మహర్షి వేదవ్యాస ప్రణీత

# శ్రీమద్భాగవతము

(చతుర్థ స్కంధము)

మూడవ సంపుటము

స్వామితత్త్వవిదానంద సరస్వతి
(బ్రహ్మవిద్యాకుటీర్, పాతఅల్వాల్, సికింద్రాబాదు)
గారిచే రచింపబడిన ''తత్త్వప్రకాశిక'' అనే
తెలుగు టీకతో కూడినది




ప్రచురణ
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.
2004

# ముందు మాట

భారతీయ వాఙ్మయంలో పురాణాలు అత్యంత విశిష్టమైనవి. అవి లోకానికి మిత్రులవలె హితాన్ని ఉపదేశిస్తాయి. కాబట్టే, ''మిత్ర సమ్మితములు''గా ప్రఖ్యాతి వహించాయి. పురాణాలు ప్రాచీనమైనవైనా ఎప్పటికప్పుడు నిత్యనూతనంగా ప్రకాశిస్తూ వుంటాయి. అవి మన పురాతన విజ్ఞాన సర్వస్వాలు (Encyclopaedias)అటువంటి పదునెనిమిది పురాణాల్లో అగ్రగణ్యమైనది శ్రీమద్భాగవతము.

'భాగవత'మంటే భగవంతుని గూర్చి వివరించే గ్రంథమని భావం. ఇలాగే 'భగవత్' శబ్దంతో సంబంధించిన నామధేయం కల మరొక ప్రసిద్ధ గ్రంథం 'భగవద్గీత'. భగవంతుడు చెప్పింది భగవద్గీత; ఆ భగవంతుని గూర్చి చెప్పేది భాగవతము. ఇది ఈ రెంటికి గల అవినాభావ సంబంధం.

వేర్వేరు పురాణాలను, ఇతిహాసాలను రచియించిన వేదవ్యాసుడు బదరికావనంలో సరస్వతీనదీ తీరాన గల తన ఆశ్రమంలో ఒకప్పుడు చింతిస్తూ కూర్చొని ఉండినాడు. ఆ సమయంలో అక్కడకు విచ్చేసిన నారదమహర్షి, విషయం తెలిసికొని, వ్యాసునితో ఇలా అన్నాడు. 'మునీంద్రా! నీవు ఇంతవరకు ఎన్నో గ్రంథాలను రచించినప్పటికీ, భగవానుడైన శ్రీమహావిష్ణువు యొక్క గుణగణాలను, మహిమలను, అవతారలీలలను వెల్లడించే కథలతో గూడిన సమగ్ర గ్రంథాన్ని ప్రత్యేకంగా రచింపలేదు. కావున, అలాంటి ఉత్కృష్ట గ్రంథాన్ని రచిస్తే నీకు పరిపూర్ణమైన మనశ్శాంతి ఏర్పడుతుంది'-అని, ఆ విధంగా నారదుని ఆదేశాన్ని పాటించి, వేదవ్యాస మహాముని రచించిన ఉదాత్తగ్రంథమే శ్రీమద్భాగవత మహాపురాణం!

మంత్రాలన్నింటిలోనూ ఉత్తమమైన మంత్రం'గాయత్రి' అటువంటి గాయత్రీమంత్రాన్ని ఆధారంచేసికొని ఈ గ్రంథం విస్తరిల్లినట్లు ఇందలి అవతారికలో పేర్కొనబడి ఉంది. ఈ గ్రంథానికి 'భక్తిశాస్త్ర' మని, 'సాత్వతసంహిత' అని, 'మోక్షగ్రంథ'మని, 'హయగ్రీవ బ్రహ్మవిద్య' అని- అనేక నామాంతరాలు పూర్వంనుండీ వాడుకలో ఉన్నాయి. ఇవన్నీ ఈ భాగవత గ్రంథానికి గల ప్రశస్తిని చక్కగా చాటుతూ వున్నాయి.

వేదవ్యాసుడు తొలుదొల్త భాగవత పురాణాన్ని కుమారుడైన శుకునికీ, శిష్యుడైన రోమ హర్షణునికీ ఉపదేశించాడు. రోమహర్షణుని కుమారుడైన ఉగ్రశ్రవసుడు నైమిశారణ్యంలో వెయ్యేండ్ల సత్రయాగాన్ని నిర్వహిస్తూవున్న

శౌనకాది మహామునుల వద్దకు వెళ్లి, భాగవత పురాణాన్ని ప్రవచనం చేశాడు. ఆ విధంగా ఉగ్రశ్రవసుడనే సూతుడు అలనాడు నైమిశారణ్యంలో ఆరంభించిన భాగవత కథా ప్రవచనం నేటికీ దేశంలో ఎక్కడో ఒకచోట అవిచ్ఛిన్నంగా కొనసాగుతూనే వస్తున్నది.

ఈ సుప్రసిద్ధ గ్రంథానికి ''తత్త్వప్రకాశిక'' - అనే తెలుగు టీక సమకూర్చబడి ఉండటం ప్రస్తుత ప్రచురణలోని ముఖ్య విశేషం! ప్రతిపదార్థ, తాత్పర్యాలతో కూడిన ఈ తెలుగు టీక సరళమైన భాషలో, సులభశైలిలో, సామాన్య పాఠకులను సైతం ఆకట్టుకొనే రీతిలో సముచితంగా కొనసాగింది. సార్థక నామధేయుయిన ఈ టీకను రచించిన సహృదయులు, సుగృహీత నామధేయులు, బ్రహ్మవిద్యానిధులు, బహుగ్రంథకర్తలు పూజ్యశ్రీ తత్త్వవిదానంద సరస్వతీ స్వామివారికి కృతజ్ఞతాపూర్వక అభివందనాలు.

చివరగా నొక్కమాట: పద్మపురాణంలో శ్రీమద్భాగవతం సాక్షాత్తు భగవంతుని స్వరూపంగా నిరూపింపబడింది. తదనుగుణంగా భాగవతంలోని మొదటి, రెండు స్కంధాలు భగవంతుని పాదాలు; మూడు నాలుగు స్కంధాలు ఊరువులు; ఐదవ స్కంధం నాభి ప్రదేశం; ఆరవ స్కంధం హృదయం; ఏడు, ఎనిమిది స్కంధాలు బాహువులు; తొమ్మిదవ స్కంధం కంఠం; పదవ స్కంధం ముఖం; పదకొండవది లలాటం; పన్రెండవ స్కంధం శిఖ.

పద్మపురాణంలోని పై వరసను బట్టి, తృతీయ చతుర్థ స్కంధాలు విరాట్పురుషునియొక్క ఊరువులు ఆవిష్కరింపబడినట్లుగా భావించాలి! అందులో ఇది చతుర్థస్కంధం. ఇలాగే, తరువాతి స్కంధాలను కూడ త్వరలో ప్రచురించే ప్రయత్నాలు చురుకుగా కొనసాగుతున్నాయి. అలమేల్మంగా శ్రీనివాసుల అనుగ్రహ విశేషంతో ఆ యా సంపుటాలూ అచిరకాలంలోనే వెలుగుచూడగలవని ఆశిస్తున్నాము.

ఆస్తిక మహాశయులెల్లరకు ఈ ధార్మిక ప్రచురణ ఆనందదాయి కాగలదని ఆకాంక్షిస్తున్నాము.

*''భాగవత పురాణ ఫల రసాస్వాదన*
*పదవిఁ గనుఁడు! రసికభావవిదులు!''*

తిరుపతి.

కార్యనిర్వహణాధికారి,
తి.తి.దేవస్థానములు

అభినవ పాణిని, రాష్ట్రపతి సమ్మాన గ్రహీత,
గురుదేవులు, కీర్తిశేషులు

బ్రహ్మశ్రీ కొంపెల్ల సుబ్బరాయ శాస్త్రి గారి

పవిత్ర స్మృతికి
భక్తిపూర్వకముగా అంకితము.

# విషయ సూచిక



* * *

శ్రీగణేశాయ నమః

ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్రీ మహర్షి వేదవ్యాస ప్రణీతం

# శ్రీమద్భాగవత మహాపురాణమ్

## తత్త్వ ప్రకాశికా సంయుతమ్

# చతుర్థః స్కంధ

## అథ ప్రథమోऽధ్యాయః

### దత్తాత్రేయావతారము, నరనారాయణావతారము

మైత్రేయ ఉవాచ ।

మనోస్తు శతరూపాయాం తిస్రః కన్యాశ్చ జజ్ఞిరే ।
ఆకూతిర్దేవహూతిశ్చ ప్రసూతిరితి విశ్రుతాః ।। 1

**మైత్రేయః** - మైత్రేయ మహర్షి, **ఉవాచ** - పలికెను, **మనోః తు** - స్వాయంభువ మనువునకు, **శతరూపాయామ్** - శతరూపయందు, **ఆకూతిః** - ఆకూతి, **దేవహూతిః** - దేవహూతి, **చ** - మరియు, **ప్రసూతిః** - ప్రసూతి, **ఇతి** - అని, **విశ్రుతాః** - ప్రసిద్ధిని గాంచిన, **తిస్రః** - ముగ్గురు, **కన్యాః చ** - కన్యలు కూడా, **జజ్ఞిరే** - జన్మించిరి.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- ఓ విదురా! స్వాయంభువ మనువునకు శతరూపాదేవికి ముగ్గురు అమ్మాయిలు కూడ జన్మించిరి. వారు ఆకూతి, దేవహూతి, ప్రసూతి అనే పేర్లతో లోకములో ప్రసిద్ధిని గాంచిరి.

ఆకూతిం రుచయే ప్రాదాదపి భ్రాతృమతీం నృపః ।
పుత్రికాధర్మమాశ్రిత్య శతరూపానుమోదితః ।। 2

నృపః - స్వాయంభువ మను మహారాజు, శతరూపా-అనుమోదితః - శతరూపాదేవి అంగీకారమును పొందినవాడై, ఆకూతిమ్ - ఆకూతిని, భ్రాతృమతీం అపి - సోదరుడు కలదియే అయిననూ, పుత్రికాధర్మమ్ - పుత్రికాధర్మమును, ఆశ్రిత్య - అవలంబించి, రుచయే - రుచి ప్రజాపతి కొరకు, ప్రాదాత్ - ఇచ్చెను.

స్వాయంభువ మనుమహారాజు శతరూపాదేవి అంగీకారముతో ఆకూతిని రుచి ప్రజాపతికి ఇచ్చి వివాహము చేసెను. ఈ వివాహమును ఆయన ఒక షరతుపై చేసెను. ఆకూతికి కలిగిన మొదటి పుత్రుని ఆమె తన తండ్రికి అప్పజెప్పవలెను. దీనికి పుత్రికాధర్మమని పేరు. స్వాయంభువ మనువునకు ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు అనే ఇద్దరు కుమారులు గలరు. అయిననూ, ఆయన ఆ షరతుతోనే వివాహమును చేసెను.

ప్రజాపతిస్స భగవాన్ రుచిస్తస్యామజీజనత్ ।
మిథునం బ్రహ్మవర్చస్వీ పరమేణ సమాధినా ।। 3

పరమేణ - సర్వశ్రేష్ఠమగు, సమాధినా - ఈశ్వరుని ధ్యానముచే, బ్రహ్మవర్చస్వీ - బ్రహ్మవర్చస్సును పొందినవాడు, ప్రజాపతిః - ప్రజాపతి, భగవాన్ - పూజ్యుడు అగు, సః - ఆ, రుచిః - రుచి, తస్యామ్ - ఆమెయందు, మిథునమ్ - పురుష స్త్రీ సంతానములను, అజీజనత్ - కనెను.

పూజ్యుడగు ఆ రుచి ప్రజాపతి సర్వోత్కృష్టమగు పరమేశ్వర ధ్యానముచే బ్రహ్మవర్చస్సు కలిగియుండెను. ఆయనకు ఆ ఆకూతి యందు ఒక పిల్లవాడు, ఒక అమ్మాయి కలిగిరి.

యస్తయోః పురుషస్సాక్షాద్విష్ణుర్యజ్ఞస్వరూపధృక్ ।
యా స్త్రీ సా దక్షిణా భూతేరంశభూతానపాయినీ ॥ 4

తయోః - వారిద్దరిలో, యః - ఏ, పురుషః - మగపిల్లవాడు గలడో ఆతడు, సాక్షాత్ - స్వయముగా, యజ్ఞస్వరూపధృక్ - యజ్ఞముయొక్క రూపమును దాల్చిన, విష్ణుః - విష్ణువే, యా - ఏ, స్త్రీ - స్త్రీ గలదో, సా - ఆమె, భూతేః - లక్ష్మీదేవియొక్క, అనపాయినీ - విష్ణువునుండి ఎన్నడైననూ దూరము కాని (తరిగిపోని), అంశభూతా - అంశయైయున్న, దక్షిణా - దక్షిణ.

వారిలో మగపిల్లవాడు స్వయముగా శ్రీమహావిష్ణువే. విష్ణువు వేదోక్తమగు యజ్ఞమునకు ప్రతీకయగు యజ్ఞుడనే ఆ పిల్లవాని రూపములో అవతరించెను. లక్ష్మీదేవి విష్ణువును విడిచి ఉండదు. కావున, ఆమె ఒకానొక అంశచే దక్షిణ అనే ఆ అమ్మాయి రూపములో జన్మించెను. ఈ అమ్మాయి యజ్ఞములో ఋత్విక్కులకు యజమాని ఇచ్చే ధనమునకు ప్రతీక. ధనముతో వేదోక్తకర్మలను చేసి దక్షిణలనిచ్చుట వలన ఈశ్వరానుగ్రహముచే సంపద స్థిరమగునే గాని, తరిగిపోదు.

ఆనిన్యే స్వగృహం పుత్ర్యాః పుత్రం వితతరోచిషమ్ ।
స్వాయంభువో ముదా యుక్తో రుచిర్జగ్రాహ దక్షిణామ్ ॥ 5

స్వాయంభువః - స్వాయంభువ మనువు, ముదా - సంతోషముతో, యుక్తః - కూడినవాడై, పుత్ర్యాః - తన పుత్రికయగు ఆకూతియొక్క, వితతరోచిషమ్ - వ్యాపించే ప్రకాశము గల, పుత్రమ్ - పుత్రుని, స్వగృహమ్ - తన గృహమును గురించి, ఆనిన్యే - తీసుకువచ్చెను, రుచిః - రుచి ప్రజాపతి, దక్షిణామ్ - దక్షిణను, జగ్రాహ - స్వీకరించెను.

స్వాయంభువ మనువు చాల సంతోషించి తన కుమార్తెయగు ఆకూతికి పుత్రుడగు ఆ యజ్ఞుని తన ఇంటికి తెచ్చుకొనెను. ఆ పిల్లవాడు తన కాంతులతో చుట్టూ ప్రకాశింపజేయుచుండెను. రుచి ప్రజాపతి అమ్మాయి దక్షిణను తన వద్ద పెంచెను.

తాం కామయానాం భగవానువాహ యజుషాం పతిః ।
తుష్టాయాం తోషమాపన్నోఽజనయద్ద్వాదశాత్మజాన్ ॥ 6

యజుషామ్ - గద్యరూపములోని మంత్రములకు (యజ్ఞములకు), పతిః - ప్రభువగు, భగవాన్ - యజ్ఞ భగవానుడు, కామయానామ్ - తనను కోరుచున్న, తామ్ - ఆ దక్షిణను, ఉవాహ - వివాహమాడెను, తోషమ్ - సంతోషమును, ఆపన్నః - పొందియున్న ఆ యజ్ఞుడు, తుష్టాయామ్ - సంతోషముతోనున్న ఆమెయందు, ద్వాదశ - పన్నెండుగురు, ఆత్మజాన్ - పుత్రులను, అజనయత్ - కనెను.

మంత్రములకు, యజ్ఞములకు ప్రభువగు విష్ణుభగవానుడు యజ్ఞుని రూపములో నుండెను. ఆయనను లక్ష్మియొక్క అవతారమగు దక్షిణ ప్రేమించెను. ఆయన ఆమెను వివాహమాడెను. అపుడు వారిద్దరు సంతోషించిరి. వారికి పన్నెండుగురు పుత్రులు కలిగిరి.

తోషః ప్రతోషస్సంతోషో భద్రశ్శాంతిరిడస్పతిః ।
ఇధ్మః కవిర్విభుస్స్వహ్నస్సుదేవో రోచనో ద్విషట్ ॥ 7

తోషః - తోషుడు, ప్రతోషః - ప్రతోషుడు, సంతోషః - సంతోషుడు, భద్రః - భద్రుడు, శాంతిః - శాంతుడు, ఇడస్పతిః - ఇడస్పతి, ఇధ్మః - ఇధ్ముడు, కవిః - కవి, విభుః - విభుడు, స్వహ్నః - స్వహ్నుడు, సుదేవః - సుదేవుడు, రోచనః - రోచనుడు, ద్విషట్ - పన్నెండు మంది.

తోషుడు (యజ్ఞమును చేయ సంకల్పించినప్పుడు యజమానికి కలిగే ఆనందమునకు ప్రతీక), ప్రతోషుడు (యజ్ఞము నిర్విఘ్నముగా కొనసాగుచుండగా యజమానికి కలిగే ఆనందము), సంతోషుడు (యజ్ఞమును పూర్తి చేసి దక్షిణలనిచ్చినప్పుడు యజమానికి కలిగే పూర్ణమగు ఆనందము), భద్రుడు (వైదికకర్మల అనుష్ఠానము మంగళప్రదము), శాంతుడు (యజ్ఞము సక్రమముగా పూర్తి అయినప్పుడు కలిగే మనశ్శాంతి), ఇడస్పతి (భూమిని పాలించే రాజు), ఇధ్ముడు (యజ్ఞములో ఉపయోగించే సమిధల కట్ట), కవి (యజ్ఞవిజ్ఞానము), విభుడు (యజ్ఞమును చేసే సామర్థ్యము), స్వహ్నుడు (యజ్ఞము నడిచే రోజులు మంచి రోజులు), సుదేవుడు

(యజమాని ఈశ్వరరూపుడే), రోచనుడు (యజమానికి యజ్ఞము వలన గొప్ప ప్రకాశము) అనునవి వారి పేర్లు.

**తుషితా నామ తే దేవా ఆసన్ స్వాయంభువాంతరే ।**
**మరీచిమిశ్రా ఋషయో యజ్ఞస్సురగణేశ్వరః ॥ 8**

తే - వారు, స్వాయంభువ-అంతరే - స్వాయంభువ మన్వంతరమునందు, తుషితాః - తుషితులు అనే పేరు గల, దేవాః - దేవతలుగా, ఆసన్ - అయిరి, మరీచిమిశ్రాః - మరీచి మొదలగువారు, ఋషయః - మహర్షులు, యజ్ఞః - యజ్ఞుడు, సురగణ-ఈశ్వరః - దేవతల గణములకు ప్రభువు.

స్వాయంభువ మన్వంతరమునందు ఈ పన్నెండుగురే తుషితులు (ఆనందము గలవారు) అనే పేరు గల దేవతలు కాగా, మరీచి మొదలగు ఏడ్గురు మహర్షులుగను, యజ్ఞుడే దేవతాగణములకు ప్రభువగు ఇంద్రుడుగను ఉండిరి.

**ప్రియవ్రతోత్తానపాదౌ మనుపుత్రౌ మహౌజసౌ ।**
**తత్పుత్రపౌత్రనప్తౄణామనువృత్తం తదంతరమ్ ॥ 9**

మహా-ఓజసౌ - గొప్ప ప్రభావము గల, ప్రియవ్రత-ఉత్తానపాదౌ - ప్రియవ్రతుడు ఉత్తానపాదుడు, మనుపుత్రౌ - స్వాయంభువ మనువు యొక్క పుత్రులు, తత్ - ఆ, అంతరమ్ - మన్వంతరము, తత్-పుత్రపౌత్ర నప్తౄణామ్ - వారి కొడుకులు కూతుళ్లు వారి సంతానముల (వంశముల చే), అనువృత్తమ్ - వ్యాపించబడినది (పాలించబడినది).

గొప్ప ప్రభావశాలురగు ప్రియవ్రత-ఉత్తానపాదులు మనువు యొక్క పుత్రులు. ఆ మన్వంతరము వారి కొడుకులు, కూతుళ్లు, మరియు వారి సంతానములచే వ్యాపించబడి, వారిచే పాలించబడినది.

**దేవహూతిమదాత్తాత కర్దమాయాత్మజాం మనుః ।**
**తత్సంబంధి శ్రుతప్రాయం భవతా గదతో మమ ॥ 10**

**తాత** - వత్సా!, **మనుః** - స్వాయంభువ మనువు, **ఆత్మజామ్** - కుమార్తెయగు, **దేవహూతిమ్** - దేవహూతిని, **కర్దమాయ** - కర్దమ ప్రజా పతి కొరకు, **అదాత్** - ఇచ్చెను, **తత్-సంబంధి** - వారికి సంబంధించిన వృత్తాంతము, **భవతా** - నీచే, **మమ** - నేను, **గదతః** - చెప్పుచుండగా, **శ్రుతప్రాయమ్** - విస్తారముగా వినబడియే యున్నది.

వత్సా! విదురా! స్వాయంభువ మనువు తన కుమార్తెయగు దేవ హూతిని కర్దమ ప్రజాపతికి ఇచ్చి వివాహమును చేసెను. ఆ వృత్తాంత మును నేను విస్తారముగా చెప్పగా, నీవు వినియే యున్నావు.

దక్షాయ బ్రహ్మపుత్రాయ ప్రసూతిం భగవాన్మనుః ।
ప్రాయచ్ఛద్యత్కృతస్సర్గస్త్రిలోక్యాం వితతో మహాన్ ॥ **11**

భగవాన్ - పూజనీయుడగు, మనుః - స్వాయంభువ మనువు, ప్రసూతిమ్ - ప్రసూతిని, బ్రహ్మపుత్రాయ - బ్రహ్మగారి పుత్రుడగు, దక్షాయ - దక్షుని కొరకు, ప్రాయచ్ఛత్ - ఇచ్చి వివాహమును చేసెను, యత్-కృతః - ఎవనిచే చేయబడిన, మహాన్ - గొప్ప, సర్గః - సృష్టి, త్రిలో క్యామ్ - ముల్లోకములలో, వితతః - వ్యాపించినదో.

పూజ్యుడగు స్వాయంభువ మనువు ప్రసూతిని బ్రహ్మగారి కుమా రుడగు దక్షునకు ఇచ్చి వివాహమును చేసెను. వారి విస్తృతమగు వంశా వళి ముల్లోకములలో వ్యాప్తిని చెందెను.

యాః కర్దమసుతాః ప్రోక్తా నవ బ్రహ్మర్షిపత్న్యయః ।
తాసాం ప్రసూతిప్రసవం ప్రోచ్యమానం నిబోధ మే ॥ **12**

కర్దమసుతాః - కర్దమ ప్రజాపతియొక్క కుమార్తెలు, బ్రహ్మర్షిప త్న్యయః - బ్రహ్మర్షుల భార్యలు అగు, యాః - ఏ, నవ - తొమ్మిదిమంది, ప్రోక్తాః - చెప్పబడినారో, మే - నాచే, ప్రోచ్యమానమ్ - చెప్పబడుచున్న, తాసామ్ - వారి, ప్రసూతిప్రసవమ్ - సంతానముయొక్క వంశవిస్తార మును, నిబోధ - తెలుసుకొనుము.

కర్దమ ప్రజాపతియొక్క తొమ్మిదిమంది కుమార్తెలు బ్రహ్మర్షుల భార్యలు. ఈ విషయము ఇదివరలో చెప్పబడినది. నేనిప్పుడు వారి సంతానముయొక్క వంశవిస్తారమును గురించి చెప్పుచున్నాను. గమనించుము.

పత్నీ మరీచేస్తు కలా సుషువే కర్దమాత్మజా ।
కశ్యపం పూర్ణిమానం చ యయోరాపూరితం జగత్ ।। 13

కర్దమ-ఆత్మజా - కర్దమ ప్రజాపతియొక్క కుమార్తె, మరీచేః - మరీచి మహర్షియొక్క, పత్నీ - భార్య అగు, కలా తు - కళయైతే, కశ్యపమ్ - కశ్యపుని, పూర్ణిమానం చ - పూర్ణిముని, సుషువే - కనెను, యయోః - ఎవరి (వంశావళిచే), జగత్ - జగత్తు, ఆపూరితమ్ - నిండిపోయినదో.

కర్దమ ప్రజాపతియొక్క కుమార్తెయగు కళ మరీచి మహర్షియొక్క ధర్మపత్ని. ఆమెకు కశ్యపుడు, పూర్ణిముడు అనే ఇద్దరు కొడుకులు కలిగిరి. వారిద్దరి వంశావళి విస్తరించి భూలోకమును వ్యాపించినది.

పూర్ణిమాऽసూత విరజం విశ్వగం చ పరంతప ।
దేవకుల్యాం హరేః పాదశౌచాద్యాభూత్సరిద్దివః ।। 14

పరంతప - శత్రువులను తపింపజేసే ఓ విదురా!, పూర్ణిమా - పూర్ణిముడు, విరజమ్ - విరజుని, విశ్వగమ్ - విశ్వగుని, చ - మరియు, దేవకుల్యామ్ - దేవకుల్యను, అసూత - కనెను, యా - ఏ దేవకుల్య, హరేః - శ్రీహరియొక్క, పాదశౌచాత్ - పాదములను కడుగుట వలన, దివః సరిత్ - స్వర్గనది (గంగ), అభూత్ - ఆయెనో.

అంతశ్శత్రువులను ఎండగట్టిన ఓ విదురా! పూర్ణిమునకు విరజుడు, విశ్వగుడు అనే ఇద్దరు కొడుకులు, దేవకుల్య అనే కుమార్తె కలిగిరి. ఈ దేవకుల్య శ్రీహరియొక్క పాదములను కడిగిన ప్రభావముచే మరుజన్మలో స్వర్గమునందలి మందాకినీ (గంగా) నదియై ప్రవహించెను.

అత్రేః పత్న్యనసూయా త్రీన్ జజ్ఞే సుయశసస్సుతాన్ ।
దత్తం దుర్వాససం సోమమాత్మేశబ్రహ్మసంభవాన్ ।। 15

అత్రేః - అత్రిమహర్షియొక్క, పత్నీ - భార్యయగు, అనసూయా - అనసూయ, సుయశసః - గొప్ప కీర్తి గలవారు, ఆత్మేశబ్రహ్మసంభవాన్ - విష్ణువు శివుడు బ్రహ్మల అంశలచే జన్మించినవారు అగు, దత్తమ్ - దత్తాత్రేయుని, దుర్వాససమ్ - దుర్వాసమహర్షిని, సోమమ్ - చంద్రుని, త్రీన్ - ఈ ముగ్గురిని, జజ్ఞే - కనెను.

అత్రిమహర్షియొక్క భార్యయగు అనసూయ దత్తాత్రేయుడు, దుర్వాసమహర్షి, చంద్రుడు అనే ముగ్గురు కొడుకులను కనెను. క్రమముగా విష్ణువు, శివుడు, బ్రహ్మల అంశల వలన జన్మించిన ఈ ముగ్గురు గొప్ప కీర్తిని పొందిరి.

విదుర ఉవాచ ।
అత్రేర్గృహే సురశ్రేష్ఠాః స్థిత్యుత్పత్త్యంతహేతవః ।
కించిచ్చికీర్షవో జాతా ఏతదాఖ్యాహి మే గురో ।। 16

స్థితి-ఉత్పత్తి-అంతహేతవః - పాలనకు సృష్టికి ప్రళయమునకు కారణభూతులైన, సురశ్రేష్ఠాః - దేవతలలో ఉత్తములగు విష్ణు బ్రహ్మ రుద్రులు, అత్రేః - అత్రి మహర్షియొక్క, గృహే - ఇంటిలో, కించిత్ - దేనిని, చికీర్షవః - చేయగోరువారై, జాతాః - జన్మించిరి?, గురో - ఓ గురుదేవా!, మే - నాకై, ఏతత్ - ఈ విషయమును, ఆఖ్యాహి - చెప్పుము.

విదురుడిట్లు పలికెను --- ఓ గురుదేవా! బ్రహ్మవిష్ణురుద్రులు క్రమముగా జగత్తుయొక్క సృష్టిస్థితిప్రళయములకు కారణమగుచున్నారు. దేవతలలో శ్రేష్ఠులగు ఆ త్రిమూర్తులు ఏమి చేయగోరి అత్రి గృహములో అవతరించినారు? నాకీ విషయమును చెప్పుడు.

మైత్రేయ ఉవాచ ।
బ్రహ్మణా నోదితస్సృష్టావత్రిర్బ్రహ్మవిదాం వరః ।
సహ పత్న్యా యయావృక్షం కులాద్రిం తపసి స్థితః ।। 17

బ్రహ్మవిదామ్ - బ్రహ్మవేత్తలలో, వరః - శ్రేష్ఠుడగు, అత్రిః - అత్రి మహర్షి, బ్రహ్మణా - బ్రహ్మగారిచే, సృష్టౌ - సృష్టిని చేయుటయందు,

నోదితః - ప్రేరేపించబడినవాడై, పత్న్యా సహ - భార్యతో గూడి, ఋక్షమ్ - ఋక్షము అనే, కుల-అద్రిమ్ - కులపర్వతమును గురించి, యయౌ - వెళ్లెను, తపసి - తపస్సునందు, స్థితః - ఉండెను.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠుడగు అత్రి మహర్షిని బ్రహ్మగారు సృష్టిని చేయుమని ప్రేరేపించిరి. అపుడాయన తన భార్యయగు అనసూయతో గూడి ఋక్షమనే కులపర్వతమునకు వెళ్లి, తపస్సును చేసెను.

తస్మిన్ ప్రసూనస్తబకపలాశాశోకకాననే ।
వార్భిస్స్రవద్భిరుద్ఘుష్టే నిర్వింధ్యాయాస్సమంతతః ॥ 18

ప్రాణాయామేన సంయమ్య మనో వర్షశతం మునిః ।
అతిష్ఠదేకపాదేన నిర్ద్వంద్వోఽనిలభోజనః ॥ 19

ప్రసూనస్తబకపలాశ-అశోకకాననే - పువ్వుల గుత్తులతో కూడిన మోదుగు కంకేళి చెట్ల అడవులు కలిగినట్టియు, నిర్వింధ్యాయాః - నిర్వింధ్యానదియొక్క, స్రవద్భిః - ప్రవహించుచున్న, వార్భిః - జలములచే, సమంతతః - అంతటా, ఉద్ఘుష్టే - శబ్దముతో నిండియున్న, తస్మిన్ - ఆ పర్వతమునందు, మునిః - అత్రి మహర్షి, మనః - మనస్సును, ప్రాణాయామేన - ప్రాణాయామముచే, సంయమ్య - చక్కగా నియంత్రించి, నిర్ద్వంద్వః - శీతోష్ణములు సుఖదుఃఖములు మొదలగు ద్వంద్వములకు అతీతుడై, అనిలభోజనః - గాలిని మాత్రమే భోజనము చేయువాడై, వర్షశతమ్ - వంద సంవత్సరములు, ఏకపాదేన - ఒకే కాలితో, అతిష్ఠత్ - నిలిచియుండెను.

ఆ పర్వతమునందలి అడవులలో మోదుగు, కంకేళి వృక్షములు పువ్వుల గుత్తులతో నిండియుండెను. నిర్వింధ్యానదియొక్క ప్రవహించే జలముల ధ్వని ఆ పర్వతమంతా వ్యాపించుచుండెను. అత్రి మహర్షి ఆ పర్వతమునందు శీతోష్ణములు, సుఖదుఃఖములు మొదలగు ద్వంద్వములకు అతీతుడై, గాలిని మాత్రమే భోజనము చేయుచూ, ప్రాణాయామ

ముతో మనస్సును వశము చేసుకొని, వంద సంవత్సరములు ఒంటి కాలిపై నిలబడి తపస్సును చేసెను.

శరణం తం ప్రపద్యేఽహం య ఏవ జగదీశ్వరః ।
ప్రజామాత్మసమాం మహ్యం ప్రయచ్ఛత్వితి చింతయన్॥20

యః - ఎవడైతే, ఏవ - నిశ్చయముగా, జగత్-ఈశ్వరః - జగన్నాథుడో, తమ్ - వానిని, అహమ్ - నేను, శరణం ప్రపద్యే - శరణు జొచ్చుచున్నాను, మహ్యమ్ - నా కొరకు, ఆత్మసమామ్ - తనతో సమానమగు, ప్రజామ్ - సంతానమును, ప్రయచ్ఛతు - ఇచ్చుగాక!, ఇతి - అని, చింతయన్ - ధ్యానించుచున్నవాడు.

జగన్నాథుడగు పరమేశ్వరుని నేను శరణు పొందుచున్నాను, ఆయన నాకు తనతో సమానమగు సంతానమును అనుగ్రహించుగాక! అని ధ్యానిస్తూ, ఆయన తపస్సును చేసెను.

తప్యమానం త్రిభువనం ప్రాణాయామైధసాగ్నినా ।
నిర్గతేన మునేర్మూర్ధ్నస్సమీక్ష్య ప్రభవస్త్రయః ॥ 21

అప్సరోమునిగంధర్వసిద్ధవిద్యాధరోరగైః ।
వితాయమానయశసస్తదాశ్రమపదం యయుః ॥ 22

ప్రాణాయామ-ఏధసా - ప్రాణాయామమే ఇంధనముగా గలిగినట్టియు, మునేః - అత్రి మహర్షియొక్క, మూర్ధ్నః - తలనుండి, నిర్గతేన - బయటకు వచ్చిన, అగ్నినా - అగ్నిచే, తప్యమానమ్ - తపింపజేయబడుచున్న, త్రిభువనమ్ - ముల్లోకములను, సమీక్ష్య - చూచి, త్రయః - ముగ్గురు, ప్రభవః - ప్రభువులు, అప్సరః-మునిగంధర్వసిద్ధవిద్యాధర-ఉరగైః - అప్సరసలు మహర్షులు గంధర్వులు సిద్ధులు విద్యాధరులు మరియు నాగులచే, వితాయమానయశసః - అధికముగా గానము చేయబడుచున్న కీర్తి గలవారై, తత్-ఆశ్రమపదమ్ - ఆ అత్రి మహర్షియొక్క ఆశ్రమస్థానమును గురించి, యయుః - వెళ్లిరి.

ప్రాణాయామమే ఇంధనము కాగా అత్రి మహర్షియొక్క శిరస్సు నుండి అగ్ని బయల్వెడలుచుండెను. దానిచే ముల్లోకములు తాపమును చెందెను. అప్పుడు సర్వసమర్థులగు బ్రహ్మవిష్ణురుద్రులు ఆ పరిస్థితిని చూచి అత్రి మహర్షియొక్క ఆశ్రమమునకు వెళ్లిరి. అట్లు వారు వెళ్లుచుండ గా, అప్సరసలు మహర్షులు గంధర్వులు సిద్ధులు విద్యాధరులు మరియు నాగులు వారి కీర్తిని విస్తారముగా గానము చేసిరి.

తత్ప్రాదుర్భావసంయోగవిద్యోతితమనా మునిః ।
ఉత్తిష్ఠన్నేకపాదేన దదర్శ విబుధర్షభాన్ ॥ 23

తత్-ప్రాదుర్భావసంయోగవిద్యోతితమనాః - వారి ఆవిర్భావము ఒకే సారి కలుగుటచే మిక్కిలి ప్రకాశముతో కూడిన మనస్సు గల, మునిః - అత్రి మహర్షి, ఏకపాదేన - ఒంటి కాలితో, ఉత్తిష్ఠన్ - నిటారుగా నిలబడి యున్నవాడై, విబుధ-ఋషభాన్ - దేవశ్రేష్ఠులగు త్రిమూర్తులను, దదర్శ - చూచెను.

ఒకే సారి త్రిమూర్తులు ఆవిర్భవించుటచే అత్రి మహర్షియొక్క మనస్సు గొప్పగా ప్రకాశించెను; అనగా, వారి దర్శనముచే ఉల్లాసమును పొందెను, లేక జ్ఞానప్రకాశమును పొందెను, లేక అమనీభావరూపమగు సమాధి తొలగి మనస్సు పనిచేయజొచ్చెను. ఆయన ఒంటి కాలిపై నిటా రుగా నిలబడియుండెను. దేవతలలో శ్రేష్ఠులగు ఆ త్రిమూర్తులను ఆయన చూచెను.

ప్రణమ్య దండవద్భూమావుపతస్థేఽర్హణాంజలిః ।
వృషహంససుపర్ణస్థాన్ స్వైస్స్వైశ్చిహ్నైశ్చ చిహ్నితాన్।
కృపావలోకేన హసద్వదనేనోపలంభితాన్ ॥ 24

వృషహంససుపర్ణస్థాన్ - వృషభము హంస గరుడుడు అను వాహనములనధిష్ఠించియున్నట్టియు, స్వైః స్వైః - తమ తమ, చిహ్నైః - చిహ్నములచే, చిహ్నితాన్ - ప్రకాశించుచున్నట్టియు, కృపా-అవలోకేన - దయతో కూడిన చూపుచే, హసత్-వదనేన - చిరునవ్వు గల ముఖముతో, ఉపలంభితాన్ - ప్రసన్నులని తెలియబడుచున్న త్రిమూర్తులను, దండవత్

- కర్రవలె, భూమౌ - నేలపై, ప్రణమ్య - నమస్కరించి, అర్హణ-అంజలిః - పువ్వులు మొదలగునవి చేతియందు గలవాడై, ఉపతస్థే - పూజించెను.

బ్రహ్మవిష్ణుమహేశ్వరులు క్రమముగా హంస, గరుడుడు, వృషభము వాహనములుగా కలిగి తమ తమ చిహ్నములతో (కమండలము, చక్రము, త్రిశూలము మొదలగునవి) ప్రకాశించుచుండిరి. వారి చూపులు దయను బరపుచుండెను. వారి ముఖములలో చిరునవ్వు తొణికిసలాడుచుండెను. దానినిబట్టి వారు తనపై ప్రసన్నులైనారని మహర్షికి తెలిసెను. అపుడాయన దండము వలె నేలపై బడి వారికి నమస్కరించి, లేచి నిలబడి, దోసిలిలో పువ్వులు మొదలగువాటిని పట్టుకొని వారిని పూజించెను.

తద్రోచిషా ప్రతిహతే నిమీల్య మునిరక్షిణీ ।
చేతస్తత్ప్రవణం యుంజన్నస్తావీత్సంహతాంజలిః ।
శ్లక్ష్ణయా సూక్తయా వాచా సర్వలోకగరీయసః ॥ 25

మునిః - అత్రి మహర్షి, తత్-రోచిషా - వారి కాంతిచే, ప్రతిహతే - మిరుమిట్లు కొల్పబడిన, అక్షిణీ - కన్నులను, నిమీల్య - మూసి, సంహత-అంజలిః - దోసిలిని ఒగ్గినవాడై, చేతః - మనస్సును, తత్-ప్రవణమ్ - వారిపై నిలిచియుండునదిగా, యుంజన్ - ఏకాగ్రము చేయువాడై, సర్వలోకగరీయసః - సకలలోకములలో ఉత్తములగు ఆ త్రిమూర్తులను, శ్లక్ష్ణయా - మధురమగు, సూక్తయా - భావపూర్ణమగు (వేదసూక్తముల రూపములోనున్న), వాచా - వాక్కుతో, అస్తావీత్ - స్తుతించెను.

ఆ త్రిమూర్తుల కాంతికి అత్రి మహర్షి కన్నులు మిరుమిట్లు గొల్పెను. ఆయన కన్నులను మూసుకొని దోసిలి యొగ్గి మనస్సును ఆ త్రిమూర్తులపై నిలిపెను. మధురమైన, భావపూర్ణమైన (వేదసూక్తముల రూపములోనున్న) వాక్కులతో ఆయన, ముల్లోకములలో ఉత్తములగు ఆ త్రిమూర్తులను స్తుతించెను.

అత్రిరువాచ ।
విశ్వోద్భవస్థితిలయేషు విభజ్యమానై-
ర్మాయాగుణైరనుయుగం విగృహీతదేహాః ।

తే బ్రహ్మవిష్ణుగిరిశాః ప్రణతోఽస్మ్యహం వ-
స్తేభ్యః క ఏవ భవతాం మ ఇహోపహూతః ॥ 26

అనుయుగమ్ - ప్రతికల్పమునందు, విశ్వ-ఉద్భవస్థితిలయేషు - జగత్తుయొక్క సృష్టి పాలనము మరియు ప్రళయములయందు, విభజ్యమానైః - విభాగము చేయబడిన, మాయాగుణైః - మాయాశక్తియొక్క సత్త్వరజస్తమోగుణములచే, విగృహీతదేహాః - వేర్వేరుగా గ్రహించబడిన దేహములు గల, తే - ఆ ప్రసిద్ధులైన, బ్రహ్మవిష్ణుగిరిశాః - బ్రహ్మవిష్ణుమహేశ్వరులు, వః - మిమ్ములను, ప్రణతః అస్మి - నమస్కరించుచున్నాను, తేభ్యః - వారినుండి, కః ఏవ - ఒక్కరు మాత్రమే, మే - నాచే, ఇహ - ఇచటకు, ఉపహూతః - పిలువబడినారో, భవతామ్ - మీలో, కః - ఎవరు?

అత్రి మహర్షి ఇట్లు పలికెను --- ప్రతికల్పమునందు పరమేశ్వరుడు సత్త్వరజస్తమోగుణాత్మకమగు మాయాశక్తి ఉపాధిగా గలవాడై జగత్కార్యమును చేయును. భగవానుడు మాయాశక్తియొక్క రజోగుణము ఉపాధిగా గలవాడై బ్రహ్మరూపమును దాల్చి జగత్తును సృష్టించి, సత్త్వగుణోపాధిచే విష్ణురూపమును దాల్చి పాలనను చేసి, తమోగుణోపాధిచే రుద్రరూపమును దాల్చి జగత్తును సంహరించును. అట్టి మీ త్రిమూర్తులకు నేను నమస్కరించుచున్నాను. కాని, నేను మీలో ఒక్కరినే ధ్యానించితిని. నేను ధ్యానించిన మూర్తి మీలో ఎవరో మీరే చెప్పుడు.

ఏకో మయేహ భగవాన్ వివిధప్రధానై-
శ్చిత్తీకృతః ప్రజననాయ కథం ను యూయమ్ ।
అత్రాగతాస్తనుభృతాం మనసోఽపి దూరాద్
బ్రూత ప్రసీదత మహానిహ విస్మయో మే ॥ 27

ఇహ - ఈ హృదయములో, మయా - నాచే, ప్రజననాయ - సంతానము కొరకు, వివిధప్రధానైః - వివిధములగు ఉపచారములచే, ఏకః - ఒక్కరు, చిత్తీకృతః - మనస్సులో నిలుపబడిరి, తనుభృతామ్ - దేహధారులకు, మనసః అపి - మనస్సునకైననూ, దూరాత్ - అందని, యూయమ్ - మీరు, అత్ర - ఇచటకు, కథమ్ - ఎట్లు, ఆగతాః - వచ్చినా

రు?, బ్రూత - చెప్పుడు, ప్రసీదత - ప్రసన్నులు కండు, ఇహ - ఈ విషయములో, మే - నాకు, మహాన్ - పెద్ద, విస్మయః - ఆశ్చర్యము.

నేను సంతానమును గోరి నా హృదయములో ఒక్క భగవానుని ఏకాగ్రచిత్తముతో నిలిపి వివిధములగు ఉపచారములతో ఆరాధించితిని. మీరు దేహధారుల మనస్సులకైననూ అందని దేవతోత్తములు. నేను ఒక్కరిని ఆరాధించగా, మీరు ముగ్గురు ఇచటకు వచ్చుటకు కారణమేమి? మీరు దయచేసి నాకీ విషయమును చెప్పుడు. నాకీ విషయములో గొప్ప ఆశ్చర్యము కలుగుచున్నది.

మైత్రేయ ఉవాచ ।
ఇతి తస్య వచః శ్రుత్వా త్రయస్తే విబుధర్షభాః ।
ప్రత్యాహుః శ్లక్ష్ణయా వాచా ప్రహస్య తమృషిం ప్రభో ।।28

ప్రభో - సమర్థుడవగు ఓ విదురా!, ఇతి - ఈ విధమైన, తస్య - ఆ అత్రి మహర్షియొక్క, వచః - మాటను, శ్రుత్వా - విని, తే - ఆ, త్రయః - ముగ్గురు, విబుధ-ఋషభాః - దేవతోత్తములు, ప్రహస్య - నవ్వి, శ్లక్ష్ణయా - మధురమగు, వాచా - వాక్కుతో, తమ్ - ఆ, ఋషిమ్ - అత్రి మహర్షిని గురించి, ప్రతి-ఆహుః - ప్రత్యుత్తరమునిచ్చిరి.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- కథాశ్రవణములో సమర్థుడవగు ఓ విదురా! అత్రి మహర్షియొక్క ఈ మాటను విని, దేవతలలో శ్రేష్ఠులగు ఆ ముగ్గురు నవ్వి, మధురమగు వాక్కుతో ఆయనకిట్లు బదులిడిరి.

దేవా ఊచుః ।
యథా కృతస్తే సంకల్పో భావ్యం తేనైవ నాన్యథా ।
సత్సంకల్పస్య తే బ్రహ్మన్యద్వై ధ్యాయతి తే వయమ్ ।।29

బ్రహ్మన్ - ఓ మహర్షీ!, సత్సంకల్పస్య - సత్యసంకల్పుడవగు, తే - నీకు, యథా - ఏ విధముగా, సంకల్పః - సంకల్పము, కృతః - చేయబడినదో, తేన ఏవ - ఆ సంకల్పముచేతనే, భావ్యమ్ - జరిగి తీరవలెను,

న అన్యథా - మరియొక విధముగా జరుగదు, యత్ - దేనిని, ధ్యాయతి - ధ్యానము చేయుచున్నావో, తే - ఆ, వయమ్ - మేము, వై - నిశ్చయము.

త్రిమూర్తులు ఇట్లు పలికిరి --- ఓ మహర్షీ! నీవు సత్యసంకల్పుడవు. నీ సంకల్పము ఎట్లున్నదో, అటులనే ఘటిల్లును. మరియొక విధముగా ఉండదు. నీవు ఏ ఒక్క జగదీశ్వరుని ధ్యానించితివో, మేము ముగ్గురము అదియే. ఇది నిశ్చయము. మాలో భేదము లేదు.

అథాస్మదంశభూతాస్త ఆత్మజా లోకవిశ్రుతాః ।
భవితారోఽంగ భద్రం తే విస్రప్స్యంతి చ తే యశః ।। 30

అంగ - ఓ మహర్షీ!, అథ - కావున, అస్మత్-అంశభూతాః - మా అంశలై యున్న, లోకవిశ్రుతాః - లోకములో ప్రసిద్ధిని గాంచే, ఆత్మజాః - పుత్రులు, తే - నీకు, భవితారః - కలుగగలరు, తే - నీ కొరకు, భద్రమ్ - మంగళమగుగాక!, చ - మరియు, తే - నీ, యశః - కీర్తిని, విస్రప్స్యంతి - విస్తరింపజేయగలరు.

ఓ మహర్షీ! కావున, నీకు మా అంశలతో ముగ్గురు కొడుకులు కలుగగలరు. వారు లోకములో ప్రసిద్ధిని గాంచి, నీ కీర్తిని విస్తరింపజేయగలరు. నీకు మంగళమగు గాక!

ఏవం కామవరం దత్త్వా ప్రతిజగ్ముస్సురేశ్వరాః ।
సభాజితాస్తయోస్సమ్యగ్దంపత్యోర్మిషతోస్తతః ।। 31

సుర-ఈశ్వరాః - దేవతోత్తములగు ఆ త్రిమూర్తులు, ఏవమ్ - ఈ విధముగా, కామవరమ్ - కోరబడిన వరమును, దత్త్వా - ఇచ్చి, సమ్యక్ - బాగుగా, సభాజితాః - పూజించబడినవారై, తతః - తరువాత, తయోః - ఆ, దంపత్యోః - దంపతులు, మిషతోః - కళ్లను అప్పగించి చూచుచుండగా, ప్రతిజగ్ముః - తిరిగి వెళ్లిరి.

దేవతోత్తములగు ఆ త్రిమూర్తులను ఆ మహర్షి బాగుగా పూజించెను. వారాయన కోరుకున్న వరముననుగ్రహించిరి. అపుడా దంపతులు కళ్లను అప్పగించి చూచుచుండగా, వారు తిరిగి వెళ్లిరి.

**సోమోऽభూద్బ్రహ్మణోంऽశేన దత్తో విష్ణోస్తు యోగవిత్ ।**
**దుర్వాసాశ్శంకరస్యాంశో నిబోధాంగిరసః ప్రజాః ॥ 32**

బ్రహ్మణః - బ్రహ్మగారి, అంశేన - అంశచే, సోమః - చంద్రుడు, **అభూత్** - జన్మించెను, విష్ణోః తు - విష్ణువుయొక్క అంశచేనైతే, యోగ విత్ - యోగశాస్త్రవేత్తయగు, దత్తః - దత్తాత్రేయమహర్షి (జన్మించెను), దుర్వాసాః - దుర్వాస మహర్షి, శంకరస్య - శంకరుని, అంశః - అంశ, అంగిరసః - అంగిరసుని, ప్రజాః - సంతానములను గురించి, నిబోధ - తెలుసుకొనుము.

బ్రహ్మగారి అంశచే చంద్రుడు, విష్ణువు అంశచే దత్తాత్రేయ మహ ర్షి, శంకరుని అంశచే దుర్వాస మహర్షి జన్మించిరి. ఇప్పుడు అంగిరసుని (బ్రహ్మగారి మూడవ పుత్రుడు) సంతానమును గురించి తెలుసుకొనుము.

శ్రద్ధా త్వంగిరసః పత్నీ చతస్రోऽసూత కన్యకాః ।
సినీవాలీ కుహూ రాకా చతుర్థ్యనుమతిస్తథా ॥ 33

అంగిరసః - అంగిరసుని, పత్నీ - భార్యయగు, శ్రద్ధా - శ్రద్ధాదేవి, సినీవాలీ - సినీవాలి, కుహూః - కుహు, రాకా - రాక, తథా - మరియు, చతుర్థీ - నాల్గవదియగు, అనుమతిః - అనుమతి అనే, చతస్రః - నలుగు రు, కన్యకాః - కన్యలను, అసూత - కనెను.

అంగిరసునకు (సాధకుని శరీరావయవములయందలి రసము లేక ఓజస్సు) శ్రద్ధ అనే భార్య (సాధకునకు నిత్యము తోడుగా ఉండేది సాధన యందలి శ్రద్ధయే) యందు సినీవాలి (కృష్ణ చతుర్దశి), కుహు (అమావా స్య), రాకా (పూర్ణిమ) మరియు అనుమతి (శుక్ల చతుర్దశి) అనే నలుగురు కన్యలు జన్మించిరి. ఈ కన్యలు దర్శపూర్ణమాసలు మొదలగు వైదికకర్మ లకు ప్రధానమైన కాలములకు ప్రతీకలు.

**తత్పుత్రావపరావాస్తాం ఖ్యాతౌ స్వారోచిషేऽంతరే ।**
**ఉతథ్యో భగవాన్ సాక్షాద్బ్రహ్మిష్ఠశ్చ బృహస్పతిః ॥ 34**

తత్-పుత్రౌ - వారి ఇద్దరు కొడుకులు, అపరౌ - ఆ కన్యలకంటె భిన్నమైనవారు, స్వారోచిషే అంతరే - స్వారోచిష మన్వంతరములో, ఖ్యాతౌ - ప్రఖ్యాతిని పొందినవారు, సాక్షాత్ - సాక్షాత్తుగా, భగవాన్ - భగవానుడు, బ్రహ్మిష్ఠః - బ్రహ్మనిష్ఠుడు అగు, ఉతథ్యః - ఉతథ్యుడు, చ - మరియు, బృహస్పతిః - బృహస్పతి అనువారలు, ఆస్తామ్ - ఉండిరి.

ఈ నలుగురు కన్యకలే గాక, వారికి ఇద్దరు కొడుకులు కూడ కలిగిరి. సాక్షాత్తు భగవానుడు మరియు బ్రహ్మనిష్ఠుడు అగు ఉతథ్యుడు మొదటి కొడుకు. బృహస్పతి రెండవ కొడుకు. వీరిద్దరు స్వారోచిష మన్వంతరములో ప్రసిద్ధిని గాంచిరి.

పులస్త్యోఽజనయత్పత్న్యామగస్త్యం చ హవిర్భువి ।
సోఽన్యజన్మని దహ్రాగ్నిర్విశ్రవాశ్చ మహాతపాః ॥ 35

పులస్త్యః - పులస్త్యుడు, పత్న్యామ్ - భార్యయగు, హవిర్భువి - హవిర్భువయందు, అగస్త్యమ్ - అగస్త్యుని, అజనయత్ - కనెను, సః - ఆయన, అన్యజన్మని - మరియొక జన్మయందు, దహ్ర-అగ్నిః - జఠరాగ్ని ఆయెను, చ - మరియు, మహాతపాః - గొప్ప తపశ్శాలియగు, విశ్రవాః చ - విశ్రవసుడు కూడ (వారి పుత్రుడే).

పులస్త్యునకు భార్యయగు హవిర్భువయందు అగస్త్యుడు, విశ్రవసుడు అనే ఇద్దరు కొడుకులు కలిగిరి. వీరిలో అగస్త్యుడు మరుజన్మలో జఠరాగ్ని అయినాడు. విశ్రవసుడు గొప్ప తపశ్శాలి.

తస్య యక్షపతిర్దేవః కుబేరస్త్విడవిడాసుతః ।
రావణః కుంభకర్ణశ్చ తథాఽన్యస్యాం విభీషణః ॥ 36

తస్య - ఆ విశ్రవసునకు, యక్షపతిః - యక్షులకు ప్రభువు, దేవః - సాత్త్వికస్వభావము కలవాడు అగు, కుబేరః - కుబేరుడు, ఇడవిడాసుతః - ఇడవిడయందు కొడుకై జన్మించెను, తథా - మరియు, అన్యస్యామ్ - మరియొక భార్య (కేశిని) యందు, రావణః - రావణుడు, కుంభకర్ణః - కుంభకర్ణుడు, చ - మరియు, విభీషణః - విభీషణుడు.

ఆ విశ్రవసునకు ఇడవిడ అనే భార్యయందు సాత్త్విక స్వభావము గల కుబేరుడు జన్మించి, యక్షులకు ప్రభుడాయెను. ఆ విశ్రవసునకే మరి యొక భార్యయగు కేశినియందు రావణ కుంభకర్ణ విభీషణులనే రాక్షసులు జన్మించిరి.

పులహస్య గతిర్భార్యా త్రీనసూత సతీ సుతాన్ ।
కర్మశ్రేష్ఠం వరీయాంసం సహిష్ణుం చ మహామతే ॥ 37

మహామతే - గొప్ప బుద్ధిశాలివగు ఓ విదురా!, పులహస్య - పులహుని, భార్యా - భార్య, సతీ - పతివ్రత అగు, గతిః - గతి, కర్మశ్రేష్ఠమ్ - కర్మశ్రేష్ఠుడు, వరీయాంసమ్ - వరీయాంసుడు, చ - మరియు, సహిష్ణుమ్ - సహిష్ణువు అనే, త్రీన్ - ముగ్గురు, సుతాన్ - కుమారులను, అసూత - కనెను.

గొప్ప బుద్ధిశాలివగు ఓ విదురా! పులహునకు పతివ్రతయగు గతి (మోక్షమునకు ప్రతీక) అనే భార్యయందు కర్మశ్రేష్ఠుడు (వైదికకర్మలలో దిట్ట), వరీయాంసుడు (ఉపాసకులలో గొప్పవాడు), సహిష్ణుడు (సహనశీలము గలవాడు) అనే ముగ్గురు కొడుకులు కలిగిరి.

క్రతోరపి క్రియా భార్యా వాలఖిల్యానసూయత ।
ఋషీన్ షష్టిసహస్రాణి జ్వలతో బ్రహ్మతేజసా ॥ 38

అపి - మరియు, క్రతోః - క్రతువునకు, భార్యా - భార్యయగు, క్రియా - క్రియ, బ్రహ్మతేజసా - బ్రహ్మవర్చస్సుతో, జ్వలతః - గొప్పగా ప్రకాశించే, షష్టిసహస్రాణి - అరవై వేలమంది, వాలఖిల్యాన్ - వాలఖిల్యులు అనే, ఋషీన్ - ఋషులను, అసూయత - కనెను.

క్రతు (వేదోక్తమగు కర్మకు ప్రతీక) మహర్షికి క్రియ (క్రతువునకు అంగమగు వైదికక్రియ) అనే భార్యయందు గొప్ప బ్రహ్మవర్చస్సు గల అరవై వేలమంది వాలఖిల్యులనే ఋషులు జన్మించిరి.

ఊర్జాయాం జజ్ఞిరే పుత్రా వశిష్ఠస్య పరంతప ।
చిత్రకేతుప్రధానాస్తే సప్త బ్రహ్మర్షయోఽమలాః ॥ 39

పరంతప - అంతశ్శత్రువులను ఎండగట్టిన ఓ విదురా!, వశిష్ఠస్య - వసిష్ఠ మహర్షికి, ఊర్జాయామ్ - అరుంధతియందు, చిత్రకేతుప్రధానాః - చిత్రకేతువు మొదలుగాగల, తే - ప్రసిద్ధిని గాంచిన, సప్త - ఏడుగురు, అమలాః - దోషము లేని, బ్రహ్మర్షయః - బ్రహ్మర్షులు, పుత్రాః - పుత్రులై, జజ్ఞిరే - పుట్టిరి.

అంతశ్శత్రువులను నశింపజేసిన ఓ విదురా! వసిష్ఠ మహర్షికి అరుంధతియందు చిత్రకేతువు మొదలగు ఏడ్గురు బ్రహ్మర్షులు పుత్రులై జన్మించిరి. చిత్రకేతువు మొదలైన పేర్లతో ప్రసిద్ధిని గాంచిన ఈ ఋషులు మహాపుణ్యాత్ములు. అరుంధతికి ఇంకో పేరు ఊర్జ.

చిత్రకేతుస్సురోచిశ్చ విరజా మిత్ర ఏవ చ ।
ఉల్బణో వసుభృద్యానో ద్యుమాన్ శక్త్యాదయోఽపరే ।। 40

చిత్రకేతుః - చిత్రకేతువు, సురోచిః - సురోచి, విరజాః - విరజసుడు, మిత్రః ఏవ చ - మిత్రుడు, ఉల్బణః - ఉల్బణుడు, వసుభృద్యానః - వసుభృద్యానుడు, ద్యుమాన్ - ద్యుమంతుడు, శక్తి-ఆదయః - శక్తి మొదలగువారు, అపరే - ఇతరులు.

చిత్రకేతువు, సురోచి, విరజసుడు, మిత్రుడు, ఉల్బణుడు, వసుభృద్యానుడు, ద్యుమంతుడు అనునవి ఆ ఏడ్గురి పేర్లు. వీరే గాక, వసిష్ఠునకు మరియొక భార్యయందు శక్తి మొదలగు పుత్రులు కలిగిరి.

చిత్తిస్త్వథర్వణః పత్నీ లేభే పుత్రం ధృతవ్రతమ్ ।
దధ్యంచమశ్వశిరసం భృగోర్వంశం నిబోధ మే ।। 41

అథర్వణః - అథర్వణుని, పత్నీ - భార్యయగు, చిత్తిః - చిత్తి, ధృతవ్రతమ్ - స్వీకరించబడిన వ్రతనిష్ఠ గల, దధ్యంచమ్ - దధ్యఙ్ అనే, అశ్వశిరసమ్ - అశ్వశిరసుడు అనే పేరు కూడ గల (గుర్రపు తలవంటి తల గల), పుత్రమ్ - పుత్రుని, లేభే - పొందెను, మే - నాచే (చెప్పబడే), భృగోః - భృగువుయొక్క, వంశమ్ - వంశమును గురించి, నిబోధ - తెలుసుకొనుము.

అథర్వణునకు భార్యయగు చిత్తియందు దధ్యఙ్ (దధీచి) అనే కొడుకు కలిగెను. గొప్ప ప్రతనిష్ఠ గల ఆ దధీచికి అశ్వశిరసుడు అనే పేరు కూడ గలదు (ఆయన తల గుఱ్ఱపు తలను పోలియుండెడిది). నేను ఇప్పుడు భృగుమహర్షియొక్క వంశమును గురించి చెప్పెదను. గమనించుము.

భృగుః ఖ్యాత్యాం మహాభాగ పత్న్యాం పుత్రానజీజనత్ ।
ధాతారం చ విధాతారం శ్రియం చ భగవత్పరామ్ ॥ 42

మహాభాగ - ఓ మహాత్మా!, భృగుః - భృగు మహర్షి, పత్న్యామ్ - భార్యయగు, ఖ్యాత్యామ్ - ఖ్యాతియందు, ధాతారమ్ - ధాత, విధాతారమ్ - విధాత, భగవత్-పరామ్ - భగవంతునకు మాత్రమే అంకితమైన, శ్రియం చ - శ్రీదేవిని, పుత్రాన్ - ఈ విధముగా ఇద్దరు కొడుకులను ఒక కుమార్తెను, అజీజనత్ - కనెను.

ఓ మహాత్ముడవగు విదురా! భృగు మహర్షికి భార్యయగు ఖ్యాతియందు ధాత, విధాత అనే ఇద్దరు కొడుకులు, శ్రీ అనే ఒక కూతురు కలిగిరి. లక్ష్మి అంశ అయిన ఈ శ్రీదేవి భగవానునకు అంకితమైనది.

ఆయతిం నియతిం చైవ సుతే మేరుస్తయోరదాత్ ।
తాభ్యాం తయోరభవతాం మృకండః ప్రాణ ఏవ చ ॥ 43

తయోః - వారిద్దరికి, మేరుః - మేరువు, ఆయతిమ్ - ఆయతి, నియతిం చ ఏవ - నియతి అనే, సుతే - కుమార్తెలను, అదాత్ - ఇచ్చెను, తయోః - వారిద్దరికి, తాభ్యామ్ - వారినుండి, మృకండః - మృకండుడు, ప్రాణః ఏవ చ - ప్రాణుడు అనే కొడుకులు, అభవతామ్ - కలిగిరి.

ధాత, విధాత అనే వారిద్దరికి మేరువు తన కుమార్తెలగు ఆయతిని, నియతిని ఇచ్చి వివాహము చేసెను. ఆ దంపతులకు క్రమముగా మృకండుడు, ప్రాణుడు అనే కొడుకులు కలిగిరి.

మార్కండేయో మృకండస్య ప్రాణాద్వేదశిరా మునిః ।
కవిశ్చ భార్గవో యస్య భగవానుశనా సుతః ॥ 44

మృకండస్య - మృకండు మహర్షియొక్క, సుతః - కుమారుడు, మార్కండేయః - మార్కండేయ మహర్షి, ప్రాణాత్ - ప్రాణునినుండి, వేద శిరాః - వేదశిరసుడు అనే, మునిః - మహర్షి, చ - మరియు, కవిః - కవి, భార్గవః - భృగు మహర్షియొక్క పుత్రుడు, యస్య - ఏ కవికి, భగవాన్ - పూజ్యుడగు, ఉశనా - ఉశనుడు, సుతః - కుమారుడో.

మృకండు మహర్షికి మార్కండేయ మహర్షి అనే కుమారుడు, ప్రాణునకు వేదశిరసుడు అనే కుమారుడు, భృగు మహర్షికి కవి అనే కుమారుడు కలిగిరి. ఆ కవియొక్క పుత్రుడే పూజ్యుడగు శుక్రాచార్యుడు.

త ఏతే మునయః క్షత్తర్లోకాన్స్వైరభావయన్ ।
ఏష కర్దమదౌహిత్రసంతానః కథితస్తవ ।। 45

క్షత్తః - ఓ విదురా!, తే - ఆ, ఏతే - ఈ, మునయః - మహర్షులు, లోకాన్ - లోకములను, స్వైః - తమ సంతానములచే, అభావయన్ - వర్ధిల్లజేసిరి, ఏషః - ఈ, కర్దమదౌహిత్రసంతానః - కర్దమ ప్రజాపతియొక్క పుత్రికల కొడుకుల సంతానము, తవ - నీకు, కథితః - చెప్పబడినది.

ఓ విదురా! ప్రసిద్ధులైన ఈ మహర్షులు తమ సంతానములచే లోకములను వర్ధిల్లజేసిరి. నీకీ విధముగా కర్దమ మహర్షియొక్క కుమార్తెల పుత్రుల సంతానమును గురించి చెప్పితిని.

శృణ్వతః శ్రద్దధానస్య సద్యః పాపహరః పరః ।
ప్రసూతిం మానవీం దక్ష ఉపయేమే హ్యజాత్మజః ।। 46

శృణ్వతః - వినువానికి, శ్రత్-దధానస్య - శ్రద్ధ గలవానికి, సద్యః - వెనువెంటనే, పాపహరః - పాపములను పోగొట్టునది, పరః - గొప్పది, అజ -ఆత్మజః - బ్రహ్మగారి పుత్రుడగు, దక్షః - దక్షుడు, మానవీమ్ - మనువు పుత్రికయగు, ప్రసూతిమ్ - ప్రసూతిని, ఉపయేమే - వివాహమాడెను.

ఈ గొప్ప వృత్తాంతమును శ్రద్ధతో వినువారి పాపములు వెంటనే నశించును. బ్రహ్మపుత్రుడగు దక్షుడు మనుపుత్రికయగు ప్రసూతిని వివాహమాడెను.

తస్యాం ససర్జ దుహితౄః షోడశామలలోచనాః ।
త్రయోదశాదాద్ధర్మాయ తథైకామగ్నయే విభుః ।
పితృభ్య ఏకాం యుక్తేభ్యో భవాయైకాం భవచ్ఛిదే ।। 47

తస్యామ్ - ఆమెయందు, అమలలోచనాః - చక్కని కన్నులు గల, షోడశ - పదహారు, దుహితౄః - కుమార్తెలను, ససర్జ - కనెను, విభుః - గొప్పగా ప్రకాశించే ఆ దక్షుడు, త్రయోదశ - పదముగ్గురు కుమార్తెలను, ధర్మాయ - ధర్ముని కొరకు, తథా - మరియు, ఏకామ్ - ఒక అమ్మాయిని, అగ్నయే - అగ్ని కొరకు, యుక్తేభ్యః - యోగ్యులగు, పితృభ్యః - పితృదేవతల కొరకు, ఏకామ్ - ఒకామెను, భవచ్ఛిదే - సంసారమును నశింపజేసే, భవాయ - శివుని కొరకు, ఏకామ్ - ఒకామెను, అదాత్ - ఇచ్చెను.

గొప్పగా ప్రకాశించే ఆ దక్షునకు ఆమెయందు పదహారు కుమార్తెలు కలిగిరి. ఆయన వారిలో పదముగ్గురిని ధర్మునకు, ఒకామెను అగ్నికి, ఇంద్రియజయము గల పితృదేవతలందరికి కలిపి ఒకామెను, భక్తుల సంసారమును నశింపజేసే శివునకు ఒకామెను ఇచ్చి వివాహము చేసెను.

శ్రద్ధా మైత్రీ దయా శాంతిస్తుష్టిః పుష్టిః క్రియోన్నతిః ।
బుద్ధిర్మేధా తితిక్షా హ్రీర్మూర్తిర్ధర్మస్య పత్నయః ।। 48

శ్రద్ధా - శ్రద్ధ, మైత్రీ - మైత్రి, దయా - దయ, శాంతిః - శాంతి, తుష్టిః - తుష్టి, పుష్టిః - పుష్టి, క్రియా - క్రియ, ఉన్నతిః - ఉన్నతి, బుద్ధిః - బుద్ధి, మేధా - మేధ, తితిక్షా - తితిక్ష, హ్రీః - హ్రీ, మూర్తిః - మూర్తి, ధర్మస్య - ధర్ముని, పత్నయః - భార్యలు.

శ్రద్ధ (వేదవచనములు జ్ఞానసాధనములు అనే ధారణతో వాటియందు ఉత్సాహమును కలిగియుండుట), మైత్రి (స్నేహభావము), దయ (భూతదయ), శాంతి (మనస్సు ప్రసన్నముగా నుండుట), తుష్టి (లభించిన దానితో సంతోషమును పొందుట), పుష్టి (సంతోషము వలన మనస్సు నిండుగానుండుట), క్రియ (వేదోక్తకర్మ), ఉన్నతి (ఆధ్యాత్మికముగా ఎదుగుట), బుద్ధి (సరిగా నిర్ణయములను చేసే సామర్థ్యము), మేధ (శాస్త్రవిషయములను బుద్ధియందు ధరించి ఉండే శక్తి), తితిక్ష (సుఖదుఃఖములను ప్రస

న్నమగు మనస్సుతో స్వీకరించే సామర్థ్యము), హ్రీ (వినయము), మూర్తి (శుద్ధసత్త్వస్వభావము) అనునవి ధర్ముని (ధర్మముయొక్క) భార్యలు (తోడుగానుండు లక్షణములు).

శ్రద్ధాఽసూత శుభం మైత్రీ ప్రసాదమభయం దయా ।
శాంతిస్సుఖం ముదం తుష్టిస్స్మయం పుష్టిరసూయత ।।49

శ్రద్ధా - శ్రద్ధ, శుభమ్ - శుభుని, అసూత - కనెను, మైత్రీ - మైత్రి, ప్రసాదమ్ - ప్రసాదుని, దయా - దయ, అభయమ్ - అభయుని, శాంతిః - శాంతి, సుఖమ్ - సుఖుని, తుష్టిః - తుష్టి, ముదమ్ - ముదుని, పుష్టిః - పుష్టి, స్మయమ్ - స్మయుని, అసూయత - కనెను.

శ్రద్ధకు శుభుడు (శ్రద్ధ ఉన్నచోట శుభము కలుగును), మైత్రికి ప్రసాదుడు (స్నేహభావము గల మనస్సు ప్రసన్నముగా నుండును), దయ అభయుని (దయ ఉన్నవాడు సకలప్రాణులకు అభయమునిచ్చి తాను భయరహితుడై యుండును), శాంతి సుఖుని (మనశ్శాంతియే సుఖము), తుష్టి ముదుని (సంతోషము ఉన్న వ్యక్తికి సర్వకాలములలో మనస్సులో ఆనందము ఉండును), పుష్టి స్మయుని (మనస్సు నిండుగా నున్నచో శరీరము నిండుగానుండి ధర్మకార్యములయందు సమధికమగు ఉత్సాహము ఉదయించును) పుత్రులుగా కనిరి.

యోగం క్రియోన్నతిర్దర్పమర్థం బుద్ధిరసూయత ।
మేధా స్మృతిం తితిక్షా తు క్షేమం హ్రీః ప్రశ్రయం సుతమ్ ।
మూర్తిస్సర్వగుణోత్పత్తిర్నరనారాయణావృషీ ।। 50

క్రియా - క్రియ, యోగమ్ - యోగుని, ఉన్నతిః - ఉన్నతి, దర్పమ్ - దర్పుని, బుద్ధిః - బుద్ధి, అర్థమ్ - అర్థుని, మేధా - మేధ, స్మృతిమ్ - స్మృతిని, తితిక్షా తు - తితిక్షయైతే, క్షేమమ్ - క్షేముని, హ్రీః - హ్రీ, ప్రశ్రయమ్ - ప్రశ్రయుని, సుతమ్ - కుమారునిగా, అసూయత - కనెను, సర్వగుణ-ఉత్పత్తిః - సకలకల్యాణగుణములు ఉదయించుటకు కారణమగు (సకలకల్యాణగుణములకు నిలయమగు భగవానుని అవతారమునకు

కారణమగు), మూర్తిః - మూర్తి, నరనారాయణౌ - నరనారాయణులనే, ఋషీ - ఋషులను (కనెను).

క్రియ యోగుని (కర్తవ్యబుద్ధితో చేసే కర్మయే సాధకుని భగవానుని వద్దకు చేర్చే ఉపాయము), ఉన్నతి దర్పుని (ఉన్నతమగు జీవితలక్ష్యము గల వ్యక్తి తపస్సును ఆచరించుటయందు, లేక జ్ఞానార్జనయందు పట్టుదలను కలిగియుండును), బుద్ధి అర్థుని (సరియగు నిర్ణయములను చేయు వ్యక్తి సంపదను పొందును), మేధ స్మృతిని (శాస్త్రవిషయములను గుర్తులో పెట్టుకున్నవాడు సరియగు సమయములో వాటిని గుర్తుకు తెచ్చుకొనగల్గును), తితిక్ష క్షేముని (సుఖదుఃఖములను ప్రసన్నమగు మనస్సుతో స్వీకరించువాడు ఆత్మజ్ఞానమును పొంది మోక్షము అనే సర్వోత్కృష్టమగు క్షేమమును పొందును), హ్రీ ప్రశ్రయుని (అధర్మమును చేయుటకు సిగ్గుపడువాడు వినయమును కలిగియుండును) పుత్రులుగా కనిరి. సకలకల్యాణగుణములకు నిలయమగు భగవానుని అవతరింపజేసిన మూర్తి నర నారాయణులనే మహర్షులను కనెను (సత్త్వగుణప్రధానమగు అంతఃకరణములో నరునకు నారాయణునితో మైత్రి ఏర్పడును).

యయోర్జన్మన్యదో విశ్వమభ్యనందత్సునిర్వృతమ్ ।
మనాంసి కకుభో వాతాః ప్రసేదుస్సరితోఽద్రయః ॥ 51

యయోః - ఏ నర నారాయణుల, జన్మని - జన్మయందు, అదః - ఈ, విశ్వమ్ - జగత్తు, సునిర్వృతమ్ - ఆనందముచే వ్యాపించబడినదై, అభ్యనందత్ - పండుగ జేసుకొనెను, మనాంసి - మనస్సులు, కకుభః - దిక్కులు, వాతాః - గాలులు, సరితః - నదులు, అద్రయః - పర్వతములు, ప్రసేదుః - ప్రసన్నములైనవి.

ఆ నర నారాయణులు జన్మించిన కాలమునందు ఈ జగత్తు అంతయు ఆనందముతో నిండి పండుగను జేసుకొనెను. జనుల మనస్సులు కోపము మొదలగునవి తొలగి ప్రసన్నములయ్యేను. దిక్కులు ధూళి లేకుండుటచే ప్రసన్నములయ్యేను. గాలులు సుఖకరమగు స్పర్శను కలిగి ప్రసన్నములయ్యేను. నదులు బురద తొలగి ప్రసన్నములయ్యేను.

అడవులలోని చెట్లు పుష్పించి ఫలించుటచే పర్వతములు ప్రసన్నముల య్యేను.

దివ్యవాద్యంత తూర్యాణి పేతుః కుసుమవృష్టయః ।
మునయస్తుష్టువుస్తుష్టా జగుర్గంధర్వకిన్నరాః ।। 52

దివి - అంతరిక్షమునందు, తూర్యాణి - బాజాలు, అవాద్యంత - వాయించబడినవి, కుసుమవృష్టయః - పువ్వుల వానలు, పేతుః - పడినవి, తుష్టాః - సంతోషమును పొందిన, మునయః - మహర్షులు, తుష్టువుః - స్తోత్రములను చేసిరి, గంధర్వకిన్నరాః - గంధర్వులు మరియు కిన్నరులు, జగుః - గానము చేసిరి

ఆ సమయములో అంతరిక్షమునందు బాజాలు మ్రోగి, పువ్వుల వానలు కురిసినవి. సంతోషమును పొందిన మహర్షులు స్తోత్రములను పఠించిరి. గంధర్వులు, కిన్నరులు గానము చేసిరి.

నృత్యంతి స్మ స్త్రియో దేవ్య ఆసీత్పరమమంగలమ్ ।
దేవా బ్రహ్మాదయస్సర్వ ఉపతస్థురభిష్టవైః ।। 53

దేవ్యః - దేవతలకు చెందిన, స్త్రియః - స్త్రీలు, నృత్యంతి స్మ - నాట్యమును చేసిరి, పరమమంగలమ్ - గొప్ప మంగళము, ఆసీత్ - ఆయెను, బ్రహ్మ-ఆదయః - బ్రహ్మ మొదలగు, దేవాః - దేవతలు, సర్వే - అందరు, అభిష్టవైః - స్తోత్రములతో, ఉపతస్థుః - స్తుతించిరి.

ఆ సమయములో అప్సరసలు నాట్యమాడిరి. అంతటా గొప్ప మంగళము కలిగెను. బ్రహ్మ మొదలగు దేవతలు అందరు స్తోత్రములను చేసిరి.

దేవా ఊచుః ।
యో మాయయా విరచితం నిజయాఽఽత్మనీదం
ఖే రూపభేదమివ తత్ప్రతిచక్షణాయ ।

ఏతేన ధర్మసదనే ఋషిమూర్తినాఽద్య
ప్రాదుశ్చకార పురుషాయ నమః పరస్మై ॥ 54

యః - ఏ భగవానుడు, నిజయా - తనదైన, మాయయా - మాయాశక్తిచే, ఆత్మని - తనయందు, ఖే - ఆకాశమునందు, రూపభేదం ఇవ - విభిన్నములగు రూపములను వలె, విరచితమ్ - రచించబడిన, ఇదమ్ - ఈ జగత్తును, తత్-ప్రతిచక్షణాయ - ఆ తన స్వరూపమును ప్రకాశింపజేయుట కొరకై, అద్య - ఇప్పుడు, ఏతేన - ఈ, ఋషిమూర్తినా - ఋషియొక్క దేహముతో, ధర్మసదనే - ధర్ముని గృహములో, ప్రాదుశ్చకార - ప్రకటము చేసెనో అట్టి, పరస్మై - ప్రకృతికి అతీతుడగు, పురుషాయ - పూర్ణస్వరూపునకు, నమః - నమస్కారము.

దేవతలు ఇట్లు పలికిరి --- ఆకాశములో ఘటాకాశము, మఠాకాశము మొదలగు భేదములు లేకున్ననూ కల్పించబడుచుండును. అదే విధముగా అద్వయ పరబ్రహ్మయందు భేదములు లేవు. అయిననూ, ఆ పరబ్రహ్మ తన మాయాశక్తిచే తనయందే ఈ నానానామరూపాత్మకమగు జగత్తును ప్రకటింపజేసెను. అట్టి తన యథార్థస్వరూపమును భక్తులకు ప్రకాశింపజేయుట కొరకై ఆ పరబ్రహ్మ ఈ నాడు ఈ ఋషిదేహముతో ధర్ముని గృహములో ఆవిర్భవించెను. ప్రకృతికి అతీతుడు, పూర్ణ స్వరూపుడు అగు అట్టి పరమేశ్వరునకు నమస్కారము.

సోఽయం స్థితివ్యతికరోపశమాయ సృష్టాన్
సత్త్వేన నస్సురగణాననుమేయతత్త్వః ।
దృశ్యాదదభ్రకరుణేన విలోకనేన
యచ్ఛ్రీనికేతమమలం క్షిపతారవిందమ్ ॥ 55

సః - అట్టి, అనుమేయతత్త్వః - శాస్త్రోపదేశముచే తెలియదగిన స్వరూపము గల, అయమ్ - ఈ పరమేశ్వరుడు, స్థితివ్యతికర-ఉపశమాయ - జగద్రక్షణకు విరుద్ధమైన శక్తులను శమింపజేయుట కొరకై, సత్త్వేన - సత్త్వగుణముచే, సృష్టాన్ - సృష్టించబడిన, సురగణాన్ - దేవతాగణములగు, నః - మనలను, అదభ్రకరుణేన - అధికమగు దయగల,

యత్ - ఏ, శ్రీనికేతమ్ - శోభకు నెలవైన, అరవిందమ్ - పద్మము గలదో దానిని, క్షిపతా - తిరస్కరించుచున్న, విలోకనేన - చూపుతో, దృశ్యాత్ - చూచుగాక!

పరమేశ్వరుని యథార్థస్వరూపమును మానవుడు శాస్త్రోపదేశము ద్వారా మాత్రమే తెలియగల్గును. ఆయన జగద్రక్షణకు విరుద్ధముగా పని చేసే దుష్టశక్తులను ఉపశమింప జేయుటకొరకై సత్త్వగుణప్రధానులగు దేవతలను సృష్టించినాడు. ఆ దేవతలము మేమే. ఆయన చూపు అందమునకు నెలవైన పద్మమును కూడ తన సౌందర్యముచే తిరస్కరించుచున్నది. ఆయన చూపులో దయ నిండియున్నది. ఆయన అట్టి దయాదృష్టిని మాపై బరపు గాక!

ఏవం సురగణైస్తాత భగవంతావభిష్టుతౌ ।
లబ్ధావలోకైర్యయతురర్చితౌ గంధమాదనమ్ ॥ 56

తాత - వత్సా విదురా!, లబ్ధ-అవలోకైః - పొందబడిన దర్శనము గల, సురగణైః - దేవతాగణములచే, ఏవమ్ - ఈ విధముగా, అభిష్టుతౌ - స్తుతించబడినవారై, అర్చితౌ - పూజించబడినవారై, భగవంతౌ - పూజ్యులగు నరనారాయణులు, గంధమాదనమ్ - గంధమాదనపర్వతమును గురించి, యయతుః - వెళ్లిరి.

వత్సా ఓ విదురా! ఈ విధముగా దేవతలు నరనారాయణ భగవానులను స్తుతించి పూజించిరి. ఆ దేవతలకు వారి దర్శనము, కృపాదృష్టి కూడ లభించెను. అపుడా నరనారాయణులు గంధమాదన పర్వతమునకు వెళ్లిరి.

తావిమౌ వై భగవతో హరేరంశావిహాగతౌ ।
భారవ్యయాయ చ భువః కృష్ణౌ యదుకురూద్వహౌ ॥ 57

భగవతః హరేః - శ్రీహరి భగవానుని, అంశౌ - అంశలగు, తౌ - ఆ నరనారాయణులే, ఇమౌ - ఈ, యదుకురు-ఉద్వహౌ - యాదవ కురు వంశములను పాలించే, కృష్ణౌ - కృష్ణార్జునులు, వై - నిశ్చయము, భువః -

భూమియొక్క, భారవ్యయాయ - బరువును తగ్గించుట కొరకు, ఇహ - ఈ భూలోకమునందు, ఆగతౌ - అవతరించినారు.

శ్రీహరి భగవానుని అంశలగు ఆ నరనారాయణులే ఈ కృష్ణార్జునులు. వీరు క్రమముగా యదు, కురు వంశములనుద్ధరించినారు. వీరు భూభారము (అధర్మమే బరువు గాని, జనసంఖ్య బరువు కాదు) ను తగ్గించుటకు ఈ భూలోకముపై అవతరించినారు.

స్వాహాభిమానినశ్చాగ్నేరాత్మజాంస్త్రీనజీజనత్ ।
పావకం పవమానం చ శుచిం చ హుతభోజనమ్ ।। 58

అభిమానినః - నిప్పుకు అభిమాని దేవతయగు, అగ్నేః - అగ్నిదేవునినుండి, స్వాహా - స్వాహాదేవి, హుతభోజనమ్ - హోమద్రవ్యములనారగించే, పావకమ్ - పావకుని, పవమానమ్ - పవమానుని, చ - మరియు, శుచిమ్ - శుచిని, త్రీన్ - ముగ్గురు, (అభిమానినః - అగ్నికి అభిమానులగు), ఆత్మజాన్ - కొడుకులను, అజీజనత్ - కనెను.

మన యెదుట మండే నిప్పుకు అభిమాని దేవత అగ్ని దేవుడు. ఆయన భార్య స్వాహా దేవి. వారికి పావకుడు, పవమానుడు, శుచి అనే ముగ్గురు కొడుకులు కలిగిరి. వీరు కూడ నిప్పుకు అభిమాని దేవతలే. మనము హోమము చేసే ద్రవ్యములను వారు ఆరగించెదరు.

తేభ్యోఽగ్నయస్సమభవంశ్చత్వారింశచ్చ పంచ చ ।
త ఏవైకోనపంచాశత్సాకం పితృపితామహైః ।। 59

తేభ్యః - ఆ ముగ్గురినుండి, చత్వారింశత్ చ పంచ చ - నలభై అయిదుమంది, అగ్నయః - అగ్నులు, సమభవన్ - కలిగిరి, తే ఏవ - వారే, పితృపితామహైః సాకమ్ - తండ్రులతో తాతతో కలిసి, ఏక-ఊనపంచాశత్ - నలభై తొమ్మిదిమంది అయిరి.

ఆ ముగ్గురికి నలభై అయిదు మంది అగ్నులు పుట్టిరి. వీరు, వీరి తండ్రులు ముగ్గురు, తాత ఒకరు కలిసి వెరసి నలభై తొమ్మిది మంది అగ్నులు అయినారు.

వైతానికే కర్మణి యన్నామభిర్బ్రహ్మవాదిభిః ।
ఆగ్నేయ్య ఇష్టయో యజ్ఞే నిరూప్యంతేఽగ్నయస్తు తే ।। 60

వైతానికే - వేదవిహితమైన, కర్మణి - కర్మయగు, యజ్ఞే - యజ్ఞమునందు, యత్-నామభిః - ఏ అగ్నుల నామములచే, బ్రహ్మవాదిభిః - వేదవేత్తలచే, ఆగ్నేయ్యః - అగ్ని దేవతగా గల, ఇష్టయః - ఇష్టులు, నిరూప్యంతే - చేయబడుచున్నవో, తే - అట్టి, అగ్నయః తు - అగ్నులే.

వేదవిహితములైన యజ్ఞకర్మలయందు వేదవేత్తలు అగ్నుల నామములను ప్రస్తావించి అగ్నిదేవతాకములగు ఇష్టులను చేయుచుందురు. ఆ అగ్నులు వీరే.

అగ్నిష్వాత్తా బర్హిషదస్సౌమ్యాః పితర ఆజ్యపాః ।
సాగ్నయోఽనగ్నయస్తేషాం పత్నీ దాక్షాయణీ స్వధా ।। 61

అగ్నిష్వాత్తాః - అగ్నిష్వాత్తులు, బర్హిషదః - బర్హిషదులు, సౌమ్యాః - సౌమ్యులు, ఆజ్యపాః - ఆజ్యపులు, పితరః - పితృదేవతలు, స-అగ్నయః - అగ్నులు గలవారు, అనగ్నయః - అగ్నులు లేనివారు, తేషామ్ - వారికి, దాక్షాయణీ - దక్షుని పుత్రికయగు, స్వధా - స్వధ, పత్నీ - భార్య.

అగ్నిష్వాత్తులు (అగ్నియందు పక్వమైన పురోడాశము మొదలగు వాటిని ఆస్వాదించువారు), బర్హిషదులు (దర్భలు ఆసనముగా గలవారు), సౌమ్యులు (సోమరసమును పానము చేయువారు) మరియు ఆజ్యపులు (ఆజ్యమును పానము చేయువారు ) అనువారలు పితృదేవతలు. వీరిలో కొందరికి అగ్నియందు సమర్పణము విహితమై యుండగా, మరికొందరికి అట్లు లేదు. ఇట్టి విభాగములతో కూడిన ఈ పితృదేవతలకు దక్షుని కుమార్తె యగు స్వధా దేవి భార్య యైనది.

తేభ్యో దధార కన్యే ద్వే వయునాం ధారిణీం స్వధా ।
ఉభే తే బ్రహ్మవాదిన్యౌ జ్ఞానవిజ్ఞానపారగే ।। 62

స్వధా - స్వధా దేవి, తేభ్యః - ఆ పితరులవలన, వయునామ్ - వయున, ధారిణీమ్ - ధారిణి అనే, ద్వే - ఇద్దరు, కన్యే - కన్యలను, దధార

- గర్భమునందు ధరించెను, తే - ఆ, ఉభే - ఇద్దరు, జ్ఞానవిజ్ఞానపారగే - జ్ఞానవిజ్ఞానములయందు దిట్టలగు, బ్రహ్మవాదిన్యౌ - బ్రహ్మవాదినులు.

ఆ పితృదేవతలకు స్వధాదేవియందు ధారిణి, వయున అనే ఇద్దరు కన్యలు కలిగిరి. వారిద్దరు ఆత్మస్వరూపమును గురించి తెలుసుకొనుటయే గాక, ఆ జ్ఞానమును అనుభవమునకు తెచ్చుకొని, దానిని జిజ్ఞాసువులకు బోధించిన మహాత్మురాండ్రు.

భవస్య పత్నీ తు సతీ భవం దేవమనువ్రతా ।
ఆత్మనస్సదృశం పుత్రం న లేభే గుణశీలతః ।। 63

భవస్య - శివుని, పత్నీ - భార్యయగు, సతీ - సతీదేవి, భవం దేవమ్ - శివదేవుని, అనువ్రతా - సేవించే పతివ్రత, తు - కాని, గుణశీలతః - గుణములలో స్వభావములో, ఆత్మనః - తనకు, సదృశమ్ - తగియున్న, పుత్రమ్ - పుత్రుని, న లేభే - పొందలేదు.

శివదేవుని భార్యయగు సతి గొప్ప ప్రేమతో ఆయనను సేవించెను. అయిననూ, ఆమెకు తన గుణశీలములకు తగిన పుత్రుడు కలుగలేదు.

పితర్యప్రతిరూపే స్వే భవాయానాగసే రుషా ।
అప్రౌఢైవాత్మనాత్మానమజహాద్యోగసంయుతా ।। 64

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే చతుర్థస్కంధే మనుకన్యాన్వయే నరనారాయణావతారవర్ణనం నామ ప్రథమోఽధ్యాయః ।।

స్వే - తన, పితరి - తండ్రి, అనాగసే - దోషమునెరుంగని, భవాయ - శివుని కొరకు, రుషా - కోపముతో, అప్రతిరూపే - తగని విధముగా ఆచరించగా, అప్రౌఢా ఏవ - యౌవనములో నుండగనే, ఆత్మనా - స్వీయప్రేరణచేతనే, యోగసంయుతా - యోగశక్తినాశ్రయించినదై, ఆత్మానమ్ - తన దేహమును, అజహాత్ - విడిచిపెట్టెను.

శివునియందు దోషమేమియు లేకున్ననూ, సతీదేవి తండ్రి ఆయనపై కోపముతో ఆయనయందు ప్రతికూలమగు ఆచరణను చేసెను. అప్ప

టికింకనూ సతీదేవి ప్రౌఢవయస్కురాలు కానేలేదు. అట్టి యౌవనవతియగు సతీదేవి తనంత తానే ఒక నిర్ణయమును తీసుకొని, యోగశక్తినాశ్రయించి, తన దేహమును వదిలిపెట్టెను.

శ్రీమద్భాగవత మహాపురాణములోని నాల్గవ స్కంధములో మనుకన్యలవంశములను, నరనారాయణావతారమును వర్ణించే మొదటి అధ్యాయము ముగిసినది (1).

*****

# అథ ద్వితీయోఽధ్యాయః

## దక్షుడు శివుని నిందించి శాపమునిచ్చుట

విదుర ఉవాచ ।
భవే శీలవతాం శ్రేష్ఠే దక్షో దుహితృవత్సలః ।
విద్వేషమకరోత్కస్మాదనాదృత్యాత్మజాం సతీమ్ ॥ 1

విదురః - విదురుడు, ఉవాచ - పలికెను, శీలవతామ్ - శీలము గలవారిలో, శ్రేష్ఠే - ఉత్తముడగు, భవే - శివునియందు, దుహితృవత్సలః - కుమార్తెలయందు ప్రేమ గల, దక్షః - దక్షుడు, ఆత్మజామ్ - తన కుమార్తెయగు, సతీమ్ - సతీదేవిని, అనాదృత్య - నిరాదరణము చేసి, కస్మాత్ - ఏ కారణము వలన, విద్వేషమ్ - అధిక ద్వేషమును, అకరోత్ - చేసెను?

విదురుడిట్లు ప్రశ్నించెను: కల్యాణగుణములు గలవారిలో శివుడు ఉత్తముడు. దక్షునకు తన కుమార్తెలయందు గొప్ప ప్రేమ గలదు. అయినను, ఆతడు తన కుమార్తెయగు సతీదేవిని నిరాదరణ చేసి, శివునియందు అధికమగు ద్వేషమును బూనుటకు కారణమేమి?

కస్తం చరాచరగురుం నిర్వైరం శాంతవిగ్రహమ్ ।
ఆత్మారామం కథం ద్వేష్టి జగతో దైవతం మహత్ ॥ 2

చర-అచరగురుమ్ - కదిలే మరియు కదలని ప్రాణులకు తండ్రి, నిర్వైరమ్ - వైరము లేనివాడు, శాంతవిగ్రహమ్ - ప్రసన్నమగు రూపము గలవాడు, ఆత్మా రామమ్ - తన స్వరూపమునందే నిష్ఠ గలవాడు, జగతః - జగత్తునకు, మహత్ - గొప్ప, దైవమ్ - దైవము అగు, తమ్ - ఆ శివుని, కః - ఎవడు, కథమ్ - ఏ విధముగా, ద్వేష్టి - ద్వేషించును?

శివుడు కదిలే మరియు కదలని ప్రాణులన్నింటికీ తండ్రి. ఆయనకు ఏ ప్రాణియందైననూ వైరభావము లేదు. ప్రసన్నమగు రూపము గల ఆ శివుడు ఆత్మస్వరూపమునందు మాత్రమే నిష్ఠను కలిగియుండును. జగత్తునకు గొప్ప దైవమగు అట్టి శివుని ఎవ్వాడు ద్వేషించును? అట్లు ద్వేషించుట ఎట్లు సంభవమగును?

ఏతదాఖ్యాహి మే బ్రహ్మన్ జామాతుః శ్వశురస్య చ ।
విద్వేషస్తు యతః ప్రాణాంస్తత్యజే దుస్త్యజాన్ సతీ ॥ 3

బ్రహ్మన్ - ఓ మైత్రేయ మహర్షీ!, మే - నా కొరకు, ఏతత్ - దీనిని, ఆఖ్యాహి - చెప్పుము, జామాతుః - అల్లునకు, శ్వశురస్య చ - మామగారికి, యతః - ఏ కారణము వలన, విద్వేషః తు - విద్వేషము కలిగినదో, దుస్త్యజాన్ - విడువ శక్యము కాని, ప్రాణాన్ - ప్రాణములను, సతీ - సతీదేవి, తత్యజే - విడిచిపెట్టెనో.

ఓ మైత్రేయ మహర్షీ! మామకు, అల్లునకు అంతటి విద్వేషము కలుగుటకు కారణమేమి? ఆ విద్వేషము కారణముగా సతీదేవి విడువ శక్యము కాని ప్రాణములను కూడ విడిచిపెట్టినది. ఈ విషయమును నాకు చెప్పుము.

మైత్రేయ ఉవాచ ।
పురా విశ్వసృజాం సత్రే సమేతాః పరమర్షయః ।
తథాऽమరగణాస్సర్వే సానుగా మునయోగ్నయః ॥ 4

పురా - పూర్వము, విశ్వసృజామ్ - మరీచి మొదలగు ప్రజాపతుల, సత్రే - సత్రయాగమునందు, పరమ-ఋషయః - మహర్షులు, తథా - అదే విధముగా, సర్వే - అందరు, అమరగణాః - దేవతాగణములు, స-అనుగాః - శిష్యులతో కూడియున్న, మునయః - మునులు, అగ్నయః - అగ్నులు, సమేతాః - ఒకచోటకు చేరిరి.

మైత్రేయ మహర్షి ఇట్లు చెప్పెను --- పూర్వము మరీచి మొదలగు ప్రజాపతులు సత్రయాగమును చేసిరి. అచటకు మహర్షులు (ఋషి

యనగా మంత్రద్రష్ట), సకలదేవతాగణములు, శిష్యులతో కూడిన మునులు (ముని యనగా మననశీలుడు, అనగా ఆత్మజ్ఞానవిష్ఠుడు), అగ్నులు (ఇదివరలో చెప్పబడిన అగ్ని-అభిమానిదేవతలు) విచ్చేసిరి.

తత్ర ప్రవిష్టమృషయో దృష్ట్వార్కమివ రోచిషా ।
భ్రాజమానం వితిమిరం కుర్వంతం తన్మహత్సదః ॥ 5

ఉదతిష్ఠన్ సదస్యాస్తే స్వధిష్ణ్యేభ్యస్సహాగ్నయః ।
ఋతే విరించం శర్వం చ తద్భాసాక్షిప్తచేతసః ॥ 6

రోచిషా - కాంతిచే, తత్ - ఆ, మహత్ - గొప్ప, సదః - సభను, వితిమిరమ్ - చీకట్లు లేనిదిగా, కుర్వంతమ్ - చేయుచున్నట్టియు, అర్కం ఇవ - సూర్యుని వలె, భ్రాజమానమ్ - ప్రకాశించుచున్నట్టియు, తత్ర - అచటకు, ప్రవిష్టమ్ - ప్రవేశించిన దక్షుని, దృష్ట్వా - చూచి, తత్-భాసా - వాని కాంతిచే, ఆక్షిప్తచేతసః - పరాభూతము చేయబడిన మనస్సులు గల, సహ-అగ్నయః - అగ్నులతో కూడియున్న, ఋషయః - మహర్షులు, తే - ఆ, సదస్యాః చ - సభాసదులు కూడ, విరించమ్ - బ్రహ్మగారిని, శర్వం చ - శివుని కూడ, ఋతే - మినహాయించి, స్వధిష్ణ్యేభ్యః - తమ ఆసనముల నుండి, ఉదతిష్ఠన్ - లేచి నిలబడిరి.

తన కాంతులచే చీకట్లను పారద్రోలే సూర్యుని వలె ప్రకాశించు చున్న దక్షుడు ఆ గొప్ప సభలోనికి ప్రవేశించెను. అతనిని చూచిన మహర్షులకు, ఇతర సభాసదులకు ఆతని కాంతియొక్క ప్రభావముచే మతులు పోయెను. అపుడు వారందరు అగ్నులతో సహా లేచి నిలబడిరి. కాని, బ్రహ్మగారు, శివుడు లేచి నిలబడలేదు.

సదసస్పతిభిర్దక్షో భగవాన్ సాధుసత్కృతః ।
అజం లోకగురుం నత్వా నిషసాద తదాజ్ఞయా ॥ 7

సదసస్పతిభిః - ముఖ్యులగు సభాసదులచే, సాధు - చక్కగా, సత్కృతః - సత్కరించబడిన, భగవాన్ - పూజ్యుడగు, దక్షః - దక్షుడు, లోకగురుమ్ - లోకములకు తండ్రియగు, అజమ్ - బ్రహ్మగారిని, నత్వా -

నమస్కరించి, తత్-ఆజ్ఞయా - ఆయన అనుమతితో, నిషసాద - కూర్చుం డెను.

సభలోని ప్రముఖులు పూజ్యుడగు ఆ దక్షుని చక్కగా సత్కరించిరి. అపుడాతడు లోకములకు తండ్రి, స్వయంభువుడు అగు బ్రహ్మగారికి నమ స్కరించి, ఆయన అనుమతితో కూర్చుండెను.

ప్రాజ్ నిషణ్ణం మృడం దృష్ట్వా నామృష్యత్తదనాదృతః ।
ఉవాచ వామం చక్షుర్భ్యామభివీక్ష్య దహన్నివ ॥ 8

ప్రాక్ - ముందే, నిషణ్ణమ్ - కూర్చున్న, మృడమ్ - శివుని, దృష్ట్వా - చూచి, తత్-అనాదృతః - దానిచే అనాదరమును పొందిన దక్షు డు, న అమృష్యత్ - సహించలేకపోయెను, చక్షుర్భ్యామ్ - కన్నులతో, దహన్ ఇవ - దహించుచున్నవాడు వలె, వామమ్ - వంకరగా, అభివీక్ష్య - ముఖములోనికి చూచి, ఉవాచ - పలికెను.

తనకంటె ముందే కూర్చునియున్న శివుని చూచి, దక్షుడు ఆ విధ ముగా శివుడు తనను అవమానించినాడని భావించెను. అపుడాతడు శివుని ముఖములోనికి కన్నులతో దహించువాని వలె వంకరగా చూస్తూ, ఇట్లు పలికెను.

శ్రూయతాం బ్రహ్మర్షయో మే సహదేవాస్సహాగ్నయః ।
సాధూనాం బ్రువతో వృత్తం నాజ్ఞానాన్న చ మత్సరాత్ ॥ 9

సహదేవాః - దేవతలతో కూడియున్న, సహ-అగ్నయః - అగ్ని లతో కూడియున్న, బ్రహ్మ-ఋషయః - బ్రహ్మర్షులారా!, అజ్ఞానాత్ న - అజ్ఞానము వలన కాకుండా, న చ మత్సరాత్ - మాత్సర్యము వలన కూడ కాకుండా, సాధూనామ్ - సత్పురుషుల, వృత్తమ్ - నడవడిని గురించి, బ్రువతః - చెప్పుచున్న, మే - నా (మాట), శ్రూయతామ్ - వినబడుగాక!

ఓ బ్రహ్మర్షులారా! మీరు దేవతలతో మరియు అగ్నులతో కూడి యున్నారు. నేను సత్పురుషుల నడవడిని గురించి చెప్పెదను. నేనీ విష

యమును అజ్ఞానముతో గాని, మాత్సర్యముతో గాని చెప్పుట లేదు. నా మాటను వినుడు.

అయం తు లోకపాలానాం యశోఘ్నో నిరపత్రపః ।
సద్భిరాచరితః పంథా యేన స్తబ్ధేన దూషితః ॥ 10

లోకపాలానామ్ - లోకములను పాలించువారి, యశః-ఘ్నః - కీర్తిని చెడగొట్టే (కీర్తిని తిరస్కరించే), అయమ్ - ఈ శివుడు, నిరపత్రపః - సిగ్గు లేనివాడు (రక్షణ లేనివారిని రక్షించువాడు), స్తబ్ధేన - పొగరుమోతైన (ఆత్మనిష్ఠుడైన), యేన - ఎవనిచే, సద్భిః - సత్పురుషులచే, ఆచరితః - నడువబడిన, పంథాః - మార్గము, దూషితః - చెడగొట్టబడినదో (విడువబ డినదో).

సిగ్గు లేని ఈ శివుడు లోకపాలకుల కీర్తిని చెడగొట్టుచున్నాడు. సత్పురుషుల నడిచే మార్గమును (సత్పురుషుల ఆచారమును) ఈ పొగ రుమోతు ధ్వస్తము చేయుచున్నాడు.

లోకపాలకుల కీర్తిని కూడ తిరస్కరించే కీర్తి గల శివుడు సర్వాధికు డగుటచే ఎవ్వరి ముందైననూ సిగ్గు పడనవసరము లేనివాడు. రక్షణ లేని వారికి రక్షకుడు అగు ఈ శివుడు ఆత్మారాముడగుటచే, కర్మరులచే మరియు ఉపాసకులచే స్వీకరించబడే ఉపాసనాసముచ్చితమగు కర్మమార్గ మును దూరముగా నెట్టివేసినాడు, అని దక్షుని నిందావాక్యములకు స్తుతి రూపమైన అర్థము.

ఏష మే శిష్యతాం ప్రాప్తో యన్మే దుహితురగ్రహీత్ ।
పాణిం విప్రాగ్నిముఖతస్సావిత్ర్యా ఇవ సాధువత్ ॥ 11

ఏషః - ఈతడు, మే - నాకు, శిష్యతామ్ - శిష్యత్వమును, ప్రాప్తః - పొందినాడు, యత్ - ఏలయనగా, సాధువత్ - సత్పురుషుని వలె, సావిత్ర్యాః ఇవ - సావిత్రివంటి, మే - నా, దుహితుః - కుమార్తెయొక్క, పాణిమ్ - చేతిని, విప్ర-అగ్నిముఖతః - బ్రాహ్మణులు మరియు అగ్నిదేవుని యెదుట, అగ్రహీత్ - స్వీకరించినాడు.

ఈతడు సత్పురుషుని వలె, బ్రాహ్మణుల యెదుట అగ్నిసాక్షిగా, సావిత్రి వలె పవిత్రమైన నా కుమార్తెను పాణిగ్రహణము చేసి, ఆ విధముగా నాకు శిష్యుడైనాడు.

నేను సత్పురుషుని వలె కనబడెదనే గాని, వాస్తవముగా సత్పురుషుడను కాను. సావిత్రివలె పవిత్రమైన నా కుమార్తెను బ్రాహ్మణుల యెదుట అగ్నిసాక్షిగా వివాహమాడినంత మాత్రాన సర్వేశ్వరుడగు ఈ శివుడు నాకు శిష్యుడై పోవునా? అని స్తుతిరూపమైన యర్థము.

గృహీత్వా మృగశాబాక్ష్యాః పాణిం మర్కటలోచనః ।
ప్రత్యుత్థానాభివాదార్హే వాచాఽప్యకృత నోచితమ్ ॥ 12

మర్కటలోచనః - కోతి కన్నులవంటి కన్నులు గల ఈ శివుడు (కోతులవంటి వారిపై కూడ దయాదృష్టిని బరపువాడు), మృగశాబ-అక్ష్యాః - లేడికూన కన్నులవంటి కన్నులు గల సతీదేవియొక్క, పాణిమ్ - చేతిని, గృహీత్వా - స్వీకరించి, ప్రతి-ఉత్థాన-అభివాద-అర్హే - లేచి ఎదురేగి నమస్కరించ దగిన నాయందు, వాచా అపి - వాక్కుచే నైననూ, ఉచితమ్ - యోగ్యమగు సత్కారమును, న అకృత - చేయలేదు.

కోతి కన్నులవంటి కన్నులు గల ఈ శివుడు లేడికూన కన్నులవంటి కన్నులు గల సతీదేవిని చెట్టబట్టినాడు. కావున, ఈతడు నేను వచ్చినప్పుడు లేచి ఎదురువచ్చి నమస్కరించ వలసినవాడు. అయిననూ, ఈతడు నాకు మాట మాత్రముచేనైననూ సత్కారమును చేయలేదు.

కోతుల వలె విషయభోగములయందు పరుగులెత్తే నావంటివారియందు దయాదృష్టిని బరపే ఈ శివుడు, నేను అయోగ్యుడనే అయిననూ, దయతో నా కుమార్తెను వివాహమాడినాడు. ఆ విధముగా నేను సత్కారమునకు అర్హుడనైనాను. కాని, ఆయన నా పొగరును గమనించి నాకు గుణపాఠమును నేర్పుటకై నన్ను సత్కరించలేదు అని స్తుతిరూపమైన యర్థము.

లుప్తక్రియాయాఽశుచయే మానినే భిన్నసేతవే ।
అనిచ్ఛన్నప్యదాం బాలాం శూద్రాయేవోశతీం గిరమ్ ॥ 13

లుప్తక్రియాయ - లోపించిన వైదికకర్మానుష్ఠానము గలవాడు (పూర్ణుడగుటచే క్రియాసంబంధము లేనివాడు), అశుచయే - శౌచము లేనివాడు (ఆశుచయే - పూర్ణమగు శౌచము గలవాడు), మానినే - పొగరుమోతు (అమానినే - పరిచ్ఛిన్నమగు అహంభావము లేనివాడు), భిన్నసేతవే - ఉల్లంఘించబడిన మర్యాద గలవాడు అగు వీనికొరకు (అభిన్నసేతవే - వైదికమర్యాదలను ఉల్లంఘించనివాడు), అనిచ్ఛన్ అపి - ఇష్టము లేనివాడనే అయిననూ (నేను తగనివాడను అనే భావముచే ఇష్టము లేకున్ననూ), శూద్రాయ - అయోగ్యుని కొరకు, ఉశతీమ్ - సుందరమైన (వేదరూపమైన), గిరం ఇవ - వాక్కును వలె, (శూద్రాః ఏవ - అయోగ్యులే, ఉశతీం గిరమ్ - వేదవాక్కును), బాలామ్ - కుమార్తెను, అదామ్ - ఇచ్చితిని.

శౌచము లేని ఈ శివుడు వైదికకర్మానుష్ఠానమును గాలికి వదిలినాడు. ఈ పొగరు మోతు వైదికమర్యాదల నుల్లంఘించినాడు. అయిననూ, అయోగ్యునకు సుందరమగు వేదమంత్రములనుపదేశించు తీరున, నేను ఇష్టము లేకున్ననూ, వీనికి నా కుమార్తెనిచ్చి వివాహము చేసినాను.

శివుడు పూర్ణుడగుటచే కర్మానుష్ఠానము ఆయనకు తొలగిపోయినది. ఆయన ఆత్మస్వరూపనిష్ఠుడగుటచే సమగ్రమగు శౌచము ఆయనయందే గలదు. పరిచ్ఛిన్నమగు అహంభావము బ్రహ్మస్వరూపుడగు ఆయనకు లేదు. ఆయన స్వయముగా పూర్ణుడే అయిననూ దయాళువగుటచే, తాను మర్యాదలను ఉల్లంఘించడు. ఆయనకు మామగారు అయ్యే యోగ్యత నాకు లేదు. కావుననే, ఇష్టము లేకున్ననూ నేను, అయోగ్యులు వేదమునుపదేశించు తీరున, ఆయనకు నా కుమార్తెనిచ్చి వివాహము చేసినాను అని స్తుతిరూపమైన యర్థము.

ప్రేతావాసేషు ఘోరేషు ప్రేతైర్భూతగణైర్వృతః ।
అటత్యున్మత్తవన్నగ్నో వ్యుప్తకేశో హసన్రుదన్ ॥ 14

ఘోరేషు - భయంకరములగు, ప్రేత-ఆవాసేషు - ప్రేతముల నివాసములగు శ్మశానములయందు (సంసారములయందు), ప్రేతైః - దెయ్యములచే (తప్పక మరణించే), భూతగణైః - భూతముల గుంపులచే (జీవుల సముదాయములచే), వృతః - చుట్టువారబడియుండే శివుడు, ఉన్మత్తవత్ - పిచ్చివానివలె (కేవలము పిచ్చివానివలె కన్పట్టుటయే), నగ్నః - దిసమొల గలవాడై (సర్వవ్యాపకుడు గనుక, ఆకాశమే శరీరముగా గలవాడు), వ్యుప్తకేశః - విరబోసుకున్న జుత్తు గలవాడై (మేఘములే జుత్తుగా గలవాడు), హసన్ - నవ్వుచున్నవాడై (అంతర్యామి రూపములో), రుదన్ - ఏడ్చుచున్నవాడై, అటతి - తిరుగాడుచుండును (సర్వాంతర్యామియై యుండును).

ఈతడు దిసమొలతో జుత్తు విరబోసుకుని దెయ్యములుండే శ్మశానములో దెయ్యములతో భూతముల గుంపులతో చుట్టువారబడి నివసించును. ఇంతే గాక, ఈతడు పిచ్చివానివలె ఒకసారి నవ్వుతూ, మరియొకసారి ఏడుస్తూ తిరుగాడుచుండును.

పుట్టి మరణించే జీవుల సముదాయములు, వారి సంసారములు శివునియందే స్థితిని కలిగియున్నవి. ఈ జగత్తును వెలయింపజేసిన శివుడు పిచ్చివాని వలె కన్పట్టిననూ, జగత్తు మిథ్య యగుటచే ఆయన పిచ్చివాడు కాదు. విరాడ్రూపుడగు ఆయనకు ఆకాశమే శరీరము కాగా, మేఘములే జుత్తు అగుచున్నవి. జీవుని స్వరూపము సర్వాంతర్యామియగు ఆయనయే గనుక, జీవుడు సంతోషించినప్పుడు ఆయనయే సంతోషించినట్లు, జీవుడు రోదించినప్పుడు ఆయనయే రోదించినట్లు అజ్ఞానముచే భాసించును, అని స్తుతిపరమైన యర్థము.

చితాభస్మకృతస్నానః ప్రేతస్రఙ్న్రస్థిభూషణః ।
శివాపదేశో హ్యశివో మత్తో మత్తజనప్రియః ।
పతిః ప్రమథభూతానాం తమోమాత్రాత్మకాత్మనామ్ ॥ 15

చితాభస్మకృతస్నానః - కాలిన శవములపైనుండే బూడిదతో చేయబడిన స్నానము గలవాడు, ప్రేతస్రక్ - శవముల (కపాలములతో

చేసిన) మాల గలవాడు, నృ-అస్థిభూషణః - (మరణించిన) జనుల ఎముకలే ఆభరణములుగా గలవాడు, శివ-అపదేశః - కేవలము శివుడు (మంగళస్వరూపుడు) అనే పేరు మాత్రమే గలవాడు, అశివః హి - నిశ్చయముగా అమంగళ స్వరూపుడు (తనకంటె గొప్ప మంగళము లేనివాడు), మత్తః - పొగరుమోతు (అమత్తః - పరిచ్ఛిన్నమగు అహంకార మమకారములు లేనివాడు), మత్తజనప్రియః - పొగరుమోతు జనులే ప్రియులుగా గలవాడు (అమత్తజనప్రియః - అహంకార మమకారములు లేనివారి యందు ప్రీతి గలవాడు), తమః-మాత్ర-ఆత్మక-ఆత్మనామ్ - కేవలము తమోగుణము మాత్రమే స్వరూపముగా గల, ప్రమథభూతానామ్ - ప్రమథ గణములకు భూతగణములకు, పతిః - నాయకుడు.

ఈతడు కాలిన శవముల మీది బూడిదను దేహమునకు పులుముకొనును. శవముల కపాలములను మాలగా ధరించును. మరణించిన జనుల ఎముకలను ఆభరణములుగా ధరించును. ఈతడు పేరునకు శివుడే (మంగళస్వరూపుడు) అయిననూ, అమంగళమూర్తి. ఈ పొగరుమోతునకు స్నేహితులందరు పొగరుమోతులే. కేవలము తమోగుణమే స్వరూపముగా గల ప్రమథగణములకు, భూతగణములకు ఈతడు నాయకుడు.

జననమరణములు రెండు సర్వాధిష్ఠానమగు శివునియందే ఉన్నవని ఆయన బూడిదను ధరించుట ద్వారా సూచించుచున్నాడు. బూడిద వైరాగ్యమునకు గుర్తు. కపాలములను, ఎముకలను ధరించుటయందు కూడ తాత్పర్యము జగత్తు మిథ్య యని సూచించుటయే. ఈ విధముగా స్వతహాగా అమంగళమై యున్న జగత్తునకు అధిష్ఠానమగు బ్రహ్మము నిత్యమంగళస్వరూపమే. ఆయనకు గాని, ఆయనకు ప్రియులగు (ఆత్మస్వరూపులగు) భక్తులకు గాని, పరిచ్ఛిన్నమగు అహంభావము లేదు. శ్మశానమువంటి సంసారములో కొట్టుమిట్టులాడే జీవులు భూతప్రేతములవంటివారే. వారికి నాయకుడు సర్వాంతర్యామియగు శివుడే అని స్తుతిరూపమగు యర్థము.

తస్మా ఉన్మాదనాథాయ నష్టశౌచాయ దుర్హృదే ।
దత్తా బత మయా సాధ్వీ చోదితే పరమేష్ఠినా ॥ 16

బత - అయ్యో! (ఆనందము!), ఉన్మాదనాథాయ - ఉన్మాదులనే భూతగణములకు ప్రభువు (అహంకారముతో మదించియున్నవారిని తపింపజేయువాడు), నష్టశౌచాయ - నశించిన శౌచము గలవాడు (భ్రష్టుల యెడల కూడ దయతో గూడిన హృదయము గలవాడు), దుర్హృదే - దుర్బుద్ధి (దుష్టులయందు కూడ ఆత్మరూపముగానున్నవాడు) అగు, తస్మై - ఆ శివుని కొరకు, పరమేష్ఠినా - బ్రహ్మగారిచే, చోదితే - ప్రేరేపించబడగా, మయా - నాచే, సాధ్వీ - పతివ్రతయగు సతీదేవి, దత్తా - ఈయబడినది.

అయ్యో! నశించిన శౌచము గల శివుడు ఉన్మాదులనే భూతగణములకు అధ్యక్షుడు. బ్రహ్మగారి ప్రేరణ వలన నేను ఆ దుర్బుద్ధియగు శివునకు పతివ్రతయగు సతీదేవిని ఇచ్చి వివాహము చేసితిని.

ఆహా! అహంకారమదాంధులను తపింపజేయువాడు, భ్రష్టుల యెడల కూడ దయ గలవాడు, దుష్టుల హృదయమునందు కూడ ఆత్మరూపముగా నుండువాడు అగు శివునకు నేను బ్రహ్మగారి ప్రేరణ వలన పతివ్రతయగు నా కుమార్తెను ఇచ్చి వివాహము చేసితిని అని స్తుతి రూపమగు యర్థము.

మైత్రేయ ఉవాచ ।
వినింద్యైవం స గిరిశమప్రతీపమవస్థితమ్ ।
దక్షోఽథాప ఉపస్పృశ్య క్రుద్ధశ్శప్తుం ప్రచక్రమే ॥ 17

క్రుద్ధః - కోపించియున్న, సః - ఆ, దక్షః - దక్షుడు, అప్రతీపమ్ - విరోధము లేకుండగా, అవస్థితమ్ - కూర్చుండియున్న, గిరిశమ్ - కైలాసవాసిని, ఏవమ్ - ఈ విధముగా, వినింద్య - అధికముగా నిందించి, అథ - తరువాత, అపః - నీటిని, ఉపస్పృశ్య - స్పృశించి, శప్తుమ్ - శపించుటకు, ప్రచక్రమే - సంసిద్ధుడాయెను.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- ఆ దక్షుడు ఈ విధముగా కైలాసవాసియగు శివుని అధికముగా నిందించెను. కాని, శివుడు ఏమియు

విరోధమును ప్రకటించకుండగా కూర్చుని యుండెను. అప్పుడు కోపించి యున్న దక్షుడు నీటిని స్పృశించి ఆయనను శపించుటకు ఉపక్రమించెను.

అయం తు దేవయజన ఇంద్రోపేంద్రాదిభిర్భవః ।
సహ భాగం న లభతాం దేవైర్దేవగణాధమః ॥ 18

దేవయజనే - దేవతలను ఆరాధించే సమయములో (యజ్ఞములో), దేవగణ-అధమః - దేవతాగణములలో అధముడగు (దేవగణములన్నియు తనకంటె తక్కువ అయి ఉన్నవాడు), అయమ్ - ఈ, భవః - శివుడు, ఇంద్ర-ఉపేంద్ర-ఆదిభిః - ఇంద్రుడు విష్ణువు మొదలగు, దేవైః సహ - దేవతలతో కూడి, భాగమ్ - హవిర్భాగమును, న లభతామ్ - పొందకుండుగాక!

దేవతలను ఆరాధించే ఈ యజ్ఞములో ఇంద్రుడు, విష్ణువు మొదలగు దేవతలతో బాటుగా, దేవగణములలో అధముడగు ఈ శివునకు హవిర్భాగము లభించకుండు గాక!

దేవతలను ఆరాధించే ఈ యజ్ఞములో సర్వదేవతలకంటె ఉత్తముడగు ఈ శివునకు ఇంద్రుడు మొదలగు దేవతలతో బాటుగా హవిర్భాగము లభించకుండు గాక! అయినను, అందరికంటె ముందే హవిర్భాగమును పొందవలెను. లేక, సర్వప్రభుడు గనుక దేవతలతో సహపంక్తి ఆయన హోదాకు తగదు అని స్తుతిరూపమైన అర్థము.

నిషిధ్యమానస్స సదస్యముఖ్యై-
ర్దక్షో గిరిత్రాయ విసృజ్య శాపమ్ ।
తస్మాద్వినిష్క్రమ్య వివృద్ధమన్యు-
ర్జగామ కౌరవ్య నిజం నికేతనమ్ ॥ 19

కౌరవ్య - కురువంశీయుడవగు ఓ విదురా!, సదస్యముఖ్యైః - సభాసదులలో ప్రధాములగు వ్యక్తులచేత, నిషిధ్యమానః - వారింపబడుచున్ననూ, వివృద్ధమన్యుః - అధికముగా పెరిగిన కోపము గల, సః - ఆ, దక్షః - దక్షుడు, గిరిత్రాయ - కైలాసగిరిపతియగు శివుని కొరకు, శాపమ్ - శాప

మును, విసృజ్య - ఇచ్చి, తస్మాత్ - అచ్చోటనుండి, వినిష్క్రమ్య - బయటకు వచ్చి, నిజమ్ - తన, నికేతనమ్ - గృహమును గురించి, జగామ - వెళ్లెను.

కురువంశీయుడవగు ఓ విదురా! దక్షుని శివునకు శాపమునీయవద్దనియు, తిట్టవద్దనియు సభలోని ప్రముఖులు వారించిరి. అయిననూ, చాల పెద్ద కోపమును పొందియున్న అతడు వారిని కాదని, ఆ కైలాసపతికి శాపమునిచ్చి, ఆ సభనుండి బయటకు వచ్చి తన ఇంటికి వెళ్లెను.

విజ్ఞాయ శాపం గిరిశానుగాగ్రణీ-
ర్నందీశ్వరో రోషకషాయదూషితః ।
దక్షాయ శాపం విససర్జ దారుణం
యే చాన్వమోదంస్తదవాచ్యతాం ద్విజాః ॥ 20

గిరిశ-అనుగ-అగ్రణీః - కైలాసవాసియగు శివుని అనుచరులకు నాయకుడగు, నందీశ్వరః - నందీశ్వరుడు, శాపమ్ - శాపమును గురించి, విజ్ఞాయ - తెలుసుకొని, రోషకషాయదూషితః - కోపము అనే దోషముచే కలుషితము చేయబడినవాడై, దక్షాయ - దక్షుని కొరకు, చ - మరియు, యే - ఏ, ద్విజాః - బ్రాహ్మణులు, తత్-అవాచ్యతామ్ - శివుడు నింద్యుడనే అభిప్రాయమును, అను-అమోదన్ - ఆమోదించిరో వారి కొరకు, దారుణమ్ - భయంకరమగు, శాపమ్ - శాపమును, విససర్జ - ఇచ్చెను.

కైలాసవాసియొక్క అనుచరులకు నందీశ్వరుడు నాయకుడు. శివునకు దక్షుడు శాపమువిచ్చిన సంగతి తెలిసి, ఆయన మనస్సు కోపము అనే దోషముతో కలుషితమై పోయెను. శివుని నిందించవలసినదే అని ఆ సభలోని కొందరు బ్రాహ్మణులు దక్షుని చర్యను అనుమోదించిరి. ఆ బ్రాహ్మణులకు మరియు దక్షునకు నందీశ్వరుడు భయంకరమగు శాపమువిచ్చెను.

య ఏతన్మర్త్యముద్దిశ్య భగవత్యప్రతిద్రుహి ।
ద్రుహ్యత్యజ్ఞః పృథగ్దృష్టిస్తత్త్వతో విముఖో భవేత్ ॥ 21

అజ్ఞః - అజ్ఞాని, పృథక్-దృష్టిః - భేదదర్శనము గలవాడు అగు, యః - ఏ దక్షుడు, మర్త్యమ్ - మరణించే, ఏతత్ - ఈ శరీరమును, ఉత్-దిశ్య - గొప్పదిగా తలపోసి, అప్రతిద్రుహి - అపకారమును చేయని, భగవతి - శివభగవానునిపై, ద్రుహ్యతి - ద్రోహమును తలపెట్టుచున్నాడో, తత్త్వతః - పరమార్థమునుండి, విముఖః - విముఖుడై, భవేత్ - అగును.

సర్వత్రా భేదమునే దర్శించే దక్షుడు అజ్ఞాని. దేహము నశించే స్వభావము గలది అని తెలుసుకొనుటకు బదులుగా, ఆతడు తన దేహము గొప్పది అని భావించుచున్నాడు. అపకారమును తలపెట్టని శివభగవానునకు ఆతడు ద్రోహమును తలపెట్టుచున్నాడు. ఆతడు పరమార్థము (తత్త్వజ్ఞానము, లేక మోక్షము) నుండి విముఖుడు (శ్రద్ధ లేనివాడు, జారిపోయినవాడు) అగుగాక!

గృహేషు కూటధర్మేషు సక్తో గ్రామ్యసుఖేచ్ఛయా ।
కర్మతంత్రం వితనుతే వేదవాదవిపన్నధీః ।। 22

గృహేషు - ఇంటియందు, కూటధర్మేషు - కపటధర్మములయందు, సక్తః - ఆసక్తుడై యున్నట్టియు, వేదవాదవిపన్నధీః - వేదమునందలి అర్థవాదములచే భ్రష్టమైన బుద్ధి గలవాడు అగు దక్షుడు (వ్యక్తి), గ్రామ్యసుఖ-ఇచ్ఛయా - తుచ్ఛములగు విషయసుఖములయందలి కోరికతో, కర్మతంత్రమ్ - కామ్యకర్మల పరికరములను (కర్మకాండను), వితనుతే - విస్తరింప జేయుచున్నాడు.

మానవుడు (ఈ దక్షుడు) ఇల్లే సర్వస్వమని నమ్మి, దంభాచారమునందాసక్తి గలవాడై, వేదములయందలి అర్థవాదముల (కర్మఫలములను స్తుతించే వాక్యముల) చే తప్పుదోవ పట్టించబడిన బుద్ధి గలవాడై, తుచ్ఛమగు విషయసుఖములయందలి కోరికతో, కామ్యకర్మల పరికరములను (కర్మకాండను) తన జీవితములో విస్తరింప జేసుకొనుచున్నాడు.

బుద్ధ్యా పరాభిధ్యాయిన్యా విస్మృతాత్మగతిః పశుః ।
స్త్రీకామస్సోఽస్త్వతితరాం దక్షో బస్తముఖోఽచిరాత్ ।। 23

పర-అభిధ్యాయిన్యా - దేహాదులే తన స్వరూపమని గట్టిగా నిశ్చయించే (భేదమునే నిశ్చయముగా స్వీకరించే), బుద్ధ్యా - బుద్ధిచే, విస్మృత -ఆత్మగతిః - మరువబడిన ఆత్మస్వరూపము (జ్ఞానముచే ఆత్మను పొందుట) గలవాడై, పశుః - అజ్ఞానియై (దేహాభిమానియై) యున్న, సః - ఆ దక్షుడు, అతితరామ్ - అత్యధికముగా, స్త్రీకామః - స్త్రీలయందు కామన గలవాడుగా, అచిరాత్ - తొందరలోనే, బస్తముఖః - మేకపోతు ముఖము గలవాడుగా, అస్తు - అగుగాక!

ఈ దక్షుడు దేహాభిమానియై, దేహాదులే తన స్వరూపమని గట్టిగా నమ్మి, భేదమే యథార్థమనే నిశ్చయము గలవాడై, ఆత్మస్వరూపమును మరచినాడు (జ్ఞానముచే ఆత్మస్వరూపమును పొందుట అనే లక్ష్యము వానికి లేదు). ఈ అజ్ఞానియగు దక్షుడు స్త్రీలయందు అధికమగు కామన గలవాడు అగుగాక! మరియు, తొందరలోనే వీడు మేకపోతు ముఖము గల వాడు అగుగాక!

విద్యాబుద్ధిరవిద్యాయాం కర్మమయ్యామసౌ జడః ।
సంసరంత్విహ యే చాముమను శర్వావమానినమ్ ॥ 24

అసౌ - ఈ, జడః - మూర్ఖుడు, కర్మమయ్యామ్ - కర్మలతో నిండి యుండే, అవిద్యాయామ్ - ఆత్మ-అజ్ఞానమునందు, విద్యాబుద్ధిః - జ్ఞానము అనే బుద్ధి గలవాడు, యే చ - ఎవరైతే, శర్వ-అవమానినమ్ - శివుని అవమానించిన, అముమ్ - ఈ దక్షుని, అను - అనుసరించెదరో వారు, ఇహ - ఈ సంసారమునందు, సంసరంతు - జననమరణప్రవాహములో పడి యుందురు గాక!

మూర్ఖుడగు ఈ దక్షుడు కర్మరూపమగు అవిద్యయే జ్ఞానమనే బుద్ధిని కలిగియున్నాడు. శివుని అవమానించిన ఈ దక్షుని అనుసరించు వారు కూడ వీనితో బాటుగా ఈ సంసారములో జననమరణప్రవాహములో పడియుందురు గాక!

గిరః శ్రుతాయాః పుష్పిణ్యా మధుగంధేన భూరిణా ।
మథ్నా చోన్మథితాత్మానస్సంముహ్యంతు హరద్విషః ॥ 25

పుష్పిణ్యాః - అర్థవాదములనే పుష్పములు గల, శ్రుతాయాః గిరః - వేదవాక్కు యొక్క, భూరిణా - అధికమగు, మథ్నా - క్షోభను కలిగించే, మధుగంధేన - తేనెల పరిమళముచే, ఉన్మథిత-ఆత్మానః - కలిచివేయబడిన మనస్సులు గల, హరద్విషః - శివద్వేషులు, సంముహ్యంతు - అధికమగు మోహమును పొందుదురు గాక!

వేదవాక్కు (కర్మకాండ) అనే లతకు అర్థవాదములు (కామ్యకర్మలను పొగిడే వాక్యములు) అనే పువ్వులు గలవు. వాటిలో మనస్సునకు అధికమగు క్షోభను కలిగించే స్వర్గాది సుఖముల వర్ణనలు (తేనెల పరిమళములు) గలవు. వాటిచే కలిచివేయబడిన మనస్సులు గల ఈ శివద్వేషులు అధికమగు మోహము (నిత్య-అనిత్యవస్తువివేకము లేకుండుట) ను పొందెదరు గాక!

సర్వభక్షా ద్విజా వృత్త్యై ధృతవిద్యాతపోవ్రతాః ।
విత్తదేహేంద్రియారామా యాచకా విచరంత్విహ ॥ 26

ద్విజాః - ఈ బ్రాహ్మణులు, సర్వభక్షాః - అన్నింటినీ తినువారై, వృత్త్యై - శరీరపోషణ కొరకు, ధృతవిద్యాతపః-వ్రతాః - ధరించబడిన విద్య తపస్సు మరియు వ్రతము గలవారై, విత్తదేహ-ఇంద్రియ-ఆరామాః - ధనము దేహము ఇంద్రియములు అనువాటియందు మాత్రమే రమించువారై, యాచకాః - యాచకులై, ఇహ - ఈ సంసారమునందు, విచరంతు - సంచరించెదరు గాక!

ఈ శివద్వేషులగు బ్రాహ్మణులు అన్నింటినీ (తినకూడని వాటిని కూడ) తింటూ, తమ విద్యను శరీరపోషణకు మాత్రమే వినియోగిస్తూ, తపస్సును వ్రతనిష్ఠను కూడ ఆర్థికలాభము కొరకు వినియోగిస్తూ, ధనమునందు దేహమునందు ఇంద్రియభోగములయందు మాత్రమే రమిస్తూ, యాచనను చేస్తూ, ఈ సంసారములో తిరుగాడెదరు గాక!

తస్యైవం దదతశ్శాపం శ్రుత్వా ద్విజకులాయ వై ।
భృగుః ప్రత్యసృజచ్ఛాపం బ్రహ్మదండం దురత్యయమ్ ॥27

ఏవమ్ - ఈ విధముగా, తస్య - ఆ నందీశ్వరుడు, ద్విజకులాయ - బ్రాహ్మణ సముదాయమునకు, వై - నిశ్చయముగా, శాపమ్ - శాపమును, దదతః - ఇచ్చుచుండగా, భృగుః - భృగు మహర్షి, దురత్యయమ్ - తప్పించుకొన శక్యము కాని, బ్రహ్మదండమ్ - బ్రహ్మదండము (బ్రాహ్మణుడు విధించే శిక్ష) రూపములోనున్న, శాపమ్ - శాపమును, ప్రత్యసృజత్ - బదులుగా ఇచ్చెను:

ఈ విధముగా నందీశ్వరుడు బ్రాహ్మణ సముదాయమునకు శాపమునీయగా, భృగుమహర్షి దానికి బదులుగా శాపమునిచ్చెను. అది వేదవేత్తయగు బ్రాహ్మణుడు ఇచ్చిన శాపమగుటచే, దానిని తప్పించుకొనుట శక్యము కాదు.

భవవ్రతధరా యే చ యే చ తాన్ సమనువ్రతాః ।
పాఖండినస్తే భవంతు సచ్ఛాస్త్రపరిపంథినః ॥ 28

యే చ - ఎవరైతే, భవవ్రతధరాః - పాశుపతవ్రతమును చేపట్టెదరో, యే చ - ఎవరైతే, తాన్ - వారిని, సమనువ్రతాః - అనుసరించే నిష్ఠను కలిగియుందురో, తే - వారు, సత్-శాస్త్రపరిపంథినః - మంచి శాస్త్రమగు వేదమునకు విరోధులై, పాఖండినః - అపధర్మీయులు (వేదనిందకులు), భవంతు - అగుదురు గాక!

ఎవరైతే పాశుపత (దేవపూజ పేరిట ఏహ్యములగు ఎముకలను ధరించుట మొదలగు పనులను చేయుట) వ్రతమును చేపట్టెదరో, మరియు ఎవరైతే అట్టి పాశుపతులను అనుసరించెదరో, వారు సచ్ఛాస్త్రమగు వేదమునకు విరోధులై, వేదమును నిందించే అపధర్మీయులు అగుదురు గాక!

నష్టశౌచా మూఢధియో జటాభస్మాస్థిధారిణః ।
విశంతు శివదీక్షాయాం యత్ర దైవం సురాసవమ్ ॥ 29

నష్టశౌచాః - నశించిన శౌచము గలవారై, మూఢధియః - మోహమును పొందియున్న బుద్ధి గలవారై, జటాభస్మ-అస్థిధారిణః - జటలను బూడిదను ఎముకలను ధరించువారై, శివదీక్షాయామ్ - పాశుపతదీక్షయం

దు, విశంతు - ప్రవేశించెదరు గాక!, యత్ర - దేనియందైతే, సురా-ఆస వమ్ - సారా కల్లులు, దైవమ్ - దైవమో.

వీరు పవిత్రతను విడనాడి, బుద్ధిలో మోహమును పొందినవారై, జటలను బూడిదను ఎముకలను ధరించెదరు. వీరు చేపట్టే పాశుపత దీక్ష యందు దైవము సారా మరియు కల్లు మాత్రమే.

బ్రహ్మ చ బ్రాహ్మణాంశ్చైవ యద్యూయం పరినిందథ ।
సేతుం విధారణం పుంసామతః పాఖండమాశ్రితాః ॥ 30

సేతుమ్ - వ్యక్తి జీవనమును కట్టడి చేయునది, పుంసామ్ - మానవులకు, విధారణమ్ - నిలబెట్టునది అగు, బ్రహ్మ - వేదమును, బ్రాహ్మణాన్ చ - బ్రాహ్మణులను కూడ, యత్ - ఏ కారణముచేనైతే, యూయమ్ - మీరు, పరినిందథ - అన్ని విధములుగా నిందించుచున్నా రో, అతః - ఇందువలన, పాఖండమ్ - అపధర్మమును, ఆశ్రితాః - ఆశ్ర యించినారు.

వేదము వైయక్తిక జీవనమును కట్టడి చేసి సమాజజీవనమును నిల బెట్టును. అట్టి వేదమును, దాని స్వరూపమునెరింగిన బ్రాహ్మణులను కూడ మీరు పరిపరి విధములుగా నిందించుచున్నారు. కావున, మీరు వేదవిరుద్ధ మగు అపధర్మమును ఆశ్రయించినారు.

ఏష ఏవ హి లోకానాం శివః పంథాస్సనాతనః ।
యం పూర్వే చాను సంతస్థుర్యత్ప్రమాణం జనార్దనః ॥ 31

లోకానామ్ - లోకములకు (మానవులకు), ఏషః ఏవ - ఇది మాత్ర మే, శివః - మంగళకరమగు, సనాతనః - అనాదియగు, పంథాః - మార్గ ము, యమ్ - దేనినైతే, పూర్వే - పూర్వజులు, అనుసంతస్థుః - ఆశ్రయిం చిరో, యత్ - దేనియందు, జన-అర్దనః - దుష్టజనశిక్షకుడగు శ్రీహరి, ప్రమాణమ్ - మూలమై యున్నాడో.

లోకములకు, మానవులకు మంగళమును కలిగించేది ఈ సనాతనమగు వేదధర్మము మాత్రమే. దీనిని మన పూర్వజులు ఆశ్రయించిరి. దుష్టశిక్షకుడగు శ్రీహరియే ఈ ధర్మమునకు మూలము.

తద్బ్రహ్మ పరమం శుద్ధం సతాం వర్త్మ సనాతనమ్ ।
విగర్హ్య యాత పాఖండం దైవం వో యత్ర భూతరాట్ ॥ 32

పరమం శుద్ధమ్ - పరమపవిత్రమైనది, సతామ్ - సత్పురుషులకు, వర్త్మ - మార్గము అయినది, సనాతనమ్ - అనాది యగు, తత్ - ఆ, బ్రహ్మ - వేదమును, విగర్హ్య - నిందించి, పాఖండమ్ - అపధర్మమును, యాత - పొందుడు, యత్ర - దేనియందు, వః - మీకు, భూతరాట్ - తామసప్రాణులకు ప్రభువు, దైవమ్ - దైవమో.

వేదము పరమపవిత్రమైనది. సనాతనమగు వేదధర్మమును సత్పురుషులు అనుసరించిరి. దానిని నిందించు మీరు అవైదికధర్మమును ఆశ్రయించి, తామసప్రాణులకు ప్రభువగు రుద్రుని దైవముగా పూజించుడు.

మైత్రేయ ఉవాచ ।
తస్యైవం దదతశ్శాపం భృగోస్స భగవాన్ భవః ।
నిశ్చక్రామ తతః కించిద్విమనా ఇవ సానుగః ॥ 33

తస్య - ఆ, భృగోః - భృగు మహర్షి, ఏవమ్ - ఈ విధముగా, శాపమ్ - శాపమును, దదతః - ఇచ్చుచుండగా, సః - ఆ, భవః భగవాన్ - శివభగవానుడు, కించిత్ - కొద్దిగా, విమనాః ఇవ - వికలమైన మనస్సు గలవాని వలె, సానుగః - అనుచరులతో కూడినవాడై, తతః - అక్కడనుండి, నిశ్చక్రామ - బయటకు వెళ్లెను.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- ఆ భృగు మహర్షి ఈ విధముగా శాపమునిచ్చుచుండగా, ఆ శివభగవానుడు పరస్పరశాపముల కారణముగా కొంచెము వికలమైన మనస్సు గలవాని వలె, అక్కడనుండి లేచి వెళ్లిపోయెను. ఆయన అనుచరులు ఆయనను అనుసరించిరి.

తేఽపి విశ్వసృజస్సత్రం సహస్రపరివత్సరాన్ ।
సంవిధాయ మహేష్వాస యత్రేజ్య ఋషభో హరిః ।। 34

ఆప్లుత్యావభృథం యత్ర గంగా యమునయాఽన్వితా ।
విరజేనాత్మనా సర్వే స్వం స్వం ధామ యయుస్తతః ।। 35

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే చతుర్థస్కంధే దక్షశాపవర్ణనం నామ ద్వితీయోఽధ్యాయః ।।

మహేష్వాస - గొప్ప ధనస్సు గల ఓ విదురా!, తే - ఆ, విశ్వసృజః అపి - ప్రజాపతులు కూడ, సహస్రపరివత్సరాన్ - వేయి సంవత్సరముల కాలము, సత్రమ్ - సత్రయాగమును, సంవిధాయ - చక్కగా అనుష్ఠించి, యత్ర - ఏ సత్రయాగమునందు, ఋషభః - సర్వశ్రేష్ఠుడగు, హరిః - శ్రీహరి, ఇజ్యః - ఆరాధించబడునో, యత్ర - ఏ స్థానమునందైతే, గంగా - గంగానది, యమునయా - యమునతో, అన్వితా - కలుసుకున్నదో అక్కడ, అవభృథమ్ - అవభృథస్నానమును, ఆప్లుత్య - చేసి, తతః - తరువాత, విరజేన - నిర్మలమగు, ఆత్మనా - అంతఃకరణముతో, సర్వే - అందరు, స్వం స్వమ్ - తమ తమ, ధామ - నివాసస్థానమును గురించి, యయుః - వెళ్లిరి.

గొప్ప ధనస్సు గల ఓ విదురా! ఆ ప్రజాపతులు వేయి సంవత్సరములు సత్రయాగమును చక్కగా అనుష్ఠించిరి. ఆ యాగములో దేవాధిదేవుడగు శ్రీహరి ఆరాధించబడును. తరువాత వారు గంగాయమునాసంగమమునందు అవభృథ స్నానమునాచరించిరి. అప్పుడు వారి మనస్సులు నిర్మలమాయెను. తరువాత వారందరు తమ తమ స్థానములకు వెళ్లిరి.

శ్రీమద్భాగవత మహాపురాణములోని నాల్గవ స్కంధములో దక్షుడు శివునకు శాపమునిచ్చుటను వర్ణించే రెండవ అధ్యాయము ముగిసినది (2).

*****

# అథ తృతీయోऽధ్యాయః

## సతీ పరమేశ్వరుల సంవాదము

మైత్రేయ ఉవాచ ।
సదా విద్వేషతోరేవం కాలో వై థ్రియమాణయోః ।
జామాతుశ్శ్వశురస్యాపి సుమహానతిచక్రమే ॥ 1

మైత్రేయః - మైత్రేయుడు, ఉవాచ - పలికెను, జామాతుః - అల్లుడగు శివుడు, శ్వశురస్య అపి - మామగారగు దక్షుడు కూడ, ఏవమ్ - ఈ విధముగా, సదా - అన్ని కాలములలో, విద్వేషతోః - అధికముగా ద్వేషించుకొనుచునే, థ్రియమాణయోః - నిలిచియుండగా, సుమహాన్ - చాల, కాలః వై - కాలము, అతిచక్రమే - గడిచిపోయెను.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- దక్షుడు మామగారు. శివుడు అల్లుడు. వారిద్దరి మధ్యలో విద్వేషము అదే విధముగా కొనసాగుచుండగా, చాల కాలము గడిచెను.

యదాభిషిక్తో దక్షస్తు బ్రహ్మణా పరమేష్ఠినా ।
ప్రజాపతీనాం సర్వేషామాధిపత్యే స్మయోऽభవత్ ॥ 2

యదా తు - ఏ కాలమునందైతే, పరమేష్ఠినా - దేవాధిదేవుడగు, బ్రహ్మణా - బ్రహ్మగారిచే, సర్వేషామ్ - అందరు, ప్రజాపతీనామ్ - ప్రజాపతుల, ఆధిపత్యే - అధిపతి స్థానమునందు, దక్షః - దక్షుడు, అభిషిక్తః - అభిషేకించబడినాడో అప్పుడు, స్మయః - గర్వము, అభవత్ - కలిగెను.

దేవాధిదేవుడగు బ్రహ్మగారు దక్షుని ప్రజాపతులందరిపై అధిపతిగా అభిషేకించెను. అప్పుడు దక్షునకు గర్వము కలిగెను.

ఇష్ట్వా స వాజపేయేన బ్రహ్మిష్ఠానభిభూయ చ ।
బృహస్పతిసవం నామ సమారేభే క్రతూత్తమమ్ ॥ 3

సః - ఆతడు, వాజపేయేన ఇష్ట్వా - వాజపేయ యాగమును చేసి, బ్రహ్మిష్ఠాన్ - బ్రహ్మనిష్ఠులను, అభిభూయ చ - తిరస్కరించి, బృహస్పతిసవం నామ - బృహస్పతిసవము అని ప్రసిద్ధి గాంచిన, క్రతు-ఉత్తమమ్ - గొప్ప యజ్ఞమును, సమారేభే - ఆరంభించెను.

ఆ దక్షుడు వాజపేయయాగమును చేసెను. గర్వించియున్న కారణముగా ఆతడు బ్రహ్మనిష్ఠులను అవమానించెడివాడు. ఆతడు వాజపేయము తరువాత బృహస్పతిసవము అనే యజ్ఞమును చేయుటకు ఉపక్రమించెను.

తస్మిన్ బ్రహ్మర్షయస్సర్వే దేవర్షిపితృదేవతాః ।
ఆసన్ కృతస్వస్త్యయనాస్తత్పత్న్యశ్చ సభర్తృకాః ॥ 4

తస్మిన్ - ఆ యజ్ఞమునందు, సర్వే - అందరు, బ్రహ్మ-ఋషయః - బ్రహ్మవేత్తలగు మహర్షులు, దేవ-ఋషిపితృదేవతాః - దేవర్షులు మరియు పితృదేవతలు, సభర్తృకాః - తమ తమ భర్తలతో కూడియున్న, తత్-పత్న్యః చ - వారి వారి పత్నులు కూడ, కృతస్వస్తి-అయనాః - చేయబడిన మంగళకార్యములు గలవారై, ఆసన్ - ఉండిరి.

బ్రహ్మర్షులు, దేవర్షులు, మరియు తమ తమ భార్యలతో కూడియున్న అందరు పితృదేవతలు ఆ యజ్ఞమునకు విచ్చేసిరి. ఆ దంపతులందరు మంగళకార్యములను పూర్తి చేసుకుని సత్కారమును స్వీకరించి యుండిరి.

తదుపశ్రుత్య నభసి ఖేచరాణాం ప్రజల్పతామ్ ।
సతీ దాక్షాయణీ దేవీ పితుర్యజ్ఞమహోత్సవమ్ ॥ 5

వ్రజతీస్సర్వతో దిగ్భ్య ఉపదేవవరస్త్రియః ।
విమానయానాస్సప్రేష్ఠా నిష్కకంఠీస్సువాససః ॥ 6

దృష్ట్వా స్వనిలయాభ్యాశే లోలాక్షీర్మృష్టకుండలాః ।
పతిం భూతపతిం దేవమౌత్సుక్యాదభ్యభాషత ॥ 7

దాక్షాయణీ - దక్షపుత్రికయగు, సతీ దేవీ - సతీదేవి, నభసి - ఆకాశమునందు, ఖేచరాణామ్ - ఆకాశమునందు సంచరించే గంధర్వులు మొదలగువారు, ప్రజల్పతామ్ - కబుర్లు చెప్పుకొనుచుండగా, పితుః - తండ్రియొక్క, తత్ - ఆ, యజ్ఞమహా-ఉత్సవమ్ - యజ్ఞము అనే మహోత్సవమును గురించి, ఉపశ్రుత్య - విని, స్వనిలయ-అభ్యాశే - తన మకామునకు దగ్గరలో, సర్వతః - అన్ని, దిగ్భ్యః - దిక్కులనుండి, వ్రజతీః - వెళ్లుచున్న, విమానయానాః - విమానములలో పయనించుచున్న, సప్రేష్ఠాః - భర్తలతో కూడియున్న, నిష్కకంఠీః - పదకములు కంఠములలో గల, సువాససః - అందమైన వస్త్రములు గల, లోల-అక్షీః - చంచలమగు కన్నులు గల, మృష్టకుండలాః - గొప్పగా ప్రకాశించే కర్ణాభరణములు గల, ఉపదేవవరస్త్రియః - గంధర్వులు మొదలగు ఉపదేవతల సుందరులగు భార్యలను, దృష్ట్వా - చూచి, భూతపతిమ్ - భూతగణములకు ప్రభువు, పతిమ్ - తనకు భర్తయగు, దేవమ్ - శివదేవుని ఉద్దేశించి, ఔత్సుక్యాత్ - ఉత్కంఠతో, అభ్యభాషత - సంభాషించెను.

గంధర్వులు మొదలగు ఉపదేవతలు ఆకాశమార్గములో వెళ్లుచున్నవారై ఆ దక్షుని యజ్ఞము అనే మహోత్సవమును గురించి కబుర్లు చెప్పుకొనుచుండగా, దక్షపుత్రికయగు సతీదేవి వినెను. ఆకాశములో అన్ని దిక్కులనుండి అందగత్తెలగు ఆ ఉపదేవతల భార్యలు, మెడలో పచ్చలను పెట్టుకొని, కొత్త చీరలను కట్టుకొని, గొప్పగా ప్రకాశించే కుండలములను ధరించి, విమానములపై నెక్కి, చంచలమగు నేత్రములతో అన్ని వైపులకు చూస్తూ, తమ భర్తలతో కలిసి యజ్ఞమునకు వెళ్లుచుండిరి. సతీదేవి తన మకామునకు సమీపములో ఆకాశములో వారినందరినీ చూచెను. అపుడామె ఉత్కంఠతో, భూతపతి మరియు తనకు భర్త అగు శివదేవునితో నిట్లు పలికెను.

సత్యువాచ ।
ప్రజాపతేస్తే శ్వశురస్య సాంప్రతం

నిర్యాపితో యజ్ఞమహోత్సవః కిల ।
వయం చ తత్రాభిసరామ వామ తే
యద్యర్థితామీ విబుధా వ్రజంతి హి ॥ 8

సాంప్రతమ్ - ఇప్పుడు, తే - నీ, శ్వశురస్య - మామగారగు, ప్రజాపతేః - దక్ష ప్రజాపతియొక్క, యజ్ఞమహా-ఉత్సవః - యజ్ఞము యొక్క గొప్ప ఉత్సవము, నిర్యాపితః కిల - ప్రవర్తిల్లినది గదా!, వామ - ఓయీ చతురా!, తే - నీకు, అర్థితా - ఇచ్ఛ, యది - ఉన్నచో (అర్థితా - నా కోరిక, తే - నీకు, యది - అంగీకారమైనచో), వయం చ - మనము కూడ, తత్ర - అచటకు, అభిసరామ - వెళ్లెదము, హి - ఏలయనగా, అమీ - ఈ, విబుధాః - దేవతలు, వ్రజంతి - వెళ్లుచున్నారు.

సతీదేవి ఇట్లు పలికెను --- ఓయీ చతురా! వామదేవా! నీ మామ గారగు దక్ష ప్రజాపతి యజ్ఞమును గొప్ప ఉత్సవముగా చేయుచున్నాడు. నీకు ఇష్టమైనచో, నీకు నా కోరిక అంగీకారమైనచో, మనము కూడ అచ్చటకు వెళ్లెదము. ఏలయనగా, దేవతలింకనూ యజ్ఞమునకు వెళ్లుచునే యున్నారు సుమా! (ఇంకను సమయము మించిపోలేదు).

తస్మిన్ భగిన్యో మమ భర్తృభిస్స్వకై-
ర్ధ్రువం గమిష్యంతి సుహృద్దిదృక్షవః ।
అహం చ తస్మిన్ భవతాభికామయే
సహోపనీతం పరిబర్హమర్హితుమ్ ॥ 9

మమ - నా, భగిన్యః - అక్కలు చెల్లెళ్లు, సుహృత్-దిదృక్షవః - బంధుమిత్రులను చూడగోరువారై, ధ్రువమ్ - నిశ్చయముగా, తస్మిన్ - ఆ యజ్ఞమునందు, స్వకైః - తమ, భర్తృభిః - భర్తలతో గూడి, గమిష్యంతి - వెళ్లగలరు, అహం చ - నేను కూడా, భవతా సహ - నీతో కూడి, ఉపనీతమ్ - ఈయబడిన, పరిబర్హమ్ - బహుమానములను, అర్హితుమ్ - స్వీకరించుటకు, అభికామయే - కోరుచున్నాను.

నా అక్కలు చెల్లెళ్లు బంధుమిత్రులను చూడగోరువారై, తమ తమ భర్తలతో గూడి ఆ యజ్ఞమునకు తప్పక వెళ్లెదరు. నేను కూడ నీతో కలిసి వెళ్లి, యజ్ఞములో మా తల్లిదండ్రులు ఇచ్చే కానుకలను స్వీకరించ గోరుచున్నాను.

తత్ర స్వసౄర్మే నను భర్తృసంమితా
మాతృష్వసౄః క్లిన్నధియం చ మాతరమ్ ।
ద్రక్ష్యే చిరోత్కంఠమనా మహర్షిభి-
రున్నీయమానం చ మృడాధ్వరధ్వజమ్ ॥ 10

మృడ - సుఖప్రదుడవగు ఓ శివా!, చిర-ఉత్కంఠమనాః - చిరకాలమునుండి బంధువులను చూడాలనే తహతహతో కూడిన మనస్సు గల నేను, భర్తృసంమితాః - భర్తలతో కూడిన, స్వసౄః - అక్కచెల్లెళ్లను, మాతృష్వసౄః - అమ్మగారి అక్కచెల్లెళ్లను, క్లిన్నధియమ్ - ప్రేమతో ఆర్ద్రమైన మనస్సు గల, మాతరం చ - అమ్మగారిని కూడ, మహర్షిభిః - మహర్షులచే, ఉన్నీయమానమ్ - నిర్వర్తించబడే (నిలబెట్టబడే, ఎగురవేయబడే), అధ్వరధ్వజం చ - ఉత్కృష్టమగు యజ్ఞమును (యూపమును, జెండాను) కూడ, ద్రక్ష్యే నను - చూడగలను సుమా!

సుఖప్రదుడవగు ఓ శివా! బంధువులను చూడాలనే తహతహ నాకు చాల కాలమునుండియు ఉన్నది. నేను అక్కడ నా అక్కచెల్లెళ్లను, మా అమ్మగారి అక్కచెల్లెళ్లను, ప్రేమార్ద్రహృదయురాలగు మా అమ్మగారిని, మహర్షులచే నిర్వర్తించబడే ఉత్కృష్టమగు యజ్ఞమును, దానిలో నిలబెట్టబడే యూపమును, ఎగురవేయబడే ధ్వజమును కూడ చూచెదను సుమా!

త్వయ్యేతదాశ్చర్యమజాత్మమాయయా
వినిర్మితం భాతి గుణత్రయాత్మకమ్ ।
తథాఽప్యహం యోషిదతత్త్వవిచ్చ తే
దీనా దిదృక్షే భవ మే భవక్షితిమ్ ॥ 11

అజ - పుట్టుక లేనివాడా!, భవ - శివా!, గుణత్రయ-ఆత్మకమ్ - సత్త్వరజస్తమోగుణాత్మకమగు, ఆశ్చర్యమ్ - అద్భుతమగు, ఏతత్ - ఈ జగత్తు, త్వయి - నీయందు, ఆత్మమాయయా - నీ మాయాశక్తిచే, వినిర్మితమ్ - ప్రకటమైనదై, భాతి - ప్రకాశించుచున్నది, తథా అపి - అయినప్పటికీ, యోషిత్ - స్త్రీని, తే - నీ, అతత్త్వవిత్ - స్వరూపమునెరుగని దానను, దీనా - దీనురాలను అగు, అహమ్ - నేను, మే - నా, భవక్షితిమ్ - పుట్టిన స్థానమును, దిదృక్షే - చూడగోరుచున్నాను.

పుట్టుక లేని ఓ భవా (అఖండసత్తా స్వరూపా)! సత్త్వరజస్తమోగుణాత్మకము, అద్భుతము అగు ఈ జగత్తు నీచే నీ మాయాశక్తిచే నీయందు నిర్మించబడి నీయందే ప్రకాశించుచున్నది. కాని, నేను నీ తత్త్వమునెరుంగని దీనురాలనగు యువతిని. నేను పుట్టి పెరిగిన స్థానమును చూడగోరుచున్నాను.

పశ్య ప్రయాంతీరభవాన్యయోషితోఽ-
త్యలంకృతాః కాంతసఖా వరూథశః ।
యాసాం వ్రజద్భిశ్శితికంఠ మండితం
నభో విమానైః కలహంసపాండుభిః ।। 12

అభవ - పుట్టుక లేని ఓ శివా!, శితికంఠ - నల్లని కంఠము గలవాడా!, అతి-అలంకృతాః - గొప్పగా అలంకరించుకున్న, కాంతసఖాః - భర్తలు తోడుగా గల, వరూథశః - గుంపులుగా, ప్రయాంతీః - వెళ్లుచున్న, అన్యయోషితః - ఇతర యువతులను, పశ్య - చూడుము, యాసామ్ - ఎవరియొక్క, వ్రజద్భిః - వెళ్లుచున్న, కలహంసపాండుభిః - రాజహంసలవలె తెల్లనైన, విమానైః - విమానములచే, నభః - ఆకాశము, మండితమ్ - అలంకరించబడినదో.

ఓ శివా! నీకు పుట్టుక లేదు. కావున, బంధువియోగము నీకు తెలియదు. ఇతరుల కొరకై విషమునైననూ భక్షించుటకు సిద్ధపడే నీ దయాహృదయమును నీ నల్లని కంఠము సూచించుచున్నది. ఆకాశము కేసి చూడుము. దేవతాస్త్రీలు దక్షునకు బంధువులు కాకున్ననూ, గొప్పగా అలంకరిం

చుకుని భర్తలతో గూడి గుంపులుగా యజ్ఞమునకు వెళ్లుచున్నారు. వారు వెళ్లుచుండగా, రాజహంసలవలె తెల్లనైన వారి విమానములచే ఆకాశము అలంకరించబడియున్నది.

కథం సుతాయాః పితృగేహకౌతుకం
నిశమ్య దేహస్సురవర్య నేంగతే ।
అనాహుతా అప్యభియాంతి సౌహృదం
భర్తుర్గురోర్దేహకృతశ్చ కేతనమ్ ॥ 13

సురవర్య - దేవతలలో ఉత్తముడవగు ఓ శివా!, సుతాయాః - కుమార్తెనగు నా, దేహః - శరీరము, పితృగేహకౌతుకమ్ - తండ్రిగారి ఇంటిలోని ఉత్సవమును గురించి, నిశమ్య - విని, కథమ్ - ఏ విధముగా, న ఇంగతే - చలనము లేకుండనుండును?, సౌహృదమ్ - మిత్రుని ఇంటిని గురించి, భర్తుః - భర్తయొక్క, గురోః - గురువుయొక్క, దేహకృతః చ - తండ్రి/తల్లియొక్క, కేతనమ్ - ఇంటిని గురించి, అనాహుతాః అపి - ఆహ్వానించబడకపోయిననూ, అభియాంతి - వెళ్లుచున్నారు.

దేవతోత్తముడవగు ఓ శివా! తండ్రిగారి ఇంటిలోని ఉత్సవమును గురించి విన్న తరువాత కూడ నా ఈ దేహము కదలకుండా ఇక్కడనే ఉండుట యెట్లు కుదురును? మిత్రుడు, భర్త, గురువు మరియు తల్లిదండ్రులు అనువారల ఇళ్లకు జనులు ఆహ్వానము లేకున్ననూ వెళ్లెదరు.

తన్మే ప్రసీదేదమమర్త్య వాంఛితం
కర్తుం భవాన్ కారుణికో బతార్హతి ।
త్వయాత్మనోऽర్ధేహమదభ్రచక్షుషా
నిరూపితా మాऽనుగృహాణ యాచితః ॥ 14

అమర్త్య - ఓ దేవా!, తత్ - అందువలన, మే - నా కొరకు, ప్రసీద - ప్రసన్నుడవు కమ్ము, కారుణికః - దయాళుడవగు, భవాన్ - నీవు, ఇదమ్ - ఈ, వాంఛితమ్ - కోర్కెను, కర్తుమ్ - చేయుటకు, అర్హతి - తగుచున్నావు, బత - నిశ్చయము, అదభ్రచక్షుషా - సర్వజ్ఞుడవైన, త్వయా - నీచే,

అహమ్ - నేను, ఆత్మనః - నీయొక్క, అర్ధే - సగభాగమునందు, నిరూపితా - స్థాపించబడితిని, యాచితః - కోరబడిన నీవు, మా - నన్ను, అనుగృహాణ - అనుగ్రహించుము.

ఓ దేవా! నాపై ప్రసన్నుడవు కమ్ము. నీవు దయాళుడవు. నా కోర్కెను నిశ్చయముగా నెరవేర్చుము. నీవు సర్వజ్ఞుడవు. నన్ను నీ అర్ధభాగములో స్థాపించియున్నావు. నేను నిన్ను కోరుచున్నాను. కావున, నన్ను అనుగ్రహించుము.

ఋషిరువాచ ।
ఏవం గిరిత్రః ప్రియయాభిభాషితః
ప్రత్యభ్యధత్త ప్రహసన్ సుహృత్ప్రియః ।
సంస్మారితో మర్మభిదః కువాగిషూన్
యానాహ కో విశ్వసృజాం సమక్షతః ॥ 15

ప్రియయా - ప్రియురాలగు పార్వతిచే, ఏవమ్ - ఈ విధముగా, అభిభాషితః - ప్రార్థించబడినవాడై, సుహృత్-ప్రియః - మంచి హృదయము గలవారలకు ప్రియుడగు, గిరిత్రః - కైలాసరక్షకుడగు శివుడు, మర్మభిదః - మర్మస్థానమును భేదించే, కువాక్-ఇషూన్ - చెడు మాటలు అనే బాణములను, సంస్మారితః - స్మరింపజేయబడినవాడై, యాన్ - ఏ మాటలను, కః - దక్ష ప్రజాపతి, విశ్వసృజామ్ - ప్రజాపతుల, సమక్షతః - యెదుట, ఆహ - పలికెనో, ప్రహసన్ - నవ్వుచున్నవాడై, ప్రతి-అభ్యధత్త - సమాధానమును చెప్పెను.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- ప్రియురాలగు పార్వతి యొక్క ఈ ప్రార్థనను విన్న శివునకు దక్షప్రజాపతి ఇతరప్రజాపతుల సమక్షములో పలికిన హృదయవిదారకములగు బాణములవంటి చెడు పలుకులు గుర్తుకు వచ్చెను. మంచి హృదయము గలవారలకు మేలు చేసే కైలాసాధిపతియగు ఆ శివుడు నవ్వి, ఆమెకు ఇట్లు సమాధానమునిచ్చెను.

శ్రీభగవానువాచ ।
త్వయోదితం శోభనమేవ శోభనే
అనాహుతా అప్యభియంతి బంధుషు ।
తే యద్యనుత్పాదితదోషదృష్టయో
బలీయసాఽనాత్మ్యమదేన మన్యునా ॥ 16

శోభనే - ఓ సుందరీ!, త్వయా - నీచే, ఉదితమ్ - పలుకబడినది, శోభనం ఏవ - చక్కగనే యున్నది, బంధుషు - బంధువుల విషయములో, అనాహుతాః అపి - ఆహ్వానించబడకపోయిననూ, అభియంతి - వెళ్లెదరు, తే - వారు, బలీయసా - బలవత్తరమైన, అనాత్మ్యమదేన - ఆత్మ కాని దేహాదులచే చేయబడిన దర్పముచే, మన్యునా - కోపముచే, అనుత్పాదిత దోషదృష్టయః యది - కలిగించబడని దోషదృష్టి గలవారైనచో.

ఓ సుందరీ! నీవు చెప్పిన మాట బాగుగనే యున్నది. బంధువుల ఇంటికి ఆహ్వానము లేకున్ననూ వెళ్లవచ్చును. కొందరు అనాత్మయగు దేహాదులయందు అభిమానము గలవారై, దర్పముచే మరియు క్రోధముచే దోషదృష్టిని కలిగి యుందురు. మన బంధువులు అట్టివారు కానప్పుడు మాత్రమే నీ అభిప్రాయము సరియగును. బంధువులు అట్టివారై యుండ గా, మనము ఆహ్వానము లేకుండగా వెళ్లరాదు.

విద్యాతపోవిత్తవపుర్వయఃకులైః-
స్సతాం గుణైష్షడ్భిరసత్తమేతరైః ।
స్మృతౌ హతాయాం భృతమానదుర్దృశః
స్తబ్ధా న పశ్యంతి హి ధామ భూయసామ్ ॥ 17

సతామ్ - సత్పురుషులకు, గుణైః - గుణములుగా ఉండే, విద్యా తపః-విత్తవపుః-వయఃకులైః - చదువు తపస్సు ధనము శరీరసౌందర్యము యౌవనము కులము అనే, అసత్తమ-ఇతరైః - మిక్కిలి దుష్టులకు చెడు లక్షణములుగా ఉండే, షడ్భిః - ఆరు లక్షణములచే, స్మృతౌ - వివేకజ్ఞాన ము, హతాయామ్ - నశించగా, భృతమానదుర్దృశః - పోషించబడిన

అహంకారముచే దుష్టమైన దృష్టిగల, స్తబ్ధాః - గర్విష్ఠులు, భూయసామ్ - మహాత్ములు, ధామ - తేజస్సును, న పశ్యంతి హి - చూడరు గదా!

చదువు, తపస్సు, సంపద, అందము, యౌవనము, కులము అను ఆరు గుణములు సత్పురుషులకు శోభనిచ్చును. కాని, ఇవే గుణములు పరమదుష్టులయందు ఉన్నచో, అవి వారి అహంకారమునే బలోపేతముగా చేసి, వారి వివేకజ్ఞానమును నశింపజేయును. అప్పుడు వారి ఆలోచించే విధానము దుష్టముగా తయారగును. అట్టి గర్విష్ఠులు మహాత్ముల గొప్పదనమును కనజాలరు.

నైతాదృశానాం స్వజనవ్యపేక్షయా
గృహాన్ ప్రతీయాదనవస్థితాత్మనామ్ ।
యేఽభ్యాగతాన్ వక్రధియాఽభిచక్షతే
ఆరోపితభ్రూభిరమర్షణాక్షిభిః ॥ 18

స్వజనవ్యపేక్షయా - నావారు అనే భావనతో, అనవస్థిత-ఆత్మనామ్ - సువ్యవస్థితము కాని చిత్తము గల, ఏతాదృశానామ్ - ఇటువంటివారల, గృహాన్ - ఇంటిని, న ప్రతీయాత్ - కన్నెత్తి చూడరాదు (వెళ్లరాదు), యే - ఎవరైతే, అభ్యాగతాన్ - ఇంటికి వచ్చినవారిని, వక్రధియా - వక్రబుద్ధితో, ఆరోపితభ్రూభిః - పైకి యెత్తబడిన కనుబొమలు గల, అమర్షణ-అక్షిభిః - కోపము నిండిన కనులతో, అభిచక్షతే - కన్నులలోనికి చూచెదరో.

అస్థిరమగు చిత్తము గల ఈ దక్షుడు మొదలగువారి ఇంటి దరిదాపులకైననూ, వీరు నా బంధువులు అనే భావముతో వెళ్లరాదు. ఏలయనగా, వీరు ఇంటికి వచ్చినవారిని వక్రబుద్ధితో కనుబొమలను పైకెత్తి కోపముతో నిండిన కన్నులతో కన్నులలోనికి చూచెదరు (అవమానించెదరు).

తథాఽరిభిర్న వ్యథతే శిలీముఖై-
శ్శేతేఽర్దితాంగో హృదయేన దూయతా ।
స్వానాం యథా వక్రధియా దురుక్తిభి-
ర్దివానిశం తప్యతి మర్మతాడితః ॥ 19

అరిభిః - శత్రువులచే, శిలీముఖైః - బాణములచే, అర్దిత-అంగః - పీడించబడిన అవయవములు గల వ్యక్తి, శేతే - పరుండియున్నాడు, తథా - ఆ విధముగా, న వ్యథతే - మనస్సులో దుఃఖమును పొందదు, యథా - ఏ విధముగానైతే, వక్రధియామ్ - వక్రమగు బుద్ధి గల, స్వానామ్ - తనవారల, దురుక్తిభిః - చెడు మాటలచే, మర్మతాడితః - హృదయమునందు కొట్టబడినవాడై, దూయతా - తపించుచున్న, హృదయేన - హృదయముతో, దివానిశమ్ - రాత్రింబగళ్లు, తప్యతి - దుఃఖమును పొందునో.

వక్రమగు బుద్ధిగల తన బంధువులే చెడ్డ మాటలు అనే బాణములతో హృదయమునందు కొట్టినప్పుడు, ఆ వ్యక్తి బాధాతప్తహృదయుడై రాత్రింబగళ్లు చాల దుఃఖమునను భవించును. శత్రువులచే బాణములతో శిథిలము చేయబడిన అవయవములు గలవాడై మంచము మీద పడియున్న వ్యక్తియైనమా మనస్సులో అంతటి దుఃఖమునను భవించడు.

వ్యక్తం త్వముత్కృష్టగతేః ప్రజాపతేః
ప్రియాత్మజానామసి సుభ్రు సంమతా ।
అథాపి మానం న పితుః ప్రపత్స్యసే
మదాశ్రయాత్కః పరితప్యతే యతః ।। 20

సుభ్రు - ఓ అందమైన కనుబొమలు గలదానా!, ఉత్కృష్టగతేః - ఉన్నతమగు స్థితిగల, ప్రజాపతేః - దక్ష ప్రజాపతియొక్క, ఆత్మజానామ్ - కుమార్తెలలో, త్వమ్ - నీవు, ప్రియా - ఇష్టమైనదానవు, అసి - అగుచున్నావని, సంమతా - నాచే గుర్తించబడినదానవు, (ప్రియ-ఆత్మజానామ్ - ప్రీతికి పాత్రములగు కుమార్తెలలో, సంమతా - ప్రియమైన దానవు), వ్యక్తమ్ - నిశ్చయము, అథాపి - అయినప్పటికీ, పితుః - తండ్రియొక్క, మానమ్ - మర్యాదను, న ప్రపత్స్యసే - పొందబోవు, యతః - ఎందువలననగా, కః - ప్రజాపతి, మత్-ఆశ్రయాత్ - నాతోడి సంబంధము వలన, పరితప్యతే - మిక్కిలి తాపమును పొందుచున్నాడు.

ఓ సుందరీ పార్వతీ! దక్ష ప్రజాపతి ఉన్నతమైన స్థితి గలవాడు. ఆయనకు కుమార్తెలందరియందు ప్రీతి గలదు. నీయందు అధికమగు ప్రీతి

గలదు. ఇది నిశ్చయము. ఈ విషయము నాకు కూడ తెలియును. కాని, నీకు తండ్రి ఈయదగిన మర్యాద (గౌరవము) లభించదు. ఏలయనగా, నీకు నేను భర్తనై యుండుట కారణముగా, దక్ష ప్రజాపతి చాల తాపమును అనుభవించుచున్నాడు.

పాపచ్యమానేన హృదాతురేంద్రియ-
స్సమృద్ధిభిః పూరుషబుద్ధిసాక్షిణామ్ ।
అకల్ప ఏషామధిరోఢుమంజసా
పదం పరం ద్వేష్టి యథాసురా హరిమ్ ॥ 21

పాపచ్యమానేన - మిక్కిలి తాపమును పొందుచున్న, హృదా - హృదయముతో, ఆతుర-ఇంద్రియః - దుఃఖితములైన ఇంద్రియములు గల దక్షుడు, సమృద్ధిభిః - సంపదలచే, పూరుషబుద్ధిసాక్షిణామ్ - జీవుని బుద్ధికి సాక్షులైయుండే, ఏషామ్ - ఈ మహాత్ముల, పరమ్ - సర్వోత్కృష్టమైన, పదమ్ - స్థానమును, అంజసా - తేలికగా, అధిరోఢుమ్ - అధిష్ఠించుటకు, అకల్పః - సమర్థుడు కానివాడై, అసురాః - అసురులు, హరిం యథా - శ్రీహరిని వలె, (పరమ్ - కేవలము), ద్వేష్టి - ద్వేషించుచున్నాడు.

దక్షుడు ద్వేషముతో నిండిన హృదయములో మిక్కిలి తాపమును పొందుచున్నాడు. ఆతని ఇంద్రియములు దుఃఖముచే కల్లోలితములగుచు న్నవి. సకలజీవుల బుద్ధులకు సాక్షిగా ఉండే ఆత్మచైతన్యమునందు నిష్ఠ గల మహాత్ములు పొందే పరమపదము (మోక్షము) ను, ఆతడు తన వద్ద ఉండే లౌకికసంపదలతో తేలికగా పొందలేడు. ఈ అసమర్థత ఆతని ద్వేష మును ఇనుమడింపజేసినది. కావున, ఆతడు అసురులు శ్రీహరిని ద్వేషించే విధముగా, కేవలము ద్వేషభావమును మాత్రమే మనస్సులో నింపుకొని యున్నాడు.

ప్రత్యుద్గమప్రశ్రయణాభివాదనం
విధీయతే సాధు మిథస్సుమధ్యమే ।
ప్రాజ్ఞైః పరస్మై పురుషాయ చేతసా
గుహాశయాయైవ న దేహమానినే ॥ 22

సుమధ్యమే - సన్నని నడుము గలదానా!, ప్రతి-ఉద్గమప్రశ్రయణ -అభివాదనమ్ - ఎదురేగుట ప్రేమను చూపుట నమస్కరించుట అనే వివిధచేష్ట, మిథః - పరస్పరము, విధీయతే - ఆచరించబడుచున్నది, ప్రాజ్ఞైః - మహాత్ములచే, చేతసా - మనస్సుతో, గుహాశయాయ - అంతర్యామియగు, పరస్మై పురుషాయ - పరమపురుషుడగు ఈశ్వరుని కొరకు, సాధు - చక్కగా, దేహమానినే - దేహాభిమానము గలవాని కొరకు, న - చేయబడదు.

ఓ సుందరీ పార్వతీ! సమాజములోని జనులు ఒకరినొకరు కలిసినప్పుడు ఎదురేగి ప్రేమతో మాటలాడి నమస్కరించెదరు. మహాత్ములు ఈ క్రియలనన్నింటినీ మానసికముగా, సర్వాంతర్యామి పరమపురుషుడు అగు పరమేశ్వరుని విషయములో చక్కగా చేయుచునే యుందురు. కాని, మహాత్ములు దేహాభిమానులగు అజ్ఞానుల యెడల ఈ క్రియలను చేయరు.

సత్త్వం విశుద్ధం వసుదేవశబ్దితం
యదీయతే తత్ర పుమానపావృతః ।
సత్త్వే చ తస్మిన్ భగవాన్ వాసుదేవో
హ్యధోక్షజో మే నమసా విధీయతే ॥ 23

విశుద్ధమ్ - పరిశుద్ధమగు, సత్త్వమ్ - సత్త్వగుణము (అంతఃకరణము), వసుదేవశబ్దితమ్ - వసుదేవుడు అని వ్యవహరించబడును, యత్ - ఏలయనగా, తత్ర - దానియందు, పుమాన్ - పరమేశ్వరుడు, అపావృతః - తొలగిన ఆవరణము గలవాడై, ఈయతే - పొందబడుచున్నాడు, తస్మిన్ - అట్టి, సత్త్వే - అంతఃకరణమునందు, మే - నాచే, అధోక్షజః - ఇంద్రియములకు గోచరము కాని (ఇంద్రియములు ఉపసంహరించబడగా సాక్షాత్కరించువాడు), వాసుదేవః భగవాన్ - శ్రీహరి భగవానుడు, నమసా - నమస్కారముచే, విధీయతే - సేవించబడుచున్నాడు.

రజస్తమోగుణముల సంపర్కము లేక కేవలసత్త్వగుణప్రధానముగా నుండుట వలన అంతఃకరణము శుద్ధమగును. అట్టి పరిశుద్ధమగు అంతఃకరణమునందు అవిద్యయొక్క ఆవరణము తొలగిపోయి, పరమేశ్వ

రుడు ఆత్మరూపముగా ప్రకాశించును. కావుననే, అట్టి అంతఃకరణమునకు వసుదేవ అని వ్యవహారము కలిగినది. అట్టి అంతఃకరణములో ప్రకాశించే భగవానుడు వాసుదేవుడైనాడు. ఆయన ఇంద్రియములకు గోచరము కాడు. ఇంద్రియములు ఉపసంహరించబడి (ఇంద్రియజ్ఞానము మిథ్యయని నిరాక రించబడి), మనస్సు తన స్వరూపమునందు విలీనము కాగా ఆ ఈశ్వ రుడు ఆత్మరూపుడై గోచరించును. కావుననే, ఆయన అధోక్షజుడైనాడు. అట్టి పరమేశ్వరుని నేను నా అంతఃకరణమునందు నమస్కారాదులచే సేవించుచునే యుందును.

తత్తే నిరీక్ష్యో న పితాఽపి దేహకృద్దక్షో
మమ ద్విట్ తదనువ్రతాశ్చ యే ।
యో విశ్వసృగ్యజ్ఞగతం వరోరు మా-
మనాగసం దుర్వచసాఽకరోత్తిరః ॥ 24

వరోరు - ఓ సుందరీ!, తత్ - అందువలన, దక్షః - దక్షుడు, తే - నీకు, దేహకృత్ - దేహమునిచ్చిన, పితా అపి - తండ్రియే అయిననూ, మమ - నాకు, ద్విట్ - ద్వేషించువాడు, న నిరీక్ష్యః - చూడదగినవాడు కాదు, తత్-అనువ్రతాః - ఆతనిని అనుసరించే, యే - ఎవరు గలరో, చ - వారు కూడ చూడదగినవారు కాదు, యః - ఏ దక్షుడు, విశ్వసృక్-యజ్ఞగ తమ్ - ప్రజాపతుల యజ్ఞమునకు వెళ్లిన, అనాగసమ్ - దోషము లేని, మామ్ - నన్ను, దుర్వచసా - చెడు వచనముతో, తిరః అకరోత్ - తిరస్క రించినాడో.

ఓ సుందరీ! కావున, దక్షుడు నీకు దేహమునిచ్చిన తండ్రియే అయిననూ, ఆతడు నన్ను ద్వేషించుచున్నవాడు గనుక, నీవు వెళ్లి ఆతనిని గాని, ఆతని అనుయాయులను గాని చూడదగదు. నేను ప్రజాపతుల యజ్ఞ మునకు వెళ్లితిని. అక్కడ నేను ఆచరించిన దోషమేమియు లేదు. అయిన నూ, ఆతడు నన్ను చెడు మాటలతో అవమానించినాడు.

యది వ్రజిష్యస్యతిహాయ మద్వచో
భద్రం భవత్యా న తతో భవిష్యతి ।

సంభావితస్య స్వజనాత్పరాభవో
యదా స సద్యో మరణాయ కల్పతే ॥ 25

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే చతుర్థస్కంధే ఉమారుద్రసం
వాదో నామ తృతీయోఽధ్యాయః ॥

మత్-వచః - నా మాటను, **అతిహాయ** - ఉల్లంఘించి, వ్రజిష్యసి యది - నీవు వెళ్లబోవుచున్నచో, **తతః** - అట్లు వెళ్లుట వలన, **భవత్యాః** - నీకు, భద్రమ్ - మంగళము, న భవిష్యతి - కలుగబోదు, సంభావితస్య - శ్రేష్ఠునిగా పరిగణించబడే వ్యక్తికి, యదా - ఏ కాలమునందు, స్వజనాత్ - తన వారి వలన, పరాభవః - పరాభవము కలుగునో, సః - ఆ పరాభవము, సద్యః - వెంటనే, మరణాయ - మరణము కొరకు, కల్పతే - సమర్థమగుచున్నది.

నీవు నా మాటను ఉల్లంఘించి వెళ్లినచో, నీకు అట్టి యాత్ర వలన కల్యాణము కలుగదు. సత్కారమును పొందే వ్యక్తికి తన వారి వలన పరాభవము ఎదురైనచో, అది వెంటనే ఆ వ్యక్తియొక్క మరణమునకు హేతువు అగును.

శ్రీమద్భాగవత మహాపురాణములోని నాల్గవ స్కంధములో ఉమారుద్రసంవాదము అనే మూడవ అధ్యాయము ముగిసినది (3).

*****

# అథ చతుర్థోఽధ్యాయః

## సతీదేవి ప్రాణములను విడిచిపెట్టుట

మైత్రేయ ఉవాచ ।
ఏతావదుక్త్వా విరరామ శంకరః
పత్న్యంగనాశం హ్యుభయత్ర చింతయన్ ।
సుహృద్దిదృక్షుః పరిశంకితా భవా-
న్నిష్క్రామతీ నిర్విశతీ ద్విధాఽఽస సా ॥ 1

మైత్రేయః - మైత్రేయుడు, ఉవాచ - పలికెను, శంకరః - శంకరుడు, ఏతావత్ - ఇంతమాత్రము, ఉక్త్వా - పలికి, ఉభయత్ర - రెండు పక్షములలో, పత్న్-అంగనాశమ్ - భార్యయొక్క దేహమునకు వినాశమును, చింతయన్ - ఆశంకించువాడై, విరరామ - విరమించెను, సా - ఆమె, సుహృత్-దిదృక్షుః - బంధువులను చూడగోరునదై, భవాత్ - శివుని వలన, పరిశంకితా - మిక్కిలి శంక గలదై, నిష్క్రామతీ - ఇంటినుండి బయలు దేరునదై, నిర్విశతీ - మరల ఇంటిలోనికి వచ్చునదై, ద్విధా - ఇటునటు తేల్చుకొనలేక, ఆస - ఉండెను.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- శంకరుడు ఇంత మాత్రము పలికి మిన్నకుండెను. సతీదేవిని వెళ్లకుండగా వారించుట, వెళ్లుటకు అనుమతించుట అనే రెండు పక్షములలో ఆమె దేహత్యాగము ఘటిల్లవచ్చుననే ఆశంక ఆయనకు కలిగెను. ఆమెకు ఒక వైపు తన బంధువులను చూడవలెననే కోరిక ఉండెను. మరియొక వైపు తాను వెళ్లినచో, శంకరుని ఆజ్ఞను ఉల్లంఘించిన దోషము కలుగునేమో యను ఆశంక గలదు. ఆమె ఇంటి

నుండి బయటకు వెళ్లి, మరల వెనుకకు మరలి వస్తూ, ఇటునటు తేల్చుకొన లేక సతమతమయ్యేను.

సుహృద్దిదృక్షాప్రతిఘాతదుర్మనాః
స్నేహాద్రుదంత్యశ్రుకలాఽతివిహ్వలా ।
భవం భవాన్యప్రతిపూరుషం రుషా
ప్రధక్ష్యతీవైక్షత జాతవేపథుః ॥ 2

సుహృత్-దిదృక్షాప్రతిఘాతదుర్మనాః - బంధువులను చూడవలె ననే కోరికకు కలిగిన ఆటంకముచే చెడిన మనస్సు గలిగినట్టియు, స్నేహాత్ - ప్రేమ వలన, రుదంతీ - రోదించుచున్నట్టియు, అశ్రుకలా-అతివిహ్వలా - కన్నీటి బిందువులతో మిక్కిలి కల్లోలమును చెందినట్టియు, (అశ్రుకలా - కన్నీటిని విడుచుచున్నట్టియు, అతివిహ్వలా - మిక్కిలి కల్లోలమును చెంది నట్టియు), జాతవేపథుః - పుట్టిన వణుకు కలిగిన, భవానీ - శివుని యిల్లాలు, అప్రతిపూరుషమ్ - సాటి మరియొకడు లేని, భవమ్ - శివుని, రుషా - రోషముతో, ప్రధక్ష్యతీ ఇవ - దహింపబోవుచున్నది వలె, ఐక్షత - చూచెను.

సతీదేవికి బంధువులను చూడవలెననే కోరిక గట్టిగా ఉండెను. ఆ కోరికకు విఘాతము కలుగగానే ఆమె మనస్సు చెడిపోయెను. ఆమె దుఃఖ ముతో కన్నులనుండి నీటిని విడుచుచుండెను. బంధువులయందలి ప్రీతి వలన మనస్సు మిక్కిలి కల్లోలితమగుటచే రోదించుచున్న ఆమెకు శరీర ములో వణుకు పుట్టెను. తనతో సాటియైనవారు ఎవ్వరూ లేని శివుని, అట్టి సతీదేవి రోషముతో దహించివేయునా యన్నట్లు చూచెను.

తతో వినిఃశ్వస్య సతీ విహాయ తం
శోకేన రోషేణ చ దూయతా హృదా ।
పిత్రోరగాత్ స్త్రైణవిమూఢధీర్గృహాన్
ప్రేమ్ణాత్మనో యోఽర్ధమదాత్సతాం ప్రియః ॥ 3

**తతః** - **అప్పుడు, శోకేన - దుఃఖముతో, చ - మరియు, రోషేణ - కోపముతో, దూయతా - తపించుచున్న, హృదా - హృదయముతో, సతీ - సతీదేవి, వినిఃశ్వస్య - గాఢముగా నిట్టూర్చి, స్త్రైణవిమూఢధీః - స్త్రీస్వ** భావముచే వ్యామోహమును పొందిన బుద్ధి గలదై, **తమ్ - ఆ** శివుని, విహాయ - విడిచిపెట్టి, పిత్రోః - **తల్లిదండ్రుల, గృహాన్ - ఇంటిని** గురించి, **అగాత్** - వెళ్ళెను, **సతామ్** - సత్పురుషులకు, **ప్రియః** - ప్రియుడగు, **యః** - ఏ శివుడైతే, ప్రేమ్ణా - ప్రేమతో, **ఆత్మనః - తన, అర్ధమ్** - సగభాగము ను, **అదాత్** - ఇచ్చినాడో.

అప్పుడు సతీదేవి తన హృదయములో, శివుడు తనను వెళ్లవద్ద న్నందులకు కోపముతో, శివుని మాటను ఉల్లంఘించుచున్నందులకు దుఃఖ ముతో, చాల తాపమును కలిగియుండెను. అపుడామె దీర్ఘముగా నిట్టూర్చి, ఆ శివుని విడిచి తల్లిదండ్రుల ఇంటికి వెళ్లెను. సత్పురుషులకు ప్రియుడగు శివుడు ఆమెకు ప్రేమతో తన అర్ధభాగమును ఇచ్చెను. కాని, ఆమె బుద్ధి యందు స్త్రీసహజమగు ప్రేమ వలన వ్యామోహము నెలకొనెను. కావున నే, అట్టి శివుని ఆమె విడిచి వెళ్లెను.

తామన్వగచ్ఛన్ ద్రుతవిక్రమాం సతీ-
మేకాం త్రినేత్రానుచరాస్సహస్రశః ।
సపార్షదయక్షా మణిమన్మదాదయః
పురోవృషేంద్రాస్తరసా గతవ్యథాః ।। 4

ఏకామ్ - ఒంటరిదైన, ద్రుతవిక్రమామ్ - వేగముగా నడిచి వెళ్లు చున్న, **తామ్ - ఆ, సతీమ్** - సతీదేవిని, **మణిమత్-మద-అదయః** - మణి మంతుడు మదుడు మొదలుగా గలిగినట్టియు, పురః-వృష-ఇంద్రాః - ఎదుట నందీశ్వరుడు ఉన్నట్టియు, గతవ్యథాః - **తొలగిన** భయము కలిగిన ట్టియు, (**ఆగతవ్యథాః** - వచ్చుచున్న దుఃఖము కలిగినట్టియు), త్రినేత్ర-అ నుచరాః - శివుని అనుచరులు, సపార్షదయక్షాః - పార్షదులతో మరియు యక్షులతో గూడినవారై, సహస్రశః - వేల సంఖ్యలో, **తరసా** - వేగముగా, **అను-అగచ్ఛన్** - అనుసరించి వెళ్లిరి.

ఆ సతీ దేవి ఒంటరిదై వేగముగా నడిచి వెళ్లుచుండగా, మణిమంతుడు, మదుడు మొదలగు శివుని కింకరులు ఇతరులగు పార్షదులతో మరియు యక్షులతో గూడినవారై, వేల సంఖ్యలో నందీశ్వరుని ముందిడుకొని, వేగముగా ఆమెను అనుసరించి వెళ్లిరి. శివుని అనుచరులగుటచే వారు నిర్భయులే అయిననూ, సతీదేవిని చూచి వారికి దుఃఖము ముంచుకు వచ్చెను.

తాం సారికాకందుకదర్పణాంబుజ-
శ్వేతాతపత్రవ్యజనస్రగాదిభిః ।
గీతాయనైర్దుందుభిశంఖవేణుభి-
ర్వృషేంద్రమారోప్య విటంకితా యయుః ॥ 5

తామ్ - ఆ సతీదేవిని, వృషేంద్రమ్ - వృషభరాజగు నందీశ్వరుని, ఆరోప్య - ఎక్కించి, సారికాకందుకదర్పణ-అంబుజశ్వేత-ఆతపత్రవ్యజనస్రక్-ఆదిభిః - పక్షి బంతి అద్దము పద్మము తెల్లని గొడుగు వింజామర పుష్పమాల మొదలగువాటితో, గీత-ఆయనైః - సంగీతసాధనములతో, దుందుభిశంఖవేణుభిః - భేరీలు శంఖములు పిల్లనగ్రోవులతో, విటంకితాః - శోభ చేకూర్చబడినవారై, యయుః - వెళ్లిరి.

వారు ఆ సతీదేవిని నందీశ్వరునిపై అధిష్ఠింపజేసిరి. వారు మైనా పక్షి (ముద్దుగా కబుర్లు చెప్పే పక్షి), బంతి మొదలగు వినోదసాధనములను, అద్దము పద్మము పుష్పమాల మొదలగు అలంకరణసామగ్రిని, తెల్లని గొడుగు వింజామరలు మొదలగు మహారాజచిహ్నములను దోడ్కొని వెళ్లిరి. వారి యాత్రకు భేరీలు, శంఖములు, పిల్లన గ్రోవులు మొదలగు సంగీత సాధనములు శోభను చేగూర్చినవి.

ఆబ్రహ్మఘోషోర్జితయజ్ఞవైశసం
విప్రర్షిజుష్టం విబుధైశ్చ సర్వశః ।
మృద్దార్వయఃకాంచనదర్భచర్మభి-
ర్నిసృష్టభాండం యజనం సమావిశత్ ॥ 6

అబ్రహ్మఘోష-ఊర్జితయజ్ఞవైశసమ్ - అంతటా వేదధ్వనులతో శోభిల్లే మరియు కర్మాంతరములలో చేసే శాస్త్రవిచారములు గలిగినట్టి యు, సర్వశః - అందరు, విబుధైః - దేవతలచే, విప్ర-ఋషిజుష్టమ్ - వేద వేత్తలచే మహర్షులచే సేవించబడినది, మృత్-దారు-అయఃకాంచనదర్భచ ర్మభిః - మట్టి చెక్క ఇనుము బంగారము దర్భలు తోలు అనువాటితో, నిసృష్టభాండమ్ - నిర్మించబడిన పాత్రలు గల, యజనమ్ - యజ్ఞస్థాన మును, సమావిశత్ - ప్రవేశించెను.

దక్షుని యజ్ఞశాలలో వేదధ్వనులు మిన్ను ముట్టుచుండెను. వివిధ హోమముల మధ్యకాలములో పండితులు స్పర్ధతో శాస్త్రచర్చలను చేయు చుండిరి. ఆ యజ్ఞవాటికను అన్ని రకముల దేవతలు, వేదవేత్తలు మరియు మహర్షులు సేవించుచుండిరి. ఆ స్థానము మట్టి, చెక్క, ఇనుము, బంగార ము, దర్భలు మరియు తోలు అనువాటితో నిర్మించబడిన వివిధపాత్రలతో నిండియున్నది. అట్టి యజ్ఞస్థానములో సతీదేవి ప్రవేశించెను.

తామాగతాం తత్ర న కశ్చనాఽఽద్రియ-
ద్విమానితాం యజ్ఞకృతో భయాజ్జనః ।
ఋతే స్వసౄర్వై జననీం చ సాదరాః
ప్రేమాశ్రుకంఠ్యః పరిషస్వజుర్ముదా ॥ 7

తత్ర - అచటకు, ఆగతామ్ - వచ్చినట్టియు, విమానితామ్ - అవ మానించబడిన, తామ్ - ఆ సతీదేవిని, స్వసౄః - అక్కచెల్లెళ్లను, జననీం చ వై ఋతే - తల్లిని కూడ నిశ్చయముగా మినహాయించి, కశ్చన - ఏ ఒక్కరైననూ, జనః - వ్యక్తి, యజ్ఞకృతః - యజ్ఞమును చేయుచున్న దక్షుని వలని, భయాత్ - భయము వలన, న ఆద్రియత్ - ఆదరించలేదు, ప్రేమ -అశ్రుకంఠ్యః - ప్రేమతో కన్నీళ్లను విడిచే మరియు బొంగురుపోయిన కంఠములు గల ఆ అక్కచెల్లెళ్లు మరియు తల్లి, స-ఆదరాః - ఆదరముతో కూడినవారై, ముదా - ఆనందముతో, పరిషస్వజుః - కౌగిలించుకొనిరి.

అక్కడకు చేరుకున్న సతీదేవిని దక్షుడు అవమానించెను. ఆమె తల్లి, అక్కచెల్లెళ్లను మినహాయించి, యజ్ఞమును చేయుచున్న దక్షుని

భయము వలన, ఏ ఒక్కరైననూ ఆమెను ఆదరించలేదు. అక్కచెల్లెళ్లు, తల్లి మాత్రము ఆమె రాకకు చాల సంతోషించిరి. ప్రేమతో వారి కన్నులలో నీరు నిండెను. వారి కంఠములు బొంగురుపోయెను. వారామెను కౌగిలించు కొనిరి.

సౌదర్యసంప్రశ్నసమర్థవార్తయా
మాత్రా చ మాతృష్వసృభిశ్చ సాదరమ్ ।
దత్తాం సపర్యాం వరమాసనం చ సా
నాదత్త పిత్రాఽప్రతినందితా సతీ ॥ 8

పిత్రా - తండ్రిచే, అప్రతినందితా - ఆదరముగా స్వీకరించబడని, సా - ఆ, సతీ - సతీదేవి, సౌదర్యసంప్రశ్నసమర్థవార్తయా - ఒకే తల్లి కడుపున పుట్టిన కారణముగా అక్కచెల్లెళ్ల చక్కని కుశలప్రశ్నతో మరియు యోగ్యమగు సంభాషణముతో, మాత్రా - తల్లిచే, మాతృష్వసృభిః చ - తల్లియొక్క తోబుట్టువులచే, సాదరమ్ - ఆదరపూర్వకముగా, దత్తామ్ - ఈయబడిన, సపర్యామ్ - పరిచర్యను, చ - మరియు, వరమ్ - శ్రేష్ఠమగు, ఆసనమ్ - ఆసనమును, న ఆదత్త - స్వీకరించలేదు.

తండ్రియగు దక్షుడు ఆ సతీదేవిని ఆదరపూర్వకముగా ఆహ్వానించలేదు. కాని, ఒకే తల్లి కడుపున పుట్టినవారగుటచే అక్కచెల్లెళ్లు కుశలప్రశ్నలను వేసి యథోచితమగు పలుకులను పలికిరి. ఆమె తల్లి, తల్లి తోబుట్టువులు ఆమెను ఆదరపూర్వకముగా లోపలికి గొనిపోయి పరిచర్యను చేసి, ఉత్తమమగు ఆసనమును సమర్పించిరి. కాని, తండ్రి అవమానించిన కారణముగా, సతీదేవి ఆ పరిచర్యలను గాని, ఆసనమును గాని స్వీకరించలేదు.

అరుద్రభాగం తమవేక్ష్య చాధ్వరం
పిత్రా చ దేవే కృతహేలనం విభౌ ।
అనాదృతా యజ్ఞసదస్యధీశ్వరీ
చుకోప లోకానివ ధక్ష్యతీ రుషా ॥ 9

అరుద్రభాగమ్ - రుద్రునకు హవిర్భాగములు లేని, తమ్ - ఆ, అధ్వరమ్ - యజ్ఞమును, పిత్రా - తండ్రిచే, విభౌ - సర్వసమర్థుడగు, దేవే - శివదేవునియందు, కృతహేలనమ్ - చేయబడిన అవమానమును, అవేక్ష్య - చూచి, యజ్ఞసదసి - యజ్ఞవాటికయందు, అనాదృతా - అనాదరము చేయబడినదై, అధి-ఈశ్వరీ - సర్వలోకములకు ఈశ్వరియగు ఆ సతీదేవి, లోకాన్ - లోకములను, రుషా - కోపముతో, ధక్ష్యతీ ఇవ - తగులబెట్టబోవుచున్నదా యన్నట్లు, చుకోప - కోపించెను.

ఆ యజ్ఞములో రుద్రునకు హవిర్భాగములు సమర్పింపబడలేదు. తండ్రి ఆ విధముగా సర్వసమర్థుడగు శివదేవుని అవమానించుటను సర్వలోకములకు అధీశ్వరియగు సతీదేవి స్వయముగా చూచెను. పైగా, దక్షుడు యజ్ఞవాటికలో ఆమెను కూడ అవమానించి యుండెను. అపుడామె తీవ్రమగు కోపమును పొందెను. ఆమె ఆ కోపముతో లోకములను తగులబెట్టబోవుచున్నదా యన్నట్లు ఉండెను.

జగర్హ సాऽమర్షవిపన్నయా గిరా
శివద్విషం ధూమపథశ్రమస్మయమ్ ।
స్వతేజసా భూతగణాన్ సముత్థితా-
న్నిగృహ్య దేవీ జగతోऽభిశృణ్వతః ॥ 10

సా - ఆ, దేవీ - సతీదేవి, సముత్థితాన్ - లేచి నిలబడిన, భూతగణాన్ - ప్రమథగణములను, స్వతేజసా - తన తేజస్సుచే, నిగృహ్య - ఆపి, జగతః - అక్కడి జనము, అభిశృణ్వతః - వినుచుండగా, ధూమపథశ్రమస్మయమ్ - పొగతో నిండియున్న కర్మమార్గమునందు శ్రమ పడుతూ గర్వించియున్న, శివద్విషమ్ - శివుని ద్వేషించే దక్షుని, అమర్షవిపన్నయా - కోపముతో తడబాటు గల, గిరా - వాక్కుతో, జగర్హ - నిందించెను.

సతీదేవి కోపమును చూచి ప్రమథగణములు లేచి నిలబడినవి. అపుడామె వారివైపు తీక్ష్ణముగా చూడగనే, వారు ఆగిపోయిరి. పొగ (అజ్ఞానము) తో నిండియున్న కర్మమార్గములో శ్రమిస్తూ గర్వించి శివుని

ద్వేషించే తండ్రిని చూచి, ఆమె అక్కడి జనులు అందరు వినుచుండగా, కోపముతో తడబాటు పడుచున్న పలుకులతో ఆతనిని నిందించెను.

శ్రీదేవ్యువాచ ।
న యస్య లోకేఽస్త్యతిశాయనః ప్రియ-
స్తథాఽప్రియో దేహభృతాం ప్రియాత్మనః ।
తస్మిన్ సమస్తాత్మని ముక్తవైరకే
ఋతే భవంతం కతమః ప్రతీపయేత్ ।। 11

లోకే - ఈ లోకమునందు, దేహభృతామ్ - దేహధారులకు, ప్రియ-ఆత్మనః - ప్రియమగు ఆత్మయే అయి ఉన్న, యస్య - ఏ శివునకు, అతిశాయనః - అతిశయించినవాడు, న అస్తి - లేడో, ప్రియః - ఇష్టమైనవాడు, తథా - మరియు, అప్రియః - ఇష్టము కానివాడు, న అస్తి - లేడో, సమస్త-ఆత్మని - సర్వమునకు ఆత్మరూపుడైయున్న, ముక్తవైరకే - విడిచి పెట్టబడిన వైరము కలిగిన, ఋతే - సత్యస్వరూపుడగు, తస్మిన్ - ఆ శివునియందు, భవంతం ఋతే - నిన్ను మినహాయించి, కతమః - ఎవ్వాడు, ప్రతీపయేత్ - ప్రతికూలముగా చేయును?

శ్రీసతీదేవి ఇట్లు పలికెను --- ఈ సృష్టిలోని సకలప్రాణులలో ఆ శివుడే ఆత్మరూపుడై యున్నాడు. కావున, ఈ సృష్టిలో ఆయనకంటె మొనగాడు మరియొకడు లేడు. అదే విధముగా, సకలప్రాణులకు ఆత్మయే అయి ఉన్న ఆయనకు ఒకడు ప్రియుడనియు, మరియొకడు ద్వేష్యుడనియు భేదము లేదు. మరియు, సత్యస్వరూపుడగు ఆ శివునకు ఎవరితోనైననూ విరోధము లేదు. అట్టి ఆ శివునకు ప్రతికూలమును నీవు తప్ప మరియెవ్వరు ఆచరించెదరు?

దోషాన్ పరేషాం హి గుణేష్వసాధవో
గృహ్ణంతి కేచిన్న భవాదృశా ద్విజ ।
గుణాంశ్చ ఫల్గూన్ బహులీకరిష్ణవో
మహత్తమాస్తేష్వవిదద్భవానఘమ్ ।। 12

ద్విజ - ఓయీ బ్రాహ్మణా!, భవాదృశాః - నీవంటి, అసాధవః - దుష్టులు, కేచిత్ - కొందరు, పరేషామ్ - ఇతరుల, గుణేషు - గుణముల యందు, దోషాన్ - దోషములను, గృహ్ణంతి హి - గ్రహించెదరు గదా!, న గుణాన్ - గుణములను గ్రహించరు, మహత్తమాః - మహాత్ములు, ఫల్గూన్ - అల్పములగు, గుణాన్ చ - గుణములను కూడ, బహులీకరిష్ణవః - గొప్పగా చేయుదురు, భవాన్ - నీవు, తేషు - అట్టివారియందు, అఘమ్ - పాపమును, అవిదత్ - పొందితివి.

ఓయీ! నేను బ్రాహ్మణుడను అని నీవు విర్రవీగుచున్నావు. నీవంటి దుష్టులు (అధములు) ఇతరుల గుణములయందు కూడ దోషములను దర్శించెదరే గాని, ఇతరుల గుణములను దర్శించలేరు. మధ్యరకమునకు చెందినవారు ఇతరుల గుణదోషములను యథాతథ ముగా స్వీకరించెదరు. సాధుపురుషులు ఇతరుల దోషములను విడిచిపెట్టి, గుణములను మాత్రమే చూచెదరు. కాని, మహాత్ములు ఇతరుల దోషము లను దర్శించకపోవుట మాత్రమే గాక, వారి అల్పములగు గుణములను కూడ గొప్పవిగా స్వీకరించెదరు. అట్టి మహాత్ముల విషయములో నీవు అప రాధమును చేసి పాపమును మూటగట్టుకొంటివి.

నాశ్చర్యమేతద్యదసత్సు సర్వదా
మహద్వినిందా కుణపాత్మవాదిషు ।
సేర్ష్యం మహాపూరుషపాదపాంసుభి-
ర్నిరస్తతేజస్సు తదేవ శోభనమ్ ।। 13

కుణప-ఆత్మవాదిషు - శవమువంటి శరీరమే ఆత్మ అని స్వీక రించే స్వభావము గల, అసత్సు - దుష్టులయందు, యత్ - ఏ, స-ఈ ర్ష్యమ్ - ఓర్వలేనితనముతో కూడిన విధముగా, సర్వదా - అన్ని కాలముల లో, మహత్-వినిందా - మహాత్ములను అధికముగా నిందించుట గలదో, ఏతత్ - ఇది, న ఆశ్చర్యమ్ - ఆశ్చర్యము కాదు, మహాపూరుషపాదపాం సుభిః - మహాత్ముల పాదరేణువులచే, నిరస్తతేజస్సు - తిరస్కరించబడిన తేజస్సు గల ఆ దుష్టులయందు, తత్ ఏవ - ఆ నిందయే, శోభనమ్ - శోభను చేకూర్చునది.

శవమువంటి శరీరమే ఆత్మయని స్వీకరించే స్వభావము గల దుష్టులు సర్వకాలములలో ఓర్వలేనితనమును కలిగియుందురు. వారు మహాత్ములను అధికముగా నిందించుటలో ఆశ్చర్యము లేదు. కాని, అట్టి దుష్టుల తేజస్సును తుడిచిపెట్టుటకు ఆ మహాత్ముల పాదధూళియే చాలును. పైగా, ఆ దుష్టులకు అట్టి మహాత్ముల నింద కాలక్రమములో కలిగే శిక్ష ద్వారా శోభను కూడ చేగూర్చును. మరియు, దుష్టుల నింద వలన మహాత్ముల శోభ ఇనుమడించునే గాని, వారికి అపకీర్తి లేదు.

యద్ద్వ్యక్షరం నామ గిరేరితం నృణాం
సకృత్ప్రసంగాదఘమాశు హంతి తత్ ।
పవిత్రకీర్తిం తమలంఘ్యశాసనం
భవానహో ద్వేష్టి శివం శివేతరః ॥ 14

యత్ - ఎవ్వాని, తత్ - ప్రసిద్ధమైన, ద్వి-అక్షరమ్ - రెండు అక్షరములు గల, నామ - పేరు, సకృత్ - ఒక్కసారి, ప్రసంగాత్ - ప్రసంగవశమున, గిరా - వాక్కుచే, ఈరితమ్ - పలుకబడినదై, నృణామ్ - మానవులకు, ఆశు - వెంటనే, అఘమ్ - పాపమును, హంతి - పోగొట్టునో, పవిత్రకీర్తిమ్ - పావనము చేయు కీర్తి గలిగినట్టియు, అలంఘ్యశాసనమ్ - ఉల్లంఘించ శక్యము కాని శాసనము కలిగిన, శివమ్ - శివుని, శివ-ఇతరః - పాపరూపుడవగు, భవాన్ - నీవు, ద్వేష్టి - ద్వేషించుచున్నావు, అహో - ఆశ్చర్యము!

శివ అనే రెండు అక్షరముల నామము వేదశాస్త్రములలో ప్రసిద్ధమై యున్నది. దానిని మానవులు బుద్ధిపూర్వకముగా కాకున్ననూ, ప్రసంగవశముచేనైననూ ఒక్కసారి నోటితో ఉచ్చరించినచో, వారి పాపములు వెంటనే నశించును. శివుని కీర్తిని గానము చేయుటచే మానవుడు పావనుడగును. ఆయన ఆజ్ఞను ఉల్లంఘించగలవారు సృష్టిలో లేరు. అట్టి మంగళకరుడగు శివుని కూడ నీవు ద్వేషించుచున్నావు. ఇది ఆశ్చర్యము! నీవు పాపరూపుడవు, అమంగళకరుడవు.

యత్పాదపద్మం మహతాం మనోఽలిభి-
　ర్నిషేవితం బ్రహ్మరసాసవార్థిభిః ।
లోకస్య యద్వర్షతి చాశిషోఽర్థిన-
　స్తస్మై భవాన్ ద్రుహ్యతి విశ్వబంధవే ॥ 15

మహతామ్ - మహాత్ములయొక్క, బ్రహ్మరస-ఆసవ-అర్థిభిః - బ్రహ్మానందము అనే తేనెయందు కోరిక గల, మనః-అలిభిః - మనస్సులు అనే తుమ్మెదలచే, యత్-పాదపద్మమ్ - ఏ శివుని పద్మమువంటి పాదము, నిషేవితమ్ - నిరంతరముగా సేవించబడినదో, చ - మరియు, అర్థినః - కోరిక గల, లోకస్య - మానవునకు, యత్ - ఎయ్యది, ఆశిషః - కోరికలను, వర్షతి - వర్షించునో, తస్మై - అట్టి, విశ్వబంధవే - జగత్తునకు తండ్రియగు శివుని కొరకు, భవాన్ - నీవు, ద్రుహ్యతి - ద్రోహమును తలపెట్టుచున్నావు.

తుమ్మెదలు తేనెకొరకై పద్మము చుట్టూ తిరుగును. అదే విధముగా, బ్రహ్మానందమును ఆస్వాదించగోరే మహాత్ముల మనస్సులు పద్మమును బోలియుండు శివుని పాదములను నిరంతరముగా ధ్యానించుచుండును. ఆ శివుని పాదములు భక్తజనులకు కోరికలను వర్షించుచుండును. జగత్తునకు తండ్రియగు అట్టి శివుని నీవు ద్వేషించుచున్నావు.

కిం వా శివాఖ్యమశివం న విదుస్త్వదన్యే
　బ్రహ్మాదయస్తమవకీర్య జటాశ్శ్మశానే ।
తన్మాల్యభస్మనృకపాల్యవసత్పిశాచై-
　ర్యే మూర్ధభిర్దధతి తచ్చరణావసృష్టమ్ ॥ 16

త్వత్-అన్యే - నీకంటె ఇతరులగు, బ్రహ్మ-ఆదయః - బ్రహ్మ మొదలగువారలు, తమ్ - ఆ శివుని, శివ-ఆఖ్యమ్ - శివుడు అనే పేరుగల, అశివమ్ - అమంగళరూపునిగా, కిం వా న విదుః - తెలియకున్నారా యేమి?, శ్మశానే - శ్మశానమునందు, జటాః - జటలను, అవకీర్య - విరబోసుకొని, తత్-మాల్యభస్మనృకపాలీ - ఆ శ్మశానమునందలి మాలలను భస్మను మనుజుల పుర్రెను కలిగియున్నవాడై, పిశాచైః - పిశాచములతో

గూడి, అవసత్ - నివసించినాడో, యే - ఏ బ్రహ్మాదులు, తత్-చరణ-అవ సృష్టమ్ - ఆయన పాదములనుండి జారినదానిని, మూర్ధభిః - శిరస్సుల చే, దధతి - ధరించుచున్నారో.

శంకరుడు పేరుకి శివుడు (మంగళకరుడు) అయినా, వాస్తవ ములో అశివుడు (అమంగళరూపుడు) అని నీవు చెప్పితివి. ఈ సంగతి నీకే గాని, బ్రహ్మగారు మొదలగు వారికి తెలియదా యేమి? ఏలయనగా, ఆ శివుడు జటలను విరబోసుకొని పిశాచములతో బాటు శ్మశానములో మకాము చేసియున్నాడు. పైగా, శ్మశానములోని మాలలను, భస్మను, మనుజుల పుర్రెను ధరించినాడు. కాని, ఆ బ్రహ్మాదులు ఆయన పాదముల నిర్మాల్యమును తమ శిరస్సులపై ధరించుచున్నారు. నీకు తెలిసిన సత్యము వారికి తెలియదా యేమి?

కర్ణౌ పిధాయ నిరయాద్యదకల్ప ఈశే
ధర్మావితర్యసృణిభిర్నృభిరస్యమానే ।
ఛింద్యాత్ప్రసహ్య రుశతీమసతీం ప్రభుశ్చే-
జ్జిహ్వామసూనపి తతో విసృజేత్స ధర్మః ॥ 17

ధర్మ-అవితరి - ధర్మమును రక్షించే, ఈశే - ఈశ్వరుడు, అసృ ణిభిః - నిరంకుశులగు, నృభిః - మానవులచే, అస్యమానే - తిట్టబడుచుం డగా, అకల్పః యత్ - సమర్థుడు కానిచో, కర్ణౌ - చెవులను, పిధాయ - మూసుకొని, నిరయాత్ - నిష్క్రమించవలెను, ప్రభుః చేత్ - సమర్థుడైన చో, రుశతీమ్ - చెడుకూతలను కూసే, అసతీమ్ - దుష్టమగు, జిహ్వామ్ - నాలుకను, ప్రసహ్య - బలాత్కారముగా, ఛింద్యాత్ - కోసివేయవలెను, తతః - తరువాత, అసూన్ అపి - ప్రాణములను కూడ, విసృజేత్ - విడిచి పెట్టవలెను, సః - అది, ధర్మః - ధర్మము.

ధర్మరక్షకుడు, జగన్నాథుడు అగు శివుని సభలోని జనులు నిందిం చినప్పుడు, ఆ నిందలను విన్న భక్తుడు సమర్థుడు కానిచో, అక్కడనుండి నిష్క్రమించవలెను. లేదా, ఆ వ్యక్తి సమర్థుడైనచో, చెడుకూతలను కూసే

ఆ నాలుకను కోసివేయవలెను. అట్లు చేయక, నిందలను విన్నచో, ప్రాణములను విడిచిపెట్టవలెను. ధర్మము ఈ మూడు విధములుగా నున్నది.

అతస్తవోత్పన్నమిదం కలేవరం
న ధారయిష్యే శితికంఠగర్హిణః ।
జగ్ధస్య మోహాద్ధి విశుద్ధిమంధసో
జుగుప్సితస్యోద్ధరణం ప్రచక్షతే ॥ 18

అతః - ఇందువలన, శితికంఠగర్హిణః - నీలకంఠుని నిందించే స్వభావము గల, తవ - నీకు, ఉత్పన్నమ్ - పుట్టిన, ఇదమ్ - ఈ, కలేవరమ్ - శరీరమును, న ధారయిష్యే - ధరించియుండను, హి - ఏలయనగా, మోహాత్ - భ్రమ వలన, జగ్ధస్య - తినబడిన, జుగుప్సితస్య - హేయమైన, అంధసః - అన్నమునకు, ఉత్-హరణమ్ - బయటకు వమనము చేయుటనే, విశుద్ధిమ్ - విశుద్ధినిగా, ప్రచక్షతే - చెప్పుచున్నారు.

దేవతలకు ఉపకారమును చేయుటకొరకై విషమును త్రాగి నీలకంఠుడైన శివుని నిందించుటయే నీవు పనిగా పెట్టుకున్నావు. కావున, నేను నీనుండి పుట్టిన ఈ దేహమును ధరించియుండను. ఏలయనగా, భ్రమ వలన ఒకడు తినకూడని ఆహారమును తిన్నచో, వమనము చేయుటయే దానికి విరుగుడు అని పెద్దలు చెప్పెదరు.

న వేదవాదాననువర్తతే మతి-
స్స్వ ఏవ లోకే రమతో మహామునేః ।
యథా గతిర్దేవమనుష్యయోః పృథక్
స్వ ఏవ ధర్మే న పరం క్షిపేత్ స్థితః ॥ 19

స్వే - ఆత్మ అనే, లోకే ఏవ - లోకమునందు మాత్రమే, రమతః - రమించే, మహామునేః - గొప్ప మననశీలుడగు జ్ఞానియొక్క, మతిః - బుద్ధి, వేదవాదాన్ - వేదముచే చెప్పబడిన విధినిషేధములను, న అనువర్తతే - అనుసరించదు, దేవమనుష్యయోః - దేవతలకు మరియు మనుష్యులకు, గతిః - గమనము, యథా - ఏ విధముగానైతే, పృథక్ - వేర్వేరుగా

నున్నదో, స్వే - తనదైన, ధర్మే ఏవ - ధర్మమునందు మాత్రమే, స్థితః - నిలిచియున్న వ్యక్తి, పరమ్ - పరధర్మమును, న క్షిపేత్ - నిందించరాదు.

గొప్ప మననశీలుడగు జ్ఞాని ఆత్మ అనే లోకమునందు మాత్రమే నిష్ఠను పొంది ఆనందమునందు నిమగ్నులై యుండును. అట్టి జ్ఞాని యొక్క బుద్ధి వేదోక్తములగు విధినిషేధములయందు ప్రవర్తిల్లదు. అనగా, ఆతడు వేదోక్తములగు విధినిషేధములకు అతీతుడు. దేవతలు, మనుష్యులు ఒకే మార్గములో సంచరించుట లేదు. అదే విధముగా కర్మఠులు, జ్ఞానులు ఒకే పద్ధతిలో జీవించుట లేదు. మానవుడు ఈ సత్యమును గుర్తించి, తాను తనకు ఉద్దేశించబడిన ధర్మమును అనుష్ఠించవలెను. అంతేగాని, ఇతరులను తన ధర్మము అనుష్ఠించని కారణముగా గాని, లేక మరియొక ధర్మమును అనుష్ఠించుచున్న కారణముగా గాని, నిందించరాదు.

కర్మ ప్రవృత్తం చ నివృత్తమప్యృతం
వేదే వివిచ్యోభయలింగమాశ్రితమ్ ।
విరోధి తద్యౌగపదైకకర్తరి
ద్వయం తథా బ్రహ్మణి కర్మ నర్ఛతి ॥ 20

ప్రవృత్తమ్ - అగ్నిహోత్రము మొదలగు ప్రవృత్తిరూపమైనది, నివృత్తం చ - శమదమాదిరూపమగు నివృత్తిరూపమైనది అగు, కర్మ - కర్మ, ఋతమ్ - సత్యమే, ఉభయలింగం అపి - రాగము వైరాగ్యము అనే రెండు విశేషాధికారములే చిహ్నముగా గల ఈ రెండు విధముల కర్మ, వేదే - వేదమునందు, వివిచ్య - యుక్తియుక్తముగా విభాగము చేసి, ఆశ్రితమ్ - విధించబడినది, తత్ - ఆ రెండు విధముల కర్మ, యౌగపద-ఏకకర్తరి - ఒకే కాలములో రెండింటినీ ఆచరించబూనుకునే వ్యక్తియందు, విరోధి - విరోధము గలది, తథా - అదే విధముగా, బ్రహ్మణి - పరబ్రహ్మయందు, ద్వయమ్ - రెండు విధముల, కర్మ - కర్మ, న ఋచ్ఛతి - ప్రాప్తమగుట లేదు.

కర్మ ప్రవృత్తి, నివృత్తి అని రెండు విధములుగా నున్నది. విషయ సుఖములయందు రాగము గల వ్యక్తికి అగ్నిహోత్రము మొదలగు స్వర్గపా

ధనములగు కర్మలను వేదము విధించినది. వైరాగ్యము గలవానికి అదే వేదము శమదమాది నివృత్తిరూపమగు కర్మను విధించినది. ఈ రెండు మార్గములు పరస్పరము విరుద్ధములగుటచే, ఒకే వ్యక్తి ఒకే కాలము నందు ఈ రెండింటినీ కలిపి అనుష్ఠించుట సంభవము కాదు. అంతేగాక, పరబ్రహ్మయగు శివునియందు ఈ రెండు విధముల మార్గములు అన్వయించవు. అనగా, శివుడు ప్రవృత్తి మార్గమును గాని, నివృత్తి మార్గమును అనుసరించ దగిన ఆవశ్యకత లేదు.

మా వః పదవ్యః పితరస్మదాస్థితా
యా యజ్ఞశాలాసు న ధూమవర్త్మభిః ।
తదన్నతృప్తైరసుభృద్భిరీడితా
అవ్యక్తలింగా అవధూతసేవితాః ॥ 21

పితః - ఓ తండ్రీ!, అస్మత్-ఆస్థితాః - మాచే ఆశ్రయించబడునవి అగు, పదవ్యః - సిద్ధులు, వః - మీకు, మా - లేవు, యాః - ఏ సిద్ధులు, యజ్ఞశాలాసు - యజ్ఞశాలలయందు, న - ఉండవో, ధూమవర్త్మభిః - దక్షిణమార్గములో పయనించే, (యజ్ఞశాలాసు - యజ్ఞశాలలయందు, ధూమవర్త్మభిః - పొగయే జీవనవిధానముగా గల), తత్-అన్నతృప్తైః - ఆ యజ్ఞముల ఫలములచే సంతోషపడే (ఆ యజ్ఞాన్నమును తిని సంతోషించే), అసుభృద్భిః - ఇంద్రియపోషకులైనవారిచే (ప్రాణపోషణమును చేసుకొనే వారిచే), న ఈడితాః - స్తుతించబడనివి, అవ్యక్తలింగాః - ప్రకటము కాని లక్షణములు గలవి, అవధూతసేవితాః - బ్రహ్మవేత్తలచే సేవించబడేవి.

ఓ తండ్రీ! మాకు (నాకు, శివునకు) ఉండే అణిమాది సిద్ధులు బయటకు ప్రకటము కావు. ఆ సిద్ధులను కేవలము బ్రహ్మవేత్తలు మాత్రమే కలిగియుందురు. ఇంద్రియభోగములయందు లాలసులైన నీవంటి వారలు యజ్ఞశాలలయందు కామ్యకర్మలను చేస్తూ, ఆ పొగలో మ్రగ్గుతూ, ఆ యజ్ఞాన్నమును తిని తృప్తిని చెందెదరు. నీవంటి వారకు మా సిద్ధుల మహిమ అవగతము కాదు. నీవంటి వారలు దక్షిణమార్గములో స్వర్గాదిలోకములను పొంది అచట కర్మఫలరూపములగు అల్పభోగములననుభవించి, మరల జన్మించెదరు. నీవంటి వారలకు శివుని మహిమ గోచరము కాదు.

నైతేన దేహేన హరే కృతాగసో
దేహోద్భవేనాలమలం కుజన్మనా।
వ్రీడా మమాభూత్కుజనప్రసంగత-
స్తజ్జన్మ ధిగ్యో మహతామవద్యకృత్ ।। 22

హరే - శివునియందు, కృత-ఆగసః - చేయబడిన పాపము గల నీ, దేహ-ఉద్భవేన - దేహమునుండి పుట్టిన, అలమ్ - మిక్కిలి, కుజన్మనా - నిందితమగు పుట్టుక గల, ఏతేన - ఈ, దేహేన - దేహముతో, న అలమ్ - ప్రయోజనమేమియు లేదు, కుజనప్రసంగతః - దుష్టజనుడవగు నీతోడి ప్రసంగము వలన, మమ - నాకు, వ్రీడా - సిగ్గు, అభూత్ - కలిగినది, యః - ఎవడైతే, మహతామ్ - మహాత్ములకు, అవద్యకృత్ - అపరాధమును చేసినాడో, తత్ - అట్టివాని వలని, జన్మ - పుట్టుకను గురించి, ధిక్ - నింద యగుగాక!

నీవు శివుని యెడల పాపమునాచరించినావు. అట్టి నీ దేహము వలన జన్మించిన ఈ నా దేహము మిక్కిలి నింద్యమైనది. దీనితో నాకు ప్రయోజనమేమియు లేదు. దుష్టుడవగు నీతో ప్రసంగించినందులకు నాకు సిగ్గు వేయుచున్నది. శివునివంటి మహాత్ముల యెడల అపరాధమును చేసిన నీ వలన కలిగిన ఈ నా జన్మ నిందనీయము.

గోత్రం త్వదీయం భగవాన్ వృషధ్వజో
దాక్షాయణీత్యాహ యదా సుదుర్మనాః ।
వ్యపేతనర్మస్మితమాశు తద్యహం
వ్యుత్స్రక్ష్య ఏతత్కుణపం త్వదంగజమ్ ।। 23

యదా - ఏ కాలమునందైతే, వృషధ్వజః - వృషభము ధ్వజమునందు చిహ్నముగా గల (ధర్మస్వరూపుడగు), భగవాన్ - శివ భగవానుడు, దాక్షాయణీ ఇతి - దక్షుని కుమార్తె అని, త్వదీయమ్ - నీకు సంబంధించిన, గోత్రమ్ - పేరును, ఆహ - పలుకునో, (తదా - అప్పుడు), అహమ్ - నేను, వ్యపేతనర్మస్మితమ్ - తొలగిన పరిహాసము చిరునవ్వు కలుగునట్లు గా, సుదుర్మనాః - మిక్కిలి ఖేదమును పొందిన మనస్సు గలదానను,

తత్ - అందువలన, త్వత్-అంగజమ్ - నీ దేహమునుండి పుట్టిన, ఏతత్ - ఈ, కుణపమ్ - శవప్రాయమగు దేహమును, ఆశు - వెంటనే, వ్యుత్స్రక్ష్యే - విడిచిపెట్టెదను.

శివుని ధ్వజమునందు వృషభము చిహ్నముగా నుండును. ఆయన ధర్మరక్షకుడు. అప్పుడప్పుడు ఆ భగవానుడు నన్ను దాక్షాయణి (దక్షుని కుమార్తె) అని పిలిచెడివాడు. ఆ సమయములలో నాలోని పరిహాసము తొలగిపోయి, చిరునవ్వు మాయమై, నేను మనస్సులో చాల ఖేదమును పొందెడిదానను. కావున, నీ దేహమునుండి పుట్టిన శవప్రాయమగు ఈ శరీరమును నేను వెంటనే విడిచిపెట్ట బోవుచున్నాను.

మైత్రేయ ఉవాచ ।
ఇత్యధ్వరే దక్షమనూద్య శత్రుహన్
క్షితావుదీచీం నిషసాద శాంతవాక్ ।
స్పృష్ట్వా జలం పీతదుకూలసంవృతా
నిమీల్య దృగ్యోగపథం సమావిశత్ ।। 24

శత్రుహన్ - శత్రువులను సంహరించినవాడా!, ఇతి - ఈ విధముగా, అధ్వరే - యజ్ఞమునందు, దక్షమ్ - దక్షుని ఉద్దేశించి, అనూద్య - పలికి, జలమ్ - నీటిని, స్పృష్ట్వా - స్పృశించి, పీతదుకూలసంవృతా - పచ్చని వస్త్రముచే కప్పబడినది, శాంతవాక్ - విరమించబడిన పలుకులు గలది అగు సతీదేవి, ఉదీచీమ్ - ఉత్తరదిక్కునందు, క్షితౌ - నేలపై, నిషసాద - కూర్చుండెను, దృక్ - కన్నులను, నిమీల్య - మూసుకొని, యోగపథమ్ - యోగమార్గమును, సమావిశత్ - ప్రతిష్ఠితురాలయ్యెను.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- కామము, క్రోధము మొదలగు అంతశ్శత్రువులను జయించిన ఓ విదురా! ఈ విధముగా యజ్ఞశాలలో ఆ సతీదేవి దక్షునితో పలికి, వెంటనే పలుకులను విరమించెను. ఆమె పచ్చని వస్త్రమును కప్పుకున్నదై ఆచమనమును చేసి, ఉత్తరదిక్కు వైపు తిరిగి నేలపై కూర్చుండి, కన్నులను మూసుకొని యోగమార్గములో సమాధిస్థితిని పొందెను.

కృత్వా సమానావనిలౌ జితాసనా
సోదానముత్థాప్య చ నాభిచక్రతః ।
శనైర్హృది స్థాప్య ధియోరసి స్థితం
కంఠాద్భ్రువోర్మధ్యమనిందితాऽనయత్ ॥ 25

అనిందితా - దోషములు లేని, సా- ఆ సతీదేవి, జిత-ఆసనా - జయించబడిన ఆసనము గలదై, అనిలౌ - ఉచ్ఛ్వాసనిశ్వాసలను, సమానౌ - సమానమైనవిగా, కృత్వా - చేసి, చ - మరియు, ఉదానమ్ - ఉదానవాయువును, నాభిచక్రతః - నాభిస్థానము (మణిపూరచక్రము) నుండి, ఉత్థాప్య - పైకి లేపి, శనైః - మెల్లగా, హృది - హృదయమునందు (అనాహత చక్రమునందు), స్థాప్య - స్థాపించి, ఉరసి - వక్షఃస్థలమునందు, స్థితమ్ - ఉన్న ఆ ఉదానమును, ధియా - బుద్ధితో సహా, కంఠాత్ - కంఠమునుండి, భ్రువోః - కనుబొమల, మధ్యమ్ - నడుమను, అనయత్ - పొందించెను.

దోషము లేని ఆ సతీదేవి దృఢమగు ఆసనమును బంధించి, ప్రాణాయామమును చేసి ప్రాణాపానములను సమానముగా చేసెను. అపుడామె ఉదానము (ప్రాణశక్తి శరీరమును విడుచునట్లు చేసే వాయువిశేషము) ను నాభిస్థానము (మణిపూరకచక్రము) నుండి పైకి లేపి, మెల్లగా బుద్ధితో సహా హృదయస్థానమునందలి అనాహతచక్రములో ప్రవేశపెట్టెను. అక్కడనుండి దానిని కంఠమునందలి విశుద్ధి చక్రములోనికి, కంఠమునుండి కనుబొమల మధ్యయందలి ఆజ్ఞాచక్రములోనికి ప్రవేశపెట్టెను.

ఏవం స్వదేహం మహతాం మహీయసా
ముహుస్సమారోపితమంకమాదరాత్ ।
జిహాసతీ దక్షరుషా మనస్వినీ
దధార గాత్రేష్వనిలాగ్నిధారణామ్ ॥ 26

మనస్వినీ - అభిమానవతి (ధీరురాలు) యగు సతీదేవి, మహతామ్ - మహాత్ములకు, మహీయసా - పూజనీయుడైన శివునిచే, ముహుః - అనేకపర్యాయములు, ఆదరాత్ - ప్రేమ వలన, అంకమ్ - ఒడిని, సమా

రోపితమ్ - చక్కగా అధిష్ఠింపజేయబడిన, స్వదేహమ్ - తన దేహమును దక్షరుషా - దక్షుని కోపము కారణముగా, జిహాసతీ - విడిచిపెట్ట గోరునదై, గాత్రేషు - అవయవములయందు, అనిల-అగ్నిధారణామ్ - వాయువు మరియు అగ్నియొక్క ధారణను, దధార - చేసెను.

సనకుడు మొదలగు మహాత్ములచే పూజించబడే శివుడు ప్రేమతో సతీదేవిని తన అంకముపై పలుమార్లు అధిష్ఠింపజేసెడివాడు. అభిమాన వతి మరియు ధైర్యవంతురాలు అగు సతీదేవి దక్షుని కోపము కారణముగా అట్టి తన దేహమును విడువగోరెను. ఆమె అప్పుడు యోగమార్గములో మనస్సునందు వాయువును, అగ్నిని ధారణ చేసెను.

తతస్స్వభర్తుశ్చరణాంబుజాసవం
జగద్గురోశ్చింతయతీ న చాపరమ్ ।
దదర్శ దేహో హతకల్మషా సతీ
సద్యః ప్రజజ్వాల సమాధిజాగ్నినా ॥ 27

తతః - తరువాత, జగత్-గురోః - జగత్తునకు తండ్రియగు, స్వభర్తుః - తనకు భర్తయగు శివుని, చరణ-అంబుజ-ఆసవమ్ - పాదపద్మ ముయొక్క మధువును, చింతయతీ - ధ్యానించుచున్న, సతీ - సతీదేవి, అపరమ్ - మరియొకదానిని, న దదర్శ - చూడకుండెను, హతకల్మషః - నశించిన దోషములు గల, దేహః - శరీరము, సమాధిజ-అగ్నినా - సమాధి నుండి పుట్టిన అగ్నిచే, సద్యః - వెంటనే, ప్రజజ్వాల - కాలిపోయెను.

తరువాత ఆ సతీదేవి జగత్తునకు తండ్రి, తనకు భర్తయగు శివుని పాదపద్మములను మనస్సులో ధ్యానించుచుండెను. అట్టి ధ్యానము వలన ఆమెకు అమృతమువంటి హృదయానందము కలిగెను. ఆమె సమాధియం దున్నదై బాహ్యస్పృహ లేకుండెను. ఆ ధ్యానముచే ఆమె దేహమునకు దక్షుని దేహమునుండి పుట్టుట అనే దోషము దూరమయ్యెను. అపుడా సమాధినుండి పుట్టిన అగ్ని ఆమె దేహమును శీఘ్రమే కాల్చివేసెను.

తత్పశ్యతాం ఖే భువి చాద్భుతం మహ-
ద్ధా హేతి వాదస్సుమహానజాయత ।

హంత ప్రియా దైవతమస్య దేవీ
జహావసూన్ కేన సతీ ప్రకోపితా ॥ 28

తత్ - ఆ, మహత్ - గొప్ప, అద్భుతమ్ - ఆశ్చర్యమును, ఖే - ఆకాశమునందు, భువి - భూమియందు, పశ్యతామ్ - చూచుచున్నవారల, హా హా ఇతి - అయ్యో! అయ్యో! అనే, సుమహాన్ - చాల పెద్ద, వాదః - కలకలము, అజాయత - కలిగెను, హంత - అయ్యో!, దైవతమస్య - దేవాధిదేవుడగు శివుని, ప్రియా - ప్రియురాలగు, సతీ దేవీ - సతీదేవి, కేన - దక్షప్రజాపతిచే, ప్రకోపితా - మిక్కిలి కోపమును పొందించబడినదై, అసూన్ - ప్రాణములను, జహౌ - విడిచిపెట్టెను.

దేవతలు మొదలగువారు ఆ గొప్ప ఆశ్చర్యమును చూచి, అయ్యో! అయ్యో! అంటూ బిగ్గరగా హాహాకారములను చేసిరి. అయ్యో! శివుడు దేవాధిదేవుడు. ఆయన ప్రియురాలగు సతీదేవికి దక్షప్రజాపతి తీవ్రమగు కోపము వచ్చునట్లు చేయగా, ఆమె ప్రాణములను విడిచిపెట్టెను అని పలుకుతూ, వారు చేసిన హాహాకారములు భూమిపై మరియు ఆకాశములో మారుమ్రోగినవి.

అహో అనాత్మ్యం మహదస్య పశ్యత
ప్రజాపతేర్యస్య చరాచరం ప్రజాః ।
జహావసూన్యద్విమతాత్మజా సతీ
మనస్వినీ మానమభీక్ష్ణమర్హతి ॥ 29

అహో - ఆశ్చర్యము!, అస్య - ఈ, ప్రజాపతేః - దక్షప్రజాపతి యొక్క, మహత్ - పెద్ద, అనాత్మ్యమ్ - దౌర్జన్యమును, పశ్యత - చూడుడు, యస్య - ఏ ప్రజాపతికి, చర-అచరమ్ - స్థావరజంగమములగు ప్రాణుల సమూహము, ప్రజాః - సంతానమో, యత్-విమతా - ఏ ప్రజాపతిచే అవమానించబడినదై, ఆత్మజా - కుమార్తెయగు, సతీ - సతీదేవి, అసూన్ - ప్రాణములను, జహౌ - విడిచిపెట్టెనో, మనస్వినీ - అభిమానవతి (పవిత్రహృదయము గలది) యగు ఆమె, అభీక్ష్ణమ్ - మరల మరల, మానమ్ - సమ్మానమును, అర్హతి - తగియున్నది.

ఆశ్చర్యము! సకలచరాచరప్రాణులను ప్రేమగా చూడవలసిన ఈ దక్షప్రజాపతియొక్క అతిశయించిన దౌర్జన్యమును చూడుడు. తన కుమార్తెయగు సతీదేవిని అవమానించినాడు. గొప్ప అభిమానవతియగు ఆ సతీదేవిని ఎన్ని మార్లు గౌరవించిననూ, ఆమె అట్టి గౌరవమునకు అర్హురాలే. ఈతడు అవమానించిన కారణముగా పవిత్రహృదయురాలగు ఆమె ప్రాణములను విడిచిపెట్టినది.

సోఽయం దుర్మర్షహృదయో బ్రహ్మధ్రుక్చ
లోకేఽపకీర్తిం మహతీమవాప్స్యతి ।
యదంగజాం స్వాం పురుషద్విడుద్యతాం
న ప్రత్యషేధన్మృతయేఽపరాధతః ॥ 30

దుర్మర్షహృదయః - చెడు ఆలోచనలతో నిండిన హృదయము గలవాడు, బ్రహ్మధ్రుక్ - ఈశ్వరునియెడల ద్రోహమును చేసినవాడు, పురుషద్విట్ - శివుని ద్వేషించువాడు అగు, సః - అట్టి, అయమ్ - ఈ దక్షుడు, లోకే - లోకమునందు, మహతీమ్ - పెద్ద, అపకీర్తిమ్ - అపకీర్తిని, అవాప్స్యతి - పొందగలడు, యత్ - ఎందువలననగా, అపరాధతః - తాను చేసిన తప్పు వలన, మృతయే - మరణించుట కొరకు, ఉద్యతామ్ - సంసిద్ధురాలైన, స్వ-అంగజామ్ - తన కుమార్తెను, న ప్రత్యషేధత్ - నివారించలేదు.

ఈ దక్షుని హృదయము చెడు ఆలోచనలకు పుట్ట. ఈతడు శివుని ద్వేషించి ఆయన యెడల ద్రోహమునే చేసినాడు. ఈతనికి లోకములో పెద్ద అపకీర్తి కలుగును. ఏలయనగా, ఈతడు చేసిన అవమానము వలన స్వంత కుమార్తె మరణించుటకు సిద్ధపడగా, ఈతడు ఆపే ప్రయత్నమునైననూ చేయలేదు.

వదత్యేవం జనే సత్యా దృష్ట్వాఽసుత్యాగమద్భుతమ్ ।
దక్షం తత్పార్షదా హంతుముదతిష్ఠన్నుదాయుధాః ॥ 31

జనే - జనము, ఏవమ్ - ఈ విధముగా, వదతి - పలుకుచుండగా, సత్యా - సతీదేవిచే చేయబడిన, అద్భుతమ్ - ఆశ్చర్యకరమగు, అసు

త్యాగమ్ - ప్రాణత్యాగమును, దృష్ట్వా - చూచి, తత్-పార్షదాః - ఆ రుద్రుని అనుచరులు, ఉత్-ఆయుధాః - పైకి ఎత్తబడిన ఆయుధములు గలవారై, దక్షమ్ - దక్షుని, హంతుమ్ - చంపుటకు, ఉదతిష్ఠన్ - లేచి నిల బడిరి.

జనులు ఈ విధముగా చెప్పుకొనుచుండిరి. సతీదేవి చేసిన ఆ అద్భుతమగు ప్రాణత్యాగమును చూచిన రుద్రానుచరులు ఆయుధములను దాల్చినవారై, దక్షుని సంహరించుటకు సంసిద్ధులైరి.

తేషామాపతతాం వేగం నిశామ్య భగవాన్ భృగుః ।
యజ్ఞఘ్నఘ్నేన యజుషా దక్షిణాగ్నౌ జుహావ హ ॥ 32

భగవాన్ - పూజ్యుడు (రక్షించే శక్తి గలవాడు) అగు, భృగుః - భృగుమహర్షి, ఆపతతామ్ - మీదకు పడిపోవుచున్న, తేషామ్ - ఆ రుద్రా నుచరుల, వేగమ్ - వేగమును, నిశామ్య - చూచి, దక్షిణ-అగ్నౌ - దక్షిణా గ్నియందు, యజ్ఞఘ్నఘ్నేన - యజ్ఞమును చెడగొట్టువారిని నశింపజేసే, యజుషా - యజుర్వేదమంత్రముతో, జుహావ హ - హోమమును చేసెను.

భృగు మహర్షి గొప్ప మంత్రశక్తి గలవాడు. తమ మీదకు వేగముగా దూసుకువచ్చుచున్న రుద్రానుచరులను చూచి, అతడు దక్షిణాగ్నియందు యజ్ఞమును చెడగొట్టువారిని నశింపజేసే యజుర్వేదమంత్రముతో హోమ మును చేసెను.

అధ్వర్యుణా హూయమానే దేవా ఉత్పేతురోజసా ।
ఋభవో నామ తపసా సోమం ప్రాప్తాస్సహస్రశః ॥ 33

అధ్వర్యుణా - అధ్వర్యుడగు భృగుమహర్షిచే, హూయమానే - హోమము చేయబడుచుండగా, తపసా - తపస్సుచే, సోమమ్ - చంద్రుని (సోమరసాహుతిలో భాగమును), ప్రాప్తాః - పొందియున్న, ఋభవః నామ - ఋభువులు అని ప్రసిద్ధిని గాంచిన, దేవాః - దేవతలు, సహస్రశః - వేల సంఖ్యలో, ఓజసా - వేగముతో, ఉత్పేతుః - బయల్వెడలిరి.

అధ్వర్యుడైన భృగుమహర్షి ఆ విధముగా అగ్నిలో హోమమును చేయుచుండగనే, ఋభువులు అని ప్రసిద్ధిని గాంచిన దేవతలు గొప్ప వేగముతో ఆవిర్భవించిరి. ఈ దేవతలు పూర్వము తపస్సును చేసి, చంద్రలోకమును మరియు యజ్ఞములోని సోమములో భాగమును పొందియుండిరి.

తైరలాతాయుధైస్సర్వే ప్రమథాస్సహగుహ్యకాః ।
హన్యమానా దిశో భేజురుశద్భిర్బ్రహ్మతేజసా ।। 34

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే చతుర్థస్కంధే సతీదేహోత్సర్గో నామ చతుర్థోఽధ్యాయః ।।

అలాత-ఆయుధైః - మండే కొరివెలే ఆయుధములుగా గలిగినట్టియు, బ్రహ్మతేజసా - బ్రహ్మతేజస్సుతో, ఉశద్భిః - ప్రకాశించే, తైః - ఆ దేవతలచే, సహగుహ్యకాః - యక్షులతో గూడియున్న, ప్రమథాః - రుద్రానుచరులు, సర్వే - అందరు, హన్యమానాః - కొట్టబడుచున్నవారై, దిశః - దిక్కులను, భేజుః - పొందిరి.

బ్రహ్మవర్చస్సుతో ప్రకాశించే ఆ దేవతలు మండే కర్రలనే ఆయుధములుగా పట్టుకొని, యక్షులతో కూడియున్న రుద్రానుచరులను కొట్టజొచ్చిరి. అపుడు వారతిదరు నలు దిక్కులకు పారిపోయిరి.

శ్రీమద్భాగవతములోని నాల్గవ స్కంధములో సతీదేవి ప్రాణములను విడుచుట అనే నాల్గవ అధ్యాయము ముగిసినది (4).

*****

# అథ పంచమోఽధ్యాయః

## వీరభద్రుడు దక్షయజ్ఞమును విధ్వంసము చేయుట

మైత్రేయ ఉవాచ ।
భవో భవాన్యా నిధనం ప్రజాపతే-
  రసత్కృతాయా అవగమ్య నారదాత్ ।
స్వపార్షదసైన్యం చ తదధ్వరర్భుభి-
  ర్విద్రావితం క్రోధమపారమాదధే ॥ 1

మైత్రేయః - మైత్రేయుడు, ఉవాచ - పలికెను, ప్రజాపతేః - దక్షప్రజాపతి కారణముగా, అసత్-కృతాయాః - అవమానించబడిన, భవాన్యాః - భవానియొక్క, నిధనమ్ - ప్రాణత్యాగమును, స్వపార్షదసైన్యమ్ - తన అనుచరుల సైన్యమును, తత్-అధ్వర-ఋభుభిః - ఆ దక్షుని యజ్ఞము లోని ఋభుదేవతలచే, విద్రావితమ్ - పలాయనము చేయించబడినదానిని గా, నారదాత్ - నారదుని వలన, అవగమ్య - తెలుసుకొని, భవః - శివుడు, అపారమ్ - అంతులేని, క్రోధమ్ - కోపమును, ఆదధే - చేసెను.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- దక్ష ప్రజాపతి చేసిన అవమానము కారణముగా భవపత్నియగు సతీదేవి ప్రాణత్యాగమును చేసెను. దక్షుని యజ్ఞములో ఉద్భవించిన ఋభువులనే దేవతలు రుద్రానుచరుల సైన్యము పారిపోవునట్లు చేసిరి. ఈ వృత్తాంతమునంతనూ నారదుని వలన తెలుసుకున్న శివునకు అంతు లేని కోపము కలిగెను.

క్రుద్ధస్సుదష్టౌష్ఠపుటస్స ధూర్జటి-
  ర్జటాం తడిద్వహ్నిసటోగ్రరోచిషమ్ ।

ఉత్కృత్య రుద్రస్సహసోత్థితో హసన్
గంభీరనాదో విససర్జ తాం భువి ॥ 2

క్రుద్ధః - కోపించినట్టియు, సుదష్ట-ఓష్ఠపుటః - బాగా కొరుకబడిన పెదవుల అగ్రభాగములు కలిగినట్టియు, ధూర్జటిః - కంపించుచున్న జటలు కలిగినట్టియు, రుద్రః - భయమును గొల్పు, సః - ఆ శివుడు, తడిత్-వహ్నిసటా-ఉగ్రరోచిషమ్ - మెరుపుల వలె మరియు అగ్నికీలల వలె భయమును గొల్పె కాంతులు గల, జటామ్ - జటను, ఉత్కృత్య - పీకి, సహసా - వెంటనే, ఉత్థితః - లేచి నిలబడినవాడై, హసన్ - నవ్వుచున్నవాడై, గంభీరనాదః - గంభీరమగు నాదము గలవాడై, తామ్ - ఆ జటను, భువి - నేలపై, విససర్జ - విడిచిపెట్టెను.

కంపించుచున్న జటలు గల ఆ శివుడు కోపముతో పెదవుల అగ్రములను కొరుకుచుండగా భయంకరాకారుడై కన్పట్టెను. ఆయన మెరుపువలె అగ్నికీలలవలె మెరిసిపోయే ఒక జటను తన జటాజూటమునుండి పెరికి, వెంటనే లేచి నిలబడి నవ్వుతూ గంభీరమగు నాదమును చేస్తూ, దానిని నేలపై విడిచిపెట్టెను.

తతోఽతికాయస్తనువా స్పృశన్దివం
సహస్రబాహుర్ఘనరుక్ త్రిసూర్యదృక్ ।
కరాలదంష్ట్రో జ్వలదగ్నిమూర్ధజః
కపాలమాలీ వివిధోద్యతాయుధః ॥ 3

తతః - దానినుండి, అతికాయః - పెద్ద శరీరము గలవాడు, సహస్రబాహుః - వేయి చేతులు గలవాడు, ఘనరుక్ - మేఘకాంతి వంటి కాంతి గల్గవాడు, త్రిసూర్యదృక్ - మూడు సూర్యునివంటి కన్నులు గలవాడు, కరాలదంష్ట్రః - ఎత్తైన (భయంకరమగు) కోరలు గలవాడు, జ్వలత్-అగ్నిమూర్ధజః - మండే నిప్పువంటి కేశములు గలవాడు, కపాలమాలీ - పుర్రెల మాల గలవాడు, వివిధ-ఉద్యత-ఆయుధః - అనేకములైన ఎత్తి ఉంచబడిన ఆయుధములు గలవాడు, తనువా - శరీరముతో, దివమ్ - ఆకాశమును, స్పృశన్ - స్పృశించుచున్నవాడై (ఉదయించెను).

ఆ జటనుండి పెద్ద శరీరము గల ఒక పురుషుడు ఉదయించెను. ఎత్తైన ఆ పురుషుడు తన దేహముతో ఆకాశమును స్పృశించుచున్నాడా యన్నట్లు ఉండెను. వేయి చేతులు, సూర్యునివంటి మూడు కన్నులు, ఎత్తైన భయంకరమగు కోరలు, మండే నిప్పువంటి కేశములు, పుర్రెల మాల, ఎత్తి పట్టుకున్న అనేకములగు ఆయుధములు గల ఆ పురుషుడు మేఘమువంటి కాంతిని కలిగియుండెను.

తం కిం కరోమీతి గృణంతమాహ
బద్ధాంజలిం భగవాన్ భూతనాథః ।
దక్షం సయజ్ఞం జహి మద్భటానాం
త్వమగ్రణీ రుద్ర భటాంశకో మే ॥ 4

కిం కరోమి - ఏమి చేయను?, ఇతి - అని, గృణంతమ్ - పలుకుచున్న, బద్ధ-అంజలిమ్ - దోసిలి ఒగ్గియున్న, తమ్ - ఆ పురుషుని, భూతనాథః - సకలప్రాణులకు ప్రభువు అగు, భగవాన్ - శివభగవానుడు, ఆహ - పలికెను, రుద్ర - ఓ భయంకరమైనవాడా!, భట - ఓ యుద్ధవిశారదా!, (రుద్రభట - భయంకరముగా యుద్ధమును చేయువాడా!), సయజ్ఞమ్ - యజ్ఞముతో కూడిన, దక్షమ్ - దక్షుని, జహి - సంహరించుము, త్వమ్ - నీవు, మత్-భటానామ్ - నా అనుచరులకు, అగ్రణీః - నాయకుడవు, మే - నా, అంశకః - అంశ గలవాడవు.

ఆ పురుషుడు చేతులను జోడించి, అయ్యా! నేను ఏమి చేయవలెను? అని ప్రశ్నించగా, జగన్నాథుడగు ఆ శివభగవానుడు ఇట్లు చెప్పెను: భయంకరముగా యుద్ధమును చేయబోయే ఓ వీరుడా! దక్షుని సంహరించి వాని యజ్ఞమును నాశము జేయుము. నా అంశనుండి పుట్టిన నీవు నా అనుచరులకు నాయకుడవు కమ్ము.

ఆజ్ఞప్త ఏవం కుపితేన మన్యునా
స దేవదేవం పరిచక్రమే విభుమ్ ।
మేనే తదాత్మానమసంగరంహసా
మహీయసాం తాత సహస్సహిష్ణుమ్ ॥ 5

తాత - వత్సా విదురా!, కుపితేన - కోపించిన, మన్యునా - రుద్రు నిచే, ఏవమ్ - ఈ విధముగా, ఆజ్ఞప్తః - ఆజ్ఞాపించబడినవాడై, సః - ఆ పురుషుడు, దేవదేవమ్ - దేవదేవుడగు, విభుమ్ - శివప్రభుని, పరిచక్రమే - ప్రదక్షిణము చేసెను, తదా - అప్పుడు, అసంగరంహసా - అడ్డు లేని (శి వుని) వేగముచే, మహీయసామ్ - గొప్ప బలశాలుల, సహః - వేగమును, సహిష్ణుః - సహించ గలవానినిగా, ఆత్మానమ్ - తనను, మేనే - తలచెను.

వత్సా విదురా! కోపించియున్న రుద్రుడు ఈ విధముగా ఆజ్ఞాపించగా, ఆ పురుషుడు దేవదేవుడగు ఆ శివప్రభునకు ప్రదక్షిణము చేసెను. శివుని శక్తిచే సృష్టించబడిన తన వేగమును ఎవ్వరైననూ ఎదిరించలేరనియు, తాను గొప్ప బలవంతుల వేగమునైననూ సహించగలననియు అతడా సమయములో తలపోసెను.

అన్వీయమానస్స తు రుద్రపార్షదై-
ర్భృశం నదద్భిర్వ్యనదత్సుభైరవమ్ ।
ఉద్యమ్య శూలం జగదంతకాంతకం
స ప్రాద్రవద్ఘోషణభూషణాంఘ్రిః ।। 6

ఘోషణభూషణ-అంఘ్రిః - గలగలలాడుచున్న నూపురాలంకారములు గల పాదములు గల, సః తు - ఆ పురుషుడైతే, భృశమ్ - మిక్కిలి, నదద్భిః - నాదమును చేయుచున్న, రుద్రపార్షదైః - రుద్రుని అనుచరులచే, అన్వీయమానః - అనుసరించబడుచున్నవాడై, సుభైరవమ్ - మిక్కిలి భయమును గొల్పే విధముగా, వ్యనదత్ - సింహనాదమును చేసెను, సః - ఆతడు, జగత్-అంతక-అంతకమ్ - జగత్తును అంతము చేసే యముని కూడ అంతము చేయగల, శూలమ్ - శూలమును, ఉద్యమ్య - పైకి యెత్తి పట్టుకొని, ప్రాద్రవత్ - గొప్ప వేగముతో వెళ్లెను.

ఆ పురుషుని (వీరభద్రుని) పాదములకు అలంకరించబడిన నూపురములు గలగల ధ్వనిని చేయుచుండెను. అతని అనుసరించి నడిచే రుద్ర కింకరులు నాదములను చేయుచుండిరి. అతడు కూడ మిక్కిలి భయమును గొల్పు విధముగా సింహనాదమును చేసెను. జగత్తులోని సకలప్రా

ణులను అంతము చేయు యముని కూడ సంహరించునా యన్నట్లు ఉన్న శూలమును ఆతడు ఎత్తి పట్టుకొని మహావేగముతో ముందుకు సాగెను.

అథర్త్విజో యజమానస్సదస్యాః
కకుభ్యుదీచ్యాం ప్రసమీక్ష్య రేణుమ్ ।
తమః కిమేతత్కుత ఏతద్రజోఽభూ-
దితి ద్విజా ద్విజపత్న్యశ్చ దధ్యుః ॥ 7

అథ - తరువాత, ఋత్విజః - ఋత్విక్కులు, యజమానః - యజమానుడగు దక్షుడు, సదస్యాః - యజ్ఞసదస్సులోనివారగు, ద్విజాః - బ్రాహ్మణులు, చ - మరియు, ద్విజపత్న్యః - బ్రాహ్మణుల భార్యలు, ఉదీచ్యాం కకుభి - ఉత్తరదిక్కునందు, రేణుమ్ - ధూళిని, ప్రసమీక్ష్య - పరిశీలనగా చూచి, ఏతత్ - ఈ, తమః - చీకటి, కిమ్ - ఏమి?, ఏతత్ - ఈ, రజః - ధూళి, కుతః - ఎక్కడనుండి, అభూత్ - ఉదయించెను?, ఇతి - అని, దధ్యుః - మనస్సులో తలపోయుచుండిరి.

అప్పుడు యజ్ఞశాలలోని ఋత్విక్కులు, దక్షుడు, సభాసదులగు బ్రాహ్మణులు, వారి భార్యలు ఉత్తరదిక్కునందు పెద్ద దుమ్మును చూచిరి. ఈ చీకటి ఏమి? ఈ దుమ్ము ఎక్కడనుండి వచ్చుచున్నది? అంటూ వారు పరిపరివిధములుగా తలపోయుచుండిరి.

వాతా న వాంతి న హి సంతి దస్యవః
ప్రాచీనబర్హిర్జీవతి హోగ్రదండః ।
గావో న కాల్యంత ఇదం కుతో రజో
లోకోఽధునా కిం ప్రలయాయ కల్పతే ॥ 8

వాతాః - తుఫాను గాలులు, న వాంతి - వీచుట లేదు, దస్యవః - చోరులు, న హి సంతి - లేరు గదా!, ఉగ్రదండః - కఠినమగు శిక్షలను వేసే, ప్రాచీనబర్హిః - ప్రాచీనబర్హిష మహారాజు, జీవతి హ - జీవించియున్నాడు సుమా!, గావః - ఆవులు, న కాల్యంతే - వేగముగా తీసుకువెళ్లబడుట లేదు, ఇదమ్ - ఈ, రజః - ధూళి, కుతః - ఎక్కడనుండి?, అధునా

- ఇప్పుడు, లోకః - జగత్తు, ప్రలయాయ - ప్రళయము కొరకు, కిం కల్పతే - సిద్ధమగుచున్నదా యేమి?

ఇప్పుడు తుఫాను గాలులు వీచుట లేదు. నేరగాళ్లకు కఠినమగు శిక్షలను వేసే ప్రాచీనబర్హిష మహారాజు జీవించియే యున్నాడు గాన, దుమ్మును రేగగొట్టే చోరులు కూడ లేరు. ఇది గోవుల మంద రేగగొట్టు చున్న ధూళి కూడ కాదు. మరి ఈ ధూళి ఎక్కడనుండి వచ్చుచున్నది? జగత్తునకు ప్రళయము రాబోవుచున్నదా యేమి?

ప్రసూతిమిశ్రాః స్త్రియ ఉద్విగ్నచిత్తా
ఊచుర్విపాకో వృజినస్యైష తస్య ।
యత్పశ్యంతీనాం దుహితౄణాం ప్రజేశ-
స్సుతాం సతీమవదధ్యావనాగామ్ ।। 9

ఉద్విగ్నచిత్తాః - కలత జెందిన మనస్సు గల, ప్రసూతిమిశ్రాః - ప్రసూతి మొదలగు, స్త్రియః - స్త్రీలు, ఊచుః - పలికిరి, ఏషః - ఇది, తస్య - ఆ, వృజినస్య - పాపమునకు, విపాకః - ఫలము, యత్ - ఏలయన, ప్రజా-ఈశః - దక్షప్రజాపతి, దుహితౄణామ్ - కుమార్తెలు, పశ్యంతీనామ్ - చూచుచుండగా, అనాగామ్ - నిర్దోషురాలు, సుతామ్ - కుమార్తె యగు, సతీమ్ - సతీదేవిని, అవదధ్యౌ - అవమానించెను.

ప్రసూతి (దక్షపత్ని) మొదలగు స్త్రీలు కలత జెందిన మనస్సులు గలవారై ఇట్లు పలికిరి: దక్ష ప్రజాపతి ఏ పాపమునెరుంగని తన కుమార్తె యగు సతీదేవిని అవమానించినాడు. తన మిగిలిన కుమార్తెలు చూచుచున్ననూ ఆతడు లెక్క చేయలేదు. ఆ పాపమునకు ఇది ఫలము.

యస్త్వంతకాలే వ్యుప్తజటాకలాప-
స్స్వశూలసూచ్యర్పితదిగ్గజేంద్రః ।
వితత్య నృత్యత్యుదితాస్త్రదోర్ధ్వజా-
నుచ్చాట్టహాసస్తనయిత్నుభిన్నదృక్ ।। 10

యః తు - ఏ శివుడైతే, అంతకాలే - ప్రళయకాలమునందు, వ్యుప్తజటాకలాపః - విరబోయబడిన జటల సమూహము గలవాడై, స్వశూలసూచీ-అర్పితదిక్-గజ-ఇంద్రః - తన శూలముయొక్క కొనలయందు గ్రుచ్చబడిన గొప్ప దిగ్గజములు గలవాడై, ఉచ్చ-అట్టహాసస్తనయిత్ను భిన్నదృక్ - పెద్ద కఠోరమైన నవ్వు అనే పిడుగుల ధ్వనిచే పగులగొట్టబడిన దిక్కులు గలవాడై, ఉదిత-అస్త్రదోః-ధ్వజాన్ - పైకి ఎత్తబడిన అస్త్రములు గల భుజములు అనే ధ్వజములను, వితత్య - విస్తారముగా చాపి, నృత్యతి - నాట్యము చేయుచున్నాడో.

ఆ శివుడు ప్రళయకాలమునందు జటల సమూహమును విరబోసు కొని, తన శూలముయొక్క కొనలయందు గొప్ప దిగ్గజములను గ్రుచ్చి పట్టుకొనును. ఆయన బిగ్గరగా కఠోరముగా నవ్వగా, పిడుగుపాటువంటి ఆ ధ్వనికి దిక్కులు పిక్కటిల్లును. ఆయన భుజములయందు అస్త్రములను పట్టుకొని, వాటిని ధ్వజములవలె చాచి నాట్యమును చేయును.

అమర్షయిత్వా తమసహ్యతేజసం
మన్యుప్లుతం దుర్విషహం భ్రుకుట్యా ।
కరాలదంష్ట్రాభిరుదస్తభాగణం
స్యాత్స్వస్తి కిం కోపయతో విధాతుః ।। 11

అసహ్యతేజసమ్ - సహింప శక్యము కాని తేజస్సు గలిగినట్టియు, మన్యుప్లుతమ్ - కోపముతో వ్యాపించబడి యున్నట్టియు, భ్రుకుట్యా - కనుబొమల వంకరతో, దుర్విషహమ్ - భయమును గొల్పునట్టియు, కరాలదంష్ట్రాభిః - భయంకరమగు కోరలతో, ఉదస్తభాగణమ్ - చెదరగొట్టబడిన నక్షత్రముల గుంపులు గలిగిన, తమ్ - ఆ శివుని, అమర్షయిత్వా - అసహనము గలవానినిగా చేసి, కోపయతః - కోపమును కలిగించే, విధాతుః - (బ్రహ్మకు) దక్ష ప్రజాపతికి, స్వస్తి - కల్యాణము, కిం స్యాత్ - కలుగునా యేమి?

కోపముతో నిండియున్న శివుని తేజస్సును సహించుట శక్యము కాదు. ఆయన కనుబొమలు కోపముతో వంకర కాగా, ఆయనను చూచుట

కూడ కష్టమే. భయంకరమగు ఆయన కోరలు నక్షత్రముల గుంపులను చెల్లాచెదరు చేయును. అట్టి శివుని సహనమును పరీక్షించి, ఆయనకు కోప మును తెప్పించిన ఈ దక్ష ప్రజాపతికి కల్యాణము కలుగునా యేమి? (ఆయనకు కోపమును కలిగించినవాడు సాక్షాత్తుగా బ్రహ్మయే అయినా, ఆయనకు శుభము కలుగునా?)

బహ్వేవముద్విగ్నదృశోచ్యమానే
జనేన దక్షస్య మఖే మహాత్మనః ।
ఉత్పేతురుత్పాతతమాస్సహస్రశో
భయావహా దివి భూమౌ చ పర్యక్ ।। 12

మహా-ఆత్మనః - మహాత్ముడగు, దక్షస్య - దక్షుని, మఖే - యజ్ఞ మునందు, ఉద్విగ్నదృశా - భయముతో నిండిన చూపులు గల, జనేన - జనముచే, ఏవమ్ - ఈ విధముగా, బహు - అధికముగా, ఉచ్యమానే - పలుకబడుచుండగా, దివి - అంతరిక్షమునందు, చ - మరియు, భూమౌ - భూమియందు, పర్యక్ - అంతటా, భయ-ఆవహాః - భయమును గొల్పే, ఉత్పాతతమాః - పెద్ద ఉత్పాతములు, సహస్రశః - వేల సంఖ్యలో, ఉత్పేతుః - బయల్వెడలినవి.

మహాత్మునివలె డంబము చూపినా దక్షుడు దుష్టుడే. ఆతని యజ్ఞ ములో జనులు భయముతో చూస్తూ ఇట్లు పరిపరి విధములుగా చెప్పుకొ నుచుండిరి. అప్పుడు భూమిపై మరియు అంతరిక్షములో అంతటా పెద్ద అపశకునములు వేలాదిగా బయల్వెడలి భయమును గొల్పినవి.

తావత్స రుద్రానుచరైర్మఖో మహా-
న్నానాయుధైర్వామనకైరుదాయుధైః ।
పింగైః పిశంగైర్మకరోదరాననైః
పర్యాద్రవద్భిర్విదురాऽన్వరుధ్యత ।। 13

విదుర - ఓ విదురా!, తావత్ - అంతలో, నానా-ఆయుధైః - అనే కములగు ఆయుధములు కలిగినట్టియు, వామనకైః - పొట్టివారు అయినట్టి

యు, ఉత్-ఆయుధైః - ఎత్తి పట్టుకొనబడిన ఆయుధములు కలిగినట్టియు, పింగైః - కపిలవర్ణము గలిగినట్టియు, పిశంగైః - పచ్చని రంగు గలిగినట్టియు, మకర-ఉదర-ఆననైః - మొసలియొక్క పొట్టవంటి పొట్ట మరియు ముఖము వంటి ముఖము గలిగినట్టియు, పరి-ఆద్రవద్భిః - అంతటా ఇటు నటు పరుగులెత్తుచున్న, రుద్ర-అనుచరైః - రుద్రుని అనుచరులచేే, సః - ఆ, మహాన్ - గొప్ప, మఖః - యజ్ఞము, అవరుధ్యత - అడ్డుకొనబడెను.

ఓ విదురా! అంతలో ఆ గొప్ప యజ్ఞమును రుద్రుని అనుచరులు అడ్డుకొనిరి. వారందరు అనేకవిధముల ఆయుధములను ఎత్తి పట్టుకొని యుండిరి. వారిలో కొందరు మరుగుజ్జులు. కొందరు కపిలవర్ణము వారు కాగా, మరికొందరు పచ్చని వర్ణమును కలిగియుండిరి. కొందరి పొట్టలు మొసలి పొట్టలను పోలియుండగా, మరికొందరు ముఖములలో మొసలి పోలికలను కలిగియుండిరి. వారు యజ్ఞశాల అంతటా ఇటునటు పరుగులెత్తుచుండిరి.

కేచిద్బభంజుః ప్రాగ్వంశం పత్నీశాలాం తథాపరే ।
సద ఆగ్నీధ్రశాలాం చ తద్విహారం మహానసమ్ ॥ 14

కేచిత్ - కొందరు, ప్రాగ్వంశమ్ - యజ్ఞశాల పైకప్పు దూలమును, బభంజుః - విరిచిరి, తథా - అదే విధముగా, అపరే - మరికొందరు, పత్నీశాలామ్ - యజమాన పత్నియొక్క శాలను, సదః - ముందుండే మండపమును, ఆగ్నీధ్రశాలామ్ - ఆగ్నీధ్రుడు అనే ఋత్విక్కుయొక్క శాలను, చ - మరియు, తత్-విహారమ్ - ఆ యజమానుని గృహమును, మహానసమ్ - వంటశాలను, బభంజుః - కూలగొట్టిరి.

వారిలో కొందరు యజ్ఞశాల పైకప్పు దూలమును విరిచివేసిరి. మరికొందరు యజమాన పత్ని కూర్చుండే శాలను, కొందరు ఆగ్నీధ్రుని శాలను, కొందరు యజమానుని గృహమును, మరికొందరు ముందుండే మండపమును, ఇంకొందరు వంటశాలను కూలగొట్టిరి.

రురుజుర్యజ్ఞపాత్రాణి తథైకేఽగ్నీననాశయన్ ।
కుండేష్వమూత్రయన్ కేచిద్బిభిదుర్వేదిమేఖలాః ॥ 15

యజ్ఞపాత్రాణి - యజ్ఞపాత్రలను, రురుజుః - పగులగొట్టిరి, తథా - మరియు, ఏకే - కొందరు, అగ్నీన్ - అగ్నులను, అనాశయన్ - నాశము జేసిరి, కేచిత్ - కొందరు, కుండేషు - అగ్నికుండములయందు, అమూత్రయన్ - మూత్రమును చేసిరి, వేదిమేఖలాః - ఉత్తరవేదికి కట్టిన సూత్రములను, బిభిదుః - ఊడబెరికిరి.

వారిలో కొందరు యజ్ఞపాత్రలను పగులగొట్టగా, కొందరు అగ్నులను నాశనము చేసి, అగ్నికుండములలో మూత్రించిరి. కొందరు ఉత్తరవేదికి కట్టిన సూత్రములను ఊడబెరికిరి.

అబాధంత మునీనన్యే ఏకే పత్నీరతర్జయన్ ।
అపరే జగృహుర్దేవాన్ ప్రత్యాసన్నాన్ పలాయితాన్ ।। 16

అన్యే - మరికొందరు, మునీన్ - మునులను, అబాధంత - పీడించిరి, ఏకే - కొందరు, పత్నీః - మునిపత్నులను, అతర్జయన్ - భయపెట్టిరి, అపరే - మరికొందరు, ప్రతి-ఆసన్నాన్ - సమీపములోనున్నట్టియు, పలాయితాన్ - పారిపోయిన, దేవాన్ - దేవతలను, జగృహుః - పట్టుకొనిరి.

కొందరు మునులను పీడించగా, మరికొందరు వారి పత్నులను భయపెట్టిరి. కొందరు దగ్గరగా నున్నవారిని మాత్రమే గాక, పారిపోవుచున్న దేవతలను కూడ పట్టుకొనిరి.

భృగుం బబంధ మణిమాన్ వీరభద్రః ప్రజాపతిమ్ ।
చండీశః పూషణం దేవం భగం నందీశ్వరోఽగ్రహీత్ ।। 17

మణిమాన్ - మణిమంతుడు, భృగుమ్ - భృగుమహర్షిని, వీరభద్రః - వీరభద్రుడు, ప్రజాపతిమ్ - దక్ష ప్రజాపతిని, బబంధ - బంధించెను, చండీశః - చండీశుడు, పూషణం దేవమ్ - పూషదేవతను, నందీశ్వరః - నందీశ్వరుడు, భగమ్ - భగదేవతను, అగ్రహీత్ - పట్టుకొనెను.

మణిమంతుడు భృగు మహర్షిని, వీరభద్రుడు దక్ష ప్రజాపతిని బంధించిరి. చండీశుడు పూషదేవతను, నందీశ్వరుడు భగదేవతను పట్టుకొనిరి.

సర్వ ఏవర్త్విజో దృష్ట్వా సదస్యాస్సదివౌకసః ।
తైరర్ద్యమానాస్సుభృశం గ్రావభిర్నైకధాఽద్రవన్ ॥ 18

సర్వే ఏవ - అందరు, ఋత్విజః - ఋత్విక్కులు, సదస్యాః - సభాసదులు, సదివ-ఓకసః - దేవతలతో గూడినవారై, దృష్ట్వా - చూచి, తైః - వారిచే, గ్రావభిః - రాళ్లతో, సుభృశమ్ - మిక్కిలి, అర్ద్యమానాః - పీడించబడుచున్నవారై, నైకధా - పలువిధముల, అద్రవన్ - పారిపోయిరి.

ఋత్విక్కులు, సభాసదులు మరియు దేవతలు అందరు ఈ కల్లోలమును చూచి నలుదిక్కులకు పారిపోజొచ్చిరి. వారిని రుద్రానుచరులు రాళ్లతో కొట్టి పీడించిరి.

జుహ్వతస్స్రువహస్తస్య శ్మశ్రూణి భగవాన్ భవః ।
భృగోర్లులుంచే సదసి యోఽహసచ్ఛ్మశ్రు దర్శయన్ ॥ 19

భగవాన్ - పూజ్యుడగు, భవః - వీరభద్రుడు, స్రువహస్తస్య - స్రువము చేతియందు కలిగినట్టియు, జుహ్వతః - హోమమును చేయుచున్న, భృగోః - భృగు మహర్షియొక్క, శ్మశ్రూణి - మీసములను గెడ్డమును, లులుంచే - పెరికివేసెను, యః - ఏ భృగు మహర్షి, శ్మశ్రు - మీసమును గెడ్డమును, దర్శయన్ - చూపువాడై, అహసత్ - నవ్వెనో.

భృగు మహర్షి చేతిలో స్రువమును పట్టుకొని హోమమును చేయుచుండెను. దక్షుడు శివుని నిందించే సమయములో అయన మీసమును గెడ్డమును సవరించుకుంటూ నవ్వెను. కావుననే, వీరభద్ర భగవానుడు ఆ భృగువుయొక్క మీసమును గెడ్డమును పెరికివేసెను.

భగస్య నేత్రే భగవాన్ పాతితస్య రుషా భువి ।
ఉజ్జహార సదఃస్థోఽక్ష్ణా యశ్శపంతమసూసుచత్ ॥ 20

భగవాన్ - వీరభద్ర భగవానుడు, రుషా - కోపముతో, భువి - నేలపై, పాతితస్య - పడవేయబడిన, భగస్య - భగుని, నేత్రే - రెండు కళ్లను, ఉత్-జహార - ఊడపీకెను, యః - ఏ భగుడు, సదఃస్థః - సభలోనున్నవాడై,

శపంతమ్ - నిందించుచున్న దక్షుని, అక్ష్ణా - కంటితో, అసూసుచత్ - ప్రేరేపించెనో.

ప్రజాపతులు చేసిన సత్రయాగములోని సభయందు దక్షుడు శివుని నిందించిన సమయములో భగుడు కన్నుతో సైగచేసి దక్షుని ప్రేరే పించెను. కావుననే, వీరభద్ర భగవానుడు కోపముతో ఆయనను వేలపై పడగొట్టి కళ్లను పీకివేసెను.

పూష్ణశ్చాపాతయద్దంతాన్ కాలింగస్య యథా బలః ।
శప్యమానే గరిమణి యోఽహసద్దర్శయన్దతః ।। 21

బలః - బలభద్రుడు, కాలింగస్య - కళింగదేశాధిపతియొక్క, దంతాన్ యథా - దంతములను వలె, పూష్ణః - పూషదేవతయొక్క, దంతాన్ - దంతములను, అపాతయత్ - రాలగొట్టెను, యః - ఏ పూష, గరిమణి - దేవదేవుడగు శివుడు, శప్యమానే - నిందించబడుచుండగా, దతః - దంతములను, దర్శయన్ - చూపువాడై, అహసత్ - నవ్వెనో.

దక్షుడు ఆ సభలో శివుని నిందించుచున్న సమయములో పూష దేవత పళ్లను ఇకిలిస్తూ నవ్వెను. కావుననే, బలభద్రుడు కళింగదేశాధిపతి పళ్లను పెకిలించిన విధముగా, వీరభద్రుడు ఆయన పళ్లను రాలగొట్టెను.

ఆక్రమ్యోరసి దక్షస్య శితధారేణ హేతినా ।
ఛిందన్నపి తదుద్ధర్తుం నాశక్నోత్ త్ర్యంబకస్తదా ।। 22

తదా - ఆ సమయములో, త్రి-అంబకః - మూడు కన్నులు గల వీరభద్రుడు, దక్షస్య - దక్షుని, ఉరసి - గుండెలపై, ఆక్రమ్య - కాలితో తొక్కిపెట్టి, శితధారేణ - పదునైన ధార (అంచు) గల, హేతినా - కత్తితో, ఛిందన్ అపి - ఛేదించిననూ, తత్ - ఆ తలను, ఉద్ధర్తుమ్ - నరుకుటకు, న అశక్నోత్ - సమర్థుడు కాలేదు.

ముక్కంటియగు వీరభద్రుడు దక్షుని గుండెలపై కాళ్లతో తొక్కిపెట్టి వాడి కత్తితో తలను నరుకుటకు ప్రయత్నించెను. కాని, ఆ ప్రయత్నములో ఆతడు సఫలుడు కాలేదు.

శస్త్రైరస్త్రాన్వితైరేవమనిర్భిన్నత్వచం హరః ।
విస్మయం పరమాపన్నో దధ్యౌ పశుపతిశ్చిరమ్ ॥ 23

ఏవమ్ - ఈ విధముగా, అస్త్ర-అన్వితైః - మంత్రశక్తితో కూడిన, శస్త్రైః - ఆయుధములతో, అనిర్భిన్నత్వచమ్ - భేదింపబడని చర్మము గల దక్షుని (చూచి), పశుపతిః - జీవులకు ప్రభుడగు, హరః - వీరభద్రుడు, పరమ్ - అధికమగు, విస్మయమ్ - ఆశ్చర్యమును, ఆపన్నః - పొందినవాడై, చిరమ్ - చాలసేపు, దధ్యౌ - ఆలోచనలో పడెను.

ఈ విధముగా మంత్రశక్తితో కూడిన ఆయుధములతో నైననూ ఆ వీరభద్రుడు దక్షుని తలను నరుకుటకు గాని, వాని చర్మమును ఒలుచుటకు గాని సమర్థుడు కాలేదు. జీవులకు నాథుడగు ఆ వీరభద్రుడు అప్పుడు చాల ఆశ్చర్యమును పొంది, దీర్ఘమగు ఆలోచనలో పడెను.

దృష్ట్వా సంజ్ఞపనం యోగం పశూనాం స పతిర్మఖే ।
యజమానపశోః కస్య కాయాత్తేనాహరచ్ఛిరః ॥ 24

తతః - ఆ ధ్యానము వలన, పశూనామ్ - జీవులకు, పతిః - ప్రభుడగు, సః - ఆ వీరభద్రుడు, మఖే - యజ్ఞమునందు, సంజ్ఞపనమ్ - పశువిశసనమును, యోగమ్ - ఉపాయముగా, దృష్ట్వా - తెలుసుకొని, తేన - ఆ ఉపాయముచే, యజమానపశోః - యజమానుని రూపములోనున్న పశువైన, కస్య - దక్ష ప్రజాపతియొక్క, కాయాత్ - శరీరమునుండి, శిరః - తలను, అహరత్ - వేరుజేసెను.

అట్లు ధ్యానించినప్పుడు జీవులకు ప్రభుడగు ఆ వీరభద్రునకు ఒక ఉపాయము తోచెను. యజ్ఞములో యజమానుడే పశువు. కావున, పశువిశసనము చేసినట్లు యజమానుడగు ఈ దక్షుని ప్రాణములనపహరించవచ్చును. ఆతడు అట్లు తోచగానే, వెంటనే ఆ ఉపాయమును అమలు చేసి, దక్షుని తలను మొండెమునుండి వేరుజేసెను.

సాధువాదస్తదా తేషాం కర్మ తత్తస్య శంసతామ్ ।
భూతప్రేతపిశాచానామన్యేషాం తద్విపర్యయః ॥ 25

తదా - అప్పుడు, తస్య - ఆ వీరభద్రుని, తత్ - ఆ, కర్మ - పని ని, శంసతామ్ - స్తుతించుచున్న, తేషామ్ - ఆ, భూతప్రేతపిశాచానామ్ - భూతప్రేతపిశాచముల, సాధువాదః - బాగు బాగు అనే ప్రశంస, అన్యే షామ్ - దక్షవర్గీయుల, తత్-విపర్యయః - దానికి భిన్నమైన భాషణము.

అప్పుడు రుద్రుని అనుచరులగు భూతప్రేతపిశాచములు వీరభ ద్రుని ఆ పనిని స్తుతిస్తూ, బాగు బాగు అని ప్రశంసించిరి. దక్షుని పక్షము వారు అయ్యో! అయ్యో! అంటూ దుఃఖించిరి.

జుహావైతచ్ఛిరస్తస్మిన్ దక్షిణాగ్నావమర్షితః ।
తద్దేవయజనం దగ్ధ్వా ప్రాతిష్ఠద్గుహ్యకాలయమ్ ॥ 26

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే చతుర్థస్కంధే వీరభద్రేణ దక్ష యజ్ఞవిధ్వంసనం నామ పంచమోఽధ్యాయః ॥

అమర్షితః - శివుని నిందను సహించలేని (మిక్కిలి కోపించియు న్న) వీరభద్రుడు, ఏతత్ - ఈ, శిరః - తలను, తస్మిన్ - ఆ, దక్షిణ-అగ్నౌ - దక్షిణాగ్నియందు, జుహావ - హోమము చేసెను, తత్ - ఆ, దేవయజ నమ్ - దేవయజనమును, దగ్ధ్వా - తగులబెట్టి, గుహ్యక-ఆలయమ్ - కైలాసమును గురించి, ప్రాతిష్ఠత్ - వెళ్లెను.

శివుని నిందను సహించలేని వీరభద్రుడు మిక్కిలి కోపించి, ఆ తలను దక్షిణాగ్నియందు హోమము చేసి, యజ్ఞమండపమును తగులబెట్టి, కైలాసమునకు తిరిగి వెళ్లెను.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి నాల్గవ స్కంధములో వీరభద్రుడు దక్షయజ్ఞమును విధ్వంసము చేయుటను వర్ణించే ఐదవ అధ్యాయము ముగిసినది (5).

*****

# అథ షష్ఠోఽధ్యాయః

## దేవతలు శివుని ప్రసన్నుని చేసుకొనుట

మైత్రేయ ఉవాచ ।
అథ దేవగణాస్సర్వే రుద్రానీకైః పరాజితాః ।
శూలపట్టిశనిస్త్రింశగదాపరిఘముద్గరైః ।। 1

సంఛిన్నభిన్నసర్వాంగాస్సర్త్విక్సభ్యా భయాకులాః ।
స్వయంభువే నమస్కృత్య కార్త్స్న్యేనైతన్న్యవేదయన్ ।।2

మైత్రేయః - మైత్రేయుడు, ఉవాచ - పలికెను, అథ - తరువాత, రుద్ర-అనీకైః - రుద్రుని సేనలచే, పరాజితాః - పరాజితులుగా చేయబడిన, దేవగణాః - దేవగణములు, సర్వే - అన్నియు, శూలపట్టిశనిస్త్రింశగదాపరిఘముద్గరైః - శూలములు అడ్డకత్తులు కత్తులు గదలు ఇనుపగుదియలు మరియు సమ్మెటలచే, సంఛిన్నభిన్నసర్వ-అంగాః - బాగా ఛిన్నాభిన్నము చేయబడిన అన్ని అవయవములు గలవారై, స-ఋత్విక్-సభ్యాః - ఋత్విక్కులతో మరియు సభాసదులతో గూడినవారై, భయ-ఆకులాః - భయముచే వ్యాకులతను చెందినవారై, స్వయంభువే - స్వయంభువుడగు బ్రహ్మగారి కొరకు, నమస్కృత్య - నమస్కరించి, ఏతత్ - ఈ విషయమును, కార్త్స్న్యేన - పూర్తిగా, న్యవేదయన్ - విన్నవించుకొనిరి.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- అప్పుడు రుద్రుని సేనలు దేవగణములను, ఋత్విక్కులను, సభాసదులను, శూలములు అడ్డకత్తులు కత్తులు గదలు ఇనుపగుదియలు మరియు సమ్మెటలు అనే ఆయుధములతో గట్టిగా కొట్టిరి. వారి అవయవములన్నియు బాగా ఛిన్నాభిన్నములాయెను. వారు భయముచే కంగారు పడిపోయి, స్వయంభువుడగు బ్రహ్మ

గారి వద్దకు వెళ్లిరి. వారాయనకు నమస్కరించి, జరిగిన వృత్తాంతమును విన్నవించిరి.

ఉపలభ్య పురైవైతద్భగవానబ్జసంభవః ।
నారాయణశ్చ విశ్వాత్మా న కస్యాధ్వరమీయతుః ।। 3

భగవాన్ - భగవానుడు, అబ్జసంభవః - పద్మసంభవుడు అగు బ్రహ్మగారు, విశ్వ-ఆత్మా - జగత్తుయొక్క స్వరూపమైయున్న, నారాయణః చ - నారాయణుడు కూడ, పురా ఏవ - ముందే, ఏతత్ - ఈ విషయమును, ఉపలభ్య - తెలుసుకొని, కస్య - దక్ష ప్రజాపతియొక్క, అధ్వరమ్ - యజ్ఞమును గురించి, న ఈయతుః - వెళ్లలేదు.

పద్మసంభవుడగు బ్రహ్మ భగవానునకు, జగత్తునకు అధిష్ఠానమైయున్న నారాయణునకు దక్షుని యజ్ఞముయొక్క ఈ పరిస్థితి ముందే తెలియును. కావుననే, వారా యజ్ఞమునకు వెళ్లలేదు.

తదాకర్ణ్య విభుః ప్రాహ తేజీయసి కృతాగసి ।
క్షేమాయ తత్ర సా భూయాన్న ప్రాయేణ బుభూషతామ్ ।।4

విభుః - బ్రహ్మప్రభుడు, తత్ - ఆ మాటను, ఆకర్ణ్య - విని, ప్రాహ - పలికెను, తేజీయసి - గొప్ప తేజశ్శాలియే అయిననూ (తేజశ్శాలియగు రుద్రుని విషయములో), కృత-ఆగసి - చేయబడిన అపరాధము గలవాడైయుండగా, తత్ర - వాని విషయములో, బుభూషతామ్ - మంచిని కోరుకొనువారలకు, ప్రాయేణ - తరచుగా, సా - అట్టి మంచి, క్షేమాయ - కల్యాణము కొరకు, న భూయాత్ - సమర్థము కాదు.

బ్రహ్మప్రభుడు ఆ మాటను విని ఇట్లు పలికెను: శివుడు గొప్ప తేజశ్శాలి. దక్షుడు కూడ స్వయముగా తేజశ్శాలియే అయిననూ, తేజశ్శాలియగు శివుని విషయములో అపరాధము చేసినాడు. అపరాధము చేసిన మహాత్ముల యెడల కూడ అపరాధమును చేయరాదు. అపరాధమునెరుంగని శివుని యెడల ఆతడు అపరాధమును చేసినాడు. అట్టి దక్షుడు, ఆతని

అనుయాయులు తమకు క్షేమము కలుగవలెనని కోరుకున్ననూ, క్షేమము కలుగుట సంభవము కాదు.

అథాపి యూయం కృతకిల్బిషా భవం
యే బర్హిషో భాగభాజం పరాదుః ।
ప్రసాదయధ్వం పరిశుద్ధచేతసా
క్షిప్రప్రసాదం ప్రగృహీతాంఘ్రిపద్మమ్ ॥ 5

అథ అపి - అయినప్పటికీ, కృతకిల్బిషాః - చేయబడిన అపరాధము గల, యూయమ్ - మీరు, యే - ఏ మీరు, బర్హిషః - యజ్ఞముయొక్క, భాగభాజమ్ - భాగమును పొందియున్న శివుని, పరాదుః - బహిష్కరించిరో, పరిశుద్ధచేతసా - పరిశుద్ధమగు అంతఃకరణముతో, క్షిప్రప్రసాదమ్ - తొందరగా అనుగ్రహించే, భవమ్ - శివుని, ప్రగృహీత-అంఘ్రిపద్మమ్ - గట్టిగా పట్టుకొనబడిన పద్మములవంటి పాదములు కలుగునట్లుగా, ప్రసాదయధ్వమ్ - ప్రసన్నుని చేసుకొనుడు.

యజ్ఞములో భాగమును పొందియున్న శివుని మీరు యజ్ఞభాగము నుండి బహిష్కరించి, ఆయన విషయములో అపరాధమును చేసియున్నారు. అయినప్పటికీ, పరిశుద్ధమగు అంతఃకరణముతో పద్మములవంటి ఆయన పాదములను గట్టిగా పట్టుకొనుడు. ఆయన తొందరగా ప్రసన్నుడగును. శివుని ఆ విధముగా ప్రసన్నుని చేసుకొనుడు.

ఆశాసానా జీవితమధ్వరస్య
లోకస్సపాలః కుపితే న యస్మిన్ ।
తమాశు దేవం ప్రియయా విహీనం
క్షమాపయధ్వం హృది విద్ధం దురుక్తైః ॥ 6

అధ్వరస్య - యజ్ఞమునకు, జీవితమ్ - పునరుజ్జీవనమును, ఆశాసానాః - కోరే మీరు, ప్రియయా - ప్రియురాలితో, విహీనమ్ - వియోగమును పొందినట్టియు, హృది - హృదయమునందు, దురుక్తైః - చెడు మాటలతో, విద్ధమ్ - కొట్టబడిన, తమ్ - ఆ, దేవమ్ - శివప్రభుని, ఆశు -

వెంటనే, క్షమాపయధ్వమ్ - క్షమింప జేయుడు, యస్మిన్ - ఏ శివుడు, కుపితే - కోపించగా, సపాలః - లోకపాలకులతో కూడిన, లోకః - జగత్తు, న - ఉండదో.

దక్షుని యజ్ఞము పునరుజ్జీవనమును పొందవలెనని మీరు కోరుచున్నారా? అట్లైనచో, వెంటనే వెళ్లి శివప్రభునకు క్షమార్పణను చెప్పుడు. ఆయనకు ప్రియురాలగు సతీదేవితో వియోగము కలిగినది. ఆయన హృదయము చెడు పలుకులతో గాయపడినది. ఆయనకు కోపము వచ్చినచో, లోకపాలకులతో సహా జగత్తు వినాశమును చెందును.

నాహం న యజ్ఞో న చ యూయమన్యే
యే దేహభాజో మునయశ్చ తత్త్వమ్ ।
విదుః ప్రమాణం బలవీర్యయోర్వా
యస్యాత్మతంత్రస్య క ఉపాయం విధిత్సేత్ ॥ 7

ఆత్మతంత్రస్య - స్వతంత్రుడగు, యస్య - ఏ శివునియొక్క, తత్త్వమ్ - యథార్థస్వరూపమును గాని, బలవీర్యయోః - బలపరాక్రమములయొక్క, ప్రమాణమ్ - ప్రమాణమును గాని, అహమ్ - నేను, న వేద - తెలియకున్నానో, యజ్ఞః - ఇంద్రుడు (విష్ణువు), న - తెలియకున్నాడో, యూయమ్ - మీరు, చ - మరియు, అన్యే - ఇతరులైన, మునయః - మహర్షులు, యే - ఏ, దేహభాజః - దేహధారులు గలరో వారు, న - తెలియకున్నారో, కః - ఎవ్వాడు, ఉపాయమ్ - ఉపాయమును, విధిత్సేత్ - చేయుటకిచ్ఛగించును?

శివుడు సర్వస్వతంత్రుడు. ఆయన యథార్థస్వరూపమును గాని, ఆయన బలపరాక్రమములు ఇంతటివి అని గాని, నాకు తెలియదు; ఇంద్రునకు, విష్ణువునకు, మీకు, మహర్షులకు కూడ తెలియదు; దేహధారులగు ప్రాణులకెవ్వరికైననూ తెలియదు. ఆయనకే కోపము వచ్చినచో, ఆ కోపమును తగ్గించే ఉపాయమును చేయుటకు ఎవరు ముందుకు రాగలరు?

స ఇత్థమాదిశ్య సురానజస్తై-
స్సమన్వితః పితృభిస్సప్రజేశైః ।

యయౌ స్వధిష్ణ్యాన్నిలయం పురద్విషః
కైలాసమద్రిప్రవరం ప్రియం ప్రభోః ॥ 8

సః - ఆ, అజః - స్వయంభువుడగు బ్రహ్మగారు, సురాన్ - దేవతలను, ఇత్థమ్ - ఈ విధముగా, ఆదిశ్య - ఆదేశించి, తైః - వారితో, సప్రజాఈశైః - ప్రజాపతులతో గూడియున్న, పితృభిః - పితృదేవతలతో, సమన్వితః - కూడుకున్నవాడై, స్వధిష్ణ్యాత్ - తన ధామమునుండి, పురద్విషః - త్రిపురాసురసంహారకుడగు, ప్రభోః - శివప్రభునకు, ప్రియమ్ - ప్రియమైనట్టియు, నిలయమ్ - నివాసస్థానమైనట్టియు, అద్రిప్రవరమ్ - పర్వతములలో శ్రేష్ఠమైన, కైలాసమ్ - కైలాసమును గురించి, యయౌ - వెళ్లెను.

స్వయంభువుడగు ఆ బ్రహ్మగారు ఆ దేవతలవీ విధముగా ఆదేశించి, తన ధామమునుండి కైలాసమునకు వెళ్లెను. ఆ దేవతలు, ప్రజాపతులు మరియు పితృదేవతలు కూడ ఆయనకు తోడుగా వెళ్లిరి. త్రిపురాసురసంహారకుడగు శివప్రభునకు పర్వతములలో ఉత్తమమగు కైలాసము చాల ప్రీతికరమైన నివాసస్థానము.

జన్మౌషధితపోమంత్రయోగసిద్ధైర్నరేతరైః ।
జుష్టం కిన్నరగంధర్వైరప్సరోభిర్వృతం సదా ॥ 9

జన్మ-ఓషధితపః-మంత్రయోగసిద్ధైః - సిద్ధుల కులమునందు పుట్టుట ఓషధులు తపస్సు మంత్రము మరియు యోగములచే సిద్ధులైన, నర-ఇతరైః - దేవతలచే, జుష్టమ్ - సేవించబడునట్టియు, సదా - అన్ని కాలములలో, కిన్నరగంధర్వైః - కిన్నరులచే మరియు గంధర్వులచే, అప్సరోభిః - అప్సరసలచే, వృతమ్ - కూడినదియు (అగు కైలాసమును చేరుకొనెను).

సిద్ధుల కులమునందు పుట్టుట, ఓషధులు, తపస్సు, మంత్రము మరియు యోగము అనే అయిదు పద్ధతులలో ఏదో ఒకదానియందు సిద్ధులైన దేవతలు కైలాసమును సేవించెదరు. అచట అన్ని కాలములలో గంధర్వులు, కిన్నరులు మరియు అప్సరసలు ఉండెదరు.

నానామణిమయైశ్శృంగైర్నానాధాతువిచిత్రితైః ।
నానాద్రుమలతాగుల్మైర్నానామృగగణావృతైః ।। 10

నానాఽమలప్రస్రవణైర్నానాకందరసానుభిః ।
రమణం విహరంతీనాం రమణైస్సిద్ధయోషితామ్ ।। 11

నానామణిమయైః - అనేకవిధముల మణులతో ప్రచురముగాను న్నట్టియు, నానాధాతువిచిత్రితైః - అనేకములగు ధాతువులచే రంగురంగులుగానున్నట్టియు, నానాద్రుమలతాగుల్మైః - అనేకవిధములైన చెట్లు తీగలు పొదలు కలిగినట్టియు, నానామృగగణ-ఆవృతైః - అనేకవిధములైన జంతువుల గుంపులచే నిండియున్నట్టియు, నానా-అమలప్రస్రవణైః - అనేకవిధములైన స్వచ్ఛమగు కొండ కాలువలు కలిగినట్టియు, నానాకందరసానుభిః - అనేకవిధములైన గుహలు కొండచరియలు కలిగిన, శృంగైః - శిఖరములతో, రమణైః - భర్తలతో గూడి, విహరంతీనామ్ - విహరించుచున్న, సిద్ధయోషితామ్ - సిద్ధపురుషుల భార్యలకు, రమణమ్ - ఉల్లాసమును కలిగించునది.

కైలాసపర్వతముయొక్క శిఖరములు అనేకవిధముల మణులతో దట్టముగా నిండియున్నవి. గైరికము మొదలగు ధాతువుల వలన ఎన్నో రంగులతో ప్రకాశించే ఆ శిఖరములపై అనేకవిధములైన చెట్లు, తీగలు, పొదలు గలవు. ఆ శిఖరములపై అనేకవిధములైన జంతువులు గుంపులు గుంపులుగా తిరుగాడుచుండును. ఆ శిఖరములపైనుండి జారిపడే కొండ కాలువలలోని నీరు స్వచ్ఛముగా నుండును. అనేకవిధములైన గుహలతో మరియు కొండచరియలతో ఒప్పారే ఆ శిఖరములయందు సిద్ధపురుషుల భార్యలు తమ భర్తలతో గూడి విహరించుచుందురు. వారికా శిఖరముల శోభ ఉల్లాసమును కలిగించును.

మయూరకేకాభిరుతం మదాంధాలివిమూర్ఛితమ్ ।
ప్లావితై రక్తకంఠానాం కూజితైశ్చ పతత్త్రిణామ్ ।। 12

మయూరకేకా-అభిరుతమ్ - నెమళ్ల కూతలతో అంతటా ధ్వనించుచున్నది, మద-అంధ-అలివిమూర్ఛితమ్ - మదించి కళ్లు మూసుకుపో

యిన తుమ్మెదలచే అధికముగా చేయబడే ఝుంకారముచే నిండియున్నది, రక్తకంఠానామ్ - కోకిలల, ప్లావితైః - దీర్ఘమగు కూతలతో, చ - మరియు, పతత్త్రిణామ్ - పక్షుల, కూజితైః - కూతలతో.

కైలాస పర్వతము అంతటా నెమళ్ల కూతలతో ప్రతిధ్వనించుచుండెను. తేనెను త్రాగి మత్తెక్కి కళ్లు మూసుకుపోయిన తుమ్మెదలు ఇటునటు వేగముగా తిరుగుతూ ఝుంకారమును చేయుచుండెను. కోకిలలు కుహూ రావములను చేయుచుండెను. వివిధములగు పక్షుల కూతలతో ఆ శిఖరములు ధ్వనించుచుండెను. అట్టి కైలాసమునకు బ్రహ్మగారు వెళ్లిరి.

ఆహ్వయంతమివోద్ధస్తైర్ద్విజాన్ కామదుఘైర్ద్రుమైః ।
వ్రజంతమివ మాతంగైర్గృణంతమివ నిర్ఝరైః ॥ 13

కామదుఘైః - కోరికలను వర్షించే, ద్రుమైః - చెట్లతో, (కామదుఘైః ద్రుమైః - కల్పవృక్షములతో), ఉత్-హస్తైః - పైకి యెత్తబడిన చేతులతో, ద్విజాన్ - పక్షులను, ఆహ్వయంతం ఇవ - ఆహ్వానించుచున్నదా యన్నట్లు ఉన్నట్టియు, మాతంగైః - ఏనుగులతో, వ్రజంతం ఇవ - కదులుచున్నదా యన్నట్లు ఉన్నట్టియు, నిర్ఝరైః - కొండ కాలువలతో, గృణంతం ఇవ - మాటలాడుచున్నదా యన్నట్లు ఉన్న (కైలాసమును బ్రహ్మగారు చేరుకొనెను).

పక్షులకు చిగుళ్లను, పళ్లను అందించే చెట్లతో (కల్పవృక్షములతో) ఆ పర్వతము చేతులను పైకెత్తి పక్షులనే అతిథులను ఆహ్వానించుచున్నట్లు ఉండెను. ఏనుగులు తిరుగాడుచుండగా, వాటి కదలిక పర్వతమే కదులుచున్నదా యన్నట్లు ఉండెను. ఆ పర్వతము కొండ కాలువల కలకల ధ్వనులతో మాటలాడుచున్నదా యన్నట్లు ఉండెను.

మందారైః పారిజాతైశ్చ సరలైశ్చోపశోభితమ్ ।
తమాలైశ్శాలతాలైశ్చ కోవిదారాసనార్జునైః ॥ 14

మందారైః - కల్పవృక్షములతో, పారిజాతైః - పారిజాత వృక్షములతో, సరలైః - తెల్లతెగడ చెట్లతో, తమాలైః - ఉలిమిరి చెట్లతో, శాలతాలైః

- శాలవృక్షములతో మరియు తాటి చెట్లతో, చ - మరియు, కోవిదార-అస న-అర్జునైః చ - రక్తకాంచనవృక్షములతో వేగిసచెట్లతో ఏరుమద్ది చెట్లతో, ఉపశోభితమ్ - ప్రకాశించే (కైలాసమును బ్రహ్మగారు చేరుకొనెను).

కల్పవృక్షములు, పారిజాత వృక్షములు, తెల్లతెగడ, ఉలిమిరి చెట్లు, శాలవృక్షములు, తాడిచెట్లు, రక్తకాంచన వృక్షములు, వేగిస, ఏరు మద్ది చెట్లతో ఆ కైలాసము ప్రకాశించుచుండెను.

చూతైః కదంబైర్నీపైశ్చ నాగపున్నాగచంపకైః ।
పాటలాశోకబకులైః కుందైః కురవకైరపి ।। 15

చూతైః - మామిడి చెట్లతో, కదంబైః - కడిమి చెట్లతో, నీపైః - మంకెన చెట్లతో, నాగపున్నాగచంపకైః - పొన్న సురపొన్న సంపెంగ చెట్ల తో, పాటల-అశోకబకులైః - కలిగొట్టు కంకేళి పొగడ చెట్లతో, కుందైః - గన్నేరు చెట్లతో, చ - మరియు, కురవకైః అపి - ఎఱ్ఱగోరంట చెట్లతో కూడ.

మామిడి, కడిమి, మంకెన, పొన్న, సురపొన్న, సంపెంగ, కలిగొ ట్టు, కంకేళి, పొగడ, గన్నేరు మరియు ఎఱ్ఱగోరంట చెట్లతో ఆ కైలాసము ప్రకాశించుచుండెను.

స్వర్ణార్ణశతపత్రైశ్చ వీరరేణుకజాతిభిః ।
కుబ్జకైర్మల్లికాభిశ్చ మాధవీభిశ్చ మండితమ్ ।। 16

స్వర్ణ-అర్ణశతపత్రైః - బంగరు వన్నె గల వంద రేకుల పద్మముల తో, వీరరేణుకజాతిభిః - గన్నేరు ఏలకులు జాజి తీగలతో, కుబ్జకైః - ఉత్త రేణి మొక్కలతో, మల్లికాభిః - మల్లె తీగలతో, చ - మరియు, మాధవీభిః - పూవుల గురివెంద చెట్లతో, మండితమ్ - అలంకరించబడియున్న (కైలాస ము).

కైలాసము బంగరు వన్నెల వందరేకుల పద్మములతో, గన్నేరు ఏలకులు జాజి మల్లె తీగలతో, ఉత్తరేణి మొక్కలతో, పూవుల గురివెంద చెట్లతో సుందరముగా నుండెను.

పనసోదుంబరాశ్వత్థప్లక్షన్యగ్రోధహింగుభిః ।
భూర్జైరోషధిభిః పూగై రాజపూగైశ్చ జంబుభిః ॥ 17

పనస-ఉదుంబర-అశ్వత్థప్లక్షన్యగ్రోధహింగుభిః - పనస మేడి రావి జువ్వి మర్రి ఇంగువ చెట్లతో, భూర్జైః - బుజపత్తిరి చెట్లతో, ఓషధిభిః - ఒక కాపుతో నశించే అరటి మొదలగు చెట్లతో, పూగైః - పోక చెట్లతో, రాజ పూగైః - రాజపూగ వృక్షములతో, చ - మరియు, జంబుభిః - నేరేడు చెట్ల తో.

పనస, మేడి, రావి, జువ్వి, మర్రి, ఇంగువ, బుజపత్తిరి, పోక, నేరేడు చెట్లతో, మరియు రాజపూగ వృక్షములతో కైలాసము ప్రకాశించు చుండెను. ఒకే కాపుతో అంతమయ్యే అరటి మొదలగు చెట్లు కూడ అక్కడ గలవు.

ఖర్జూరామ్రాతకామ్రాద్యైః ప్రియాలమధుకేంగుదైః ।
ద్రుమజాతిభిరన్యైశ్చ రాజితం వేణుకీచకైః ॥ 18

ఖర్జూర-ఆమ్రాతక-ఆమ్ర-ఆద్యైః - ఖర్జూరము అంబాళపు చెట్టు మామిడి చెట్టు మొదలగు చెట్లతో, ప్రియాలమధుక-ఇంగుదైః - మోరటి ఇప్ప గార చెట్లతో, అన్యైః - ఇతరములగు, ద్రుమజాతిభిః - చెట్ల జాతుల తో, చ - మరియు, వేణుకీచకైః - వెదురు సన్నవెదురు పొదలతో, రాజి తమ్ - ప్రకాశించునది.

ఖర్జూరము, అంబాళము, మామిడి, మోరటి, ఇప్ప, గార చెట్లతో మాత్రమే గాక, ఇతరవృక్షజాతులతో, మరియు వెదురు సన్నవెదురు పొద లతో కైలాసము ప్రకాశించెను.

కుముదోత్పలకహ్లారశతపత్రవనర్ద్ధిభిః ।
నలినీషు కలం కూజత్ఖగవృందోపశోభితమ్ ॥ 19

కుముద-ఉత్పలకహ్లారశతపత్రవన-ఋద్ధిభిః - తెల్ల కలువ నల్ల కలువ చెంగలువ తామర పువ్వుల గుంపుల శోభలతో, నలినీషు - సరస్సు

లయందు, కలమ్ - మధురముగా, కూజత్-ఖగవృంద-ఉపశోభితమ్ కూయుచున్న పక్షుల గుంపులచే ప్రకాశించునది.

కైలాసమునందలి సరస్సులలో తెల్ల కలువలు, నల్ల కలువలు, చెంగలువలు, తామర పువ్వులు గుంపులు గుంపులుగా ప్రకాశించుచుండెను. ఆ సరస్సులలో పక్షులు గుంపులు చేరి మధురముగా కూయుచుండగా, అచ్చోటు చాల సుందరముగా నుండెను.

మృగైశ్శాఖామృగైః క్రోడైర్మృగేంద్రైఃఋక్షశల్యకైః ।
గవయైశ్శరభైర్వ్యాఘ్రై రురుభిర్మాహిషాదిభిః ॥ 20

కర్ణాంత్రైకపదాశ్వాస్యైర్నిర్జుష్టం వృకనాభిభిః ।
కదలీషండసంరుద్ధనలినీపులినశ్రియమ్ ॥ 21

మృగైః - లేళ్లచే, శాఖామృగైః - కోతులచే, క్రోడైః - అడవి పందులచే, మృగ-ఇంద్రైః - సింహములచే, ఋక్షశల్యకైః - ఎలుగు బంట్లచే ముళ్ల పందులచే, గవయైః - గురుపోతులచే, శరభైః - శరభమృగములచే, వ్యాఘ్రైః - పెద్దపులులచే, రురుభిః - నల్లచారల దుప్పిలచే, మాహిష-ఆదిభిః - అడవిదున్నలు మొదలగువాటిచే, కర్ణాంత్ర-ఏకపద-అశ్వాస్యైః - గోకర్ణ మృగములచే ఏకపద మృగములచే గుఱ్ఱపు ముఖము గల మృగములచే, వృకనాభిభిః - తోడేళ్లచే కస్తూరి మృగములచే, నిర్జుష్టమ్ - సేవించబడినది, కదలీషండసంరుద్ధనలినీపులినశ్రియమ్ - అరటి చెట్ల గుంపులచే ఆవరించబడియున్న సరస్సుల (నదుల) తీరముల శోభ గలది.

కైలాసపర్వతమునందు లేళ్లు, కోతులు, అడవి పందులు, సింహములు, ఎలుగు బంట్లు, ముళ్ల పందులు, గురుపోతులు, శరభమృగములు, పెద్ద పులులు, నల్లచారల దుప్పిలు, అడవి దున్నలు, గోకర్ణ మృగములు, కర్ణాంత్ర మృగములు, గుఱ్ఱపు ముఖము గల మృగములు, తోడేళ్లు, కస్తూరి మృగములు మొదలగు జంతువులు సంచరించుచుండును. అక్కడి నదులకు, సరస్సులకు తీరములపై అరటి చెట్లు దట్టముగా ఆవరించి చాల శోభను చేకూర్చును.

పర్యస్తం నందయా సత్యాస్స్నానపుణ్యతరోదయా ।
విలోక్య భూతేశగిరిం విబుధా విస్మయం యయుః ॥ 22

సత్యాః - సతీదేవియొక్క, స్నానపుణ్యతర-ఉదయా - స్నానముచే మిక్కిలి పవిత్రమైన నీరు గల, నందయా - నందా నదిచే, పర్యస్తమ్ - చుట్టువారబడి యున్న, భూత-ఈశగిరిమ్ - సకలప్రాణులకు నాథుడగు శివుని పర్వతమును, విలోక్య - తేరిపార జూచి, విబుధాః - దేవతలు, విస్మయమ్ - ఆశ్చర్యమును, యయుః - పొందిరి.

సతీదేవి స్నానము చేయుటచే మిక్కిలి పవిత్రము చేయబడిన నీరు గల నందా నది కైలాసము చుట్టూ ప్రవహించుచుండును. సకలప్రాణులకు నాథుడగు శివుని నివాసమగు ఆ పర్వతమును చూచి, దేవతలు ఆశ్చర్యమును పొందిరి.

దదృశుస్తత్ర తే రమ్యామలకాం నామ వై పురీమ్ ।
వనం సౌగంధికం చాపి యత్ర తన్నామ పంకజమ్ ॥ 23

తే - వారు, తత్ర - అక్కడ, అలకాం నామ - అలక అని ప్రసిద్ధిని గాంచిన, పురీం వై - నగరమును, సౌగంధికం వనమ్ - సౌగంధికమనే వనమును, దదృశుః - చూచిరి, యత్ర - ఏ వనమునందైతే, తత్-నామ - అదే పేరు గల, పంకజమ్ - పద్మము గలదో.

వారు ఆ కైలాసమునందు అలకాపురము అని ప్రసిద్ధిని గాంచిన నగరమును, సౌగంధికమనే వనమును చూచిరి. ఆ అడవిలోని పద్మములకు సౌగంధికములు అని పేరు.

నందా చాలకనందా చ సరితౌ బాహ్యతః పురమ్ ।
తీర్థపాదపదాంభోజరజసాఽతీవ పావనే ॥ 24

తీర్థపాదపద-అంభోజరజసా - పవిత్రమగు పాదములు గల శివుని పాదపద్మముల ధూళిచే, అతీవ - మిక్కిలి, పావనే - పవిత్రము చేఎ, నందా - నంద, చ - మరియు, అలకనందా - అలకనంద అనే, సరితౌ - నదులు, పురం బాహ్యతః - నగరమునకు బయట.

నంద, అలకనంద అనే రెండు నదులు అలకాపురమునకు బయట ప్రవహించుచున్నవి. పావనము చేయు పాదములు గల శివుని పాదపద్మ ముల ధూళిచే ఆ నదులు మిక్కిలి పవిత్రములు అయినవి.

యయోస్సురస్త్రియః క్షత్తరవరుహ్య స్వధిష్ణ్యతః ।
క్రీడంతి పుంసస్సించంత్యో విగాహ్య రతికర్శితాః ॥ 25

క్షత్తః - ఓ విదురా!, రతికర్శితాః - భోగములచే అలసిపోయిన, సురస్త్రియః - దేవతాస్త్రీలు, స్వధిష్ణ్యతః - తమ లోకమునుండి, అవ రుహ్య - క్రిందకు దిగి వచ్చి, యయోః - ఏ రెండు నదులయందు, విగాహ్య - ప్రవేశించి, పుంసః - భర్తలను, సించంత్యః - నీటిని చల్లుచున్న వారై, క్రీడంతి - క్రీడించెదరో.

ఓ విదురా! దేవతాస్త్రీలు దేవభోగములచే అలసి సొలసినప్పుడు దేవలోకమునుండి క్రిందకు దిగి వచ్చి, ఆ రెండు నదులలో ఈదులాడు తూ, తమ భర్తలపై నీళ్లను చల్లుచూ, విహరించెదరు.

యయోస్తత్స్నానవిభ్రష్టనవకుంకుమపింజరమ్ ।
వితృషోఽపి పిబంత్యంభః పాయయంతో గజా గజీః ॥ 26

గజాః - మగ ఏనుగులు, వితృషః అపి - దాహము లేనివే అయిన నూ, తత్-స్నానవిభ్రష్టనవకుంకుమపింజరమ్ - ఆ దేవతాస్త్రీలు స్నానము చేయునప్పుడు జారిపోయిన కొత్త కుంకుమలచే పచ్చని రంగు గల, యయోః - ఏ నదులయొక్క, అంభః - నీటిని, గజీః - ఆడ ఏనుగులను, పాయయంతః - త్రాగించుచున్నవై, పిబంతి - త్రాగుచున్నవో.

దేవతాస్త్రీలు ఆ నదులలో జలకములాడినప్పుడు వారు కొత్తగా పెట్టుకున్న కుంకుమ కరిగిపోవుట వలన ఆ నీరు పచ్చగా నగును. అట్టి ఆ నీటిని మగ ఏనుగులు దాహము లేకున్ననూ, సుగంధముచే ఆకర్షింపబడి, ఆడ ఏనుగులకు త్రాగించి, తాము కూడ త్రాగుచుండును.

తారహేమమహారత్నవిమానశతసంకులామ్ ।
జుష్టాం పుణ్యజనస్త్రీభిర్యథా ఖం సతడిద్ఘనమ్ ॥ 27

తారహేమమహారత్నవిమానశతసంకులామ్ - ముత్యములు బంగారము గొప్ప రత్నములతో నిండియున్న వందలాది విమానములచే రద్దీగానుండునట్టియు, సతడిత్-వనమ్ - మెరుపులతో మరియు మేఘము లతో కూడియున్న, ఖం యథా - ఆకాశము వలె, పుణ్యజనస్త్రీభిః - యక్ష స్త్రీలచే, జుష్టామ్ - సేవించబడు ( ఆ నగరమును వారు చూచిరి).

అలకానగరముపై ఆకాశములో వందలాది విమానములు రద్దీగా తిరుగుచుండును. ఆ విమానములు ముత్యములతో, బంగారముతో మరియు గొప్ప రత్నములతో నిండియుండును. వాటిలో యక్షస్త్రీలు విహ రించుచుందురు. ఈ విధముగా, అలకాపురిలోని ఆకాశము మెరుపులతో (యక్షస్త్రీలకు పోలిక), మేఘములతో (విమానములకు పోలిక) నిండిన ఆకాశము వలె శోభిల్లుచుండును.

హిత్వా యక్షేశ్వరపురీం వనం సౌగంధికం చ తత్ ।
ద్రుమైః కామదుఘైర్హృద్యం చిత్రమాల్యఫలచ్ఛదైః ॥ 28

యక్ష-ఈశ్వరపురీమ్ - యక్షరాజగు కుబేరుని ఆ నగరమును, హిత్వా - దాటి, చిత్రమాల్యఫలచ్ఛదైః - రంగురంగుల పుష్పములు ఫల ములు పత్రములు గల, కామదుఘైః ద్రుమైః - కోరికలనీడేర్చే కల్ప వృక్షములతో, హృద్యమ్ - మనోహరమైన, తత్ - ఆ, సౌగంధికం వనం చ - సౌగంధిక వనమును చేరుకొనిరి.

దేవతలు యక్షరాజగు కుబేరుని నగరమగు అలకాపురిని దాటి సౌగంధిక వనమును చేరుకొనిరి. ఆ వనము కోరికలనీడేర్చే కల్పవృక్షము లతో మనోహరముగా నుండెను. ఆ వృక్షములు రంగు రంగుల పుష్పము లతో, పండ్లతో మరియు చిగుళ్లతో ప్రకాశించుచుండెను.

రక్తకంఠఖగానీకస్వరమండితషట్పదమ్ ।
కలహంసకులప్రేష్ఠఖరదండజలాశయమ్ ॥ 29

రక్తకంఠఖగానీకస్వరమండితషట్పదమ్ - కోకిల పక్షుల గుంపుల ధ్వనులచే శోభిల్లే తుమ్మెదలు గలిగినట్టియు, కలహంసకులప్రేష్ఠఖరదండ

జల-ఆశయమ్ - రాజహంసల గుంపులకు మిక్కిలి ప్రీతికరమైన పద్మము లతో నిండిన సరస్సులు గల (వనమును చేరిరి).

ఆ వనములో కోకిల గుంపుల కూతలు తుమ్మెదల ఝుంకారము లకు తోడైనవి. రాజహంసలకు మిక్కిలి ప్రీతికరమైన పద్మములతో సర స్సులు నిండియుండెను.

వనకుంజరసంఘృష్టహరిచందనవాయునా ।
అధి పుణ్యాజనస్త్రీణాం ముహురున్మథయన్మనః ॥ 30

వనకుంజరసంఘృష్టహరిచందనవాయునా - అడవిలోని ఏనుగు లచే రాపిడి చేయబడిన హరిచందనవృక్షములనుండి వీచే వాయువుచే, పు ణ్యాజనస్త్రీణామ్ - యక్షస్త్రీల, మనః - మనస్సును, అధి - అధికముగా, ముహుః - పలుమార్లు, ఉన్మథయత్ - కల్లోలపరచుచున్న (వనమును చేరిరి).

ఆ వనములో హరిచందన వృక్షములు గలవు. అడవి యేనుగులు దురదను తీర్చుకొనుటకై ఆ చెట్లకు తమ దేహములతో రాపిడి చేయగా, బెరడు బయట పడి, ఆ వృక్షముల మీదుగా వీచే గాలులు ఆ సుగంధ ముతో నిండియున్నవి. అట్టి పరిమళభరితములగు గాలులు యక్షస్త్రీల మనస్సులను పదే పదే అధికమగు క్షోభకు గురి చేయుచున్నవి.

వైదూర్యకృతసోపానా వాప్య ఉత్పలమాలినీః ।
ప్రాప్తం కింపురుషైర్దృష్ట్వా త ఆరాద్దదృశుర్వటమ్ ॥ 31

వైదూర్యకృతసోపానాః - వైదూర్యమణులచే పొదగబడిన మెట్లు గలిగినట్టియు, ఉత్పలమాలినీః - నల్లకలువల పంక్తులు గల, వాప్యః - దిగుడు బావులను, కింపురుషైః - కింపురుషులచే, ప్రాప్తమ్ - పొందబడిన ఆ సౌగంధిక వనమును, దృష్ట్వా - చూచి, తే - వారు, ఆరాత్ - దగ్గరలో, వటమ్ - మఱ్ఱిచెట్టును, దదృశుః - చూచిరి.

ఆ వనములోని దిగుడు బావుల మెట్లు వైదూర్యమాణిక్యములతో పొదగబడి యున్నవి. ఆ బావులు నల్ల కలువల వరుసలతో శోభిల్లినవి.

వారా బావులను, అక్కడ విహరించే కింపురుషులను చూచి, దగ్గరలో ఒక మర్రి చెట్టును చూచిరి.

స యోజనశతోత్సేధః పాదోనవిటపాయతః ।
పర్యక్కృతాచలచ్ఛాయో నిర్నీడస్తాపవర్జితః ॥ 32

సః - ఆ చెట్టు, యోజనశత-ఉత్సేధః - వంద యోజనముల యెత్తు గలది, పాద-ఊనవిటప-ఆయతః - డెబ్బది అయిదు యోజనముల పొడవు గల కొమ్మలు గలది, పర్యక్-కృత-అచలచ్ఛాయః - అన్నివైపులా చేయబడిన తొలగిపోని నీడ గలది, నిర్నీడః - పక్షి గూళ్లు లేనిది, తాపవర్జితః - వేడి లేనిది.

ఆ చెట్టు వంద యోజనముల యెత్తు ఉండెను. దాని కొమ్మలు డెబ్బది అయిదు యోజనముల పొడవు కలిగియుండెను. దాని క్రింద అన్ని వైపులా ఉండే నీడ ఎప్పటికీ తొలగిపోదు. దానిపై పక్షి గూళ్లు లేవు. దాని క్రింద తాపము ఉండదు.

తస్మిన్ మహాయోగమయే ముముక్షుశరణే సురాః ।
దదృశుశ్శివమాసీనం త్యక్తామర్షమివాంతకమ్ ॥ 33

మహాయోగమయే - అణిమ మొదలగు గొప్ప సిద్ధులకు నిలయమైనది (మహాయోగులగు సనకాదులచే అధికముగా దర్శించబడేది), ముముక్షుశరణే - మోక్షమును కోరువారికి ఆశ్రయమైనది అగు, తస్మిన్ - ఆ చెట్టువద్ద, ఆసీనమ్ - కూర్చున్నట్టియు, త్యక్త-అమర్షమ్ - విడువబడిన కోపము గల, అంతకం ఇవ - యముని వలెనున్న, శివమ్ - శివుని, సురాః - దేవతలు, దదృశుః - చూచిరి.

ఆ చెట్టు అణిమ మొదలగు గొప్ప సిద్ధులకు నిలయము. దాని వద్ద సనకాది యోగిపుంగవులు తరచు కానవచ్చెదరు. మోక్షమును కోరు సాధకులు ఆ వృక్షమును ఆశ్రయించెదరు. దాని వద్ద కూర్చుండియున్న శివుడు దేవతలకు కానవచ్చెను. ఆయన కోపమును వీడిన యముని వలె నుండెను.

సనందాద్యైర్మహాసిద్ధైశ్శాంతైస్సంశాంతవిగ్రహమ్ ।
ఉపాస్యమానం సఖ్యా చ భర్త్రా గుహ్యకరక్షసామ్ ॥ 34

శాంతైః - రాగద్వేషములు లేని, సనంద-ఆద్యైః - సనందనుడు మొదలగు, మహాసిద్ధైః - గొప్ప సిద్ధులచే, చ - మరియు, గుహ్యకరక్షసామ్ - యక్షులకు రాక్షసులకు, భర్త్రా - ప్రభువైన, సఖ్యా - మిత్రుడగు కుబేరునిచే, ఉపాస్యమానమ్ - ఉపాసించబడుచున్నట్టియు, సంశాంతవిగ్రహమ్ - మిక్కిలి శాంతమైన రూపము కలిగిన (శివుని చూచిరి).

రాగద్వేషములు లేని సనక సనందనాది మహాసిద్ధులు పరమశాంతస్వరూపుడగు ఆ శివుని ఉపాసించుచుండిరి. యక్షరాక్షసప్రభువు, శివునకు మిత్రుడు అగు కుబేరుడు కూడ ఆయనను సేవించుచుండెను.

విద్యాతపోయోగపథమాస్థితం తమధీశ్వరమ్ ।
చరంతం విశ్వసుహృదం వాత్సల్యాల్లోకమంగలమ్ ॥ 35

విద్యాతపోయోగపథమ్ - ఉపాసన చిత్తసమాధానము మరియు అష్టాంగయోగముల మార్గమును, ఆస్థితమ్ - అనుష్ఠించుచున్నట్టియు, అధి-ఈశ్వరమ్ - జగన్నాథుడైనట్టియు, విశ్వసుహృదమ్ - జగత్తునకు హితకారి అయినట్టియు, వాత్సల్యాత్ - ప్రేమ వలన, లోకమంగలమ్ - లోకముల కల్యాణమును, చరంతమ్ - అనుష్ఠించుచున్న (శివుని చూచిరి).

జగన్నాథుడగు శివుడు సాధకులకు మార్గదర్శనమును చేయుటకై ఉపాసన, చిత్తైకాగ్రత మరియు అష్టాంగయోగము అనే సాధనములను అనుష్ఠించుచుండును. జగత్తునకు హితకారి, మిత్రుడు అగు ఆయన ప్రేమస్వరూపుడగుటచే, లోకములకు కల్యాణమును చేయుచుండును.

లింగం చ తాపసాభీష్టం భస్మదండజటాజినమ్ ।
అంగేన సంధ్యాభ్రరుచా చంద్రలేఖాం చ బిభ్రతమ్ ॥ 36

సంధ్యా-అభ్రరుచా - సంధ్యాకాలమునందలి మేఘముయొక్క కాంతిగల, అంగేన - శరీరముచే, తాపస-అభీష్టమ్ - తపశ్శాలురకు ప్రియమైన, భస్మదండజటా-అజినమ్ - భస్మ దండము జటలు మరియు

మృగచర్మము అనే, లింగమ్ - చిహ్నమును, చంద్రలేఖాం చ - చంద్రవంకను కూడ, బిభ్రతమ్ - ధరించియున్న (శివుని చూచిరి).

శివుని శరీరము సంధ్యాకాలమునందలి మేఘము వలె ఎర్రగా ప్రకాశించుచుండెను. ఆయన భస్మను, దండమును, జటలను, మృగచర్మమును ధరించియుండెను. ఈ చిహ్నములు తపశ్శాలురకు ప్రియమైనవి. ఆయన శిరస్సుపై చంద్రవంకను కూడ దాల్చియుండెను.

ఉపవిష్టం దర్భమయ్యాం బృస్యాం బ్రహ్మ సనాతనమ్ ।
నారదాయ ప్రవోచంతం పృచ్ఛతే శృణ్వతాం సతామ్ ।। 37

దర్భమయ్యామ్ - దర్భలతో చేసిన, బృస్యామ్ - ఆసనమునందు, ఉపవిష్టమ్ - కూర్చుని యున్నట్టియు, పృచ్ఛతే - ప్రశ్నించిన, నారదాయ - నారదుని కొరకు, సనాతనమ్ - కాలమునకు అతీతమైన, బ్రహ్మ - పరబ్రహ్మను గురించి, సతామ్ - సనకాది మహాత్ములు, శృణ్వతామ్ - వినుచుండగా, ప్రవోచంతమ్ - ప్రవచించుచున్న (శివుని చూచిరి).

శివుడు దర్భాసనముపై కూర్చుండి, తనను ప్రశ్నించిన నారదునకు కాలాతీతమగు పరబ్రహ్మతత్త్వమును ఉపదేశించుచుండెను. సనకాది మహాత్ములు ఆ ఉపదేశమును వినుచుండిరి.

కృత్వోరౌ దక్షిణే సవ్యం పాదపద్మం చ జానుని ।
బాహుప్రకోష్ఠేఽక్షమాలామాసీనం తర్కముద్రయా ।। 38

దక్షిణే - కుడి, ఊరౌ - తొడయందు, సవ్యమ్ - ఎడమ, పాదపద్మమ్ - పద్మమువంటి పాదమును, కృత్వా - ఉంచి, చ - మరియు, జానుని - మోకాలియందు, బాహుప్రకోష్ఠే - చేతి మణికట్టునందు, అక్షమాలామ్ - జపమాలను, కృత్వా - ఉంచి, తర్కముద్రయా - జ్ఞానముద్రతో, ఆసీనమ్ - కూర్చున్న (శివుని చూచిరి).

ఆయన కుడితొడపై పద్మమువంటి ఎడమపాదమును పెట్టి (వీరాసనము), ఎడమచేతిలో జపమాలను పట్టుకొని, దానిని ఎడమ మోకాలిపై

ఆన్చి, కుడిచేతితో జ్ఞానముద్ర (బొటనవ్రేలితో చూపుడు వ్రేలును కలిపి, మిగిలిన మూడు వ్రేళ్లను నిటారుగా నుంచుట) పట్టి కూర్చుండెను.

తం బ్రహ్మనిర్వాణసమాధిమాశ్రితం
వ్యుపాశ్రితం గిరిశం యోగకక్షామ్ ।
సలోకపాలా మునయో మనూనా-
మాద్యం మనుం ప్రాంజలయః ప్రణేముః ॥ 39

బ్రహ్మనిర్వాణసమాధిమ్ - బ్రహ్మానందమునందు చిత్తముయొక్క ఏకాగ్రతను, ఆశ్రితమ్ - ఆశ్రయించి ఉన్నట్టియు, యోగకక్షామ్ - యోగపట్టమును, వ్యుపాశ్రితమ్ - గట్టిగా దగ్గరగా లాగి కట్టుకున్నట్టియు, మనూనామ్ - మననశీలురలో, ఆద్యమ్ - మొట్టమొదటి, మనుమ్ - మననశీలుడైన, తమ్ - ఆ, గిరిశమ్ - కైలాసపతిని, సలోకపాలాః - లోకపాలకులతో కూడియున్న, మునయః - మహర్షులు, ప్ర-అంజలయః - చేతులను జోడించినవారై, ప్రణేముః - నమస్కరించిరి.

శివుడు యోగపట్టమును గట్టిగా దగ్గరకు లాగి కట్టుకొని మనస్సును బ్రహ్మానందమునందు స్థిరముగా లగ్నము చేసి కూర్చుండెను. ఆత్మనిష్ఠులగు వారిలో ఆయన అగ్రగణ్యుడు. ఆ కైలాసపతిని చూచి, లోకపాలకులు, మహర్షులు చేతులను జోడించి నమస్కరించిరి.

స తూపలభ్యాగతమాత్మయోనిం
సురాసురేశైరభివందితాంఘ్రిః ।
ఉత్థాయ చక్రే శిరసాఽభివందన-
మర్హత్తమః కస్య యథైవ విష్ణుః ॥ 40

సుర-అసుర-ఈశైః - దేవప్రభువులచే మరియు రాక్షసప్రభువులచే, అభివందిత-అంఘ్రిః - నమస్కరించబడే పాదములు గల, సః తు - ఆ శివుడైతే, ఆగతమ్ - వచ్చియున్న, ఆత్మయోనిమ్ - స్వయంభువుడగు బ్రహ్మగారిని, ఉపలభ్య - చూచి, ఉత్థాయ - లేచి నిలబడి, అర్హత్-తమః ఏవ - మిక్కిలి పూజింపదగినవాడే అయిననూ, విష్ణుః - విష్ణువు, కస్య

యథా - కశ్యప ప్రజాపతికి వలె, శిరసా - శిరస్సుతో, అభివందనమ్ - అభివాదమును, చక్రే - చేసెను.

శివుని పాదపద్మములకు దేవప్రభువులు మరియు రాక్షసప్రభువులు కూడ నమస్కరించుచుందురు. శ్రీమహావిష్ణువు పూజనీయులలో సర్వశ్రేష్ఠుడే అయినా, (వామనావతారములో) కశ్యప ప్రజాపతికి నమస్కరించును. అదే విధముగా శివుడు కూడ, తన వద్దకు వచ్చిన స్వయంభువుడగు బ్రహ్మగారిని చూచి, లేచి నిలబడి, తల వంచి నమస్కరించెను.

తథాऽపరే సిద్ధగణా మహర్షిభి-
ర్యే వై సమంతాదను నీలలోహితమ్ ।
నమస్కృతః ప్రాహ శశాంకశేఖరం
కృతప్రణామం ప్రహసన్నివాత్మభూః ॥ 41

తథా - అదే విధముగా, అపరే - ఇతరులగు, మహా-ఋషిభిః - మహర్షులతో గూడియున్న, సిద్ధగణాః - సిద్ధపురుషుల గణములు, నీలలోహితమ్ - శివుని, అను - అనుసరించువారు, యే వై - ఎవరైతే, సమంతాత్ - అన్ని వైపులా ఉన్నారో (వారు కూడ నమస్కరించిరి), నమస్కృతః - నమస్కరించబడిన, ఆత్మభూః - స్వయంభువుడగు బ్రహ్మగారు, ప్రహసన్ ఇవ - నవ్వుచున్నవాని వలె, కృతప్రణామమ్ - చేయబడిన నమస్కారము గల, శశాంక శేఖరమ్ - చంద్రవంక శిరోభూషణముగా గల శివుని ఉద్దేశించి, ప్రాహ - పలికెను.

అదే విధముగా, శివుని అనుయాయులు, శివునకు నలువైపులా ఉన్న సిద్ధగణములు, మహర్షులు కూడ బ్రహ్మగారికి నమస్కరించిరి. (శివుడు కంఠమునందు నీలవర్ణమును, దేహమంతటా ఎర్రని రంగును కలిగియుండును). సర్వులు శివునకు నమస్కరించిరి. శివుడు చంద్రవంకయే శిరోభూషణముగా గలవాడై ప్రకాశించుచుండెను. స్వయంభువుడగు బ్రహ్మగారు అప్పుడు చిరునవ్వుతో, తనకు నమస్కారమును చేసిన ఆ శివుని ఉద్దేశించి ఇట్లు పలికెను.

బ్రహ్మోవాచ ।
జానే త్వామీశం విశ్వస్య జగతో యోనిబీజయోః ।
శక్తేశ్శివస్య చ పరం యత్తద్బ్రహ్మ నిరంతరమ్ ॥ 42

విశ్వస్య - జగత్తునకు, ఈశమ్ - నాథుడవైనట్టియు, జగతః - జగత్తునకు, యోనిబీజయోః - కారణము మరియు బీజము అయిన, శక్తేః - మాయాశక్తికి, చ - మరియు, శివస్య - పురుషునకు, పరమ్ - అతీతమైనట్టియు, నిరంతరమ్ - రెండవది లేని, యత్ - ఏ, బ్రహ్మ - పరబ్రహ్మ గలదో, తత్ - అది అయి ఉన్న, త్వామ్ - నిన్ను, జానే - తెలియుదును.

బ్రహ్మగారు ఇట్లు పలికెను --- నీవు సర్వజగన్నాథుడవు. జగత్తు పుట్టుటకు ఉపాదానము మాయాశక్తి కాగా, నిమిత్తము శివుడగుచున్నాడు. ప్రకృతి పురుషుల కలయిక చేతనే జగత్తు ఉద్భవించుచున్నది. ఈ విధముగా జగత్తునకు శక్తి, శివుడు తల్లిదండ్రులగుచున్నారు. అట్టి శివశక్తులకు అతీతమైనట్టియు, రెండవది లేనట్టియు, వేదాంతములలో ప్రసిద్ధమైన ఏకరసమగు పరబ్రహ్మ యేది గలదో, అది నీవేనని నాకు తెలియును.

త్వమేవ భగవన్నేతచ్ఛివశక్త్యోస్సరూపయోః ।
విశ్వం సృజసి పాస్యత్సి క్రీడన్నూర్ణపటో యథా ॥ 43

భగవన్ - ఓ భగవానుడా!, త్వం ఏవ - నీవే, సరూపయోః - సమానములైన, శివశక్త్యోః - శివశక్తులయందు, క్రీడన్ - క్రీడించుచున్నవాడవై, ఏతత్ - ఈ, విశ్వమ్ - జగత్తును, ఊర్ణపటః యథా - సాలెపురుగు వలె, సృజసి - సృష్టించుచున్నావు, పాసి - రక్షించుచున్నావు, అత్సి - భక్షించుచున్నావు.

ఓ భగవానుడా! నీవే శివశక్తుల రూపములో ప్రకటమై ఆ రూపములలో క్రీడించుచున్నావు. శివశక్తులు నీయందు అభేదమును పొందుచున్నారు. ఈ జగత్కార్యములు నీకు లీల మాత్రమే. సాలెపురుగు గూడును తన నుండియే ప్రకటము చేసి, మరల తనలోనే విలీనము చేసుకొనును. అదే విధముగా, నీవు కూడ నీనుండియే ఈ జగత్తును వెలయింపజేసి, దానికి

స్థితికాలములో ఉనికిని చైతన్యప్రకాశమును అనుగ్రహించి, మరల నీ లోనికి ఉపసంహరించుకొనుచున్నావు.

త్వమేవ ధర్మార్థదుఘాభిపత్తయే
దక్షేణ సూత్రేణ ససర్జిథాధ్వరమ్ ।
త్వయైవ లోకేఽవసితాశ్చ సేతవో
యాన్ బ్రాహ్మణాశ్శ్రద్దధతే ధృతవ్రతాః ॥ 44

ధర్మ-అర్థదుఘ-అభిపత్తయే - ధర్మార్థములనే పురుషార్థములను అనుగ్రహించే వేదమాతను రక్షించుట కొరకు, దక్షేణ - దక్షుడు అనే, సూత్రేణ - నిమిత్తము ద్వారా, అధ్వరమ్ - యజ్ఞమును, ససర్జిథ - ప్రవర్తిల్ల జేసితివి, త్వయా ఏవ - నీచే మాత్రమే, లోకే - లోకమునందు, సేతవః - ధర్మమర్యాదలు, అవసితాః చ - నిబద్ధములై యున్నవి, యాన్ - వేటిని, ధృతవ్రతాః - స్వీకరించబడిన వ్రతనిష్ఠ గల, బ్రాహ్మణాః - వేదవేత్తలు, శ్రద్దధతే - శ్రద్ధతో అనుష్ఠించుచున్నారో.

ధర్మార్థకామములనే పురుషార్థములను వేదము జనులకు అనుగ్రహించుచున్నది. అట్టి వేదమును రక్షించుట కొరకై నీవు దక్షుని నిమిత్తముగా చేసి, యజ్ఞమును ప్రవర్తిల్ల జేసినావు. ఈ లోకములో ధర్మము యొక్క మర్యాదలను నిలబెట్టేది నీవే. ఆ మర్యాదలనే నియమనిష్ఠ గల వేదవేత్తలు శ్రద్ధతో అనుష్ఠించుచున్నారు.

త్వం కర్మణాం మంగల మంగలానాం
కర్తుస్స్మ లోకే తనుషే స్వః పరం వా ।
అమంగలానాం చ తమిస్రముల్బణం
విపర్యయః కేన తదైవ కస్యచిత్ ॥ 45

మంగల - మంగలమయుడవగు ఓ శివా!, లోకే - లోకమునందు, మంగలానామ్ - మంగళమయములగు, కర్మణామ్ - కర్మలకు, కర్తుః - చేయువానికి, స్వః - స్వర్గమును గాని, పరం వా - మోక్షమును గాని, తనుషే స్మ - అనుగ్రహించుచున్నావు, చ - ఇంతేగాక, అమంగలానామ్ -

తప్పు పనులకు (చేయువానికి), ఉల్బణమ్ - భయంకరమగు, తమిస్రమ్ - నరకమును (ఇచ్చుచున్నావు), కేన - ఏదో ఒక కారణముచే, తత్ ఏవ - అదే కర్మ విషయములో, కస్యచిత్ - ఒకానొకనికి, విపర్యయః - ఫలము తల్లక్రిందులగును.

మంగళమయుడవగు ఓ శివా! లోకములో మంగళకర్మలను సకామముగా చేయువారికి స్వర్గసుఖములను, నిష్కామముగా చేయువారలకు పరమపురుషార్థమగు మోక్షమును నీవు అనుగ్రహించుచున్నావు. తప్పు పనులను చేయువారలను నీవు భయంకరమగు నరకములోనికి నెట్టివేయుచున్నావు. కాని, ఒకప్పుడు మాకు తెలియరాని కారణములచే ఒకానొకనికి ఈ ఫలములు తల్లక్రిందులగును. అనగా, దక్షుడు వంటి వాడు మంచి పనిని మొదలిడి అమంగళమును పొందును.

న వై సతాం త్వచ్చరణార్పితాత్మనాం
భూతేషు సర్వేష్వభిపశ్యతాం తవ ।
భూతాని చాత్మన్యపృథగ్దిదృక్షతాం
ప్రాయేణ రోషోఽభిభవేద్యథా పశుమ్ ॥ 46

త్వత్-చరణ-అర్పిత-ఆత్మనామ్ - నీ పాదములయందు లగ్నము చేయబడిన మనస్సు గలిగినట్టియు, సర్వేషు - సకలములగు, భూతేషు - ప్రాణులయందు, తవ - నిన్ను, అభిపశ్యతామ్ - వ్యాపించియున్నవానినిగా చూచునట్టియు, చ - మరియు, భూతాని - ప్రాణులను, ఆత్మని - తమయందు, అపృథక్ - భేదము లేని విధముగా, దిదృక్షతామ్ - చూడగోరు, సతామ్ - మహాత్ములకు, ప్రాయేణ - తరచుగా, పశుం యథా - పశువును (అజ్ఞానిని) వలె, రోషః - కోపము, న వై అభిభవేత్ - నిశ్చయముగా పరాభూతులను చేయదు.

పశువులకు, అజ్ఞానులకు కోపము వచ్చినచో తరచుగా ఒళ్లు తెలియదు. కాని, మహాత్ములు ఆ విధముగా కోపముచే పరాభూతులు కారు. వారు తమ మనస్సును నీ పాదములపై నిలిపి యుంచెదరు. సకలప్రాణులలో ఆత్మరూపముగా వ్యాపించియున్న నిన్ను వారు సర్వత్రా దర్శించెద

రు. మరియు, వారు బ్రహ్మాభిన్నమగు ఆత్మయందు సకలప్రాణులను (సకలజగత్తును) అభిన్నముగా దర్శించెదరు.

పృథగ్ధియః కర్మదృశో దురాశయాః
పరోదయేనార్పితహృద్రుజోఽనిశమ్ ।
పరాన్ దురుక్తైర్వితుదంత్యరుంతుదా-
స్తాన్ మాఽవధీద్దైవవధాన్ భవద్విధః ॥ 47

పృథక్-ధియః - భేదదృష్టి కలిగినట్టియు, కర్మదృశః - కర్మయందు మాత్రమే దృష్టి కలిగినట్టియు, దుర్-ఆశయాః - చెడు బుద్ధి కలిగినట్టియు, పర-ఉదయేన - ఇతరుల అభివృద్ధిచే, అనిశమ్ - సర్వకాలములలో, అర్పితహృత్-రుజః - చేయబడిన మానసిక పీడ కలిగినట్టియు, అరుంతుదాః - మర్మములను పొడిచే జనులు, పరాన్ - ఇతరులను, దుర్-ఉక్తైః - చెడు మాటలతో, వితుదంతి - విశేషముగా పొడిచెదరు, భవత్-విధః - నీవంటివాడు, దైవవధాన్ - దైవముచే వధింపబడే, తాన్ - వారిని, మా అవధీత్ - సంహరించరాదు.

కొందరు సర్వత్ర భేదమునే గాంచెదరు. వారి దృష్టి కర్మలయందే గాని, ఈశ్వరునియందు ఉండదు. చెడు బుద్ధి గల ఇట్టి జనులు ఇతరుల ఉన్నతిని చూచి తమ హృదయములో సర్వదా మాత్సర్యదుఃఖమును పొందుచుందురు. వారు మర్మస్థానములను పొడిచే ఈటెలవంటి మాటలతో ఇతరులకు విశేషముగా దుఃఖమును కలిగించెదరు. అట్టి దుష్టులను కర్మఫలరూపమగు దైవమే వధించును. దక్షుడు అట్టివారిలో ఒకడు. వానిని నీవంటి మంగళస్వరూపుడు సంహరించ వద్దని ప్రార్థించుచున్నాము.

యస్మిన్ యదా పుష్కరనాభమాయయా
దురంతయా స్పృష్టధియః పృథగ్దృశః ।
కుర్వంతి తత్ర హ్యనుకంపయా కృపాం
న సాధవో దైవబలాత్కృతే క్రమమ్ ॥ 48

దురంతయా - దాట శక్యము కాని, పుష్కరనాభమాయయా - పద్మనాభుని మాయచే, స్పృష్టధియః - మోహింపజేయబడిన బుద్ధి గలిగి నట్టియు, పృథక్-దృశః - భేదమును దర్శించే జనులు, యస్మిన్ - ఏ స్థానమునందు, యదా - ఏ కాలమునందు (ఉండెదరో), తత్ర - ఆ దేశకాలములయందు, దైవబలాత్ - ప్రారబ్ధబలముచే, కృతే - చేయబడిన అపరాధము విషయములో, సాధవః - మహాత్ములు, అనుకంపయా - దయచే, కృపామ్ - అనుగ్రహమును, కుర్వంతి హి - చేయుచుందురు గదా!, క్రమమ్ - పరాక్రమమును, న - చేయరు.

పద్మనాభుని మాయను అధిగమించుట చాల కష్టము. దానిచే మోహమును పొందిన బుద్ధి గల జనులు భేదమును మాత్రమే దర్శించుచుందురు. అట్టివారు ఏయే దేశకాలములయందు దైవబలముచే ఏయే అపరాధములను చేసిననూ, ఆయా దేశకాలములయందు ఆయా అపరాధములను మహాత్ములు దయతో క్షమించి, అనుగ్రహమునే చూపెదరు. అంతేగాని, వారిపై మహాత్ములు తమ పరాక్రమమును చూపించరు.

భవాంస్తు పుంసః పరమస్య మాయయా
దురంతయాఽస్పృష్టమతిస్సమస్తదృక్ ।
తయా హతాత్మస్వనుకర్మచేత-
స్స్వనుగ్రహం కర్తుమిహార్హసి ప్రభో ॥ 49

ప్రభో - ఓ ప్రభూ!, పరమస్య పుంసః - పరమపురుషుడగు భగవానుని, దురంతయా - అధిగమించ శక్యము కాని, మాయయా - మాయచే, అస్పృష్టమతిః - స్పృశించబడని బుద్ధిగలిగినట్టియు, సమస్తదృక్ - సర్వజ్ఞుడైన, భవాన్ తు - నీవైతే, తయా - ఆ మాయచే, హత-ఆత్మసు - నశింపజేయబడిన బుద్ధి కలిగినట్టియు, అనుకర్మచేతస్సు - కర్మలయందు ఆసక్తమైన బుద్ధిగలవారియందు, ఇహ - ఈ అపరాధము విషయములో, అనుగ్రహమ్ - అనుగ్రహమును, కర్తుమ్ - చేయుటకు, అర్హసి - తగుదువు.

ఓ ప్రభూ! పరమపురుషుడగు భగవానుని మాయను అధిగమించుట కష్టము. కాని, సర్వజ్ఞుడవగు నీయొక్క బుద్ధిని ఆ మాయ స్పృశించ

లేదు. కాని, ఆ మాయచే నశింపజేయబడిన బుద్ధి గల దక్షాదులు కర్మల యందు మాత్రమే తగుల్కొన్న చిత్తమును కలిగియుందురు. వారియందు నీవు ఈ జరిగిన అపరాధము విషయములో అనుగ్రహమును చూప దగు దువు.

కుర్వధ్వరస్యోద్ధరణం హతస్య భో-
  స్త్వయాఽసమాప్తస్య మనో ప్రజాపతేః ।
న యత్ర భాగం తవ భాగినో దదుః
  కుయజ్వినో యేన మఖో నినీయతే ॥ 50

భోః మనో - ఓయీ ఆదికారణుడా!, త్వయా - నీచే, హతస్య - ధ్వంసము చేయబడిన, అసమాప్తస్య - సమాప్తిని చెందని, ప్రజాపతేః - దక్షప్రజాపతియొక్క, అధ్వరస్య - యజ్ఞముయొక్క, ఉద్ధరణమ్ - ఉద్ధరణ మును, కురు - చేయుము, యత్ర - ఏ యజ్ఞమునందు, కుయజ్వినః - దుష్టులగు యాజ్ఞికులు, భాగినః - భాగము గల, తవ - నీకు, భాగమ్ - భాగమును, న దదుః - ఈయలేదో, యేన - ఏ నీచే, మఖః - యజ్ఞము, నినీయతే - ఫలమునీయబడుచున్నదో.

ఓయీ ఆదికారణా శివా! నీవు ధ్వంసము చేయుటచే దక్ష ప్రజాప తియొక్క యజ్ఞము సమాప్తము కాలేదు. ఆ యజ్ఞమును నీవు ఉద్ధరించు ము. యజ్ఞమునందు నీకు భాగము గలదు. యజ్ఞమునకు ఫలమునిచ్చువా డవు నీవే. కాని, దుష్టులగు యాజ్ఞికులు నీకా యజ్ఞమునందు భాగమునీ యకుండిరి.

జీవతాద్యజమానోఽయం ప్రపద్యేతాక్షిణీ భగః ।
భృగోశ్శ్మశ్రూణి రోహంతు పూష్ణో దంతాశ్చ పూర్వవత్ ॥51

**యజమానః - యజమానుడగు, అయమ్ - ఈ దక్షుడు, జీవతాత్ - జీవించుగాక!, భగః - భగుడు, అక్షిణీ - కన్నులను, ప్రపద్యేత - పొందు గాక!, భృగోః - భృగు మహర్షికి, శ్మశ్రూణి - మీసములు గెడ్డము, రోహంతు - మొలుచును గాక!, చ - మరియు, పూష్ణః - పూష దేవతకు, దంతాః - దంతములు, పూర్వవత్ - పూర్వమునందు వలెనే ఉండుగాక!**

యజమానుడగు ఈ దక్షుడు తిరిగి జీవించునట్లు, భగునకు కన్నులు వచ్చునట్లు, భృగు మహర్షికి మీసములు గెడ్డములు తిరిగి మొలుచునట్లు, మరియు పూష దేవతకు పూర్వమునందు వలెనే దంతములు వచ్చునట్లు నీవు అనుగ్రహించుము.

దేవానాం భగ్నగాత్రాణామృత్విజాం చాయుధాశ్మభిః ।
భవతానుగృహీతానామాశు మన్యోఽస్త్వనాతురమ్ ॥ 52

మన్యో - ఓ రుద్రా!, ఆయుధ-అశ్మభిః - ఆయుధములచే మరియు రాళ్లచే, భగ్నగాత్రాణామ్ - విరుగగొట్టబడిన అవయవములు కలిగినట్టియు, భవతా - నీచే, అనుగృహీతానామ్ - అనుగ్రహించబడిన, దేవానామ్ - దేవతలకు, చ - మరియు, ఋత్విజామ్ - ఋత్విక్కులకు, ఆశు - వెంటనే, అనాతురమ్ - ఆరోగ్యము, అస్తు - కలుగుగాక!

ఓ రుద్రదేవా! ఆయుధములచే మరియు రాళ్లచే దేవతలకు, ఋత్విక్కులకు అవయవములు విరుగగొట్టబడినవి. వారికి మరల నీ అనుగ్రహముచే వెంటనే స్వస్థత చేకూరుగాక!

ఏష తే రుద్ర భాగోఽస్తు యదుచ్ఛిష్టోఽధ్వరస్య వై ।
యజ్ఞస్తే రుద్ర భాగేన కల్పతామద్య యజ్ఞహన్ ॥ 53

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే చతుర్థస్కంధే రుద్రసాంత్వనం నామ షష్ఠోఽధ్యాయః ॥

రుద్ర - ఓ రుద్రా!, ఏషః - ఇది, తే - నీకొరకు, భాగః - భాగము, అస్తు - అగుగాక!, యత్ - ఏదైతే, అధ్వరస్య - యజ్ఞముయొక్క, ఉచ్ఛిష్టః - మిగిలినది కలదో, రుద్ర - ఓ రుద్రా!, యజ్ఞహన్ - యజ్ఞమును ధ్వంసము చేసినవాడా!, అద్య - ఈనాడు, తే - నీ, భాగేన - భాగముచే, యజ్ఞః - యజ్ఞము, కల్పతామ్ - సంపన్నమగును గాక!

యజ్ఞమును ధ్వంసము చేసిన ఓ రుద్రా! యజ్ఞము సమాప్తము కాగా మిగిలిన సర్వము నీ భాగమే అగుగాక! ఓ రుద్రదేవా! ఈనాడు యజ్ఞము నీ భాగముతోనే సుసంపన్నమగును గాక!

శ్రీమద్భాగవత మహాపురాణములోని నాల్గవ స్కంధములో
బ్రహ్మగారు రుద్రుని స్తుతించుట, దేవతలు రుద్రుని
ప్రసన్నుని చేసుకొనుట అనే ఆరవ
అధ్యాయము ముగిసినది (6).

*****

# అథ సప్తమోఽధ్యాయః

## దక్షయజ్ఞములో దేవతలు శ్రీహరిని స్తుతించుట

మైత్రేయ ఉవాచ ।
ఇత్యజేనానునీతేన భవేన పరితుష్యతా ।
అభ్యధాయి మహాబాహో ప్రహస్య శ్రూయతామితి ।। 1

మైత్రేయః - మైత్రేయుడు, ఉవాచ - పలికెను, మహాబాహో - గొప్ప బాహువులు గల ఓ విదురా!, ఇతి - ఈ విధముగా, అజేన - స్వయంభువుడగు బ్రహ్మగారిచే, అనునీతేన - ప్రార్థించబడినట్టియు, పరితుష్యతా - సంతోషించిన, భవేన - శివునిచే, ప్రహస్య - నవ్వి, శ్రూయతామ్ - వినబడుగాక!, ఇతి - అని, అభ్యధాయి - పలుకబడెను.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- గొప్ప బాహువులు గల ఓ విదురా! స్వయంభువుడగు బ్రహ్మగారు ఈ విధముగా ప్రార్థించగా, శివుడు సంతోషించి నవ్వుతూ, వినుడు అని పలికెను.

శ్రీమహాదేవ ఉవాచ ।
నాఘం ప్రజేశ బాలానాం వర్ణయే నానుచింతయే ।
దేవమాయాఽభిభూతానాం దండస్తత్ర ధృతో మయా ।। 2

ప్రజా-ఈశ - ఓ బ్రహ్మ!, దేవమాయా-అభిభూతానామ్ - ఈశ్వరుని మాయచే పరాభూతులైన, బాలానామ్ - అవివేకుల, అఘమ్ - అపరాధమును, న వర్ణయే - వర్ణించను, న అనుచింతయే - తరువాత ఆలోచించను, తత్ర - ఆ అపరాధము విషయములో, మయా - నాచే, దండః - శిక్ష, ధృతః - విధించబడినది.

మహాదేవుడగు శ్రీ శివుడు ఇట్లు పలికెను --- ఓ బ్రహ్మా! ఈశ్వరుని మాయచే మోహితులై వివేకమును కోల్పోయిన దక్షాదుల అపరాధమును గురించి నేను వర్ణించను; దాని గురించి నేను ఆలోచించనైననూ ఆలోచించను. కాని, ఆ సమయములో ఆ అపరాధమునకు తగిన శిక్షను నేను అమలు చేసితిని.

ప్రజాపతేర్దగ్ధశీర్ష్ణో భవత్వజముఖం శిరః ।
మిత్రస్య చక్షుషేక్షేత భాగం స్వం బర్హిషో భగః ॥ 3

దగ్ధశీర్ష్ణః - దహించబడిన శిరస్సు గల, ప్రజాపతేః - దక్ష ప్రజాపతికి, అజముఖమ్ - మేక ముఖము, శిరః - తల, భవతు - అగుగాక!, భగః - భగదేవత, మిత్రస్య - మిత్ర దేవతయొక్క, చక్షుషా - కంటితో, బర్హిషః - యజ్ఞముయొక్క, స్వమ్ - తన, భాగమ్ - భాగమును, ఈక్షేత - చూచుగాక!

దక్ష ప్రజాపతి తల దగ్ధమైనది. అతనికి మేక తల ఉండగలదు. కన్నులను పోగొట్టుకున్న భగదేవత యజ్ఞములో తన భాగమును మిత్రదేవతయొక్క కన్నుతో చూడగలదు.

పూషా తు యజమానస్య దద్భిర్జక్షతు పిష్టభుక్ ।
దేవాః ప్రకృతసర్వాంగా యే మ ఉచ్ఛేషణం దదుః ॥ 4

పూషా తు - పూష దేవతయైతే, యజమానస్య - యజమానుని, దద్భిః - దంతములతో, జక్షతు - నములుగాక!, పిష్టభుక్ - పిండిని తినుగాక!, యే - ఏ, దేవాః - దేవతలు, మే - నా కొరకు, ఉచ్ఛేషణమ్ - యజ్ఞములో మిగిలిన దానిని, దదుః - భాగముగా ఇచ్చినారో వారు, ప్రకృతసర్వ -అంగాః - పూర్వమునందు వలెనే ఉన్న అన్ని అవయవములు కలవారు.

పూష దేవత యజమానుని దంతములతో ఆహారమును నములుగాక! ఆతడు పిండినైననూ తినవచ్చును. దేవతలు యజ్ఞములో మిగిలిన సర్వమును నాకు భాగముగా ఇచ్చినారు. కావున, వారి అవయవములు పూర్వమునందు వలె స్వస్థములగుగాక!

**బాహుభ్యామశ్వినోః పూష్ణో హస్తాభ్యాం కృతబాహవః ।**
**భవంత్వధ్వర్యవశ్చాన్యే బస్తశ్మశ్రుర్భృగుర్భవేత్ ।। 5**

అన్యే - ఇతరులగు, అధ్వర్యవః చ - అధ్వర్యులు, అశ్వినోః - అశ్వినీదేవతల, బాహుభ్యామ్ - బాహువులతో, పూష్ణః - పూషదేవతయొక్క, హస్తాభ్యామ్ - ముంజేతులతో, కృతబాహవః - చేయబడిన బాహువులు గలవారై, భవంతు - అగుదురు గాక!, భృగుః - భృగు మహర్షి, బస్తశ్మశ్రుః - మేకపోతు గెడ్డము మీసములు గలవాడు అగుగాక!

చేతులను పోగొట్టుకున్న ఇతరులగు అధ్వర్యులనే ఋత్విక్కులు అశ్వినీ దేవతల బాహువులతో, పూష దేవత ముంజేతులతో తమ తమ పనులను చేసుకొందురు గాక! మీసములను, గెడ్డమును పోగొట్టుకున్న భృగు మహర్షికి మేకపోతు మీసములు, గెడ్డము ఉందగలవు.

మైత్రేయ ఉవాచ ।
తదా సర్వాణి భూతాని శ్రుత్వా మీఢుష్టమోదితమ్ ।
పరితుష్టాత్మభిస్తాత సాధు సాధ్విత్యథాబ్రువన్ ।। 6

తాత - వత్సా!, తదా - అప్పుడు, సర్వాణి - అన్ని, భూతాని - ప్రాణులు, మీఢుష్టమ-ఉదితమ్ - భక్తులకు కోర్కెలను వర్షించే శివునిచే చెప్పబడిన మాటను, శ్రుత్వా - విని, అథ - తరువాత, పరితుష్ట-ఆత్మభిః - మిక్కిలి సంతోషించిన మనస్సులు గలవియై, సాధు సాధు - బాగు బాగు, ఇతి - అని, అబ్రువన్ - పలికినవి.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- ఓ వత్సా విదురా! అప్పుడు అక్కడివారు అందరు శివుని మాటను విని తమ తమ హృదయములలో చాల సంతోషించిరి. శివుడు భక్తుల కోర్కెలను వర్షించే దైవము. అపుడు వారు సంతోషముతో బాగు, బాగు అని ఆయనను ప్రశంసించిరి.

**తతో మీఢ్వాంసమామంత్ర్య శునాసీరాస్సహర్షిభిః ।**
**భూయస్తద్దేవయజనం సమీఢ్వద్వేధసో యయుః ।। 7**

తతః - తరువాత, మీఢ్వాంసమ్ - భక్తులకు కోరికలను వర్షించే మహాదేవుని, ఆమంత్ర్య - ప్రార్థించి, శునాసీరాః - దేవతలు, సమీఢ్వత్-వేధసః - శివుడు బ్రహ్మ తోడుగా గలవారై, ఋషిభిః సహ - మహర్షులతో గూడి, భూయః - మరల, తత్ - ఆ, దేవయజనమ్ - యజ్ఞశాలను గురించి (తత్-దేవయజనమ్ - ఆ దక్షుని యజ్ఞశాలను గురించి), యయుః - వెళ్లిరి.

తరువాత ఆ దేవతలు శివుని ప్రార్థించి, ఆయనను బ్రహ్మగారిని దోడ్కొని, మహర్షులు వెంట రాగా, మరల ఆ దక్షుని యజ్ఞశాలకు వెళ్లిరి.

విధాయ కార్త్స్న్యేన చ తద్యదాహ భగవాన్ భవః ।
సందధుః కస్య కాయేన సవనీయపశోశ్శిరః ॥ 8

భగవాన్ - భగవానుడగు, భవః - శివుడు, యత్ - దేనిని, ఆహ - చెప్పినాడో, తత్ - దానిని, కార్త్స్న్యేన - పూర్తిగా, విధాయ - చేసి, సవనీయపశోః - యజ్ఞపశువుయొక్క శిరః - తలను, కస్య - దక్ష ప్రజాపతికి, సందధుః - అతికించిరి.

వారు అచట శివభగవానుడు చెప్పినట్లుగా సర్వమును చేసిరి. దక్ష ప్రజాపతి మొండెమునకు యజ్ఞపశువుయొక్క తలను అతికించిరి.

సంధీయమానే శిరసి దక్షో రుద్రాభివీక్షితః ।
సద్యస్సుప్త ఇవోత్తస్థౌ దదృశే చాగ్రతో మృడమ్ ॥ 9

శిరసి - తల, సంధీయమానే - అతికించబడుచుండగా, రుద్ర-అభివీక్షితః - శివునిచే ప్రసన్నముగా చూడబడిన, దక్షః - దక్షుడు, సద్యః - వెంటనే, సుప్తః ఇవ - నిద్రించినవాడు వలె, ఉత్తస్థౌ - లేచి నిలబడెను, చ - మరియు, అగ్రతః - ఎదురుగా, మృడమ్ - శివుని, దదృశే - చూచెను.

శివుడు దయాదృష్టితో చూచుచుండగా, తలను అతికించిన వెంటనే, దక్షుడు నిద్రించినవాడు వలె లేచి నిలబడెను. ఆతనికి యెదుట శివుడు కనబడెను.

తదా వృషధ్వజద్వేషకలిలాత్మా ప్రజాపతిః ।
శివావలోకాదభవచ్ఛరద్ధ్రద ఇవామలః ।। 10

తదా - అప్పుడు, వృషధ్వజద్వేషకలిల-ఆత్మా - వృషభమే ధ్వజముగా గల శివునియందలి ద్వేషముచే మలినమైన బుద్ధి గల, ప్రజాపతిః - దక్ష ప్రజాపతి, శివ-అవలోకాత్ - శివుని చూపు వలన (శివుని చూచుట వలన), శరత్-హ్రదః - శరత్కాలమునందలి చెరువు వలె, అమలః - స్వచ్ఛమైనవాడు, అభవత్ - ఆయెను.

వృషభధ్వజుడగు శివుని ద్వేషముచే దక్ష ప్రజాపతియొక్క అంతఃకరణము కలుషితమైనదియే. కాని, శివుని దయాదృష్టి ఆతనిపై పడెను. పైగా ఆతడు బ్రతికిన వెంటనే శివుని దర్శించెను. దాని వలన, ఆతని అంతఃకరణము శరత్కాలము రాగానే చెరువులలోని నీరు బురద దిగిపోయి తేటపడు విధముగా, స్వచ్ఛమయ్యెను.

భవస్తవాయ కృతధీర్నాశక్నోదనురాగతః ।
ఔత్కంఠ్యాద్బాష్పకలయా సంపరేతాం సుతాం స్మరన్ ।।11

భవస్తవాయ - శివుని స్తుతించుట కొరకు, కృతధీః - చేయబడిన సంకల్పము గలవాడే అయిననూ, సంపరేతామ్ - మరణించిన, సుతామ్ - కుమార్తెను, స్మరన్ - స్మరించువాడై, అనురాగతః - అనురాగము వలన, ఔత్కంఠ్యాత్ - ఆందోళన వలన, బాష్పకలయా - కన్నీటి ధారచే, న అశక్నోత్ - సమర్థుడు కాలేదు.

దక్షుడు శివుని స్తుతించవలెనని సంకల్పించెను. కాని, ఆతనికి మరణించిన కుమార్తె గుర్తుకు వచ్చి మనస్సు అనురాగముతో ఆందోళనతో నిండిపోయెను. కన్నీరు ధారగా స్రవించుచుండుటచే, ఆతడు మాటలాడలేకపోయెను.

కృచ్ఛ్రాత్సంస్తభ్య చ మనః ప్రేమవిహ్వలితస్సుధీః ।
శశంస నిర్వ్యలీకేన భావేనేశం ప్రజాపతిః ।। 12

సుధీః - విద్వాంసుడు, ప్రేమవిహ్వలితః - ప్రేమచే స్వాధీనత లేనివాడు అగు, ప్రజాపతిః - దక్ష ప్రజాపతి, మనః - మనస్సును, కృచ్ఛ్రాత్ - కష్టముతో, సంస్తభ్య - నిలద్రొక్కుకొని, నిర్-వ్యలీకేన - కపటము లేని, భావేన - భక్తితో, ఈశమ్ - శివుని, శశంస - స్తుతించెను.

దక్ష ప్రజాపతి విద్వాంసుడు. కాని, ఆతని మనస్సు ప్రేమచే స్వాధీనత తప్పియుండెను. ఆతడు కష్టము మీద మనస్సును నిలద్రొక్కుకొని, కపటము లేని భావము (భక్తి) తో శివుని స్తుతించెను.

దక్ష ఉవాచ ।
భూయాననుగ్రహ అహో భవతా కృతో మే
దండస్త్వయా మయి భృతో యదపి ప్రలబ్ధః ।
న బ్రహ్మబంధుషు చ వాం భగవన్నవజ్ఞా
తుభ్యం హరేశ్చ కుత ఏవ ధృతవ్రతేషు ।। 13

యత్ అపి ప్రలబ్ధః - నిందింపబడినవాడవే అయిననూ, భవతా - నీచే, మే - నా కొరకు, భూయాన్ - గొప్ప, అనుగ్రహః - అనుగ్రహము, కృతః - చేయబడినది, అహో - ఆశ్చర్యము!, త్వయా - నీచే, మయి - నాయందు, దండః - శిక్ష, భృతః - వేయబడినది, భగవన్ - ఓ భగవానుడా!, తుభ్యమ్ - నీకు, హరేః చ - శ్రీహరికి, వామ్ - మీ ఇద్దరికి, బ్రహ్మబంధుషు - బ్రాహ్మణాధములయందు, అవజ్ఞా - నిరాదరణ, న - లేదు, ధృతవ్రతేషు - ధరించబడిన వ్రతనిష్ఠ గలవారియందు, కుతః ఏవ - ఏల ఉండును?

దక్షుడు ఇట్లు పలికెను --- నేను నిన్ను నిందించితిని. అయిననూ, నీవు ముందుగా నాకు శిక్షను వేసి, తరువాత ఆ శిక్షను రద్దు చేసి, రెండు విధములుగా నాయందు అనుగ్రహమునే చూపితివి. ఆశ్చర్యము! ఓ భగవానుడా! నీకు, శ్రీహరికి బ్రాహ్మణాధములయందు కూడ నిరాదరణ లేదు. అట్టిచో, యజ్ఞదీక్షను స్వీకరించినవారియందు మీకిద్దరికి నిరాదరణ ఏల ఉండును?

విద్యాతపోవ్రతధరాన్ముఖతస్స్మ విప్రాన్
బ్రహ్మాత్మతత్త్వమవితుం ప్రథమం త్వమస్రాక్ ।
తద్బ్రాహ్మణాన్ పరమ సర్వవిపత్సు పాసి
పాలః పశూనివ విభో ప్రగృహీతదండః ॥ 14

పరమ - ఓ పరమేశ్వరా!, విభో - సర్వవ్యాపకా!, బ్రహ్మ - వేదమును, (బ్రహ్మ - బ్రహ్మరూపుడవై), ఆత్మతత్త్వమ్ - ఆత్మజ్ఞానమును, అవితుమ్ - రక్షించుటకై, ప్రథమమ్ - సృష్టి ఆదియందు, త్వమ్ - నీవు, విద్యాతపః-వ్రతధరాన్ - జ్ఞానము తపస్సు (ఉపాసన) మరియు కర్మకాండకు చెందిన వ్రతములను ధరించు, విప్రాన్ - వేదవేత్తలను, ముఖతః - ముఖమునుండి, అస్రాక్ స్మ - సృష్టించితివి, తత్ - అందువలన, ప్రగృహీతదండః - దృఢముగా స్వీకరించబడిన దుష్టశిక్షణము గలవాడవై, సర్వవిపత్సు - సకలములగు ఆపదలయందు, ప్రగృహీతదండః - గట్టిగా పట్టుకొనబడిన కర్ర గల, పాలః - పశుపాలకుడు, పశూన్ ఇవ - పశువులను వలె, బ్రాహ్మణాన్ - వేదవేత్తలను బ్రహ్మవేత్తలను, పాసి - రక్షించుచున్నావు.

ఓ పరమేశ్వరా! నీవు సర్వవ్యాపకుడవు. వేదములను, ఆత్మజ్ఞానమును రక్షించుట కొరకై సృష్ట్యాదియందు బ్రహ్మరూపుడవై ముఖము నుండి బ్రాహ్మణులను సృష్టించితివి. వారు జ్ఞాననిష్ఠను, తపస్సు (ఉపాసన) ను, కర్మనియమములను పాటిస్తూ వేదధర్మముమ రక్షించిరి. కావుననే, ఆపదలు వచ్చినప్పుడు నీవు ఆ వేదవేత్తలను బ్రహ్మవేత్తలను రక్షించుచున్నావు. పశుపాలకుడు చేత కర్రను బట్టి దారిని తప్పే పశువులను అదలించి తద్ద్వారా వాటిని రక్షించును. అదే విధముగా, నీవు కూడ దుష్టులను గట్టిగా శిక్షించి, తద్ద్వారా వారిని రక్షిస్తూ, వారి ద్వారా వేదధర్మమును రక్షించుచున్నావు. నీవు నా వంటి వారలకు విధించే శిక్ష కూడ మమ్ములను రక్షించుటయే అని తాత్పర్యము.

యోఽసౌ మయాఽవిదితతత్త్వదృశా సభాయాం
క్షిప్తో దురుక్తవిశిఖైరగణయ్య తన్మామ్ ।

అర్వాక్పతంతమర్హత్తమనిందయాఽపా-
ద్దృష్ట్యాఽర్ద్రయా స భగవాన్ స్వకృతేన తుష్యేత్ ।। 15

**అవిదితతత్త్వదృశా** - శివుని యథార్థజ్ఞానముతో కూడిన దర్శనము లేని, **మయా** - నాచే, **సభాయామ్** - సభయందు, **యః** - ఏ, **అసౌ** - ఈ శివుడు, **దురుక్తవిశిఖైః** - నిందావచనములనే బాణములతో, **క్షిప్తః** - కొట్టబడినాడో, **తత్** - ఆ చేష్టను, **అగణయ్య** - లెక్క చేయకుండగా, **అర్హత్-తమనిందయా** - మిక్కిలి పూజనీయుడగు శివుని నిందించుటచే, **అర్వాక్-పతంతమ్** - నరకములో పడిపోవుచున్న, **మామ్** - నన్ను, **ఆర్ద్రయా** - దయతో నిండిన, **దృష్ట్యా** - చూపుతో, **అపాత్** - రక్షించెనో, **సః** - అట్టి, **భగవాన్** - శివ భగవానుడు, **స్వకృతేన** - తన కృత్యముచే, **తుష్యేత్** - సంతోషించు గాక!

నేను శివుని యథార్థస్వరూపమును తెలియని వాడను. నిండు సభలో నేను ఆయనను నిందావచనములనే బాణములతో కొట్టితిని. కాని, దయామయుడగు ఆయన దానిని పట్టించుకొనలేదు. పరమపూజ్యుడగు శివుని నిందించుటచే నేను నరకములో పడబోవుచుండగా, ఆ శివ భగవానుడు నన్ను తన దయాపూర్ణమైన చూపుతో చూచి, రక్షించినాడు. నాయందు అర్హత ఏమియు లేదు. నేను ఆయనకు చేయదగిన పూజాదికము కూడ సున్న. కాని, ఆయన నన్ను రక్షించినాడు. తన మహోదారమగు ఈ చేష్టచేతనే ఆయన సంతుష్టుడగుగాక!

మైత్రేయ ఉవాచ ।
క్షమాప్యైవం స మీఢ్వాంసం బ్రహ్మణా చానుమంత్రితః ।
కర్మ సంతానయామాస సోపాధ్యాయర్త్విగగ్నిభిః ।। 16

**ఏవమ్** - ఈ విధముగా, **సః** - ఆ దక్షుడు, **మీఢ్వాంసమ్** - భక్తులకు కోరికలను వర్షించే శివుని ఉద్దేశించి, **క్షమాప్య** - క్షమాపణమును చెప్పి, **బ్రహ్మణా** - బ్రహ్మగారిచే, **అనుమంత్రితః** - అనుజ్ఞ నీయబడినవాడై, **స-ఉపాధ్యాయ-ఋత్విక్-అగ్నిభిః** - ఉపాధ్యాయునితో గూడిన ఋత్వి

క్కులతో మరియు అగ్నులతో గూడి, కర్మ - యజ్ఞకర్మను, సంతానయా మాస - చక్కగా ప్రవర్తిల్లజేసెను.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- ఈ విధముగా ఆ దక్షుడు భక్తులకు కోరికలను వర్షించే శివునకు క్షమాపణను చెప్పుకొనెను. తరువాత ఆతడు బ్రహ్మగారి అనుజ్ఞచే ఉపాధ్యాయునితో మరియు ఋత్విక్కులతో గూడి, అగ్నులను వ్రేల్చి, మిగిలిపోయిన యజ్ఞకర్మను బాగుగా ప్రవర్తిల్ల జేసెను.

వైష్ణవం యజ్ఞసంతత్యై త్రికపాలం ద్విజోత్తమాః ।
పురోడాశం నిరవపన్ వీరసంసర్గశుద్ధయే ॥ 17

ద్విజ-ఉత్తమాః - బ్రాహ్మణోత్తములు, యజ్ఞసంతత్యై - యజ్ఞము సుసంపన్నము అగుట కొరకు, వీరసంసర్గశుద్ధయే - యుద్ధవీరులతోడి సంసర్గము వలన కలిగిన దోషము తొలగుట కొరకై, త్రికపాలమ్ - మూడు కపాలములయందు సంస్కరించబడిన, వైష్ణవమ్ - విష్ణుదేవతాకమైన, పురోడాశమ్ - పురోడాశమును, నిరవపన్ - నిర్వాపము చేసిరి.

యుద్ధవీరులు యజ్ఞభూమినంతనూ త్రొక్కివేయుటచే కలిగిన దోషము శాంతించి యజ్ఞము సుసంపన్నము అగుట కొరకై ఆ బ్రాహ్మణోత్త ములు మూడు ఘటశకలములలో సంస్కరించబడిన పురోడాశమును విష్ణువునుద్దేశించి హోమమును చేసిరి.

అధ్వర్యుణాఽఽత్తహవిషా యజమానో విశాం పతే ।
ధియా విశుద్ధయా దధ్యౌ తథా ప్రాదురభూద్ధరిః ॥ 18

విశాం పతే - ప్రజలను శాసించే (ఇంద్రియములను వశపరచుకు న్న) ఓ విదురా!, ఆత్తహవిషా - చేతిలోనికి తీసుకొనబడిన హవిస్సు గల, అధ్వర్యుణా - అధ్వర్యునితో గూడి, యజమానః - యజమానుడగు దక్షుడు, విశుద్ధయా - పరిశుద్ధమగు, ధియా - అంతఃకరణముతో, దధ్యౌ - ధ్యానము చేసెను, తథా - అదే రూపములో, హరిః - శ్రీహరి, ప్రాదుర భూత్ - సాక్షాత్కరించెను.

ప్రజలను శాసించే (ఇంద్రియవిజేతవగు) ఓ విదురా! అధ్వర్యుడు హవిస్సును చేతబట్టి నిలిచియుండగా, యజమానుడగు దక్షుడు పరిశుద్ధ మగు అంతఃకరణముతో శ్రీహరిని ధ్యానించెను. వెనువెంటనే, శ్రీహరి అక్కడ సాక్షాత్కరించెను.

తదా స్వప్రభయా తేషాం ద్యోతయంత్యా దిశో దశ ।
ముష్ణంస్తేజ ఉపానీతస్తార్క్ష్యేణ స్తోత్రవాజినా ॥ 19

తదా - అప్పుడు, దశ - పది, దిశః - దిక్కులను, ద్యోతయంత్యా - ప్రకాశింపజేసే, స్వప్రభయా - తన కాంతితో, తేషామ్ - వారి, తేజః - తేజస్సును, ముష్ణన్ - అపహరించువాడై, స్తోత్రవాజినా - బృహత్ రథంతరము అనే సామవేదస్తోత్రములే రెక్కలుగా గల, తార్క్ష్యేణ - గరుడునిచే, ఉపానీతః - దగ్గరకు తీసుకురాబడెను.

అప్పుడు గరుడుడు శ్రీహరిని అక్కడకు తీసుకొనివచ్చెను. సామ వేదస్తోత్రములగు బృహత్ మరియు రథంతరములే ఆ గరుడుని రెక్కలు. పది దిక్కులు వెలిగిపోవునట్లు చేసే ఆ శ్రీహరియొక్క కాంతి ముందు బ్రహ్మాదులు వెలవెల బోయిరి.

శ్యామో హిరణ్యరశనోఽర్కకిరీటజుష్టో
నీలాలకభ్రమరమండితకుండలాస్యః ।
కంబ్వబ్జచక్రశరచాపగదాఽసిచర్మ-
వ్యగ్రైర్హిరణ్మయభుజైరివ కర్ణికారః ॥ 20

శ్యామః - నల్లనివాడు, హిరణ్యరశనః - బంగరు మొలత్రాడు (వస్త్రము) గలవాడు, అర్కకిరీటజుష్టః - సూర్యునివంటి కిరీటముతో కూడి యున్నవాడు, నీల-అలకభ్రమరమండితకుండల-ఆస్యః - నల్లని ముంగురులనే తుమ్మెదలచే అలంకరించబడిన మరియు కుండలములతో కూడిన ముఖము గలవాడు, కంబు-అబ్జచక్రశరచాపగదా-అసిచర్మవ్యగ్రైః - శంఖము పద్మము చక్రము బాణములు ధనస్సు గద కత్తి డాలులతో వేగిర పడుచున్న, హిరణ్మయభుజైః - బంగరు ఆభరణములు గల భుజములతో కర్ణికారః ఇవ - కొండగోగు చెట్టువలె ఉన్నవాడు.

నల్లనివాడగు ఆ శ్రీహరి బంగరు మొలత్రాడుతో, బంగారము వంటి పచ్చని వస్త్రముతో, సూర్యుని వలె ప్రకాశించే కిరీటముతో శోభిల్లెను. తుమ్మెదలవంటి ముంగురులు గల ఆయన ముఖము కుండలములతో అలంకరింపబడి యుండెను. ఆయన బంగరు ఆభరణములను కలిగి యున్న తన ఎనిమిది భుజములతో శంఖము, పద్మము, చక్రము, బాణములు, ధనస్సు, గద, కత్తి, డాలులను ధరించి భక్తులను రక్షించుటకొరకై వేగిర పడుచుండెను. ఈ ఆయుధములతో ఆయన పుష్పించిన కొండగోగు చెట్టు వలె ప్రకాశించెను.

వక్షస్యధిశ్రితవధూర్వనమాల్యుదార-
హాసావలోకకలయా రమయంశ్చ విశ్వమ్ ।
పార్శ్వభ్రమద్వ్యజనచామరరాజహంస-
శ్వేతాతపత్రశశినోపరి రజ్యమానః ॥ 21

వక్షసి - వక్షఃస్థలమునందు, అధిశ్రితవధూః - అధిష్ఠించియున్న లక్ష్మీదేవి గలవాడు, వనమాలీ - అడవి పువ్వుల దండ గలవాడు, ఉదార హాస-అవలోకకలయా - ప్రేమను ఒలికే చిరునవ్వు మరియు చూపుల నైపుణితో, విశ్వమ్ - జగత్తును, రమయన్ - ఆనందింపజేయువాడు, చ - మరియు, పార్శ్వభ్రమద్-వ్యజనచామరరాజహంసః - ఇరుప్రక్కలా కదలాడే వింజామరలనే రాజహంసలు గలవాడు, శ్వేత-ఆతపత్రశశినా - తెల్లని గొడుగు అనే చంద్రునితో, ఉపరి - పైన, రజ్యమానః - మిక్కిలి ప్రకాశించువాడు.

వక్షఃస్థలమునందు లక్ష్మిని దాల్చియుండే ఆ శ్రీహరి అడవి పువ్వుల దండను ధరించెను. ఆయన చిరునవ్వుతో మరియు కంటి చూపులతో ప్రేమను ఒలకబోస్తూ జగత్తును ఆహ్లాదపరచుచుండెను. ఆయనకు ఇరువైపులా రాజహంసలవంటి వింజామరలు కదలాడుచుండెను. తలపై చంద్రునివంటి తెల్లని గొడుగుతో ఆయన అధికముగా ఒప్పారెను.

తముపాగతమాలక్ష్య సర్వే సురగణాదయః ।
ప్రణేముస్సహసోత్థాయ బ్రహ్మేంద్రత్ర్యక్షనాయకాః ॥ 22

ఉపాగతమ్ - దగ్గరకు వచ్చిన, తమ్ - ఆ శ్రీహరిని, అలక్ష్య - చూచి, బ్రహ్మ-ఇంద్రత్రి-అక్షనాయకాః - బ్రహ్మ ఇంద్రుడు ముక్కంటి నాయకులుగా గల, సురగణ-ఆదయః - దేవతాగణములు మొదలగు వారు, సర్వే - అందరు, సహసా - వెంటనే, ఉత్థాయ - లేచి, ప్రణేముః - నమస్కరించిరి.

బ్రహ్మ ఇంద్రుడు మరియు ముక్కంటి నాయకులుగా గల దేవతా గణములు మరియు ఇతరులు దగ్గరకు వచ్చిన ఆ శ్రీహరిని చూచిరి. వారు వెంటనే లేచి ఆయనకు నమస్కరించిరి.

తత్తేజసా హతరుచస్సన్నజిహ్వాస్ససాధ్వసాః ।
మూర్ధ్నా ధృతాంజలిపుటా ఉపతస్థురధోక్షజమ్ ॥ 23

తత్-తేజసా - ఆయన తేజస్సుచే, హతరుచః - తిరస్కరించబడిన కాంతులు గల ఆ దేవతలు, సన్నజిహ్వాః - మూతబడిన నోళ్లు గలవారై, ససాధ్వసాః - కంగారుతో కూడుకున్నవారై, మూర్ధ్నా - శిరస్సుచే, ధృత-అంజలిపుటాః - ధరించబడిన దోసిళ్లు గలవారై, అధోక్షజమ్ - శ్రీహరిని, ఉపతస్థుః - స్తుతించిరి.

ఆ దేవతలు శ్రీహరి ప్రకాశము ముందు వెలవెలబోయిరి. ఆయనను చూడగనే వారు మాటలను కట్టిబెట్టి, కంగారు పడుతూ, తలలపై దోసిళ్లను ఒగ్గి నమస్కరించిరి. ప్రత్యక్షాది ప్రమాణములకు గోచరము కాని తత్త్వము గల ఆ శ్రీహరిని వారు నిలబడి స్తుతించిరి.

అప్యర్వాగ్వృత్తయో యస్య మహి త్వాత్మభువాదయః ।
యథామతి గృణంతి స్మ కృతానుగ్రహవిగ్రహమ్ ॥ 24

ఆత్మభువ-ఆదయః - స్వయంభువుడగు బ్రహ్మగారు మొదలైన వారు, యస్య - ఏ శ్రీహరియొక్క, మహి తు - మహిమ గురించియైతే, (మహి - విభూతిరూపులైన), అర్వాక్-వృత్తయః - చేరుకోలేని వాక్ప్రవృత్తి మరియు మనఃప్రవృత్తి గలవారే అయినను, కృత-అనుగ్రహవిగ్రహమ్ -

ప్రకటించబడిన అనుగ్రహరూపము గల శ్రీహరిని, యథామతి - బుద్ధికి తగ్గట్లుగా, గృణంతి స్మ - స్తుతించిరి.

స్వయంభువుడగు బ్రహ్మగారు మొదలుగా గల ఆ దేవతలు శ్రీహరియొక్క విభూతులు మాత్రమే. ఆయన మహిమ, వారు వాక్కులతో చేసే వర్ణనకు గాని, మనస్సుయొక్క ఊహకు గాని అందదు. అయిననూ, తమను అనుగ్రహించి తమ యెదుట తన రూపమును ప్రకటించిన ఆ శ్రీహరిని వారు తమ బుద్ధికి తగ్గట్లుగా స్తుతించిరి.

దక్షో గృహీతార్హణసాదనోత్తమం
యజ్ఞేశ్వరం విశ్వసృజాం పరం గురుమ్ ।
సునందనందాద్యనుగైర్వృతం ముదా
గృణన్ ప్రపేదే ప్రయతః కృతాంజలిః ॥ 25

దక్షః - దక్షుడు, ప్రయతః - ఏకాగ్రమైన చిత్తము గలవాడై, కృత-అంజలిః - దోసిలి ఒగ్గినవాడై, గృహీత-అర్హణసాదన-ఉత్తమమ్ - స్వీకరించబడిన పూజాసామగ్రి మరియు ఉత్తమమగు పాత్ర కలిగినట్టియు (స్వీకరించబడిన పూజాసామగ్రి మరియు ఉత్తమమగు పాత్ర కలుగువిధముగా), యజ్ఞ-ఈశ్వరమ్ - యజ్ఞములకు ప్రభువు అయినట్టియు, విశ్వసృజామ్ - ప్రజాపతులకు, పరమ్ - సర్వశ్రేష్ఠుడగు, గురుమ్ - గురువు (తండ్రి) అయినట్టియు, సునందనంద-ఆది-అనుగైః - సునందుడు నందుడు మొదలగు అనుచరులచే, వృతమ్ - చుట్టువారబడి యున్న శ్రీహరిని, ముదా - ఆనందముతో, గృణన్ - స్తుతించువాడై, ప్రపేదే - శరణు పొందెను.

శ్రీహరి ఎక్కడ ప్రకటమైననూ భక్తులు పూజాసామగ్రిని ఉత్తమమగు పాత్రలో పెట్టి ఆయనకు సమర్పించగా, ఆయన వాటిని స్వీకరించును. దక్షుడు కూడ ఏకాగ్రమగు చిత్తముతో అటులనే చేయగా, శ్రీహరి ఆ పూజను స్వీకరించెను. నందుడు, సునందుడు మొదలగు అనుచరులు శ్రీహరిని చుట్టువారి యుండిరి. దక్షుడు చేతులను జోడించి ప్రజాపతులకు పరమగురువు, యజ్ఞేశ్వరుడు అగు ఆ శ్రీహరిని స్తుతిస్తూ శరణు వేడెను.

దక్ష ఉవాచ ।

శుద్ధం స్వధామ్న్యుపరతాఖిలబుద్ధ్యవస్థం
చిన్మాత్రమేకమభయం ప్రతిషిధ్య మాయామ్ ।
తిష్ఠంస్తయైవ పురుషత్వముపేత్య తస్యా-
మాస్తే భవానపరిశుద్ధ ఇవాత్మతంత్రః ॥ 26

శుద్ధమ్ - పరిశుద్ధమైనది, ఉపరత-అఖిలబుద్ధి-అవస్థమ్ - తొలగి పోయిన అన్ని అంతఃకరణముయొక్క అవస్థలు కలిగినది, ఏకమ్ - రెండవది లేనిది, అభయమ్ - భయము లేనిది అగు, చిత్-మాత్రమ్ - చైతన్య ఘనమగు పరబ్రహ్మయే స్వరూపముగా గల, భవాన్ - నీవు, ఆత్మతంత్రః - స్వతంత్రుడవై, స్వధామ్ని ఏవ - నీ స్వరూపమునందు మాత్రమే, తిష్ఠన్ - నిలిచియున్నవాడవై, మాయామ్ - మాయాశక్తిని, ప్రతిషిధ్య - నిషేధించి, తయా - ఆ మాయాశక్తిచే, పురుషత్వమ్ - మనుష్యభావమును, ఉపేత్య - పొంది, తస్యామ్ - ఆ మాయాశక్తియందు, అపరిశుద్ధః ఇవ - పరిశుద్ధుడు కానివాడు వలె, ఆస్తే - ఉన్నావు.

దక్ష ప్రజాపతి ఇట్లు పలికెను --- ఆత్మచైతన్యమునందు సర్వము ప్రకాశించుచున్ననూ, ఆ ప్రకాశించే సర్వముయొక్క గుణదోషములు చైతన్యమును ప్రభావితము చేయవు. కావుననే, ఆత్మ చైతన్యము నిత్యశుద్ధము. దానియందు రెండవది లేదు గనుక, భయమునకు తావు లేదు. జాగ్రత్తు, స్వప్నము, సుషుప్తి అనే మూడు అవస్థలు ఆత్మచైతన్యమునందే ప్రకాశించుచున్ననూ, ఆత్మచైతన్యము ఈ మూడు అవస్థలకు అతీతముగనే నిలిచియుండును. అట్టి బ్రహ్మాభిన్నమగు ఆత్మచైతన్యమే నీ స్వరూపమై యున్నది. స్వతంత్రుడవగు నీవు మాయాశక్తికి అతీతుడవై నీ స్వరూపమగు చిద్ఘనమునందే నిలిచియున్ననూ, మాయాశక్తియందు ప్రతిఫలించి మనుష్యభావమును పొందినవాని వలె, దోషము గలవాని వలె కన్పట్టెదవు.

ఋత్విజ ఊచుః ।

తత్త్వం న తే వయమనంజన రుద్రశాపాత్
కర్మణ్యవగ్రహధియో భగవన్ విదామః ।

ధర్మోపలక్షణమిదం త్రివృదధ్వరాఖ్యం
జ్ఞాతం యదర్థమధిదైవమదో వ్యవస్థాః ॥ 27

అనంజన - ఉపాధి దోషములు అంటనివాడా!, రుద్రశాపాత్ - నందీశ్వరుని శాపము వలన, కర్మణి - కర్మయందు, అవగ్రహధియః - పట్టుదలతో కూడిన బుద్ధి గల, వయమ్ - మేము, తే - నీ, తత్త్వమ్ - యథార్థస్వరూపమును, న విదామః - తెలియకున్నాము, ధర్మ-ఉపలక్షణమ్ - ధర్మమునకు ప్రవర్తకము, త్రివృత్ - మూడు వేదములచే ప్రతిపాదించబడునది, అధ్వర-ఆఖ్యమ్ - యజ్ఞము అనే, ఇదమ్ - ఈ నీ రూపము, జ్ఞాతమ్ - తెలియబడినది, యత్-అర్థమ్ - ఏ యజ్ఞము కొరకై, అదః - ఈ, అధిదైవమ్ - ఇంద్రుడు మొదలగు అధిదైవ రూపము (ను), వ్యవస్థాః - నియమములు గలవో (స్వీకరించియున్నావో).

ఋత్విక్కులు ఇట్లు పలికిరి --- ఓ దేవా! వివిధములగు దేహోపాధులయందు నీవు ఆత్మరూపముగా ప్రకటమగుచున్ననూ, ఆయా ఉపాధుల దోషములు నీకు అంటవు. నందీశ్వరుని శాపము వలన మా బుద్ధిలో కేవలము కర్మయందలి పట్టుదల మాత్రమే ఉన్నది. అట్టి మేము నీ యథార్థస్వరూపమును తెలియకున్నాము. జనులను ధర్మమార్గమునందు 'ప్రవర్తిల్ల జేయునది, మూడు వేదములచే ప్రతిపాదించబడునది అగు ఈ యజ్ఞము నీ రూపమే. ఈ యజ్ఞము సిద్ధించుట కొరకై నీవే ఇంద్రుడు మొదలగు దేవతల రూపములో ప్రకటమైనావు. ఈ దేవతలు, నియమములు యజ్ఞసిద్ధి కొరకు మాత్రమే నీచే ప్రవర్తిల్ల జేయబడుచున్నవి.

సదస్యా ఊచుః ।
ఉత్పత్త్యధ్వన్యశరణ ఉరుక్లేశదుర్గేఽంతకోగ్ర-
వ్యాలాన్విష్టే విషయమృగతృష్ణాత్మగేహోరుభారః ।
ద్వంద్వశ్వభ్రే ఖలమృగభయే శోకదావేఽజ్ఞసార్థః
పాదౌకస్తే శరణద కదా యాతి కామోపసృష్టః ॥ 28

శరణద - శరణునిచ్చువాడా!, అశరణే - రక్షకుడు లేనట్టియు, ఉరుక్లేశదుర్గే - అయిదు గొప్ప చిత్తమలములనే దుర్గమస్థానములు కలిగిన

ట్టియు, అంతక-ఉగ్రవ్యాల-అన్విష్టే - మృత్యువు అనే భయంకరమగు పాముచే వెంటాడబడునట్టియు, ద్వంద్వశ్వభ్రే - ద్వంద్వములనే గోతులు కలిగినట్టియు, ఖలమృగభయే - దుష్టులు అనే క్రూరమృగముల వలని భయము ఉన్నట్టియు, శోకదావే - శోకమనే దావాగ్ని కలిగియున్న, ఉత్పత్తి -అధ్వని - పుట్టుక మరణములతో కూడిన సంసారమార్గమునందు, విషయ మృగతృష్ణ-ఆత్మగేహ-ఉరుభారః - విషయసుఖములనే ఎండమావుల కొరకై శరీరము ఇల్లు అనే పెద్ద బరువు గలిగినట్టియు, కామ-ఉపసృష్టః - కామనలచే పరాజితమై యున్న, అజ్ఞసార్థః - అజ్ఞానుల దండు, తే - నీ, పాద-ఓకః - పాదములనే నివాసస్థానమును, కదా - ఎప్పుడు, యాతి - పొందును?

సభాసదులు ఇట్లు పలికిరి --- రక్షణనిచ్చే ఓ దేవా! అజ్ఞానులగు మానవుల సమాజము జననమరణప్రవాహరూపమగు సంసారమార్గములో పడి పోవుచున్నది. మృత్యువు అనే భయంకరమగ పాము వెంటబడే ఈ మార్గములో వారికి రక్షకుడు లేడు. ఈ సంసారమార్గములో అవిద్య (ఆత్మ స్వరూపము తెలియకుండుట), అస్మిత (అహంకారము), రాగము, ద్వేష ము, అభినివేశము (మృత్యుభయము) అనే అయిదు చిత్తమలములనే దుర్గ ములను అధిగమించుట వారికి చాల కష్టమగుచున్నది. సుఖదుఃఖములు, లాభనష్టములు మొదలగు ద్వంద్వములనే గోతులలో పడుతూ లేస్తూ ఉండే ఆ జనులకు, సమాజములోని దుష్టులు అనే క్రూరమృగముల వలన చాల బెడద కలుగుచుండును. ఈ సంసారమనే అడవి దారిలో శోకమనే దావాగ్ని మండుచుండును. మానవులు శరీరము, ఇల్లు-వాకిలి అనే పెద్ద బరువును మోసుకుంటూ, విషయసుఖములు (ఇంద్రియభోగములు) అనే ఎండమావుల కొరకై ఈ మార్గములో పడి పోవుచున్నారు. వారిని కామ నలు ఈ దారిలో పరవశులను చేయుచుండును. నీ పాదములను పట్టుకు న్నచో, వారికి రక్షణ లభించును. కాని, వారా పనిని చేసేది ఎప్పుడు?

రుద్ర ఉవాచ ।

తవ వరద వరాంఘ్రావాశిషేహాఖిలార్థే
హ్యపి మునిభిరసక్తైరాదరేణార్హణీయే ।

యది రచితధియం మాఽవిద్యలోకోఽపవిద్ధం
జపతి న గణయే తత్త్వత్పరానుగ్రహేణ ॥ 29

వరద - వరములనిచ్చువాడా!, ఇహ - ఈ జగత్తునందు, ఆశిషా - కామనచే, అసక్తైః - కామనలు లేని, మునిభిః అపి - మహర్షులచే కూడ, ఆదరేణ - శ్రద్ధతో, అర్హణీయే - పూజించదగినట్టియు, అఖిల-అర్థే - సకలములగు ఫలములనిచ్చే, తవ - నీ, వర-అంఘ్రౌ - శ్రేష్ఠమగు పాదమునందు, రచితధియమ్ - స్థిరము చేయబడిన చిత్తము గల, మా - నన్ను, అవిద్యలోకః - అజ్ఞానియగు జనుడు, అపవిద్ధమ్ - తప్పుగా, యది జపతి - పలికిననూ, తత్ - దానిని, త్వత్-పర-అనుగ్రహేణ - నీ ఉత్కృష్టమగు అనుగ్రహముచే (నీకు భక్తులయందు ఉండే అనుగ్రహముచే), న గణయే - లెక్క చేయను.

రుద్రుడు ఇట్లు పలికెను --- వరములనిచ్చే ఓ శ్రీహరీ! ఈ జగత్తులో కామనలు గల జనులు మాత్రమే గాక, కామనలు లేని మహర్షులు కూడ నీ శ్రేష్ఠమగు పాదమును శ్రద్ధతో పూజించెదరు. నా చిత్తము అట్టి నీ పాదమునందు స్థిరముగా లగ్నమై యున్నది. అట్టి నన్ను అజ్ఞానియగు వ్యక్తి తప్పుగా నిందించిననూ, నేనా నిందను లెక్క చేయను. ఏలయన, భక్తులపై నీవు చూపే ఉత్కృష్టమగు నీ అనుగ్రహము నాకు గలదు.

భృగురువాచ ।
యన్మాయయా గహనయాఽపహృతాత్మబోధా
బ్రహ్మాదయస్తనుభృతస్తమసి స్వపంతః ।
నాత్మన్ శ్రితం తవ విదంత్యధునాఽపి తత్త్వం
సోఽయం ప్రసీదతు భవాన్ ప్రణతార్తిబంధుః ॥ 30

గహనయా - దుస్తరమగు, యత్-మాయయా - ఏ నీ మాయచే, అపహృత-ఆత్మబోధః - అపహరించబడిన ఆత్మజ్ఞానము గల, బ్రహ్మ-ఆదయః - బ్రహ్మగారు మొదలగు, తనుభృతః - దేహధారులు, తమసి - అజ్ఞానమునందు, స్వపంతః - నిద్రించుచున్నవారై, ఆత్మన్ - హృదయమునందు, శ్రితమ్ - ఉన్న, తవ - నీ, తత్త్వమ్ - స్వరూపమును. అధునా

అపి - ఇప్పటికి కూడ, న విదంతి - తెలియకున్నారో, సః - అట్టి, అయమ్ - ఈ, ప్రణత-ఆత్మబంధుః - నమస్కరించువారలకు ఆత్మబంధువు అగు, భవాన్ - నీవు, ప్రసీదతు - ప్రసన్నుడవగుదువు గాక!

భృగుమహర్షి ఇట్లు పలికెను --- బ్రహ్మగారు మొదలగు దేహధారులు (జీవులు) దాట శక్యము కాని నీ మాయచే మోహితులై, తమ స్వరూపమును తెలియకున్నారు. తమ హృదయములో నీవు చైతన్యరూపముగా ప్రకటమగుచున్ననూ, అజ్ఞాననిద్రలో నున్న ఆ బ్రహ్మాదులు ఇప్పటికి కూడా నిన్ను ఆత్మరూపముగా గుర్తించలేకున్నారు. నీవు భక్తులకు ఆత్మబంధుడవు. అట్టి ఈ నీవు నాపై ప్రసన్నుడవగుదువు గాక!

బ్రహ్మోవాచ ।
నైతత్స్వరూపం భవతోఽసౌ పదార్థ-
భేదగ్రహైః పురుషో యావదీక్షేత్ ।
జ్ఞానస్య చార్థస్య గుణస్య చాశ్రయో
మాయామయాద్వ్యతిరిక్తో యతస్త్వమ్ ॥ 31

అసౌ - ఈ, పురుషః - మానవుడు, పదార్థభేదగ్రహైః - పదార్థములలోని భేదాను గుర్తించే ఇంద్రియములతో, యావత్ - ఎంతవరకు, ఈక్షేత్ - చూచునో, ఏతత్ - ఈ దృశ్యప్రపంచము, భవతః - నీ, స్వరూపమ్ - స్వరూపము, న - కాదు, యతః - ఎందువలననగా, త్వమ్ - నీవు, జ్ఞానస్య - జ్ఞానమునకు, అర్థస్య - పదార్థమునకు, గుణస్య చ - ఇంద్రియమునకు కూడ, ఆశ్రయః - అధిష్ఠానము, మాయామయాత్ - లేకున్ననూ కానవచ్చే పదార్థముకంటె, వ్యతిరిక్తః - విలక్షణమైనవాడవు.

బ్రహ్మగారు ఇట్లు పలికెను --- ఈ మానవుడు ఇంద్రియములతో జగత్తులోని పదార్థముల మధ్యమండే భేదమును మాత్రమే తెలియగల్గును. ఆ విధముగా భేదమును చూస్తూ ఉన్నంత కాలము వానికి నీ స్వరూపము తెలియదు. ఏలయనగా, ఒక పదార్థముయొక్క జ్ఞానమును కలిగించే చైతన్యావిష్టమగు మనోవృత్తికి, ఆ పదార్థమునకు మరియు ఆ పదార్థమును గుర్తించే ఇంద్రియమునకు కూడ నీవే అధిష్ఠానము. అనగా, జ్ఞాత, జ్ఞాన

ము, జ్ఞేయము అనే త్రిపుటి ఆత్మచైతన్యస్వరూపుడవగు నీయందే అధ్య స్తమగుచున్నది. లేకున్ననూ కానవచ్చే ఈ పదార్థములకంటె విలక్షణమగు ఆత్మచైతన్యమే నీవు.

ఇంద్ర ఉవాచ ।
ఇదమప్యచ్యుత విశ్వభావనం వపురానందకరం మనోదృశామ్ ।
సురవిద్విట్క్షపణైరుదాయుధైర్భుజదండైరుపపన్నమష్టభిః ॥ 32

అచ్యుత - వినాశము లేనివాడా!, విశ్వభావనమ్ - జగత్తును పాలించునది, సురవిద్విట్క్షపణైః - దేవతలను విశేషముగా ద్వేషించువారలను నశింపజేసే, ఉత్-ఆయుధైః - ఉద్యతమగు ఆయుధములు గల, అష్టభిః - ఎనిమిది, భుజదండైః - దండములవంటి భుజములచే, ఉపపన్నమ్ - కూడిన, ఇదమ్ - ఈ, వపుః అపి - రూపము కూడ, మనోదృశామ్ - మనస్సునకు కళ్లకు, ఆనందకరమ్ - ఆనందమును కలిగించునది.

ఇంద్రుడు ఇట్లు పలికెను --- వినాశము లేని ఓ శ్రీహరీ! నీవీ రూపములో జగత్తును పాలించుచున్నావు. నీవు దండముల వంటి ఎనిమిది భుజములలో ఆయుధములను సంసిద్ధముగా దాల్చి, దేవతలను విశేషముగా ద్వేషించే రాక్షసులను మట్టుబెట్టుచున్నావు. అట్టి నీ ఈ రూపము కూడ మనస్సునకు, కళ్లకు ఆనందమును కలిగించుచున్నది.

పత్న్య ఊచుః ।
యజ్ఞోఽయం తవ యజనాయ కేన సృష్టో
విధ్వస్తః పశుపతినాఽద్య దక్షకోపాత్ ।
తం నస్త్వం శవశయనాభశాంతమేధం
యజ్ఞాత్మన్నలినరుచా దృశా పునీహి ॥ 33

యజ్ఞ-ఆత్మన్ - ఓ యజ్ఞస్వరూపా!, శవశయనాభ - ఓ పద్మనాభా! (శవమనగా నీరు), కేన - బ్రహ్మగారిచే (దక్ష ప్రజాపతిచే), తవ - నీ, యజనాయ - ఆరాధించుట కొరకు, సృష్టః - సృష్టించబడిన (నిర్వహించబడిన), అయమ్ - ఈ, యజ్ఞః - యజ్ఞము, అద్య - ఈనాడు, దక్షకో

పాత్ - దక్షుని కోపము నిమిత్తముగా (దక్షునియందలి కోపము వలన), పశు పతినా - శివునిచే, విధ్వస్తః - నశింపజేయబడినది, త్వమ్ - నీవు, శవశయ న-అభశాంతమేధమ్ - శ్మశానముయొక్క కాంతివంటి కాంతిగలిగినట్టియు మరియు ఆగిపోయిన కర్మానుష్ఠానము గల, నః - మాయొక్క, తమ్ - ఆ యజ్ఞమును, నలినరుచా - కలువ కాంతులు గల, దృశా - కంటితో, పునీహి - పావనము చేయుము.

యాజ్ఞికుల పత్నులు ఇట్లు పలికిరి --- ఓ పద్మనాభా! నీవు యజ్ఞ స్వరూపుడవు. బ్రహ్మగారు నిన్ను జనులు ఆరాధించుట కొరకై యజ్ఞమును సృష్టించెను. అట్టి యజ్ఞమును చేయుటకు దక్షుడు పూనుకొనెను. కాని, వాని కోపము యజ్ఞమునకు విఘ్నమును కలిగించినది. రుద్రుడు దక్షునిపై కోపించి, ఆ యజ్ఞమును నాశము చేసినాడు. ఇప్పుడా యజ్ఞశాల కర్మల న్నియు ఆగిపోయి శ్మశానమును పోలియున్నది. నీవు కలువ కాంతుల కన్నులతో చూచి దానిని పావనము చేయుము.

ఋషయ ఊచుః ।
అనన్వితం తే భగవన్ విచేష్టితం
యదాత్మనా చరసి హి కర్మ నాఽజ్యసే ।
విభూతయే యత ఉపసేదురీశ్వరీం
న మన్యతే స్వయమనువర్తతీం భవాన్ ।। 34

భగవన్ - ఓ భగవానుడా!, తే - నీ, విచేష్టితమ్ - చేష్ట, అనన్వి తమ్ - అద్భుతము, యత్ - ఏలయనగా, ఆత్మనా - శరీరముచే, కర్మ - కర్మను, చరసి - చేయుచున్నావు, న అజ్యసే హి - లేపమును పొందవు గదా!, యతః - ఏలయనగా, విభూతయే - సంపద కొరకు, ఈశ్వరీమ్ - లక్ష్మిని, ఉపసేదుః - ఆరాధించెదరు, భవాన్ - నీవు, స్వయమ్ - తనంత తానుగా, అనువర్తతీమ్ - అనుసరించి ఉండే ఆమెను, న మన్యతే - లెక్క చేయవు.

మహర్షులు ఇట్లు పలికిరి --- ఓ భగవానుడా! నీ లీల అద్భుత ము. ఏలయన, నీవు శరీరముతో కర్మలను ఆచరిస్తూనే ఉంటావు. కాని,

నీయందు కర్తృత్వము గాని, ఫలాసక్తి గాని లేవు. జనులు సంపద కొరకు లక్ష్మీదేవిని ఆరాధించెదరు. అట్టి లక్ష్మి నిన్ను అనుసరించి యున్ననూ, నీవు సంపదలపై స్పృహను కలిగియుండవు. నేను లక్ష్మీపతిని అనే అభిమానము నీకు ఉండదు.

సిద్ధా ఊచుః ।
అయం త్వత్కథామృష్టపీయూషనద్యాం
మనోవారణః క్లేశదావాగ్నిదగ్ధః ।
తృషార్తోఽవగాఢో న సస్మార దావం
న నిష్క్రామతి బ్రహ్మసంపన్నవన్నః ॥ 35

క్లేశదావ-అగ్నిదగ్ధః - చిత్తమలములు అనే దావాగ్నులచే కాల్చబడినట్టియు, తృషా-ఆర్తః - తృష్ణ అనే దప్పికచే పీడితమైయున్న, అయమ్ - ఈ, నః - మా, మనః-వారణః - మనస్సు అనే ఏనుగు, త్వత్-కథామృష్ట పీయూషనద్యామ్ - నీ గాథలు అనే పుష్టిదాయకమగు అమృతముయొక్క ప్రవాహమునందు, అవగాఢః - మునిగినదై, దావమ్ - దావాగ్నిని, న సస్మార - స్మరించదు, బ్రహ్మసంపన్నవత్ - పరబ్రహ్మతో ఐక్యమును చెందినది వలె, న నిష్క్రామతి - బయటకు వచ్చుట లేదు.

సిద్ధులు ఇట్లు పలికిరి --- ఏనుగు వలె నిలబెట్ట శక్యము కాని మా ఈ మనస్సు అజ్ఞానము, అహంకారము, ఇచ్ఛ, ద్వేషము మరియు మృత్యుభయము అనే చిత్తమలముల తాపమును అనుభవిస్తూ, విషయభోగములయందలి తృష్ణచే పీడితమై యున్నది. అడవిలో దావాగ్నిచే తాపమును పొంది, దప్పికను గొన్న ఏనుగు నదీప్రవాహములో కూర్చుండి బయటకు రాని తీరున, అట్టి ఈ మా మనస్సు నీ గాథలు అనే అమృతప్రవాహములో మునకను వేసియున్నది. నీ గాథల అమృతము మా మనస్సునకు బలమును చేగూర్చినది. ఇప్పుడు మాకు ఆ చిత్తమలముల స్మరణయే లేదు. మాకు ఆ గాథలను విరమించాలనే భావనయే కలుగుట లేదు. మా మనస్సు పరబ్రహ్మలో విలీనమైనట్లే ఉన్నది.

యజమాన్యువాచ ।
స్వాగతం తే ప్రసీదేశ తుభ్యం నమ-
శ్శ్రీనివాస శ్రియా కాంతయా త్రాహి నః ।
త్వామృతేఽధీశ నాంగైర్మఖశ్శోభతే
శీర్షహీనః కబంధో యథా పూరుషః ।। 36

ఈశ - ఓ పరమేశ్వరా!, శ్రీనివాస - ఓ శ్రీనివాసా!, అధీశ - ఓ జగన్నాథా! (ఓ యజ్ఞేశ్వరా!), తే - నీకు, స్వాగతమ్ - స్వాగతము, ప్రసీద - అనుగ్రహించుము, తుభ్యమ్ - నీ కొరకు, నమః - నమస్కారము, కాంతయా - ప్రియురాలగు, శ్రియా - లక్ష్మీదేవితో గూడి, నః - మమ్ములను, త్రాహి - రక్షించుము, శీర్షహీనః - తల లేని, కబంధః - మొండెము మాత్రమే అయిన, పూరుషః - వ్యక్తి, అంగైః యథా - అవయవములతో వలె, త్వాం ఋతే - నీవు లేకుండా, మఖః - యజ్ఞము, అంగైః - కర్మలతో, న శోభతే - ప్రకాశించదు.

దక్షుని భార్యయగు ప్రసూతి ఇట్లు పలికెను --- ఓ శ్రీనివాసా! నీవు పరమేశ్వరుడవు, జగన్నాథుడవు. నీకు స్వాగతము. మమ్ములను అనుగ్రహించుము. నీకు నమస్కారము. నీవు ప్రియురాలగు లక్ష్మీదేవితో గూడి మమ్ములను రక్షించుము. యజ్ఞేశ్వరుడవు నీవే. తల లేని మొండెమునకు కాళ్లు, చేతులు మొదలగు అవయములు ఉన్ననూ శోభ లేని విధముగా, ప్రయాజలు మొదలగు యజ్ఞాంగములతో కూడియున్ననూ నీవు లేని యజ్ఞమునకు శోభ లేదు.

లోకపాలా ఊచుః ।
దృష్టః కిం నో దృగ్భిరసద్గ్రహైస్త్వం
ప్రత్యగ్ద్రష్టా దృశ్యతే యేన దృశ్యమ్ ।
మాయా హ్యేషా భవదీయా హి భూమన్
యస్త్వం షష్ఠః పంచభిర్భాసి భూతైః ।। 37

భూమన్ - ఓ పరబ్రహ్మస్వరూపా!, ప్రత్యక్-ద్రష్టా - జీవుల అంతరాత్మయైన దృక్-స్వరూపుడవగు, త్వమ్ - నీవు, అసత్-గ్రహైః - మిథ్యయగు నామరూపములను తెలుసుకొనే, నః - మా, దృగ్భిః - ఇంద్రియములచే, దృష్టః కిమ్ - చూడబడినావా యేమి?, యేన - ఏ ప్రత్యగాత్మచే, దృశ్యమ్ - కంటికి కనబడే జగత్తు, దృశ్యతే - చూడబడుచున్నదో, ఏషా - ఇది, భవదీయా - నీకు చెందిన, మాయా - మాయ, యః - ఏ, షష్ఠః - ఆరవవాడవగు, త్వమ్ - నీవు, పంచభిః - అయిదు, భూతైః - భూతములతో, భాసి - ప్రకాశించుచున్నావో.

లోకపాలకులు ఇట్లు పలికిరి --- ఓ పరబ్రహ్మ స్వరూపా! ఆత్మ చైతన్యమే నీ స్వరూపము. నీవు జీవుల బుద్ధియందు సాక్షిచైతన్యరూపముగా ప్రతిఫలించి, ఇంద్రియములకు జ్ఞానమును కలిగించే శక్తిని అనుగ్రహించుచున్నావు. ఈ ఇంద్రియములు మిథ్యాభూతములగు నామరూపములను మాత్రమే దర్శించగలవు. అట్టి ఇంద్రియములు దృశ్యజగత్తును చూడగలవేగాని, నిన్ను చూడగలవా? చూడలేవు. ఈ జగత్తు నీ మాయాశక్తినుండి పుట్టినది. పంచభూతములతో కూడిన ఈ జగత్తు అధిష్ఠానమగు నీయందే భాసించుచున్నది. కాని, నీవు ఆరవవాడుగనే, అనగా పాంచభౌతిక జగత్తు కంటె విలక్షణుడుగనే నిలిచియున్నావు. నీవు పంచభూతములకు అతీతుడవైననూ, భౌతికశరీరముతో ప్రకాశించుచున్నావు. అనగా, పంచభూతములు నీ అఖండసత్తను ప్రకటింపజేసే ఉపాధులు.

యోగేశ్వరా ఊచుః ।
ప్రేయాన్న తేఽన్యోఽస్త్యముతస్త్వయి ప్రభో
విశ్వాత్మనీక్షేన్న పృథగ్య ఆత్మనః ।
అథాపి భక్త్యేశతయోపధావతా-
మనన్యవృత్త్యాఽనుగృహాణ వత్సల ॥ 38

ప్రభో - ఓ ప్రభూ!, తే - నీ కొరకు, అముతః - వీనికంటె, ప్రేయాన్ - మిక్కిలి ప్రియమైనవాడు, అన్యః - మరియొకడు, న అస్తి - లేడు, యః - ఎవడైతే, విశ్వ-ఆత్మని - జగత్తునకు ఆత్మయగు, త్వయి -

నీయందు, ఆత్మనః - తనయొక్క, పృథక్ - భేదమును, (ఆత్మనః - జీవులను, పృథక్ - వేరుగా), న ఈక్షేత్ - చూడదో, వత్సల - భక్తప్రియా!, అథాపి - అయినప్పటికీ, ఈశతయా - స్వామిభావముతో, అనన్యవృత్త్యా - మరియొక అనుసరణము లేని, భక్త్యా - భక్తితో, అనుధావతామ్ - సేవించువారలకు, అనుగృహాణ - అనుగ్రహమును చూపుము.

యోగేశ్వరులు ఇట్లు పలికిరి --- ఓ ప్రభూ! ఈ జగత్తుయొక్క వాస్తవస్వరూపము నీవే. అట్టి నీయందు తాను గాని, సకలజీవులు గాని ఐక్యమును పొందియున్నారే గాని వేరుగా లేరని ఆత్మవేత్తలు దర్శింపెదరు. అట్టి జ్ఞానులకంటె అధికముగా నీ ప్రీతికి పాత్రులు మరియొకరు లేరు. భక్తులు నిన్ను తమ స్వామిగా స్వీకరించి, ఇతరములగు ఆకాంక్షలను విడిచి నీయందు నిశ్చలమగు భక్తిని చేయుదురు. భక్తజనప్రియుడవగు నీవు అట్టి భక్తులను కూడ అనుగ్రహించుము.

జగదుద్భవస్థితిలయేషు దైవతో
బహుభిద్యమానగుణయాత్మమాయయా ।
రచితాత్మభేదమతయే స్వసంస్థయా
వినివర్తితభ్రమగుణాత్మనే నమః ॥ 39

జగత్-ఉద్భవస్థితిలయేషు - జగత్తుయొక్క సృష్టి స్థితి మరియు ప్రలయములయందు, దైవతః - జీవుల అదృష్టము వలన, బహుభిద్యమానగుణయా - అనేకవిధములుగా భేదమును పొందే గుణములు గల, ఆత్మమాయయా - నీ మాయాశక్తిచే, రచిత-ఆత్మభేదమతయే - కల్పించబడిన జీవభేదముయొక్క అభిమానము కలిగినట్టియు, స్వసంస్థయా - తన స్వరూపమునందు ఉండుటచే, వినివర్తితభ్రమగుణ-ఆత్మనే - కల్పించబడిన భేదభ్రాంతి మరియు గుణములు తనయందే గల ఈశ్వరుని కొరకు, నమః - నమస్కారము.

ఈ జగత్తు పరమేశ్వరుని మాయాశక్తినుండి పుట్టి, పరమేశ్వరుని వలన స్థితిని పొంది, మరల ఆయనయందే విలీనమగుచున్నది. ఆయా జీవుల ప్రారబ్ధకర్మానుసారముగా మాయాశక్తియొక్క సత్త్వరజస్తమోగుణ

ముల సమ్మేళనము వివిధజీవులలో విభిన్నముగా కానవచ్చును. ఈ విధముగా జీవులలో ప్రకటమయ్యే భేదాభిమానము కూడ ఆ ఈశ్వరునియందే అధ్యస్తమై యున్నది. ఆ పరమేశ్వరుడు తన స్వరూపమునందు నిలిచి ఉంటూనే, మాయాశక్తియొక్క ఈ గుణములకు, వాటి వలన కలిగే భేద భ్రాంతికి ఆలంబనమగుచున్నాడు. అట్టి పరమేశ్వరునకు నమస్కారము.

బ్రహ్మోవాచ ।
నమస్తే శ్రితసత్త్వాయ ధర్మాదీనాం చ సూతయే ।
నిర్గుణాయ చ యత్కాష్ఠాం నాహం వేదాపరేఽపి చ ॥ 40

బ్రహ్మ - వేదము, ఉవాచ - పలికెను, శ్రితసత్త్వాయ - స్వీకరించబడిన సత్త్వగుణము కలిగినట్టియు, ధర్మ-ఆదీనామ్ - ధర్మార్థకామమోక్షములకు, సూతయే - ఇచ్చునట్టియు, చ - మరియు, నిర్గుణాయ - నిర్గుణుడైన, తే - నీ కొరకు, నమః - నమస్కారము, యత్-కాష్ఠామ్ - ఏ నీ స్వరూపమును, అహమ్ - నేను, చ - మరియు, అపరే అపి - ఇతరులు కూడ, న వేద - తెలియకున్నారో.

వేదపురుషుడు ఇట్లు పలికెను --- నీవు సత్త్వగుణప్రధానుడవై ధర్మార్థకామమోక్షములను భక్తులకు అనుగ్రహించుచున్నావు. కాని, నీవు నిర్గుణుడవు కూడా. నీ తత్త్వమును జ్ఞానరూపుడనగు నేనే తెలియకున్నాను. ఇతరులు కూడ నీ స్వరూపమును తెలియకున్నారు.

అగ్నిరువాచ ।
యత్తేజసాఽహం సుసమిద్ధతేజా
హవ్యం వహే స్వధ్వర ఆజ్యసిక్తమ్ ।
తం యజ్ఞియం పంచవిధం చ పంచభి-
స్స్విష్టం యజుర్భిః ప్రణతోఽస్మి యజ్ఞమ్ ॥ 41

యత్-తేజసా - ఎవ్వాని తేజస్సుచే, సుసమిద్ధతేజాః - చక్కగా ప్రజ్వరిల్ల జేయబడిన తేజస్సు గల, అహమ్ - నేను, సు-అధ్వరే - చక్కని యజ్ఞమునందు, ఆజ్యసిక్తమ్ - నేతితో తడిసిన, హవ్యమ్ - హవిస్సును,

వహే - గైకొని పోయెదవో, తమ్ - అట్టి, యజ్ఞియమ్ - యజ్ఞరక్షకుడైన ట్టియు, పంచవిధమ్ - అయిదు రకముల యజ్ఞముల రూపములోనున్నట్టి యు, పంచభిః - అయిదు, యజుర్భిః - యజుర్మంత్రములచే, సు-ఇష్టమ్ - చక్కగా ఆరాధించబడే, యజ్ఞమ్ - యజ్ఞమూర్తియగు శ్రీహరిని, ప్రణతః అస్మి - నమస్కరించుచున్నాను.

అగ్ని ఇట్లు పలికెను --- నేను ఆ శ్రీహరియొక్క తేజస్సుచేతనే చక్కగా ప్రజ్వరిల్లే తేజస్సును కలిగినవాడనై, యజ్ఞములో ఋత్విక్కులు శ్రద్ధతో సమర్పించే నేతితో తడిసిన హవిస్సును ఆయా దేవతలకు చేర్చు చున్నాను. యజ్ఞమూర్తియగు ఆ శ్రీహరియే అగ్నిహోత్రము, దర్శ, పూర్ణ మాస, చాతుర్మాస్యము, సోమయాగము అనే ఐదు యజ్ఞముల రూప ములో నున్నాడు. ఆశ్రావయ (ఓ అగ్నీధ్రా! హవిస్సు సిద్ధముగానున్నదని దేవతకు వినిపించుము అనే అధ్వర్యుని వచనము), అస్తు శ్రౌషట్ (సరే, ఓ దేవతా! వినుము, హవిస్సు తయారుగా నున్నది అనే అగ్నీధ్రుని వచన ము), యజ (ఓ హోతా! యాజ్యమంత్రమును పఠించుము అనే అధ్వర్యుని వచనము), యే యజామహే (అధ్వర్యునిచే ప్రేరితులమైన మేము యాజ్య మంత్రములను పఠించుచున్నాము అనే హోతృగణముయొక్క వచనము), వషట్ (దేవతకు హవిస్సు సమర్పితమగుగాక! అనే అధ్వర్యుని వచనము) అనే ఐదు యజుర్మంత్రములతో ఋత్విక్కులు (అగ్నీధ్రుడు, అధ్వర్యుడు, హోత అనునవి ఋత్విక్కుల పేర్లు) యజ్ఞరక్షకుడగు ఆ శ్రీహరిని చక్కగా ఆరాధించెదరు. నేనాయనకు నమస్కరించుచున్నాను.

దేవా ఊచుః ।
పురా కల్పాపాయే స్వకృతముదరీకృత్య వికృతం
త్వమేవాద్యస్తస్మిన్ సలిల ఉరగేంద్రాధిశయనే ।
పుమాన్ శేషే సిద్ధైర్హృది విమృశితాధ్యాత్మపదవిః
స ఏవాద్యాక్ణ్ణోర్యః పథి చరసి భృత్యానవసి నః ॥ 42

పురా - పూర్వము, కల్ప-అపాయే - కల్పాంతమునందలి ప్రళ యమునందు, స్వకృతమ్ - తనచే సృష్టించబడిన, వికృతమ్ - వికార

ముల సమూహమైన కార్యజగత్తును, ఉదరీకృత్య - తన పొట్టలో పెట్టుకొని, సిద్ధైః - సిద్ధపురుషులచే, హృది - హృదయమునందు, విమృశిత-అధ్యాత్మపదవిః - ధ్యానము చేయబడిన జ్ఞానమార్గము కలిగినట్టియు, ఆద్యః - సర్వకారణమగు, పుమాన్ - పురుషుడవైన, యః - ఏ, త్వం ఏవ - నీవే, తస్మిన్ - ఆ ప్రళయకాలమునందలి, సలిలే - నీటియందు, ఉరగ-ఇంద్ర -అధిశయనే - నాగరాజగు శేషుడు అనే గొప్ప పడకపై, శేషే - పరుండెదవో, సః ఏవ - ఆ నీవే, అద్య - ఇప్పుడు, నః - మాయొక్క, అక్ష్ణోః - కన్నుల, పథి - మార్గమునందు, చరసి - సంచరించుచున్నావు, భృత్యాన్ - సేవకులమగు మమ్ములను, అవసి - రక్షించుచున్నావు.

దేవతలిట్లు పలికిరి --- ఈ సృష్టికి పూర్వము కల్పము పూర్తి అయినప్పుడు ప్రళయము ఆసన్నము కాగా, నీవు నీచేతనే సృష్టించబడిన వికారసముదాయరూపమగు కార్యజగత్తును నీ పొట్టలో పెట్టుకొని, ఆ ప్రళయజలమునందు నాగరాజగు ఆదిశేషుడే గొప్ప పడక కాగా పరుండెదవు. తమ హృదయములో ఆత్మచైతన్యస్వరూపుడవై యున్న నిన్ను సిద్ధపురుషులు తమ మనస్సులో ధ్యానించుచుందురు. ఆదినారాయణుడవగు అట్టి నీవే ఈ నాడు మా కన్నులకు కనబడి, సేవకులమగు మమ్ములను రక్షించుచున్నావు.

గంధర్వా ఊచుః ।
అంశాంశాస్తే దేవ మరీచ్యాదయ ఏతే
బ్రహ్మేంద్రాద్యా దేవగణా రుద్రపురోగాః ।
క్రీడాభాండం విశ్వమిదం యస్య చ భూమన్
తస్మై నిత్యం నాథ నమస్తే కరవామ ।। 43

దేవ - ఓ దేవా!, భూమన్ - ఓ పరబ్రహ్మరూపా!, నాథ - ఓ నాథా!, ఏతే - ఈ, మరీచి-ఆదయః - మరీచి మొదలగు ప్రజాపతులు, రుద్రపురోగాః - రుద్రుడు అగ్రేసరుడుగా గల, బ్రహ్మ-ఇంద్ర-ఆద్యాః - బ్రహ్మగారు ఇంద్రుడు మొదలుగా గల, దేవగణాః - దేవతల గణములు, యస్య - ఏ, తే - నీకు, అంశ-అంశాః - అంశలకు అంశలో, చ - మరి

యు, ఇదమ్ - ఈ, విశ్వమ్ - జగత్తు, క్రీడాభాండమ్ - లీలాసాధనమో, తస్మై - అట్టి, తే - నీ కొరకు, నిత్యమ్ - అన్ని కాలములలో, నమః - నమస్కారమును, కరవామ - చేయుదుము గాక!

గంధర్వులిట్లు పలికిరి --- పరబ్రహ్మరూపుడవగు ఓ దేవా! మాకు నీవే నాథుడవు. మరీచి మొదలగు ఈ ప్రజాపతులు, దేవతలకు అగ్రేసరుడగు రుద్రుడు, బ్రహ్మగారు ఇంద్రుడు మొదలుగా గల దేవతల గణములు నీ అంశలకు కూడ అంశలై యున్నారు. ఈ బ్రహ్మాండము నీ లీలలకు ఉపకరించే సాధనము. అట్టి నిన్ను మేము సర్వదా నమస్కరిస్తూ ఉండెదము గాక!

విద్యాధరా ఊచుః ।
త్వన్మాయయార్థమభిపద్య కలేవరేఽస్మిన్
కృత్వా మమాహమితి దుర్మతిరుత్పథైస్స్వైః।
క్షిప్తోఽప్యసద్విషయలాలస ఆత్మమోహం
యుష్మత్కథాఽమృతనిషేవక ఉద్వ్యుదస్యేత్ ॥ 44

అర్థమ్ - ప్రయోజనకారియగు మనుష్యదేహమును, అభిపద్య - సంపాదించుకొని, దుర్మతిః - దుర్బుద్ధియగు జనుడు, ఉత్పథైః - తప్పుదారిన నడిచే, స్వైః - తనవారిచే (తన ఇంద్రియములచే), క్షిప్తః - పరాజితుడై, త్వత్-మాయయా - నీ మాయచే, అస్మిన్ - ఈ, కలేవరే - దేహమునందు, అహమ్ - నేను, మమ - నాది, ఇతి - అని, కృత్వా - (అభిమానమును) పెట్టుకొని, అసత్-విషయలాలసః - దుష్టములగు ఇంద్రియభోగములయందు తృష్ణ గలవాడు, యుష్మత్-కథా-అమృతనిషేవకః - నీ గాథలు అనే అమృతమును సేవించువాడు, ఆత్మమోహమ్ - తన (బుద్ధియందలి) అజ్ఞానమును, ఉత్ - దూరముగా, వ్యుదస్యేత్ - నెట్టివేయును.

విద్యాధరులు ఇట్లు పలికిరి --- ఈ మనుష్యదేహము పురుషార్థసాధనము. ఇది పుణ్యకర్మల బలముచే లభించును. దీనిని పొంది కూడ దుర్బుద్ధియగు జనుడు, తన వారు మరియు తన ఇంద్రియములు తప్పుదారిలో నడుచుటను అనుమతించుచున్నాడు. నీ మాయచే మోహితుడైన

ఇట్టి జనుడు శరీరమే తాననియు, లేదా శరీరము తనదనియు అభిమానము పెట్టుకొనియున్నాడు. అట్టి మూర్ఖుడు హావిని చేసే ఇంద్రియభోగములయందు తగుల్కొనియుండును. కాని, దీనికి భిన్నముగా నీ భక్తుడు నీ గాథలనే అమృతమును సేవిస్తూ, తన బుద్ధియందలి అజ్ఞానమును దూరముగా పారద్రోలుచున్నాడు.

బ్రాహ్మణా ఊచుః ।

త్వం క్రతుస్త్వం హుతాశస్స్వయం
త్వం హి మంత్రస్సమిద్దర్భపాత్రాణి చ ।
త్వం సదస్యర్త్విజో దంపతీ దేవతా
అగ్నిహోత్రం స్వధా సోమ ఆజ్యం పశుః ॥ 45

త్వమ్ - నీవే, క్రతుః - యజ్ఞము, త్వమ్ - నీవే, హవిః - హవిస్సు, త్వమ్ - నీవే, హుత-అశః - అగ్నిహోత్రుడవు, త్వం హి - నీవే, స్వయమ్ - స్వయముగా, మంత్రః - మంత్రము, సమిత్-దర్భపాత్రాణి చ - సమిధలు దర్భలు పాత్రలు కూడా, త్వమ్ - నీవే, సదస్య-ఋత్విజః - సభాసదులు ఋత్విక్కులు, దంపతీ - యజమానుడు ఆయన భార్య, దేవతా - దేవత, అగ్నిహోత్రమ్ - అగ్నియందు చేయబడే హోమము, స్వధా - పితృదేవతలకు చేసే సమర్పణము, సోమః - సోమరసము, ఆజ్యమ్ - నేయి, పశుః - పశువు.

బ్రాహ్మణులిట్లు పలికిరి --- యజ్ఞము నీవే. దానిలో దేవతకు సమర్పించబడే ద్రవ్యము, అగ్నిలో ఆ ద్రవ్యమును సమర్పించే క్రియ, ఆ అగ్నిహోత్రుడు మరియు ఆ దేవత కూడ స్వయముగా నీవే. మంత్రము, సమిధలు, దర్భలు, యజ్ఞపాత్రలు, సోమరసము, నేయి మరియు పశువు కూడ నీ రూపములే. సభాసదులు, ఋత్విక్కులు, యజమానుడు, ఆయన పత్ని కూడ నీ రూపములే. పితృదేవతలకు చేసే శ్రాద్ధాదులు కూడ నీ రూపమే.

త్వం పురా గాం రసాయా మహాసూకరో
దంష్ట్రయా పద్మినీం వారణేంద్రో యథా ।

స్తూయమానో నదన్ లీలయా యోగిభిః
వ్యుజ్జహర్థ త్రయీగాత్ర యజ్ఞక్రతుః ॥ 46

త్రయీ - గాత్ర - మూడు వేదములే శరీరముగా గలవాడా!, యజ్ఞ క్రతుః - యజ్ఞసంకల్పమే రూపముగా గల, త్వమ్ - నీవు, పురా - పూర్వము, మహాసూకరః - గొప్ప వరాహమూర్తివై, యోగిభిః - యోగులచే, స్తూయమానః - కొనియాడబడుచున్నవాడవై, నదన్ - నాదమును చేయువాడవై, లీలయా - తేలికగా, దంష్ట్రయా - కోరతో, గామ్ - భూమిని, రసాయాః - పాతాళమునుండి, వారణ-ఇంద్రః - గొప్ప ఏనుగు, పద్మినీం యథా - పద్మపు మొక్కను వలె, వ్యుజ్జహర్థ - లేవనెత్తితివి.

మూడు వేదములే శరీరముగా గల ఓ శ్రీహరీ! యజ్ఞమును చేయ అనే సంకల్పము కూడ నీ రూపమే. నీవు పూర్వము గొప్ప వరాహ మూర్తిగా అవతరించి నినదిస్తూ, పాతాళమునుండి భూమిని కోరతో పైకి తెచ్చితివి. పెద్ద ఏనుగు పద్మపు మొక్కను సరస్సునుండి పైకి తీసినంత అవలీలగా నీవా పనిని చేయగా, సిద్ధులు నిన్ను స్తుతించిరి.

స ప్రసీద త్వమస్మాకమాకాంక్షతాం
దర్శనం తే పరిభ్రష్టసత్కర్మణామ్ ।
కీర్త్యమానే నృభిర్నామ్ని యజ్ఞేశ తే
యజ్ఞవిఘ్నాః క్షయం యాంతి తస్మై నమః ॥ 47

యజ్ఞ-ఈశ - యజ్ఞమునకు ప్రభువగు ఓ శ్రీహరీ! సః - అట్టి, త్వమ్ - నీవు, తే - నీ, దర్శనమ్ - దర్శనమును, ఆకాంక్షతామ్ - ఆకాంక్షించునట్టియు, పరిభ్రష్టసత్-కర్మణామ్ - నశించిన మంచి కర్మ గల, అస్మాకమ్ - మాకు, ప్రసీద - అనుగ్రహించుము, నృభిః - మానవులచే, తే - నీ, నామ్ని - నామము, కీర్త్యమానే - కీర్తించబడుచుండగా, యజ్ఞవిఘ్నాః - యజ్ఞమునకు కలిగే ఆటంకములు, క్షయమ్ - వినాశమును, యాంతి - పొందుము, తస్మై - అట్టి నీ కొరకు, నమః - నమస్కారము.

ఓ యజ్ఞేశ్వరా! మేము నీ దర్శనమును గట్టిగా కోరుచున్నాము. మేము మొదలు పెట్టిన మంచి యజ్ఞము వినష్టమైనది. మమ్ములనను

హించుము. నీ నామమును కీర్తించు జనులకు యజ్ఞములో విఘ్నములు దూరమగును. నీకు నమస్కారము.

మైత్రేయ ఉవాచ ।
ఇతి దక్షః కవిర్యజ్ఞం భద్ర రుద్రావమర్శితమ్ ।
కీర్త్యమానే హృషీకేశే సంనిన్యే యజ్ఞభావనే ॥ 48

ఇతి - ఈ విధముగా, యజ్ఞభావనే - యజ్ఞపాలకుడు, హృషీకేశే - ఇంద్రియములకు ప్రభువు అగు శ్రీహరి, కీర్త్యమానే - కీర్తించబడుచుండగా, భద్రరుద్ర-అవమర్శితమ్ - వీరభద్రునిచే నశింపజేయబడిన (భద్ర - ఓ మంగళకరమైనవాడా!), యజ్ఞమ్ - యజ్ఞమును, కవిః - స్వచ్ఛమగు అంతఃకరణము గల, దక్షః - దక్షుడు, సంనిన్యే - నడిపించెను.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- మంగళకరుడవగు ఓ విదురా! ఈ విధముగా వారు ఇంద్రియాధిపతి, యజ్ఞరక్షకుడు అగు శ్రీహరిని కీర్తించుచుండిరి. అపుడు దక్షుడు స్వచ్ఛమగు అంతఃకరణముతో వీరభద్రునిచే ధ్వస్తము చేయబడిన యజ్ఞమును మరల చేయ మొదలిడెను.

భగవాన్ స్వేన భాగేన సర్వాత్మా సర్వభాగభుక్ ।
దక్షం బభాష ఆభాష్య ప్రీయమాణ ఇవానఘ ॥ 49

అనఘ - పాపమునెరుగని ఓ విదురా!, సర్వ-ఆత్మా - సర్వులకు ఆత్మయైనవాడు, సర్వభాగభుక్ - యజ్ఞభాగములనన్నింటినీ స్వీకరించువాడు అగు, భగవాన్ - శ్రీహరి భగవానుడు, స్వేన - తన, భాగేన - భాగముతో, ప్రీయమాణః ఇవ - ప్రీతిని చెందుచున్నవాడు వలె, దక్షమ్ - దక్షుని, ఆభాష్య - సంబోధించి, బభాషే - పలికెను.

పాపమునెరుగని ఓ విదురా! శ్రీహరి సర్వులకు ఆత్మయై ఉన్నాడు గనుక, సర్వదేవతల యజ్ఞభాగములను భుజించువాడు ఆయనయే. కాని, ఆయన తన భాగముతో తృప్తిని చెందినాడా యన్నట్లు దక్షుని సంబోధించి ఇట్లు పలికెను.

శ్రీభగవానువాచ ।
అహం బ్రహ్మా చ శర్వశ్చ జగతః కారణం పరమ్ ।
ఆత్మేశ్వర ఉపద్రష్టా స్వయంధృగవిశేషణః ॥ 50

అహమ్ - నేను, జగతః - జగత్తునకు, పరమ్ - సర్వాతిశాయి యగు (అతీతమగు), కారణమ్ - కారణము, ఆత్మా - ఆత్మను, ఈశ్వరః - ఈశ్వరుడను, ఉపద్రష్టా - సాక్షిని, స్వయందృక్ - స్వయంప్రకాశ స్వరూపుడను, అవిశేషణః - ఉపాధి గుణములు లేనివాడను (ముగ్గురికి తేడా లేదు), బ్రహ్మా - బ్రహ్మగారు, శర్వః చ - శివుడు కూడా.

శ్రీహరి భగవానుడిట్లు పలికెను --- నేను సర్వకారణకారణుడను. నేను జగత్కారణుడనే అయిననూ, జగత్తునకు అతీతుడను (అనగా, జగత్తు నా వివర్తము మాత్రమే, అనగా, నాయందు వాస్తవముగా లేకున్ననూ ఉన్నట్లు కనబడేది). ఈ సర్వమునకు ఆత్మ (స్వరూపసత్త) నేనే. ఈ జగత్తునకు ఆ విధముగా అధీశ్వరుడను కూడ నేనే. స్వయంప్రకాశస్వరూపుడనగు నాకు జగత్తు అనే ఉపాధి గుణములు సంక్రమించవు. నేను ఎట్టివాడనో బ్రహ్మగారు, శివుడు కూడ అట్టివారే. అనగా, నాకు వారితో భేదము ఏమియు లేదు.

ఆత్మమాయాం సమావిశ్య సోఽహం గుణమయీం ద్విజ ।
సృజన్ రక్షన్ హరన్ విశ్వం దధ్రే సంజ్ఞాం క్రియోచితామ్॥51

ద్విజ - ఓ దక్షా! సః - అట్టి, అహమ్ - నేను, గుణమయీమ్ - త్రిగుణాత్మకమగు, ఆత్మమాయామ్ - నా మాయాశక్తిని, సమావిశ్య - చక్కగా ఆవేశించినవాడనై, విశ్వమ్ - జగత్తును, సృజన్ - సృష్టించువాడనై, రక్షన్ - రక్షించువాడనై, హరన్ - ఉపసంహరించువాడనై, క్రియా-ఉచితామ్ - పనికి తగిన, సంజ్ఞామ్ - పేరును, దధ్రే - ధరించెదను.

ఓ దక్షా! అట్టి నేను త్రిగుణాత్మకమగు నా మాయాశక్తిని నా వశములో నుంచుకుంటూ, దానిని ఉపాధిగా చేసుకొని జగత్తును సృష్టించి, రక్షించి, ఉపసంహరించుచుందును. క్రమముగా ఈ మూడు జగత్కార్యములకు తగిన బ్రహ్మవిష్ణురుద్రులనే మూడు పేర్లను నేనే కలిగియుందును.

తస్మిన్ బ్రహ్మణ్యద్వితీయే కేవలే పరమాత్మని ।
బ్రహ్మరుద్రౌ చ భూతాని భేదేనాజ్ఞోఽనుపశ్యతి ॥ 52

అద్వితీయే - రెండవది లేనిది, కేవలే - అఖండము, పరమ-ఆత్మని - జీవులలో అంతరతమమగు ఆత్మరూపముగా నున్నది అగు, తస్మిన్ - ఆ, బ్రహ్మణి - పరబ్రహ్మయందు, బ్రహ్మరుద్రౌ - బ్రహ్మగారిని రుద్రుని, చ - మరియు, భూతాని - ప్రాణులను, భేదేన - తేడాగా, అజ్ఞః - అజ్ఞాని, పశ్యతి - చూచుచున్నాడు.

అఖండసత్తారూపమగు పరబ్రహ్మకంటె రెండవది మరియొకటి లేదు. జీవులలో అంతరతమమగు ఆత్మచైతన్యము రూపములో ఆ పరబ్రహ్మయే ఉన్నది. అదియే నేను. కాని, అజ్ఞాని బ్రహ్మగారు, రుద్రుడు, ఇతర జీవులు అనే భేదమును పరబ్రహ్మయందు దర్శిస్తూ, అట్టి భేదమే సత్యమని తలపోయుచున్నాడు.

యథా పుమాన్న స్వాంగేషు శిరఃపాణ్యాదిషు క్వచిత్ ।
పారక్యబుద్ధిం కురుత ఏవం భూతేషు మత్పరః ॥ 53

యథా - ఏ విధముగానైతే, పుమాన్ - మానవుడు, శిరః-పాణి-ఆదిషు - తల చేయి మొదలగు, స్వ-అంగేషు - తన శరీరావయవముల యందు, క్వచిత్ - ఎక్కడనైననూ (ఎప్పుడైననూ), పారక్యబుద్ధిమ్ - తన కంటె వేరు అనే ఆలోచనను, న కురుతే - చేయడో, ఏవమ్ - అదే విధముగా, మత్-పరః - నాయందు భక్తి గలవాడు, భూతేషు - ప్రాణుల విషయములో.

మానవుడు తల, చేయి మొదలగు తన శరీరావయవములు తన కంటె వేరుగా నున్నవని ఎక్కడైనా ఎప్పుడైననూ తలపోయడు. అదే విధముగా, నా భక్తుడు సకలప్రాణులు నాకంటె వేరుగానున్నవని తలపోయడు.

త్రయాణామేకభావానాం యో న పశ్యతి వై భిదామ్ ।
సర్వభూతాత్మనాం బ్రహ్మన్ స శాంతిమధిగచ్ఛతి ॥ 54

బ్రహ్మన్ - ఓ మహాత్మా!, ఏకభావానామ్ - ఒకే స్వరూపము కలిగినట్టియు, సర్వభూత-ఆత్మనామ్ - సకలప్రాణులకు ఆత్మరూపులైయున్న, త్రయాణామ్ - ముగ్గురికి, యః - ఎవరైతే, నై - నిశ్చయముగా, భిదామ్ - భేదాను, న పశ్యతి - చూడడో, సః - అట్టివాడు, శాంతిమ్ - శాంతిని, అధిగచ్ఛతి - పొందును.

ఓ మహాత్మా విదురా! బ్రహ్మవిష్ణురుద్రుల స్వరూపము, సకలప్రాణుల ఆత్మస్వరూపము ఒక్కటియే. భేదా లేదు. ఈ సత్యమును తెలుసుకున్న వ్యక్తి మోక్షమును పొందును.

మైత్రేయ ఉవాచ ।
ఏవం భగవతాదిష్టః ప్రజాపతిపతిర్హరిమ్ ।
అర్చిత్వా క్రతునా స్వేన దేవానుభయతోఽయజత్ ।। 55

ప్రజాపతిపతిః - ప్రజాపతులకు ప్రభువగు దక్షుడు, ఏవమ్ - ఈ విధముగా, భగవతా - శ్రీహరి భగవానునిచే, ఆదిష్టః - ఆదేశించబడినవాడై, స్వేన - తనదైన, క్రతునా - త్రికపాలేష్టితో, హరిమ్ - శ్రీహరిని, అర్చిత్వా - పూజించి, దేవాన్ - ఇతరదేవతలను, ఉభయతః - ప్రధానయాగముతో మరియు అంగయాగములతో, అయజత్ - ఆరాధించెను.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- ఈ విధముగా శ్రీహరి ఆదేశించగా, ప్రజాపతులకు నాయకుడగు దక్షుడు త్రికపాలేష్టి (మూడు కపాలములయందు సంస్కరించబడిన పురోడాశము సమర్పించబడే యాగము)చే శ్రీహరిని అర్చించెను. ఇతరదేవతలను కూడ అంగయాగము, ప్రధానయాగము అనే రెండు యాగములతో ఆరాధించెను.

రుద్రం చ స్వేన భాగేన హ్యుపాధావత్సమాహితః ।
కర్మణోదవసానేన సోమపానితరానపి ।
ఉదవస్య సహర్త్విగ్భిస్సస్నావవభృథం తతః ।। 56

సమాహితః - ఏకాగ్రచిత్తుడగు దక్షుడు, స్వేన - తనదైన, భాగేన - భాగముతో, రుద్రం చ - రుద్రుని కూడ, ఉపాధావత్ - పూజించెను, ఉద

వసానేన - సమాప్తీష్టి అనే, కర్మణా - కర్మచే, సోమపాన్ - సోమమునందు భాగము గల, ఇతరాన్ అపి - ఇతరదేవతలను కూడ, తతః - తరువాత, ఉదవస్య - యజ్ఞమును పూర్తి చేసి, ఋత్విగ్భిః సహ - ఋత్విక్కులతో గూడి, అవభృథమ్ - అవభృథమగునట్లుగా, సస్నౌ - స్నానమును చేసెను.

దక్షుడు ఏకాగ్రచిత్తముతో శివునకు యజ్ఞశిష్టమగు భాగమును సమర్పించి పూజించెను. యజ్ఞమునకు ఆఖరులో చేసే ఉదవసానేష్టిని కూడ చేసి, సోమమునందు భాగము గల ఇతరదేవతలను కూడ ఆతడు పూజించెను. తరువాత ఆతడు ఋత్విక్కులతో గూడి అవభృథ స్నానమును (యజ్ఞదీక్ష అయిన తరువాత చేసే స్నానము) చేసెను.

తస్మా అప్యనుభావేన స్వేనైవావాప్తరాధసే ।
ధర్మ ఏవ మతిం దత్త్వా త్రిదశాస్తే దివం యయుః ।। 57

స్వేన - తనదైన, అనుభావేన ఏవ - ప్రభావముచేతనే, ఆప్తరాధసే - పొందబడిన ధర్మసిద్ధి గల, తస్మై అపి - ఆ దక్షుని కొరకు కూడ, ధర్మే ఏవ - ధర్మమునందు మాత్రమే, మతిమ్ - బుద్ధిని, దత్త్వా - అనుగ్రహించి, తే - ఆ, త్రిదశాః - దేవతలు, దివమ్ - స్వర్గమును గురించి, యయుః - వెళ్లిరి.

ఈ విధముగా భగవానుని స్వయముగా ఆరాధించి, దాని ప్రభావముచే మాత్రమే దక్షుడు ధర్మమును సిద్ధింపజేసుకొనెను. దేవతలు ఆతనికి ధర్మమునందు మాత్రమే బుద్ధి నిలుచునట్లు అనుగ్రహించి, స్వర్గమునకు వెళ్లిరి.

ఏవం దాక్షాయణీ హిత్వా సతీ పూర్వకలేవరమ్ ।
జజ్ఞే హిమవతః క్షేత్రే మేనాయామితి శుశ్రుమ ।। 58

దాక్షాయణీ - దక్షుని కుమార్తెయగు, సతీ - సతీదేవి, ఏవమ్ - ఈ విధముగా, పూర్వకలేవరమ్ - పూర్వమునందలి దేహమును, హిత్వా - విడిచిపెట్టి, హిమవతః - హిమవంతుని, క్షేత్రే - భార్యయగు, మేనా

యామ్ - మేనయందు, జజ్ఞే - జన్మించెను, ఇతి - అని, శుశ్రుమ - విని యున్నాము.

దక్షుని కుమార్తెయగు సతీదేవి ఈ విధముగా ఆ దేహమును విడిచి పెట్టి, హిమవంతుని భార్యయగు మేనకు కుమార్తెయై జన్మించినదని విని యున్నాము.

తమేవ దయితం భూయ ఆవృంక్తే పతిమంబికా ।
అనన్యభావైకగతిం శక్తిస్సుప్తేవ పూరుషమ్ ॥ 59

భూయః - మరల, అంబికా - జగన్మాతయగు ఆ పార్వతి, సుప్తా - నిద్రించిన, శక్తిః - శక్తి, పూరుషం ఇవ - పురుషుని వలె, అనన్యభావ-ఏక గతిమ్ - ఇతరమునందు ప్రేమలేని వారలకు ఏకైకమగు శరణు అయి ఉన్న, తం ఏవ - ఆ శివుని మాత్రమే, దయితమ్ - ప్రియుడగు, పతిమ్ - భర్తగా, ఆవృంక్తే - సేవించెను.

ప్రళయకాలములో భగవంతునియందు ఉపసంహరించబడిన మాయాశక్తి సృష్టికాలములో పునరుత్థానమును చెంది ఆ ఈశ్వరుని మాత్రమే ఆశ్రయించును. అదే విధముగా జగన్మాతయగు ఆ పార్వతి ఆ శివుని మాత్రమే తనకు ప్రియమైన భర్తగా సేవించెను. ఇతరమునందు ప్రేమ లేనివారలకు ఆయన ఏకైకశరణ్యుడు గదా!

ఏతద్భగవతశ్శంభోః కర్మ దక్షాధ్వరద్రుహః ।
శ్రుతం భాగవతాచ్ఛిష్యాదుద్ధవాన్మే బృహస్పతేః ॥ 60

దక్ష-అధ్వరద్రుహః - దక్షుని యజ్ఞమును వినాశము చేసిన, భగవతః - భగవానుడగు, శంభోః - శివుని, ఏతత్ - ఈ, కర్మ - లీల, భాగవతాత్ - భగవద్భక్తుడు, బృహస్పతేః - బృహస్పతికి, శిష్యాత్ - శిష్యుడు అగు, ఉద్ధవాత్ - ఉద్ధవునినుండి, మే - నాచే, శ్రుతమ్ - వినబడినది.

శంభుభగవానుడు ఈ విధముగా దక్షుని యజ్ఞమును ధ్వంసము చేసిన లీలను నేను ఉద్ధవునినుండి వింటిని. బృహస్పతికి శిష్యుడగు ఉద్ధవుడు భగవద్భక్తుడు.

ఇదం పవిత్రం పరమీశచేష్టితం
యశస్యమాయుష్యమఘౌఘమర్షణమ్ ।
యో నిత్యదాఽఽకర్ణ్య నరోఽనుకీర్తయేత్
ధునోత్యఘం కౌరవ భక్తిభావతః ॥ 61

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే చతుర్థస్కంధే దక్షయజ్ఞే
సర్వదేవకృతస్తుతివర్ణనం నామ సప్తమోఽధ్యాయః ॥

కౌరవ - ఓ విదురా!, పరమ్ - మిక్కిలి, పవిత్రమ్ - పావనమైనట్టియు, యశస్యమ్ - కీర్తిని కలిగించునట్టియు, ఆయుష్యమ్ - ఆయుర్దాయమునిచ్చునట్టియు, అఘ-ఓఘమర్షణమ్ - పాపప్రవాహమును ఎండగొట్టే, ఇదమ్ - ఈ, ఈశచేష్టితమ్ - శివుని లీలను, యః - ఏ, నరః - మానవుడు, భక్తిభావతః - భక్తిభావము వలన, నిత్యదా - నిత్యము, ఆకర్ణ్య - విని, అను - తరువాత, కీర్తయేత్ - కీర్తించునో వాడు, అఘమ్ - దుఃఖమును, ధునోతి - పోగొట్టుకొనును.

ఓ విదురా! శివుని ఈ లీల మిక్కిలి పావనము. ఈ లీల భక్తులకు కీర్తిని, ఆయుర్దాయమును ఇచ్చి పాపప్రవాహము ఎండిపోవునట్లు చేయును. ఏ మానవుడైతే దీనిని నిత్యము భక్తిభావముతో విని కీర్తించునో, వాని పాపములు నశించును.

శ్రీమద్భాగవత మహాపురాణములోని నాల్గవ స్కంధములో
దక్షయజ్ఞమునందు దేవతలు శ్రీహరిని స్తుతించుటను
వర్ణించే ఏడవ అధ్యాయము ముగిసినది (7).

*****

# అథ అష్టమోఽధ్యాయః

## ధ్రువోపాఖ్యానము - ధ్రువుడు అడవికి వెళ్లి కఠోరమగు తపస్సును చేయుట

మైత్రేయ ఉవాచ ।
సనకాద్యా నారదశ్చ ఋభుర్హంసోఽరుణిర్యతిః ।
నైతే గృహాన్ బ్రహ్మసుతా హ్యావసన్నూర్ధ్వరేతసః ॥ 1

మైత్రేయః - మైత్రేయుడు, ఉవాచ - పలికెను, సనక-ఆద్యాః - సనకుడు మొదలగువారు, నారదః - నారదుడు, ఋభుః - ఋభువు, హంసః - హంసుడు, అరుణిః - అరుణి, యతిః - యతి, ఏతే - ఈ, ఊర్ధ్వ రేతసః - నైష్ఠికబ్రహ్మచారులగు, బ్రహ్మసుతాః - బ్రహ్మగారి పుత్రులు, గృహాన్ న హి అవసన్ - గృహస్థాశ్రమమును స్వీకరించనే లేదు.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- సనకుడు, సనందనుడు, సనాతనుడు, సనత్కుమారుడు, నారదుడు, ఋభువు, హంసుడు, అరుణి మరియు యతి అనే బ్రహ్మగారి పుత్రులు గృహస్థాశ్రమమును స్వీకరించ కుండగా నైష్ఠిక బ్రహ్మచారులుగనే ఉండిపోయిరి.

మృషాఽధర్మస్య భార్యాసీద్దంభం మాయాం చ శత్రుహన్ ।
అసూత మిథునం తత్తు నిరృతిర్జగృహేఽప్రజః ॥ 2

శత్రుహన్ - అంతశ్శత్రువులను సంహరించినవాడా!, అధర్మస్య - అధర్మునకు, మృషా - మృష, భార్యా - భార్య, ఆసీత్ - ఆయెను, దంభమ్ - దంభుని, మాయాం చ - మాయను కూడ, అసూత - కనెను,

అప్రజః - సంతానము లేని, నిర్ృతిః - నిర్ృతి, తత్ - ఆ, మిథునం తు - జంటనైతే, జగృహే - తీసుకొని వెళ్లెను.

కామక్రోధములు మొదలగు అంతశ్శత్రువులను దునుమాడిన ఓ విదురా! ధర్మని వలె, అధర్ముడు కూడ బ్రహ్మగారి పుత్రుడే. అధర్మునకు మృష అనే భార్య ఉండెను. వారికి దంభుడు అనే కుర్రవాడు, మాయ అనే అమ్మాయి కలిగిరి. వారిద్దరినీ సంతానము లేని నిర్ృతి తీసుకువెళ్లెను.

అధర్మమునకు అసత్యము తోడుగానుండును. ఆ కలయికనుండి డాంబికము, కపటము ఉదయించును. ఆ లక్షణములను స్వీకరించువాడే. రాక్షసుడు. వాని నివాసమే నరకము.

తయోస్సమభవల్లోభో నికృతిశ్చ మహామతే ।
తాభ్యాం క్రోధశ్చ హింసా చ యద్దురుక్తిస్స్వసా కలిః ।। 3

మహామతే - గొప్ప బుద్ధిశక్తి గల ఓ విదురా!, తయోః - వారిద్దరికీ, లోభః - లోభుడు, నికృతిః చ - నికృతి కూడ, సమభవత్ - కలిగెను, తాభ్యామ్ - వారినుండి, క్రోధః - క్రోధుడు, హింసా చ - హింస కూడ (కలిగిరి), యత్ - ఎవరినుండైతే, కలిః - కలి, స్వసా - చెల్లెలు అగు, దురుక్తిః - దురుక్తి కలిగిరో.

ఓ విదురా! నీవు గొప్ప బుద్ధిశాలివి. ఆ దంభునకు, మాయకు లోభుడు అనే కుమారుడు, నికృతి అనే అమ్మాయి కలిగిరి. వారికి క్రోధుడు అనే కుర్రవాడు, హింస అనే అమ్మాయి కలిగిరి. వారికి, కలి అనే కుర్రవాడు, దురుక్తి అనే అమ్మాయి కలిగిరి.

డాంబికమునకు కపటము తోడైతే లోభము పుట్టును. డాంబికులు కపటోపాయములతో ప్రజల ధనమును దోచెదరు. వారా ప్రయత్నములో ఇతరులకు రహస్యముగా అపకారము (నికృతి) ను చేయుదురు. లోభమును అంటి పెట్టుకొని కోపము ఉండును. లోభము ఫలించనప్పుడు అది వెంటనే బయట పడును. కోపమునుండి కలహము, తిట్టుకొనుట అనునవి ఉదయించును.

దురుక్తౌ కలిరాధత్త భియం మృత్యుం చ సత్తమ ।
తయోశ్చ మిథునం జజ్ఞే యాతనా నిరయస్తథా ॥ 4

సత్తమ - ఓ మహాత్మా!, కలిః - కలి, దురుక్తౌ - దురుక్తియందు, భియమ్ - భీ అనే అమ్మాయిని, మృత్యుం చ - మృత్యువును కూడ, ఆధత్త - కనెను, తయోః చ - వారిద్దరికి కూడ, యాతనా - యాతన అనే అమ్మాయి, తథా - మరియు, నిరయః - నిరయుడు అనే, మిథునమ్ - జంట, జజ్ఞే - కలిగెను.

ఓ మహాత్మా విదురా! కలికి దురుక్తియందు భీ అనే అమ్మాయి, మృత్యువు అనే కుమారుడు కలిగిరి. వారిద్దరికి యాతన అనే అమ్మాయి, నిరయుడు అనే కుమారుడు కలిగిరి.

కలహములో తిట్లను ప్రయోగించినప్పుడు ఎదుటివాడు పగ తీర్చుకొనునేమో అనే భయము తప్పదు. ఆ భయము వెంట, ఎదుటివాడు పగ తీర్చుకున్నచో, మరణమే కలుగవచ్చును. కలహములు తిట్లకు మాత్రమే గాక, భయహేతువులై హత్యలకు దారి తీయుట లోకప్రసిద్ధము. తిట్లు, హత్యలు ఉన్నప్పుడు నరకము (కారాగారము), యాతనలు వాటిని వెంటనంటి యుండును.

సంగ్రహేణ మయాఽఽఖ్యాతః ప్రతిసర్గస్తవానఘ ।
త్రిశ్శ్రుత్వైతత్పుమాన్ పుణ్యం విధునోత్యాత్మనో మలమ్॥ 5

అనఘ - పుణ్యాత్ముడవగు ఓ విదురా!, తవ - నీకు, మయా - నాచే, ప్రతిసర్గః - ప్రళయము, సంగ్రహేణ - సంగ్రహముగా, ఆఖ్యాతః - చెప్పబడినది, పుమాన్ - మానవుడు, పుణ్యమ్ - పవిత్రమగు, ఏతత్ - దీనిని, త్రిః - మూడు సార్లు, శ్రుత్వా - విని, ఆత్మనః - తన, మలమ్ - పాపమును, విధునోతి - పూర్తిగా తొలగించుకొనును.

పుణ్యాత్ముడవగు ఓ విదురా! నేను నీకీ విధముగా అధర్మవంశమును చెప్పి, దానిచే కలిగే ప్రళయమును సూచించుట ద్వారా సంగ్రహముగా ప్రళయమును కూడ చెప్పినట్లైనది. ఈ అధర్మవంశమునకు దూర

ముగా నుండుట పుణ్యహేతువు గనుక, దీనిని మూడు సార్లు విన్న మాన
వుడు తన పాపములను విశేషముగా తొలగించుకొనగల్గును.

**అథాతః కీర్తయే వంశం పుణ్యకీర్తేః కురూద్వహ ।**
**స్వాయంభువస్యాపి మనోర్హరేరంశాంశజన్మనః ॥ 6**

కురు-ఉద్వహ - ఓ కురువంశశ్రేష్ఠా!, అథ - తరువాత, అతః - ఇదివరలో కొంతవరకు చెప్పియున్న కారణముగా, పుణ్యకీర్తేః - పవిత్రమగు కీర్తి కలిగినట్టియు, హరేః - శ్రీహరియొక్క, అంశ-అంశజన్మనః - అంశయగు బ్రహ్మగారి శరీరమునుండి జన్మించిన, స్వాయంభువస్య మనోః - స్వాయంభువ మనువుయొక్క, వంశం అపి - వంశమును కూడ, కీర్తయే - కీర్తించెదను.

కురువంశశ్రేష్ఠుడవగు ఓ విదురా! దక్షయజ్ఞముమ గురించి చెప్పితిని. ఇదివరలో స్వాయంభువ మనువంశమును ప్రస్తావించితిని. కావున, పవిత్రమగు కీర్తిగల ఆ స్వాయంభువ మనువుయొక్క వంశమును గురించి కీర్తించెదను. శ్రీహరియొక్క అంశయగు బ్రహ్మగారి దేహమునుండి ఆ మను మహారాజు జన్మించెను.

**ప్రియవ్రతోత్తానపాదౌ శతరూపాపతేస్సుతౌ ।**
**వాసుదేవస్య కలయా రక్షాయాం జగతః స్థితౌ ॥ 7**

శతరూపాపతేః - శతరూపకు భర్తయగు స్వాయంభువమనువుయొక్క, సుతౌ - పుత్రులైన, ప్రియవ్రత-ఉత్తానపాదౌ - ప్రియవ్రతుడు ఉత్తానపాదుడు, వాసుదేవస్య - శ్రీహరియొక్క, కలయా - అంశచే, జగతః - జగత్తుయొక్క, రక్షాయామ్ - రక్షణయందు, స్థితౌ - స్థిరముగా నుండిరి.

శతరూపకు స్వాయంభువ మమవునకు ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు అనే ఇద్దరు కుమారులు ఉండిరి. వారు శ్రీహరియొక్క అంశ గలవారై, జగద్రక్షణకార్యమును దృఢముగా చేసిరి.

జాయే ఉత్తానపాదస్య సునీతిస్సురుచిస్తయోః ।
సురుచిః ప్రేయసీ పత్యుర్నేతరా యత్సుతో ధ్రువః ।। 8

ఉత్తానపాదస్య - ఉత్తానపాదునకు, సునీతిః - సునీతి, సురుచిః - సురుచి అనే, జాయే - ఇద్దరు భార్యలు, తయోః - వారిద్దరిలో, సురుచిః - సురుచి, పత్యుః - భర్తకు, ప్రేయసీ - మిక్కిలి ప్రియురాలు, ఇతరా - సునీతి, న - కాదు, యత్-సుతః - ఏ సునీతియొక్క పుత్రుడు, ధ్రువః - ధ్రువుడో.

ఉత్తానపాదునకు సునీతి, సురుచి అనే ఇద్దరు భార్యలు గలరు. వారిద్దరిలో సురుచిపై ఆయనకు ప్రేమ మిక్కుటము; ఆయనకు సునీతిపై అంతటి ప్రేమ ఉండెడిది కాదు. సునీతి కుమారుడు ధ్రువుడు.

ఏకదా సురుచేః పుత్రమంకమారోప్య లాలయన్ ।
ఉత్తమం నారురుక్షంతం ధ్రువం రాజాఽభ్యనందత ।। 9

ఏకదా - ఒకనాడు, రాజా - ఉత్తానపాద మహారాజు, సురుచేః - సురుచియొక్క, పుత్రమ్ - పుత్రుడగు, ఉత్తమమ్ - ఉత్తముని, అంకమ్ - తొడను, ఆరోప్య - ఎక్కించుకొని, లాలయన్ - లాలించుచున్నవాడై, ఆరురుక్షంతమ్ - తొడపై ఎక్కగోరుచున్న, ధ్రువమ్ - ధ్రువుని, న అభ్యనందత - అంగీకరించలేదు.

ఒకనాడు ఉత్తానపాద మహారాజు సురుచి పుత్రుడగు ఉత్తముని ఒడిలో కూర్చుండబెట్టుకొని లాలించుచుండెను. ధ్రువుడు కూడ ఆయన ఒడిలో కూర్చుండబోగా, దానికి ఆయన అంగీకరించలేదు.

తథా చికీర్షమాణం తం సపత్న్యాస్తనయం ధ్రువమ్ ।
సురుచిశ్శృణ్వతో రాజ్ఞస్సేర్ష్యమాహాతిగర్వితా ।। 10

తథా - ఆ విధముగా, చికీర్షమాణమ్ - చేయగోరుచున్నట్టియు, సపత్న్యాః - సవతియొక్క, తనయమ్ - పుత్రుడైన, ధ్రువమ్ - ధ్రువుని ఉద్దేశించి, అతిగర్వితా - మిక్కిలి గర్వించియున్న, సురుచిః - సురుచి,

రాజ్ఞః - మహారాజు, శృణ్వతః - వినుచుండగా, స-ఈర్ష్యమ్ - ఓర్వలేనిద నముతో కూడియున్న విధముగా, ఆహ - పలికెను.

ధ్రువుడు ఆ తీరున తండ్రి ఒడిలో కూర్చోవాలని కోరి ప్రయత్నిం చుచుండెను. దానిని చూచి సవతి తల్లియగు సురుచి ఓర్వలేకపోయెను. మిక్కిలి గర్వించియున్న ఆమె, మహారాజు ఉన్నాడనే విషయమును కూడ పట్టించుకోకుండగా, తన సవతి కొడుకగు ధ్రువునితో నిట్లనెను.

న వత్స నృపతేర్ధిష్ణ్యం భవానారోఢుమర్హతి ।
న గృహీతో మయా యత్త్వం కుక్షావపి నృపాత్మజః ।। 11

వత్స - బాబూ!, భవాన్ - నీవు, నృపతేః - మహారాజుయొక్క, ధిష్ణ్యమ్ - ఆసనమును, ఆరోఢుమ్ - ఎక్కుటకు, న అర్హతి - తగవు, యత్ - ఎందువలననగా, త్వమ్ - నీవు, నృప-ఆత్మజః అపి - రాజపుత్రుడవే అయిననూ, మయా - నాచే, కుక్షౌ - ఉదరమునందు, న గృహీతః - ధరిం పబడలేదు.

బాబూ! నీవు మహారాజుగారి ఆసనముపై కూర్చుండుట తగదు. ఎందుకంటే, నీవు రాజపుత్రుడవే అయినా, నిన్ను పది మాసములు మోసి కన్నది నేను కాదు కదా!

బాలోఽసి బత నాత్మానమన్యస్త్రీగర్భసంభృతమ్ ।
నూనం వేద భవాన్ యస్య దుర్లభేఽర్థే మనోరథః ।। 12

బత - అయ్యో!, బాలః అసి - కుఱ్ఱకుంకవు, భవాన్ - నీవు, ఆత్మానమ్ - నిన్ను, అన్యస్త్రీగర్భసంభృతమ్ - మరియొక స్త్రీయొక్క గర్భమునందు ధరింపబడినవానినిగా, నూనమ్ - నిశ్చయముగా, న వేద - తెలియకున్నావు, యస్య - ఏ నీకు, దుర్లభే - పొంద శక్యము కాని, అర్థే - విషయమునందు, మనోరథః - కోరిక గలదో.

అయ్యో! నీవు నా కడుపున కాకుండా, మరియొక స్త్రీ కడుపున పుట్టినావు. నీవు ఈ సంగతిని కూడ సరిగ్గా తెలుసుకోలేని కుఱ్ఱకుంకవు. అందువలననే, నీకు పొంద శక్యము కాని స్థానముపై కోరిక కలిగినది.

తపసాఽఽరాధ్య పురుషం తస్యైవానుగ్రహేణ మే ।
గర్భే త్వం సాధయాత్మానం యదీచ్ఛసి నృపాసనమ్ ।। 13

త్వమ్ - నీవు, నృప-ఆసనమ్ - రాజుగారి ఆసనమును, ఇచ్ఛసి యది - కోరుచున్నచో, తపసా - తపస్సుచే, పురుషమ్ - పరమేశ్వరుని, ఆరాధ్య - ఆరాధించి, తస్య - ఆ పరమేశ్వరుని, అనుగ్రహేణ ఏవ - అనుగ్రహముచే మాత్రమే, ఆత్మానమ్ - నిన్ను, మే - నా, గర్భే - గర్భమునందు, సాధయ - సాధించుము.

నీవు రాజుగారి ఆసనమును కోరువాడవైనచో, తపస్సును చేసి పరమేశ్వరుని ఆరాధించుము. ఆయన అనుగ్రహము మాత్రమే నీవు మరుజన్మలో నా కడుపున పుట్టునట్లు చేయగలదు. నీవీ పనిని సాధించినచో, నీ కోరిక తీరగలదు.

మైత్రేయ ఉవాచ ।
మాతుస్సపత్న్యాస్స దురుక్తవిద్ధః
శ్వసన్రుషా దండహతో యథాఽహిః ।
హిత్వా మిషంతం పితరం సన్నవాచం
జగామ మాతుః ప్రరుదన్ సకాశమ్ ।। 14

మాతుః - తల్లియొక్క, సపత్న్యాః - సవతియొక్క, దురుక్తవిద్ధః - చెడు మాటలచే గాయపరచబడిన, సః - ఆ ధ్రువుడు, దండహతః - కర్రచే కొట్టబడిన, అహిః యథా - పాము వలె, రుషా - కోపముతో, శ్వసన్ - నిట్టూర్పులను విడుచుచున్నవాడై, మిషంతమ్ - చూచుచున్నట్టియు, సన్నవాచమ్ - మూతబడిన నోరు గల, పితరమ్ - తండ్రిని, హిత్వా - విడిచిపెట్టి, ప్రరుదన్ - బిగ్గరగా ఏడ్చుచున్నవాడై, మాతుః - తల్లియొక్క, సకాశమ్ - సన్నిధిని గురించి, జగామ - వెళ్లెను.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- ధ్రువుని మనస్సును సవతి తల్లి చెడు మాటలతో ఈ విధముగా గాయపరిచెను. తండ్రి దీనినంతనూ చూస్తూ కూడా నోరు నొక్కుకొని యుండెను. అప్పుడు ధ్రువుడు కర్రతో

కొట్టబడిన పాములె కోపముతో బుసలు కొట్టుచుండెను. అతడు బిగ్గరగా ఏడుస్తూ తండ్రిని విడిచిపెట్టి, తన తల్లి వద్దకు వెళ్లిపోయెను.

తం నిశ్శ్వసంతం స్ఫురితాధరోష్ఠం
సునీతిరుత్సంగ ఉదుహ్యా బాలమ్ ।
నిశమ్య తత్పౌరముఖాన్నితాంతం
సా వివ్యథే యద్గదితం సపత్న్యాః ॥ 15

నిశ్శ్వసంతమ్ - నిట్టూర్పులను విడుచుచున్నట్టియు, స్ఫురిత-అధర-ఓష్ఠమ్ - వణకుచున్న క్రింది పెదవి కలిగినట్టియు, బాలమ్ - పిల్లవాడగు, తమ్ - ఆ ధ్రువుని, సా - ఆ, సునీతిః - సునీతి, ఉత్సంగే - ఒడిలో, ఉదుహ్యా - కూర్చుండబెట్టుకొని, సపత్న్యాః - సవతియొక్క, యత్ - ఏ, గదితమ్ - భాషణము గలదో, తత్ - దానిని, పౌరముఖాత్ - అంతఃపురజనుల నోటివలన, నిశమ్య - విని, నితాంతమ్ - మిక్కిలి, వివ్యథే - వ్యథను చెందెను.

ధ్రువుడు నిట్టూర్పులను విడుచుచుండెను. అతని క్రింది పెదవి వణకుచుండెను. తల్లియగు సునీత ఆ పిల్లవానిని తన ఒడిలో కూర్చుండబెట్టుకొనెను. అంతఃపురజనులు చెప్పగా, తన సవతి పలికిన పలుకుల గురించి విని, ఆమె చాల వ్యథను చెందెను.

సోత్సృజ్య ధైర్యం విలలాప శోక-
దావాగ్నినా దావలతేవ బాలా ।
వాక్యం సపత్న్యాస్స్మరతీ సరోజ-
శ్రియా దృశా బాష్పకలాముహాహ ॥ 16

దావలతా ఇవ - దావాగ్నియందలి తీగ వలెనున్న, సా - ఆ, బాలా - అమాయకురాలగు సునీత, ధైర్యమ్ - నిబ్బరమును, ఉత్సృజ్య - విడనాడి, శోకదావ-అగ్నినా - శోకము అనే దావాగ్నిచే, విలలాప - రోదించెను, సపత్న్యాః - సవతియొక్క, వాక్యమ్ - మాటను, స్మరతీ - స్మరిం

పచున్నదై, సరోజశ్రియా - పద్మపు శోభగల, దృశా - కంటితో, బాష్పక లామ్ - కన్నీటి ధారను, ఉవాహ - కలిగియుండెను.

అమాయకురాలగు ఆ సునీత శోకము అనే దావాగ్నిచే, దావాగ్ని మధ్యలోనున్న తీగవలె వడలిపోయి ఉండెను. ఆమె నిబ్బరమును విడనాడి ఏడ్చెను. సవతి మాటలను తలచుకొనుచున్న ఆమెకు పద్మములవంటి కళ్లనుండి నీరు ధారగా ప్రవహించెను.

దీర్ఘం శ్వసంతీ వృజినస్య పార-
మపశ్యతీ బాలకమాహ బాలా ।
మామంగలం తాత పరేష్వమంస్థా
భుంక్తే జనో యత్పరదుఃఖదస్తత్ ॥ 17

దీర్ఘమ్ - దీర్ఘముగా, శ్వసంతీ - నిట్టూర్చుచున్నదై, బాలా - అమాయకురాలగు సునీత, వృజినస్య - దుఃఖమునకు, పారమ్ - అంతమును, అపశ్యతీ - కానరానిదై, బాలకమ్ - పిల్లవానిని ఉద్దేశించి, ఆహ - పలికెను, తాత - బాబూ!, పరేషు - ఇతరుల విషయములో, అమంగలమ్ - అశుభమును, మా అమంస్థాః - తలపోయకుము, యత్ - ఏలయనగా, పరదుఃఖదః - ఇతరులకు దుఃఖమును కలిగించిన, జనః - మానవుడు, తత్ - ఆ దుఃఖమును, భుంక్తే - అనుభవించుచున్నాడు.

అమాయకురాలగు సునీత దీర్ఘముగా నిట్టూర్చుచుండెను. ఆమెకు తన దుఃఖమునకు అంతము కానరాకుండెను. ఆమె ధ్రువునితో ఇట్లు పలికెను : బాబూ! నీవు ఇతరులకు అశుభము కలుగవలెనని భావించకుము. ఎందుకంటే, ఇతరులకు దుఃఖమును కలిగించు వ్యక్తి అదే దుఃఖమును తాను అనుభవించును.

సత్యం సురుచ్యాభిహితం భవాన్మే
యద్దుర్భగాయా ఉదరే గృహీతః ।
స్తన్యేన వృద్ధశ్చ విలజ్జతే యాం
భార్యేతి వా వోఢుమిడస్పతిర్మామ్ ॥ 18

సురుచ్యా - సురుచిచే, అభిహితమ్ - చెప్పబడిన మాట, సత్యమ్ - యథార్థము, యత్ - ఏలయనగా, భవాన్ - నీవు, దుర్భగాయాః - దురదృష్టవంతురాలగు, మే - నాయొక్క, ఉదరే - గర్భమునందు, గృహీతః - ధరించబడితివి, చ - మరియు, స్తన్యేన - స్తన్యముచే, వృద్ధః - పెంచబడితివి, యామ్ - ఏ, మామ్ - నన్ను, ఇడస్పతిః - మహారాజు, భార్యా ఇతి వా - భార్య అనియైననూ, వోఢుమ్ - అంగీకరించుటకు, విలజ్జతే - మిక్కిలి సిగ్గు పడుచున్నాడో.

సురుచి చెప్పిన మాట నిజమే. ఎందుకంటే, నీవు దురదృష్టవంతురాలగు నా కడుపున పుట్టి, నా స్తన్యముచే పెరిగి పెద్దవు అయినావు. మహారాజు నన్ను తన భార్యయని అంగీకరించుటకైననూ చాల సిగ్గు పడుచుండును.

ఆతిష్ఠ తత్తాత విమత్సరస్త్వ-
ముక్తం సమాత్రాఽపి యదవ్యలీకమ్ ।
ఆరాధయాఽధోక్షజపాదపద్మం
యదీచ్ఛసేఽధ్యాసనముత్తమో యథా ॥ 19

తాత - బాబూ!, త్వమ్ - నీవు, విమత్సరః - ద్వేషము లేనివాడవై, తత్ - దానిని, ఆతిష్ఠ - అనుష్ఠించుము, యత్ - ఏది, సమాత్రా - సవతి తల్లిచే, ఉక్తం అపి - చెప్పబడినదే అయిననూ, అవ్యలీకమ్ - సత్యమో, ఉత్తమః యథా - ఉత్తమునివలె, అధి-ఆసనమ్ - గొప్ప స్థానమును, ఇచ్ఛసే యది - కోరుచున్నవాడవైనచో, అధోక్షజపాదపద్మమ్ - ఇంద్రియములకు గోచరుడు కాని శ్రీహరియొక్క పద్మములవంటి పాదమును, ఆరాధయ - ఆరాధించుము.

బాబూ! సురుచి సవతి తల్లియే అయినా, సత్యమును చెప్పినది. నీవు ద్వేషమును విడనాడి అటులనే చేయుము. ఉత్తముని వలె నీవు కూడ గొప్ప స్థానమును పొందాలని కోరుకునే పక్షములో, ఇంద్రియములకు గోచరము కాని శ్రీహరియొక్క పద్మమువంటి పాదములను ఆరాధించుము.

యస్యాంఘ్రిపద్మం పరిచర్య విశ్వ-
విభావనాయాత్తగుణాభిపత్తేః ।
అజోఽధ్యతిష్ఠత్ఖలు పారమేష్ఠ్యం
పదం జితాత్మశ్వసనాభివంద్యమ్ ॥ 20

విశ్వవిభావనాయ - జగత్తును రక్షించుటకొరకై, ఆత్తగుణాభిపత్తేః - స్వీకరించబడిన సత్త్వగుణ-ఉపాధిగల, యస్య - ఏ శ్రీహరియొక్క, జిత-ఆత్మశ్వసన-అభివంద్యమ్ - జయించబడిన మనస్సు మరియు ప్రాణసంచారము గల యోగులచే నమస్కరించబడే, పాదపద్మమ్ - పద్మ మువంటి పాదమును, పరిచర్య - సేవించి, అజః - స్వయంభువుడగు బ్రహ్మగారు, పారమేష్ఠ్యమ్ - సర్వోత్కృష్టమగు, పదమ్ - స్థానమును, అధి-అతిష్ఠత్ - అధిష్ఠించినాడో.

పరబ్రహ్మ సత్త్వగుణమును ఉపాధిగా స్వీకరించి, విష్ణువు అనే నామమును పొంది, జగత్తును రక్షించుచున్నాడు. యోగీశ్వరులు ప్రాణా యామాదులచే మనస్సును జయించి, అట్టి శ్రీహరిని పూజించుచున్నారు. స్వయంభువుడగు బ్రహ్మగారు ఆయన పాదపద్మములను సేవించి, ఈ సృష్టిలోకెల్లా ఉత్తమమగు సృష్టికర్త స్థానమును పొందియున్నాడు.

తథా మనుర్వో భగవాన్ పితామహో
యమేకమత్యా పురుదక్షిణైర్మఖైః ।
ఇష్ట్వాఽభిపేదే దురవాపమన్యతో
భౌమం సుఖం దివ్యమథాపవర్గ్యమ్ ॥ 21

తథా - అదే విధముగా, వః - మీ, పితామహః - తాతగారు, భగ వాన్ - పూజ్యుడు అగు, మనుః - స్వాయంభువ మనువు, యమ్ - ఏ శ్రీహరిని, ఏకమత్యా - ఏకాగ్రమగు చిత్తముతో, పురుదక్షిణైః - గొప్ప దక్షిణలు గల, మఖైః - యజ్ఞములతో, ఇష్ట్వా - ఆరాధించి, అన్యతః - మారి యొక ఉపాయము వలన, దురవాపమ్ - పొంద శక్యము కాని, భౌమమ్ - భూలోకమునకు చెందిన, సుఖమ్ - సుఖమును, దివ్యమ్ - స్వర్గసుఖము

ను, అథ - మరియు, అపవర్గ్యమ్ - మోక్షసుఖమును, అభిపేదే - పొంద
నో.

అంతేగాక, మీకు తాతగారైన పూజ్యుడగు స్వాయంభువ మనువు
ఏకాగ్రచిత్తముతో గొప్ప దక్షిణలు గల యజ్ఞములతో ఆ శ్రీహరిని ఆరాధిం
చి, భూలోకసుఖము (మన్వంతరాధిపత్యము మొదలైనవి) లను, స్వర్గసుఖ
ములను మాత్రమే గాక, మోక్షసుఖమును కూడ పొందెను. ఇట్టి మహాఫల
మును ఈశ్వరారాధన కంటె భిన్నమగు ఉపాయముల వలన పొందుట
సంభవము కాదు.

తమేవ వత్సాఽఽశ్రయ భృత్యవత్సలం
ముముక్షుభిర్మృగ్యపదాబ్జపద్ధతిమ్ ।
అనన్యభావే నిజధర్మభావితే
మనస్యవస్థాప్య భజస్వ పూరుషమ్ ॥ 22

వత్స - ఓ బాబూ!, భృత్యవత్సలమ్ - భక్తులయందు వాత్స
ల్యము కలిగినట్టియు, ముముక్షుభిః - మోక్షమును కోరువారిచే, మృగ్యపద
-అబ్జపద్ధతిమ్ - వెదుకబడే పద్మములవంటి పాదముల మార్గము గలిగిన
ట్టియు, పూరుషమ్ - పూర్ణుడగు, తం ఏవ - ఆ శ్రీహరిని మాత్రమే,
ఆశ్రయ - ఆశ్రయించుము, అనన్యభావే - మరియొకదానియందు రాగము
(ఇంకో తలంపు) లేనట్టియు, నిజధర్మభావితే - స్వధర్మముచే శోధితమైన,
మనసి - మనస్సునందు, పూరుషమ్ - పూర్ణుడగు భగవానుని, అవస్థాప్య
- నిలిపి, భజస్వ - సేవించుము.

బాబూ! శ్రీహరి భక్తులయందు వాత్సల్యము గలవాడు. మోక్ష
మును కోరు భక్తులు భక్తిని చేయుటకు పద్మములవంటి ఆయన పాద
ములను వెదుకుచుందురు. నీ మనస్సులో ఇతరములగు ఆలోచనలను
గాని, సంసారమునందలి రాగమును గాని పెట్టుకొనకుము. స్వధర్మమును
అనుష్ఠించి, మనస్సును శుద్ధము చేసుకొనుము. అట్టి మనస్సులో ఆ
పూర్ణుడగు భగవానుని దృఢముగా నిలిపి సేవించుము.

నాన్యం తతః పద్మపలాశలోచనాత్
దుఃఖచ్ఛిదం తే మృగయామి కంచన ।
యో మృగ్యతే హస్తగృహీతపద్మయా
శ్రియేతరైరంగ విమృగ్యమాణయా ॥ 23

అంగ - ఓయీ!, పద్మపలాశలోచనాత్ - పద్మపు రేకులవంటి కన్నులు గల, తతః - ఆ శ్రీహరికంటె, అన్యమ్ - మరియొకనిని, తే - నీ, దుఃఖ-ఛిదమ్ - దుఃఖమును పోగొట్టువానిని, కంచన - ఎవనినైననూ, న మృగయామి - ఆలోచించిననూ కానరాను, యః - ఏ శ్రీహరి, హస్తగృహీతపద్మయా - చేతియందు పట్టుకొనబడిన పద్మము కలిగినట్టియు, ఇతరైః - ఇతరులచే, విమృగ్యమాణయా - విశేషముగా అన్వేషించబడే, శ్రియా - లక్ష్మీదేవిచే, మృగ్యతే - వెదుకబడుచున్నాడో.

ఓ ధ్రువా! నేను ఎంత ఆలోచించి చూచినా, నీ దుఃఖమును పోగొట్టగలవాడు ఆ శ్రీహరికంటె మరియొకడు నాకు కానరాడు. అందరు లక్ష్మి (సంపద) వెంట బడుచుండగా, ఆమె మాత్రము చేతిలో పద్మమును పట్టుకొని, పద్మపత్రములవంటి కన్నులు గల ఆ శ్రీహరి వెంట పడుచుండును.

మైత్రేయ ఉవాచ ।
ఏవం సంజల్పితం మాతురాకర్ణ్యార్థాగమం వచః ।
సన్నియమ్యాత్మనాత్మానం నిశ్చక్రామ పితుః పురాత్ ॥ 24

అర్థ-ఆగమమ్ - అర్థసిద్ధిని కలిగించే, ఏవమ్ - ఈ విధమైన, మాతుః - తల్లియొక్క, సంజల్పితమ్ - ఏడుస్తూ చెప్పబడిన, వచః - మాటను, ఆకర్ణ్య - విని, ఆత్మనా - బుద్ధిచే (ధైర్యముచే), ఆత్మానమ్ - మనస్సును, సం-నియమ్య - చక్కగా నియంత్రించి, పితుః - తండ్రియొక్క, పురాత్ - నగరమునుండి, నిశ్చక్రామ - నిష్క్రమించెను.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- తల్లి ఈ విధముగా ఏడుస్తూ కార్యసిద్ధిని కలిగించే మాటను చెప్పినది. ధ్రువుడు ఆ మాటను విని, బుద్ధి

శక్తి (ధైర్యము) తో మనస్సును నియంత్రించి, తండ్రిగారి రాజధానీ నగరమును విడిచిపెట్టి వెళ్లిపోయెను.

నారదస్తదుపాకర్ణ్య జ్ఞాత్వా తస్య చికీర్షితమ్ ।
స్పృష్ట్వా మూర్ధన్యఘఘ్నేన పాణినా ప్రాహ విస్మితః ॥ 25

నారదః - నారదుడు, తత్ - ఆ సునీతి ఉపదేశమును (లేక, నగరమును విడిచి వెళ్లుటను) గురించి, ఉప-ఆకర్ణ్య - విని, తస్య - ఆ ధ్రువుని, చికీర్షితమ్ - చేయగోరిన దానిని గురించి, జ్ఞాత్వా - తెలుసుకొని, విస్మితః - ఆశ్చర్యమును పొందినవాడై, అఘఘ్నేన - పాపములను పోగొట్టే, పాణినా - చేతితో, మూర్ధని - శిరస్సునందు, స్పృష్ట్వా - స్పృశించి, ప్రాహ - పలికెను.

సునీతి ఉపదేశమును, ధ్రువుడు నగరమును విడిచిపెట్టుటను గురించి త్రికాలజ్ఞుడగు నారదుడు వినెను. ఆ ధ్రువుడు ఏమి చేద్దామనుకుంటున్నాడో ఆయనకు తెలిసిపోయెను. ఆయన అతని భావమునెరింగి, ఆశ్చర్యచకితుడయ్యెను. ఆయన పాపములను పోనాడే తన చేతితో వాని తలను స్పృశించి, ఇట్లు పలికెను.

అహో తేజః క్షత్రియాణాం మానభంగమమృష్యతామ్ ।
బాలోఽప్యయం హృదా ధత్తే యత్సమాతురసద్వచః ॥ 26

మానభంగమ్ - మర్యాదకు భంగమును, అమృష్యతామ్ - సహించని, క్షత్రియాణామ్ - క్షత్రియుల, తేజః - ప్రభావము, అహో - ఆశ్చర్యమును కలిగించును, యత్ - ఏలయనగా, అయమ్ - ఈతడు, బాలః అపి - పిల్లవాడే అయినా, సమాతుః - సవతి తల్లియొక్క, అసత్ - దుష్టమగు, వచః - మాటను, హృదా - హృదయముతో, ధత్తే - ధరించుచున్నాడు.

క్షత్రియులు తమ మర్యాదకు భంగము కలిగినచో, దానిని సహించరు. వారి ప్రభావము ఆశ్చర్యమును కలిగించును. ఏలయన, ఈతడు పిల్లవాడే అయినా, సవతి తల్లి పలికిన చెడు మాటలను మనస్సులో పెట్టుకొని యున్నాడు.

నారద ఉవాచ ।
నాధునాప్యవమానం తే సమ్మానం వాపి పుత్రక ।
లక్షయామః కుమారస్య సక్తస్య క్రీడనాదిషు ॥ 27

పుత్రక - అబ్బాయీ!, క్రీడన-ఆదిషు - ఆటలు మొదలగువాటి యందు, సక్తస్య - లగ్నమైయుండే, కుమారస్య - పిల్లవాడవగు, తే - నీకు, అధునా అపి - ఇప్పుడే, అవమానమ్ - అవమానమును గాని, సమ్మానం వా అపి - సన్మానమును గాని, న లక్షయామః - కనజాలము.

నారద మహర్షి ఇట్లు పలికెను --- బాబూ! నీవు నాకు కొడుకు వంటి వాడవు. ఇంకనూ నీది ఆటపాటలలో మునిగి తేలే వయస్సు మాత్ర మే. నీకు ఇప్పుడే మానావమానముల ప్రసక్తిని నేను ఊహించలేకున్నాను.

వికల్పే విద్యమానేఽపి న హ్యసంతోషహేతవః ।
పుంసో మోహమృతే భిన్నా యల్లోకే నిజకర్మభిః ॥ 28

వికల్పే - మానావమానములను పట్టించుకొనుట, విద్యమానే అపి - ఉన్నప్పటికీ, పుంసః - మానవునకు, అసంతోషహేతవః - దుఃఖమునకు హేతువులు (కారకులు), మోహం ఋతే - అజ్ఞానమును మినహాయించి, భిన్నాః - భిన్నమైనవి (వారు), న హి - నిశ్చయముగా లేవు (రు), యత్ - ఎందువలననగా, లోకే - లోకమునందు, నిజకర్మభిః - తమ కర్మలచే.

ఒకచో మానావమానములను పట్టించుకొనే స్థితి నీకు ఉండవచ్చు గాక! కాని, మానవునకు దుఃఖమును కలిగించే పరిస్థితులు గాని, వ్యక్తులు గాని బాహ్యమునందు లేరు. మానవుని అజ్ఞానమే వాని దుఃఖమునకు హేతువు. మానవులు తమ ప్రారబ్ధకర్మకు అధీనులై మానావమానములను పొందెదరు.

పరితుష్యేత్తతస్తాత తావన్మాత్రేణ పూరుషః ।
దైవోపసాదితం యావద్వీక్ష్యేశ్వరగతిం బుధః ॥ 29

తాత - బాబూ!, తతః - అందువలన, బుధః - వివేకము గల, పూరుషః - మానవుడు, ఈశ్వరగతిమ్ - దైవగతిని, వీక్ష్య - తెలుసుకొని,

యావత్ - ఎంతైతే, దైవ-ఉపసాదితమ్ - దైవముచే సమకూర్చబడినదో తావన్మాత్రేణ - అంతమాత్రముచేతనే, పరితుష్యేత్ - సంతోషించవలెను.

బాబూ! ఈశ్వరలీలలు విచిత్రమైనవి. మానవుడు తన కర్మకు అనురూపముగా ఫలమును ఈశ్వరునినుండి పొందును. కావున, వివేకము గల మానవుడు ఈ సత్యమును గుర్తించి, తనకు దైవము ఎంతవరకు సమకూర్చునో, అంతటితో సంతోషమును పొందవలెను.

అథ మాత్రోపదిష్టేన యోగేనావరురుత్ససి ।
యత్ప్రసాదం స వై పుంసాం దురారాధ్యో మతో మమ ॥30

అథ - అట్లు కాకుండా, మాత్రా - తల్లిచే, ఉపదిష్టేన - ఉపదేశించబడిన, యోగేన - ఈశ్వరారాధన అనే ఉపాయముచే, యత్- ప్రసాదమ్ - ఏ శ్రీహరి అనుగ్రహమును, అవరురుత్ససి - పొందగోరుచున్నావో, సః - ఆ శ్రీహరి, వై - నిశ్చయముగా, పుంసామ్ - మానవులకు, దుర్-ఆరాధ్యః - ఆరాధింప శక్యము కానివాడని, మమ - నా, మతః - అభిప్రాయము.

అట్లుగాక, నీవు తల్లి ఉపదేశించిన విధముగా శ్రీహరిని ఆరాధించి ఆయన అనుగ్రహమును పొందగోరుచున్నావా యేమి! ఆయనను ఆరాధించుట సామాన్యమానవులకు చాల కఠినమని నా అభిప్రాయము.

మునయః పదవీం యస్య నిస్సంగేనోరుజన్మభిః ।
న విదుర్మృగయంతోఽపి తీవ్రయోగసమాధినా ॥ 31

మునయః - మహర్షులు, నిస్సంగేన - సర్వసంగపరిత్యాగముచే, తీవ్రయోగసమాధినా - కఠినమగు ప్రాణాయామము మొదలగువాటితో గూడిన సమాధిచే, ఉరుజన్మభిః - బహుజన్మలచే, యస్య - ఏ శ్రీహరి యొక్క, పదవీమ్ - మార్గమును, మృగయంతః అపి - వెదుకువారే అయిననూ, న విదుః - తెలియకున్నారు.

మహర్షులు అనేకజన్మలలో సర్వసంగపరిత్యాగమును చేసి, ప్రాణాయామము మొదలగు కఠినమగు సాధనలను చేసి, ఏకాగ్రచిత్తులై ఆ

శ్రీహరియొక్క మార్గమును వెదుకుచున్నారు. అయినను, వారు సఫలులు కాలేకపోవుచున్నారు.

**అతో నివర్తతామేష నిర్బంధస్తవ నిష్ఫలః ।**
**యతిష్యతి భవాన్ కాలే శ్రేయసాం సముపస్థితే ॥ 32**

**అతః** - ఇందువలన, నిష్ఫలః - వ్యర్థమగు, ఏషః - ఈ, తవ - నీ, నిర్బంధః - మంకుపట్టు, నివర్తతామ్ - తొలగిపోవుగాక!, భవాన్ - నీవు, శ్రేయసామ్ - కల్యాణములకు, కాలే - సమయము, సముపస్థితే - సంప్రాప్తమైనప్పుడు, యతిష్యతి - ప్రయత్నమును చేయుము.

కావున, నీవీ వ్యర్థమగు మంకుపట్టును విడనాడుము. నీవు పెద్ద అయిన తరువాత, మంగళకరమగు కాలము సంప్రాప్తమైనప్పుడు శ్రీహరిని ఆరాధించే ప్రయత్నమును చేయగలవు.

**యస్య యద్దైవవిహితం స తేన సుఖదుఃఖయోః ।**
**ఆత్మానం తోషయన్ దేహీ తమసః పారమృచ్ఛతి ॥ 33**

సుఖదుఃఖయోః - సుఖదుఃఖములలో, యస్య - ఎవనికి, యత్ - ఏది, దైవవిహితమ్ - దైవముచే విధించబడినదో, సః - ఆ, దేహీ - మానవుడు, తేన - దానిచే, ఆత్మానమ్ - తనను, తోషయన్ - సంతోషపెట్టుకొనువాడై, తమసః - అజ్ఞానముయొక్క, పారమ్ - ఆవలి తీరమును, ఋచ్ఛతి - పొందును.

దైవవిధానమునననుసరించి మానవులలో కొందరికి సుఖము, మరి కొందరికి దుఃఖము, ఒకప్పుడు సుఖము, మరియొకప్పుడు దుఃఖము కలుగుచుండును. మానవుడు తన ప్రారబ్ధఫలమును మాత్రమే తాను అనుభవిస్తున్నానని తెలుసుకొని, సంతోషముగా జీవించుచున్నచో, ఆతడు అజ్ఞానమును తొలగించుకొని, సంసారమును దాటివేయును.

**గుణాధికాన్ముదం లిప్సేదనుక్రోశం గుణాధమాత్ ।**
**మైత్రీం సమానాదన్విచ్ఛేన్న తాపైరభిభూయతే ॥ 34**

గుణ-అధికాత్ - గుణములలో అధికుని వలన, ముదమ్ - ఆనం దమును, గుణ-అధమాత్ - గుణములలో తక్కువవాని వలన, అనుక్రోశమ్ - దయను, లిప్సేత్ - పొందగోరవలెను, సమానాత్ - సమానమైనవాని వలన, మైత్రీమ్ - స్నేహమును, అను-ఇచ్ఛేత్ - చేయవలెను, తాపైః తాపములచే, న అభిభూయతే - పరాభూతుడు కాడు.

మానవుడు తనకంటె గొప్ప గుణశాలిని చూచి ఆనందించవలెను. తనకంటె తక్కువ గుణములు గలవానియందు దయను చూపవలెను. తనతో సమానమైనవానితో స్నేహమును నెరపవలెను. ఇట్లు చేయు వ్యక్తి సాంసారికములగు తాపములచే పరాభూతుడు కాబోడు.

ధ్రువ ఉవాచ ।
సోఽయం శమో భగవతా సుఖదుఃఖహతాత్మనామ్ ।
దర్శితః కృపయా పుంసాం దుర్దర్శోఽస్మద్విధైస్తు యః ।।35

సః - అట్టి, అయమ్ - ఈ, శమః - శాంతచిత్తత్వము, భగవతా - పూజ్యులగు మీచే, సుఖదుఃఖహత-ఆత్మనామ్ - సుఖదుఃఖములచే పరాజితమైన బుద్ధి గల, పుంసామ్ - మానవులకు, కృపయా - దయతో, దర్శితః - చూపబడినది, యః - ఏదైతే, అస్మత్-విధైః తు - నావంటి వారిచేనైతే, దుర్దర్శః - దర్శించ శక్యము కానిదో.

ధ్రువుడు ఇట్లు పలికెను --- మానవులు జీవితములో సుఖదుఃఖములచే పరాజితులై వివేకమును కోల్పోయి ఉందురు. అట్టి జనులను ఉద్దేశించి ఈ శాంతచిత్తత్వము అనే ఉపాయమును పూజ్యులగు మీరు దయతో ఉపదేశించినారు. కాని, నావంటి వారలకు దాని గురించి తలపోయుటయైననూ సంభవము కాదు.

అథాపి మేఽవినీతస్య క్షాత్త్రం ఘోరముపేయుషః ।
సురుచ్యా దుర్వచోబాణైర్న భిన్నే శ్రయతే హృది ।। 36

అథాపి - అయినప్పటికీ, ఘోరమ్ - ఉగ్రమైన, క్షాత్రమ్ - క్షత్రియలక్షణమును, ఉపేయుషః - పొందియున్న, అవినీతస్య - వినయమునె

రుంగని, సురుచ్యా - సురుచిచే, దుర్వచః-బాణైః - చెడు మాటలు అనే బాణములచే, భిన్నే - గాయపరచబడిన, మే - నా, హృది - హృదయము నందు, న శ్రయతే - నిలబడుట లేదు.

అయినప్పటికీ, నేను ఉగ్రమగు క్షత్రియలక్షణమును కలిగి, వినయము లేక ఉన్నాను. నా హృదయము సురుచియొక్క చెడు మాటలచే గాయపడినది. అట్టి నా హృదయములో ఈ శమము (శాంతచిత్తత్వము) అనే లక్షణము (లేక, ఈ మీ ఉపదేశము) నిలబడుట లేదు.

పదం త్రిభువనోత్కృష్టం జిగీషోస్సాధు వర్త్మ మే ।
బ్రూహ్యస్మత్పితృభిర్బ్రహ్మన్నన్యైరప్యనధిష్ఠితమ్ ॥ 37

బ్రహ్మన్ - ఓ మహాత్మా!, త్రిభువన-ఉత్కృష్టమ్ - ముల్లోకములలో శ్రేష్ఠమైనది, అస్మత్-పితృభిః - మా పూర్వీకులచే, అన్యైః అపి - ఇతరులచే కూడ, అనధిష్ఠితమ్ - అధిష్ఠించబడనిది అగు, పదమ్ - స్థానమును, జిగీషోః - జయించగోరుచున్న, మే - నాకు, సాధు - చక్కని, వర్త్మ - మార్గమును, బ్రూహి - చెప్పుము.

ఓ మహాత్మా! నేను ముల్లోకములలో శ్రేష్ఠమైన పదమును పొందగోరుచున్నాను. అట్టి పదమును ఇదివరలో నా పూర్వజులు గాని, ఇతరులు గాని పొందియుండరాదు. దానిని పొందే చక్కని ఉపాయమును నాకు చెప్పుము.

నూనం భవాన్ భగవతో యోఽంగజః పరమేష్ఠినః ।
వితుదన్నటతే వీణాం హితార్థం జగతోఽర్కవత్ ॥ 38

భవాన్ - నీవు, వీణామ్ - వీణను, వితుదన్ - వాయించుచున్నవాడవై, జగతః - లోకముయొక్క, హిత-అర్థమ్ - హితము కొరకై, అర్కవత్ - సూర్యుని వలె, అటతే - సంచరించుచున్నావు, నూనమ్ - నిశ్చయము, యః - ఏ నీవు, భగవతః - పూజ్యుడగు, పరమేష్ఠినః - బ్రహ్మగారి, అంగజః - దేహమునుండి పుట్టితివో.

నీవు పూజ్యుడగు బ్రహ్మగారి దేహమునుండి పుట్టితివి. నీవు లోకములకు హితమును చేయగోరి, వీణను వాయిస్తూ, సూర్యుని వలె సంచరించెదవు. ఇది నిశ్చయము.

మైత్రేయ ఉవాచ ।
ఇత్యుదాహృతమాకర్ణ్య భగవాన్నారదస్తదా ।
ప్రీతః ప్రత్యాహ తం బాలం సద్వాక్యమనుకంపయా ।। 39

ఇతి - ఈ విధముగా, ఉదాహృతమ్ - చెప్పబడిన మాటను, ఆకర్ణ్య - విని, భగవాన్ - పూజ్యుడగు, నారదః - నారదుడు, తదా - అప్పుడు, ప్రీతః - సంతసించినవాడై, అనుకంపయా - దయతో, తమ్ - ఆ, బాలమ్ - బాలుడగు ధ్రువుని ఉద్దేశించి, సత్-వాక్యమ్ - మంచి ఉపదేశమును, ప్రతి-ఆహ - బదులు చెప్పెను.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- ధ్రువుడు చెప్పిన మాటలను విని పూజ్యుడగు నారదుడు చాల సంతోషించెను. అపుడాయన దయతో ఆ బాలకుడగు ధ్రువునకు చక్కని ఉపదేశమును చెప్పెను.

నారద ఉవాచ ।
జనన్యాఽభిహితః పంథాస్స వై నిశ్శ్రేయసస్య తే ।
భగవాన్ వాసుదేవస్తం భజ తత్ప్రవణాత్మనా ।। 40

తే - నీ, జనన్యా - తల్లిచే, అభిహితః - బోధించబడిన, సః - ఆ ఉపదేశము, తే - నీకు, వై - నిశ్చయముగా, నిఃశ్రేయసస్య - అభీష్టసిద్ధికి, పంథాః - మార్గము, భగవాన్ - భగవానుడగు, వాసుదేవః - వాసుదేవుడే (మార్గము), తమ్ - ఆయనను, తత్-ప్రవణ-ఆత్మనా - ఆయనయందు ఏకాగ్రమగు చిత్తముతో, భజ - సేవించుము.

నారదుడిట్లు పలికెను --- నీకు నీ తల్లి ఉపదేశించిన ఉపాయమే గొప్ప కల్యాణమును చేకూర్చగలదు. సర్వప్రాణులలో చైతన్యరూపముగా విరాజిల్లే శ్రీహరియే ఆ ఉపాయము. నీవాయనను ఏకాగ్రమగు చిత్తముతో ఆరాధించుము.

ధర్మార్థకామమోక్షాఖ్యం య ఇచ్ఛేచ్ఛ్రేయ ఆత్మనః ।
ఏకమేవ హరేస్తత్ర కారణం పాదసేవనమ్ ॥ 41

యః - ఎవరైతే, ఆత్మనః - తనకు, ధర్మ-అర్థకామమోక్ష-ఆఖ్యమ్ - ధర్మార్థకామమోక్షములనబడే, శ్రేయః - కల్యాణమును, ఇచ్ఛేత్ - కోరునో, తత్ర - దాని విషయములో, హరేః - శ్రీహరియొక్క, పాదసేవనమ్ - పాదములను సేవించుట, ఏకం ఏవ - ఒక్కటియే, కారణమ్ - కారణము.

ఎవరైతే తనకు ధర్మార్థకామమోక్షములనే పురుషార్థముల రూపములోనుండే మంగళము కలుగవలెనని కోరునో, అట్టివాడు శ్రీహరి పాదములను సేవించవలెను. పురుషార్థసిద్ధికి అది ఒక్కటియే ఉపాయము.

తత్తాత గచ్ఛ భద్రం తే యమునాయాస్తటం శుచి ।
పుణ్యం మధువనం యత్ర సాన్నిధ్యం నిత్యదా హరేః ॥ 42

తాత - వత్సా!, తత్ - కావున, శుచి - శుభ్రమైనది, పుణ్యమ్ - పావనము, మధువనమ్ - మధువనమను పేరు గలది (శ్రీహరి ఆరాధింపబడే క్షేత్రము) అగు, యమునాయాః - యమునానదియొక్క, తటమ్ - తీరమును గురించి, గచ్ఛ - వెళ్లుము, తే - నీ కొరకు, భద్రమ్ - మంగళమగు గాక!, యత్ర - ఎక్కడనైతే, నిత్యదా - సర్వకాలములలో, హరేః - శ్రీహరియొక్క, సాన్నిధ్యమ్ - సాన్నిధ్యము గలదో.

వత్సా! కావున, నీవు యమునానదీతీరమునందు గల మధువనమునకు వెళ్లుము. శుచిగా ఉండే ఆ మధువనము చాల పవిత్రమైనది. అక్కడ సర్వకాలములలో శ్రీహరి సన్నిధి గలదు. నీకు మంగళమగు గాక!

స్నాత్వానుసవనం తస్మిన్ కాలింద్యాస్సలిలే శివే ।
కృత్వోచితాని నివసన్నాత్మనః కల్పితాసనః ॥ 43

ప్రాణాయామేన త్రివృతా ప్రాణేంద్రియమనోమలమ్ ।
శనైర్వ్యుదస్యాభిధ్యాయేన్మనసా గురుణా గురుమ్ ॥ 44

తస్మిన్ - ఆ మధువనమునందు, నివసన్ - నివసించువాడవై, కాలింద్యాః - యమునానదియొక్క, శివే - స్వచ్ఛమగు (పావనకరమగు), సలిలే - నీటియందు, అనుసవనమ్ - మూడు పూటలయందు, స్నాత్వా - స్నానమును చేసి, ఆత్మనః - తనకు, ఉచితాని - ఉచితములగు యమని యమములను, కృత్వా - పాటించి, కల్పిత-ఆసనః - వేయబడిన ఆస నము గలవాడవై, త్రివృతా - మూడు విధముల (ఓంకారముతో), ప్రాణా యామేన - ప్రాణాయామముచే, ప్రాణ-ఇంద్రియమనః-మలమ్ - ప్రాణవృ త్తులు ఇంద్రియములు మరియు మనస్సులలో ఉండే దోషమును, శనైః - మెల్లగా, వ్యుదస్య - పోనాడి, గురుణా - ధైర్యముతో గూడిన, మనసా - మనస్సుతో, గురుమ్ - తండ్రియగు శ్రీహరిని, అభిధ్యాయేత్ - చక్కగా ధ్యానించవలెను.

నీవా మధువనములో నివసించుము. ప్రతిదినము మూడు పూటలా యమునానదియొక్క స్వచ్ఛమగు పావనజలములలో స్నాన మును చేయుము. నీ శక్తికి తగ్గ విధముగా యమనియమములను పాటిం చుము. కూర్చుండే స్థానమును, చాపను ఏర్పాటు చేసుకొని, యోగాసన మునందు కూర్చుండుము. పూరక రేచక కుంభకములనే మూడు విధముల ప్రాణాయామమును ఓంకారముతో కలిపి చేయుము. అట్లు చేయుట వలన కొంత కాలమునకు ప్రాణాపానాది వృత్తులు సంతులనమగుటయే గాక, మనస్సులోని చాంచల్యదోషము పోయి, ఇంద్రియముల విచ్చలవిడి తనము తొలగిపోవును (ప్రత్యాహారము). మనస్సులో ధైర్యము (స్థైర్యము) ను చిక్కబట్టి, సకలజగన్నాథుడగు శ్రీహరిని ధ్యానించుము.

ప్రసాదాఽభిముఖం శశ్వత్ప్రసన్నవదనేక్షణమ్ ।
సునాసం సుభ్రువం చారుకపోలం సురసుందరమ్ ॥ 45

తరుణం రమణీయాంగమరుణోష్ఠేక్షణాధరమ్ ।
ప్రణతాశ్రయణం నృమ్ణం శరణ్యం కరుణార్ణవమ్ ॥ 46

శ్రీవత్సాంకం ఘనశ్యామం పురుషం వనమాలినమ్ ।
శంఖచక్రగదాపద్మైరభివ్యక్తచతుర్భుజమ్ ॥ 47

కిరీటినం కుండలినం కేయూరవలయాన్వితమ్ ।
కౌస్తుభాభరణగ్రీవం పీతకౌశేయవాససమ్ ॥ 48

కాంచీకలాపపర్యస్తం లసత్కాంచననూపురమ్ ।
దర్శనీయతమం శాంతం మనోనయనవర్ధనమ్ ॥ 49

పద్భ్యాం నఖమణిశ్రేణ్యా విలసద్భ్యాం సమర్చతామ్ ।
హృత్పద్మకర్ణికాధిష్ణ్యమాక్రమ్యాత్మన్యవస్థితమ్ ॥ 50

స్మయమానమభిధ్యాయేత్సానురాగావలోకనమ్ ।
నియతేనైకభూతేన మనసా వరదర్షభమ్ ॥ 51

ప్రసాద-అభిముఖమ్ - అనుగ్రహించుటకు సంసిద్ధముగానున్నట్టియు, శశ్వత్ - అన్ని కాలములయందు, ప్రసన్నవదన-ఈక్షణమ్ - ప్రసన్నమైన ముఖము కన్నులు కలిగినట్టియు, సునాసమ్ - చక్కని ముక్కు కలిగినట్టియు, సుభ్రువమ్ - చక్కని కనుబొమలు కలిగినట్టియు, చారుకపోలమ్ - అందమగు చెక్కిళ్లు కలిగినట్టియు, సురసుందరమ్ - దేవతలలో (కంటె) అందగాడైనట్టియు, తరుణమ్ - యువకుడైనట్టియు, రమణీయ-అంగమ్ - మనోహరమగు అవయవములు కలిగినట్టియు, అరుణ-ఓష్ఠ-ఈక్షణ-అధరమ్ - ఎఱ్ఱని పై పెదవి కన్నులు మరియు క్రింది పెదవి కలిగినట్టియు, ప్రణత-ఆశ్రయణమ్ - శరణు జొచ్చినవారికి ఆశ్రయమైనట్టియు, నృమ్ణమ్ - సుఖమునిచ్చునట్టియు, శరణ్యమ్ - శరణు పొందదగినట్టియు, కరుణా-అర్ణవమ్ - దయకు సముద్రమువంటివాడైనట్టియు, శ్రీవత్స-అంకమ్ - శ్రీవత్సము చిహ్నముగా కలిగినట్టియు, ఘనశ్యామమ్ - మేఘములవలె నల్లనైనట్టియు, పురుషమ్ - పరమపురుషుడైనట్టియు, వనమాలినమ్ - అడవి పూల మాలను దాల్చినట్టియు, శంఖచక్రగదాపద్మైః - శంఖము చక్రము గద పద్మము అనువాటిచే, అభివ్యక్తచతుర్భుజమ్ - ప్రకాశించే నాలుగు భుజములు కలిగినట్టియు, కిరీటినమ్ - కిరీటము కలిగినట్టియు, కుండలినమ్ - కుండలములు కలిగినట్టియు, కేయూరవలయ-అన్వితమ్ - గుండ్రని అంగదములతో కూడియున్నట్టియు, కౌస్తుభ-ఆభరణగ్రీవమ్ - కౌస్తుభమాణిక్యము అనే ఆభరణము గల మెడ కలిగినట్టియు, పీతకౌశేయ

వాససమ్ - పచ్చని పట్టు వస్త్రము కలిగినట్టియు, కాంచీకలాపపర్యస్తమ్ - చిరుగంటల మొలత్రాడు కట్టుకున్నట్టియు, లసత్-కాంచననూపురమ్ - ప్రకాశించే బంగరు అందెలు కలిగినట్టియు, దర్శనీయతమమ్ - మిక్కిలి సుందరుడైనట్టియు, శాంతమ్ - శాంతుడైనట్టియు, మనః-నయనవర్ధనమ్ - మనస్సునకు కళ్లకు ఉల్లాసమును కలిగించునట్టియు, నఖమణిశ్రేణ్యా - గోళ్లు అనే మణుల వరుసచే, విలసద్భ్యామ్ - ప్రకాశించుచున్న పద్భ్యామ్ - పాదములతో, సమర్చతామ్ - చక్కగా పూజించువారల, హృత్-పద్మకర్ణికాధిష్ణ్యమ్ - హృదయము అనే పద్మముయొక్క దుద్దు అనే స్థానమును, ఆక్రమ్య - ఆక్రమించి, ఆత్మని - అంతఃకరణమునందు, అవస్థితమ్ - ఉన్నట్టియు, స్మయమానమ్ - చిరునవ్వు నవ్వుచున్నట్టియు, స-అనురాగ-అవలోకనమ్ - అనురాగముతో కూడిన చూపు కలిగినట్టియు, వరద-ఋషభమ్ - వరములనిచ్చువారిలో శ్రేష్ఠుడైన శ్రీహరిని, నియతేన - వశీకృతమైన, ఏకభూతేన - ఏకాగ్రమైన, మనసా - మనస్సుతో, అభిధ్యాయేత్ - చక్కగా ధ్యానించవలెను.

భక్తులననుగ్రహించుటకు సంసిద్ధుడుగానుండే శ్రీహరి ముఖము, కన్నులు సర్వకాలములలో ప్రసన్నముగా నుండును. చక్కని ముక్కు, కనుబొమలు, అందమగు చెక్కిళ్లు గల ఆ శ్రీహరి దేవతలను మించిన సుందరుడు. యువకుడగు శ్రీహరియొక్క అవయవములు మనోహరముగను, పెదవులు కన్నులు ఎర్రగను ఉండును. సుఖములనిచ్చే ఆ శ్రీహరి శరణు జొచ్చువారికి ఆశ్రయమునిచ్చును. శరణు పొందదగిన ఆ శ్రీహరి దయాసముద్రుడు. వక్షఃస్థలముపై శ్రీవత్సము అనే మచ్చను దాల్చియుండే శ్రీహరి మేఘము వలె నల్లనివాడు. ఆ పూర్ణపురుషుడు అడవి పూల మాలను ధరించును. ఆయన చేతులు శంఖము, చక్రము, గద మరియు పద్మములతో శోభిల్లుచుండును. కిరీటమును, కుండలములను, గుండ్రని అంగదములను, మెడలో కౌస్తుభమాణిక్యముతో కూడిన ఆభరణమును ధరించియుండే శ్రీహరి పచ్చని పట్టు వస్త్రమును దాల్చియుండును. బంగరు చిరుగంటల మొలత్రాడును, ప్రకాశించే బంగరు అందెలను దాల్చియుండే శ్రీహరి సుందరులలోకెల్లా సుందరుడు. ఆ శాంతస్వరూపుడు మనస్సునకు, కళ్లకు ఉల్లాసమును కలిగించును. భక్తులు మణుల వంటి

గోళ్ల వరుసతో ప్రకాశించే ఆయన పాదములను తమ అంతరంగములలో హృదయపద్మముయొక్క మధ్యస్థానమునందు నిలుపుకొని యుందురు. అట్టి భక్తుల హృదయపద్మములే ఆయన నివాసస్థానము. చిరునవ్వుతో, అనురాగముతో చూచే శ్రీహరి వరములనిచ్చువారిలో అగ్రగణ్యుడు. సాధకుడు తన మనస్సును వశము చేసుకొని, ఏకాగ్రము చేసి, ఇట్టి శ్రీహరి రూపమును చక్కగా ధ్యానించవలెను.

ఏవం భగవతో రూపం సుభద్రం ధ్యాయతో మనః ।
నిర్వృత్యా పరయా తూర్ణం సంపన్నం న నివర్తతే ॥ 52

ఏవమ్ - ఈ విధముగా, సుభద్రమ్ - మిక్కిలి మంగళకరమగు, భగవతః - శ్రీహరి భగవానుని, రూపమ్ - రూపమును, ధ్యాయతః - ధ్యానమును చేయుచున్న వాని, మనః - మనస్సు, తూర్ణమ్ - శీఘ్రముగా, పరయా - సర్వోత్కృష్టమైన, నిర్వృత్యా - ఆనందముతో, సంపన్నమ్ - నిండినదై, న నివర్తతే - వెనుకకు మరలదు.

ఈ విధముగా పరమమంగళకరమగు శ్రీహరి భగవానుని రూపమును ధ్యానము చేయుచున్న వ్యక్తికి మనస్సు శీఘ్రముగా పరమానందముతో నిండిపోవును. అతని మనస్సు ధ్యేయమునుండి వెనుకకు మరలి రాదు.

జప్యశ్చ పరమో గుహ్యః శ్రూయతాం మే నృపాత్మజ ।
యం సప్తరాత్రం ప్రపఠన్ పుమాన్ పశ్యతి ఖేచరాన్ ॥ 53

నృప-ఆత్మజ - మహారాజ కుమారా!, మే - నా (మాట), శ్రూయతామ్ - వినబడుగాక!, పరమః - సర్వోత్కృష్టమగు, గుహ్యః - మంత్రము, జప్యః చ - జపించబడవలెను, పుమాన్ - మానవుడు, యమ్ - ఏ మంత్రమును, సప్తరాత్రమ్ - ఏడు రోజులు, ప్రపఠన్ - జపించువాడై, ఖేచరాన్ - ఆకాశమునందు సంచరించే సిద్ధులను, పశ్యతి - చూచునో.

ఓ మహారాజ కుమారా! నా మాటను వినుము. సర్వోత్కృష్టమగు ఒక మంత్రమును కూడ నీవు జపించవలెను. దానిని ఏడు రోజుల జపించు మానవుడు ఆకాశములో సిద్ధపురుషులను చూడగల్గును.

ఓం నమో భగవతే వాసుదేవాయ ।
మంత్రేణానేన దేవస్య కుర్యాద్ద్రవ్యమయీం బుధః ।
సపర్యాం వివిధైర్ద్రవ్యైర్దేశకాలవిభాగవిత్ ॥ 54

ఓమ్ నమో భగవతే వాసుదేవాయ. దేశకాలవిభాగవిత్ - దేశకాలముల తేడాను తెలిసిన, బుధః - వివేకి, అనేన - ఈ, మంత్రేణ - మంత్రముచే, దేవస్య - శ్రీహరికి, వివిధైః - అనేకములగు, ద్రవ్యైః - ద్రవ్యములతో, ద్రవ్యమయీమ్ - ద్రవ్యప్రధానమగు, సపర్యామ్ - పూజను, కుర్యాత్ - చేయవలెను.

ఓంకారము భగవానుని శబ్దాత్మకమగు ప్రతీక మాత్రమే గాక, భగవానుని స్వరూపమును కూడ బోధించును. భగవానుడు సకలప్రాణులలో చైతన్యరూపముగా విరాజిల్లుచున్నాడు. అట్టి భగవానునకు నమస్కారము అని మంత్రమునకు అర్థము. ఏ దేశములో ఏ కాలములో ఎట్టి ద్రవ్యములతో శ్రీహరిని పూజించవలెను అనే విభాగమునెరింగిన వివేకియగు భక్తుడు ఈ మంత్రమును పఠిస్తూ, వివిధ ద్రవ్యములతో శ్రీహరికి ద్రవ్యప్రధానమగు పూజను చేయవలెను.

సలిలైశ్శుచిభిర్మాల్యైర్వన్యైర్మూలఫలాదిభిః ।
శస్తాంకురాంశుకైశ్చార్చేత్తులస్యా ప్రియయా ప్రభుమ్ ॥ 55

శుచిభిః - స్వచ్ఛములు పవిత్రములు అగు, సలిలైః - నీళ్లతో, మాల్యైః - పుష్పమాలలతో, వన్యైః -అడవియందు లభించే, మూలఫల-ఆదిభిః - దుంపలు పళ్లు మొదలగువాటితో, చ - మరియు, శస్త-అంకుర -అంశుకైః - ప్రశస్తములైన (శాస్త్రవిహితములైన) గడ్డిపరకలతో ఆకులతో, ప్రియయా - ప్రియమైన, తులస్యా - తులసితో, ప్రభుమ్ - జగత్ప్రభుడగు శ్రీహరిని, అర్చేత్ - పూజించవలెను.

స్వచ్ఛములు, పవిత్రములు అగు నీళ్లు, పుష్పమాలలు, అడవిలో దొరికే కందమూలఫలములు, ప్రశస్తములు శాస్త్రవిహితములు అగు దూర్వలు మరియు పత్రములు, శ్రీహరి ప్రభునకు ప్రియమైన తులసి అను వాటితో శ్రీహరిని అర్చించవలెను.

**లబ్ధ్వా ద్రవ్యమయీమర్చాం క్షిత్యంబ్వాదిషు చార్చయేత్ ।**
**ఆభృతాత్మా మునిశ్శాంతో యతవాఙ్మితవన్యభుక్ ॥ 56**

ద్రవ్యమయీమ్ - ద్రవ్యముతో చేసిన, అర్చామ్ - విగ్రహమును, లబ్ధ్వా - సంపాదించి, క్షితి-అంబు-ఆదిషు చ - భూమి నీరు మొదలగువాటియందు గాని, అర్చయేత్ - పూజించవలెను, ఆభృత-ఆత్మా - వశము చేసుకొనబడిన చిత్తము గలవాడై, మునిః - మననశీలుడై, శాంతః - శాంతుడై, యతవాక్ - నియమించబడిన వాగింద్రియము గలవాడై, మితవన్యభుక్ - మితముగా వనమునందు దొరికే కందమూలఫలాదులను తినువాడై ఉండవలెను.

భక్తుడు శిల మొదలగు ద్రవ్యముతో చేసిన విగ్రహమును సంపాదించి గాని, లేక నేల నీరు మొదలగు వాటియందు గాని, శ్రీహరిని పూజించవలెను. భక్తుడు మనస్సును వశము చేసుకొని మననశీలుడై శాంతముగానుండవలెను. అతడు వాగింద్రియమును నియమించుకొని, అడవియందు దొరికే కందమూలఫలాదులను మితముగా భుజించవలెను.

**స్వేచ్ఛావతారచరితైరచింత్యనిజమాయయా ।**
**కరిష్యత్యుత్తమశ్లోకస్తద్ధ్యాయేద్ధృదయంగమమ్ ॥ 57**

ఉత్తమశ్లోకః - ఉత్తమమగు కీర్తిగల భగవానుడు, అచింత్యనిజమాయయా - ఊహకు అందని తన మాయాశక్తిచే, స్వ-ఇచ్ఛా-అవతారచరితైః - తన ఇచ్ఛచే స్వీకరించబడే అవతారముల లీలలచే, హృదయంగమమ్ - మనోహరమగు చేష్టను, కరిష్యతి - చేయగలడు, తత్ - దానిని, ధ్యాయేత్ - ధ్యానించవలెను.

ఉత్తమమగు కీర్తిగల శ్రీహరి తన ఇచ్ఛచే అవతారములనెత్తి లీలలను చేయును. మనోహరమగు ఆ లీలలను భక్తుడు ధ్యానించవలెను.

పరిచర్యా భగవతో యావత్యః పూర్వసేవితాః ।
తా మంత్రహృదయేనైవ ప్రయుంజ్యాన్మంత్రమూర్తయే ।।58

భగవతః - భగవానునకు, పూర్వసేవితాః - పూర్వీకులచే సేవారూపముగా అందజేయబడిన, యావత్యః - ఎన్ని, పరిచర్యాః - పరిచర్యలు గలవో, తాః - వాటిని, మంత్రమూర్తయే - మంత్ర (వేద) స్వరూపుడగు శ్రీహరి కొరకు, మంత్రహృదయేన ఏవ - మంత్రములలో ముఖ్యమగు ద్వాదశాక్షరమంత్రముతోనే (మంత్రముతో కూడిన మనస్సుతోనే), ప్రయుంజ్యాత్ - అనుష్ఠించవలెను.

భగవానునకు చేయదగిన పరిచర్యలను పూర్వజులైన మహర్షులు నిర్దేశించినారు. ద్వాదశాక్షర మహామంత్రము మంత్రములలోకెల్లా గొప్పది. సాధకుడు దానిని మనస్సులో ధ్యానిస్తూ, మంత్రమే (వేదమే) స్వరూపముగా గల భగవానునకు ఆ పరిచర్యలనన్నింటినీ అనుష్ఠించవలెను.

ఏవం కాయేన మనసా వచసా చ మనోగతమ్ ।
పరిచర్యమాణో భగవాన్ భక్తిమత్పరిచర్యయా ।। 59

పుంసామమాయినాం సమ్యగ్భజతాం భావవర్ధనః ।
శ్రేయో దిశత్యభిమతం యద్ధర్మాదిషు దేహినామ్ ।। 60

ఏవమ్ - ఈ విధముగా, మనః-గతమ్ - మనస్సులో నిలిచిపోవునట్లుగా, కాయేన - దేహముతో, వచసా - వాక్కుతో, చ - మరియు, మనసా - మనస్సుతో, భక్తిమత్-పరిచర్యయా - భక్తితో గూడిన పరిచర్యచే, పరిచర్యమాణః - సేవించబడుచున్నట్టియు, భావవర్ధనః - భక్తుల కోరికలను (భక్తిని) వర్ధిల్లజేసే, భగవాన్ - శ్రీహరి భగవానుడు, సమ్యక్ - చక్కగా, భజతామ్ - సేవించుచున్న, అమాయినామ్ - కపటము లేని, దేహినామ్ - దేహధారులగు, పుంసామ్ - మానవులకు, ధర్మ-ఆదిషు - ధర్మా

ర్థకామములయందు, యత్ - ఏది, అభిమతమ్ - అభిమతమో, తత్ - ఆ, శ్రేయః - శ్రేయస్సును, దిశతి - ఇచ్చుచున్నాడు.

మానవులు దేహధారణకు కావలసిన వ్యవస్థను చేసుకొని, దంభము లేకుండగా తమ హృదయములోని శ్రీహరిని చక్కగా శరీరముతో (పూజలను చేయుట), వాక్కుతో (జపము) మరియు మనస్సుతో (ధ్యానము) భక్తిపూర్వకముగా సేవించవలెను. ఇట్లు సేవించబడే శ్రీహరి అట్టి భక్తుల అభీష్టములను నెరవేర్చుటయే గాక, వారి భక్తిని కూడ వర్ధిల్లజేయును. అట్టివారికి ధర్మార్థకామములలో ఏది అభిమతమో, భగవానుడు ఆ శ్రేయస్సును వారికి అనుగ్రహించును.

విరక్తశ్చేంద్రియరతౌ భక్తియోగేన భూయసా ।
తం నిరంతరభావేన భజేతాద్ధా విముక్తయే ॥ 61

ఇంద్రియరతౌ - ఇంద్రియముల భోగమునందు, విరక్తః - వైరాగ్యము గలవాడు, నిరంతరభావేన - నిరంతరమగు ప్రేమగల, భూయసా - దృఢమగు, భక్తియోగేన - భక్తి అనే సాధనచే, తమ్ - ఆ శ్రీహరిని, అద్ధా - సాక్షాత్తుగా, విముక్తయే - మోక్షము కొరకు, భజేత - సేవించవలెను.

ఇంద్రియభోగములయందు వైరాగ్యము గల భక్తుడు అవిచ్ఛిన్నమగు ప్రేమతో కూడిన భక్తిని దృఢముగా సాధన చేస్తూ, ఆ శ్రీహరిని సాక్షాత్తుగా మోక్షము కొరకు సేవించవలెను.

ఇత్యుక్తస్తం పరిక్రమ్య ప్రణమ్య చ నృపార్భకః ।
యయౌ మధువనం పుణ్యం హరేశ్చరణచర్చితమ్ ॥ 62

ఇతి - ఈ విధముగా, ఉక్తః - పలుకబడిన, నృప-అర్భకః - మహారాజ కుమారుడగు ధ్రువుడు, తమ్ - ఆ నారదుని, పరిక్రమ్య - ప్రదక్షిణము చేసి, చ - మరియు, ప్రణమ్య - నమస్కరించి, హరేః - శ్రీహరియొక్క, చరణచర్చితమ్ - పాదములచే శోభిల్లిన, పుణ్యమ్ - పావనమగు, మధువనమ్ - మధువనమును గురించి, యయౌ - వెళ్లెను.

నారదుడీ విధముగా ఉపదేశించిన తరువాత, రాజకుమారుడగు ధ్రువుడు ఆయనకు ప్రదక్షిణ నమస్కారములను చేసి, మధువనమునకు వెళ్లెను. సుందరమగు ఆ మధువనము నిత్యనివాసియగు శ్రీహరి పాదముల సంచారముచే పావనమయ్యెను.

తపోవనం గతే తస్మిన్ ప్రవిష్టోఽంతఃపురం మునిః ।
అర్హితార్హణకో రాజ్ఞా సుఖాసీన ఉవాచ తమ్ ॥ 63

తస్మిన్ - ఆ ధ్రువుడు, తపః-వనమ్ - తపస్సు కొరకై (తపస్సునకు అనుకూలమైన) మధువనమును గురించి, గతే - వెళ్లగా, మునిః - నారద మహర్షి, అంతఃపురమ్ - అంతఃపురమును, ప్రవిష్టః - ప్రవేశించినవాడై, రాజ్ఞా - ఉత్తానపాద మహారాజుచే, అర్హిత-అర్హణకః - సమర్పించబడిన పూజాదికము గలవాడై, సుఖ-ఆసీనః - సుఖముగా కూర్చున్నవాడై, తమ్ - ఆ రాజును ఉద్దేశించి, ఉవాచ - పలికెను.

ఆ ధ్రువుడు తపస్సు కొరకై దానికి అనుకూలమగు మధువనమునకు వెళ్లగానే, నారద మహర్షి ఉత్తానపాద మహారాజుయొక్క అంతఃపురమునకు వెళ్లెను. ఆ రాజు ఆయనకు స్వాగతమును చెప్పి సత్కరించెను. నారద మహర్షి ఆసనమునందు సుఖముగా కూర్చుండి, రాజుతో నిట్లనెను.

నారద ఉవాచ ।
రాజన్ కిం ధ్యాయసే దీర్ఘం ముఖేన పరిశుష్యతా ।
కిం వా న రిష్యతే కామో ధర్మో వాఽర్థేన సంయుతః ॥ 64

రాజన్ - ఓ మహారాజా!, పరిశుష్యతా - వాడిపోయిన, ముఖేన - ముఖముతో, దీర్ఘమ్ - దీర్ఘముగా, కిమ్ - దేనిని గురించి, ధ్యాయసే - చింతిల్లుచున్నావు?, అర్థేన - అర్థముతో, సంయుతః - కూడియున్న, కామః - కామము గాని, ధర్మః వా - ధర్మము గాని, కిం వా న రిష్యతే - నశించుట లేదు గదా?

నారదుడిట్లు పలికెను --- ఓ మహారాజా! నీ ముఖము వాడి యున్నది. నీవు దీర్ఘముగా చింతిల్లుచున్నావు. విషయమేమి? ధర్మార్థకామములు అనే పురుషార్థములలో నీకేదైన లోటు రాలేదు గదా?

రాజోవాచ ।
సుతో మే బాలకో బ్రహ్మన్ స్త్రైణేనాఽకరుణాత్మనా ।
నిర్వాసితః పంచవర్షస్సహ మాత్రా మహాన్ కవిః ।। 65

బ్రహ్మన్ - ఓ మహర్షీ!, మహాన్ - గొప్ప లక్షణములు గలవాడు, కవిః - బుద్ధిమంతుడు, పంచవర్షః - అయిదేండ్ల వయస్సు గల, బాలకః - పిల్లవాడు అగు, మే - నా, సుతః - కుమారుడు, స్త్రైణేన - స్త్రీకి వశుడై యుండే, అకరుణ-ఆత్మనా - దయలేని మనస్సు గల నాచే, మాత్రా సహ - తల్లితో కూడా, నిర్వాసితః - త్రోసివేయబడినాడు.

రాజు ఇట్లు పలికెను -- ఓ మహర్షీ! నా పుత్రుడు అయిదేండ్ల పిల్లవాడు. కాని, ఆతడు గొప్ప లక్షణములు గల బుద్ధిశాలి. నేను స్త్రీ (వాని సవతి తల్లి) కి వశుడనై వానిని త్రోసివేసితిని. నా హృదయములో దయకు చోటు లేకుండెను. నేను వాని తల్లిని కూడ ఉపేక్షించితిని.

అప్యనాథం వనే బ్రహ్మన్మా స్మాదంత్యర్భకం వృకాః ।
శ్రాంతం శయానం క్షుధితం పరిమ్లానముఖాంబుజమ్ ।। 66

బ్రహ్మన్ - ఓ మహర్షీ!, అనాథమ్ - దిక్కు లేనట్టియు, శ్రాంతమ్ - అలసినట్టియు, శయానమ్ - పరుండినట్టియు, క్షుధితమ్ - ఆకలి గొన్నట్టియు, పరిమ్లానముఖ-అంబుజమ్ - బాగా వడలిపోయిన పద్మమువంటి ముఖము గల, అర్భకమ్ - పిల్లవానిని, వనే - అడవియందు, వృకాః - తోడేళ్లు (పెద్ద పులులు), అపి మా స్మ అదంతి - తినివేయుట లేదు గదా?

ఓ మహర్షీ! పిల్లవాడగు ధ్రువుడు అడవిలో అనాథయై తిరిగి తిరిగి అలసి సొలసి ఆకలి గొనియుండును. పద్మమువంటి వాని ముఖము వడలి పోయి యుండును. వానిని తోడేళ్లు (పెద్ద పులులు) భక్షించియుండునేమో?

అహో మే బత దౌరాత్మ్యం స్త్రీజితస్యోపధారయ ।
యోఽంకం ప్రేమ్ణాఽఽరురుక్షంతం నాభ్యనందమసత్తమః ॥67

అహో - ఆశ్చర్యము, బత - అయ్యో!, స్త్రీజితస్య - స్త్రీచే జయించబడిన నా, దౌరాత్మ్యమ్ - దుర్బుద్ధిని, ఉపధారయ - పరికించుము, అసత్తమః - దుష్టులలో మొదటివాడనగు, యః - ఏ నేను, ప్రేమ్ణా - ప్రేమతో, అంకమ్ - ఒడిని, ఆరురుక్షంతమ్ - ఎక్క గోరుచున్న ధ్రువుని, న అభ్యనందమ్ - ఆదరించలేదో.

అయ్యో! స్త్రీకి వశుడనైన నేను దుష్టులలో మొదటివాడను. నా దుర్బుద్ధిని పరికించుడు. ధ్రువుడు ప్రేమతో నా ఒడిలో కూర్చుండుటకు యత్నించుచుండగా, నేను ఆదరించి ముద్దాడక పోతిని.

నారద ఉవాచ ।
మా మా శుచస్స్వతనయం దేవగుప్తం విశాం పతే ।
తత్ప్రభావమవిజ్ఞాయ ప్రావృంక్తే యద్యశో జగత్ ॥ 68

విశాం పతే - ఓ నరపతీ!, దేవగుప్తమ్ - ఈశ్వరునిచే రక్షించబడిన, స్వతనయమ్ - నీ పుత్రుని గురించి, తత్-ప్రభావమ్ - వాని ప్రభావమును, అవిజ్ఞాయ - తెలియక, మా మా శుచః - దుఃఖించనే వద్దు, యత్-యశః - ఎవని కీర్తి, జగత్ - జగత్తును, ప్రావృంక్తే - ప్రకృష్టముగా వ్యాపించుచున్నదో.

నారద మహర్షి ఇట్లు పలికెను --- ఓ మహారాజా! నీవు నీ కుమారుని గురించి సుతరాము దుఃఖించవద్దు. వానిని శ్రీహరి రక్షించియున్నాడు. వాని ప్రభావము నీకు తెలియదు. వాని కీర్తి జగత్తునంతనూ వ్యాపించుచున్నది.

సుదుష్కరం కర్మ కృత్వా లోకపాలైరపి ప్రభుః ।
ఏష్యత్యచిరతో రాజన్ యశో విపులయంస్తవ ॥ 69

రాజన్ - ఓ మహారాజా!, లోకపాలైః అపి - లోకపాలకులచే కూడ, సుదుష్కరమ్ - మిక్కిలి చేయ శక్యము కాని, కర్మ - కర్మను, కృత్వా -

చేసి, ప్రభుః - సమర్థుడై, తవ - నీ, యశః - కీర్తిని, విపులయన్ - విస్తరింప జేయుచున్నవాడై, అచిరతః - తొందరలో, ఏష్యతి - రాగలడు.

ఓ మహారాజా! ధ్రువుడు లోకపాలకులకు కూడ సాధ్యము కాని కర్మను చేసి, సర్వసమర్థుడై, తొందరలోనే తిరిగి వచ్చి, నీ కీర్తిని విస్తరింపజే యగలడు.

మైత్రేయ ఉవాచ ।
ఇతి దేవర్షిణా ప్రోక్తం విశ్రుత్య జగతీపతిః ।
రాజలక్ష్మీమనాదృత్య పుత్రమేవాన్వచింతయత్ ॥ 70

ఇతి - ఈ విధముగా, దేవ-ఋషిణా - దేవర్షియగు నారదునిచే, ప్రోక్తమ్ - చెప్పబడిన మాటను, విశ్రుత్య - జాగ్రత్తగా విని, జగతీపతిః - మహారాజు, రాజలక్ష్మీమ్ - సామ్రాజ్యసంపదను, అనాదృత్య - లెక్క చేయక, పుత్రం ఏవ - పుత్రుని గురించి మాత్రమే, అను-అచింతయత్ - చింతిల్లెను.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- ఆ మహారాజు దేవర్షియగు నారదుడు చెప్పిన ఈ మాటలను జాగ్రత్తగా వినెను. ఆయన రాజ్యవ్యవహా రములను పట్టించుకొనుట మానివేసి, నిరంతరము తన పుత్రుడగు ధ్రువుని గురించి మాత్రమే తలపోయుచుండెను.

తత్రాభిషిక్తః ప్రయతస్తాముపోష్య విభావరీమ్ ।
సమాహితః పర్యచరదృష్యాదేశేన పూరుషమ్ ॥ 71

తత్ర - ఆ మధువనమునందు, అభిషిక్తః - స్నానమును చేసినవాడై, ప్రయతః - పవిత్రుడైన ధ్రువుడు, తామ్ - అదే, విభావరీమ్ - రాత్రిని, ఉపోష్య - ఉపవాసమును చేసి, సమాహితః - ఏకాగ్రమగు చిత్తము గలవాడై, ఋషి-ఆదేశేన - నారద మహర్షి ఆదేశముచే, పూరు షమ్ - పరమపురుషుడగు శ్రీహరిని, పరి-అచరత్ - పూజించెను.

ధ్రువుడు మధువనమునకు వెళ్లి, అదే రాత్రి స్నానమును చేసి పవిత్రుడై ఉపవాసమును చేసెను. ఆతడు నారద మహర్షి ఆదేశించిన విధముగా ఏకాగ్రచిత్తుడై పరమపురుషుడగు శ్రీహరిని పూజించెను.

త్రిరాత్రాంతే త్రిరాత్రాంతే కపిత్థబదరాశనః ।
ఆత్మవృత్త్యనుసారేణ మాసం నిన్యేఽర్చయన్ హరిమ్ ।। 72

త్రిరాత్ర-అంతే త్రిరాత్రాంతే - ప్రతి మూడు రాత్రుల అంతమునందు, ఆత్మవృత్తి-అనుసారేణ - శరీరస్థితికి అనురూపముగా, కపిత్థబదర-అశనః - వెలగ రేగు పళ్లు ఆహారముగా గలవాడై, హరిమ్ - శ్రీహరిని, అర్చయన్ - పూజించుచున్నవాడై, మాసమ్ - నెలను, నిన్యే - గడిపెను.

ధ్రువుడు మూడు రోజులకు ఒకసారి శరీరము నిలబడుటకు మాత్రమే సరిపడే వెలగ రేగు పళ్లను ఆహారముగా తీసుకొనెడివాడు. ఆతడు ఈ విధముగా శ్రీహరిని అన్ని కాలములలో పూజిస్తూ నెల రోజులు గడిపెను.

ద్వితీయం చ తథా మాసం షష్ఠే షష్ఠేఽర్భకో దినే ।
తృణపర్ణాదిభిశ్శీర్ణైః కృతాన్నోఽభ్యర్చయద్విభుమ్ ।। 73

తథా - అదే విధముగా, అర్భకః - ఆ బాలకుడు, ద్వితీయమ్ - రెండవ, మాసమ్ - నెలను, షష్ఠే షష్ఠే - ప్రతి ఆరవ, దినే - దినమునందు, శీర్ణైః - ఎండిన రాలిన, తృణపర్ణ-ఆదిభిః - గడ్డి ఆకులు మొదలగువాటితో, కృత-అన్నః - చేయబడిన ఆహారము గలవాడై, విభుమ్ - సర్వవ్యాపకుడగు శ్రీహరిని, అభి-అర్చయత్ - చక్కగా పూజించెను.

ఆ బాలకుడు రెండవ నెల కూడ ఆరు రోజులకొకసారి ఎండు గడ్డి, రాలిన ఆకులు మొదలగువాటితో ఆహారమును సరిపెట్టుకొనెను. ఆతడు సర్వవ్యాపకుడగు శ్రీహరిని సర్వకాలములలో చక్కగా ఆరాధించెను.

తృతీయం చానయన్మాసం నవమే నవమేఽహని ।
అబ్భక్ష ఉత్తమశ్లోకముపాధావత్సమాధినా ।। 74

తృతీయమ్ - మూడవ, మాసం చ - నెలను కూడ, నవమే నవమే - ప్రతి తొమ్మిదవ, అహని - దినమునందు, అప్-భక్షః - నీటిని ఆహారముగా తీసుకొనువాడై, అనయత్ - గడిపెను, సమాధినా - ఏకాగ్రమగు చిత్తముతో, ఉత్తమశ్లోకమ్ - ఉత్తమమగు కీర్తి గల శ్రీహరిని, ఉపాధావత్ - నిరంతరముగా ధ్యానించెను.

అతడు మూడవ నెలలో తొమ్మిది రోజులకొకసారి నీటిని మాత్రమే త్రాగి గడిపెను. అతడు ఏకాగ్రమగు చిత్తముతో ఉత్తమమగు కీర్తిగల శ్రీహరిని నిరంతరముగా ధ్యానించెను.

చతుర్థమపి వై మాసం ద్వాదశే ద్వాదశేఽహని ।
వాయుభక్షో జితశ్వాసో ధ్యాయన్ దేవమధారయత్ ।। 75

చతుర్థమ్ - నాల్గవ, మాసం అపి వై - నెలను కూడ, ద్వాదశే ద్వాదశే - ప్రతి పన్నెండవ, అహని - దినమునందు, వాయుభక్షః - గాలిని భక్షించువాడై, జితశ్వాసః - జయించబడిన ఉచ్ఛ్వాసనిశ్వాసలు గలవాడై, దేవమ్ - శ్రీహరిని, ధ్యాయన్ - ధ్యానించుచున్నవాడై, అధారయత్ - ప్రాణములను ధరించియుండెను.

అతడు నాల్గవ నెలలో పన్నెండు రోజులకొకసారి గాలిని భోజనము చేయుచూ, ఉచ్ఛ్వాసనిశ్వాసలను తన వశము చేసుకొని, శ్రీహరిని ధ్యానిస్తూ, ప్రాణములను ధరించి యుండెను.

పంచమే మాస్యనుప్రాప్తే జితశ్వాసో నృపాత్మజః ।
ధ్యాయన్ బ్రహ్మ పదైకేన తస్థౌ స్థాణురివాచలః ।। 76

పంచమే - ఐదవ, మాసి - నెల, అనుప్రాప్తే - రాగా, జితశ్వాసః - జయించబడిన ఉచ్ఛ్వాసనిశ్వాసలు గల, నృప-ఆత్మజః - ఆ రాజకుమారుడు, బ్రహ్మ - పరబ్రహ్మను, ధ్యాయన్ - ధ్యానించువాడై, ఏకేన - ఒక, పదా - కాలితో, స్థాణుః - కదలిక లేనివాడై, అచలః ఇవ - పర్వతము వలె, (స్థాణుః ఇవ - స్తంభమువలె, అచలః - కదలిక లేనివాడై), తస్థౌ - నిలిచి యుండెను.

ఐదవ నెల రాగానే, ఆ రాజకుమారుడు ఉచ్ఛ్వాసనిశ్వాసలను తన వశము చేసుకొని, పర్వతము వలె (స్తంభము వలె) కదలిక లేకుండా ఒంటికాలిపై నిలబడి, అక్షర పరబ్రహ్మను ధ్యానించెను.

సర్వతో మన ఆకృష్య హృది భూతేంద్రియాశయమ్ ।
ధ్యాయన్ భగవతో రూపం నాద్రాక్షీత్కించనాపరమ్ ॥ 77

భూత-ఇంద్రియ-ఆశయమ్ - విషయములు ఇంద్రియములు గ్రహించబడే, మనః - మనస్సును, సర్వతః - సర్వమునుండి, ఆకృష్య - ఉపసంహరించి, హృది - హృదయమునందు, భూత-ఇంద్రియ-ఆశయమ్ - సూక్ష్మభూతముల కార్యములగు ఇంద్రియములచే గ్రహించబడని, భగవతః - శ్రీహరి భగవానుని, రూపమ్ - రూపమును, ధ్యాయన్ - ధ్యానించుచున్నవాడై, అపరమ్ - మరియొకదానిని, కించన - దేనినైననూ, న అద్రాక్షీత్ - చూడలేదు.

శబ్దస్పర్శరూపరసగంధములనే విషయములను మనస్సు చెవి, చర్మము, కన్ను, నాలుక మరియు ముక్కు అనే ఇంద్రియముల ద్వారా గ్రహించుచుండును. భగవాముని స్వరూపము ఈ సూక్ష్మపంచభూతముల నుండి పుట్టిన ఇంద్రియములకు గాని, మనస్సునకు గాని గోచరము కాదు. ధ్రువుడు అట్టి మనస్సును సర్వవిషయములనుండి ఉపసంహరించెను. అతడు ఇంద్రియములకు గోచరము కాని స్వరూపము గల భగవానుని తన హృదయమునందు ధ్యానించుచుండెను. అతని మనస్సు భగవానుని రూపము తక్క మరియొకదానిపైకి ప్రసరించనే లేదు.

ఆధారం మహదాదీనాం ప్రధానపురుషేశ్వరమ్ ।
బ్రహ్మ ధారయమాణస్య త్రయో లోకాశ్చకంపిరే ॥ 78

మహత్-ఆదీనామ్ - మహత్తత్త్వము మొదలగు తత్త్వములకు, ఆధారమ్ - ఆధారమైనట్టియు, ప్రధానపురుషేశ్వరమ్ - అవ్యక్తమునకు జీవులకు కూడ ప్రభువగు, బ్రహ్మ - పరబ్రహ్మను, ధారయమాణస్య - ధ్రువుడు ధ్యానించుచుండగా, త్రయః - మూడు, లోకాః - లోకములు, చకంపిరే - కంపించినవి.

అవ్యక్తము (మాయాశక్తి), మహత్తత్త్వము (సమష్టి విజ్ఞానము), అహంకారము, అయిదు సూక్ష్మభూతములు, అయిదు స్థూలభూతములు అనే సర్వము అక్షర పరబ్రహ్మనుండియే ఆవిర్భవించినది. అవ్యక్తమునకు, జీవజాతమునకు ప్రభువు అగు ఆ పరబ్రహ్మమ ధ్రువుడు ధ్యానము చేయు చుండగా, (అతని కఠోరమగు తపస్సునకు) ముల్లోకములు కంపించినవి.

యద్రైకపాదేన స పార్థివార్భకస్తస్థౌ తదంగుష్ఠనిపీడితా మహీ ।
ననామ తత్రార్ధమిభేంద్రధిష్ఠితా తరీవ సవ్యేతరతః పదే పదే ॥79

యదా - ఏ కాలమునందైతే, పార్థివ-అర్భకః - రాజకుమారుడగు, సః - ఆ ధ్రువుడు, ఏకపాదేన - ఒంటికాలితో, తస్థౌ - నిలబడెనో, తత్ర - ఆ కాలమునందు, తత్-అంగుష్ఠనిపీడితా - వాని బొటనవ్రేలిచే నొక్కబడిన, మహీ - భూమి, ఇభ-ఇంద్రధిష్ఠితా - గొప్ప ఏనుగుచే అధిష్ఠించబడిన, తరీ ఇవ - నావ వలె, పదే పదే - ప్రతి అడుగునందు, సవ్య-ఇతరతః - ఎడమ కుడి వైపులకు, అర్ధమ్ - సగభాగము, ననామ - వంగెను.

రాజకుమారుడగు ధ్రువుడు ఒంటికాలిపై నిలబడినప్పుడు వాని బొటనవ్రేలిచే నొక్కబడిన భూమి, గొప్ప ఏనుగు ఎక్కిన నావ అడుగడుగువా ఎడమ కుడి వైపులకు వంగునట్లుగా, సగము ఒక వైపునకు వంగెను.

తస్మిన్నభిధ్యాయతి విశ్వమాత్మనో
ద్వారం నిరుధ్యాసుమనన్యయా ధియా ।
లోకా నిరుచ్ఛ్వాసనిపీడితా భృశం
సలోకపాలాశ్శరణం యయుర్హరిమ్ ॥ 80

తస్మిన్ - ఆ ధ్రువుడు, అసుమ్ - ప్రాణశక్తిని, ద్వారమ్ - ఇంద్రియముల ద్వారమును, నిరుధ్య - నిరోధించి, ఆత్మనః - తనకంటె, అనన్యయా - భేదము లేని, ధియా - బుద్ధితో, విశ్వమ్ - విశ్వరూపుడగు శ్రీహరిని, అభిధ్యాయతి - చక్కగా ధ్యానించుచుండగా, సలోకపాలాః - లోకపాలకులతో కూడిన, లోకాః - జనులు, భృశమ్ - మిక్కిలి, నిరుచ్ఛ్వాసనిపీడితాః - శ్వాస లేకుండుటచే పీడను పొందినవారై, హరిమ్ - శ్రీహరిని, శరణమ్ - శరణమును, యయుః - పొందిరి.

ఆ ధ్రువుడు ఇంద్రియముల ద్వారములను, ప్రాణసంచారమును నిరోధించెను. ఆతడు జగద్రూపముగా వెలసియున్న శ్రీహరిని తన స్వరూపము కంటె అభిన్నుడు అనే జ్ఞానముతో దర్శించుచుండెను. ఈ విధముగా ఆతడు సమష్టితో ఐక్యమును పొందుటచే, లోకులకు లోకపాలకులకు కూడ ఉచ్ఛ్వాసనిశ్శ్వాసలు ఆగిపోయి, వారు చాల పీడను పొందిరి. వారందరు శ్రీహరిని శరణు జొచ్చిరి.

దేవా ఊచుః ।
నైవం విదామో భగవన్ ప్రాణరోధం
చరాచరస్యాఖిలసత్త్వధామ్నః ।
విధేహి తన్నో వృజినాద్విమోక్షం
ప్రాప్తా వయం త్వాం శరణం శరణ్యమ్ ॥ 81

భగవన్ - ఓ భగవానుడా!, చర-అచరస్య - కదిలే మరియు కదలని, అఖిలసత్త్వధామ్నః - సకలప్రాణుల శరీరమునకు, ఏవమ్ - ఈ విధముగా, ప్రాణరోధమ్ - ప్రాణసంచారము ఆగిపోవుటను, న విదామః - ఎరుంగము, తత్ - అందువలన, నః - మాకు, వృజినాత్ - పీడనుండి, విమోక్షమ్ - విముక్తిని, విధేహి - కలిగించుము, శరణ్యమ్ - శరణాగతరక్షకుడవగు, త్వామ్ - నిన్ను, వయమ్ - మేము, శరణమ్ - శరణును, ప్రాప్తాః - పొందియున్నాము.

దేవతలు ఇట్లు పలికిరి --- ఓ భగవానుడా! కదిలే మరియు కదలని సకలప్రాణుల శరీరములలో ప్రాణసంచారము ఆగిపోయినది. ఇట్టి స్థితిని ఇదివరలో మేము ఎరుంగము. మాకు ఈ పీడనుండి విముక్తిని కలిగించుము. శరణాగతవత్సలుడవగు నిన్ను మేము శరణు పొందినాము.

శ్రీభగవానువాచ ।
మా భైష్ట బాలం తపసో దురత్యయాత్
నివర్తయిష్యే ప్రతియాత స్వధామ ।

యతో హి వః ప్రాణనిరోధ ఆసీత్
ఔత్తానపాదిర్మయి సంగతాత్మా ॥ 82

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే చతుర్థస్కంధే ధ్రువోపాఖ్యానే మధువనసమాగమనవర్ణనం నామ అష్టమోఽధ్యాయః ॥

మా భైష్ట - భయపడకుడు, బాలమ్ - బాలకుడగు ధ్రువుని, దురత్యయాత్ - విఘ్నమును కలిగించ శక్యము కాని (దుష్కరమగు), తపసః - తపస్సునుండి, నివర్తయిష్యే - వెనుకకు మరల్చగలను, స్వధామ - మీ స్థానమును గురించి, ప్రతియాత - తిరిగి వెళ్లుడు, యతః హి - ఎవని వలన, వః - మీకు, ప్రాణనిరోధః - శ్వాస ఆగిపోవుట, ఆసీత్ - కలిగినదో, ఔత్తానపాదిః - ఉత్తానపాదుని పుత్రుడగు ఆ ధ్రువుడు, మయి - నాయందు, సంగత-ఆత్మా - ఐక్యమును పొందిన చిత్తము గలవాడు.

శ్రీభగవానుడు ఇట్లు పలికెను --- భయపడకుడు. ఉత్తానపాదుని కుమారుడగు ధ్రువుడు నాయందు తన చిత్తమును విలీనము చేసియున్నాడు. ఆతడు జగద్రూపుడనగు నాతో ఐక్యమును పొందియుండుట వలననే మీకు ప్రాణనిరోధము కలిగినది. ఆతనిచే ఈ దుష్కరమైన, విఘ్నమును కలిగించ శక్యము కాని తపస్సును మాన్పించెదను. మీరు భయపడకుడు. మీ మీ స్థానములకు తిరిగి వెళ్లుడు.

శ్రీమద్భాగవత మహాపురాణములోని నాల్గవ స్కంధములో
ధ్రువోపాఖ్యానమునందు ధ్రువుడు అడవికి వెళ్లి కఠోరమగు
తపస్సును చేయుటను వర్ణించే ఎనిమిదవ
అధ్యాయము ముగిసినది (8).

*****

# అథ నవమోऽధ్యాయః

## ధ్రువోపాఖ్యానము - ధ్రువునకు శ్రీహరి సాక్షాత్కరించుట, ధ్రువస్తుతి, ధ్రువుని రాజ్యాభిషేకము

మైత్రేయ ఉవాచ ।
త ఏవముత్పన్నభయా ఉరుక్రమే
కృతావనామాః ప్రయయుస్త్రివిష్టపమ్ ।
సహస్రశీర్షాపి తతో గరుత్మతా
మధోర్వనం భృత్యదిదృక్షయా గతః ॥ 1

మైత్రేయః - మైత్రేయుడు, ఉవాచ - పలికెను, తే - ఆ దేవతలు, ఏవమ్ - ఈ విధమగు భగవానుని వాక్యముచే, ఉత్పన్నభయాః - తొలగిన భయము గలవారై, ఉరుక్రమే - వామనావతారములో పెద్ద పెద్ద అడుగులను వేసిన భగవానునియందు, కృత-అవనామాః - చేయబడిన నమస్కారములు గలవారై, త్రివిష్టపమ్ - స్వర్గమును గురించి, ప్రయయుః - వెళ్లిరి, సహస్రశీర్షా అపి - అనంతములగు శిరస్సులు గల భగవానుడు కూడ, తతః - తరువాత, భృత్యదిదృక్షయా - సేవకుడగు ధ్రువుని చూచు కోరికతో, గరుత్మతా - గరుత్మంతునితో, మధోః వనమ్ - మధువనమును గురించి, గతః - వెళ్లినాడు.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- ఈ విధముగా భగవానుడు చెప్పుటచే దేవతల భయము తొలగిపోయినది. ఆయన వామనుడై పెద్ద పెద్ద అడుగులతో ముల్లోకములను కొలిచి దేవతల భయమును పోగొట్టినాడు. ఆ దేవతలు అట్టి తమ రక్షకునకు నమస్కరించి స్వర్గమునకు వెళ్లిరి. తరువాత శ్రీహరి తన భక్తుడగు ధ్రువుని చూచే కోరికతో గరుత్మంతుని

అధిష్ఠించి మధువనమునకు వెళ్లెను. సకలప్రాణుల రూపములో శ్రీహరియే ఉన్నాడు గనుక, ప్రాణుల తలలన్నియు ఆయన తలలే గనుక, ఆయన అనంతములగు శిరస్సులు గలవాడైనాడు.

స వై ధియా యోగవిపాకతీవ్రయా
హృత్పద్మకోశే స్ఫురితం తడిత్ప్రభమ్ ।
తిరోహితం సహసైవోపలక్ష్య
బహిఃస్థితం తదవస్థం దదర్శ ॥ 2

సః వై - ఆ ధ్రువుడు, యోగవిపాకతీవ్రయా - అభ్యాసముయొక్క పరిపాకముచే నిశ్చలమైన, ధియా - బుద్ధితో, హృత్-పద్మకోశే - హృదయము అనే పద్మగర్భమునందు, స్ఫురితమ్ - ప్రకాశించిన, తడిత్-ప్రభమ్ - మెరుపు కాంతి వంటి కాంతి గల భగవానుని, సహసా ఏవ - హఠాత్తుగా, తిరోహితమ్ - అంతర్ధానమైన వానినిగా, ఉపలక్ష్య - గమనించి, తత్-అవస్థమ్ - అటువంటి రూపమునే, బహిః-స్థితమ్ - బయటనున్న దానిని, దదర్శ - చూచెను.

ఆ ధ్రువుని బుద్ధి, సమాధియొక్క అభ్యాసము పరిపక్వమగుటచే, స్థిరముగా భగవానునియందు నిలిచియుండెను. ఆతడు హృదయపద్మము లోపల మెరుపు వలె ప్రకాశించే భగవానుని రూపముపై మనస్సును నిలిపియుంచెను. కావుననే, బయటనున్న శ్రీహరిని గాంచలేదు. కాని, ఆ రూపము హఠాత్తుగా చెదరిపోగా, ఆతడు కనులను తెరిచి, అదే రూపమును తన యెదుట బయట గాంచెను.

తద్దర్శనేనాగతసాధ్వసః క్షితా-
వవందతాంగం వినమయ్య దండవత్ ।
దృగ్భ్యాం ప్రపశ్యన్ ప్రపిబన్నివార్భకః
చుంబన్నివాస్యేన భుజైరివాశ్లిషన్ ॥ 3

**తత్**-దర్శనేన - భగవానుని ఆ రూపమును చూచుటచే, ఆగతసాధ్వసః - కలిగిన కంగారు గల, అర్భకః - పిల్లవాడగు ఆ ధ్రువుడు, అంగమ్

- శరీరమును, క్షితౌ - నేలపై, దండవత్ - కఱ్ఱవలె, వినమయ్య - వంచి, దృగ్భ్యామ్ - కన్నులతో, ప్రపిబన్ ఇవ - పానము చేయుచున్నాడా యన్నట్లు, ఆస్యేన - ముఖముతో, చుంబన్ ఇవ - ముద్దిడుచున్నాడా యన్నట్లు, భుజైః - చేతులతో, ఆశ్లిషన్ ఇవ - కౌగిలించుకొనుచున్నాడా యన్నట్లు, ప్రపశ్యన్ - రెప్పపాటు లేకుండా చూచుచున్నవాడై, అవందత - నమస్కరించెను.

భగవానుని ఆ రూపమును చూడగానే పిల్లవాడగు ధ్రువుడు కంగారు పడిపోయెను. ఆతడు వెంటనే నేలపై బడి సాష్టాంగప్రణామమునాచరించెను. ఆతడు కన్నులతో భగవానుని రూపమును పానము చేయుచున్నాడా యన్నట్లుగా, ఆయన ముఖమును ముద్దిడుచున్నాడా యన్నట్లుగా, ఆయన నాలుగు చేతులతో తనను కౌగిలింప జేసుకొనుచున్నాడా యన్నట్లుగా, రెప్పపాటు లేకుండగా చూచుచుండెను.

స తం వివక్షంతమతద్విదం హరిః
జ్ఞాత్వాస్య సర్వస్య చ హృద్యవస్థితః ।
కృతాంజలిం బ్రహ్మమయేన కంబునా
పస్పర్శ బాలం కృపయా కపోలే ॥ 4

అస్య - ఈ ధ్రువునియొక్క, చ - మరియు, సర్వస్య - సకలప్రాణిలోకముయొక్క, హృది - హృదయమునందు, అవస్థితః - నిలిచియున్న, హరిః - శ్రీహరి, కృత-అంజలిమ్ - దోసిలి ఒగ్గి ఉన్నట్టియు, బాలమ్ - పిల్లవాడగు, తమ్ - ఆ ధ్రువుని, వివక్షంతమ్ - మాటలాడ గోరుచున్నవానినిగా, అతత్-విదమ్ - మాటలాడుట చేతగానివానినిగా, జ్ఞాత్వా - తెలుసుకొని, కృపయా - దయతో, బ్రహ్మమయేన - వేదరూపమగు, కంబునా - శంఖముతో, కపోలే - చెక్కిలియందు, పస్పర్శ - స్పృశించెను.

శ్రీహరి ధ్రువుని హృదయములో మాత్రమే గాక, సకలప్రాణుల బుద్ధిగుహయందు ఆత్మచైతన్యరూపుడై విరాజిల్లుచున్నాడు. ఆ ధ్రువుడు ఏదో మాటలాడగోరుచున్నాడనియు, కాని పిల్లవాడగుటచే మాటలాడుట

ఎరుగకున్నాడనియు ఆయనకు తెలిసిపోయెను. ఆయన దయతో వాని చెక్కిలిపై వేదరూపమగు శంఖముతో స్పృశించెను.

స వై తదైవ ప్రతిపద్య తాం గిరం
దైవీం పరిజ్ఞాతపరాత్మనిర్ణయః ।
తం భక్తిభావోऽభ్యగృణాదసత్వరం
పరిశ్రుతోరుశ్రవసం ధ్రువక్షితిః ॥ 5

తదా ఏవ - అదే క్షణములో, తామ్ - ఆ, దైవీమ్ - శ్రీహరిచే ఆవిర్భవింపజేయబడిన (శ్రీహరి స్వరూపమును వర్ణించే), గిరమ్ - వాక్కును (దైవీం గిరమ్ - వేదవాక్కును), వై - నిశ్చయముగా, ప్రతిపద్య - పొంది, పరిజ్ఞాతపర-ఆత్మనిర్ణయః - చక్కగా తెలియబడిన పరమాత్మయొక్క స్వరూపము గల, ధ్రువక్షితిః - స్థిరమగు స్థానము గల, సః - ఆ ధ్రువుడు, భక్తిభావః - భక్తితో నిండిన భావము గలవాడై, అసత్వరమ్ - తొందరపాటు లేని విధముగా, పరిశ్రుత-ఉరుశ్రవసమ్ - సర్వత్రా వ్యాపించియుండే గొప్ప కీర్తిగల, తమ్ - ఆ శ్రీహరిని, అభ్యగృణాత్ - స్తుతించెను.

అదే క్షణములో ధ్రువునకు శ్రీహరిని ప్రతిపాదించే వేదవాణి శ్రీహరి అనుగ్రహము చేతనే ఆవిష్కృతమయ్యెను. ఆతనికి పరమాత్మ యొక్క స్వరూపము పూర్ణముగా తెలిసెను. ఆతడు ధ్రువమగు స్థానమును పొందబోవుచున్నాడు. అట్టి ధ్రువుడు తొందరపాటు లేనివాడై భక్తితో నిండిన హృదయముతో భగవానుని స్తుతించెను. శ్రీహరి భగవానుని గొప్ప కీర్తి సర్వత్రా (వేదములలో, లోకములలో) వ్యాపించియుండును గదా!

ధ్రువ ఉవాచ ।

యోऽంతః ప్రవిశ్య మమ వాచమిమాం ప్రసుప్తాం
సంజీవయత్యఖిలశక్తిధరస్స్వధామ్నా ।
అన్యాంశ్చ హస్తచరణశ్రవణత్వగాదీన్
ప్రాణాన్నమో భగవతే పురుషాయ తుభ్యమ్ ॥ 6

అఖిలశక్తిధరః - సకలశక్తులను ధరించియుండే, యః - ఏ భగవానుడు, అంతః - హృదయమునందు, ప్రవిశ్య - ప్రవేశించి, ప్రసుప్తామ్ - గట్టిగా నిద్రించియున్న, మమ - నా, ఇమామ్ - ఈ, వాచమ్ - వాక్కును, అన్యాన్ - ఇతరములగు, హస్తచరణశ్రవణత్వక్-ఆదీన్ - చేతులు కాళ్లు చెవులు చర్మము మొదలగు, ప్రాణాన్ చ - ఇంద్రియములను కూడా, స్వధామ్నా - తన తేజస్సుచే, సంజీవయతి - పునరుజ్జీవింప జేయుచున్నాడో, భగవతే - భగవానుడవగు, పురుషాయ - పూర్ణుడవగు (అంతర్యామివగు), తుభ్యమ్ - నీ కొరకు, నమః - నమస్కారము.

ధ్రువుడు ఇట్లు పలికెను --- ఓ భగవానుడా! నీవు సకలశక్తులను ధరించియున్న పూర్ణ పురుషుడవు. నీవే నా హృదయములో ప్రవేశించి అంతర్యామివై, గట్టిగా నిద్రించియున్న నా ఈ వాక్కును, మరియు చేతులు కాళ్లు చెవులు చర్మము మొదలగు ఇతర-ఇంద్రియములను నీ చైతన్యజ్యోతిచే పునరుజ్జీవింప జేయుచున్నావు. నీకు నమస్కారము.

ఏకస్త్వమేవ భగవన్నిదమాత్మశక్త్యా
మాయాఖ్యయోరుగుణయా మహదాద్యశేషమ్ ।
సృష్ట్వాఽనువిశ్య పురుషస్తదసద్గుణేషు
నానేవ దారుషు విభావసువద్విభాసి ॥ 7

భగవన్ - ఓ భగవానుడా!, త్వమ్ - నీవు, ఏకః ఏవ - ఒక్కడివే, ఉరుగుణయా - మూడు గుణములు గల, మాయా-ఆఖ్యయా - మాయ అనే పేరు గల, ఆత్మశక్త్యా - నీ శక్తిచే, మహత్-ఆది - మహత్తత్త్వము మొదలగు, అశేషమ్ - సకలమును, సృష్ట్వా - సృష్టించి, పురుషః - అంతర్యామివై, అనువిశ్య - తరువాత వాటిలో ప్రవేశించి, తత్-అసత్-గుణేషు - ఆ మాయాశక్తియొక్క అసత్ (మిథ్యా) రూపములగు గుణకార్యములయందు, దారుషు - కట్టెలయందు, విభావసువత్ - అగ్నివలె, నానా ఇవ - అనేకము వలె, విభాసి - ప్రకాశించుచున్నావు.

ఓ భగవానుడా! అద్వితీయుడవగు నీ శక్తికి మాయ అని పేరు. అది సత్త్వము, రజస్సు, తమస్సు అనే మూడు గుణములను కలిగియున్న

ది. మహత్తత్త్వము (సమష్టిబుద్ధిశక్తి) తో మొదలిడి స్థూలభూతముల వరకు గల తత్త్వములనన్నింటినీ నీవు ఆ మాయాశక్తిచేతనే సృజించుచున్నావు. ఆ తత్త్వముల పరిణామమే ఈ జగత్తు. మాయాశక్తియొక్క గుణముల పరిణామము చేతనే ఈ జగత్తులోని పదార్థములన్నియు ఆవిర్భవించినవి. కాని, ఈ జగత్తునకు సత్తాస్ఫూర్తిరూపముగా అంతర్యామివై నీవే ఉనికిని కలిగించుచున్నావు. స్వతంత్రమగు సత్తాస్ఫూర్తులు లేని ఈ జగత్తు మిథ్య. అట్టి ఈ నానారూపమగు జగత్తులో అద్వితీయుడవైన నీవే, కట్టెలలో నిప్పు వలె, అనేకరూపములలో ప్రకాశించుచున్నావు.

త్వద్దత్తయా వయునయేదమచష్ట విశ్వం
సుప్తః ప్రబుద్ధ ఇవ నాథ భవత్ప్రపన్నః ।
తస్యాఽపవర్గ్యశరణం తవ పాదమూలం
విస్మర్యతే కృతవిదా కథమార్తబంధో ॥ 8

ఆర్తబంధో - ఆపదలోనున్నవారలకు రక్షకుడా!, నాథ - ఓ ప్రభూ!, త్వత్-దత్తయా - నీచే ఈయబడిన, వయునయా - జ్ఞానముచే, భవత్-ప్రపన్నః - నిన్ను శరణు పొందినవాడు, ఇదమ్ - ఈ, విశ్వమ్ - జగత్తును, సుప్తః - నిద్రించినవాడు, ప్రబుద్ధః ఇవ - మేల్కాంచినవాడు వలె, అచష్ట - చూచెను, తస్య - అట్టి, తవ - నీ, ఆపవర్గ్యశరణమ్ - మోక్షకాములకు శరణు పొందదగిన, పాదమూలమ్ - పాదమూలము, కృతవిదా - చేసిన ఉపకారమును గుర్తించువానిచే, కథమ్ - ఏ విధముగా, విస్మర్యతే - విస్మరించబడును?

ఆపదలలోనున్నవారిని రక్షించే ఓ జగన్నాథా! నిద్రించిన వ్యక్తి మేల్కాంచిన వెంటనే ఈ జగత్తును కనుచున్నాడు. అదే విధముగా, సర్వజనులు ఈ జగత్తును చూడగల్గుచున్నారు. అట్లు చూడగల్గుటకు కారణము నీవు ఆత్మచైతన్యరూపుడవై ఇంద్రియములను, బుద్ధిని ప్రకాశింపజేయుటయే. (బ్రహ్మగారు నీవు ఇచ్చిన జ్ఞానము చేతనే ఈ విశ్వమును చూచినాడు). ఇట్లు మానవుడు ఆత్మరూపుడవగు నిన్ను ఆశ్రయించియే జగత్తును చూడగల్గుచున్నాడు. చేసిన ఉపకారమును గుర్తించే స్వభావము గల వివేకి, అంతర్యామివై తనకు సత్తాస్ఫూర్తులను కలుగచేయుచున్న

నీయొక్క పాదమూలమును ఎట్లు విస్మరించ గల్గును? మోక్షమును కోరు భక్తులు నీ పాదమూలమును శరణు పొందెదరు.

నూనం విమృష్టమతయస్తవ మాయయా తే
యే త్వాం భవాప్యయవిమోక్షణమన్యహేతోః ।
అర్చంతి కల్పకతరుం కుణపోపభోగ్య-
మిచ్ఛంతి యత్ స్పర్శజం నిరయేఽపి నృణామ్ ॥ 9

తే - వారు, తవ - నీ, మాయయా - మాయచే, విమృష్టమతయః - మోహింపజేయబడిన చిత్తములు గలవారు, నూనమ్ - నిశ్చయము, యే - ఎవరైతే, భవ-అప్యయవిమోక్షణమ్ - జన్మమరణములనుండి విముక్తిని ఇచ్చునట్టియు, కల్పకతరుమ్ - కల్పవృక్షము అగు, త్వామ్ - నిన్ను, అన్యహేతోః - ఇతరప్రయోజనము నిమిత్తముగా, అర్చంతి - పూజించుచున్నారో, కుణప-ఉపభోగ్యమ్ - శవమువంటి శరీరముచే భోగించబడే, స్పర్శజమ్ - ఇంద్రియవిషయసంయోగము వలన పుట్టే సుఖమును, ఇచ్ఛంతి - కోరుచున్నారు, యత్ - ఏ సుఖము, నృణామ్ - మానవులకు, నిరయే అపి - నరకమునందు కూడ గలదో.

నీవు కల్పవృక్షమువంటి వాడవు. నీవు భక్తులకు జన్మమరణముల నుండి మోక్షమును అనుగ్రహించెదవు. కాని, కొందరు నీ మాయచే మోహింపజేయబడిన చిత్తములు గలవారై ఇతరములగు ప్రయోజనముల కొరకు నిన్ను పూజించుచున్నారు. వారు ఈ శవము వంటి శరీరముచే అనుభవించబడే ఇంద్రియవిషయసంయోగజన్యమగు సుఖములను కోరుచున్నారు. ఇట్టి సుఖములు మానవులకు నరకమునందు కూడ కొద్దో గొప్పో లభించును.

యా నిర్వృతిస్తనుభృతాం తవ పాదపద్మ-
ధ్యానాద్భవజ్జనకథాశ్రవణేన వా స్యాత్ ।
సా బ్రహ్మణి స్వమహిమన్యపి నాథ మా భూత్
కిం త్వంతకాసిలులితాత్పతతాం విమానాత్ ॥10

నాథ - ఓ ప్రభూ!, తవ - నీ, పాదపద్మధ్యానాత్ - పద్మముల వంటి పాదములను ధ్యానించుట వలన, వా - లేక, భవత్-జనకథాశ్రవణాత్ - నీ భక్తులతో గూడి నీ గాథలను వినుటచే, తనుభృతామ్ - దేహధారుల కు, యా - ఏ, నిర్వృతిః - ఆనందము, స్యాత్ - కలుగునో, సా - అట్టి ఆనందము, స్వమహిమని - స్వయంప్రకాశస్వరూపమగు, బ్రహ్మణి అపి - పరబ్రహ్మయందైననూ, మా భూత్ - కలుగదు, అంతక-అసిలులితాత్ - మృత్యువుయొక్క కత్తియగు కాలముచే ఖండించబడిన, విమానాత్ - విమానమునుండి, పతతాం తు - పడిపోవుచున్నవారలకైతే, కిమ్ - చెప్పే దేమున్నది?

ఓ ప్రభూ! మానవులకు నీ పాదపద్మములను ధ్యానించుట వలన, నీ భక్తులతో గూడి నీ గాథలను శ్రవణము చేయుట వలన కలిగే ఆనందము స్వయంప్రకాశస్వరూపమగు పరబ్రహ్మయందైననూ లేదు. అనగా, ఈ ఆనందము బ్రహ్మానందము కంటె గొప్పది. అట్లైనచో, స్వర్గములో విమాన ములో సంచరించే పుణ్యాత్ముల పుణ్యమును కాలము అనే కత్తి ఛేదించివే యగా, అక్కడనుండి వారు భూలోకమునకు పడిపోవుదురు (భూలోక ములో జన్మించెదరు). అట్టివారికి ఈ ఆనందము కలుగదని వేరుగా చెప్ప వలయునా?

భక్తిం ముహుః ప్రవహతాం త్వయి మే ప్రసంగో
భూయాదనంత మహతామమలాశయానామ్ ।
యేనాంజసోల్బణమురువ్యసనం భవాబ్ధిం
నేష్యే భవద్గుణకథాఽమృతపానమత్తః ॥ 11

అనంత - ఓ అనంతుడా!, త్వయి - నీయందు, ముహుః - నిరం తరముగా, భక్తిమ్ - భక్తిని, ప్రవహతామ్ - ప్రవాహరూపముగా చేయుచు న్న, అమల-ఆశయానామ్ - పరిశుద్ధమగు అంతఃకరణము గల, మహ తామ్ - మహాత్ముల, ప్రసంగః - గొప్ప సంగము, మే - నాకు, భూయాత్ - కలుగుగాక!, యేన - ఏ సాధుసంగముచే, భవత్-గుణకథా-అమృతపాన మత్తః - నీ గుణముల వర్ణనము అనే అమృతమును పానము చేయుటచే మహానందమును పొందిన నేను, ఉరువ్యసనమ్ - పెద్ద ఆపదలు గల,

ఉల్బణమ్ - భయంకరమైన, భవ-అబ్ధిమ్ - సంసార సముద్రమును, అంజసా - తేలికగా, నేష్యే - తరించగలను.

ఓ అనంతా! పరిశుద్ధమగు అంతఃకరణము గల మహాత్ములు నిరంతరము తమ మనోవృత్తుల ప్రవాహమును నీయందు లగ్నము చేసి భక్తిని చేయుదురు. అట్టి మహాత్ముల గొప్ప సంగము నాకు లభించుగాక! అట్టి మహాత్ములు నీ గుణములను వర్ణించుచుండగా, ఆ అమృతమును పానము చేసి, నేను మహానందమును పొందుచున్నవాడనై, పెద్ద ఆపదలతో కూడియున్న భయంకరమగు ఈ సంసార సముద్రమును తేలికగా దాటివేయగలను.

తే న స్మరంత్యతితరాం ప్రియమీశ మర్త్యం
యే చాన్వదస్సుతసుహృద్గృహవిత్తదారాః ।
యే త్వబ్జనాభ భవదీయపదారవింద-
సౌగంధ్యలుబ్ధహృదయేషు కృతప్రసంగాః ।। 12

ఈశ - ఓ ప్రభూ! అబ్జనాభ - పద్మము నాభియందు గలవాడా!, తే - వారు, అతితరామ్ - మిక్కిలి, ప్రియమ్ - ప్రియమగు, మర్త్యమ్ - దేహమును, చ - మరియు, యే - ఏ, అదః - ఈ దేహమును, అను - అనుసరించి వచ్చే, సుతసుహృత్-గృహవిత్తదారాః - సంతానము మిత్రులు ఇల్లు ధనము భార్య (లేక భర్త) అనునవి గలవో వాటిని, న స్మరంతి - స్మరించరు, యే తు - ఎవరైతే, భవదీయపద-అరవిందసౌగంధ్యలుబ్ధహృదయేషు - నీ పద్మములవంటి పాదముల పరిమళముచే ఆకర్షితమైన హృదయము గలవారియందు, కృతప్రసంగాః - చేయబడిన గొప్ప సంగము గలవారో.

ఓ పద్మనాభా! నీవే నా ప్రభుడవు. పద్మములవంటి నీ పాదముల పరిమళముచే ఆకర్షితమైన హృదయము గల నీ భక్తులతోడి సంగము చాల గొప్పది. అట్టి సంగమును చేయువారు, మిక్కిలి ప్రియమైననూ నశించే స్వభావము గల ఈ దేహమును గాని, దానిని బట్టి వచ్చే సంతానము మిత్రులు ఇల్లు ధనము భార్య (లేక భర్త) అనువాటిని గాని స్మరించరు.

తిర్యఙ్నగద్విజసరీసృపదేవదైత్య-
మర్త్యాదిభిః పరిచితం సదసద్విశేషమ్ ।
రూపం స్థవిష్ఠమజ తే మహదాద్యనేకం
నాతః పరం పరమ వేద్మి న యత్ర వాదః ।। 13

అజ - పుట్టుక లేనివాడా!, పరమ - ఓ పరమేశ్వరా!, తిర్యక్-నగద్విజసరీసృపదేవదైత్యమర్త్య-ఆదిభిః - పశువులు చెట్లు పక్షులు పాములు దేవతలు రాక్షసులు మానవులు మొదలగు ప్రాణులచే, పరిచితమ్ - వ్యాప్తమైనట్టియు, సత్-అసత్-విశేషమ్ - స్థూలపంచభూతములు మరియు సూక్ష్మభూతములు అనే నానాత్వము గలిగినట్టియు, మహత్-ఆది-అనేకమ్ - మహత్తత్త్వము మొదలగు అనేక తత్త్వములు గలిగిన, తే - నీ, స్థవిష్ఠమ్ - స్థూలమగు, రూపమ్ - విరాడ్రూపమును, వేద్మి - తెలియుచున్నాను, అతః - దీనికంటె, పరమ్ - అతీతమైన పరబ్రహ్మస్వరూపమును, న వేద్మి - తెలియకున్నాను, యత్ర - దేనియందైతే, వాదః - శబ్దప్రవృత్తి, న - లేదో.

ఓ పరమేశ్వరా! నీకు పుట్టుక లేదు. నీ ఈ స్థూలమగు విరాడ్రూపము పశువులు, చెట్లు, పక్షులు, పాములు, దేవతలు, రాక్షసులు, మానవులు మొదలగు ప్రాణులతో నిండియున్నది. దీనియందు స్థూలపంచభూతములు (పృథివి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశము), సూక్ష్మభూతములు (గంధము, రసము, రూపము, స్పర్శ, శబ్దము) అనే తేడాలు కనబడును. మరియు, మహత్తత్త్వము మొదలగు కారణతత్త్వములన్నియు ఈ విరాడ్రూపములో అంతర్గతమగుచున్నవి. నేను ఈ విరాడ్రూపమును గురించి మాత్రమే తెలుసుకున్నాను. దీనికి అతీతమైన నిర్గుణ పరబ్రహ్మ తత్త్వమును నేను యెరుగను. ఆ తత్త్వము వాక్కులకు గాని, ఊహకు గాని అందదు గదా!

కల్పాంత ఏతదఖిలం జఠరేణ గృహ్ణన్
శేతే పుమాన్ స్వదృగనంతసఖస్తదంకే ।

యన్నాభిసింధురుహకాంచనలోకపద్మ-
గర్భే ద్యుమాన్ భగవతే ప్రణతోఽస్మి తస్మై ॥ 14

కల్ప-అంతే - కల్పము అంతము కాగా, ఏతత్ - ఈ, అఖిలమ్ - సర్వమును, జఠరేణ - ఉదరముచే, గృహ్ణన్ - స్వీకరించువాడై, స్వదృక్ - స్వయంప్రకాశ స్వరూపుడైనట్టియు, అనంతసఖః - ఆదిశేషుడే తోడుగా గలిగినట్టియు, పుమాన్ - ఆది పురుషుడగు శ్రీహరి, తత్-అంకే - ఆ శేషుని ఒడియందు, శేతే - నిద్రించును, యత్-నాభిసింధురుహకాంచన లోకపద్మగర్భే - ఏ శ్రీహరియొక్క నాభి అనే సముద్రమునందు ఉదయించిన బంగరు ముల్లోకముల రూపమైన పద్మముయొక్క గర్భమునందు, ద్యుమాన్ - కాంతిమంతుడగు బ్రహ్మ (ఉదయించెనో), తస్మై - అట్టి, భగవతే - భగవానుని కొరకు, ప్రణతః అస్మి - నమస్కరించుచున్నాను.

కల్పము అంతమైనప్పుడు, ఆదిపురుషుడు, స్వయంప్రకాశ స్వరూపుడు అగు శ్రీహరి ఈ సకలజగత్తును తన ఉదరములోనిడుకొని, ఆదిశేషుడే తోడు కాగా, ఆయన ఒడిలో యోగనిద్రను పొందును. సముద్రమువంటి ఆయన నాభినుండి ముల్లోకములు బంగరు పద్మము రూపములో ఉదయించును. ఆ పద్మము మధ్యలో గొప్ప కాంతి గల బ్రహ్మ ప్రకటమగును. అట్టి శ్రీహరి భగవానుని నేను నమస్కరించుచున్నాను.

త్వం నిత్యముక్తపరిశుద్ధవిబుద్ధ ఆత్మా
కూటస్థ ఆదిపురుషో భగవాంస్త్ర్యధీశః ।
యద్బుద్ధ్యవస్థితిమఖండితయా స్వదృష్ట్యా
ద్రష్టా స్థితావధిమఖో వ్యతిరిక్త ఆస్సే ॥ 15

త్వమ్ - నీవు, నిత్యముక్తపరిశుద్ధవిశుద్ధః - సర్వకాలములలో విముక్తము మిక్కిలి శుద్ధము మరియు జ్ఞానస్వరూపము, కూటస్థః - వికారములు లేనిది అగు, ఆత్మా - ఆత్మవు, ఆదిపురుషః - సర్వకారణుడవు పూర్ణుడవు, భగవాన్ - భగవానుడవు, త్రి-అధి-ఈశః - ముల్లోకములకు (మూడు గుణములకు) శాసకుడవు, యత్ - ఏలయనగా, బుద్ధి-అవస్థితిమ్ - బుద్ధియొక్క అవస్థను, అఖండితయా - ఖండితము కాని, స్వదృష్ట్యా -

తన చైతన్యప్రకాశముచే, ద్రష్టా - దర్శించే సాక్షివి, స్థితౌ - స్థితికాలమునం దు, అధిమఖః - యజ్ఞమునకు అధిష్ఠానమవు, వ్యతిరిక్తః - జగత్తుకంటె విల క్షణుడవై, ఆస్సే - ఉన్నావు.

నిత్యముక్తము, నిత్యశుద్ధము, నిత్యబుద్ధము మరియు నిర్వికా రము అగు ఆత్మ నీవే. నీవు సర్వజగత్కారణుడవు, పూర్ణుడవు, షడ్గుణైశ్వ ర్యసంపన్నుడవు, త్రిగుణాత్మికయగు ప్రకృతికి అధిష్ఠానమవు, ముల్లోకము లకు నాథుడవు. నీవు జీవుని బుద్ధియొక్క వేర్వేరు అవస్థలకు సాక్షిగా ఉండే చైతన్యమవు. నీ స్వయంప్రకాశ చైతన్యము ఏకరసము (ఖండములు లేనిది). స్థితి కాలములో నీవు యజ్ఞమునకు అధిష్ఠాన దైవమవు. నీవు నీయందు ప్రకాశించే వినాశియగు జగత్తుకంటె విలక్షణుడవు.

యస్మిన్ విరుద్ధగతయో హ్యనిశం పతంతి
విద్యాదయో వివిధశక్తయ అనుపూర్వ్యాత్ ।
తద్బ్రహ్మ విశ్వభవమేకమనంతమాద్య-
మానందమాత్రమవికారమహం ప్రపద్యే ॥ 16

విరుద్ధగతయః - పరస్పరవిరుద్ధమగు స్వభావములు గల, విద్యా- ఆదయః - విద్య మొదలగు, వివిధశక్తయః - వివిధములగు శక్తులు, అని శమ్ - నిరంతరముగా, అనుపూర్వ్యాత్ - ఒకదాని తరువాత ఒకటిగా, యస్మిన్ - ఏ పరబ్రహ్మయందు, పతంతి - అకస్మాత్తుగా ఉద్భవించుచు న్నవో, తత్ - అట్టి, విశ్వభవమ్ - జగత్తునకు పుట్టుకస్థానమైనట్టియు, ఏకమ్ - రెండవది లేనట్టియు, అనంతమ్ - అంతము లేనట్టియు, ఆద్యమ్ - సర్వకారణమైనట్టియు, ఆనందమాత్రమ్ - ఆనందఘనమైనట్టియు, అవి కారమ్ - వికారములు లేని, బ్రహ్మ - పరబ్రహ్మను, అహమ్ - నేను, ప్రపద్యే - శరణు పొందుచున్నాను.

పరస్పర విరుద్ధములగు విద్య-అవిద్య, సృష్టి-ప్రళయము మొద లగు వివిధశక్తులు నిరంతరముగా ఒకదాని తరువాత మరియొకటిగా ఆ అద్వయ పరబ్రహ్మయందు అకస్మాత్తుగా ఉద్భవించుచుండును. కాలపరి చ్ఛేదము లేని పరబ్రహ్మనుండియే ఈ జగత్తు పుట్టినది. ఆనందఘనమగు

ఆ పరబ్రహ్మ వికారములేమియు లేకుండగనే సర్వకారణమగుచున్నది. అట్టి పరబ్రహ్మను నేను శరణు పొందుచున్నాను.

సత్యాఽఽశిషో హి భగవంస్తవ పాదపద్మ-
మాశీస్తథాఽనుభజతః పురుషార్థమూర్తేః ।
అప్యేవమార్య భగవాన్ పరిపాతి దీనాన్
వాశ్రేవ వత్సకమనుగ్రహకాతరోఽస్మాన్ ॥ 17

భగవన్ - ఓ భగవానుడా!, తథా - ఆ విధముగా, అనుభజతః - సేవించుచున్న వ్యక్తికి, పురుష-అర్థమూర్తేః - సర్వమానవులచే కోరబడే ఆనందమే స్వరూపముగాగల, తవ - నీ, పాదపద్మమ్ - పద్మమువంటి పాదము, ఆశిషః - ఇతరఫలము కంటె, సత్యా - యథార్థమగు, ఆశీః - ఫలము, హి - నిశ్చయము, ఆర్య - ఓ మహానుభావా!, అపి ఏవమ్ - వస్తుస్థితి ఇట్లు ఉన్నప్పటికీ, అనుగ్రహకాతరః - అనుగ్రహించాలనే తహ తహ గల, భగవాన్ - భగవానుడు (నీవు), వాశ్రా - కొత్తగా ఈనిన ఆవు, వత్సకం ఇవ - దూడను వలె, దీనాన్ - దీనులమగు, అస్మాన్ - మమ్ముల ను, పరిపాతి - అన్ని విధములుగా రక్షించుచున్నాడు (వు).

ఓ భగవానుడా! సర్వమానవులచే కోరబడే ఆనందమునకు నీ పద్మమువంటి పాదమే నిధానము. నిన్ను నిష్కామభావనతో సేవించు వ్యక్తికి, పదోన్నతి మొదలగు ఇతరఫలములకంటె, నీ పద్మమువంటి పాదమును సేవించుటయే యథార్థమగు ఫలము అగుచున్నది. (భగవద్భక్తికి ఫలము భగవానుడే). అయిననూ, ఓ మహానుభావా! భగవానుడవగు నీవు భక్తులననుగ్రహించుటకు తహతహలాడుచుందువు. కొత్తగా ఈనిన ఆవు దూడను కాపాడు విధముగా, నీవు దీనులమగు మమ్ములను అన్ని విధములుగా కాపాడుచున్నావు.

మైత్రేయ ఉవాచ ।
అథాభిష్టుత ఏవం వై సత్సంకల్పేన ధీమతా ।
భృత్యానురక్తో భగవాన్ ప్రతినంద్యేదమబ్రవీత్ ॥ 18

**అథ** - తరువాత, ఏవమ్ - ఈ విధముగా, సత్-సంకల్పేన - మంచి సంకల్పశక్తిగల, ధీమతా - బుద్ధిమంతుడగు ధ్రువునిచే, అభిష్టుతః - స్తుతించబడినట్టియు, భృత్య-అనురక్తః - సేవకునియందు అనురాగము గల, భగవాన్ - శ్రీహరి భగవానుడు, ప్రతినంద్య - అభినందించి, ఇదమ్ - ఈ మాటను, అబ్రవీత్ - పలికెను.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను -- ధ్రువుడు శుభకరమైన సంకల్పశక్తి గల బుద్ధిమంతుడు. ఆతడు ఈ విధముగా స్తుతించిన తరువాత, భక్తవత్సలుడగు శ్రీహరి భగవానుడు ఆతనిని అభినందిస్తూ ఇట్లు పలికెను.

శ్రీభగవానువాచ ।
వేదాహం తే వ్యవసితం హృది రాజన్యబాలక ।
తత్ప్రయచ్ఛామి భద్రం తే దురాపమపి సువ్రత ।। 19

రాజన్యబాలక - ఓ రాజకుమారా!, తే - నీ, హృది - హృదయమునందలి, వ్యవసితమ్ - నిశ్చయమును, అహమ్ - నేను, వేద - ఎరుగుదును, సువ్రత - గొప్ప వ్రతనిష్ఠ గలవాడా!, తే - నీ కొరకు, భద్రమ్ - మంగళమగు గాక!, దురాపం అపి - పొంద శక్యము కానిదే అయిననూ, తత్ - దానిని, ప్రయచ్ఛామి - ఇచ్చుచున్నాను.

శ్రీహరి భగవానుడు ఇట్లు పలికెను --- ఓ రాజకుమారా! నీవు ఉత్తమమగు వ్రతనిష్ఠ గలవాడవు. నీ హృదయములోనున్న నిశ్చయము నాకు తెలియును. నీవు కోరేది పొంద శక్యము కానిదే అయినా, నీకు ఇచ్చెదను. నీకు మంగళమగు గాక!

నాన్యైరధిష్ఠితం భద్ర యద్భ్రాజిష్ణు ధ్రువక్షితి ।
యత్ర గ్రహర్క్షతారాణాం జ్యోతిషాం చక్రమాహితమ్ ।
మేఢ్యాం గోచక్రవత్ స్థాస్ను పరస్తాత్కల్పవాసినామ్ ।। 20

భద్ర - కల్యాణగుణములు గలవాడా!, యత్ - ఏ లోకము, అన్యైః - ఇతరులచే, అధిష్ఠితమ్ - అధిష్ఠించబడినది, న - కాదో, భ్రాజిష్ణు - ప్రకాశించునది, ధ్రువక్షితి - శాశ్వతమగు నివాసము గలది, యత్ర - ఎక్కడనై

తే, గ్రహ-ఋక్షతారాణామ్ - గ్రహములు నక్షత్రములు తారలు అనే, జ్యోతిషామ్ - ప్రకాశమండలముల, చక్రమ్ - చక్రము, మేఢ్యామ్ - రాట యందు, గోచక్రవత్ - గోవుల సమూహము వలె, ఆహితమ్ - నిబద్ధమై యున్నదో, కల్పవాసినామ్ - కల్పమునకు లోబడి పుణ్యలోకములలో నివసించు పుణ్యాత్ములకు, పరస్తాత్ - తరువాతి కాలములో కూడ, స్థాస్ను - నిలిచియుండునది.

కల్యాణగుణములు గల ఓ ధ్రువా! నీవు పొందబోయే లోకము ఉజ్జ్వలముగా ప్రకాశించును. దానిని ఇతరులు అధిరోహించలేరు. నీవు అచట శాశ్వతముగా నివసించగలవు. గ్రహములు, నక్షత్రములు, తారాగణములు, గడ్డినూర్చేటప్పుడు కర్ర చుట్టూ తిరిగే ఎద్దులవలె, ఆ లోకమునకు నిబద్ధములై యుండును. కల్పములోపల తిరిగి భూలోకములో జన్మించే పుణ్యాత్ములు ఊర్ధ్వలోకములనుండి మరలి వచ్చుచుందురు. కాని, నీకు ఈ లోకము కల్పాంతము వరకు నిలిచియుండును.

ధర్మోఽగ్నిః కశ్యపశ్శుక్రో మునయో యే వనౌకసః ।
చరంతి దక్షిణీకృత్య భ్రమంతో యత్సతారకాః ॥ 21

ధర్మః - ధర్ముడు, అగ్నిః - అగ్ని, కశ్యపః - కశ్యపుడు, శుక్రః - శుక్రుడు, వన-ఓకసః - వానప్రస్థులగు, మునయః - మహర్షులు, యే - ఎవరు గలరో వారు, సతారకాః - తారాగణములతో కూడినవారై, యత్ - ఏ లోకమును, దక్షిణీకృత్య - ప్రదక్షిణము చేసి, భ్రమంతః - తిరుగుచున్నవారై, చరంతి - సంచరించెదరో.

ధర్ముడు, అగ్ని, కశ్యపుడు, శుక్రుడు, వానప్రస్థ ధర్మముచే గొప్ప పుణ్యమును సంపాదించిన సప్తర్షులు నక్షత్రరూపములో ఇతరతారాగణములతో కలిసి, ఆ లోకము చుట్టూ నిరంతరముగా ప్రదక్షిణము చేయుదురు.

ప్రస్థితే తు వనం పిత్రా దత్త్వా గాం ధర్మసంశ్రయః ।
షట్త్రింశద్వర్షసాహస్రం రక్షితాఽవ్యాహతేంద్రియః ॥ 22

గామ్ - భూమిని, దత్త్వా - ఇచ్చి, పిత్రా - తండ్రిచే, వనమ్ - వనమును గురించి, ప్రస్థితే - వెళ్లబడగా, అవ్యాహత-ఇంద్రియః - పరస్పరవిరుద్ధములు కాని ఇంద్రియములు గల (నశించని ఇంద్రియములు గల) నీవు, ధర్మసంశ్రయః - ధర్మమే ఆశ్రయముగా గలవాడవై, షట్-త్రింశత్-వర్షసాహస్రమ్ - ముప్పది ఆరు వేల సంవత్సరములు, రక్షితా - రక్షించగలవు.

తండ్రి నీకు రాజ్యమునప్పజెప్పి వానప్రస్థమునకు వెళ్లిన తరువాత, నీవు ఆ రాజ్యమును ముప్పది ఆరు వేల సంవత్సరములు రక్షించెదవు. నీవు ధర్మమును ఖచ్చితముగా పాలిస్తూ, ధర్మార్థకామములు అనే పురుషార్థములలో పరస్పరవిరోధము లేని విధముగా ఇంద్రియభోగములను అనుభవించెదవు. నీకు ఇంద్రియముల పాటవము కొరవడదు.

త్వద్భ్రాతర్యుత్తమే నష్టే మృగయాయాం తు తన్మనాః ।
అన్వేషంతీ వనం మాతా దావాగ్నిం సా ప్రవేక్ష్యతి ॥ 23

త్వత్-భ్రాతరి - నీ తమ్ముడగు, ఉత్తమే - ఉత్తముడు, మృగయాయామ్ - వేటయందు, నష్టే - మరణించగా, తత్-మనాః - వానియందే లగ్నమైన మనస్సు గల, సా - ఆ, మాతా తు - తల్లియైతే, వనమ్ - అడవిని, అన్వేషంతీ - వెదుకుచున్నదై, దావ-అగ్నిమ్ - కార్చిచ్చును, ప్రవేక్ష్యతి - ప్రవేశించగలదు.

నీ తమ్ముడగు ఉత్తముడు వేటలో మరణించగలడు. అతనిని మరచిపోలేని అతని తల్లియగు సురుచి అడవిలో అతనినే వెదుకుతూ, కార్చిచ్చులో ప్రవేశించి మరణించగలదు.

ఇష్ట్వా మాం యజ్ఞహృదయం యజ్ఞైః పుష్కలదక్షిణైః ।
భుక్త్వా చేహాశిషస్సత్యా అంతే మాం సంస్మరిష్యసి ॥ 24

యజ్ఞహృదయమ్ - యజ్ఞమే హృదయముగా గల, మామ్ - నన్ను, పుష్కలదక్షిణైః - పుష్కలమగు దక్షిణలు గల, యజ్ఞైః - యజ్ఞముల చే, ఇష్ట్వా - ఆరాధించి, చ - మరియు, ఇహ - ఈ లోకమునందు, సత్యాః

- ఉత్తమములగు, ఆశిషః - భోగములను, భుక్త్వా - అనుభవించి, అంతే - మరణకాలమునందు, మామ్ - నన్ను, సంస్మరిష్యసి - చక్కగా గుర్తు చేసుకొనగలవు.

యజ్ఞమే నా హృదయము. అట్టి నన్ను నీవు పుష్కలమగు దక్షిణలు గల యజ్ఞములతో ఆరాధించెదవు. ఈ లోకములో ఉత్తమమగు భోగములననుభవించి, నీవు అవసానకాలములో నన్ను చక్కగా స్మరించెదవు.

తతో గంతాసి మత్స్థానం సర్వలోకనమస్కృతమ్ ।
ఉపరిష్టాదృషిభ్యస్త్వం యతో నావర్తతే యతిః ॥ 25

తతః - తరువాత, త్వమ్ - నీవు, సర్వలోకనమస్కృతమ్ - లోకములన్నింటిచే నమస్కరించబడునట్టియు, ఋషిభ్యః - సప్తర్షులకంటె, ఉపరిష్టాత్ - పైన ఉండే, మత్-స్థానమ్ - నా లోకమును, గంతాసి - పొందగలవు, యతః - ఏ లోకమునుండైతే, యతిః - యతీశ్వరుడు, న ఆవర్తతే - తిరిగి రాడో.

తరువాత నీవు సర్వలోకములచే నమస్కరించబడే నా లోకమును చేరెదవు. అది సప్తర్షిమండలమునకు పైన గలదు. అక్కడకు యతీశ్వరులు మాత్రమే చేరెదరు. ఒకసారి అక్కడకు చేరిన పిదప, తిరిగి జన్మించుట ఉండదు.

మైత్రేయ ఉవాచ ।
ఇత్యర్చితస్స భగవానతిదిశ్యాత్మనః పదమ్ ।
బాలస్య పశ్యతో ధామ స్వమగాద్గరుడధ్వజః ॥ 26

గరుడధ్వజః - గరుడుడు ధ్వజమునందు గల, సః - ఆ, భగవాన్ - శ్రీహరి భగవానుడు, ఇతి - ఈ విధముగా, అర్చితః - పూజించబడినవాడై, ఆత్మనః - తన, పదమ్ - ధామమును, అతిదిశ్య - అనుగ్రహించి, బాలస్య - ఆ పిల్లవాడు, పశ్యతః - చూచుచుండగనే, స్వమ్ - తన, ధామ - ధామమును గురించి, అగాత్ - వెళ్లెను.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- గరుడధ్వజుడగు ఆ శ్రీహరి భగవానుడు ఈ విధముగా బాలకుడగు ధ్రువునిచే ఆరాధించబడి, అతనికి తన ధామమునను‌గ్రహించి, అతడు చూచుచుండగనే, తన ధామమునకు వెళ్లెను.

సోఽపి సంకల్పజం విష్ణోః పాదసేవోపసాదితమ్ ।
ప్రాప్య సంకల్పనిర్వాణం నాతిప్రీతోఽభ్యగాత్పురమ్ ॥ 27

సః అపి - ఆ ధ్రువుడు కూడ, విష్ణోః - శ్రీహరియొక్క, పాదసేవా -ఉపసాదితమ్ - పాదములను సేవించుటచే పొందించబడినట్టియు, సంకల్పనిర్వాణమ్ - సంకల్పముయొక్క సమాప్తి గల, సంకల్పజమ్ - మనోరథమును, ప్రాప్య - పొంది, న అతిప్రీతః - మిక్కిలి ప్రీతిని పొందనివాడై, పురమ్ - నగరమును గురించి, అభ్యగాత్ - వెళ్లెను.

శ్రీహరియొక్క పాదములను సేవించుటచే ధ్రువుని సంకల్పము పూర్ణమయ్యెను. అతని మనోరథము నెరవేరెను. కాని, అతనికి పూర్ణమగు ప్రీతి కలుగలేదు. అప్పుడు ధ్రువుడు కూడ తన నగరమునకు వెళ్లెను.

విదుర ఉవాచ ।
సుదుర్లభం యత్పరమం పదం హరేః
మాయావినస్తచ్చరణార్చనార్చితమ్ ।
లబ్ధ్వాప్యసిద్ధార్థమివైకజన్మనా
కథం స్వమాత్మానమమన్యతార్థవిత్ ॥ 28

మాయావినః - మోసగానికి, సుదుర్లభమ్ - మిక్కిలి పొంద శక్యము కానిది, పరమమ్ - సర్వోత్కృష్టమైనది, తత్-చరణ-అర్చన-అర్చితమ్ - ఆ శ్రీహరియొక్క పాదములను పూజించుటచే సంపాదించబడునది అగు, మాయావినః - మాయాధీశుడగు, హరేః - శ్రీహరియొక్క, యత్ - ఏ, పదమ్ - ధామము గలదో దానిని, ఏకజన్మనా - ఒకే జన్మతో, లబ్ధ్వా అపి - పొందినప్పటికీ, అర్థవిత్ - సారమునెరింగిన ధ్రువుడు, స్వమ్

- తన, ఆత్మానమ్ - మనస్సును, అసిద్ధ-అర్థం ఇవ - సిద్ధించని మనోర థము గలదానిని వలె, కథమ్ - ఏ విధముగా, అమన్యత - తలపోసెను?

విదురుడు ఇట్లు పలికెను --- మాయాధీశుడగు శ్రీహరియొక్క సర్వోత్కృష్టమగు ధామము మోసగాళ్లకు మిక్కిలి దుర్లభము. ఆయన పాదములను అర్చించు భక్తులకు మాత్రమే అది లభించును. సారతత్త్వము నెరింగిన ధ్రువుడు ఒకే జన్మలో ఆ ధామమును పొందినప్పటికీ, తన మనో రథము సిద్ధించలేదా యన్నట్లు తలపోయుటకు కారణమేమి?

మైత్రేయ ఉవాచ ।
మాతుస్సపత్న్యా వాగ్బాణైర్హృది విద్ధస్తు తాన్ స్మరన్ ।
నైచ్ఛన్ముక్తిపతేర్ముక్తిం తస్మాత్తాపముపేయివాన్ ॥ 29

సపత్న్యాః మాతుః - సవతి తల్లియొక్క, వాక్-బాణైః - బాణము లవంటి మాటలతో, హృది - హృదయమునందు, విద్ధః - గాయపరచబ డిన ధ్రువుడు, తాన్ - ఆ మాటలను, స్మరన్ - స్మరించుచున్నవాడై, ముక్తి పతేః - ముక్తికి అధిపతియగు శ్రీహరినుండి, ముక్తిమ్ - ముక్తిని, న ఐచ్ఛత్ - కోరలేదు, తస్మాత్ - అందువలన, తాపమ్ - దుఃఖమును, ఉపేయివాన్ - పొందినాడు.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- సవతి తల్లి ఈటెల వంటి పలుకులతో ధ్రువుని హృదయమును గాయపరచెను. అతడు ఆ పలుకు లనే స్మరిస్తూ, ముక్తిని ఇచ్చే ప్రభుడగు శ్రీహరినుండి ముక్తిని కోరలేదు. ఆ కారణముచే, ఆతడు దుఃఖించెను.

ధ్రువ ఉవాచ ।
సమాధినా నైకభవేన యత్పదం
విదుస్సనందాదయ ఊర్ధ్వరేతసః ।
మాసైరహం షడ్భిరముష్య పాదయోః
ఛాయాముపేత్యాపగతః పృథఙ్మతిః ॥ 30

న-ఏకభవేన - అనేకజన్మలలో అభ్యసించబడిన, సమాధినా - ఏకాగ్రమగు ధ్యానముచే, ఊర్ధ్వరేతసః - నైష్ఠిక బ్రహ్మచారులగు, సనంద-ఆదయః - సనకసనందనాదులు, యత్ - ఏ, పదమ్ - ధామమును, విదుః - తెలుసుకొనిరో, అముష్య - అట్టి ఈ శ్రీహరియొక్క, పాదయోః - పాదములయొక్క, ఛాయామ్ - నీడను, అహమ్ - నేను, షడ్భిః - ఆరు, మాసైః - నెలలచే, ఉపేత్య - పొంది, పృథక్-మతిః - భేదదృష్టి గలవాడనై, అపగతః - తొలగిపోతిని.

ధ్రువుడు ఇట్లు పలికెను --- సనక సనందనాది నైష్ఠిక బ్రహ్మచారులు అనేకజన్మలలో ఏకాగ్రమగు ధ్యానమునభ్యసించి, ఆ శ్రీహరి స్వరూపమును జ్ఞానముచే పొందిరి. నేను అట్టి శ్రీహరి పాదముల నీడను ఆరు నెలల తపస్సుచే చేరుకొంటిని. కాని, భేదదృష్టి (సవతి తల్లి వేరు అనే దృష్టి) గలవాడనగుటచే, దానికి మరల దూరమైతిని.

అహో బత మమానాత్మ్యం మందభాగ్యస్య పశ్యత ।
భవచ్ఛిదః పాదమూలం గత్వా యాచే యదంతవత్ ।। 31

అహో - ఆశ్చర్యము!, బత - అయ్యో!, మందభాగ్యస్య - దురదృష్టవంతుడనగు, మమ - నా, అనాత్మ్యమ్ - మూర్ఖత్వమును, పశ్యత - చూడుడు, భవ-ఛిదః - సంసారమును తొలగించే శ్రీహరియొక్క, పాదమూలమ్ - పాదముల మూలమును, గత్వా - చేరుకొని, యత్ - ఏది, అంతవత్ - వినాశము గలదియో దానిని, యాచే - కోరినాను.

ఆశ్చర్యము! దురదృష్టవంతుడనగు నా మూర్ఖత్వమును కనుడు. అయ్యో! నేను సంసారమును తొలగించే శ్రీహరి పాదమూలమును చేరుకొంటిని. కాని, వినష్టమయ్యే పదవిని మాత్రమే కోరుకుంటిని.

మతిర్విదూషితా దేవైః పతద్భిరసహిష్ణుభిః ।
యో నారదవచస్తథ్యం నాగ్రాహిషమసత్తమః ।। 32

పతద్భిః - నాకంటె తక్కువ స్థానమునందున్నట్టియు (పుణ్యము ఖర్చు కాగానే క్రిందకు పడబోవునట్టియు), అసహిష్ణుభిః - ఓర్వలేనిదనము

గల, దేవైః - దేవతలచే, మతిః - బుద్ధి, విదూషితా - కలుషితము చేయబ డినది, అసత్-తమః - మిక్కిలి అయోగ్యుడవగు, యః - ఏ నేను, తథ్యమ్ - సత్యమగు, నారదవచః - నారదుని మాటను, న అగ్రాహిషమ్ - స్వీకరిం చకపోతినో.

దేవతలు నేను పొందబోయే లోకముకంటె తక్కువ స్థానమునం దుండెదరు. పైగా, పుణ్యము ఖర్చు కాగానే వారి స్వర్గలోకనివాసము అంత మగును. కావుననే, నా అభివృద్ధిని చూచి ఓర్వలేక, వారు నా బుద్ధిని కలు షితము చేసినారు. అందువలననే, మిక్కిలి అయోగ్యుడనగు నేను నారద మహర్షియొక్క యథార్థవచనమును చెవిని పెట్టనైతిని.

దైవీం మాయాముపాశ్రిత్య ప్రసుప్త ఇవ భిన్నదృక్ ।
తప్యే ద్వితీయేఽప్యసతి భ్రాతృభ్రాతృవ్యహృద్రుజా ॥ 33

దైవీమ్ - శ్రీహరియొక్క, మాయామ్ - మాయను, ఉప-ఆశ్రిత్య - ఆశ్రయించి, ప్రసుప్తః ఇవ - నిద్రపోవుచున్నవాడు వలె, ద్వితీయే - రెండ వది, అసతి అపి - లేకున్ననూ, భిన్నదృక్ - భిన్నమును చూచువాడనై, భ్రాతృభ్రాతృవ్యహృత్-రుజా - సోదరుడే శత్రువు అనే హృదయమునం దలి పీడచే, తప్యే - తాపమును పొందుచున్నాను.

నేను శ్రీహరి మాయచే మోహితుడనైతిని. నిద్రించుచున్న వ్యక్తి స్వప్నములో రెండవది లేకున్ననూ తనకంటె ఇతరము ఉన్నదని దర్శించు ను. అదే విధముగా వాస్తవముగా ఆత్మకంటె భిన్నముగా ఏదియు లేకున్న నూ, నేను తమ్ముడే శత్రువు అనే హృదయపీడతో తాపమును పొందుచు న్నాను.

మయైతత్ప్రార్థితం వ్యర్థం చికిత్సేవ గతాయుషి ।
ప్రసాద్య జగదాత్మానం తపసా దుష్ప్రసాదనమ్ ।
భవచ్ఛిదమయాచేఽహం భవం భాగ్యవివర్జితః ॥ 34

గత-ఆయుషి - గతించిన ఆయువు గలవానియందు, చికిత్సా ఇవ - వైద్యుని చికిత్స వలె, మయా - నాచే, ప్రార్థితమ్ - కోరబడిన, ఏతత్

- ఇది, వ్యర్థమ్ - వ్యర్థము, జగత్-ఆత్మానమ్ - జగత్తునకు ఆత్మ (స్వరూపము) యైనవట్టియు, దుః-ప్రసాదనమ్ - ప్రసన్నుని చేసుకొనుట కఠినమైనట్టియు, భవ-ఛిదమ్ - సంసారమును తొలగించు శ్రీహరిని, తపసా - తపస్సుతో, ప్రసాద్య - ప్రసన్నునిగా చేసుకొని, భాగ్యవివర్జితః - భాగ్యముచే విడిచిపెట్టబడిన, అహమ్ - నేను, భవమ్ - సంసారమును, అయాచే - కోరితిని.

నేను కోరిన ఈ కోరిక మరణించినవానికి చికిత్స వలె వ్యర్థము. జగత్తునకు ఆత్మయగు శ్రీహరిని ప్రసన్నుని చేసుకొనుట చాల కఠినము. సంసారమును తొలగించే అట్టి శ్రీహరిని నేను తపస్సుచే ప్రసన్నునిగా చేసుకొంటిని. కాని, భాగ్యము నాకు దూరమగుటచే, నేను ఆయననుండి సంసారమునే కోరితిని.

స్వారాజ్యం యచ్ఛతో మౌఢ్యాన్మానో మే భిక్షితో బత ।
ఈశ్వరాత్ క్షీణపుణ్యేన ఫలీకారానివాధనః ॥ 35

స్వారాజ్యమ్ - మోక్షము అనే సామ్రాజ్యమును, యచ్ఛతః - ఇచ్చే, ఈశ్వరాత్ - ఈశ్వరునినుండి, మే - నాచే, మౌఢ్యాత్ - మూర్ఖత్వము వలన, క్షీణపుణ్యేన - క్షీణించిన పుణ్యముచే, అధనః - ధనము లేనివాడు, ఫలీకారాన్ ఇవ - ధాన్యపు గింజలను వలె, మానః - అభిమానము, భిక్షితః - యాచించబడినది, బత - అయ్యో!

అయ్యో! ఈశ్వరుడు మోక్షసామ్రాజ్యమును ఇచ్చును. కాని, మూర్ఖుడనగు నేను పుణ్యము క్షీణించుటచే, ధనము లేనివాడు బియ్యపు గింజలను బిచ్చమెత్తు విధముగా, ఆయననుండి అభిమానమును పెంచే ఉన్నతపదమును కోరితిని.

మైత్రేయ ఉవాచ ।
న వై ముకుందస్య పదారవిందయో
రజోజుషస్తాత భవాదృశా జనాః ।

వాంఛంతి తద్దాస్యమృతేఽర్థమాత్మనో
యదృచ్ఛయా లబ్ధమనస్సమృద్ధయః ॥ 36

తాత - వత్సా!, ముకుందస్య - మోక్షమునిచ్చే శ్రీహరియొక్క, పద-అరవిందయోః - పద్మములవంటి పాదములయొక్క, రజః-జుషః - ధూళిని సేవించువారు, యదృచ్ఛయా - ఈశ్వరేచ్ఛచే, లబ్ధమనః-సమృద్ధయః - పొందబడిన మనోరథములు గలవారు, భవాదృశాః - నీవంటి, జనాః - జనులు, తత్-దాస్యం ఋతే - ఆ శ్రీహరియొక్క సేవను మినహాయించి, ఆత్మనః - తనకు, అర్థమ్ - కామనను, న వై వాంఛంతి - నిశ్చయముగా కోరరు.

వత్సా విదురా! నీవంటి నిష్కామభక్తుల మనోరథములు ఈశ్వరేచ్ఛచే లభించిన దానితోడనే తీరిపోవును. మోక్షదాతయగు శ్రీహరియొక్క పాదపద్మముల ధూళిని సేవించే నీవంటివారలు ఆయన సేవను మినహాయించి, తమకొరకై దేనినైననూ కోరుకొనరు.

ఆకర్ణ్యాత్మజమాయాంతం సంపరేత్య యథాऽऽగతమ్ ।
రాజా న శ్రద్దధే భద్రమభద్రస్య కుతో మమ ॥ 37

సంపరేత్య - మరణించి, ఆగతం యథా - వచ్చినవాని వలె, ఆయాంతమ్ - వచ్చుచున్న, ఆత్మజమ్ - పుత్రుని గురించి, ఆకర్ణ్య - విని, రాజా - ఉత్తానపాద మహారాజు, న శ్రద్దధే - నమ్మలేదు, అభద్రస్య - అభాగ్యుడనగు, మమ - నాకు, భద్రమ్ - భాగ్యము, కుతః - ఎక్కడిది?

మరణించినవాడు తిరిగి వచ్చినాడన్నచో, నమ్మకము కుదరదు. అదే విధముగా, తన కుమారుడు తిరిగి వచ్చుచున్నాడన్న వార్తను విన్న ఉత్తానపాద మహారాజునకు నమ్మకము కలుగలేదు. అభాగ్యుడనగు నాకు అంతటి భాగ్యమెక్కడిది? అని ఆయన భావించెను.

శ్రద్ధాయ వాక్యం దేవర్షేర్హర్షవేగేన ధర్షితః ।
వార్తాహర్తురతిప్రీతో హారం ప్రాదాన్మహాధనమ్ ॥ 38

దేవ-ఋషేః - దేవర్షియగు నారదుని, వాక్యమ్ - మాటను, శ్రద్ధాయ - విశ్వసించి, హర్షవేగేన - హర్షముయొక్క వేగముచే, ధర్షితః - కుదిపివె బడిన మహారాజు, అతిప్రీతః - మిక్కిలి సంతోషించినవాడై, వార్తాహర్తుః - వార్తను తెచ్చినవానికి, మహాధనమ్ - మిక్కిలి విలువైన, హారమ్ - హారమును, ప్రాదాత్ - ఇచ్చెను.

కాని, ఉత్తానపాద మహారాజునకు దేవర్షియగు నారదుని మాట గుర్తు వచ్చి ఆ వార్తను విశ్వసించెను. అపుడాయన హర్షముయొక్క వేగముచే కదలాడిపోయెను. ఆయన చాల సంతోషించి వార్తను తెచ్చిన వ్యక్తికి మిక్కిలి విలువైన హారమును బహుమతిగా ఇచ్చెను.

సదశ్వం రథమారుహ్య కార్తస్వరపరిష్కృతమ్ ।
బ్రాహ్మణైః కులవృద్ధైశ్చ పర్యస్తోఽమాత్యబంధుభిః ॥ 39

శంఖదుందుభినాదేన బ్రహ్మఘోషేణ వేణుభిః ।
నిశ్చక్రామ పురాత్తూర్ణమాత్మజాభీక్షణోత్సుకః ॥ 40

సత్-అశ్వమ్ - మంచి గుర్రములు గలిగినట్టియు, కార్తస్వరపరిష్కృతమ్ - బంగారముచే అలంకరించబడిన, రథమ్ - రథమును, ఆరుహ్య - ఎక్కి, ఆత్మజ-అభి-ఈక్షణ-ఉత్సుకః - పుత్రుని ముఖమును చూడాలనే ఉత్సాహము గల మహారాజు, బ్రాహ్మణైః - బ్రాహ్మణులతో, కులవృద్ధైః - కులమునందలి పెద్దలతో, అమాత్యబంధుభిః - మంత్రులతో బంధువులతో, పర్యస్తః - చుట్టువారబడినవాడై, శంఖదుందుభినాదేన - శంఖముల మరియు దుందుభుల ధ్వనితో, బ్రహ్మఘోషేణ - వేదఘోషతో, వేణుభిః - పిల్లనగ్రోవులతో, పురాత్ - నగరమునుండి, తూర్ణమ్ - శీఘ్రముగా, నిశ్చక్రామ - బయలు దేరెను.

ఉత్తానపాద మహారాజు పుత్రుని ముఖమును చూడాలనే ఉత్సాహముతో, బంగారముతో అలంకరించబడి మంచి గుర్రములను పూన్చిన రథమునెక్కి వెంటనే నగరమునుండి బయలు దేరెను. బ్రాహ్మణులు, కులపెద్దలు, మంత్రులు, బంధువులు ఆయనను చుట్టువారియుండిరి. జనులు

శంఖములను, దుందుభులను, పిల్లనగ్రోవులను మ్రోయించుచుండిరి. వేద పండితులు వేదమంత్రములను బిగ్గరగా పఠించుచుండిరి.

సునీతిస్సురుచిశ్చాస్య మహిష్యౌ రుక్మభూషితే ।
ఆరుహ్య శిబికాం సార్ధముత్తమేనాభిజగ్మతుః ।। 41

అస్య - ఈ మహారాజుయొక్క, మహిష్యౌ - పట్టమహిషులు అగు, సునీతిః - సునీతి, సురుచిః చ - సురుచి కూడ, రుక్మభూషితే - బంగరు ఆభరణములచే అలంకరించబడినవారై, ఉత్తమేన సార్ధమ్ - ఉత్తమునితో గూడి, శిబికామ్ - పల్లకీని, ఆరుహ్య - ఎక్కి, అభిజగ్మతుః - ఎదురేగిరి.

ఉత్తానపాదుని పట్టమహిషులు అగు సునీతి, సురుచి కూడ బంగరు ఆభరణములతో అలంకరించు కొనిరి. వారు ఉత్తమునితో గూడి పల్లకీనెక్కి ధ్రువునకు ఎదురేగిరి.

తం దృష్ట్వోపవనాభ్యాశ ఆయాంతం తరసా రథాత్ ।
అవరుహ్య నృపస్తూర్ణమాసాద్య ప్రేమవిహ్వలః ।। 42

పరిరేభేఽంగజం దోర్భ్యాం దీర్ఘోత్కంఠమనాశ్వ్వసన్ ।
విష్వక్సేనాంఘ్రిసంస్పర్శహతాశేషాఘబంధనమ్ ।। 43

విష్వక్సేన-అంఘ్రిసంస్పర్శహత-అశేష-అఘబంధనమ్ - సర్వ వ్యాపకుడగు శ్రీహరియొక్క పాదములను చక్కగా స్పృశించుటచే నశింప జేయబడిన సకలములగు పాపముల బంధము గలిగినట్టియు, ఆయాంతమ్ - వచ్చుచున్న, తమ్ - ఆ, అంగజమ్ - పుత్రుడైన ధ్రువుని, ఉపవన-అభ్యాశే - ఉద్యానవనమునకు సమీపమునందు, దృష్ట్వా - చూచి, ప్రేమవిహ్వలః - ప్రేమచే పరవశుడైన, నృపః - మహారాజు, తరసా - వేగముగా, రథాత్ - రథమునుండి, అవరుహ్య - క్రిందకు దిగి, తూర్ణమ్ - వేగముగా, ఆసాద్య - సమీపించి, దీర్ఘ-ఉత్కంఠమనాః - చిరకాలము వేగిరపడుచున్న మనస్సు గలవాడై, శ్వసన్ - నిట్టూర్పులను విడుచుచున్నవాడై, దోర్భ్యామ్ - బాహువులతో, పరిరేభే - కౌగిలించుకొనెను.

సర్వవ్యాపకుడగు శ్రీహరి పాదములను చక్కగా స్పృశించుటచే ధ్రువుని పాపబంధములన్నియు తొలగిపోయెను. అట్టి తన పుత్రుడు వచ్చుచుండగా ఉత్తానపాద మహారాజు ఉద్యానవనసమీపములో చూచెను. ఆయన మనస్సులో చిరకాలమునుండి పుత్రుని చూడవలెననే వేగిరపాటు ఉండెను. ఆయన వెంటనే వేగముగా రథము దిగి, శీఘ్రముగా అతని వద్దకు వెళ్లి, నిట్టూర్పులను విడుచుచున్నవాడై, భుజములతో అతనిని కౌగిలించుకొనెను.

అథాఽఽజిఘ్రన్ముహుర్మూర్ధ్ని శీతైర్నయనవారిభిః ।
స్నాపయామాస తనయమాప్తోద్దామమనోరథః ॥ 44

అథ - తరువాత, ఆప్త-ఉద్దామమనోరథః - సిద్ధించిన గొప్ప కోరిక గల మహారాజు, తనయమ్ - పుత్రుని, ముహుః - పలుమార్లు, మూర్ధ్ని - తలపై, ఆజిఘ్రన్ - ముద్దాడుచున్నవాడై, శీతైః - చల్లని, నయనవారిభిః - కన్నీళ్లతో, స్నాపయామాస - తడిపి వేసెను.

అప్పుడు మహారాజునకు గల పెద్ద కోరిక సిద్ధించెను. ఆయన పుత్రుని పలుమార్లు శిరస్సుపై అఘ్రాణించి, చల్లని ఆనందబాష్పములతో అతనిని తడిపివేసెను.

అభివంద్య పితుః పాదావాశీర్భిశ్చాభిమంత్రితః ।
ననామ మాతరౌ శీర్ష్ణా సత్కృతస్సజ్జనాగ్రణీః ॥ 45

సత్-జన-అగ్రణీః - సత్పురుషులలో అగ్రేసరుడగు ధ్రువుడు, పితుః - తండ్రియొక్క, పాదౌ - పాదములను, అభివంద్య - నమస్కరించి, ఆశీర్భిః - ఆశీర్వచనములచే, అభిమంత్రితః - సంభాషించబడినవాడై, సత్కృతః - సత్కరించబడినవాడై, మాతరౌ - తల్లులనిద్దరిని, శీర్ష్ణా - శిరస్సుతో, ననామ - నమస్కరించెను.

ధ్రువుడు సత్పురుషులలో మొట్టమొదటివాడు. అతడు తండ్రి పాదములకు నమస్కరించగా, ఆయన ఆశీర్వదించి కుశలప్రశ్నాదికమును

వేసెను. ఈ విధముగా సత్కరించబడిన ధ్రువుడు తల్లులిద్దరికీ కూడ తల వంచి నమస్కరించెను.

సురుచిస్తం సముత్థాప్య పాదావనతమర్భకమ్ ।
పరిష్వజ్యాహ జీవేతి బాష్పగద్గదయా గిరా ॥ 46

సురుచిః - సురుచి, పాద-అవనతమ్ - పాదములవద్ద వంగియున్న, అర్భకమ్ - బాలకుడగు, తమ్ - ఆ ధ్రువుని, సముత్థాప్య - ప్రేమగా పైకి లేవదీసి, పరిష్వజ్య - కౌగిలించుకొని, బాష్పగద్గదయా - కన్నీటితో బొంగురువోయిన, గిరా - వాక్కుతో, జీవ - జీవించుము, ఇతి - అని, ఆహ - పలికెను.

తన పాదములకు వంగి నమస్కరించిన ఆ బాలకుని సురుచి ప్రేమతో పైకి లేవదీసి కౌగిలించుకొని, కన్నీటిని కారుస్తూ, బొంగురువోయిన కంఠముతో, చిరంజీవ అని ఆశీర్వదించెను.

యస్య ప్రసన్నో భగవాన్ గుణైర్మైత్ర్యాదిభిర్హరిః ।
తస్మై నమంతి భూతాని నిమ్నమాప ఇవ స్వయమ్ ॥ 47

యస్య - ఎవనికి, మైత్రీ-ఆదిభిః - మైత్రి కరుణ మొదలగు, గుణైః - గుణములచే, హరిః భగవాన్ - శ్రీహరి భగవానుడు, ప్రసన్నః - ప్రసన్నుడైనాడో, తస్మై - వాని కొరకు, భూతాని - ప్రాణులు, ఆపః - నీళ్లు, నిమ్నం ఇవ - పల్లమును వలె, స్వయమ్ - తమంత తాముగా, నమంతి - నమస్కరించును.

నీరు పల్లమునకు తనంత తానుగా ప్రవహించును. అదే విధముగా, ఎవనిపై మైత్రి కరుణ మొదలగు సద్గుణముల కారణముగా శ్రీహరి భగవానునకు అనుగ్రహము కలిగినదో, వానికి జనులందరు తమంత తాముగా నమస్కరించెదరు.

ఉత్తమశ్చ ధ్రువశ్చోభావన్యోన్యం ప్రేమవిహ్వలౌ ।
అంగసంగాదుత్పులకావస్రౌఘం ముహురూహతుః ॥ 48

అన్యోన్యమ్ - పరస్పరము, ప్రేమవిహ్వలౌ - ప్రేమచే పరవశులైన, ఉత్తమః - ఉత్తముడు, ధ్రువః - ధ్రువుడు, ఉభౌ చ - ఇద్దరు కూడ, అంగసంగాత్ - దేహముల కలయిక వలన, ముహుః - పలుమార్లు, ఉత్-పులకౌ - ఉదయించిన గగుర్పాటు గలవారై, అస్ర-ఓఘమ్ - కన్నీటి ప్రవాహమును, ఊహతుః - కలిగియుండిరి.

ధ్రువుడు, ఉత్తముడు పరస్పరము ప్రేమచే పరవశులైరి. వారు కౌగిలించుకొని పలుమార్లు గగుర్పాటును చెందిరి. వారిద్దరికి కన్నీరు ప్రవహించెను.

సునీతిరస్య జననీ ప్రాణేభ్యోఽపి ప్రియం సుతమ్ ।
ఉపగుహ్య జహావాధిం తదంగస్పర్శనిర్వృతా ॥ 49

అస్య - ఈ ధ్రువుని, జననీ - తల్లియగు, సునీతిః - సునీతి, ప్రాణేభ్యః అపి - ప్రాణములకంటె కూడ, ప్రియమ్ - ప్రియమైన, సుతమ్ - పుత్రుని, ఉపగుహ్య - కౌగిలించుకొని, తత్-అంగస్పర్శనిర్వృతా - వాని దేహముయొక్క స్పర్శచే ఆనందించినదై, ఆధిమ్ - మనస్సులోని శోకమును, జహౌ - విడిచిపెట్టెను.

ధ్రువుని తల్లియగు సునీతి తన ప్రాణములకంటె కూడ ప్రియమైన పుత్రుని కౌగిలించుకొనెను. పుత్రుని స్పృశించి మహానందమును పొందిన ఆ తల్లికి మనస్సులోని శోకము దూరమయ్యెను.

పయః స్తనాభ్యాం సుస్రావ నేత్రజైస్సలిలైశ్శివైః ।
తదాఽభిషిచ్యమానాభ్యాం వీర వీరసువో ముహుః ॥ 50

వీర - ధీరుడవగు ఓ విదురా!, తదా - అప్పుడు, శివైః - మంగళకరములగు (చల్లని), నేత్రజైః - కన్నులనుండి పుట్టిన, సలిలైః - జలములచే, అభిషిచ్యమానాభ్యామ్ - తడుపబడిన, వీరసువః - వీరమాతయగు సునీతియొక్క, స్తనాభ్యామ్ - స్తనములనుండి, పయః - క్షీరము, ముహుః - పలుమార్లు, సుస్రావ - స్రవించెను.

ధీరుడవగు ఓ విదురా! అప్పుడు వీరమాతయగు సునీతికి, కన్ను లనుండి స్రవించిన మంగళకరములగు ఆనందబాష్పములచే తడిసిన స్తన ములనుండి క్షీరము స్రవించెను.

తాం శశంసుర్నరా రాజ్ఞీం దిష్ట్యా తే పుత్ర ఆర్తిహా ।
ప్రతిలబ్ధశ్చిరం నష్టో రక్షితా మండలం భువః ।। 51

నరాః - జనులు, తామ్ - ఆ, రాజ్ఞీమ్ - మహారాణిని, శశంసుః - కొనియాడిరి, చిరమ్ - చాలకాలము, నష్టః - కనబడకుండా పోయి నట్టియు, దిష్ట్యా - దైవవశముచే, ప్రతిలబ్ధః - దొరికిన, పుత్రః - పుత్రుడు, తే - నీకు, ఆర్తిహా - దుఃఖమును పోగొట్టగలడు, భువః మండలమ్ - భూమండలమును, రక్షితా - రక్షించగలడు.

జనులు మహారాణియగు సునీతిని ఇట్లు ప్రశంసించిరి : నీ కొడుకు చాల కాలము కనబడకుండా పోయి, తిరిగి దైవానుగ్రహముచే దొరికినాడు. అతడు మనందరి దుఃఖమును పోగొట్టి, భూమండలమును రక్షించగలడు.

అభ్యర్చితస్త్వయా నూనం భగవాన్ ప్రణతార్తిహా ।
యదనుధ్యాయినో వీరా మృత్యుం జిగ్యుస్సుదుర్జయమ్।।52

ప్రణత-ఆర్తిహా - నమస్కరించువారల దుఃఖమును పోగొట్టే, భగ వాన్ - భగవానుడు, త్వయా - నీచే, నూనమ్ - నిశ్చయముగా, అభి-అ ర్చితః - చక్కగా పూజించబడినాడు, యత్-అనుధ్యాయినః - ఏ భగవా నుని ధ్యానించే శీలము గల, వీరాః - ధీరపురుషులు, సుదుర్జయమ్- మిక్కిలి జయించ శక్యము కాని, మృత్యుమ్ - మృత్యువును, జిగ్యుః - జయించినారో.

నమస్కరించే భక్తుల దుఃఖములను దూరము చేసే భగవానుని నీవు బాగా పూజించినావు. ఇది నిశ్చయము. భగవానుని ధ్యానమునందు పరాయణులైన ధీరపురుషులు ఇతరులకు సుతరాము జయించ శక్యము కాని మృత్యువునైననూ జయించెదరు.

లాల్యమానం జనైరేవం ధ్రువం సభ్రాతరం నృపః ।
ఆరోప్య కరిణీం హృష్టః స్తూయమానోऽవిశత్పురమ్ ॥ 53

హృష్టః - ఆనందమును పొందియున్న, నృపః - మహారాజు, జనైః - జనులచే, ఏవమ్ - ఈ విధముగా, లాల్యమానమ్ - లాలించబడు చున్నట్టియు, సభ్రాతరమ్ - తమ్మునితో కూడియున్న, ధ్రువమ్ - ధ్రువుని, కరిణీమ్ - ఏనుగును, ఆరోప్య - ఎక్కించి, స్తూయమానః - కొనియాడబ డుచున్నవాడై, పురమ్ - నగరమును, అవిశత్ - ప్రవేశించెను.

ధ్రువుని జనులందరు ఈ విధముగా లాలించుచుండగా, మహా రాజు మహానందమును పొందెను. ఆయన ధ్రువుని తమ్మునితో బాటు ఏనుగుపై నెక్కించి నగరములోనికి ప్రవేశించెను. జనులు ఆయనను కూడ ప్రశంసించిరి.

తత్ర తత్రోపసంక్లృప్తైర్లసన్మకరతోరణైః ।
సవృంతైః కదలీస్తంభైః పూగపోతైశ్చ తద్విధైః ॥ 54

చూతపల్లవవాసస్స్రఙ్ముక్తాదామవిలంబిభిః ।
ఉపస్కృతం ప్రతిద్వారమపాం కుంభైస్సదీపకైః ॥ 55

తత్ర తత్ర - అక్కడక్కడ, ఉపసంక్లృప్తైః - దగ్గరగా ఏర్పాటు చేయబడిన, లసత్-మకరతోరణైః - ప్రకాశించే మకరతోరణములతో, సవృంతైః - పళ్లగెలలతో కూడియున్న, కదలీస్తంభైః - అరటి బోదెలతో, చ - మరియు, తత్-విధైః - ఆ విధముగానే యున్న, పూగపోతైః - లేత పోక చెట్లతో, చూతపల్లవవాసః-స్రక్-ముక్తాదామవిలంబిభిః - మామిడి చిగుళ్లు వస్త్రములు మాలలు ముత్యాల దండలు వ్రేలాడుచున్న, సదీపకైః - దీప ములతో కూడిన, అపామ్ - నీళ్ల, కుంభైః - కడవలతో, ప్రతిద్వారమ్ - ప్రతి ద్వారము, ఉపస్కృతమ్ - అలంకరించబడినది.

ఆ నగరములో అక్కడక్కడ ప్రకాశించే మకరతోరణములు (మొ సలి ఆకారములోని ద్వారములు) దగ్గర దగ్గరగా ఏర్పాటు చేయబడెను. పళ్లగెలలతోనున్న అరటి బోదెలు, పోకచెక్కల గుత్తులతో నున్న లేత పోక

చెట్లు ఆ ద్వారముల వద్ద అలంకరించబడెను. ప్రతి ద్వారము వద్ద దీపము లతో కూడిన నీటి కడవలు అలంకరించబడెను. ఆ కడవలకు మామిడి చిగుళ్లు, వస్త్రములు, పుష్పమాలలు, ముత్యాల దండలు వ్రేలాడుచుండెను.

ప్రాకారైర్గోపురాగారైశ్శాతకుంభపరిచ్ఛదైః ।
సర్వతోఽలంకృతం శ్రీమద్విమానశిఖరద్యుభిః ॥ 56

శాతకుంభపరిచ్ఛదైః - బంగరు పరికరములు కలిగినట్టియు, శ్రీమత్-విమానశిఖరద్యుభిః - శోభాయుక్తములగు విమానముల శిఖరముల వంటి శిఖరముల కాంతులు గల, ప్రాకారైః - ప్రాకారములతో, గోపుర-అగారైః - గోపురములతో భవనములతో, సర్వతః - అంతటా, అలంకృతమ్ - అలంకరించబడిన (నగరమును ప్రవేశించెను).

ఆ నగరము అంతటా ప్రాకారములతో, గోపురములతో, భవనములతో ప్రకాశించుచుండెను. వాటియందు బంగరు పరికరములు ఉండెను. వాటి శిఖరములు గొప్ప విమానముల శిఖరములవలె భాసిల్లెను.

మృష్టచత్వరరథ్యాఽట్టమార్గం చందనచర్చితమ్ ।
లాజాక్షతైః పుష్పఫలైస్తండులైర్బలిభిర్యుతమ్ ॥ 57

మృష్టచత్వరరథ్యా-అట్టమార్గమ్ - తుడిచి శుభ్రము చేయబడిన కూడళ్లు రాజమార్గములు మిద్దెలు మరియు వీధులు కలిగినట్టియు, చందనచర్చితమ్ - గంధపు నీళ్లు చల్లబడినట్టియు, లాజ-అక్షతైః - పేలాలతో మరియు అక్షతలతో, పుష్పఫలైః - పువ్వులతో పండ్లతో, తండులైః - బియ్యపు గింజలతో, బలిభిః - మృష్టాన్నములతో, యుతమ్ - కూడియున్న (నగరమును ప్రవేశించెను).

ఆ నగరములోని కూడళ్లను, రాజమార్గములను, వీధులను, మిద్దెలను తుడిచి శుభ్రము చేసి గంధపు నీళ్లను చల్లిరి. పేలాలు, అక్షతలు (పసుపు కలిపిన బియ్యము, లేక యవలు), పువ్వులు, పళ్లు, బియ్యము, మృష్టాన్నములు ఆ నగరములో పంసిద్ధము చేయబడి యుండెను.

ధ్రువాయ పథి దృష్టాయ తత్ర తత్ర పురస్త్రియః ।
సిద్ధార్థాక్షతదధ్యంబుదూర్వాపుష్పఫలాని చ ॥ 58

ఉపాజహ్రుః ప్రయుంజానా వాత్సల్యాదాశిషస్సతీః ।
శృణ్వంస్తద్వల్గుగీతాని ప్రావిశద్భవనం పితుః ॥ 59

తత్ర తత్ర - అక్కడక్కడ, పథి - మార్గమునందు, దృష్టాయ - కనబడిన, ధ్రువాయ - ధ్రువుని కొరకు, పురస్త్రియః - నగరమునందలి స్త్రీలు, వాత్సల్యాత్ - అనురాగము వలన, సతీః - శ్రేష్ఠములగు, ఆశిషః - ఆశీర్వచనములను, ప్రయుంజానాః - చేయుచున్నవారై, సిద్ధార్థ-అక్షతదధి-అంబుదూర్వాపుష్పఫలాని చ - తెల్ల నువ్వులు అక్షతలు పెరుగు నీరు లేత గడ్డి పరకలు పువ్వులు మరియు ఫలములను కూడ, ఉపాజహ్రుః - చల్లిరి, తత్-వల్గుగీతాని - వారి మనోహరమగు పాటలను, శృణ్వన్ - వినుచున్నవాడై, పితుః - తండ్రియొక్క, భవనమ్ - ప్రాసాదమును, ప్రావిశత్ - ప్రవేశించెను.

అక్కడక్కడ రాజమార్గమునందు ధ్రువుడు కానరాగానే పురస్త్రీలు వాత్సల్యముతో ఆయనకు శ్రేష్ఠములగు ఆశీర్వచనములను అందజేయుచుండిరి. వారాయనపై తెల్ల నువ్వులు, అక్షతలు, పెరుగు, నీరు, లేత గడ్డి పరకలు, పువ్వులు, పండ్లు మొదలగు మంగళద్రవ్యములను చల్లుచుండిరి. ధ్రువుడు వారి మనోహరములగు పాటలను వింటూ, తండ్రిగారి ప్రాసాదములోనికి ప్రవేశించెను.

మహామణివ్రాతమయే స తస్మిన్ భవనోత్తమే ।
లాలితో నితరాం పిత్రా న్యవసద్దివి దేవవత్ ॥ 60

సః - ఆ ధ్రువుడు, మహామణివ్రాతమయే - గొప్ప మణుల సమూహములచే నిర్మించబడిన, తస్మిన్ - ఆ, భవన-ఉత్తమే - గొప్ప ప్రాసాదమునందు, పిత్రా - తండ్రిచే, నితరామ్ - అధికముగా, లాలితః - లాలించబడినవాడై, దివి - స్వర్గమునందు, దేవవత్ - దేవతలవలె, న్యవసత్ - నివసించెను.

ఆ గొప్ప ప్రాసాదము విలువైన అనేకములగు మణులచే నిర్మించ బడినది. తండ్రి తనను అధికముగా లాలించుచుండగా, ధ్రువుడు దానిలో స్వర్గమునందు దేవతలవలె నివసించెను.

పయఃఫేననిభాశ్శయ్యా దాంతా రుక్మపరిచ్ఛదాః ।
ఆసనాని మహార్హాణి యత్ర రౌక్మా ఉపస్కరాః ॥ 61

యత్ర - ఏ భవనమునందైతే, దాంతాః - దంతముతో చేసిన, శయ్యాః - శయ్యలు, పయఃఫేననిభాః - పాలనురుగును పోలియున్నవో, రుక్మపరిచ్ఛదాః - బంగరు సామగ్రి, మహార్హాణి - గొప్ప విలువైన, ఆస నాని - ఆసనములు, రౌక్మాః - బంగరు, ఉపస్కరాః - పాత్రలు మొదలగు నవి గలవో.

ఆ భవనములోని శయ్యలు దంతముతో నిర్మించబడి, పాల నురు గును పోలియుండెను. అక్కడి సామగ్రి, పాత్రలు అన్నీ బంగారముతో చేసి నవే. దానియందలి ఆసనములు గొప్ప విలువ గలవి.

యత్ర స్ఫటికకుడ్యేషు మహామారకతేషు చ ।
మణిప్రదీపా ఆభాంతి లలనా రత్నసంయుతాః ॥ 62

యత్ర - ఏ భవనమునందైతే, మహామారకతేషు - గొప్ప పచ్చలు పొదిగిన, స్ఫటికకుడ్యేషు - స్ఫటికముతో చేసిన గోడలయందు, మణిప్ర దీపాః - మణిదీపములు, చ - మరియు, రత్నసంయుతాః - రత్నాభరణ ములు గల, లలనాః - యువతులు, ఆభాంతి - ప్రకాశించుచున్నారో.

ఆ భవనములో గోడలు స్ఫటికముతో చేసి, గొప్ప పచ్చలు పొదగ బడియుండెను. ఆ గోడలకు మణిదీపములు వెలుగుచుండెను. ఆ భవన ములోని యువతులు రత్నాభరణములను పెట్టుకొని ప్రకాశించుచుండిరి.

ఉద్యానాని చ రమ్యాణి విచిత్రైరమరద్రుమైః ।
కూజద్విహంగమిథునైర్గాయన్మత్తమధువ్రతైః ॥ 63

ఉద్యానాని చ - ఉద్యానవనములు కూడ, కూజత్-విహంగమిథునైః - కూతలను కూయుచున్న పక్షుల జంటలు కలిగినట్టియు, గాయత్-మత్తమధువ్రతైః - గానము చేయుచున్న మత్తెక్కిన తుమ్మెదలు కలిగినట్టియు, విచిత్రైః - రంగురంగుల, అమరద్రుమైః - దేవవృక్షములతో, రమ్యాణి - మనోహరముగా నున్నవి.

అక్కడి ఉద్యానవనములు దివ్యములగు వృక్షములతో మనోహరముగా నుండెను. ఆ చెట్లపై పక్షుల జంటలు కూతలు కూయుచుండగా, తుమ్మెదలు మత్తెక్కి గానము చేయుచుండెను.

వాప్యో వైడూర్యసోపానాః పద్మోత్పలకుముద్వతీః ।
హంసకారండవకులైర్జుష్టాశ్చక్రాహ్వసారసైః ।। 64

వైడూర్యసోపానాః - వైడూర్య రత్నములు పొదిగిన మెట్లు గలిగినట్టియు, పద్మ-ఉత్పలకుముద్వతీః - పద్మములు నల్లకలువలు తెల్ల కలువలు గల, వాప్యః - దిగుడు బావులు, హంసకారండవకులైః - హంసల కారండవ పక్షుల గుంపులచే, చక్రాహ్వసారసైః - జక్కవ మరియు బెగ్గురు పక్షులచే, జుష్టాః - సేవించబడినవి.

ఆ ఉద్యానములలో దిగుడు బావుల మెట్లకు వైడూర్య రత్నములు పొదగబడెను. అవి పద్మములు, నల్ల కలువలు మరియు తెల్ల కలువలతో అందముగా నుండెను. వాటిని హంసలు, కారండవ పక్షులు, జక్కవ పక్షులు, బెగ్గురు పక్షులు గుంపులు గుంపులుగా సేవించుచుండెను.

ఉత్తానపాదో రాజర్షిః ప్రభావం తనయస్య తమ్ ।
శ్రుత్వా దృష్ట్వాఽద్భుతతమం ప్రపేదే విస్మయం పరమ్ ।।65

రాజర్షిః - రాజర్షియగు, ఉత్తానపాదః - ఉత్తానపాదుడు, తనయస్య - పుత్రుని, తమ్ - ఆ, అద్భుతతమమ్ - అత్యాశ్చర్యమును గొలిపే, ప్రభావమ్ - మహిమను గురించి, శ్రుత్వా - విని, దృష్ట్వా - చూచి, పరమ్ - గొప్ప, విస్మయమ్ - విస్మయమును, ప్రపేదే - పొందెను.

రాజర్షియగు ఉత్తానపాదుడు తన పుత్రుని అత్యద్భుతమగు మహిమను గురించి నారదుని వలన వినియుండెను. ఇప్పుడా మహిమను కనులారా గాంచి, గొప్ప విస్మయమును పొందెను.

వీక్ష్యోఢవయసం తం చ ప్రకృతీనాం చ సంమతమ్ ।
అనురక్తప్రజం రాజా ధ్రువం చక్రే భువః పతిమ్ ॥ 66

రాజా - మహారాజు, తమ్ - ఆ, ధ్రువమ్ - ధ్రువుని, ఊఢవయసమ్ - పొందబడిన యౌవనము గలవానినిగా, ప్రకృతీనామ్ - మంత్రి మొదలగు రాజ్యాధికారులకు, సంమతమ్ - ఇష్టుడైన వానినిగా, చ - మరియు, అనురక్తప్రజమ్ - అనురాగముతో గూడిన ప్రజలు గలవానినిగా, వీక్ష్య - గమనించి, భువః - సామ్రాజ్యమునకు, పతిమ్ - ప్రభువునిగా, చక్రే - చేసెను.

ధ్రువునకు యౌవనము వచ్చెను. మంత్రి మొదలగు రాజ్యములోని ఉన్నతాధికారులకు ఆతడు రాజు అగుట సమ్మతమాయెను. మరియు ప్రజలకు ఆతనిపై అనురాగము ఉండెను. ఈ విషయములను గమనించిన ఉత్తానపాద మహారాజు ఆతనిని సామ్రాజ్యమునకు అధిపతిగా చేసెను.

ఆత్మానం చ ప్రవయసమాకలయ్య విశాం పతిః ।
వనం విరక్తః ప్రాతిష్ఠద్విమృశన్నాత్మనో గతిమ్ ॥ 67

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే చతుర్థస్కంధే ధ్రువోపాఖ్యానే ధ్రువరాజ్యాభిషేకవర్ణనం నామ నవమోఽధ్యాయః ॥

విశాం పతిః - ఆ నృపతి, ఆత్మానమ్ - తనను, ప్రవయసమ్ - వయసు మీద పడినవానినిగా, ఆకలయ్య - గమనించి, విరక్తః - వైరాగ్యము గలవాడై, ఆత్మనః - ఆత్మయొక్క, గతిమ్ - తత్త్వమును, విమృశన్ - విచారము చేయుచున్నవాడై, వనమ్ - అడవిని గురించి, ప్రాతిష్ఠత్ - బయలు దేరెను.

ఉత్తానపాద మహారాజు తనకు వయసు మీద బడిన సంగతిని గమనించి వైరాగ్యము గలవాడై, ఆత్మతత్త్వమును విచారిస్తూ గడుపుటకై అడవికి బయలుదేరెను (వానప్రస్థ జీవనమును స్వీకరించెను).

శ్రీమద్భాగవత మహాపురాణములోని నాల్గవ స్కంధములో
ధ్రువోపాఖ్యానములో ధ్రువుడు రాజ్యాభిషిక్తుడగుటను
వర్ణించే తొమ్మిదవ అధ్యాయము ముగిసినది (9).

*****

# అథ దశమోఽధ్యాయః

## ధ్రువోపాఖ్యానము - ధ్రువునకు యక్షులతో యుద్ధము

మైత్రేయ ఉవాచ ।
ప్రజాపతేర్దుహితరం శిశుమారస్య వై ధ్రువః ।
ఉపయేమే భ్రమిం నామ తత్సుతౌ కల్పవత్సరౌ ॥ 1

మైత్రేయః - మైత్రేయుడు, ఉవాచ - పలికెను, ధ్రువః - ధ్రువుడు, భ్రమిం నామ - భ్రమి అని ప్రసిద్ధిని గాంచిన, శిశుమారస్య ప్రజాపతేః - శిశుమార ప్రజాపతియొక్క, దుహితరమ్ - కుమార్తెను, ఉపయేమే - వివాహమాడెను, తత్-సుతౌ - వారిద్దరి పుత్రులు, కల్పవత్సరౌ - కల్పుడు వత్సరుడు.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- శిశుమార ప్రజాపతికి భ్రమి అని ప్రసిద్ధిని గాంచిన కుమార్తె గలదు. ఆమెను ధ్రువుడు వివాహమాడెను. వారిద్దరికి కల్పుడు, వత్సరుడు అనే ఇద్దరు కుమారులు కలిగిరి.

ఇలాయామపి భార్యాయాం వాయోః పుత్ర్యాం మహాబలః ।
పుత్రముత్కలనామానం యోషిద్రత్నమజీజనత్ ॥ 2

మహాబలః - గొప్ప బలశాలియగు ధ్రువుడు, వాయోః - వాయు దేవుని, పుత్ర్యామ్ - పుత్రికయగు, ఇలాయామ్ - ఇల అనే, భార్యాయాం అపి - భార్యయందు కూడ, ఉత్కలనామానమ్ - ఉత్కలుడని ప్రసిద్ధిని గాంచిన, పుత్రమ్ - కొడుకును, యోషిత్-రత్నమ్ - రత్నమువంటి కన్య ను, అజీజనత్ - కనెను.

గొప్ప బలశాలియగు ధ్రువుడు వాయుదేవుని పుత్రికయగు ఇలను వివాహమాడెను. వారికి ఉత్కలుడనే కొడుకు, రత్నమువంటి కుమార్తె కలిగిరి.

ఉత్తమస్త్వకృతోద్వాహో మృగయాయాం బలీయసా ।
హతః పుణ్యజనేనాద్రౌ తన్మాతాఽస్య గతిం గతా ॥ 3

ఉత్తమః తు - ఉత్తముడైతే, అకృత-ఉద్వాహః - చేయబడని వివాహము గలవాడై, మృగయాయామ్ - వేటయందు, బలీయసా - బలవంతుడగు, పుణ్యజనేన - యక్షునిచే, అద్రౌ - పర్వతమునందు, హతః - చంపబడెను, తత్-మాతా - వాని తల్లి, అస్య - ఈ ఉత్తముని, గతిమ్ - గతిని, గతా - పొందెను.

ఉత్తముడు వివాహము చేసుకోలేదు. ఆతడు వేటకు వెళ్లి, హిమవత్పర్వతముపై బలశాలియగు యక్షుని చేతిలో మరణించెను. వాని తల్లి కూడ మరణించెను.

ధ్రువో భ్రాతృవధం శ్రుత్వా కోపామర్షశుచాఽర్పితః ।
జైత్రం స్యందనమాస్థాయ గతః పుణ్యజనాలయమ్ ॥ 4

ధ్రువః - ధ్రువుడు, భ్రాతృవధమ్ - తమ్ముని వధను గురించి, శ్రుత్వా - విని, కోప-అమర్షశుచా - కోపము ఓర్వలేనితనముల వలన కలిగిన దుఃఖముచే, అర్పితః - నిండినవాడై, జైత్రమ్ - విజయమును కలిగించే, స్యందనమ్ - రథమును, ఆస్థాయ - అధిష్ఠించి, పుణ్యజన-ఆలయమ్ - యక్షుల నివాసమును గురించి, గతః - వెళ్లినవాడు.

తన తమ్ముడు వధించబడినాడని విని ధ్రువుడు సహించలేకపోయెను. ఆతని హృదయము కోపముతో, దుఃఖముతో నిండిపోయెను. ఆతడు విజయప్రదమగు రథమునెక్కి, ఆ యక్షుల నివాసస్థానమగు అలకాపురమునకు వెళ్లెను.

గత్వోదీచీం దిశం రాజా రుద్రానుచరసేవితామ్ ।
దదర్శ హిమవద్ద్రోణ్యాం పురీం గుహ్యకసంకులామ్ ॥ 5

రాజా - ధ్రువ మహారాజు, రుద్ర-అనుచరసేవితామ్ - రుద్రుని అనుచరులగు ప్రమథగణములచే సేవించబడే, ఉదీచీం దిశమ్ - ఉత్తరదిక్కును గురించి, గత్వా - వెళ్లి, హిమవత్-ద్రోణ్యామ్ - హిమవత్పర్వతశ్రేణుల లోపలనున్నే మైదానమునందు, గుహ్యకసంకులామ్ - యక్షులతో రద్దీగానుండే, పురీమ్ - అలకాపురిని, దదర్శ - చూచెను.

ధ్రువ మహారాజు ఉత్తరదిక్కు వైపు పయనించెను. అక్కడ రుద్రుని అనుచరులు సంచరించుచుందురు. ఆతడు ఆ దిక్కులో వెళ్లి, హిమవత్పర్వతశ్రేణులలో ఉన్న మైదాన ప్రదేశమును చేరుకొనెను. అచట ఆతనికి యక్షులతో రద్దీగానున్న అలకాపురము కానవచ్చెను.

దధ్మౌ శంఖం బృహద్బాహుః ఖం దిశశ్చానునాదయన్ ।
యేనోద్విగ్నదృశః క్షత్తరుపదేవ్యోఽత్రసన్ భృశమ్ ॥ 6

క్షత్తః - ఓ విదురా !, బృహత్-బాహుః - ఆజానుబాహువు అగు ధ్రువుడు, ఖమ్ - ఆకాశమును, దిశః చ - దిక్కులను కూడ, అనునాదయన్ - ప్రతిధ్వనింపజేయుచున్నవాడై, శంఖమ్ - శంఖమును, దధ్మౌ - పూరించెను, యేన - ఏ ధ్వనిచే, ఉద్విగ్నదృశః - భయముతో కూడిన కన్నులు గల, ఉపదేవ్యః - యక్షస్త్రీలు, భృశమ్ - మిక్కిలి, అత్రసన్ - భయపడిరో.

పాపములను పోగొట్టుటలో సమర్థుడవగు ఓ విదురా! ఆజానుబాహుడగు ధ్రువుడు శంఖమును పూరించగా, ఆకాశము దిక్కులు కూడ ప్రతిధ్వనించెను. ఆ ధ్వనిని విని యక్షస్త్రీలు వణికిపోయిరి. వారి కన్నులలో చాల భయము కానవచ్చెను.

తతో నిష్క్రమ్య బలిన ఉపదేవమహాభటాః ।
అసహంతస్తం నినాదమభిపేతురుదాయుధాః ॥ 7

తతః - అప్పుడు, బలినః - బలశాలురగు, ఉపదేవమహాభటాః - యక్షుల గొప్ప భటులు, తమ్ - ఆ, నినాదమ్ - ధ్వనిని, అసహంతః - ఓర్వలేనివారై, ఉత్-ఆయుధాః - ఎత్తి పట్టుకొనబడిన ఆయుధములు గల

వారై, నిష్క్రమ్య - బయటకు వచ్చి, అభిపేతుః - ధ్రువుని వైపునకు ఉరికిరి.

అప్పుడు గొప్ప బలశాలురగు యక్షసైనికులు ఆ ధ్వనిని సహించనివారై, ఆయుధములను ఎత్తి పట్టుకొని, నగరము బయటకు వచ్చి, ధ్రువుని వైపునకు ఉరికిరి.

స తానాపతతో వీర ఉగ్రధన్వా మహారథః ।
ఏకైకం యుగపత్సర్వానహన్ బాణైస్త్రిభిస్త్రిభిః ॥ 8

వీరః - వీరుడు, ఉగ్రధన్వా - భయంకరమగు ధనస్సు గలవాడు, మహారథః - రథయుద్ధములో గొప్పవాడు అగు, సః - ఆ ధ్రువుడు, ఆపతతః - మీదకు దూసుకుని వచ్చుచున్న, తాన్ - వారిని, సర్వాన్ - అందరినీ, యుగపత్ - ఒక్కసారిగా, ఏక-ఏకమ్ - ఒక్కొక్కరిని, త్రిభిః త్రిభిః - మూడు మూడు, బాణైః - బాణములతో, అహన్ - కొట్టెను.

ధ్రువుడు రథముపైనుండి యుద్ధమును చేయుటలో దిట్ట. అతని ధనస్సు శత్రువులకు భయమును గొల్పును. తన మీదకు వచ్చుచున్న ఆ యక్షసైనికులను ఆయన ఒక్కొక్కరిని మూడు చొప్పున బాణములతో అందరినీ ఒక్కసారిగా కొట్టెను.

తే వై లలాటలగ్నైస్తైరిషుభిస్సర్వ ఏవ హి ।
మత్వా నిరస్తమాత్మానమాశంసన్ కర్మ తస్య తత్ ॥ 9

తే - వారు, సర్వే ఏవ హి - అందరు కూడ, లలాటలగ్నైః - నుదురునందు తగుల్కొన్న, తైః - ఆ, ఇషుభిః - బాణములచే, ఆత్మానమ్ - తనను, నిరస్తమ్ - జయించబడినవానినిగా, మత్వా - తలచి, తస్య - ఆ ధ్రువుని, తత్ - ఆ, కర్మ - కర్మను, ఆశంసన్ - ప్రశంసించిరి.

ఈ విధముగా తమ నుదుట బాణములు తగుల్కొనుట తోడనే వారందరు తాము పరాజితులమైనామనియే తలపోసి, ధ్రువుని ఆ వీరకృత్యమును ప్రశంసించిరి.

తేఽపి చాముమమృష్యంతః పాదస్పర్శమివోరగాః ।
శరైరవిధ్యన్ యుగపద్ద్విగుణం ప్రచికీర్షవః ॥ 10

తే అపి చ - వారు కూడ, ఉరగాః - పాములు, పాదస్పర్శం ఇవ - పాదములతో తొక్కుటను వలె, అముమ్ - ఈ ధ్రువుని, అమృష్యంతః - సహించనివారై, ప్రచికీర్షవః - బదులు దాడిని చేయగోరువారై, ద్విగుణమ్ - రెండు రెట్లు అగునట్లుగా, శరైః - బాణములతో, యుగపత్ - ఒకేసారి, అవిధ్యన్ - కొట్టిరి.

వారందరు తోక తొక్కిన పాముల వలె ధ్రువుని వీరకృత్యమును సహించనివారై అతని దెబ్బకు దెబ్బను తీయగోరి, ఒక్కొక్కరు ఆరేసి బాణముల చొప్పున అందరు ఒకేసారిగా ఆయనను కొట్టిరి.

తతః పరిఘనిస్త్రింశైః ప్రాసశూలపరశ్వధైః ।
శక్త్యృష్టిభిర్భుశుండీభిశ్చిత్రవాజైశ్శరైరపి ॥ 11

అభ్యవర్షన్ ప్రకుపితాస్సరథం సహసారథిమ్ ।
ఇచ్ఛంతస్తత్ప్రతీకర్తుమయుతాని త్రయోదశ ॥ 12

తతః - అప్పుడు, ప్రకుపితాః - మిక్కిలి కోపించినట్టియు, తత్ - ఆ ధ్రువుడు కొట్టిన దెబ్బను, ప్రతీకర్తుమ్ - ప్రతీకారమును చేయుటకు, ఇచ్ఛంతః - కోరుచున్న, త్రయోదశ అయుతాని - లక్ష ముప్పై వేలమంది యక్షులు, పరిఘనిస్త్రింశైః - గుదియలతో కత్తులతో, ప్రాసశూలపరశ్వధైః - ఈటెలతో శూలములతో గండ్రగొడ్డళ్లతో, శక్తి-ఋష్టిభిః - చిల్లకోలలతో మరియొక రకము ఈటెలతో, భుశుండీభిః - భుశుండి అనే ఆయుధముల తో, చిత్రవాజైః - రంగు రంగుల రెక్కలు గల, శరైః అపి - బాణములతో కూడ, సరథమ్ - రథముతో కూడియున్న, సహసారథిమ్ - సారథితో కూడియున్న ధ్రువుని, అభ్యవర్షన్ - అభిముఖముగా గుప్పించిరి.

అప్పుడా లక్ష ముప్పై వేలమంది యక్షులు చాల కోపించి ధ్రువుడు కొట్టిన దెబ్బకు బదులుగా దెబ్బను కొట్టగోరిరి. వారు ఆయనపై రథముపై మరియు సారథిపై గుదియలను, కత్తులను, రకరకముల ఈటెల

ను, శూలములను, గండ్రగొడ్డళ్లను, చిల్లకోలలను, భుశుండులను, రంగు రంగుల రెక్కలు గల బాణములను కూడ వర్షమువలె గుప్పించిరి.

ఔత్తానపాదిస్స తదా శస్త్రవర్షేణ భూరిణా ।
న ఉపాదృశ్యత చ్ఛన్న ఆసారేణ యథా గిరిః ।। 13

తదా - అప్పుడు, ఔత్తానపాదిః - ఉత్తానపాదుని పుత్రుడగు, సః - ఆ ధ్రువుడు, భూరిణా - పెద్ద, శస్త్రవర్షేణ - ఆయుధముల వర్షముచే, ఆసారేణ - కుండపోత వర్షముచే, గిరిః యథా - పర్వతము వలె, ఛన్నః - కప్పివేయబడినవాడై, న ఉపాదృశ్యత - దగ్గరనుండి కూడ కానరాలేదు.

ఉత్తానపాదుని పుత్రుడగు ధ్రువుని వారు ప్రయోగించిన ఆయుధముల పెద్ద వర్షము కప్పివేయుటచే, ఆతడు దగ్గరనుండి కూడ కనబడలేదు. కుండపోత వర్షముచే కప్పివేయబడి కనబడని పర్వతమువలె ఆతడు చెక్కు చెదరకుండగా నుండెను.

హాహాకారస్తదైవాసీత్సిద్ధానాం దివి పశ్యతామ్ ।
హతోఽయం మానవస్సూర్యో మగ్నః పుణ్యజనార్ణవే ।। 14

తదా ఏవ - అదే సమయమునందు, దివి - అంతరిక్షమునందు, పశ్యతామ్ - చూచుచున్న, సిద్ధానామ్ - సిద్ధుల, హాహాకారః - హాహాకారము, ఆసీత్ - ఆయెను, మానవః - మనువు వంశములో పుట్టిన, అయమ్ - ఈ, సూర్యః - సూర్యుడు, పుణ్యజన-అర్ణవే - యక్షులు అనే సముద్రమునందు, మగ్నః - మునిగిపోయినాడు.

అదే సమయములో అంతరిక్షములోనుండి యుద్ధమును తిలకించుచున్న సిద్ధులు ఈ విధముగా హాహాకారములను చేసిరి : మనువు వంశములో పుట్టి సూర్యుని వలె ప్రకాశించే ఈ ధ్రువుడు యక్షసైన్యము అనే సముద్రములో మునిగి కనబడకుండా పోయినాడు.

నదత్సు యాతుధానేషు జయకాశిష్వథో మృధే ।
ఉదతిష్ఠద్రథస్తస్య నీహారాదివ భాస్కరః ।। 15

మృధే - యుద్ధమునందు, జయకాశిషు - విజయమును ప్రకటించుకొనుచున్న, యాతుధానేషు - యక్షులు, నదత్సు - నాదమును చేయుచుండగా, అథో - వెంటనే, తస్య - ఆ ధ్రువుని, రథః - రథము, నీహారాత్ - పొగమంచునుండి, భాస్కరః ఇవ - సూర్యుడు వలె, ఉత్-అతిష్ఠత్ - పైకి వచ్చెను.

యక్షులు తామే నెగ్గితిమని ప్రకటిస్తూ జయనాదములను చేయుచుండిరి. ఇంతలో పొగమంచునుండి సూర్యుడు ఆవిర్భవించునట్లుగా, ఆ ధ్రువుని రథము హఠాత్తుగా ఆవిర్భవించెను.

ధనుర్విస్ఫూర్జయన్ దివ్యం ద్విషతాం ఖేదముద్వహన్ ।
అస్త్రౌఘం వ్యధమద్బాణైర్ఘనానీకమివానిలాః ॥ 16

దివ్యమ్ - దివ్యమగు, ధనుః - ధనస్సును, విస్ఫూర్జయన్ - టంకారమును చేయుచున్నవాడై, ద్విషతామ్ - శత్రువులకు, ఖేదమ్ - దుఃఖమును, ఉద్వహన్ - కలిగించుచున్న ధ్రువుడు, అస్త్ర-ఓఘమ్ - ఆయుధముల సమూహమును, బాణైః - బాణములతో, ఘన-అనీకమ్ - మేఘముల గుంపును, అనిలాః ఇవ - గాలులు వలె, వ్యధమత్ - చెదరగొట్టెను.

ధ్రువుడు దివ్యమగు ధనస్సుయొక్క నారిత్రాటిని సవరించి టంకారధ్వనిని చేయుచుండెను. ఆ విధముగా అతడు శత్రువులకు ఖేదమును కలిగిస్తూ, బాణములతో వారి ఆయుధముల సమూహమును, సుడిగాలులు మేఘముల గుంపును వలె, చెదరగొట్టెను.

తస్య తే చాపనిర్ముక్తా భిత్త్వా వర్మాణి రక్షసామ్ ।
కాయానావివిశుస్తిగ్మా గిరీనశనయో యథా ॥ 17

తస్య - ఆ ధ్రువుని, చాపనిర్ముక్తాః - ధనస్సునుండి విడిచిపెట్టబడినట్టియు, తిగ్మాః - వాడియైన, తే - ఆ బాణములు, రక్షసామ్ - యక్షుల, వర్మాణి - కవచములను, భిత్త్వా - పగులగొట్టి, అశనయః - పిడుగులు,

గిరీన్ యథా - పర్వతములను వలె, కాయాన్ - శరీరములను, అవివిశుః - ప్రవేశించినవి.

ధ్రువుడు తన ధనస్సునుండి విడిచిపెట్టిన ఆ వాడి బాణములు, పర్వతములపై పడిన పిడుగులు వలె, యక్షుల కవచములను పగులగొట్టి, వారి దేహములలో ప్రవేశించినవి.

భల్లైస్సంఛిద్యమానానాం శిరోభిశ్చారుకుండలైః ।
ఊరుభిర్హేమతాలాభైర్దోర్భిర్వలయవల్గుభిః ॥ 18

హారకేయూరముకుటైరుష్ణీషైశ్చ మహాధనైః ।
ఆస్తృతాస్తా రణభువో రేజుర్వీరమనోహరాః ॥ 19

భల్లైః - అర్ధచంద్రాకార బాణములచే, సంఛిద్యమానానామ్ - తెగ గొట్టబడుచున్న, చారుకుండలైః - అందమైన కుండలములు గల, శిరోభిః - తలలతో, హేమతాల-ఆభైః - బంగరు తాడిచెట్లను పోలియున్న, ఊరుభిః - తొడలతో, వలయవల్గుభిః - కంకణములతో అందముగానున్న, దోర్భిః - భుజములతో, హారకేయూరముకుటైః - హారములు అంగదములు కిరీట ములతో, చ - మరియు, మహాధనైః - మిక్కిలి విలువైన, ఉష్ణీషైః - తల పాగలతో, ఆస్తృతాః - విసిరివేయబడియున్న, తాః - ఆ, రణభువః - యుద్ధము జరిగిన స్థానములు, వీరమనోహరాః - శూరుల మనస్సులను దోచివేయునవై, రేజుః - ప్రకాశించినవి.

యుద్ధము జరిగిన ఆ స్థానములలో అంతటా, ధ్రువుని అర్ధచంద్రా కార బాణములచే తెగగొట్టబడిన యక్షుల అందమైన కుండలములు గల తలలు, బంగరు తాడిచెట్లను పోలియున్న తొడలు, కంకణములతో అంద ముగానున్న భుజములు, హారములు, అంగదములు, కిరీటములు, మిక్కిలి విలువైన తలపాగలు చెల్లాచెదరుగా పడి ప్రకాశించినవి. ఆ దృశ్యము శూర పురుషుల మనస్సును దోచివేయ సమర్థమై యున్నది.

హతావశిష్టా ఇతరే రణాజిరాత్
రక్షోగణాః క్షత్రియవర్యసాయకైః ।

ప్రాయో వివృక్ణావయవా విదుద్రువుః
మృగేంద్రవిక్రీడితయూథపా ఇవ ॥ 20

క్షత్రియవర్యసాయకైః - క్షత్రియవీరుడగు ధ్రువుని బాణములచే, హత-అవశిష్టాః - చంపబడగా మిగిలిన, ఇతరే - ఇతరులగు, రక్షోగణాః - యక్షుల గణములు, ప్రాయః - చాలవరకు, వివృక్ణ-అవయవాః - తెగగొట్టబడిన అవయవములు గలవారై, మృగ-ఇంద్రవిక్రీడితయూథపాః ఇవ - సింహముచే తరుమబడిన ఏనుగులు వలె, రణ-అజిరాత్ - యుద్ధరంగము నుండి, విదుద్రువుః - అన్ని వైపులకు పారిపోయిరి.

క్షత్రియవీరుడగు ధ్రువుడు సంహరించగా మిగిలిన యక్షుల గణములలో చాలమందికి అవయవములు తెగగొట్టబడెను. వారు యుద్ధరంగమును విడిచిపెట్టి, సింహముచే తరుమబడిన ఏనుగుల వలె, అన్ని వైపులకు పారిపోయిరి.

అపశ్యమానస్స తదాఽఽతతాయినం
మహామృధే కంచన మానవోత్తమః ।
పురీం దిదృక్షన్నపి నావిశద్ద్విషాం
న మాయినాం వేద చికీర్షితం జనః ॥ 21

తదా - అప్పుడు, మానవ-ఉత్తమః - మనువంశమువారిలో శ్రేష్ఠుడగు, సః - ఆ ధ్రువుడు, మహామృధే - ఆ గొప్ప యుద్ధములో, ఆతతాయినమ్ - ఆయుధమును దాల్చియున్నవానిని, కంచన - ఎవ్వనినైననూ, అపశ్యమానః - కానరానివాడై, ద్విషామ్ - శత్రువులగు యక్షుల, పురీమ్ - అలకాపురిని, దిదృక్షన్ అపి - చూడాలనే కోరిక గలవాడే అయినప్పటికీ, న అవిశత్ - ప్రవేశించలేదు, మాయినామ్ - మాయావుల, చికీర్షితమ్ - చేయగోరుదానిని, జనః - మానవుడు, న వేద - తెలియలేదు.

అప్పుడు మనువంశతిలకుడగు ధ్రువునకు ఆ గొప్ప యుద్ధభూమిలో ఆయుధమును పట్టి నిలబడినవాడు ఒక్కడైననూ కనబడలేదు. ఆతనికి శత్రువులగు యక్షుల అలకానగరమును చూడాలనే కోరిక కలిగిననూ, నగరములోనికి ప్రవేశించలేదు. మాయావులగు యక్షులు ఏమి చేయదల

చుకున్నారో ఊహించుట మనకు సంభవము కాదు సుమా! (అని అతడు సారథితో పలికెను).

ఇతి బ్రువంశ్చిత్రరథస్స్వసారథిం
యత్తః పరేషాం ప్రతియోగశంకితః ।
శుశ్రావ శబ్దం జలధేరివేరితం
నభస్వతో దిక్షు రజోऽన్వదృశ్యత ॥ 22

చిత్రరథః - రంగు రంగుల రథము గల ధ్రువుడు, ఇతి - ఈ విధముగా, స్వసారథిమ్ - తన సారథిని ఉద్దేశించి, బ్రువన్ - పలుకుచున్నవాడై, పరేషామ్ - శత్రువులగు యక్షులయొక్క, ప్రతియోగశంకితః - బదులు దండెత్తుటను శంకించినవాడై, యత్తః - ప్రయత్నశీలుడై, జలధేః ఇవ - సముద్రమునుండి వలె, ఈరితమ్ - పుట్టిన, శబ్దమ్ - శబ్దమును, శుశ్రావ - వినెను, నభస్వతః - వాయువు వలన, దిక్షు - దిక్కులయందు, రజః - ధూళి, అను-అదృశ్యత - వెనువెంటనే కనబడెను.

రంగు రంగుల రథము గల ధ్రువుడు తన సారథితో ఈ విధముగా పలుకుతూనే, శత్రువులగు యక్షులు మరల తనపై దండెత్తుదురనే శంక గలవాడై, దానిని ఎదుర్కొనుటకు తగిన యత్నమును చేయుచుండెను. ఇంతలోనే ఆయన సముద్రఘోషవంటి శబ్దమును వినెను. దాని వెంటనే, దిక్కులలో వాయువుచే రేగగొట్టబడిన ధూళి కానవచ్చెను.

క్షణేనాచ్ఛాదితం వ్యోమ ఘనానీకేన సర్వతః ।
విస్ఫురత్తడితా దిక్షు త్రాసయత్స్తనయిత్నునా ॥ 23

విస్ఫురత్-తడితా - విశేషముగా వెలిగిపోయే మెరుపులు కలిగినట్టియు, త్రాసయత్-స్తనయిత్నునా - భయమును గొల్పే పిడుగులు గల, ఘన-అనీకేన - మేఘముల గుంపుచే, వ్యోమ - ఆకాశము, సర్వతః - అన్ని, దిక్షు - దిక్కులయందు, క్షణేన - క్షణకాలములో, ఆచ్ఛాదితమ్ - కప్పివేయబడెను.

క్షణకాలములో ఆకాశము అన్ని దిక్కులయందు మేఘముల గుంపులతో నిండిపోయెను. ఆ మేఘములలో మెరుపులు విశేషముగా ప్రకాశించుచుండగా, పిడుగులు భయమును గొల్పుచుండెను.

వవృషూ రుధిరౌఘాసృక్పూయవిణ్మూత్రమేదసః ।
నిపేతుర్గగనాదస్య కబంధాన్యగ్రతోఽనఘ ॥ 24

అనఘ - పాపమునెరుంగని ఓ విదురా!, రుధిర-ఓఘ-అసృక్-పూయవిట్-మూత్రమేదసః - రక్తముల ధారలను శ్లేష్మము మొదలగు ద్రవములను చీమును మలమూత్రములను క్రొవ్వును, వవృషుః - వర్షించినవి, అస్య - ఈ ధ్రువునకు, అగ్రతః - ఎదుట, గగనాత్ - ఆకాశమునుండి, కబంధాని - మొండెములు, నిపేతుః - పడినవి.

పాపమునెరుంగని ఓ విదురా! ఆ మేఘములు రక్తముల ధారలను, శ్లేష్మము మొదలగు ద్రవద్రవ్యములను, చీమును, మలమూత్రములను, క్రొవ్వును వర్షించినవి. ఆ ధ్రువుని ఎదుట ఆకాశమునుండి మొండెములు వచ్చి పడినవి.

తతః ఖేఽదృశ్యత గిరిర్నిపేతుస్సర్వతోదిశమ్ ।
గదాపరిఘనిస్త్రింశముశలాస్సాశ్మవర్షిణః ॥ 25

తతః - ఆ తరువాత, ఖే - ఆకాశమునందు, గిరిః - పర్వతము, అదృశ్యత - కనబడెను, స-అశ్మవర్షిణః - రాళ్లతో కూడిన వర్షమును కలిగించే, గదాపరిఘనిస్త్రింశముశలాః - గదలు గుదియలు కత్తులు రోకళ్లు, సర్వతః-దిశమ్ - అన్ని దిక్కులయందు, నిపేతుః - పడినవి.

ఆ తరువాత ఆకాశమునందు పర్వతము కనబడెను. అన్ని దిక్కులయందు రాళ్ల వర్షముతో బాటు గదలు, గుదియలు, కత్తులు మరియు రోకళ్లు పడెను.

అహయోఽశనినిశ్శ్వాసా వమంతోఽగ్నిం రుషాక్షిభిః ।
అభ్యధావన్ గజా మత్తాస్సింహవ్యాఘ్రాశ్చ యూథశః ॥ 26

అశనినిశ్వాసాః - పెద్ద ధ్వనితో కూడిన మంటలే నిట్టూర్పులుగా గలిగినట్టియు, రుషా - కోపముతో, అక్షిభిః - కళ్లతో, అగ్నిమ్ - అగ్నిని, వమంతః - వెడల గ్రక్కుచున్న, అహయః - పాములు, మత్తాః - మదించిన, గజాః - ఏనుగులు, చ - మరియు, సింహవ్యాఘ్రాః - సింహములు పెద్ద పులులు, యూథశః - గుంపులు గుంపులుగా, అభ్యధావన్ - ధ్రువుని వైపునకు పరుగెత్తినవి.

పెద్ద ధ్వనితో కూడిన మంటలే నిశ్వాసముగా గల పాములు కళ్లతో నిప్పులను గ్రక్కుచూ కోపముతో ధ్రువుని వైపునకు ఉరికినవి. మదించిన ఏనుగులు, సింహములు, పెద్దపులులు కూడ ఆయన వైపునకు పరుగెత్తినవి.

సముద్ర ఊర్మిభిర్భీమః ప్లావయన్ సర్వతో భువమ్ ।
ఆససాద మహాహ్రాదః కల్పాంత ఇవ భీషణః ॥ 27

ఊర్మిభిః - తరంగములతో, భీమః - భయమును గొల్పునది, భువమ్ - నేలను, సర్వతః - అన్నివైపులా, ప్లావయన్ - ముంచెత్తుచున్నది, మహాహ్రాదః - పెద్ద ధ్వని గలది, కల్ప-అంతే ఇవ - ప్రళయకాలమునందు వలె, భీషణః - ఉగ్రమైనది అగు, సముద్రః - సముద్రము, ఆససాద - సమీపించెను.

తరంగములతో భయమును గొల్పుతూ, పెద్ద శబ్దమును చేస్తూ, ప్రళయకాలమునందు వలె భీషణమగు సముద్రము నేలను అన్ని వైపులా ముంచెత్తుతూ దగ్గరకు వచ్చెను.

ఏవంవిధాన్యనేకాని త్రాసనాన్యమనస్వినామ్ ।
ససృజుస్తిగ్మగతయ ఆసుర్యా మాయయాఽసురాః ॥ 28

తిగ్మగతయః - క్రూరమగు ప్రవృత్తి గల, అసురాః - యక్షులు, ఆసుర్యా - అసురులకు చెందిన, మాయయా - మాయచే, అమనస్వినామ్ - బేల మనసు గలవారలకు, త్రాసనాని - భయమును గొల్పే, ఏవంవిధాని

- ఇటువంటి, అనేకాని - అనేకములగు దృశ్యములను, ససృజుః - సృష్టించిరి.

క్రూరమగు ప్రవృత్తి గల ఆ యక్షులు రాక్షసమాయచే ఈ విధమగు అనేకములైన దృశ్యములను సృష్టించిరి. కాని, ఇవి బేల మనసు గలవారికి మాత్రమే భయమును గొల్పును.

ధ్రువే ప్రయుక్తామసురైస్తాం మాయామతిదుస్తరామ్ ।
నిశమ్య తస్య మునయశ్శమాశంసన్ సమాగతాః ॥ 29

అసురైః - యక్షులచే, ధ్రువే - ధ్రువునియందు, ప్రయుక్తామ్ - ప్రయోగించబడినట్టియు, అతిదుస్తరామ్ - సుతరాము దాటుటకు శక్యము కాని, తామ్ - ఆ, మాయామ్ - మాయను, నిశమ్య - చూచి, సమాగతాః - అచటకు వచ్చియున్న, మునయః - మహర్షులు, తస్య - ఆ ధ్రువునకు, శమ్ - శుభమును, ఆశంసన్ - ప్రార్థించిరి.

యక్షులు ధ్రువునియందు ప్రయోగించిన ఆ మాయను దాటుట సుతరాము శక్యము కాదు. అచటకు వచ్చిన మహర్షులు దానిని చూచి, ధ్రువునకు శుభము కలుగుటకై ప్రార్థనలను చేసిరి.

మునయ ఊచుః ।
ఔత్తానపాదే భగవాంస్తవ శార్‌ఙ్గధన్వా
దేవః క్షిణోత్వవనతార్తిహరో విపక్షాన్ ।
యన్నామధేయమభిధాయ నిశమ్య చాద్ధా
లోకోఽంజసా తరతి దుస్తరమంగ మృత్యుమ్ ॥ 30

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే చతుర్థస్కంధే
దశమోఽధ్యాయః ॥

అంగ - ఓయీ!, ఔత్తానపాదే - ఉత్తానపాదుని పుత్రుడవగు ఓ ధ్రువా!, భగవాన్ - భగవానుడు, శార్‌ఙ్గధన్వా - శార్‌ఙ్గము అనే ధనస్సు కలిగినవాడు, అవనత-ఆర్తిహరః - నమస్కరించువారి కష్టములను పోగొ

ట్టువాడు అగు, దేవః - శ్రీహరి దేవుడు, తవ - నీ, విపక్షాన్ - శత్రువులను, క్షిణోతు - నశింపజేయుగాక!, యత్-నామధేయమ్ - ఏ శ్రీహరియొక్క నామమును, అభిధాయ - ఉచ్చరించి, నిశమ్య - విని, లోకః - మానవుడు, అద్ధా - సాక్షాత్తుగా, అంజసా - తేలికగా, దుస్తరమ్ - తరింప శక్యము గాని, మృత్యుమ్ - మృత్యువును, తరతి - తరించుచున్నాడో.

ఓయీ ఉత్తానపాదుని పుత్రుడవగు ధ్రువా! శార్ఙ్గమనే ధనస్సు గల శ్రీహరి భగవానుడు నమస్కరించువారి కష్టములను బాపును. ఆ దేవుడు నీ శత్రువులను నాశనము చేయుగాక! ఆయన నామధేయమును ఉచ్చరించి వినే మానవుడు తరింప శక్యము కాని మృత్యువును సాక్షాత్తుగా తేలికగా తరించి వేయును.

శ్రీమద్భాగవత మహాపురాణములోని నాల్గవ స్కంధమునందు
ధ్రువునకు యక్షులతోడి యుద్ధమును వర్ణించే
పదవ అధ్యాయము ముగిసినది (10).

*****

# అథ ఏకాదశోఽధ్యాయః

## ధ్రువోపాఖ్యానము - ధ్రువునకు మనువు తత్త్వమునుపదేశించుట

మైత్రేయ ఉవాచ ।
నిశమ్య గదతామేవమృషీణాం ధనుషి ధ్రువః ।
సందధేఽస్త్రముపస్పృశ్య యన్నారాయణనిర్మితమ్ ॥ 1

మైత్రేయః - మైత్రేయుడు, ఉవాచ - పలికెను, ధ్రువః - ధ్రువుడు, ఋషీణామ్ - మహర్షులు, ఏవమ్ - ఈ విధముగా, గదతామ్ - మాటలాడుచుండగా, ఉపస్పృశ్య - ఆచమనము చేసి, ధనుషి - ధనస్సునందు, అస్త్రమ్ - అస్త్రమును, సందధే - ఎక్కుపెట్టెను, యత్ - ఏదైతే, నారాయణనిర్మితమ్ - నారాయణునిచే నిర్మించబడినదో.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- మహర్షులు ఈ విధముగా మాటలాడుచుండగా ధ్రువుడు వినెను. ఆతడు వెంటనే ఆచమనమును చేసి, ధనస్సుపై నారాయణునిచే నిర్మించబడిన అస్త్రమును సంధించెను.

సంధీయమాన ఏతస్మిన్మాయా గుహ్యకనిర్మితాః ।
క్షిప్రం వినేశుర్విదుర క్లేశా జ్ఞానోదయే యథా ॥ 2

విదుర - ఓ విదురా!, ఏతస్మిన్ - ఈ అస్త్రము, సంధీయమానే - సంధించబడుచుండగా, గుహ్యకనిర్మితాః - యక్షులచే సృష్టించబడిన, మాయాః - మాయలు, జ్ఞాన-ఉదయే - ఆత్మజ్ఞానము కలుగగా, క్లేశాః యథా - చిత్తమలములు వలె, క్షిప్రమ్ - శీఘ్రముగా, వినేశుః - పూర్తిగా అదృశ్యమైనవి.

ఓ విదురా! ఆ నారాయణాస్త్రమును సంధించుచుండగనే, యక్షులు కల్పించిన మాయలన్నియు, ఆత్మజ్ఞానము కలుగగానే అవిద్య (అజ్ఞానము) అస్మిత (అహంకారము) రాగము ద్వేషము అభినివేశము (మరణభయము) అనే చిత్తమలములు నశించునట్లుగా, శీఘ్రముగా కనబడకుండా పోయినవి.

తస్యాఽఽర్షమస్త్రం ధనుషి ప్రయుంజతః
సువర్ణపుంఖాః కలహంసవాససః ।
వినిస్సృతా నిర్వివిశుర్ద్విషద్బలం
యథా వనం భీమరవాశ్శిఖండినః ॥ 3

తస్య - ఆ ధ్రువుడు, ఆర్షమ్ - నారాయణ-ఋషినుండి పుట్టిన, అస్త్రమ్ - నారాయణాస్త్రమును, ధనుషి - ధనస్సునందు, ప్రయుంజతః - సంధించుచుండగా, సువర్ణపుంఖాః - బంగరు కొనలు గలవి, కలహంసవాససః - రాజహంసల రెక్కలవంటి రెక్కలు గలవి, భీమరవాః - భయంకరముగు ధ్వనులు గల బాణములు, వినిస్సృతాః - బయటకు వచ్చినవై, శిఖండినః - నెమళ్లు, వనం యథా - అడవిని వలె, ద్విషత్-బలమ్ - శత్రుసైన్యమును, నిర్వివిశుః - ప్రవేశించినవి.

నారాయణాస్త్రమును నారాయణ-ఋషి ఆవిష్కరింపజేసినాడు. దానిని ధ్రువుడు ధనస్సునందు సంధించుచుండగనే, బంగరు కొనల బాణములు బయటకు వచ్చి భయంకరమగు శబ్దమును చేస్తూ, నెమళ్లు అడవిలో ప్రవేశించే విధముగా, శత్రుసైన్యములోనికి ప్రవేశించినవి. ఆ బాణముల రెక్కలు రాజహంసల రెక్కల వలె శోభిల్లెను.

తైస్తిగ్మధారైః ప్రధనే శిలీముఖైః
ఇతస్తతః పుణ్యజనా ఉపద్రుతాః ।
తమభ్యధావన్ కుపితా ఉదాయుధాః
సుపర్ణమున్నద్ధఫణా ఇవాహయః ॥ 4

ప్రధనే - యుద్ధభూమియందు, తిగ్మధారైః - వాడి అంచులు గల, తైః - ఆ, శిలీముఖైః - బాణములచే, ఉపద్రుతాః - కొట్టబడిన, పుణ్యజనాః - యక్షులు, కుపితాః - కోపించినవారై, ఉత్-ఆయుధాః - పైకి ఎత్తి పట్టుకున్న ఆయుధములు గలవారై, ఉన్నద్ధఫణాః - పైకి ఎత్తబడిన పడగలు గల, అహయః - పాములు, సుపర్ణం ఇవ - గరుత్మంతుని వలె, తమ్ - ఆ ధ్రువుని, ఇతః - ఈ వైపునుండి, తతః - ఆ వైపునుండి, అభ్యధావన్ - అభిముఖముగా ఉరికిరి.

యుద్ధభూమిలో ఆ వాడి అంచులు గల బాణములచే కొట్టబడిన యక్షులు చాల కోపించి ఆయుధములను పైకి ఎత్తి పట్టుకొని, పడగలనెత్తిన పాములు గరుత్మంతుని పైకి వెళ్లే విధముగా, ధ్రువుని పైకి అన్ని వైపుల నుండియు దండెత్తిరి.

స తాన్ పృషత్కైరభిధావతో మృధే
నికృత్తబాహూరుశిరోధరోదరాన్ ।
నినాయ లోకం పరమర్కమండలం
వ్రజంతి నిర్భిద్య యమూర్ధ్వరేతసః ॥ 5

సః - ఆ ధ్రువుడు, మృధే - యుద్ధమునందు, అభిధావతః - మీదకు ఉరుకుచున్నట్టియు, పృషత్కైః - బాణములచే, నికృత్తబాహు-ఊరు-శిరోధర-ఉదరాన్ - తెగగొట్టబడిన బాహువులు తొడలు మెడలు మరియు ఉదరములు గల, తాన్ - ఆ యక్షులను, అర్కమండలమ్ - సూర్యమండలమును, పరమ్ - అధిగమించి ఉండే, లోకమ్ - సత్యలోకమును గురించి, నినాయ - పంపించెను, యమ్ - ఏ లోకమును గురించి, ఊర్ధ్వరేతసః - నైష్ఠిక బ్రహ్మచారులు, అర్కమండలమ్ - సూర్యమండలమును, నిర్భిద్య - భేదించుకొని, వ్రజంతి - వెళ్లెదరో.

ఆ ధ్రువుడు యుద్ధములో తన మీదకు ఉరుకుచున్న ఆ యక్షుల చేతులను తొడలను మెడలను ఉదరములను బాణములతో తెగగొట్టి, సూర్యమండలమును దాటి ఉండే సత్యలోకమునకు పంపించెను. నైష్ఠికబ్రహ్మచారులు సూర్యమండలమును భేదించుకొని పొందే లోకము అదియే.

**తాన్ హన్యమానానభివీక్ష్య గుహ్యకాన్**
**అనాగసశ్చిత్రరథేన భూరిశః ।**
**ఔత్తానపాదిం కృపయా పితామహో**
**మనుర్జగాదోపగతస్సహర్షిభిః ॥ 6**

చిత్రరథేన - రంగు రంగుల రథము గల ధ్రువునిచే, భూరిశః - పెద్ద సంఖ్యలో, హన్యమానాన్ - సంహరించబడుచున్నట్టియు, అనాగసః - తప్పు చేయని, తాన్ - ఆ, గుహ్యకాన్ - యక్షులను, అభివీక్ష్య - చూచి, పితామహః - తాతగారగు, మనుః - స్వాయంభువ మనువు, ఋషిభిః సహ - మహర్షులతో గూడి, ఉపగతః - వచ్చినవాడై, కృపయా - దయతో, ఔత్తానపాదిమ్ - ఉత్తానపాదుని పుత్రుడగు ధ్రువుని ఉద్దేశించి, జగాద - పలికెను.

రంగు రంగుల అద్భుతమైన రథము గల ధ్రువుడు తప్పు చేయని ఆ యక్షులను పెద్ద సంఖ్యలో సంహరించుచుండగా, ఆయన తాతగారగు స్వాయంభువ మనువు చూచెను. ఆయన మహర్షులతో గూడి అచటకు వచ్చి, దయచే ఉత్తానపాదుని పుత్రుడగు ధ్రువునితో ఇట్లు పలికెను.

**మనురువాచ ।**

**అలం వత్సాతిరోషేణ తమోద్వారేణ పాప్మనా ।**
**యేన పుణ్యజనానేతానవధీస్త్వమనాగసః ॥ 7**

వత్స- బాబూ!, పాప్మనా - పాపమును కలిగించునట్టియు, తమోద్వారేణ - నరకము (సంసారము) నకు ద్వారమైన, అతిరోషేణ - తీవ్రమగు కోపముతో, అలమ్ - చాలును, యేన - ఏ కోపముచే, త్వమ్ - నీవు, అనాగసః - తప్పు చేయని, ఏతాన్ - ఈ, పుణ్యజనాన్ - యక్షులను, అవధీః - సంహరించితివో.

బాబూ! తీవ్రమగు కోపము పాపమును కలిగించి వ్యక్తిని నరకమునకు గొనిపోవును. సంసారములో వ్యక్తిని త్రిప్పే అట్టి కోపమును విడిచిపెట్టుము. నీవా కోపముచేతనే నిరపరాధులగు ఈ యక్షులను చంపితివి.

నాస్మత్కులోచితం తాత కర్మైతత్సద్విగర్హితమ్ ।
వధో యదుపదేవానామారబ్ధస్తేఽకృతైనసామ్ ॥ 8

తాత - బాబూ!, ఏతత్ - ఈ, సత్-విగర్హితమ్ - సత్పురుషులచే విశేషముగా నిందించబడిన, కర్మ - పని, అస్మత్-కుల-ఉచితమ్ - మన వంశమునకు తగినది, న - కాదు, యత్ - ఏలయనగా, తే - నీచే, అకృత-ఏనసామ్ - చేయబడని తప్పు గల, ఉపదేవానామ్ - యక్షులయొక్క, వధః - సంహారము, ఆరబ్ధః - ఆరంభించబడినదో.

బాబూ! నీవు చేయుచున్న ఈ పనిని సత్పురుషులు అధికముగా నిందించినారు. ఇది మన వంశములో జన్మించిన నీకు తగదు. ఏలయనగా, నీవు తప్పు చేయని యక్షులను ఊచకోత కోయుట ఆరంభము చేసినావు.

నన్వేకస్యాపరాధేన ప్రసంగాద్బహవో హతాః ।
భ్రాతుర్వధాభితప్తేన త్వయాంగ భ్రాతృవత్సల ॥ 9

అంగ - ఓయీ!, భ్రాతృవత్సల - సోదరునియందు ప్రేమ గల వాడా!, భ్రాతుః - తమ్ముని, వధ-అభితప్తేన - వధచే చాల తాపమును పొందిన, త్వయా - నీచే, ఏకస్య - ఒక్కని, అపరాధేన - తప్పుచే, ప్రసంగాత్ - వానితోడి సంబంధము వలన, బహవః - చాలమంది, నను హతాః - సంహరించబడినారు సుమా!

ఓయీ! నీకు సోదరునియందు ప్రేమ మెండు. కాని, సోదరుని వధచే సంతాపమును చెందిన నీవు, ఒక్కడు చేసిన తప్పునకు, వాని సంబంధీకులలో చాలమందిని సంహరించినావు సుమా!

నాయం మార్గో హి సాధూనాం హృషీకేశానువర్తినామ్ ।
యదాత్మానం పరాగ్గృహ్య పశువద్భూతవైశసమ్ ॥ 10

హృషీకేశ-అనువర్తినామ్ - ఇంద్రియాధిపతియగు శ్రీహరిని అనుసరించే, సాధూనామ్ - సత్పురుషుల, మార్గః - మార్గము, అయమ్ - ఇది, న హి - కాదు సుమా!, యత్ - ఏదైతే, పరాక్ - అనాత్మయగు దేహ

మును, ఆత్మానమ్ - ఆత్మనుగా, గృహ్యా - స్వీకరించి, పశువత్ - పశువులు వలె, భూతవైశసమ్ - ప్రాణులను హింసించుట గలదో.

పశువులు దేహాభిమానము గలవియై ఒకదానిని మరియొకటి హింసించును. అదే విధముగా నీవు కూడ దేహమే ఆత్మయని స్వీకరించి ఇతరులను సంహరించుట మంచిది కాదు. సర్వాంతర్యామియగు శ్రీహరి యొక్క భక్తులైన నీవంటి సత్పురుషులు అనుసరించ దగిన పద్ధతి ఇది కాదు సుమా!

సర్వభూతాత్మభావేన భూతావాసం హరిం భవాన్ ।
ఆరాధ్యాఽఽప దురారాధ్యం విష్ణోస్తత్పరమం పదమ్ ॥ 11

భవాన్ - నీవు, భూత-ఆవాసమ్ - ప్రాణులలో అంతర్యామియై ఉన్నట్టియు (ప్రాణులకు అధిష్ఠానమైనట్టియు), దురారాధ్యమ్ - ఆరాధించుట శక్యము కాని, హరిమ్ - శ్రీహరిని, సర్వభూత-ఆత్మభావేన - సకల ప్రాణులు ఆత్మరూపములే అనే అవగాహనతో, ఆరాధ్య - ఆరాధించి, విష్ణోః - శ్రీహరియొక్క, తత్ - ఆ, పరమమ్ - సర్వాతిశాయియగు, పదమ్ - ధామమును, ఆప - పొందినావు.

సకలప్రాణులకు అధిష్ఠానము మరియు సకలప్రాణులలో అంతర్యామిగా ఉండే శ్రీహరిని ఆరాధించుట కష్టము. అయిననూ, నీవు ఆయనను సర్వప్రాణులు ఆత్మరూపములే అనే అవగాహనతో ఆరాధించి, సర్వవ్యాపకుడగు శ్రీహరియొక్క సర్వాతిశాయి, వేదములయందు ప్రసిద్ధము అగు ధామమును సంపాదించినావు.

స త్వం హరేరనుధ్యాతస్తత్పుంసామపి సమ్మతః ।
కథం త్వవద్యం కృతవాననుశిక్షన్ సతాం వ్రతమ్ ॥ 12

హరేః - శ్రీహరికి, అనుధ్యాతః - స్మరించబడువాడవు, తత్-పుంసాం అపి - ఆ శ్రీహరి భక్తులకు కూడ, సమ్మతః - మంచివానిగా పరిగణించబడినవాడవు, సతామ్ - సత్పురుషుల (కు), వ్రతమ్ - నియమనిష్ఠను, అనుశిక్షన్ - నారదుని వలన నేర్చుకున్నవాడవు (నీ ఆచరణచే నేర్పు

వాడవు) అగు, సః - అట్టి, త్వం తు - నీవు కూడ, అవద్యమ్ - దోషము ను, కథం కృతవాన్ - ఎట్లు చేసితివి?

నీవు శ్రీహరి కూడ స్మరించేటంతటి గొప్ప భక్తుడవు. శ్రీహరి భక్తులు నిన్ను సాధు పురుషునిగా పరిగణించెదరు. పైగా, నీవు నారదుని వలన సత్పురుషులు పాటించదగిన నియమనిష్ఠలను కూడ నేర్చుకున్నావు. నీవు నీ ఆచరణచే సత్పురుషులకు కూడ మార్గదర్శకుడవు. అట్టి నీవు దోషమునెట్లు ఆచరించితివి?

తితిక్షయా కరుణయా మైత్ర్యా చాఖిలజంతుషు ।
సమత్వేన చ సర్వాత్మా భగవాన్ సంప్రసీదతి ॥ 13

సర్వ-ఆత్మా - సకలప్రాణులకు ఆత్మరూపములోనుండే, భగవాన్ - శ్రీహరి భగవానుడు, తితిక్షయా - సహనగుణముచే, కరుణయా - దయాగుణముచే, అఖిలజంతుషు - సకలప్రాణులయందు, మైత్ర్యా - ప్రేమభావముచే, చ - మరియు, సమత్వేన చ - సమబుద్ధిచే కూడ, సంప్రసీదతి - చక్కగా ప్రసన్నుడగును.

శ్రీహరి భగవానుడు సకలప్రాణులలో ఆత్మరూపముగా నున్నాడు. సుఖదుఃఖములయందు సహనగుణము, దయ, సకలప్రాణులయెడల ప్రేమభావము, మరియు సర్వము ఈశ్వరుడే అనే సమ (బ్రహ్మ) బుద్ధి ఉన్న వ్యక్తి విషయములో శ్రీహరి మిక్కిలి ప్రసన్నుడగును.

సంప్రసన్నే భగవతి పురుషః ప్రాకృతైర్గుణైః ।
విముక్తో జీవనిర్ముక్తో బ్రహ్మ నిర్వాణమృచ్ఛతి ॥ 14

భగవతి - భగవానుడు, సంప్రసన్నే - చక్కగా ప్రసన్నుడు కాగా, పురుషః - వ్యక్తి, ప్రాకృతైః - ప్రకృతికి సంబంధించిన, గుణైః - గుణముల చే, విముక్తః - విముక్తుడై, జీవనిర్ముక్తః -లింగశరీరమునుండి విముక్తుడై, నిర్వాణమ్ - ఆనందఘనమగు, బ్రహ్మ - పరబ్రహ్మను, ఋచ్ఛతి - పొందుచున్నాడు.

భగవంతుడు పూర్ణముగా ప్రసన్నుడైనచో, వ్యక్తి ప్రకృతియొక్క సత్త్వరజస్తమోగుణముల కార్యములగు సంసారమునుండియు మరియు సూక్ష్మశరీరమునుండి విముక్తిని పొంది, ఆనందఘనమగు పరబ్రహ్మ యందు ఐక్యమును పొందును.

భూతైః పంచభిరారబ్ధైర్యోషిత్పురుష ఏవ హి ।
తయోర్వ్యవాయాత్సంభూతిర్యోషిత్పురుషయోరిహ ।। 15

ఆరబ్ధైః - దేహాకారముగా మారిన, పంచభిః - ఐదు, భూతైః - భూతములచే, యోషిత్ - స్త్రీ, పురుషః ఏవ హి - పురుషుడు కూడ కలుగుచున్నారు, తయోః - వారిద్దరి, వ్యవాయాత్ - కలయిక వలన, ఇహ - ఈ లోకమునందు, యోషిత్-పురుషయోః - స్త్రీపురుషుల, సంభూతిః - పుట్టుక.

పంచభూతములే దేహాకారముగా మారి, ఈ లోకములో స్త్రీ మరియు పురుషుడు అగుచున్నవి. మరల ఆ స్త్రీపురుషుల కలయికచే మరియొక స్త్రీ గాని, పురుషుడు గాని పుట్టును.

ఏవం ప్రవర్తతే సర్గః స్థితిస్సంయమ ఏవ చ ।
గుణవ్యతికరాద్రాజన్మాయయా పరమాత్మనః ।। 16

రాజన్ - ఓ రాజా!, ఏవమ్ - ఈ విధముగా, పరమాత్మనః - పరమాత్మయొక్క, మాయయా - మాయచే, గుణవ్యతికరాత్ - గుణముల లోని తేడాల వలన, సర్గః - సృష్టి, స్థితిః - స్థితి, సంయమః ఏవ చ - ప్రళయము కూడ, ప్రవర్తతే - ప్రవర్తిల్లుచున్నది.

ఓ రాజా! ఈ విధముగా పరమేశ్వరుని మాయచే, సత్త్వరజస్తమో గుణముల రకరకముల మేళవింపుచే ప్రాణుల దేహములు పుట్టి, కొంతకాలము మనుగడను సాగించి, నశించుచున్నవి. (లేదా, జగత్తుయొక్క సృష్టి స్థితిలయములు ప్రవర్తిల్లుచున్నవి).

నిమిత్తమాత్రం తత్రాసీన్నిర్గుణః పురుషర్షభః ।
వ్యక్తావ్యక్తమిదం విశ్వం యత్ర భ్రమతి లోహవత్ ।। 17

తత్ర - ఆ సృష్టి మొదలగువాటియందు, నిర్గుణః - నిర్గుణుడగు, పురుష-ఋషభః - పరమాత్మయైతే, నిమిత్తమాత్రమ్ - నిమిత్తుడుగా మాత్రమే, ఆసీత్ - ఉండెను, యత్ర - ఏ పరమాత్మయందైతే, వ్యక్త-అవ్యక్తమ్ - స్థూలము సూక్ష్మము అగు, ఇదమ్ - ఈ, విశ్వమ్ - జగత్తు, లోహవత్ - లోహమువలె, భ్రమతి - తిరుగుచున్నదో.

పరమాత్మ నిర్గుణుడు. జగత్తుయొక్క సృష్టిస్థితిలయముల విషయములో పరమాత్మ నిమిత్తము మాత్రమే. అయస్కాంతము సన్నిధిలో ఇనుప ముక్క కదిలినట్లుగా, పరమాత్మ సన్నిధిలో అవ్యక్తమగు ప్రకృతి నుండి జగత్తు ఉదయించి, మరల ఆ ప్రకృతిలో విలీనమగుచూ, ఈ విధముగా ఈ సృష్టిచక్రము తిరుగుచుండును.

స ఖల్విదం భగవాన్ కాలశక్త్యా
గుణప్రవాహేణ విభక్తవీర్యః ।
కరోత్యకర్తైవ నిహంత్యహంతా
చేష్టా విభూమ్నః ఖలు దుర్విభావ్యా ॥ 18

కాలశక్త్యా - కాలమనే తన శక్తిచే, గుణప్రవాహేణ - గుణముల లోని సంక్షోభముచే, విభక్తవీర్యః - విభాగము చేయబడిన శక్తిగల, సః - అట్టి, భగవాన్ - భగవానుడు, అకర్తా ఏవ - కర్త కాకుండగనే, ఇదమ్ - ఈ జగత్తును, కరోతి - సృష్టించుచున్నాడు, అహంతా - హంత కాకుండగనే, నిహంతి - ఉపసంహరించుచున్నాడు, విభూమ్నః - పరబ్రహ్మయొక్క, చేష్టా - లీల, దుర్విభావ్యా ఖలు - ఊహకు అందనిది గదా!

పరమేశ్వరుని కాలరూపమగు శక్తిచే త్రిగుణాత్మికయగు ప్రకృతి యందు కదలిక వచ్చి, గుణముల సామ్యావస్థ చెదిరిపోవును. ఆ విధముగా పరమేశ్వరుని శక్తిలో సత్త్వరజస్తమోగుణముల కారణముగా సృష్టిస్థితిలయములు అనే విభాగము ఏర్పడును. ఈ విధముగా పరమేశ్వరుడు కర్త కాకుండగనే ఈ జగత్తును సృష్టించి, సంహర్త కాకుండగనే దీనిని ఉపసంహరించుచున్నాడు. ఆ పరబ్రహ్మయొక్క లీలలు ఊహకు అందవు గదా!

**సోఽనంతోఽంతకరః కాలోఽనాదిరాదికృదవ్యయః ।**
**జనం జనేన జనయన్ మారయన్ మృత్యునాంతకమ్ ।। 19**

**అనాదిః** - జన్మ లేనట్టియు, **అనంతః** - వినాశము లేనట్టియు, **అవ్యయః** - వికారములు లేనట్టియు, కాలః - కాలస్వరూపుడైన, సః - ఆ భగవానుడు, జనేన - జనునిచే, జనమ్ - జనుని, జనయన్ - పుట్టించుచు న్నవాడై, ఆదికృత్ - సృష్టికర్తయు, మృత్యునా - మృత్యురూపమగు ఒక ప్రాణిచే, అంతకమ్ - ఇతరులను సంహరించే ప్రాణిని కూడ, మారయన్ - సంహరింపజేయుచున్నవాడై, అంతకరః - సంహారకుడు.

కాలస్వరూపుడగు భగవానునకు జన్మ గాని, వికారములు గాని, వినాశము గాని లేవు. ఆయన ఒక ప్రాణిచే మరియొక ప్రాణికి జన్మని ప్పించి సృష్టికర్త యగుచున్నాడు. ఇతరప్రాణులను సంహరించే ప్రాణులను కూడ మృత్యురూపములోనున్న మరియొక ప్రాణిచే సంహరింపజేసి, సంహారకర్త యగుచున్నాడు.

న వై స్వపక్షోఽస్య విపక్ష ఏవ వా
పరస్య మృత్యోర్విశతస్సమం ప్రజాః ।
తం ధావమానమను ధావంత్యనీశా
యథా రజాంస్యనిలం భూతసంఘాః ।। 20

ప్రజాః - ప్రాణులను, సమమ్ - సమముగా, విశతః - ప్రవేశించున ట్టియు, పరస్య - ప్రాణుల ఉపాధులకు అతీతమైనట్టియు, మృత్యోః - మర ణమును కలిగించే కాలరూపుడైన, అస్య - ఈ ఈశ్వరునకు, స్వపక్షః - తన పక్షము గాని, విపక్షః ఏవ వా - శత్రుపక్షము అనేది గాని, న వై - నిశ్చయ ముగా లేదు, అనీశాః - అస్వతంత్రులగు, భూతసంఘాః - ప్రాణిసంఘము లు, ధావమానమ్ - పరుగెత్తుచున్న, తమ్ - ఆ కాలరూపుడగు ఈశ్వరుని, అను - అనుసరించి, రజాంసి - ధూళికణములు, అనిలం యథా - వాయు వును వలె, ధావంతి - పరుగెత్తుచున్నవి.

కాలరూపుడగు పరమేశ్వరుడు సకలప్రాణులలో సమముగా ప్రవే శించియున్నాడు. ఆయనయే కాలము రూపములో సకలప్రాణుల దేహము

లకు వినాశమును కలిగించుచున్నాడు. ఆయనకు ఈ విషయములో తనవారు అని గాని, పరాయివారు అని గాని వైషమ్యము లేదు. ఇది నిశ్చయము. వాయువు వీచుచుండగా ధూళి దానిని అనుసరించి పోవు విధముగా, అస్వతంత్రులగు ప్రాణులు కాలరూపుడగు ఈశ్వరుని పరుగును అనుసరించి పరుగెత్తుచున్నారు. అనగా, కర్మాధీనులగు ప్రాణులు కాలప్రవాహముచే సంసారములో పడి కొట్టుకొని పోవుచున్నారు.

ఆయుషోఽపచయం జంతోస్తథైవోపచయం విభుః ।
ఉభాభ్యాం రహితస్స్వస్థో దుఃస్థస్య విదధాత్యసౌ ॥ 21

విభుః - సర్వవ్యాపకుడు, ఉభాభ్యామ్ - చిక్కుట ఎదుగుట అనే రెండింటిచే, రహితః - లేనివాడు, స్వస్థః - తన స్వరూపమునందు ఉండువాడు అగు, అసౌ - ఈ ఈశ్వరుడు, దుఃస్థస్య - కర్మప్రవాహమునకు లోబడియున్న, జంతోః - జీవుని, ఆయుషః - ఆయుర్దాయమునకు, అపచయమ్ - తగ్గుదలను, తథా ఏవ - అదే విధముగా, ఉపచయమ్ - పెరుగుదలను, విదధాతి - కలిగించుచున్నాడు.

ఈశ్వరుడు సర్వవ్యాపకుడు, ఎదుగుదల గాని తగ్గుదల గాని లేని నిర్వికారుడు, తన స్వరూపమునందు ఉండువాడు. జీవుడు కర్మప్రవాహమునకు లోబడి యుండును. అట్టి ఈశ్వరుడు జీవునకు కర్మను బట్టి దేవాది శరీరములలో ఆయుర్దాయమునకు పెరుగుదలను గాని, క్రిమి మొదలగు శరీరములలో తగ్గుదలను గాని కలిగించును.

కేచిత్కర్మ వదంత్యేనం స్వభావమపరే నృప ।
ఏకే కాలం పరే దైవం పుంసః కామముతాపరే ॥ 22

నృప - ఓ మహారాజా!, ఏనమ్ - ఈ ఈశ్వరుని, కేచిత్ - కొందరు, కర్మ - కర్మ అనియు, అపరే - మరికొందరు, స్వభావమ్ - స్వభావమనియు, ఏకే - కొందరు, కాలమ్ - కాలము అనియు, పరే - ఇంకొందరు, దైవమ్ - దైవమనియు, ఉత - ఇంకా, అపరే - ఇతరులు, పుంసః - పురుషుని, కామమ్ - ఇచ్ఛ అని, వదంతి - చెప్పుచున్నారు.

ఓ మహారాజా! ఈ ఈశ్వరుని కర్మమీమాంసకులు కర్మ అనియు, చార్వాకులు స్వభావమనియు, వైశేషికులు కాలమనియు, జ్యోతిష్కులు గ్రహాదిరూపములలో నుండే దైవమనియు, వాత్స్యాయనుడు మొదలగు వారు కామమనియు చెప్పుచున్నారు. అనగా, వీరందరు ఈశ్వరుని అంగీక రించువారే. వివాదము నామమునందు మాత్రమే.

అవ్యక్తస్యాప్రమేయస్య నానాశక్త్యుదయస్య చ ।
న వై చికీర్షితం తాత కో వేదాథ స్వసంభవమ్ ॥ 23

తాత - బాబూ!, అవ్యక్తస్య - నిర్గుణుడైనట్టియు, అప్రమేయస్య - ప్రమాణములకు గోచరుడు కానట్టియు, చ - మరియు, నానాశక్తి-ఉదయస్య - అనేకశక్తులు ఉదయించే స్థానము అయిన ఈశ్వరుని, చికీర్షితమ్ - చేయగోరుదానిని, కః - ఎవడైననూ, న వేద - తెలియుట లేదు, అథ - అట్టి స్థితిలో, స్వసంభవమ్ - తాను ఆవిర్భవించిన స్థానముగు ఈశ్వరుని, కః - ఎవడు, వేద - తెలియును?

బాబూ! ఈశ్వరుడు నిర్గుణుడు. కావుననే ఆయన ప్రత్యక్షాది ప్రమాణములకు గోచరుడు కాడు. కాని, ఈ జగత్తులోని శక్తులన్నియు ఆయననుండియే పుట్టుచున్నవి. అట్టి ఈశ్వరుని సంకల్పమును తెలియగ లవాడు లేడు. అట్టిచో, జీవుడు తాను ఏ ఈశ్వరునినుండి ఆవిర్భవించినా డో, అట్టి ఈశ్వరుని తెలియగల్గునా యేమి? తెలియలేడు.

న చైతే పుత్రక భ్రాతుర్హంతారో ధనదానుగాః ।
విసర్గాదానయోస్తాత పుంసో దైవం హి కారణమ్ ॥ 24

పుత్రక - ఓ వత్సా!, భ్రాతుః - నీ తమ్ముని, హంతారః - చంపిన వారు, ఏతే - ఈ, ధనద-అనుగాః - కుబేరుని అనుచరులగు యక్షులు, న చ - కానే కారు, తాత - బాబూ!, హి- ఏలయనగా, పుంసః - వ్యక్తియొక్క, విసర్గ-ఆదానయోః - జన్మమరణములకు, దైవమ్ - ఈశ్వరుడే, కారణం హి - కారణము.

ఓ వత్సా! నీ తమ్ముని వాస్తవముగా చంపినది కుబేరుని అనుచరులగు ఈ యక్షులు కాదు. బాబూ! వ్యక్తియొక్క జన్మమరణములకు కాలరూపుడగు ఈశ్వరుడే కారణమగుచున్నాడు.

స ఏవ విశ్వం సృజతి స ఏవావతి హంతి చ ।
అథాపి హ్యనహంకారాన్నాజ్యతే గుణకర్మభిః ॥ 25

సః ఏవ - ఆ ఈశ్వరుడు మాత్రమే, విశ్వమ్ - జగత్తును, సృజతి - సృష్టించుచున్నాడు, సః ఏవ - ఆయనయే, అవతి - రక్షించుచున్నాడు, చ - మరియు, హంతి - ఉపసంహరించుచున్నాడు, అథాపి - అయినప్పటికీ, అనహంకారాత్ - కర్తను నేను అనే అభిమానము లేకుండుట వలన, గుణకర్మభిః - సత్త్వరజస్తమోగుణములచే మరియు పుణ్యాపాపకర్మలచే, న ఆజ్యతే - లేపమును పొందుట లేదు.

ఆ ఈశ్వరుడు మాత్రమే ఈ జగత్తును సృష్టించి, పాలించి, సంహరించుచున్నాడు. కాని, ఆయనయందు నేను కర్తను అనే అభిమానము లేదు. కావుననే, ఆయనకు సత్త్వరజస్తమోగుణములతో గాని, పాపపుణ్యములతో గాని సంబంధము లేదు.

ఏష భూతాని భూతాత్మా భూతేశో భూతభావనః ।
స్వశక్త్యా మాయయా యుక్తస్సృజత్యత్తి చ పాతి చ ॥ 26

భూత-ఆత్మా - సకలప్రాణులకు ఆత్మ, భూత-ఈశః - సకలప్రాణులకు ప్రభువు, భూతభావనః - సకలప్రాణులను పాలించువాడు అగు, ఏషః - ఈ ఈశ్వరుడు, స్వశక్త్యా - తన శక్తియగు, మాయయా - మాయచే, యుక్తః - కూడినవాడై, భూతాని - సకలప్రాణులను, సృజతి - సృష్టించుచున్నాడు, అత్తి చ - సంహరించుచున్నాడు, పాతి చ - పాలించుచున్నాడు కూడా.

సకలప్రాణులలో అంతరాత్మరూపుడై యుండి వాటిని నియంత్రిస్తూ పాలించేది ఈ ఈశ్వరుడే. ఆయనయే తన మాయాశక్తితో కూడుకున్నవాడై సకలప్రాణులను సృష్టించి, పాలించి, ఉపసంహరించుచున్నాడు.

తమేవ మృత్యుమమృతం తాత దైవం
సర్వాత్మనోపేహి జగత్పరాయణమ్ ।
యస్మై బలిం విశ్వసృజో హరంతి
గావో యథా వై నసి దామయంత్రితాః ॥ 27

మృత్యుమ్ - కాలరూపుడై మృత్యువు అయినట్టియు, అమృతమ్ - స్వరూపముచే అమృతుడైనట్టియు, జగత్-పర-అయనమ్ - జగత్తునకు సర్వాతిశాయియగు ఆశ్రయమైన, తమ్ - ఆ, దైవం ఏవ - ఈశ్వరుని మాత్రమే, సర్వ-ఆత్మనా - సర్వాత్మభావముతో (సర్వమనోవృత్తులను లగ్నము చేసి), ఉపేహి - శరణు పొందుము, యస్మై - ఏ ఈశ్వరుని కొరకు, విశ్వసృజః - ప్రజాపతులు, నసి - ముక్కునందు, దామయంత్రితాః - త్రాడుతో నియంత్రించబడే, గావః యథా వై - ఎద్దులు వలె, బలిమ్ - పూజ కొరకు కానుకను (కప్పమును), హరంతి - తీసుకు వచ్చుచున్నారో.

జగత్తునకు సర్వాతిశాయియగు ఆశ్రయము ఈశ్వరుడే. ఆయనయే బాహ్యమునందు కాలరూపుడై మృత్యువుగను, అంతఃకరణమునందు చైతన్యరూపుడై అమృతుడుగను ఉన్నాడు. నీవు సర్వప్రాణులయందు ఆయనను దర్శిస్తూ (మనోవృత్తులన్నింటినీ ఆయనయందే నిలిపి), ఆయననే శరణు వేడుము. జగత్తును సృష్టించే ప్రజాపతులు కూడ, చక్రవర్తికి కప్పము కట్టే సామంతుల వలె, ముక్కు త్రాడు వేసి నియంత్రించబడే ఎద్దులు వలె, ఆయనకు పూజాద్రవ్యములను సమర్పించి, వశవర్తులైయున్నారు.

యః పంచవర్షో జననీం త్వాం విహాయ
మాతుస్సపత్న్యా వచసా భిన్నమర్మా ।
వనం గతస్తపసా ప్రత్యగక్ష-
మారాధ్య లేభే మూర్ధ్ని పదం త్రిలోక్యాః ॥ 28

పంచవర్షః - అయిదు సంవత్సరముల వయస్సు కలిగినట్టియు, సపత్న్యాః మాతుః - సవతి తల్లియొక్క, వచసా - వాక్కుచే, భిన్నమర్మా - గాయపరచబడిన హృదయము గల, యః - ఏ, త్వమ్ - నీవు, జననీమ్ -

తల్లిని, విహాయ - విడిచిపెట్టి, వనమ్ - వనమును గురించి, గతః - వెళ్లిన వాడవై, ప్రత్యక్-అక్షమ్ - అంతర్ముఖములగు ఇంద్రియములు కలుగునట్లు గా (ఇంద్రియములకు అంతర్యామియగు శ్రీహరిని), ఆరాధ్య - ఆరాధించి, త్రిలోక్యాః - ముల్లోకములకు, మూర్ధ్ని - అగ్రమునందు, పదమ్ - స్థానమును, లేభే - పొందినాడవో.

అయిదేళ్ల వయసులోనే నీవు, సవతి తల్లి పలుకులచే హృదయములో గాయము కాగా, తల్లిని విడిచి అడవికి వెళ్లి, ఇంద్రియములను ఉపసంహరించి అంతర్ముఖుడవై ఇంద్రియాధిపతియగు శ్రీహరిని ఆరాధించి, ముల్లోకములకు అగ్రమునందుండే స్థానమును సంపాదించితివి.

తమేనమంగాత్మని ముక్తవిగ్రహే
వ్యపాశ్రితం నిర్గుణమేకమక్షరమ్ ।
ఆత్మానమన్విచ్ఛ విముక్తమాత్మదృక్
యస్మిన్నిదంభేదమసత్ప్రతీయతే ।। 29

అంగ - ఓయీ!, ఆత్మదృక్ - అంతర్ముఖమగు దృష్టి గలవాడవై, ముక్తవిగ్రహే - విడిచిపెట్టబడిన విరోధము గల, ఆత్మని - మనస్సునందు, వ్యపాశ్రితమ్ - నిలిచి ఉండునట్టియు, నిర్గుణమ్ - నిర్గుణుడైనట్టియు, ఏకమ్ - అద్వయుడైనట్టియు, అక్షరమ్ - అవినాశియైనట్టియు, ఆత్మానమ్ - ఆత్మరూపుడైనట్టియు, విముక్తమ్ - నిత్యముక్తుడైన, ఏనమ్ - ఈ శ్రీహరిని, అన్విచ్ఛ - అన్వేషించుము, యస్మిన్ - ఏ శ్రీహరియందు, అసత్ - మిథ్యయగు, ఇదంభేదమ్ - ఈ నానాత్వము, ప్రతీయతే - కానవచ్చుచున్నదో.

ఓయీ! సకలప్రాణులలో నిత్యముక్తమగు ఆత్మరూపుడైయున్న ఆ శ్రీహరి విద్వేషము లేని అంతఃకరణములో మాత్రమే ప్రకటమగును. నిర్గుణుడు, అద్వయుడు, అవినాశి అగు ఆ శ్రీహరిని అంతర్ముఖమగు మనస్సులో అవలోకించుము. వాస్తవముగా లేకున్ననూ కానవచ్చే ఈ నానాత్వ విశిష్టమగు జగత్తునకు అధిష్ఠానము ఆ శ్రీహరియే.

త్వం ప్రత్యగాత్మని తదా భగవత్యనంత
ఆనందమాత్ర ఉపపన్నసమస్తశక్తౌ ।
భక్తిం విధాయ పరమాం శనకైరవిద్యా-
గ్రంథిం విభేత్స్యసి మమాహమితి ప్రరూఢమ్ ॥ 30

తదా - అదే సమయములో, త్వమ్ - నీవు, ప్రత్యక్-ఆత్మని - అంతరతమమగు ఆత్మరూపుడైనట్టియు, అనంతే - కాలమునకు లోబడనట్టియు, ఆనందమాత్రే - ఆనందఘనుడైనట్టియు, ఉపసన్నసమస్తశక్తౌ - నిత్యసిద్ధములగు సకలశక్తులు కలిగిన, భగవతి - శ్రీహరి భగవానునియందు, పరమామ్ - సర్వాతిశాయియగు, భక్తిమ్ - భక్తిని, విధాయ - చేసి, శనకైః - మెల్లగా, మమ-అహం-ఇతి - అహంకార మమకారరూపములలో నుండే, ప్రరూఢమ్ - గట్టిగా బిగుసుకున్న, అవిద్యాగ్రంథిమ్ - అజ్ఞానము అనే ముడిని, విభేత్స్యసి - విడగొట్టగలవు.

అదే సమయములో నీవు అంతరతమమగు ఆత్మరూపుడైయున్న శ్రీహరి భగవానునియందు నిష్కామభక్తిని చేయుము. ఆయన అనంతుడు, ఆనందఘనుడు. సకలశక్తులు ఆయనను నిత్యము సేవించుచుండును. అట్టి భక్తి వలన నీవు మెల్లగా, అహంకార మమకారములనే రూపములలో గట్టిగా బిగుసుకొనియున్న అజ్ఞానము అనే ముడిని విడగొట్టి, దానినుండి బయట పడగలవు.

సంయచ్ఛ రోషం భద్రం తే ప్రతీపం శ్రేయసాం పరమ్ ।
శ్రుతేన భూయసా రాజన్నగదేన యథాऽऽమయమ్ ॥ 31

రాజన్ - ఓ రాజా!, శ్రేయసామ్ - శ్రేయస్సులకు, పరమ్ - మిక్కిలి, ప్రతీపమ్ - విఘాతకమైన, రోషమ్ - కోపమును, అగదేన - మందుతో, ఆమయం యథా - రోగమును వలె, భూయసా - అధికమగు, శ్రుతేన - శ్రవణముచే, సంయచ్ఛ - నిలువరించుము, తే - నీ కొరకు, భద్రమ్ - మంగళమగుగాక!

ఓ రాజా! కోపము వ్యక్తికి రావలసిన శ్రేయస్సులన్నింటికీ పెద్ద ఆటంకము. రోగమును మందుతో నయము చేసుకున్న విధముగా, వేద

చెప్పిన ఉపదేశమును విని భావన చేయుట ద్వారా, ఆ కోపమును నిలుప రించుము. నీకు మంగళమగు గాక!

**యేనోపసృష్టాత్పురుషాల్లోక ఉద్విజతే భృశమ్ ।**
**న బుధస్తద్వశం గచ్ఛేదిచ్ఛన్నభయమాత్మనః ॥ 32**

యేన - ఏ కోపముచే, ఉపసృష్టాత్ - నిండియున్న, పురుషాత్ - వ్యక్తి వలన, లోకః - జనము, భృశమ్ - మిక్కిలి, ఉద్విజతే - ఉద్వేగ మును పొందునో, ఆత్మనః - తనకు, అభయమ్ - అభయమును, ఇచ్ఛన్ - కోరే, బుధః - వివేకి, తత్-వశమ్ - ఆ కోపమునకు వశమును, న గచ్ఛేత్ - కారాదు.

కోపముతో నిండియున్న వ్యక్తిని చూచి సకలప్రాణులు ఆందోళ నను చెందును. కావున, తనకు అభయము (మోక్షము) కలగాలని (తన వలన ఇతరులకు భయము కలుగరాదనియు, తనకు ఇతరుల వలన భయము కలుగరాదనియు) కోరుకునే వివేకి కోపమునకు వశుడు కారాదు.

**హేలనం గిరిశభ్రాతుర్ధనదస్య త్వయా కృతమ్ ।**
**యజ్జఘ్నివాన్ పుణ్యజనాన్ భ్రాతృఘ్నానిత్యమర్షితః ॥ 33**

త్వయా - నీచే, గిరిశభ్రాతుః - కైలాసాధిపతియగు శివుని సోదరు డగు, ధనదస్య - కుబేరునకు, హేలనమ్ - అవమానము, కృతమ్ - చేయ బడినది, యత్ - ఏలయనగా, భ్రాతృఘ్నాన్ ఇతి - సోదరులను సంహరిం చినవారు అని యక్షులను, అమర్షితః - సహించని నీవు, పుణ్యజనాన్ - ఆ యక్షులను, జఘ్నివాన్ - సంహరించినావో.

ఈ యక్షులు నా సోదరుని చంపినారు అనే భావముతో నీవు వారిని సంహరించి, కుబేరుని అవమానించినావు. కైలాసాధిపతియగు శివుడు కుబేరుని తన సోదరునిగా స్వీకరించినాడు.

**తం ప్రసాదయ వత్సాశు సన్నత్యా ప్రశ్రయోక్తిభిః ।**
**న యావన్మహతాం తేజః కులం నోఽభిభవిష్యతి ॥ 34**

**వత్స - బాబూ!, తమ్ - ఆ కుబేరుని, ఆశు - వెంటనే, సన్నత్యా - నమస్కారముచే, ప్రశ్రయ-ఉక్తిభిః - వినయముతో కూడిన పలుకులతో, ప్రసాదయ - ప్రసన్నుని చేసుకొనుము, యావత్ - ఎంతలోనైతే, మహతామ్ - మహాత్ముల, తేజః - తేజస్సు, నః - మన, కులమ్ - వంశమును, న అభిభవిష్యతి - వినాశము చేయదో.**

ఓ వత్సా! మహాత్ములగు లోకపాలకుల తేజస్సు మన వంశమును వినాశము చేసే లోపులోనే, నీవు ఆ కుబేరునకు నమస్కరించి, ఆయనతో వినయముగా మాటలాడి, ఆయనను ప్రసన్నునిగా చేసుకొనుము.

ఏవం స్వాయంభువః పౌత్రమనుశాస్య మనుర్ధ్రువమ్ ।
తేనాభివందితస్సాకమృషిభిస్స్వపురం యయౌ ॥ 35

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే చతుర్థస్కంధే మనుకృత
తత్త్వోపదేశం నామ ఏకాదశోఽధ్యాయః ॥

ఏవమ్ - ఈ విధముగా, స్వాయంభువః మనుః - స్వాయంభువ మనువు, పౌత్రమ్ - మనుమడగు, ధ్రువమ్ - ధ్రువుని, అనుశాస్య - ఆదేశించి, తేన - ఆతనిచే, అభివందితః - నమస్కరించబడినవాడై, ఋషిభిః సాకమ్ - మహర్షులతో గూడి, స్వపురమ్ - తన నగరమును గురించి, యయౌ - వెళ్లెను.

ఈ విధముగా స్వాయంభువ మనువు తన మనుమడగు ధ్రువునకు ఉపదేశించెను. ధ్రువుడు ఆయనకు నమస్కరించెను. అపుడాయన మహర్షులతో గూడి ధ్రువుని రాజధానికి వెళ్లెను.

శ్రీమద్భాగవత మహాపురాణములోని నాల్గవ స్కంధములో
మనువు ధ్రువునకు తత్త్వమునుపదేశించుటను వర్ణించే
పదునొకండవ అధ్యాయము ముగిసినది (**11**).

*****

# అథ ద్వాదశోఽధ్యాయః

## ధ్రువోపాఖ్యానము - ధ్రువుడు పరమ పదమును పొందుట

మైత్రేయ ఉవాచ ।

ధ్రువం నివృత్తం ప్రతిబుధ్య వైశసాత్
అపేతమన్యుం భగవాన్ ధనేశ్వరః ।
తత్రాగతశ్చారణయక్షకిన్నరైః
సంస్తూయమానోఽభ్యవదత్కృతాంజలిమ్ ॥ 1

మైత్రేయః - మైత్రేయుడు, ఉవాచ - పలికెను, అపేతమన్యుమ్ - తొలగిపోయిన కోపము గల, ధ్రువమ్ - ధ్రువుని, వైశసాత్ - యక్షుల హింసనుండి, నివృత్తమ్ - వెనుకకు మరలినవానినిగా, ప్రతిబుధ్య - తెలుసుకొని, భగవాన్ - పూజ్యుడగు, ధన-ఈశ్వరః - కుబేరుడు, తత్ర - అచటకు, చారణయక్షకిన్నరైః - చారణులు యక్షులు కిన్నరులతో కూడి, ఆగతః - వచ్చినవాడై, సంస్తూయమానః - చక్కగా కొనియాడబడుచున్నవాడై, కృత-అంజలిమ్ - దోసిలియొగ్గి నమస్కరించిన ధ్రువుని ఉద్దేశించి, అభి-అవదత్ - అభిముఖముగా పలికెను.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- ధ్రువునకు కోపము పోయినదనియు, అతడు యక్షుల హింసను ఆపివేసినాడనియు తెలుసుకున్న పూజ్యుడగు కుబేరుడు అచటకు వచ్చెను. ఆయన వచ్చుచుండగా, చారణులు యక్షులు కిన్నరులు ఆయనను చక్కగా స్తుతించుచుండిరి. ఆయనకు ధ్రువుడు చేతులు జోడించి నమస్కరించెను. అపుడాయన ధ్రువుని ఉద్దేశించి ఇట్లు పలికెను.

ధనద ఉవాచ ।
భోభోః క్షత్రియదాయాద పరితుష్టోఽస్మి తేఽనఘ ।
యస్త్వం పితామహాదేశాద్వైరం దుస్త్యజమత్యజః ॥ 2

భోః భోః - ఓయీ!, క్షత్రియదాయాద - క్షత్రియకుమారా!, అనఘ - పాపమునెరుంగనివాడా!, తే - నీ కొరకు, పరితుష్టః - చాల సంతోషించినవాడను, అస్మి - అగుచున్నాను, యః - ఏ, త్వమ్ - నీవు, పితామహ-ఆదేశాత్ - తాతగారి ఆదేశము వలన, దుస్త్యజమ్ - విడిచిపెట్ట శక్యము కాని, వైరమ్ - వైరమును, అత్యజః - విడిచిపెట్టితివో.

ఓయీ రాజకుమారా! నీవు పుణ్యాత్ముడవు. నేను నీ విషయములో చాల సంతోషించితిని. వైరభావమును విడిచిపెట్టుట చాల కష్టము. కాని, నీవు తాతగారి ఆదేశముననుసరించి యక్షులయందలి వైరబుద్ధిని విడిచిపెట్టితివి.

న భవానవధీద్యక్షాన్న యక్షా భ్రాతరం తవ ।
కాల ఏవ హి భూతానాం ప్రభురప్యయభావయోః ॥ 3

భవాన్ - నీవు, యక్షాన్ - యక్షులను, న అవధీత్ - చంపలేదు, యక్షాః - యక్షులు, తవ - నీ, భ్రాతరమ్ - సోదరుని, న - చంపలేదు, హి - ఏలయనగా, భూతానామ్ - ప్రాణుల, అప్యయభావయోః - మరణమునకు జన్మకు, కాలః ఏవ - కాలము మాత్రమే, ప్రభుః - సమర్థము.

వాస్తవములో యక్షులను సంహరించినది నీవు కాదు. నీ తమ్ముని సంహరించినది యక్షులు కాదు. ఏలయవగా, సకలప్రాణుల జన్మమరణములకు సమర్థమైనది కాలము మాత్రమే.

అహం త్వమిత్యపార్థా ధీరజ్ఞానాత్పురుషస్య హి ।
స్వాప్నీవాభాత్యతద్ధ్యానాద్యయా బంధవిపర్యయౌ ॥ 4

పురుషస్య - పురుషునకు, అజ్ఞానాత్ - అజ్ఞానము వలన, అతత్-ధ్యానాత్ - అనాత్మయగు దేహమును ఆత్మయని భావించుట వలన, స్వాప్నీ ఇవ - స్వప్నదర్శనము వలె, అహమ్ - నేను, త్వమ్ - నీవు, ఇతి

- అనే, అప-అర్థా - యథార్థము కాని, ధీః - బుద్ధి, ఆభాతి - ప్రకాశించు చున్నది, యయా - ఏ బుద్ధిచే, బంధవిపర్యయౌ - కర్మబంధము మరియు దుఃఖము కలుగుచున్నవో.

వ్యక్తి స్వప్నములో కానవచ్చే సర్వము తానే అయి ఉన్ననూ, ఒక దేహమునందు నేను అనే బుద్ధి ఉండుటచే, ఇతరము అంతా తనకంటె భిన్నము అనే భావన కలుగును. కాని, ఈ భావన తప్పు. స్వప్నములోని సర్వము స్వప్నద్రష్ట తానే అయి ఉన్నాడు. జాగ్రదవస్థలో కూడ వ్యక్తికి దేహమునందు నేను అనే భ్రాంతి ఉండుటచేతనే, నేను నీవు అనే భేదబుద్ధి కలుగుచున్నది. ఈ భేదబుద్ధి అజ్ఞానకృతము, అయథార్థము మాత్రమే. ఈ భేదబుద్ధి వలననే వ్యక్తికి కర్మబంధము మరియు సంసారదుఃఖము కలుగు చున్నవి.

తద్గచ్ఛ ధ్రువ భద్రం తే భగవంతమధోక్షజమ్ ।
సర్వభూతాత్మభావేన సర్వభూతాత్మవిగ్రహమ్ ॥ 5

భజస్వ భజనీయాంఘ్రిమభవాయ భవచ్ఛిదమ్ ।
యుక్తం విరహితం శక్త్యా గుణమయ్యాత్మమాయయా ॥ 6

ధ్రువ - ఓ ధ్రువా!, తత్ - కావున, గచ్ఛ - వెళ్లుము, తే - నీ కొరకు, భద్రమ్ - మంగళమగు గాక!, అధోక్షజమ్ - ప్రత్యక్షాది ప్రమాణములకు గోచరుడు కానట్టియు, సర్వభూత-ఆత్మవిగ్రహమ్ - సకలప్రాణి సముదాయమే రూపముగా గలిగినట్టియు, భజనీయ-అంఘ్రిమ్ - సేవించదగిన పాదములు కలిగినట్టియు, భవ-ఛిదమ్ - సంసారమును ఛేదించునట్టియు, గుణమయ్యా - త్రిగుణాత్మికయగు, శక్త్యా - శక్తియగు, ఆత్మమాయయా - తన మాయచే, యుక్తమ్ - కూడియున్నట్టియు, విరహితమ్ - స్వరూపమునందు మాయాశక్తి లేని, భగవంతమ్ - శ్రీహరి భగవానుని, అభవాయ - సంసారనివృత్తి కొరకు, సర్వభూత-ఆత్మభావేన - సకలప్రాణులు ఆత్మరూపములే అనే భావనతో, భజస్వ - సేవించుము.

ఓ ధ్రువా! వెళ్లుము. నీకు మంగళమగు గాక! శ్రీహరి భగవానుడు ప్రత్యక్షాది ప్రమాణములకు గోచరుడు కాడు. కాని, ఆయనయే మన

ముందు సకలప్రాణుల రూపములోనున్నాడు. ఆయన పాదములను సేవించువారలకు సంసారము తొలగిపోవును. ఆయన సత్త్వరజస్తమోగుణాత్మకమగు మాయాశక్తి అనే ఉపాధిని స్వీకరించి జగత్తుయొక్క సృష్టిస్థితిలయములను చేయువాడే అయిననూ, ఆయన స్వరూపమునందు మాయాశక్తితో సహా రెండవది ఏదీ లేదు. అట్టి శ్రీహరిని నీవు సంసారనివృత్తి కొరకై సేవించుము. సకలప్రాణులను ఆత్మరూపముగా దర్శించుము.

వృణీహి కామం నృప యన్మనోగతం
మత్తస్త్వమౌత్తానపదేఽవిశంకితః ।
వరం వరార్హోఽంబుజనాభపాదయోః
అనంతరం త్వాం వయమంగ శుశ్రుమ ।। 7

నృప - ఓ రాజా!, ఔత్తానపదే - ఉత్తానపాదుని పుత్రుడా!, వర-అర్హః - వరమునకు తగిన, త్వమ్ - నీవు, అవిశంకితః - శంక లేనివాడవై, మత్తః - నానుండి, మనః-గతమ్ - మనస్సునందు గల, యత్ - ఏ వరము గలదో, వరమ్ - ఆ వరమును, కామమ్ - యథేచ్ఛగా, వృణీహి - కోరుకొనుము, అంగ - ఓయీ!, వయమ్ - మేము, త్వామ్ - నిన్ను, అంబుజనాభపాదయోః - పద్మనాభుని పాదములకు, అనంతరమ్ - చాల దగ్గరలోనున్నవానినిగా, శుశ్రుమ - వినియుంటిమి.

ఉత్తానపాదుని కుమారుడవగు ఓ రాజా! నీవు వరమునకు అర్హుడవు. ఏలయన, నీవు పద్మనాభుని పాదపద్మములకు చాల దగ్గర భక్తుడవని మేము వినియుంటిమి. కావున, నీవు శంకను పెట్టుకొనకుండగా యథేచ్ఛగా నీ మనస్సులోని వరమును నానుండి కోరుకొనుము.

మైత్రేయ ఉవాచ ।
స రాజరాజేన వరాయ చోదితో
ధ్రువో మహాభాగవతో మహామతిః ।
హరౌ స వవ్రేఽచలితాం స్మృతిం యయా
తరత్యయత్నేన దురత్యయం తమః ।। 8

మహాభాగవతః - గొప్ప భగవద్భక్తుడు, మహామతిః - పెద్ద మనసు గలవాడు అగు, సః - ఆ, ధ్రువః - ధ్రువుడు, రాజరాజేన - రాజులకు రాజగు కుబేరునిచే, వరాయ - వరము కొరకు, చోదితః - ప్రేరేపించబడినవాడై, హరౌ - శ్రీహరియందు, అచలితామ్ - విచలితము కాని, స్మృతిమ్ - స్మరణమును, వవ్రే - కోరుకొనెను, యయా - ఏ స్మరణముచే, దురత్యయమ్ - తరింప శక్యము కాని, తమః - అజ్ఞానము (సంసారము) ను, అయత్నేన - తేలికగా, తరతి - తరించుచున్నాడో.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- ధ్రువుడు గొప్ప భగవద్భక్తుడు మరియు పెద్ద మనసు గలవాడు. ఆయనను రాజరాజగు కుబేరుడు వరమును కోరుకొమ్మని ప్రేరేపించెను. అపుడాయన తనకు విచలితము కాని శ్రీహరియొక్క స్మరణము ఉండవలెనని కోరెను. అట్లు శ్రీహరిని స్మరించువాడు, తరింప శక్యము కాని అజ్ఞానమును, తత్కృతమగు సంసార సముద్రమును తేలికగా తరించివేయును.

తస్య ప్రీతేన మనసా తాం దత్త్వైడవిడస్తతః ।
పశ్యతోఽంతర్దధే సోఽపి స్వపురం ప్రత్యపద్యత ॥ 9

ఐడవిడః - ఇడవిడాపుత్రుడగు కుబేరుడు, ప్రీతేన - సంతసించిన, మనసా - మనస్సుతో, తామ్ - అట్టి అఖండ హరిస్మరణమును, దత్త్వా - వరముగా ఇచ్చి, తతః - తరువాత, తస్య - ఆ ధ్రువుడు, పశ్యతః - చూచుచుండగనే, అంతర్దధే - అంతర్ధానమును చెందెను, సః అపి - ఆ ధ్రువుడు కూడ, స్వపురమ్ - తన నగరమును, ప్రత్యపద్యత - చేరుకొనెను.

ఇడవిడాపుత్రుడగు కుబేరుడు తన మనస్సులో చాల సంతోషించి, ధ్రువునకు అఖండమగు హరిస్మరణము కలుగునట్లుగా వరమునిచ్చి, ఆతడు చూచుచుండగనే అంతర్ధానమయ్యెను. అపుడు ధ్రువుడు కూడ తన నగరమును చేరుకొనెను.

అథాయజత యజ్ఞేశం క్రతుభిర్భూరిదక్షిణైః ।
ద్రవ్యక్రియాదేవతానాం కర్మ కర్మఫలప్రదమ్ ॥ 10

అథ - తరువాత, భూరిదక్షిణైః - అధికమగు దక్షిణలు గల, క్రతుభిః - క్రతువులచే, యజ్ఞ-ఈశమ్ - యజ్ఞేశ్వరుడైనట్టియు, ద్రవ్యక్రియా దేవతానామ్ - ద్రవ్యము క్రియ దేవతలకు సంబంధించిన, కర్మ - కర్మరూపుడైనట్టియు, కర్మఫలప్రదమ్ - కర్మఫలమునిచ్చు శ్రీహరిని, అయజత - ఆరాధించెను.

తరువాత ధ్రువుడు అధికమగు దక్షిణలు గల క్రతువులచే యజ్ఞేశ్వరుడగు శ్రీహరిని ఆరాధించెను. పురోడాశాది ద్రవ్యము, ప్రయాజ మొదలగు కర్మాంగములు మరియు దేవతలతో కూడియున్న కర్మ శ్రీహరి రూపమే. అట్టి కర్మకు ఫలమునిచ్చువాడు కూడ శ్రీహరియే.

సర్వాత్మన్యచ్యుతేఽసర్వే తీవ్రౌఘాం భక్తిముద్వహన్ ।
దదర్శాత్మని భూతేషు తమేవావస్థితం విభుమ్ ॥ 11

సర్వ-ఆత్మని - సర్వముయొక్క స్వరూపమైనట్టియు, అసర్వే - సర్వముయొక్క ఉపాధులతో సంబంధము లేనట్టియు, అచ్యుతే - వినాశము లేని శ్రీహరియందు, తీవ్ర-ఓఘామ్ - అఖండమగు చిత్తవృత్తిప్రవాహము గల, భక్తిమ్ - భక్తిని, ఉద్వహన్ - కలిగియున్నవాడై, ఆత్మని - తనయందు, భూతేషు - ప్రాణులయందు, అవస్థితమ్ - నిలిచియున్న, విభుమ్ - సర్వవ్యాపకుడగు, తం ఏవ - ఆ శ్రీహరిని మాత్రమే, దదర్శ - దర్శించెను.

ఈ సర్వముయొక్క మౌలికస్వరూపమగు సత్త శ్రీహరియే. కాని, ఈ అన్ని ఉపాధులు ఆయనయందే ప్రకాశించుచున్ననూ, వాస్తవముగా ఈ ఉపాధులు ఆయనయందు లేవు. అట్టి అవినాశియగు శ్రీహరియందు ధ్రువుడు అఖండ చిత్తవృత్తి ప్రవాహమును నిలిపి భక్తిని చేసెను. అతడు తనయందు, సకలప్రాణులయందు అంతర్యామియై సర్వవ్యాపకుడగు శ్రీహరిని ఆత్మరూపముగా దర్శించెను.

తమేవం శీలసంపన్నం బ్రహ్మణ్యం దీనవత్సలమ్ ।
గోప్తారం ధర్మసేతూనాం మేనిరే పితరం ప్రజాః ॥ 12

ఏవంశీలసంపన్నమ్ - ఈ విధమగు స్వభావములో భాగమై పోయిన భక్తితో నిండియున్నట్టియు, బ్రహ్మణ్యమ్ - వేదవేత్తలయెడల భక్తి కలిగినట్టియు, దీనవత్సలమ్ - దీనులయెడల ప్రేమ కలిగినట్టియు, ధర్మ సేతూనామ్ - ధర్మముయొక్క మర్యాదలకు, గోప్తారమ్ - రక్షకుడైన, తమ్ - ఆ ధ్రువుని, ప్రజాః - ప్రజలు, పితరమ్ - తండ్రినిగా, మేనిరే - తలచిరి.

ఈ విధముగా భక్తి ధ్రువుని స్వభావములో భాగమై పోయెను. ఆత నికి వేదవేత్తలయెడల ఆదరము, దీనుల యెడల ప్రేమ ఉండెడివి. ఆతడు ధర్మముయొక్క మర్యాదలను రక్షించెడివాడు. అట్టి ధ్రువుని ప్రజలు తమ తండ్రిగనే భావించిరి.

షట్త్రింశద్వర్షసాహస్రం శశాస క్షితిమండలమ్ ।
భోగైః పుణ్యక్షయం కుర్వన్నభోగైరశుభక్షయమ్ ॥ 13

భోగైః - సుఖములచే, పుణ్యక్షయమ్ - పుణ్యముయొక్క క్షయ మును, అభోగైః - భోగములను విడిచిపెట్టుటచే, అశుభక్షయమ్ - పాపక్ష యమును, కుర్వన్ - చేయుచున్నవాడై, షట్-త్రింశత్-వర్షసాహస్రమ్ - ముప్పది ఆరు వేల సంవత్సరములు, క్షితిమండలమ్ - భూమండలము ను, శశాస - శాసించెను.

ధ్రువుడు రాజోచితములగు భోగములననుభవించుటచే ఆతని పుణ్యము ఖర్చు అయ్యెను. భోగములను విడిచి యజ్ఞాదులను చేయుటచే పాపము క్షయమయ్యెను. ఈ విధముగా ఆతడు భూమండలమును ముప్పది ఆరు వేల సంవత్సరములు శాసించెను.

ఏవం బహుసవం కాలం మహాత్మాఽవిచలేంద్రియః ।
త్రివర్గౌపయికం నీత్వా పుత్రాయాదాన్నృపాసనమ్ ॥ 14

మహాత్మా - మహాత్ముడు, అవిచల-ఇంద్రియః - విచలితము కాని ఇంద్రియములు గలవాడు అగు ధ్రువుడు, ఏవమ్ - ఈ విధముగా, త్రివర్గ-ఔపయికమ్ - ధర్మార్థకామములకు సాధనమగు, బహుసవమ్ - అనేక

సంవత్సరముల, కాలమ్ - కాలమును, నీత్వా - గడిపి, నృప-ఆసనమ్ - సింహాసనమును, పుత్రాయ - పుత్రుని కొరకు, అదాత్ - ఇచ్చెను.

ధ్రువుడు విచలితము కాని ఇంద్రియములు గల మహాత్ముడు. ఆయన ఈ విధముగా అనేకసంవత్సరముల కాలమును ధర్మార్థకామము లనే పురుషార్థముల సేవనములో గడిపి, రాజ్యాధికారమును పుత్రుడగు ఉత్కలునకు ఇచ్చెను.

మన్యమాన ఇదం విశ్వం మాయారచితమాత్మని ।
అవిద్యారచితస్వప్నగంధర్వనగరోపమమ్ ॥ 15

అవిద్యారచితస్వప్నగంధర్వనగర-ఉపమమ్ - అజ్ఞానముచే కల్పించబడిన కల మరియు మేఘముల గుంపులో కానవచ్చే నగరము వంటి, ఇదమ్ - ఈ, విశ్వమ్ - జగత్తును, ఆత్మని - ఆత్మ చైతన్యమునం దు, మాయారచితమ్ - మాయచే కల్పించబడినదానినిగా, మన్యమానః - దర్శించువాడు.

మనకు కల వచ్చినప్పుడు దానిలోని పదార్థములన్నియు యథార్థ ములే యనిపించును. కాని, ఆ కల కేవలము మనస్సుచే కల్పితమై ఆత్మ చైతన్యముచే ప్రకాశించుచున్నది. మేఘముల గుంపులో ఏవేవో రూప ములు కానవచ్చును. ఆ రూపములు కేవలము మనస్సుయొక్క కల్పనలు మాత్రమే. కాని, ఆ కల్పిత రూపములను ప్రకాశింపజేసేది ఆత్మ చైతన్యమే. అదే విధముగా ఈ జగత్తు కూడ వాస్తవముగా ఆత్మ చైతన్యమునందు లేకు న్ననూ, అజ్ఞానముచే ఉన్నట్లు కానవచ్చుచున్నది. ఈ సత్యమును ధ్రువుడు తెలుసుకున్నాడు.

ఆత్మస్త్ర్యపత్యసుహృదో బలమృద్ధకోశ -
మంతఃపురం పరి విహారభువశ్చ రమ్యాః ।
భూమండలం జలధిమేఖలమాకలయ్య
కాలోపసృష్టమితి స ప్రయయౌ విశాలామ్ ॥ 16

**ఆత్మ**-స్త్రీ-అపత్యసుహృదః - దేహము భార్య సంతానము మిత్రులు, బలమ్ - సైన్యము, ఋద్ధకోశః - సంపదలతో నిండియున్న ఖజానా, అంతఃపురమ్ - అంతఃపురము, పరి - చుట్టూ, రమ్యాః - సుందరములగు, విహారభువః - విహారమునకు ఉద్యానములు, జలధిమేఖలమ్ - సముద్రమే కందకముగా గల, భూమండలమ్ - సామ్రాజ్యము, కాల-ఉపసృష్టమ్ - కాలముచే కబళించ వేయబడునది, ఇతి - అని, ఆకలయ్య - దర్శించి, సః - ఆ ధ్రువుడు, విశాలామ్ - బదరికాశ్రమమును, ప్రయయౌ - చేరుకొనెను.

దేహము, భార్య, సంతానము, మిత్రులు, సైన్యము, సంపదలతో నిండియున్న ఖజానా, అంతఃపురము, చుట్టూ సుందరమైన విహారోద్యానములు, సముద్రతీరము వరకు వ్యాపించిన సామ్రాజ్యము అనే ఈ సర్వము కాలముచే కబళించివేయబడును అని ఆ ధ్రువుడు దర్శించి, బదరికాశ్రమమును చేరుకొనెను.

తస్యాం విశుద్ధకరణశ్శివవార్విగాహ్య
బద్ధ్వాఽఽసనం జితమరున్మనసా హృతాక్షః ।
స్థూలే దధార భగవత్ప్రతిరూప ఏతత్
ధ్యాయంస్తదవ్యవహితో వ్యసృజత్సమాధౌ ॥ 17

తస్యామ్ - ఆ బదరియందు, శివవాః - పవిత్రమగు నీటియందు, విగాహ్య - స్నానమును చేసి, విశుద్ధకరణః - పరిశుద్ధమగు ఇంద్రియములు అంతఃకరణము గలవాడై, ఆసనమ్ - ఆసనమును, బద్ధ్వా - బంధించి, జితమరుత్ - జయించబడిన వాయుసంచారము గలవాడై, మనసా - మనస్సుచే, హృత-అక్షః - ఉపసంహరించబడిన ఇంద్రియములు గలవాడై, స్థూలే - స్థూలమగు, భగవత్-ప్రతిరూపే - భగవంతునకు ప్రతినిధియగు రూపమునందు, ఏతత్ - ఈ మనస్సును, దధార - ధారణ చేసెను, ధ్యాయన్ - ధ్యానము చేయుచున్నవాడై, అవ్యవహితః - భేద దర్శనము లేనివాడై, సమాధౌ - సమాధియందు, తత్ - ఆ రూపమును, వ్యసృజత్ - విడిచిపెట్టెను.

ఆ ధ్రువుడు బదరియందు పవిత్రజలములలో స్నానమును చేసి పరిశుద్ధమగు ఇంద్రియములు, మనస్సు గలవాడై (యమ నియమములు), ఆసనమును బిగించి కూర్చుండెను. అపుడాయన ప్రాణాయామమును చేసి, మనస్సుచే ఇంద్రియములను ప్రత్యాహారము చేసి, భగవంతుని స్థూలమగు విరాడ్రూపమునందు మనస్సును ధారణ చేసెను. ఆ రూప మునే ఏకాగ్రముగా ధ్యానిస్తూ, ధ్యాత-ధ్యేయము అనే భేదమునకు అతీత మైన నిర్వికల్ప సమాధిని పొంది, ఆ రూపమును కూడ విడిచిపెట్టెను.

భక్తిం హరౌ భగవతి ప్రవహన్నజస్ర-
మానందబాష్పకలయా ముహురర్ద్యమానః ।
విక్లిద్యమానహృదయః పులకాచితాంగో
నాత్మానమస్మరదసావితి ముక్తలింగః ।। 18

హరౌ భగవతి - శ్రీహరి భగవానునియందు, అజస్రమ్ - నిరంతర ముగా, భక్తిమ్ - భక్తిని, ప్రవహన్ - దృఢముగా కలవాడై, ఆనందబాష్పక లయా - ఆనందపు కన్నీటి ధారచే, ముహుః - పలుమార్లు, అర్ద్యమానః - పరవశుడగుచున్నవాడై, విక్లిద్యమానహృదయః - విశేషముగా ద్రవించు చున్న హృదయము గలవాడై, పులక-అచిత-అంగః - రోమాంచముచే వ్యాప్తమైన అవయవములు గలవాడై, ముక్తలింగః - విడిచిపెట్టబడిన దేహా భిమానము గలవాడై, ఆత్మానమ్ - తనను, అసౌ ఇతి - ఈ నేను అని, న అస్మరత్ - స్మరించలేదు.

ధ్రువుడు శ్రీహరి భగవానునియందు అఖండమగు భక్తి గలవాడై కనుల వెంబడి ఆనందబాష్పముల ప్రవాహము స్రవించుచుండగా పలు మార్లు పరవశుడగుచుండెను. భక్తిభావముచే విశేషముగా ద్రవించుచున్న హృదయము గల ఆతని అవయవములన్నియు రోమాంచముచే వ్యాప్తమ గుచుండెను. శరీరాభిమానమును విడిచిపెట్టిన ఆ ధ్రువునకు తాను ధ్రువుడ ననే స్మరణము కూడ లేకుండెను.

స దదర్శ విమానాగ్ర్యం నభసోఽవతరత్ ధ్రువః ।
విభ్రాజయన్ దశ దిశో రాకాపతిమివోదితమ్ ।। 19

సః - ఆ ధ్రువుడు, నభసః - ఆకాశమునుండి, అవతరత్ - దిగుచున్నట్టియు, ఉదితమ్ - ఉదయించిన, రాకాపతిం ఇవ - పూర్ణచంద్రుని వలె, దశ - పది, దిశః - దిక్కులను, విభ్రాజయత్ - ప్రకాశింపజేయుచున్న, విమాన-అగ్ర్యమ్ - శ్రేష్ఠమగు విమానమును, దదర్శ - చూచెను.

ఆ ధ్రువునకు ఆకాశమునుండి దిగుచున్న ఒక గొప్ప విమానము కనబడెను. అది ఉదయించిన పూర్ణచంద్రుని వలె పది దిక్కులను విశేషముగా ప్రకాశింపజేయుచుండెను.

తత్రాను దేవప్రవరౌ చతుర్భుజౌ
శ్యామౌ కిశోరావరుణాంబుజేక్షణౌ ।
స్థితావవష్టభ్య గదాం సువాససౌ
కిరీటహారాంగదచారుకుండలౌ ॥ 20

అను - తరువాత, తత్ర - ఆ విమానమునందు, చతుర్భుజౌ - నాలుగు చేతులు కలిగినట్టియు, శ్యామౌ - నీలవర్ణము కలిగినట్టియు, కిశోరౌ - నూతనయౌవనములోనున్నట్టియు, అరుణ-అంబుజ-ఈక్షణౌ - పద్మములవలె ఎర్రని కన్నులు కలిగినట్టియు, గదామ్ - గదను, అవష్టభ్య - పట్టుకొని, స్థితౌ - నిలబడియున్నట్టియు, సువాససౌ - మంచి వస్త్రములను కలిగియున్నట్టియు, కిరీటహార-అంగదచారుకుండలౌ - కిరీటము హారము భుజకీర్తులు అందమగు కుండలములు కలిగిన, దేవప్రవరౌ - శ్రేష్ఠులగు దేవతామూర్తులను (చూచెను).

విమానమును చూచిన ధ్రువునకు వెంటనే ఇద్దరు గొప్ప దేవతామూర్తులు కనబడిరి. నాలుగు చేతులు గల వారిద్దరు నీలవర్ణముతో శోభిల్లిరి. గదను పట్టుకొని నిలబడియున్న వారిద్దరి కన్నులు పద్మములవలె ఎర్రగా ప్రకాశించెను. వారిద్దరు మంచి వస్త్రములను, కిరీటమును, హారమును, భుజకీర్తులను, అందమగు కుండలములను ధరించి యుండిరి.

విజ్ఞాయ తావుత్తమగాయకింకరా-
వభ్యుత్థితస్సాధ్వసవిస్మృతక్రమః ।

నవామ నామాని గృణన్మధుద్విషః
పార్షత్ప్రధానావితి సంహతాంజలిః ॥ 21

తౌ - వారిద్దరినీ, ఉత్తమగాయకింకరౌ - పవిత్రమగు కీర్తిగల శ్రీహరియొక్క అనుచరులనుగా, విజ్ఞాయ - తెలుసుకొని, అభి-ఉత్థితః - వారియెదుట లేచి నిలబడిన ధ్రువుడు, పార్షత్-ప్రధానౌ ఇతి - శ్రీహరి అనుచరులలో ముఖ్యులు అనే కారణముగా, సాధ్వసవిస్మృతక్రమః - కంగారుచే మరువబడిన పూజాపద్ధతి గలవాడై, మధుద్విషః - మధువైరియగు శ్రీహరి యొక్క, నామాని - నామములను, గృణన్ - పలుకుచున్నవాడై, సంహత -అంజలిః - దోసిలి యొగ్గినవాడై, నవామ - నమస్కరించెను.

వారిద్దరు పవిత్రమగు కీర్తిగల శ్రీహరి అనుచరులని ధ్రువుడు గుర్తు పట్టెను. వెంటనే ఆయన లేచి నిలబడి, వారు శ్రీహరి అనుచరులలో ముఖ్యులైన కారణముగా చాల కంగారు పడినవాడై, అతిథులను పూజించే పద్ధతిని విస్మరించినాడు. ఆయన కేవలము మధువైరియగు శ్రీహరి నామములను కీర్తిస్తూ, దోసిలి ఒగ్గి వారికి నమస్కారమును మాత్రమే చేసెను.

తం కృష్ణపాదాభినివిష్టచేతసం
బద్ధాంజలిం ప్రశ్రయనమ్రకంధరమ్ ।
సునందనందావుపసృత్య సస్మితం
ప్రత్యూచతుః పుష్కరనాభసమ్మతౌ ॥ 22

కృష్ణపాద-అభినివిష్టచేతసమ్ - శ్రీకృష్ణుని పాదములయందు దృఢముగా నిలిచియున్న మనస్సు కలిగినట్టియు, బద్ధ-అంజలిమ్ - జోడించబడిన చేతులు కలిగినట్టియు, ప్రశ్రయనమ్రకంధరమ్ - వినయముచే వంగిన మెడ కలిగిన, తమ్ - ఆ ధ్రువుని, పుష్కరనాభసమ్మతౌ - పద్మనాభుని అనుచరులలో శ్రేష్ఠులుగా స్వీకరించబడిన, సునందనందౌ - సునందుడు నందుడు, సస్మితమ్ - చిరునవ్వుతో కూడియున్న విధముగా, ఉపసృత్య - సమీపించి, ప్రతి-ఊచతుః - బదులు చెప్పిరి.

ధ్రువుని మనస్సు శ్రీకృష్ణుని పాదములయందు దృఢముగా నిలిచియుండెను. ఆతడు చేతులను జోడించి వినయముతో తలను వంచి నిలబ

డెను. సునందనందులనే వారిద్దరు పద్మనాభుని అనుచరులలో శ్రేష్ఠులుగా ప్రసిద్ధిని గాంచినవారు. వారు చిరునవ్వుతో ఆతనిని ఉద్దేశించి ఇట్లు పలికిరి.

సునందనందావూచతుః ।
భో భో రాజన్ సుభద్రం తే వాచం నోఽవహితశ్శృణు ।
యః పంచవర్షస్తపసా భవాన్ దేవమతీతృపత్ ॥ 23

భోః భోః రాజన్ - ఓయీ రాజా!, తే - నీ కొరకు, సుభద్రమ్ - సకల కల్యాణములు కలుగుగాక!, నః - మాయొక్క, వాచమ్ - మాటను, అవహితః - సావధానుడవై, శృణు - వినుము, పంచవర్షః - అయిదు సంవత్సరముల వయస్సు గల, యః - ఏ, భవాన్ - నీవు, తపసా - తపస్సుచే, దేవమ్ - శ్రీహరి దేవుని, అతీతృపత్ - సంతోషపెట్టితివో.

సునంద నందులిట్లు పలికిరి --- ఓ రాజా! మా మాటను సావధానముగా వినుము. నీవు అయిదు సంవత్సరముల వయస్సులోనున్నప్పుడే తపస్సును చేసి శ్రీహరి దేవుని సంతోష పెట్టితివి.

తస్యాఖిలజగద్ధాతురావాం దేవస్య శార్ఙ్గిణః ।
పార్షదావిహ సంప్రాప్తౌ నేతుం త్వాం భగవత్పదమ్ ॥ 24

ఆవామ్ - మేమిద్దరము, అఖిలజగత్-ధాతుః - సకలజగత్తునకు తండ్రియైనట్టియు, శార్ఙ్గిణః - శార్ఙ్గము అనే ధనస్సు గల, తస్య - ఆ, దేవస్య - శ్రీహరి దేవుని, పార్షదౌ - అనుచరులము, త్వామ్ - నిన్ను, భగవత్-పదమ్ - శ్రీహరి భగవానుని ధామమును గురించి, నేతుమ్ - తీసుకు వెళ్లుటకు, ఇహ - ఇచటకు, సంప్రాప్తౌ - వచ్చియుంటిమి.

మేమిద్దరము సకలజగత్తునకు తండ్రి, శార్ఙ్గము అనే ధనస్సును ధరించువాడు అగు శ్రీహరిదేవుని అనుచరులము. మేము నిన్ను శ్రీహరి భగవానుని ధామమునకు గొనిపోవుటకై ఇచటకు వచ్చియుంటిమి.

సుదుర్జయం విష్ణుపదం జితం త్వయా
యత్సూరయోఽప్రాప్య విచక్షతే పరమ్ ।

ఆతిష్ఠ తచ్చంద్రదివాకరాదయో
గ్రహర్క్షతారాః పరియంతి దక్షిణమ్ ।। 25

సుదుర్జయమ్ - మిక్కిలి జయింప శక్యము కాని, విష్ణుపదమ్ - శ్రీహరి ధామము, త్వయా - నీచే, జితమ్ - జయించబడినది, యత్ - దేనిని, సూరయః - సప్తర్షులు, అప్రాప్య - చేరలేక, పరమ్ - కేవలము, విచక్షతే - చూచుచున్నారో, చంద్రదివాకర-ఆదయః - చంద్రుడు సూర్యుడు మొదలగువారు, గ్రహ-ఋక్షతారాః - గ్రహములు నక్షత్రములు తారకలు, దక్షిణమ్ - ప్రదక్షిణముగా, పరియంతి - చుట్టూ తిరుగుచున్నారో, తత్ - దానిని, ఆతిష్ఠ - అధిష్ఠించుము.

విష్ణుధామమును జయించుట చాల కఠినము. కాని, నీవు దానిని జయించితివి (పుణ్యముచే సంపాదించితివి). దానిని సప్తర్షులు సైతము చేరుకొనలేక, కేవలము దూరమునుండి చూచుచుందురు. దాని చుట్టూ సూర్యుడు, చంద్రుడు, గ్రహములు, నక్షత్రములు, తారకలు మొదలగునవి ప్రదక్షిణముగా తిరుగుచుండును. దానిని నీవు ఇప్పుడు అధిష్ఠించుము.

అనాస్థితం తే పితృభిరన్యైరప్యంగ కర్హిచిత్ ।
ఆతిష్ఠ జగతాం వంద్యం తద్విష్ణోః పరమం పదమ్ ।। 26

అంగ - ఓయీ!, కర్హిచిత్ - ఏ కాలమునందైననూ, తే - నీ, పితృభిః - తండ్రితాతలచే, అన్యైః అపి - ఇతరులచేనైననూ, అనాస్థితమ్ - అధిష్ఠించబడనట్టియు, జగతామ్ - లోకములకు, వంద్యమ్ - నమస్కరించ దగినట్టియు, తత్ - ప్రసిద్ధమైన, పరమమ్ - సర్వాతిశాయియగు, విష్ణోః - శ్రీహరియొక్క, పదమ్ - ధామమును, ఆతిష్ఠ - అధిష్ఠించుము.

ఓ ధ్రువా! లోకములకు నమస్కరించదగిన శ్రీహరియొక్క ధామమును ఇదివరలో నీ తండ్రితాతలు గాని, ఇతరులు గాని ఎవరైననూ పొందియుండలేదు. వేదములలో ప్రసిద్ధమైన సర్వోత్కృష్టమైన అట్టి శ్రీహరి ధామమును నీవు అధిష్ఠించుము.

ఏతద్విమానప్రవరముత్తమశ్లోకమౌలినా ।
ఉపస్థాపితమాయుష్మన్నధిరోఢుం త్వమర్హసి ॥ 27

ఆయుష్మన్ - ఓ ఆయుష్మంతుడా!, ఉత్తమశ్లోకమౌలినా - పవిత్రమగు కీర్తి గలవారిలో అగ్రేసరుడగు శ్రీహరిచే, ఉపస్థాపితమ్ - పంపబడిన, ఏతత్ - ఈ, విమానప్రవరమ్ - శ్రేష్ఠమగు విమానమును, త్వమ్ - నీవు, అధిరోఢుమ్ - అధిష్ఠించుటకు, అర్హసి - తగుచున్నావు.

ఓ ఆయుష్మంతుడా! పవిత్రమగు కీర్తి గలవారిలో అగ్రేసరుడగు శ్రీహరి ఈ గొప్ప విమానమును పంపినాడు. నీవు దీనిని అధిరోహించుటకు అర్హుడవు.

మైత్రేయ ఉవాచ ।
నిశమ్య వైకుంఠనియోజ్యముఖ్యయోః
మధుచ్యుతం వాచమురుక్రమప్రియః ।
కృతాభిషేకః కృతనిత్యమంగలో
మునీన్ ప్రణమ్యాశిషమభ్యవాదయత్ ॥ 28

ఉరుక్రమప్రియః - శ్రీహరికి ప్రియమైనవాడు (శ్రీహరి ప్రియమైనవాడు) అగు ధ్రువుడు, వైకుంఠనియోజ్యముఖ్యయోః - వైకుంఠవాసియగు శ్రీహరి అనుచరులలో ముఖ్యులగు వారిద్దరి, మధుచ్యుతమ్ - తేనెలొలికే, వాచమ్ - మాటను, నిశమ్య - విని, కృత-అభిషేకః - చేయబడిన స్నానము గలవాడై, కృతనిత్యమంగలః - చేయబడిన నిత్యకర్మ మంగళాలంకారములు గలవాడై, మునీన్ - మహర్షులను, ప్రణమ్య - నమస్కరించి, ఆశిషమ్ - ఆశీర్వచనములను, అభ్యవాదయత్ - పలికించెను.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- ధ్రువునకు శ్రీహరి ప్రియుడు, శ్రీహరికి ధ్రువుడు ప్రియుడు. వైకుంఠవాసియగు శ్రీహరియొక్క అనుచరులు ఇద్దరు పలికిన ఆ తేనెలొలికే పలుకులను విన్న ధ్రువుడు స్నానమునాచరించి, సంధ్యావందనాది నిత్యకర్మలను పూర్తి చేసుకొని, మంగళా

లంకారములను ధరించి, అక్కడి మహర్షులకు నమస్కరించి, వారి ఆశీర్వ చనములను తీసుకొనెను.

పరీత్యాభ్యర్చ్య ధిష్ణ్యాగ్ర్యం పార్షదావభివంద్య చ ।
ఇయేష తదధిష్ఠాతుం బిభ్రద్రూపం హిరణ్మయమ్ ॥ 29

ధిష్ణ్య-అగ్ర్యమ్ - శ్రేష్ఠమగు ఆ విమానమును, అభ్యర్చ్య - చక్కగా పూజించి, పరీత్య - ప్రదక్షిణమును చేసి, చ - మరియు, పార్షదౌ - శ్రీహరి అనుచరులను, అభివంద్య - నమస్కరించి, హిరణ్మయమ్ - తేజో మయమగు, రూపమ్ - రూపమును, బిభ్రత్ - ధరించినవాడై, తత్ - ఆ విమానమును, అధిష్ఠాతుమ్ - అధిష్ఠించుటకు, ఇయేష - కోరెను.

ధ్రువుడు ఆ గొప్ప విమానమును చక్కగా పూజించి ప్రదక్షిణ మును చేసెను. తరువాత ఆ శ్రీహరి అనుచరులకు నమస్కరించెను. అపు డాయన తేజోమయమగు రూపమును దాల్చినవాడై విమానమును అధి ష్ఠించుటకు సంసిద్ధుడాయెను.

తదోత్తానపదః పుత్రో దదర్శాంతకమాగతమ్ ।
మృత్యోర్మూర్ధ్ని పదం దత్త్వా ఆరురోహాద్భుతం గృహమ్ ॥ 30

తదా - అప్పుడు, ఉత్తానపదః - ఉత్తానపాదుని, పుత్రః - పుత్రు డగు ధ్రువుడు, ఆగతమ్ - విచ్చేసిన, అంతకమ్ - మృత్యుదేవతను, దదర్శ - చూచెను, మృత్యోః - మృత్యువుయొక్క, మూర్ధ్ని - తలపై, పదమ్ - కాలిని, దత్త్వా - ఉంచి, అద్భుతమ్ - అద్భుతమగు, గృహమ్ - విమానమును, ఆరురోహ - అధిష్ఠించెను.

అప్పుడు అచటకు కాలము (మృత్యువు) రూపమును దాల్చి విచ్చేసెను. ఉత్తానపాదుని పుత్రుడగు ధ్రువుడు ఆ మృత్యువును చూచి, దాని తలపై కాలిని పెట్టి, ఆ అద్భుతమగు విమానమునెక్కెను.

తదా దుందుభయో నేదుర్మృదంగపణవాదయః ।
గంధర్వముఖ్యాః ప్రజగుః పేతుః కుసుమవృష్టయః ॥ 31

తదా - అప్పుడు, దుందుభయః - భేరీలు, మృదంగపణవ-ఆ దయః - మద్దెళ్లు తప్పెట్లు మొదలగునవి, నేదుః - మ్రోగినవి, గంధర్వ ముఖ్యాః - గంధర్వులు మొదలగువారు, ప్రజగుః - గొప్పగా పాడిరి, కుసు మవృష్టయః - పుష్పవర్షములు, పేతుః - పడినవి.

అప్పుడు భేరీలు, మద్దెళ్లు, తప్పెట్లు మొదలగునవి మ్రోగినవి. గంధర్వులలో ముఖ్యులగు తుంబురుడు మొదలగువారు గొప్పగా పాడిరి. పూల వానలు కురిసినవి.

స చ స్వర్లోకమారోక్ష్యన్ సునీతిం జననీం ధ్రువః ।
అన్వస్మరదగం హిత్వా దీనాం యాస్యే త్రివిష్టపమ్ ॥ 32

స్వః-లోకమ్ - స్వర్గలోకమును, ఆరోక్ష్యన్ - అధిరోహించబోయే, సః - ఆ, ధ్రువః - ధ్రువుడు, జననీమ్ - తల్లియగు, సునీతిమ్ - సునీతిని, అను-అస్మరత్ - స్మరించెను, దీనామ్ - దీనురాలగు తల్లిని, హిత్వా - విడిచిపెట్టి, అగమ్ - వెళ్లుటకు శక్యము కాని, త్రివిష్టపమ్ - స్వర్గలోక మును గురించి, యాస్యే - వెళ్లబోవుచున్నాను.

స్వర్గలోకమును అధిరోహించబోయే ముందు ధ్రువునకు తల్లి సునీతి గుర్తుకు వచ్చెను. దీనురాలగు తల్లిని విడిచిపెట్టి పొంద శక్యము కాని స్వర్గలోకమునకు వెళ్లిపోవుచున్నానే అని ఆయన తలపోసెను.

ఇతి వ్యవసితం తస్య వ్యవసాయ సురోత్తమౌ ।
దర్శయామాసతుర్దేవీం దేవయానేన గచ్ఛతీమ్ ॥ 33

ఇతి - ఈ విధమగు, తస్య - ఆ ధ్రువుని, వ్యవసితమ్ - భావన ను, వ్యవసాయ - తెలుసుకొని, సుర-ఉత్తమౌ - దేవతలలో గొప్పవారగు నందసునందులు, దేవయానేన - దేవమార్గముచే (దేవవిమానముచే), గచ్ఛతీమ్ - వెళ్లుచున్న, దేవీమ్ - సునీతిని, దర్శయామాసతుః - చూపిం చిరి.

ధ్రువుని ఈ మనోభావము దేవతోత్తములగు నందసునందులకు తెలిసిపోయెను. వారాయనకు దేవమార్గములో దేవవిమానముపై వెళ్లు చున్న సునీతీదేవిని చూపించిరి.

తత్ర తత్ర ప్రశంసద్భిః పథి వైమానికైస్సురైః ।
అవకీర్యమాణో దదృశే కుసుమైః క్రమశో గ్రహాన్ ॥ 34

పథి - మార్గమునందు, తత్ర తత్ర - అక్కడక్కడ, ప్రశంసద్భిః - కొనియాడుచున్నట్టియు, వైమానికైః - విమానములయందున్న, సురైః - దేవతలచే, కుసుమైః - పువ్వులచే, అవకీర్యమాణః - చల్లబడుచున్నవాడై, గ్రహాన్ - గ్రహములను, క్రమశః - వరుసగా, దదృశే - చూచెను.

మార్గములో అక్కడక్కడ విమానములలోని దేవతలు ధ్రువునిపై పువ్వులను చల్లుతూ కొనియాడు చుండిరి. ఆయన వరుసగా గ్రహములను చూచెను.

త్రిలోకీం దేవయానేన సోஉతివ్రజ్య మునీనపి ।
పరస్తాద్యద్ధ్రువగతిర్విష్ణోః పదమథాభ్యగాత్ ॥ 35

అథ - తరువాత, ధ్రువగతిః - నిశ్చలమగు గమనము గల, సః - ఆ ధ్రువుడు, దేవయానేన - దేవలోక మార్గముచే (దేవవిమానముచే), త్రిలోకీమ్ - ముల్లోకముల సమూహమును, మునీన్ అపి - సప్తర్షులను కూడ, అతివ్రజ్య - దాటి వెళ్లి, పరస్తాత్ - ఆపైన, యత్ - ఏ, విష్ణోః - శ్రీహరియొక్క, పదమ్ - ధామము గలదో దానిని, అభి-అగాత్ - సుఖముగా చేరెను (ధ్రువగతిః - ధ్రువమగు స్థానమును చేరుకున్నవాడు).

తరువాత ధ్రువుడు ఆ దేవవిమానముపై దేవలోకమార్గములో నిశ్చలముగా పయనించి, ముల్లోకములను సప్తర్షిమండలమును కూడ దాటి, ఆ పైన ఉండే శ్రీహరి ధామమును సుఖముగా చేరుకొనెను. ఈ విధముగా ధ్రువుడు శాశ్వతమగు స్థానమును పొందెను.

యద్భ్రాజమానం స్వరుచైవ సర్వతో
లోకాస్త్రయో హ్యనువిభ్రాజంత ఏతే ।

యన్నాప్రజన్ జంతుషు యేఽననుగ్రహా
ప్రజంతి భద్రాణి చరంతి యేఽనిశమ్ ॥ 36

యత్ - ఏ ధామము, స్వరుచా ఏవ - తన ప్రకాశము చేతనే, సర్వతః - అంతటా, భ్రాజమానమ్ - ప్రకాశించుచున్నదో, ఏతే - ఈ, త్రయః - మూడు, లోకాః - లోకములు, అనువిభ్రాజంతే హి - అనుసరించి ప్రకాశించుచున్నవో, జంతుషు - ప్రాణులయందు, యే - ఎవరైతే, అననుగ్రహాః - దయ లేనివారో వారు, యత్ - దేనిని, న అప్రజన్ - పొందరో, యే - ఎవరైతే, అనిశమ్ - ఎల్లవేళలా, భద్రాణి - మంగళకార్యములను, చరంతి - ఆచరించెదరో వారు, ప్రజంతి - వెళ్లెదరో.

ఆ శ్రీహరి ధామము స్వయంప్రకాశము. అది అంతటా తనంత తానుగా ప్రకాశించుచుండగా, ఈ ముల్లోకములు దాని ప్రకాశములో మాత్రమే ప్రకాశించుచున్నవి. ప్రాణులయందు దయను చూపి మంగళకార్యములను చేసే పుణ్యాత్ములు మాత్రమే ఆ లోకమును పొందగల్గుదురు. ప్రాణులయందు దయ లేని క్రూరచిత్తులు అచటకు చేరలేరు.

శాంతాస్సమదృశశ్శుద్ధాస్సర్వభూతానురంజనాః ।
యాంత్యంజసాఽచ్యుతపదమచ్యుతప్రియబాంధవాః ॥ 37

శాంతాః - ప్రసన్నమగు చిత్తము గలవారు, సమదృశః - సర్వమునందు పరబ్రహ్మను దర్శించువారు, శుద్ధాః - పరిశుద్ధమగు అంతఃకరణము గలవారు, సర్వభూత-అనురంజనాః - సకలప్రాణులను రంజింపజేయువారు, అచ్యుతప్రియబాంధవాః - శ్రీహరికి ప్రియబంధువులైనవారు (శ్రీహరియే ప్రియబంధువుగా గలవారు, శ్రీహరి భక్తులే బంధువులుగా గలవారు), అచ్యుతపదమ్ - చ్యుతిలేని ఆ శ్రీహరి ధామమును, అంజసా - తేలికగా, యాంతి - పొందెదరు.

ప్రసన్నమగు చిత్తము గలవారై సర్వమునందు పరబ్రహ్మను దర్శించే పరిశుద్ధాంతఃకరణులగు జనులు సకలప్రాణులను సంతోషపెట్టెదరు. వీరికి శ్రీహరి మరియు శ్రీహరి భక్తులు మాత్రమే ప్రియబంధువులు.

ఇట్టివారు శ్రీహరికి ప్రియబంధువులగుదురు. వీరు శాశ్వతమగు ఆ శ్రీహరి ధామమును తేలికగా పొందెదరు.

ఇత్యుత్తానపదః పుత్రో ధ్రువః కృష్ణపరాయణః ।
అభూత్త్రయాణాం లోకానాం చూడామణిరివామలః ॥ 38

ఇతి - ఈ విధముగా, ఉత్తానపదః - ఉత్తానపాదుని, పుత్రః - పుత్రుడు, కృష్ణపరాయణః - శ్రీకృష్ణునియందు అనన్యమగు భక్తి గలవాడు, అమలః - స్వచ్ఛమగు అంతఃకరణము గలవాడు అగు, ధ్రువః - ధ్రువుడు, త్రయాణామ్ - మూడు, లోకానామ్ - లోకములకు, చూడామణిః ఇవ - శిరోభూషణము వంటివాడు, అభూత్ - ఆయెను.

ఈ విధముగా ఉత్తానపాదుని పుత్రుడగు ధ్రువుడు పవిత్రమగు అంతఃకరణము గలవాడై శ్రీకృష్ణునియందు అనన్యమగు భక్తిని చేసి, ముల్లోకములకు తలమానికము వంటివాడయ్యెను.

గంభీరవేగోఽనిమిషం జ్యోతిషాం చక్రమాహితమ్ ।
యస్మిన్ భ్రమతి కౌరవ్య మేఢ్యామివ గవాం గణః ॥ 39

కౌరవ్య - కురువంశీయుడవగు ఓ విదురా!, అనిమిషమ్ - అలుపునెరుగని, గంభీరవేగః - గొప్ప వేగము గల, జ్యోతిషామ్ - జ్యోతిర్మండలములయొక్క, చక్రమ్ - చక్రము, యస్మిన్ - ఏ ధ్రువస్థానమునందు, గంభీరవేగః - గంభీరమగు వేగము గల, గవామ్ - గోవుల, గణః - సమూహము, మేఢ్యాం ఇవ - రాటయందు వలె, ఆహితమ్ - స్థాపించబడినదై, భ్రమతి - తిరుగుచుండునో.

కురువంశీయుడవగు ఓ విదురా! ధాన్యపు కుప్పలను నూర్చునప్పుడు మైదానమునకు మధ్యలో పాతబడిన రాటకు కట్టబడి దాని చుట్టూ ఎద్దుల గుంపు గంభీరమగు వేగముతో తిరుగుచుండును. అదే విధముగా జ్యోతిర్మండలల చక్రము అలుపునెరుగని గంభీరమగు వేగముతో ధ్రువలోకమునకు కట్టుబడియున్నదై, దాని చుట్టూ తిరుగుచుండును.

మహిమానం విలోక్యాస్య నారదో భగవానృషిః ।
ఆతోద్యం వితుదన్ శ్లోకాన్ సత్రేఽగాయత్ప్రచేతసామ్ ।। 40

అస్య - ఈ ధ్రువునియొక్క, మహిమానమ్ - గొప్పదనమును, విలోక్య - చూచి, భగవాన్ - పూజ్యుడగు, నారదః ఋషిః - నారద మహర్షి, ప్రచేతసామ్ - ప్రచేతసులు అనే రాజులయొక్క, సత్రే - సత్రయాగమునందు, ఆతోద్యమ్ - వీణను, వితుదన్ - వాయించుచున్నవాడై, శ్లోకాన్ - శ్లోకములను, అగాయత్ - పాడెను.

పూజ్యుడగు నారద మహర్షి ధ్రువునియొక్క ఈ గొప్పదనమును చూచి, ప్రచేతసరాజుల సత్రయాగములో వీణను వాయిస్తూ, కొన్ని శ్లోకములను పాడెను.

నారద ఉవాచ ।
నూనం సునీతేః పతిదేవతాయాః
తపఃప్రభావస్య సుతస్య తాం గతిమ్ ।
దృష్ట్వాభ్యుపాయానపి వేదవాదినో
నైవాధిగంతుం ప్రభవంతి కిం నృపాః ।। 41

నూనమ్ - నిశ్చయము, పతిదేవతాయాః - భర్తయే దైవముగా గల, సునీతేః - సునీతియొక్క, సుతస్య - పుత్రుడగు ధ్రువుని, తపః-ప్రభావస్య - తపోమహిమయొక్క, తామ్ - అట్టి, గతిమ్ - ఫలమును, దృష్ట్వా - చూచి, వేదవాదినః అపి - వేదవేత్తలు కూడ, అభ్యుపాయాన్ - అంతరంగసాధనలను, అధిగంతుమ్ - అనుష్ఠించుటకు, న ఏవ ప్రభవంతి - సుతరాము సమర్థులు కాలేకపోవుచున్నారు, కిం నృపాః - రాజుల గురించి చెప్పేదేమున్నది?

నారదుడిట్లు పలికెను --- భర్తయే దైవముగా గల సునీతియొక్క పుత్రుడగు ధ్రువుడు తపస్సుయొక్క మహిమచే ఇట్టి ఫలమును పొందెను. వేదవేత్తలగు మహర్షులు కూడ ఈ విషయమును చూచి, ధ్రువుడు అనుష్ఠించిన అంతరంగ సాధనములను అనుష్ఠించుటలో సమర్థులు కాకుండిరి.

కావుననే, వారు అట్టి మహాఫలమును పొందకుండిరి. ఇక రాజులు అట్టి ఫలమును పొందలేకున్నారని వేరుగా చెప్పవలయునా?

యః పంచవర్షో గురుదారవాక్శరైః
భిన్నేన యాతో హృదయేన దూయతా ।
వనం మదాదేశకరోఽజితం ప్రభుం
జిగాయ తద్భక్తగుణైః పరాజితమ్ ॥ 42

పంచవర్షః - అయిదు సంవత్సరముల వయస్సు గల, యః - ఏ ధ్రువుడు, గురుదారవాక్-శరైః - తండ్రియొక్క రెండవ భార్యయొక్క మాటలు అనే బాణములచే, భిన్నేన - గాయపరచబడి, దూయతా - పీడను కలిగించుచున్న, హృదయేన - హృదయముతో, వనమ్ - అడవిని గురించి, యాతః - వెళ్లినాడో, మత్-ఆదేశకరః - నా ఆదేశమును పాలించే ఆ ధ్రువుడు, అజితమ్ - జయింపబడనట్టియు, తత్-భక్తగుణైః - ఆయన భక్తుల గుణములచే, పరాజితమ్ - లొంగిపోవునట్లు చేయబడే, ప్రభుమ్ - శ్రీహరి ప్రభుని, జిగాయ - జయించెను.

ధ్రువుడు అయిదు సంవత్సరముల వయస్సులో ఉండగా సవతి తల్లి పలికిన ఈటెలవంటి మాటలచే హృదయమునకు చాల పీడ కలిగి అడవికి వెళ్లిపోయెను. అచట ఆతడు నా ఆదేశమును పాలించి తపస్సును చేసెను. శ్రీహరిని ఆరాధించి వశపరచుకొనుట చాల కష్టము. అయిననూ, ఆయన తన భక్తుల సద్గుణములకు లొంగిపోవును. అట్టి శ్రీహరిని ధ్రువుడు తన వశము చేసుకొనెను.

యః క్షత్రబంధుర్భువి తస్యాధిరూఢ-
మన్వారురుక్షేదపి వర్షపూగైః ।
షట్పంచవర్షో యదహోభిరల్పైః
ప్రసాద్య వైకుంఠమవాప తత్పదమ్ ॥ 43

భువి - భూలోకమునందు, యః - ఏ, క్షత్రబంధుః - క్షత్రియుడనబడేవాడు గలడో ఆతడు, తస్య - ఆ ధ్రువుని, అధిరూఢమ్ - అధిష్ఠించః

డిన ధామమును, అను - ధ్రువుని తరువాత, వర్షపూగైః - సంవత్సరముల సమూహములచే, అపి ఆరురుక్షేత్ - అధిష్ఠించగోరునా యేమి?, యత్ - ఏ, పదమ్ - వైకుంఠ ధామము గలదో, తత్ - దానిని, షట్-పంచవర్షః - అయిదారు సంవత్సరముల వయస్సు గల ధ్రువుడు, అల్పైః - కొద్ది, అహోభిః - దినములచే, వైకుంఠం - బుద్ధిగుహయందు నివసించే శ్రీహరిని, ప్రసాద్య - ప్రసన్నునిగా చేసుకొని, అవాప - పొందెను.

ఈ లోకములో క్షత్రియులు ఎంతటి గొప్పవారైనా ధ్రువునికంటె తక్కువయే. వారెవరైనా ధ్రువుడు అధిష్ఠించిన ధామమును అనేక సంవత్సరములు తపస్సు చేసియైననూ అధిష్ఠించ గల్గుదురా? అట్లు కోరుటకైననూ వారికి తాహతు చాలదు. ధ్రువుడు అయిదారేళ్ల వయస్సులోనే కొద్ది రోజులలో బుద్ధిగుహయందు నివసించే శ్రీహరిని ప్రసన్నునిగా చేసుకొని ఆ ధామమును చేరుకొనినాడు.

మైత్రేయ ఉవాచ ।
ఏతత్తేఽభిహితం సర్వం యత్పృష్టోఽహమిహ త్వయా ।
ధ్రువస్యోద్దామయశసశ్చరితం సంమతం సతామ్ ॥ 44

ఉద్దామయశసః - చాల గొప్ప కీర్తి గల, ధ్రువస్య - ధ్రువుని, ఏతత్ - ఈ, చరితమ్ - వృత్తాంతము, సర్వమ్ - అంతా, తే - నీ కొరకు, అభిహితమ్ - చెప్పబడినది, సతామ్ - సత్పురుషులకు, సంమతమ్ - మిక్కిలి ప్రియమగు (ప్రశంసించబడే), యత్ - ఏ చరితమును గురించి, త్వయా - నీచే, అహమ్ - నేను, ఇహ - ఇక్కడ (ఇప్పుడు), పృష్టః - ప్రశ్నించబడితినో.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- నీవు నన్ను ఇప్పుడు ఇక్కడ గొప్ప కీర్తి గల ధ్రువుని వృత్తాంతమునంతను చెప్పమని కోరితివి. సత్పురుషులకు మిక్కిలి ప్రియమగు ఈ చరితమును నేను నీకు చెప్పితిని. దీనిని సత్పురుషులు చాల ప్రశంసించెదరు.

ధన్యం యశస్యమాయుష్యం పుణ్యం స్వస్త్యయనం మహత్।
స్వర్గ్యం ధ్రౌవ్యం సౌమనస్యం ప్రశస్యమఘమర్షణమ్ ॥ 45

ధన్యమ్ - సంపదనిచ్చునది, యశస్యమ్ - కీర్తిని ఇచ్చునది, ఆయుష్యమ్ - ఆయుర్దాయమును ఇచ్చునది, పుణ్యమ్ - పవిత్రమైనది, స్వస్తి-అయనమ్ - మంగళములకు నిధానము, మహత్ - గొప్పది, స్వర్గ్యమ్ - స్వర్గమునిచ్చునది, ధ్రౌవ్యమ్ - ధ్రువపదమునిచ్చునది, సౌమనస్యమ్ - దేవత్వమునిచ్చునది (మనస్సునకు ప్రసన్నతనిచ్చునది), ప్రశస్యమ్ - కొనియాడ దగినది, అఘమర్షణమ్ - పాపములను పోనాడునది.

ఈ గొప్ప చరితము సంపదను, కీర్తిని, ఆయుర్దాయమును ఇచ్చును. పవిత్రమైన ఈ చరితము మంగళములకు నిధానము. కొనియాడదగిన ఈ చరితము భక్తులకు స్వర్గమును, ధ్రువపదమును, దేవత్వమును ఇచ్చును. ఇది పాపములను కడిగివేసి మనస్సునకు ప్రసన్నతను కలిగించును.

శ్రుత్వైతచ్ఛ్రద్ధయాఽభీక్ష్ణమచ్యుతప్రియచేష్టితమ్ ।
భవేద్భక్తిర్భగవతి యయా స్యాత్ క్లేశసంక్షయః ॥ 46

అచ్యుతప్రియచేష్టితమ్ - శ్రీహరికి ప్రియుడగు (శ్రీహరియే ప్రియమైన) ధ్రువుని ఈ వృత్తాంతమును, అభీక్ష్ణమ్ - పలుమార్లు, శ్రద్ధయా - శ్రద్ధతో, శ్రుత్వా - విని, భగవతి - శ్రీహరి భగవానునియందు, భక్తిః - భక్తి, భవేత్ - కలుగును, యయా - దేనిచే, క్లేశసంక్షయః - చిత్తమలముల నాశము కలుగునో.

ధ్రువుడు శ్రీహరికి చాల ప్రీతిపాత్రుడు. ధ్రువునకు శ్రీహరియందు ప్రీతి మెండు. ఆయన వృత్తాంతమును పలుమార్లు శ్రద్ధతో విన్నవారికి ఆ శ్రీహరి భగవానునియందు భక్తి కుదురును. అవిద్య, అస్మిత, రాగము, ద్వేషము, అభినివేశము అనే అయిదు చిత్తక్లేశములు అట్టి భక్తి వలన తొలగిపోవును.

మహత్త్వమిచ్ఛతాం తీర్థం శ్రోతుశ్శీలాదయో గుణాః ।
యత్ర తేజస్తదిచ్ఛూనాం మానో యత్ర మనస్వినామ్ ॥ 47

మహత్త్వమ్ - గొప్పదనమును, ఇచ్ఛతామ్ - కోరువారలకు, తీర్థమ్ - అది లభించే స్థానము, యత్ర - దేనియందైతే, శ్రోతుః - శ్రవ

ణము చేయువానికి, శీల-ఆదయః - సచ్ఛీలము మొదలగు, గుణాః - గుణ ములు కలుగునో, తేజః - తేజస్సు, తత్-ఇచ్ఛూనామ్ - దానిని కోరువాల కు, యత్ర - దేనియందైతే, మనస్వినామ్ - అభిమానవంతులకు, మానః - సమ్మానము కలుగునో.

ఈ వృత్తాంతమును శ్రవణము చేయువారలకు గొప్పదనము గాని, బ్రహ్మవర్చస్సు గాని, దేనిని కోరితే అది లభించును. సచ్ఛీలము మొదలగు గుణములు కలుగును. మరియు మానమర్యాదలు గలవారికి సమ్మానము లభించును.

ప్రయతః కీర్తయేత్ప్రాతస్సమవాయే ద్విజన్మనామ్ ।
సాయం చ పుణ్యశ్లోకస్య ధ్రువస్య చరితం మహత్ ।। 48

పుణ్యశ్లోకస్య - పవిత్రమగు కీర్తి గల, ధ్రువస్య - ధ్రువునియొక్క, మహత్ - గొప్ప, చరితమ్ - వృత్తాంతమును, ద్విజన్మనామ్ - వైదికసం స్కారము గలవారి, సమవాయే - సభయందు, ప్రాతః - ఉదయము, చ - మరియు, సాయమ్ - సాయంకాలము, ప్రయతః - ఏకాగ్రమగు చిత్తము గలవాడై, కీర్తయేత్ - కీర్తించవలెను.

పవిత్రమగు కీర్తి గల ధ్రువుని గొప్ప వృత్తాంతమును వైదికసంస్కా రవంతుల సభలో వక్త ఏకాగ్రచిత్తము గలవాడై ఉదయ సాయంకాలముల యందు కీర్తించవలెను.

పూర్ణమాస్యాం సినీవాల్యాం ద్వాదశ్యాం శ్రవణేఽథ వా ।
దినక్షయే వ్యతీపాతే సంక్రమేఽర్కదినేఽపి వా ।। 49

పూర్ణమాస్యామ్ - పూర్ణిమనాడు, సినీవాల్యామ్ - అమావాస్యనా డు, ద్వాదశ్యామ్ - ద్వాదశినాడు, అథవా - లేక, శ్రవణే - శ్రవణ నక్షత్ర మునాడు, దినక్షయే - దినక్షయమునాడు, వ్యతీపాతే - సంక్రాంతినాడు, అపి వా - లేక, అర్కదినే - ఆదివారము (రథసప్తమి) నాడు (కీర్తించవ లెను).

పూర్ణిమ, అమావాస్య, ద్వాదశి, శ్రవణ నక్షత్రము ఉన్న దినము, తిథి ఆరంభమై పూర్తి అయ్యే దినము, సంక్రాంతి, ఆదివారము, రథసప్తమి అనే దినములలో వీలును బట్టి ఈ గాథను కీర్తించవలెను.

శ్రావయేచ్ఛ్రద్దధానానాం తీర్థపాదపదాశ్రయః ।
నేచ్ఛంస్తత్రాత్మనాత్మానం సంతుష్ట ఇతి సిధ్యతి ॥ 50

తీర్థపాదపద-ఆశ్రయః - గంగ పుట్టిన పాదములు గల శ్రీహరి పాదములను శరణు జొచ్చిన భక్తుడు, న ఇచ్ఛన్ - ఫలాకాంక్ష లేనివాడై, శ్రద్దధానానామ్ - శ్రద్ధాళువులకు, శ్రావయేత్ - వినిపించవలెను, తత్ర - ఆ విధముగా చేయగా, ఆత్మానమ్ - తన గురించి, ఆత్మనా - తన చేతనే, సంతుష్టః - సంతోషము గలవాడై, ఇతి - ఈ కారణముగా, సిధ్యతి - సంసిద్ధిని పొందును.

శ్రీహరి పాదములనుండి గంగ పుట్టినది. అట్టి పాదములను శరణు జొచ్చిన భక్తుడు ప్రతిఫలాపేక్ష లేనివాడై ఈ వృత్తాంతమును శ్రద్ధాళువులకు వినిపించవలెను. అట్లు చేయుట వలన వానికి తనలో తనకు సంతోషము లభించును. దాని వలన ఆతడు ఆత్మనిష్ఠను పొంది కృతార్థుడగును.

జ్ఞానమజ్ఞాతతత్త్వాయ యో దద్యాత్సత్పథేఽమృతమ్ ।
కృపాలోర్దీననాథస్య దేవాస్తస్యానుగృహ్ణతే ॥ 51

సత్-పథే - సత్యమార్గమునందు, అజ్ఞాతతత్త్వాయ - తెలియబడని యథార్థ జ్ఞానము గలవానికి, యః - ఎవడైతే, జ్ఞానమ్ - జ్ఞానమనే, అమృతమ్ - అమృతమును, దద్యాత్ - ఇచ్చునో, దీననాథస్య - దీనులను ద్ధరించే, కృపాలోః - దయామయుడగు, తస్య - వానికి, దేవాః - దేవతలు, అనుగృహ్ణతే - అనుగ్రహించెదరు.

సత్యమార్గములో యథార్థ జ్ఞానము లేని వ్యక్తికి ఎవడైతే ఈ జ్ఞానము అనే అమృతమును ఇచ్చునో, వాడే దీనులనుద్ధరించే దయామయుడు. అట్టివానిని దేవతలు అనుగ్రహించెదరు.

ఇదం మయా తేఽభిహితం కురూద్వహ
ధ్రువస్య విఖ్యాతవిశుద్ధకర్మణః ।
హిత్వార్భకః క్రీడనకాని మాతుః
గృహం చ విష్ణుం శరణం యో జగామ ॥ 52

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే చతుర్థస్కంధే ధ్రువోపాఖ్యానే
ధ్రువస్య పరమపదప్రాప్తిర్నామ ద్వాదశోఽధ్యాయః ॥

కురు-ఉద్వహ - కురువంశ శ్రేష్ఠుడవగు ఓ విదురా!, విఖ్యాతవిశుద్ధకర్మణః - ప్రసిద్ధిని గాంచిన పరమపవిత్రమగు చరితము గల, ధ్రువస్య - ధ్రువునియొక్క, ఇదమ్ - ఈ వృత్తాంతము, మయా - నాచే, తే - నీ కొరకు, అభిహితమ్ - చెప్పబడినది, అర్భకః - పిల్లవాడగు, యః - ఏ ధ్రువుడు, క్రీడనకాని - ఆట వస్తువులను, మాతుః - తల్లియొక్క, గృహం చ - గృహమును కూడ, హిత్వా - విడిచిపెట్టి, విష్ణుమ్ - శ్రీహరిని, శరణం జగామ - శరణు పొందెనో.

కురువంశ శ్రేష్ఠుడవగు ఓ విదురా! ధ్రువుని పరమపవిత్రమగు చరితము లోకములో ప్రసిద్ధిని గాంచినది. ధ్రువుడు పిల్లవాడుగా నుండగనే ఆటవస్తువులను, తల్లి గృహమును కూడ విడిచిపెట్టి, శ్రీహరిని శరణు జొచ్చినాడు. ఆ వృత్తాంతమును నేను నీకు చెప్పితిని.

శ్రీమద్భాగవత మహాపురాణములోని నాల్గవ స్కంధములో
ధ్రువోపాఖ్యానములో ధ్రువుడు పరమపదమును పొందుట
అనే పన్నెండవ అధ్యాయము ముగిసినది (**12**).

*****

# అథ త్రయోదశోఽధ్యాయః

## పృథూపాఖ్యానము - అంగ మహారాజు రాజ్యమును విడిచి వెళ్లుట

సూత ఉవాచ ।
నిశమ్య కౌషారవిణోపవర్ణితం
ధ్రువస్య వైకుంఠపదాధిరోహణమ్ ।
ప్రరూఢభావో భగవత్యధోక్షజే
ప్రష్టుం పునస్తం విదురః ప్రచక్రమే ॥ 1

సూతః - సూత మహర్షి, ఉవాచ - పలికెను, కౌషారవిణా - మైత్రేయ మహర్షిచే, ఉపవర్ణితమ్ - వర్ణించబడిన, ధ్రువస్య - ధ్రువుని, వైకుంఠపద-అధిరోహణమ్ - వైకుంఠధామము నధిష్ఠించుటను, నిశమ్య - విని, అధోక్షజే - ఇంద్రియగోచరుడు కాని, భగవతి - శ్రీహరి భగవానుని యందు, ప్రరూఢభావః - గట్టిగా నాటుకున్న భక్తిగల, విదురః - విదురుడు, పునః - మరల, తమ్ - ఆయనను, ప్రష్టుమ్ - ప్రశ్నించుటకు, ప్రచక్రమే - ఉపక్రమించెను.

సూత మహర్షి ఇట్లు పలికెను --- ధ్రువుడు వైకుంఠధామమును అధిష్ఠించిన వృత్తాంతమును మైత్రేయుడు ఈ విధముగా వర్ణించి చెప్పెను. దానిని విన్న విదురునకు ఇంద్రియగోచరుడు కాని శ్రీహరి భగవానునిపై హృదయములో భక్తి గట్టిగా నాటుకొనెను. ఆయన మరల మైత్రేయుని ప్రశ్నించుటకు ఉపక్రమించెను.

విదుర ఉవాచ ।
కే తే ప్రచేతసో నామ కస్యాపత్యాని సువ్రత ।
కస్యాన్వవాయే ప్రఖ్యాతాః కుత్ర వా సత్రమాసతే ।। 2

సువ్రత - గొప్ప వ్రతనిష్ఠ గలవాడా!, తే - ఆ, ప్రచేతసః నామ - ప్రచేతసులని ప్రసిద్ధి చెందినవారు, కే - ఎవరు?, కస్య - ఎవని, అపత్యాని - సంతానము?, కస్య - ఎవని, అన్వవాయే - వంశమునందు, ప్రఖ్యాతాః - ప్రసిద్ధిని బడసినారు?, కుత్ర వా - ఎక్కడ, సత్రమ్ - సత్రయాగమును, ఆసతే - చేసినారు?

విదురుడిట్లు పలికెను --- గొప్ప వ్రతనిష్ఠ గల ఓ మహర్షీ! ఆ ప్రచేతసులు ఎవరు? వారు ఎవరి సంతానము? వారు ఎవరి వంశములో జన్మించినారు? వారు సత్రయాగమును ఎక్కడ చేసినారు?

మన్యే మహాభాగవతం నారదం దేవదర్శనమ్ ।
యేన ప్రోక్తః క్రియాయోగః పరిచర్యావిధిర్హరేః ।। 3

దేవదర్శనమ్ - శ్రీహరి దేవుని దర్శనము గల, నారదమ్ - నారద మహర్షిని, మహాభాగవతమ్ - గొప్ప భగవద్భక్తునిగా, మన్యే - తలచుచున్నాను, యేన - ఎవనిచేనైతే, హరేః - శ్రీహరియొక్క, పరిచర్యా విధిః - పూజాపద్ధతి అనే, క్రియాయోగః - క్రియాయోగము, ప్రోక్తః - చెప్పబడినదో.

శ్రీహరిని దర్శించి కృతార్థుడైనవాడు, దేవతలచే మాత్రమే దర్శించబడేవాడు, భక్తులకు శ్రీహరిని దర్శించే ఉపాయమును బోధించువాడు అగు నారద మహర్షి భగవద్భక్తులలో గొప్పవాడని నేను తలచుచున్నాను. ఆయన శ్రీహరిని పూజించే విధానమును బోధించినాడు. ఆ పూజాపద్ధతి ద్వారా భక్తుడు శ్రీహరిని చేరుకొనవచ్చును.

స్వధర్మశీలైః పురుషైర్భగవాన్ యజ్ఞపూరుషః ।
ఇజ్యమానో భక్తిమతా నారదేనేరితః కిల ।। 4

స్వధర్మశీలైః - తమ ధర్మమును పాటించుటయే స్వభావముగా గల, పురుషైః - వ్యక్తులచే, ఇజ్యమానః - యజ్ఞముల ద్వారా ఆరాధించబడే, యజ్ఞపూరుషః - యజ్ఞేశ్వరుడగు, భగవాన్ - శ్రీహరి భగవానుడు, భక్తిమతా - భక్తి గల, నారదేన - నారదునిచే, ఈరితః కిల - స్తుతించబడినాడు గదా!

స్వధర్మానుష్ఠానమే స్వభావముగా గల ప్రచేతసులు యజ్ఞేశ్వరుడగు శ్రీహరిని సత్రయాగమునందు ఆరాధించుచుండగా, భక్తశిఖామణి యగు నారదుడు అచట ధ్రువునకు మోక్షమునిచ్చిన శ్రీహరిని స్తుతించినాడు గదా!

యాస్తా దేవర్షిణా తత్ర వర్ణితా భగవత్కథాః ।
మహ్యం శుశ్రూషవే బ్రహ్మన్ కార్త్స్న్యేనాచష్టుమర్హసి ।। 5

బ్రహ్మన్ - ఓ మహర్షీ!, తత్ర - ఆ సత్రయాగమునందు, దేవర్షిణా - దేవర్షియగు నారదునిచే, యాః - ఏ, భగవత్-కథాః - భగవానుని గాథలు, వర్ణితాః - వర్ణించబడినవో, తాః - వాటిని, శుశ్రూషవే - వినగోరుచున్న, మహ్యమ్ - నా కొరకు, కార్త్స్న్యేన - పూర్తిగా, ఆచష్టుమ్ - చెప్పుటకు, అర్హసి - తగుదువు.

ఓ మహర్షీ! ఆ సత్రయాగములో దేవర్షి నారదుడు చెప్పిన భగవానుని గాథలను నేను వినగోరుచున్నాను. నీవు వాటిని పూర్తిగా నాకు చెప్ప తగుదువు.

మైత్రేయ ఉవాచ ।
ధ్రువస్య చోత్కలః పుత్రః పితరి ప్రస్థితే వనమ్ ।
సార్వభౌమశ్రియం నైచ్ఛదధిరాజాసనం పితుః ।। 6

ధ్రువస్య - ధ్రువుని, పుత్రః - పుత్రుడగు, ఉత్కలః - ఉత్కలుడు, పితరి - తండ్రి, వనమ్ - వనమును గురించి, ప్రస్థితే - వెళ్లిపోగా, పితుః - తండ్రియొక్క, అధిరాజ-ఆసనమ్ - చక్రవర్తి పదవిని, సార్వభౌమశ్రియమ్ - చక్రవర్తి సంపదను, న ఐచ్ఛత్ - కోరలేదు.

ధ్రువుడు వానప్రస్థమునకు వెళ్లిన తరువాత ఆయన కుమారుడగు ఉత్కలునకు తండ్రిగారి చక్రవర్తి సింహాసనమునందు గాని, చక్రవర్తి సంపదలయందు గాని, కోరిక లేకుండెను.

స జన్మనోపశాంతాత్మా నిస్సంగస్సమదర్శనః ।
దదర్శ లోకే వితతమాత్మానం లోకమాత్మని ॥ 7

జన్మనా - పుట్టుక తోడనే, ఉపశాంత-ఆత్మా - భోగాసక్తినుండి విరమించిన మనస్సు గలవాడు, నిస్సంగః - ఆసక్తి లేనివాడు, సమదర్శనః - అంతటా పరమాత్మను దర్శించువాడు అగు, సః - ఆ ఉత్కలుడు, లోకే - జగత్తునందు, వితతమ్ - వ్యాపించియున్న, ఆత్మానమ్ - ఆత్మను, ఆత్మని - ఆత్మయందు, లోకమ్ - లోకమును, దదర్శ - దర్శించెను.

ఆ ఉత్కలునకు పుట్టుకనుండియు మనస్సులో భోగేచ్ఛ గాని, సంసారాసక్తి గాని లేకుండెను. ఆతడు సర్వవ్యాపకమగు పరబ్రహ్మయందు నిష్ఠ కలిగియుండెను. సకలజగత్తు ఆత్మ చైతన్యమునందు మాత్రమే కనబడుచున్నదనియు, ఈ విధముగా మనోవృత్తిప్రవాహరూపమగు జగత్తునంతనూ ఆత్మ చైతన్యమే వ్యాపించి యున్నదనియు ఆతడు తెలుసుకొనెను.

ఆత్మానం బ్రహ్మ నిర్వాణం ప్రత్యస్తమితవిగ్రహమ్ ।
అవబోధరసైకాత్మ్యమానందమనుసంతతమ్ ॥ 8

అవ్యవచ్ఛిన్నయోగాగ్నిదగ్ధకర్మమలాశయః ।
స్వరూపమవరుంధానో నాత్మనోఽన్యం తదైక్షత ॥ 9

అవ్యవచ్ఛిన్నయోగ-అగ్నిదగ్ధకర్మమల-ఆశయః - నిరంతరముగా కొనసాగే బ్రహ్మానుసంధానము అనే అగ్ని వలన దహించబడిన కర్మవాసనలు గల అంతఃకరణము గల ఆ ఉత్కలుడు, నిర్వాణమ్ - దుఃఖసంపర్కము లేనట్టియు, ప్రత్యస్తమితవిగ్రహమ్ - పూర్తిగా తొలగిన భేదము కలిగినట్టియు, అవబోధరస-ఐకాత్మ్యమ్ - అఖండజ్ఞానమే స్వరూపముగా కలిగినట్టియు, ఆనందమ్ - ఆనందఘనమైనట్టియు, అనుసంతతమ్ - సర్వవ్యాపకమైనట్టియు, బ్రహ్మ - బ్రహ్మయే అయి ఉన్న, ఆత్మానమ్ - ప్రత్య

గాత్మను, స్వరూపమ్ - తన యథార్థ స్వరూపముగా, అవరుంధానః - తెలుసుకున్నవాడై, తదా - అప్పుడు, ఆత్మనః - ఆత్మకంటె, అన్యమ్ - భిన్నమైనదానిని, న ఐక్షత - దర్శించలేదు.

నిరంతరమగు బ్రహ్మానుసంధానము అనే అగ్నిచే ఆ ఉత్కలుని అంతఃకరణములోని కర్మవాసనలన్నియు దగ్ధమైనవి. దుఃఖసంపర్కము గాని, భేదలేశము గాని లేని పరబ్రహ్మను అతడు ప్రత్యగాత్మకంటె అభిన్నముగా తెలుసుకొనెను. ఆనందఘనమగు ఆ పరమాత్మ అఖండము మరియు ఏకరసము అగు జ్ఞానమే స్వరూపముగా గలది. సర్వము ఆ ఆత్మచైతన్యమునందు మాత్రమే భాసించుటచే, అది సర్వమును వ్యాపించియుండును. అట్టి బ్రహ్మను తన స్వరూపముగా అనుసంధానము చేసే ఉత్కలునకు ఆ జీవన్ముక్తావస్థలో ఆత్మకంటె భిన్నముగా ఏదీ కానరాలేదు.

జడాంధబధిరోన్మత్తమూకాకృతిరతన్మతిః ।
లక్షితః పథి బాలానాం ప్రశాంతార్చిరివానలః ॥ 10

పథి - మార్గమునందు, బాలానామ్ - అజ్ఞానులకు, జడ-అంధబధిర-ఉన్మత్తమూక-ఆకృతిః - మూర్ఖుడు గ్రుడ్డివాడు చెవిటివాడు పిచ్చివాడు మూగవాడు అనువారల ఆకారము కలవాడుగా, లక్షితః - కనబడువాడు, అతత్-మతిః - వారి బుద్ధివంటి బుద్ధి కలవాడు కాదు, ప్రశాంత-అర్చిః - చల్లారిన జ్వాలలు గల, అనలః ఇవ - అగ్నివంటివాడు.

ఆయన దారిలో అజ్ఞానులకు మూర్ఖుడు వలె, గ్రుడ్డివాడు చెవిటివాడు పిచ్చివాడు మూగవాడు వలె కనబడెడివాడు. కాని, ఆయన బుద్ధి వారి బుద్ధివంటిది కాదు. ఆయన సర్వజ్ఞుడు. ఆయన జ్వాలలు చల్లారిన అగ్నిని పోలియుండెడివాడు.

మత్వా తం జడమున్మత్తం కులవృద్ధాస్సమంత్రిణః ।
వత్సరం భూపతిం చక్రుర్యవీయాంసం భ్రమేస్సుతమ్ ॥ 11

తమ్ - ఆ ఉత్కలుని, జడమ్ - మూర్ఖునిగా, ఉన్మత్తమ్ - పిచ్చివానిగా, మత్వా - తలచి, సమంత్రిణః - మంత్రులతో గూడియున్న, కుల

వృద్ధాః - కులపెద్దలు, యవీయాంసమ్ - ఆతని తమ్ముడైనట్టియు, భ్రమేః - భ్రమియొక్క, సుతమ్ - పుత్రుడైన, వత్సరమ్ - వత్సరుని, భూపతిమ్ - రాజునుగా, చక్రుః - చేసిరి.

ఆ ఉత్కలుడు మూర్ఖుడు మరియు పిచ్చివాడు అని తలచిన మంత్రులు, కులపెద్దలు కలిసి ఆయన తమ్ముడు, భ్రమి పుత్రుడు అగు వత్సరుని రాజుగా చేసిరి. (కాలచక్రాధిష్ఠాత ధ్రువుడు; ఆయన పుత్రుడగు ఉత్కలుడు వాస్తవములో ఉత్కాలుడు, అనగా కాలమునకు అతీతుడగు బ్రహ్మజ్ఞాని; కాలచక్రముయొక్క భ్రమణమే భ్రమి; ఆమె పుత్రుడే వత్సరుడు, అనగా సంవత్సర పరిమాణము గల కాలఖండమునకు ప్రతీక)

స్వర్వీథిర్వత్సరస్యేష్టా భార్యాఽసూత షడాత్మజాన్ ।
పుష్పార్ణం తిగ్మకేతుం చ ఇషమూర్జం వసుం జయమ్ ॥12

వత్సరస్య - వత్సరునకు, ఇష్టా - ప్రియురాలైన, భార్యా - భార్యయగు, స్వర్వీథిః - స్వర్వీథి, పుష్పార్ణమ్ - పుష్పార్ణుడు, తిగ్మకేతుమ్ - తిగ్మకేతువు, ఇషమ్ - ఇషుడు, ఊర్జమ్ - ఊర్జుడు, వసుమ్ - వసువు, చ - మరియు, జయమ్ - జయుడు అనే, షట్ - ఆరుగురు, ఆత్మజాన్ - కొడుకులను, అసూత - కనెను.

వత్సరుని ప్రియభార్యయగు స్వర్వీథి (సూర్యుని మార్గము) పుష్పార్ణుడు, తిగ్మకేతువు, ఇషుడు, ఊర్జుడు, వసువు మరియు జయుడు అనే ఆరుగురు పుత్రులను (ఋతువులకు అధిష్ఠాన దేవతలు) కనెను.

పుష్పార్ణస్య ప్రభా భార్యా దోషా చ ద్వే బభూవతుః ।
ప్రాతర్మధ్యందినం సాయమితి హ్యాసన్ ప్రభాసుతాః ॥ 13

పుష్పార్ణస్య - పుష్పార్ణునకు, ప్రభా - ప్రభ, భార్యా - భార్య, దోషా చ - దోష కూడ భార్యయే, ద్వే - ఇద్దరు భార్యలు, బభూవతుః - ఉండిరి, ప్రాతః - ప్రాతఃకాలము, మధ్యందినమ్ - మధ్యందినము, సాయమ్ - సాయంకాలము, ఇతి - అనువారలు, ప్రభాసుతాః - ప్రభయొక్క పుత్రులు, ఆసన్ - అయిరి.

పుష్పార్ణునకు ప్రభ, దోష అనే ఇద్దరు భార్యలు (పగలు, రాత్రి అనే కాలములకు అభిమాని దేవతలు) గలరు. వారిలో ప్రభకు ప్రాతః, మధ్యందినము, సాయము అనే కాలాభిమాన దేవతలు పుత్రులు అయిరి.

ప్రదోషో నిశీథో వ్యుష్ట ఇతి దోషాసుతాస్త్రయః ।
వ్యుష్టస్సుతం పుష్కరిణ్యాం సర్వతేజసమాదధే ।। 14

ప్రదోషః - ప్రదోషుడు, నిశీథః - నిశీథుడు, వ్యుష్టః - వ్యుష్టుడు, ఇతి - అనే, త్రయః - ముగ్గురు, దోషాసుతాః - దోషకు పుత్రులు, వ్యుష్టః - వ్యుష్టుడు, పుష్కరిణ్యామ్ - పుష్కరిణియందు, సర్వతేజసమ్ - సర్వతేజసుడు అనే, సుతమ్ - కొడుకును, ఆదధే - కనెను.

దోషకు ప్రదోషుడు (రాత్రి ఆరంభము), నిశీథుడు (మధ్యరాత్రి), వ్యుష్టుడు (రాత్రి అంతమయ్యే వేళ) అనే ముగ్గురు పుత్రులు కలిగిరి. వ్యుష్టునకు పుష్కరిణి (సూర్యోదయమునకు ముందు వికసిస్తూ ఉండే పద్మముల సరస్సు) భార్య. వారికి సర్వతేజసుడు (రాత్రి అంతమునందు అంతటా కాంతి విస్తరిల్లుట) అనే కొడుకు కలిగెను.

స చక్షుస్సుతమాకూత్యాం పత్న్యాం మనుమవాప హ ।
మనోరసూత మహిషీ విరజాన్నడ్వలా సుతాన్ ।। 15

పురుం కుత్సం త్రితం ద్యుమ్నం సత్యవంతమృతం వ్రతమ్ ।
అగ్నిష్టోమమతీరాత్రం ప్రద్యుమ్నం శిబిముల్మకమ్ ।। 16

సః - ఆ సర్వతేజసుడు, పత్న్యామ్ - భార్యయగు, ఆకూత్యామ్ - ఆకూతియందు, చక్షుః మనుమ్ - చాక్షుష మనువును, సుతమ్ - పుత్రునిగా, అవాప హ - పొందెనట, మనోః - చాక్షుష మనువుయొక్క, మహిషీ - పట్టమహిషియగు, నడ్వలా - నడ్వల, పురుమ్ - పురువు, కుత్సమ్ - కుత్సుడు, త్రితమ్ - త్రితుడు, ద్యుమ్నమ్ - ద్యుమ్నుడు, సత్యవంతమ్ - సత్యవంతుడు, ఋతమ్ - ఋతుడు, వ్రతమ్ - వ్రతుడు, అగ్నిష్టోమమ్ - అగ్నిష్టోముడు, అతీరాత్రమ్ - అతీరాత్రుడు, ప్రద్యుమ్నమ్ - ప్రద్యుమ్న

డు, శిబిమ్ - శిబి, ఉల్ముకమ్ - ఉల్ముకుడు అనే, విరజాన్ - దోషములు లేని, సుతాన్ - కొడుకులను, అసూత - కనెను.

ఆ సర్వతేజసుని భార్య ఆకూతి. వారి పుత్రుడే చాక్షుష మనువు. చాక్షుష మనువునకు నడ్వల అనే భార్యయందు దోషమునెరుంగని పన్నెండుమంది పుత్రులు కలిగిరి. పురువు, కుత్సుడు, త్రితుడు, ద్యుమ్నుడు, సత్యవంతుడు, ఋతుడు, వ్రతుడు, అగ్నిష్టోముడు, అతీరాత్రుడు, ప్రద్యుమ్నుడు, శిబి, ఉల్ముకుడు అనునవి వారి పేర్లు.

ఉల్ముకోఽజనయత్పుత్రాన్ పుష్కరిణ్యాం షడుత్తమాన్ ।
అంగం సుమనసం ఖ్యాతిం క్రతుమంగిసరం గయమ్ ॥ 17

ఉల్ముకః - ఉల్ముకుడు, పుష్కరిణ్యామ్ - పుష్కరిణియందు, అంగమ్ - అంగుడు, సుమనసమ్ - సుమనసుడు, ఖ్యాతిమ్ - ఖ్యాతి, క్రతుమ్ - క్రతువు, అంగిరసమ్ - అంగిరసుడు, గయమ్ - గయుడు అనే, షట్ - ఆరుగురు, ఉత్తమాన్ - ఉత్తములగు, పుత్రాన్ - కొడుకులను, అజనయత్ - కనెను.

ఉల్ముకునకు పుష్కరిణియందు అంగుడు, సుమనసుడు, ఖ్యాతి, క్రతువు, అంగిరసుడు, గయుడు అనే ఆరుగురు ఉత్తములగు కొడుకులు కలిగిరి.

సునీథాంగస్య యా పత్నీ సుషువే వేనముల్బణమ్ ।
యద్దౌశ్శీల్యాత్స రాజర్షిర్నిర్విణ్ణో నిరగాత్పురాత్ ॥ 18

అంగస్య - అంగునకు, సునీథా - సునీథ అనే, యా - ఏ, పత్నీ - భార్య గలదో ఆమె, ఉల్బణమ్ - భయంకరుడగు, వేనమ్ - వేనుని, సుషువే - కనెను, యత్-దౌశ్శీల్యాత్ - ఎవని చెడు శీలము వలన, నిర్విణ్ణః - విరక్తుడైన, సః - ఆ, రాజర్షిః - రాజర్షి, పురాత్ - నగరమునుండి, నిరగాత్ - వెళ్లిపోయెనో.

అంగుని భార్య సునీథ. వారికి వేనుడు అనే కొడుకు కలిగెను. ఆతడు చాల భయంకరుడు, చెడు స్వభావము గలవాడు. ఆతని కారణ

ముగా రాజర్షియగు ఆ అంగుడు విరక్తిని జెంది నగరమును విడిచిపెట్టి వెళ్లిపోయెను.

యమంగ శేపుః కుపితా వాగ్వజ్రా మునయః కిల ।
గతాసోస్తస్య భూయస్తే మమంథుర్దక్షిణం కరమ్ ॥ 19

అంగ - ఓయీ విదురా!, వాక్-వజ్రాః - వాక్కే వజ్రాయుధముగా గల, మునయః - మహర్షులు, కుపితాః - కోపించినవారై, యమ్ - ఏ వేనుని, శేపుః కిల - శపించినారో, భూయః - మరల, గత-అసోః - పోయిన ప్రాణములు గల, తస్య - ఆ వేనుని, దక్షిణమ్ - కుడి, కరమ్ - చేతిని, తే - వారు, మమంథుః - మథించిరి.

ఓ విదురా! మహర్షులకు వాక్కే వజ్రాయుధము. వారు కోపించి ఆ వేనుని శపించిరట. అపుడు వేనుడు మరణించగా, మరల వారే వాని కుడి చేతిని మథించిరి.

అరాజకే తదా లోకే దస్యుభిః పీడితాః ప్రజాః ।
జాతో నారాయణాంశేన పృథురాద్యః క్షితీశ్వరః ॥ 20

తదా - అప్పుడు, లోకే - లోకము, అరాజకే - రాజు లేనిది కాగా, ప్రజాః - జనులు, దస్యుభిః - దోపిడీగాండ్రచే, పీడితాః - పీడించబడిరి, పృథుః - పృథువు, నారాయణ-అంశేన - నారాయణుని అంశచే, జాతః - పుట్టెను, యః - ఏ పృథువైతే, ఆద్యః - మొట్టమొదటి, క్షితి-ఈశ్వరః - భూపతియో.

వేనుడు మరణించినప్పుడు రాజు లేని కారణముగా దోపిడీగాండ్రు జనులను దోచుకొనుట మొదలిడిరి. ఈ విధముగా జనులు దుఃఖమునను భవించుచుండగా, ఆ మహర్షులు మథనమును చేసినప్పుడు, పృథువు నారాయణుని అంశచే జన్మించెను. ఆయనయే మొట్టమొదటగా రాజ్యమును సువ్యవస్థితము చేసిన రాజు.

విదుర ఉవాచ ।
తస్య శీలనిధేస్సాధోర్బ్రహ్మణ్యస్య మహాత్మనః ।
రాజ్ఞః కథమభూద్దుష్టా ప్రజా యద్విమనా యయౌ ॥ 21

శీలనిధేః - మంచి శీలమునకు నిధియైనట్టియు, సాధోః - పరోప కారియైనట్టియు, బ్రహ్మణ్యస్య - వేదవేత్తలయెడల భక్తి కలిగినట్టియు, మహాత్మనః - విశాలహృదయుడగు, తస్య - ఆ, రాజ్ఞః - అంగ మహారాజు నకు, దుష్టా - చెడు, ప్రజా - సంతానము, కథమ్ - ఏ కారణముగా, అభూత్ - కలిగెను, యత్ - దేని కారణముగా, విమనాః - మనస్సు చెడిన వాడై, యయౌ - వెళ్లిపోయెనో.

విదురుడిట్లు పలికెను --- అంగ మహారాజు చక్కటి శీలమునకు నిధి, పరోపకారి, వేదవేత్తల యెడల భక్తి గలవాడు, విశాలహృదయుడు. కాని, ఆయన సంతానము చెడు అయిన కారణముగా మనస్సు విరిగి నగర మును విడిచిపెట్టి వెళ్లిపోయెను. అట్టి రాజునకు చెడు సంతానము కలుగు టకు కారణమేమి?

కిం వాఽహో వేన ఉద్దిశ్య బ్రహ్మదండమయూయుజన్ ।
దండవ్రతధరే రాజ్ఞి మునయో ధర్మకోవిదాః ॥ 22

ధర్మకోవిదాః - ధర్మములో నిష్ణాతులగు, మునయః - మహర్షు లు, దండవ్రతధరే - ప్రజలను శాసించుట అనే వ్రతమును కలిగియుండే, వేనే రాజ్ఞి - వేన మహారాజుపై, కిం వా - ఏ, అహః - పాపమును, ఉద్దిశ్య - ఉద్దేశించి, బ్రహ్మదండమ్ - బ్రాహ్మణశాపము అనే శిక్షను, అయూయు జన్ - ప్రయోగించిరి?

ధర్మమునందు నిష్ణాతులగు మహర్షులు ప్రజలను శాసించుటయే వ్రతముగా గల మహారాజుపై శాపము అనే శిక్షను ప్రయోగించుటకు కారణ మేమి? ఆ రాజు చేసిన పాపమేది?

నావధ్యేయః ప్రజాపాలః ప్రజాభిరఘవానపి ।
యదసౌ లోకపాలానాం బిభర్త్యోజస్స్వతేజసా ॥ 23

ప్రజాపాలః - ప్రజలను పాలించే రాజు, అఘవాన్ అపి - తప్పు చేసినవాడే అయిననూ, ప్రజాభిః - ప్రజలచే, న అవధ్యేయః - అవమానించబడరాదు, యత్ - ఏలయనగా, అసౌ - ఈ రాజు, లోకపాలానామ్ - లోకపాలకుల, ఓజః - శక్తిని, స్వతేజసా - తన ప్రభావముచే, బిభర్తి - ధరించుచున్నాడు.

ప్రజలను పాలించే రాజు ఒకచో తప్పు చేసిననూ, ప్రజలు ఆయనను అవమానించరాదు. ఏలయనగా, రాజు తన ప్రభావముచే లోకపాలకుల శక్తిని ధరించియుండును.

ఏతదాఖ్యాహి మే బ్రహ్మన్ సునీథాత్మజచేష్టితమ్ ।
శ్రద్దధానాయ భక్తాయ త్వం పరావరవిత్తమః ॥ 24

బ్రహ్మన్ - ఓ మహర్షీ!, ఏతత్ - ఈ, సునీథా-ఆత్మజచేష్టితమ్ - సునీథాదేవియొక్క పుత్రుడగు వేనుని చేష్టను, శ్రద్దధానాయ - శ్రద్ధ కలిగినట్టియు, భక్తాయ - భక్తుడనగు, మే - నా కొరకు, ఆఖ్యాహి - చెప్పుము, త్వమ్ - నీవు, పర-అవరవిత్-తమః - భూతభవిష్యత్తులు తెలిసినవారిలో అగ్రేసరుడవు.

ఓ మహర్షీ! సునీథాదేవి పుత్రుడగు వేనుని చేష్టలను గురించి నాకు చెప్పుము. నేను శ్రద్ధ గల భక్తుడను. నీవు భూతభవిష్యత్తులు తెలిసినవారిలో అగ్రేసరుడవు.

మైత్రేయ ఉవాచ ।
అంగోఽశ్వమేధం రాజర్షిరాజహార మహాక్రతుమ్ ।
నాజగ్ముర్దేవతాస్తస్మిన్నాహూతా బ్రహ్మవాదిభిః ॥ 25

రాజర్షిః - రాజర్షియగు, అంగః - అంగుడు, అశ్వమేధమ్ - అశ్వమేధము అనే, మహాక్రతుమ్ - గొప్ప యజ్ఞమును, ఆజహార - చేసెను, తస్మిన్ - దానియందు, బ్రహ్మవాదిభిః - వేదవేత్తలచే, ఆహూతాః - ఆహ్వానించబడిన, దేవతాః - దేవతలు, న ఆజగ్ముః - రాలేదు.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- రాజర్షియగు అంగుడు అశ్వమేధము అనే గొప్ప యజ్ఞమును చేసెను. దానిలో వేదవేత్తలు ఆహ్వానించినన్నూ, దేవతలు రాలేదు.

తమూచుర్విస్మితాస్తత్ర యజమానమథర్త్విజః ।
హవీంషి హూయమానాని న తే గృహ్ణంతి దేవతాః ।। 26

అథ - అప్పుడు, విస్మితాః - ఆశ్చర్యమును పొందిన, ఋత్విజః - ఋత్విక్కులు, తత్ర - ఆ యజ్ఞశాలయందు, తమ్ - ఆ, యజమానమ్ - యజమానిని ఉద్దేశించి, ఆహుః - పలికిరి, హూయమానాని - హోమము చేయబడుచున్న, తే - నీ, హవీంషి - హవిస్సులను, దేవతాః - దేవతలు, న గృహ్ణంతి - స్వీకరించుట లేదు.

అప్పుడు ఆశ్చర్యపోయిన ఋత్విక్కులు యజమానియగు అంగునితో నిట్లనిరి : నీ ఈ యజ్ఞములో మేము హోమము చేసే హవిస్సులను దేవతలు స్వీకరించుట లేదు.

రాజన్ హవీంష్యదుష్టాని శ్రద్ధయాఽఽసాదితాని తే ।
ఛందాంస్యయాతయామాని యోజితాని ధృతవ్రతైః ।। 27

రాజన్ - ఓ రాజా!, తే - నీ, హవీంషి - హవిస్సులు, అదుష్టాని - దోషము లేనివి, శ్రద్ధయా - శ్రద్ధతో, ఆసాదితాని - సమర్పించబడినవి, ధృతవ్రతైః - స్వీకరించబడిన వ్రతనిష్ఠ గల మాచే, యోజితాని - ప్రయోగించబడిన, ఛందాంసి - మంత్రములు, అయాతయామాని - తొలగిపోని సామర్థ్యము గలవియే.

ఓ రాజా! నీ యజ్ఞములో మేము దోషములు లేని హవిస్సులను శ్రద్ధగా సమర్పించితిమి. మేము వ్రతనిష్ఠను స్వీకరించి నిర్దుష్టముగా మంత్రములను ప్రయోగించితిమి. కావున, మా మంత్రముల సామర్థ్యము తగ్గిపోలేదు.

న విదామేహ దేవానాం హేలనం వయమణ్వపి ।
యన్న గృహ్ణంతి భాగాన్ స్వాన్యే దేవాః కర్మసాక్షిణః ।। 28

ఇహ - ఈ యజ్ఞమునందు, దేవానామ్ - దేవతలకు, హేలనమ్ - అపరాధము, అణు అపి - లేశమైననూ, వయమ్ - మేము, న విదామ - తెలియకున్నాము, యత్ - దేనివలన, స్వాన్ - తమ, భాగాన్ - భాగములను, న గృహ్ణంతి - స్వీకరించుట లేదో, యే - ఏ, దేవాః - దేవతలు, కర్మ సాక్షిణః - వైదికకర్మలకు సాక్షులో.

వైదికకర్మలలో ప్రధానమైనవారు దేవతలే. కాని, వారు ఈ యజ్ఞములో తమ తమ హవిర్భాగములను స్వీకరించుట లేదు. వారి యెడల జరిగిన అపరాధము మాకు లేశమైననూ కానవచ్చుట లేదు.

మైత్రేయ ఉవాచ ।
అంగో ద్విజవచశ్శ్రుత్వా యజమానస్సుదుర్మనాః ।
తత్ప్రష్టుం వ్యసృజద్వాచం సదస్యాంస్తదనుజ్ఞయా ॥ 29

యజమానః - యజమానుడగు, అంగః - అంగుడు, ద్విజవచః - ఋత్విక్కుల మాటను, శ్రుత్వా - విని, సుదుర్మనాః - మిక్కిలి దుఃఖించిన మనస్సు గలవాడై, తత్-అనుజ్ఞయా - ఆ ఋత్విక్కుల అనుమతితో, తత్ - ఆ కారణమును, సదస్యాన్ - సభాసదులను, ప్రష్టుమ్ - ప్రశ్నించుటకు, వాచమ్ - వాక్కును, వ్యసృజత్ - ప్రయోగించెను.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- యజమానుడగు అంగుడు ఈ ఋత్విక్కుల మాటలను విని మనస్సులో చాల దుఃఖించెను. దేవతలు హవిర్భాగములను తీసుకొనకపోవుటకు కారణమేమి? అని సభాసదులను ప్రశ్నించుటకై ఆయన ఋత్విక్కుల అనుమతిని గోరెను. ఆయన వారి అనుమతితో మౌననియమమును విడిచిపెట్టి, ఇట్లు పలికెను.

నాగచ్ఛంత్యాహుతా దేవా న గృహ్ణంతి గ్రహానిహ ।
సదసస్పతయో బ్రూత కిమవద్యం మయా కృతమ్ ॥ 30

ఆహుతాః - ఆహ్వానించబడిన, దేవాః - దేవతలు, న ఆగచ్ఛంతి - వచ్చుట లేదు, ఇహ - ఈ యజ్ఞమునందు, గ్రహాన్ - సోమపాత్రలను, న గృహ్ణంతి - స్వీకరించుట లేదు, సదసస్పతయః - ఓ సభాసదులారా!,

బ్రూత - చెప్పుడు, మయా - నాచే, కృతమ్ - చేయబడిన, అవద్యమ్ దోషము, కిమ్ - ఏమి?

ఈ యజ్ఞములో దేవతలను ఆహ్వానించినప్పుడు వారు వచ్చి సోమపాత్రలను గ్రహించుట లేదు. ఓ సభాసదులారా! నేను చేసిన అపరాధమేమి? చెప్పుడు.

సదసస్పతయ ఊచుః ।
నరదేవేహ భవతో నాఘం తావన్మనాక్ స్థితమ్ ।
అస్త్యేకం ప్రాక్తనమఘం యదిహేదృక్త్వమప్రజః ॥ 31

నరదేవ - ఓ మహారాజా!, ఇహ తావత్ - ఈ యజ్ఞమునందైతే, భవతః - నీ, అఘమ్ - దోషము, మనాక్ - లేశమైననూ, న స్థితమ్ - లేదు, ప్రాక్తనమ్ - పూర్వజన్మకు చెందిన, ఏకమ్ - ఒక, అఘమ్ - దోషము, అస్తి - కలదు, యత్ - దేనివలన, ఇహ - ఈ జన్మలో, త్వమ్ - నీవు, ఈదృక్ - ఈ విధముగా, అప్రజః - సంతానము లేనివాడవో.

ఓ మహారాజా! ఈ యజ్ఞమునందైతే నీ దోషము లేశమైననూ లేదు. కాని, పూర్వజన్మలో నీవు చేసిన దోషము ఒకటి గలదు. దాని వలననే నీవీ జన్మలో ఈ తీరున సంతానము లేనివాడవైతివి.

తథా సాధయ భద్రం తే ఆత్మానం సుప్రజం నృప ।
ఇష్టస్తే పుత్రకామస్య పుత్రం దాస్యతి యజ్ఞభుక్ ॥ 32

నృప - ఓ మహారాజా!, తథా - ఆ విధముగా, ఆత్మానమ్ - నిన్ను, సుప్రజమ్ - చక్కని సంతానము గలవానినిగా, సాధయ - సాధించుకొనుము, తే - నీ కొరకు, భద్రమ్ - మంగళమగు గాక!, పుత్రకామస్య - పుత్రునియందు కోరిక గల, తే - నీకు, యజ్ఞభుక్ - యజ్ఞములోని హవిర్భాగములను స్వీకరించే భగవానుడు, ఇష్టః - యజ్ఞముచే ఆరాధించబడినవాడై, పుత్రమ్ - పుత్రుని, దాస్యతి - ఈయగలడు.

ఓ మహారాజా! మేము చెప్పినట్లు చేయుము. అప్పుడు నీకు చక్కని సంతానము కలిగి నీ కోరిక సిద్ధించును. నీకు మంగళమగు గాక!

యజ్ఞములో హవిర్భాగములను స్వీకరించేది శ్రీహరి భగవానుడే. నీవు ఆయనను పుత్రకామనతో యజ్ఞమును చేసి ఆరాధించుము. అప్పుడు ఆయన నీకు పుత్రుని అనుగ్రహించగలడు.

తథా స్వభాగధేయాని గ్రహీష్యంతి దివౌకసః ।
యద్యజ్ఞపురుషస్సాక్షాదపత్యాయ హరిర్వృతః ॥ 33

తథా - అట్లు చేసినప్పుడు, దివ-ఓకసః - దేవతలు, స్వభాగధే యాని - తమ భాగములను, గ్రహీష్యంతి - స్వీకరించగలరు, యత్ - ఎందువలననగా, సాక్షాత్ - సాక్షాత్తుగా, యజ్ఞపురుషః - యజ్ఞేశ్వరుడగు, హరిః - శ్రీహరి, అపత్యాయ - సంతానము కొరకు, వృతః - ఆహ్వానించబ డినాడో.

అట్లు సాక్షాత్తుగా యజ్ఞపురుషుడగు శ్రీహరిని సంతానము కోరి ఆహ్వానించినప్పుడు, దేవతలందరు తమ తమ హవిర్భాగములను స్వీకరించగలరు.

తాంస్తాన్ కామాన్ హరిర్దద్యాద్యాన్ యాన్ కామయతే జనః ।
ఆరాధితో యథైవైషాం తథా పుంసాం ఫలోదయః ॥ 34

జనః - మానవుడు, యాన్ యాన్ - ఏయే, కామాన్ - అభీష్టము లగు వస్తువులను, కామయతే - కోరునో, తాన్ తాన్ - వాటిని వాటిని, హరిః - శ్రీహరి, దద్యాత్ - ఇచ్చును, యథా - ఏ విధముగానైతే, ఆరా ధితః - ఆరాధించబడినాడో, ఏషామ్ - ఈ, పుంసామ్ - మానవులకు, తథా ఏవ - ఆ విధముగానే, ఫల-ఉదయః - ఫలము పుట్టును.

భక్తుడు ఏయే అభీష్టవస్తువులను కోరునో, శ్రీహరి వాటినే వానికి అనుగ్రహించును. భక్తులు శ్రీహరిని ఏ విధముగా ఆరాధించునో, వారికి ఫలము దానికి అనురూపముగనే కలుగును.

ఇతి వ్యవసితా విప్రాస్తస్య రాజ్ఞః ప్రజాతయే ।
పురోడాశం నిరవపన్ శిపివిష్టాయ విష్ణవే ॥ 35

ఇతి - ఈ విధముగా, వ్యవసితాః - నిశ్చయించుకున్న, విప్రాః - ఋత్విక్కులు, తస్య - ఆ, రాజ్ఞః - మహారాజునకు, ప్రజాతయే - సంతానము కొరకై, శిపివిష్టాయ - సకలప్రాణులలో అంతర్యామియగు, విష్ణవే - శ్రీహరి కొరకు, పురోడాశమ్ - పురోడాశము అనే హవిస్సును, నిరవపన్ - హోమము చేసిరి.

మహారాజునకు సంతానము కలుగుట కొరకై ఋత్విక్కులు ఈ విధముగా నిశ్చయించుకొనిరి. అపుడు వారు సకలప్రాణులలో అంతర్యామియై ఉండే యజ్ఞేశ్వరుడగు శ్రీహరికి పురోడాశము (బియ్యపు పిండిని వేయించి నెయ్యి కలిపి చేసే ముద్ద) అనే హవిస్సును హోమము చేసిరి.

తస్మాత్పురుష ఉత్తస్థౌ హేమమాల్యమలాంబరః ।
హిరణ్మయేన పాత్రేణ సిద్ధమాదాయ పాయసమ్ ॥ 36

తస్మాత్ - ఆ అగ్నిహోత్రమునుండి, హేమమాలీ - బంగరు మాల గలవాడు, అమల-అంబరః - స్వచ్ఛమగు వస్త్రములు గలవాడు అగు, పురుషః - పురుషుడు, హిరణ్మయేన - బంగరు, పాత్రేణ - పాత్రతో, సిద్ధమ్ - పక్వమైన, పాయసమ్ - పాయసమును, ఆదాయ - తీసుకొని, ఉత్-తస్థౌ - లేచి నిలబడెను.

బంగరు మాలను, స్వచ్ఛమగు వస్త్రములను ధరించిన పురుషుడు ఒకడు ఆ అగ్నిహోత్రమునుండి ఉదయించెను. ఆయన చేతిలోని బంగరు పాత్రలో పక్వమైన పాయసము ఉండెను.

స విప్రానుమతో రాజా గృహీత్వాఽంజలినౌదనమ్ ।
అవఘ్రాయ ముదా యుక్తః ప్రాదాత్పత్న్యా ఉదారధీః ॥ 37

ఉదారధీః - విశాలహృదయుడగు, సః - ఆ రాజు, విప్ర-అనుమతః - ఋత్విక్కులచే అనుమతించబడినవాడై, అంజలినా - దోసిలితో, ఓదనమ్ - పాయసమును, గృహీత్వా - తీసుకొని, అవఘ్రాయ - ఆఘ్రాణించి, ముదా - సంతోషముతో, యుక్తః - కూడినవాడై, పత్న్యై - భార్య కొరకు, ప్రాదాత్ - ఇచ్చెను.

విశాలహృదయుడగు ఆ అంగ మహారాజు ఋత్విక్కుల అనుమతితో ఆ పాయసమును దోసిలిలో తీసుకొని, తాను అఘ్రాణించి, ఆనందముతో కూడినవాడై, దానిని తన భార్యకు ఇచ్చెను.

సా తత్పుంసవనం రాజ్ఞీ ప్రాశ్య వై పత్యురాదధే ।
గర్భం కాల ఉపావృత్తే కుమారం సుషువేఽప్రజా ॥ 38

అప్రజా - సంతానము లేని, సా - ఆ, రాజ్ఞీ - మహారాణి, పుంసవనమ్ - పుత్రసంతానమును కలిగించే, తత్ - ఆ పాయసమును, ప్రాశ్య వై - నిశ్చయముగా భక్షించి, పత్యుః - భర్తనుండి, గర్భమ్ - గర్భమును, ఆదధే - ధరించెను, కాలే - సమయము, ఉపావృత్తే - రాగా, కుమారమ్ - పుత్రుని, సుషువే - కనెను.

సంతానము లేని ఆ సునీథాదేవి పుత్రసంతానమును కలిగించే ఆ పాయసమును చాల ఆదరముతో స్వీకరించి, భర్త వలన గర్భమును దాల్చెను. ఆమె ప్రసవకాలము రాగానే పుత్రుని కనెను.

స బాల ఏవ పురుషో మాతామహమనువ్రతః ।
అధర్మాంశోద్భవం మృత్యుం తేనాభవదధార్మికః ॥ 39

సః - ఆ, పురుషః - పుత్రుడు, బాలః ఏవ - బాలుడుగా నుండగనే, అధర్మ-అంశ-ఉద్భవమ్ - అధర్ముని అంశనుండి పుట్టిన, మాతామహమ్ - తాతగారగు, మృత్యుమ్ - మృత్యువును, అనువ్రతః - అన్ని వేళలలో అనుసరించి యుండెడివాడు, తేన - దానిచే, అధార్మికః - అధార్మికుడు, అభవత్ - ఆయెను.

ఆ పిల్లవాడు చిన్న వయసునుండియు తల్లికి తండ్రియగు మృత్యువును అన్ని వేళలా అనుసరించి ఉంటూ పెరిగెను. ఆ కారణముగా ఆతడు అధర్మప్రియుడు ఆయెను. సునీథ తండ్రి మృత్యువు.

స శరాసనముద్యమ్య మృగయుర్వనగోచరః ।
హంతి సాధూన్ మృగాన్ దీనాన్ వేనోఽసావిత్యరౌజ్జనః ॥40

సః - అతడు, వనగోచరః - వనమును చేరినవాడై, మృగయుః - వేటగాడై, శర-అసనమ్ - ధనస్సును, ఉద్యమ్య - ఎక్కుపెట్టి, దీనాన్ - దీనముగానుండే, సాధూన్ మృగాన్ - సాధు జంతువులను, హంతి - చంపుచున్నాడు, అసౌ - వీడు, వేనః - వేనుడు, ఇతి - అని, జనః - జనము, అరౌత్ - ఆక్రోశించెను.

అతడు అడవికి వేటకై వెళ్లి, కిరాతుని వలె విల్లును ఎక్కుపెట్టి దీనముగానుండే సాధుజంతువులను (లేళ్లను) చంపెడివాడు. అతనిని చూచి జనులు, వీడు వేనుడు (పీడను కలిగించువాడు) వచ్చుచున్నాడు అని ఆక్రోశించెడివారు.

ఆక్రీడే క్రీడతో బాలాన్ వయస్యానతిదారుణః ।
ప్రసహ్య నిరనుక్రోశః పశుమారమమారయత్ ॥ 41

అతిదారుణః - మిక్కిలి క్రూరుడు, నిరనుక్రోశః - దయ లేనివాడు అగు ఆ వేనుడు, ఆక్రీడే - ఆటల మైదానములో, క్రీడతః - ఆటలాడుచున్న, వయస్యాన్ - సమానవయస్కులగు, బాలాన్ - పిల్లలను, ప్రసహ్య - బలాత్కారముగా, పశుమారమ్ - గొడ్డును బాదినట్లుగా, అమారయత్ - బాదెను.

వేనుడు మిక్కిలి క్రూరుడు, దయ లేనివాడు. అతడు ఆటల మైదానములో ఆటలాడుచున్న సమానవయస్కులగు పిల్లలను బలాత్కారముగా గొడ్డును బాదినట్లు బాదెను.

తం విచక్ష్య ఖలం పుత్రం శాసనైర్వివిధైర్నృపః ।
యదా న శాసితుం కల్పో భృశమాసీత్సుదుర్మనాః ॥ 42

నృపః - అంగ మహారాజు, తమ్ - ఆ, పుత్రమ్ - పుత్రుని, ఖలమ్ - దుష్టునిగా, విచక్ష్య - కనుగొని, వివిధైః - అనేకములగు, శాసనైః - శిక్షల చే, శాసితుమ్ - అదుపులో పెట్టుటకు, యదా - ఎప్పుడైతే, కల్పః - సమర్థుడు, న - కాలేదో, భృశమ్ - మిక్కిలి, సుదుర్మనాః - చెడిపోయిన మనస్సు గలవాడు, ఆసీత్ - అయెను.

అంగ మహారాజు తన పుత్రుడు చాల చెడ్డవాడని గమనించి, అతనికి అనేకశిక్షలను వేసి అదుపులో పెట్టుటకు ప్రయత్నించెను. కాని, ప్రయోజనము లేకపోవుటచే, ఆయన మనస్సులో చాల దుఃఖమును పొందెను.

ప్రాయేణాభ్యర్చితో దేవో యేఽప్రజా గృహమేధినః ।
కదపత్యభృతం దుఃఖం యే న విందంతి దుర్భరమ్ ।। 43

అప్రజాః - సంతానము లేని, గృహమేధినః - గృహస్థులు, యే - ఎవరు గలరో వారు, యే - ఎవరైతే, కదపత్యభృతమ్ - చెడు సంతానముచే కలిగించబడిన, దుర్భరమ్ - భరించ శక్యము కాని, దుఃఖమ్ - దుఃఖమును, న విందంతి - పొందరో వారు, ప్రాయేణ - అధికముగా, దేవః - దేవుడు, అభి-అర్చితః - చక్కగా పూజించబడినాడు.

సంతానము లేని గృహస్థులు, చెడు సంతానము కలిగించే భరించ శక్యము కాని దుఃఖమును పొందని గృహస్థులు ఆ దేవుని అధికముగా చక్కగా ఆరాధించి యుందురు.

యతః పాపీయసీ కీర్తిరధర్మశ్చ మహాన్నృణామ్ ।
యతో విరోధస్సర్వేషాం యత ఆధిరనంతకః ।। 44

యతః - ఏ చెడు సంతానముచే, నృణామ్ - మానవులకు, పాపీయసీ - చెడ్డ, కీర్తిః - పేరు, మహాన్ - పెద్ద, అధర్మః చ - అధర్మము కూడ కలుగునో, యతః - దేనివలన, సర్వేషామ్ - అందరితో, విరోధః - విరోధము కలుగునో, యతః - దేనివలన, అనంతకః - అంతము లేని, ఆధిః - మనోవ్యాధి కలుగునో.

చెడు సంతానము వలన తల్లిదండ్రులకు చెడ్డ పేరు, అధర్మము, అందరితో విరోధము, మరియు అంతము లేని మనోవ్యథ కలుగును.

కస్తం ప్రజాఽపదేశం వై మోహబంధనమాత్మనః ।
పండితో బహు మన్యేత యదర్థాః క్లేశదా గృహాః ।। 45

తమ్ - అట్టి, ప్రజా-అపదేశమ్ - పేరుకు మాత్రమే సంతానమై యున్న, ఆత్మనః - తనకు, మోహబంధనమ్ - మోహము అనే బంధము ను, కః - ఏ, పండితః - వివేకి, బహు మన్యేత - ఆదరించును?, యత్ -అర్థాః - ఎవరి కారణముగా, గృహాః - ఇల్లు, క్లేశదాః - దుఃఖదాయకమో.

చెడు సంతానము వలన తల్లిదండ్రులకు ఇల్లు దుఃఖనిలయమగు ను. అట్టి సంతానము పేరుకు సంతానమే గాని, వాస్తవములో వారు తల్లి దండ్రులకు మోహము అనే బంధము మాత్రమే. వివేకియైనవాడు ఎవడు అట్టి సంతానమును ఆదరించును?

కదపత్యం వరం మన్యే సదపత్యాచ్ఛుచాం పదాత్ ।
నిర్విద్యేత గృహాన్మర్త్యో యత్ క్లేశనివహా గృహాః ॥ 46

శుచామ్ - దుఃఖములకు, పదాత్ - స్థానమైన, సత్-అపత్యాత్ - మంచి సంతానము కంటె, కదపత్యమ్ - చెడు సంతానము, వరమ్ - శ్రేష్ఠ మని, మన్యే - తలంచుచున్నాను, మర్త్యః - మానవుడు, గృహాత్ - గృహ మునుండి, నిర్విద్యేత - విరక్తిని చెందునో, యత్ - ఏలయనగా, గృహాః - ఇల్లు, క్లేశనివహాః - చిత్తమలములకు నిధానమో.

ఇంకో రకంగా ఆలోచిస్తే, మంచి సంతానము కంటె చెడు సంతా నమే మేలు. మంచి సంతానము వలన వియోగాది దుఃఖములు తప్పవు. కాని, చెడు సంతానము వలన, ఇల్లు అజ్ఞానము మొదలగు చిత్తమలము లకు (దుఃఖములకు) నిధానము అని గుర్తించిన మానవునకు విరక్తిని చెందే అవకాశము లభించును.

ఏవం స నిర్విణ్ణమనా నృపో గృహాత్
నిశీథ ఉత్థాయ మహోదయోదయాత్ ।
అలబ్ధనిద్రోఽనుపలక్షితో నృభిః
హిత్వా గతో వేనసువం ప్రసుప్తామ్ ॥ 47

ఏవమ్ - ఈ విధముగా, నిర్విణ్ణమనాః - విరక్తిని చెందిన మనస్సు కలిగినవాడు, అలబ్ధనిద్రః - నిద్ర పట్టనివాడు అగు, నృపః - ఆ మహారాజు,

నిశీథే - అర్ధరాత్రియందు, ఉత్థాయ - లేచి, నృభిః - జనులచే, అలక్షితః - చూడబడనివాడై, ప్రసుప్తామ్ - గాఢముగా నిద్రించుచున్న, వేనసువమ్ - వేనుని తల్లిని, హిత్వా - విడిచిపెట్టి, మహా-ఉదయ-ఉదయాత్ - గొప్ప సంపధలకు జన్మస్థానమగు, గృహాత్ - ఇంటినుండి, గతః - వెళ్లినాడు.

ఈ విధముగా అంగ మహారాజు మనస్సులో విరక్తిని చెందియుండెను. ఆయనకు నిద్ర పట్టలేదు. ఆయన అర్ధరాత్రమునందు లేచి, జనులకు కనబడకుండా, గాఢముగా నిద్రించుచున్న వేనుని తల్లియగు సునీథను విడిచిపెట్టి, గొప్ప సంపదలకు నిలయమగు తన ఇంటినుండి వెళ్లిపోయెను.

విజ్ఞాయ నిర్విద్య గతం పతిం ప్రజాః
పురోహితామాత్యసుహృద్గణాదయః ।
విచిక్యురుర్వ్యామతిశోకకాతరా
యథా నిగూఢం పురుషం కుయోగినః ॥ 48

పురోహిత-అమాత్యసుహృత్-గణ-ఆదయః - పురోహితుడు మంత్రులు మిత్రగణములు మొదలగు, ప్రజాః - జనులు, పతిమ్ - రాజును, నిర్విద్య - విరక్తి జెంది, గతమ్ - వెళ్లిపోయినవానినిగా, విజ్ఞాయ - తెలుసుకొని, అతిశోకకాతరాః - అధికమగు దుఃఖముచే విహ్వలులై, కుయోగినః - దొంగ యోగులు, నిగూఢమ్ - హృదయములో రహస్యముగా దాగియున్న, పురుషం యథా - ఈశ్వరుని వలె, ఉర్వ్యామ్ - భూమియందు, విచిక్యుః - వెదికిరి.

పురోహితుడు, మంత్రులు, మిత్రగణములు, జనులు అందరు రాజు విరక్తిని చెంది వెళ్లిపోయినాడని తెలిసి అధికమగు దుఃఖముతో విహ్వలులైరి. వారు దేశమంతటా రాజును వెదికించిరి. దొంగ యోగులకు తమ హృదయములోనే దాగియున్న ఈశ్వరుడు బయట ఎక్కడా కానరాని విధముగా, వారికి ఆ రాజు ఆ నగరములోనే ఉన్నా కానరాలేదు.

అలక్షయంతః పదవీం ప్రజాపతేః
హతోద్యమాః ప్రత్యుపసృత్య తే పురీమ్ ।

ఋషీన్ సమేతానభివంద్య సాశ్రవో
న్యవేదయన్ పౌరవ భర్తృవిప్లవమ్ ॥ 49

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే చతుర్థస్కంధే పృథూపాఖ్యానే
అంగస్య రాజ్యత్యాగో నామ త్రయోదశోఽధ్యాయః ॥

పౌరవ - పురువంశీయుడవగు ఓ విదురా!, ప్రజాపతేః - ప్రజలను పాలించే మహారాజుయొక్క, పదవీమ్ - జాడను, అలక్షయంతః - కనజాలని, తే - వారు, హత-ఉద్యమాః - నిష్ఫలమగు ప్రయత్నము గలవారై, పురీమ్ - నగరమును గురించి, ప్రతి-ఉపసృత్య - తిరిగి వచ్చి, సమేతాన్ - ఒకచో గూడియున్న, ఋషీన్ - మహర్షులను, అభివంద్య - నమస్కరించి, స-అశ్రవః - కన్నీటితో కూడినవారై, భర్తృవిప్లవమ్ - ప్రభువుయొక్క కనబడక పోవుటను గురించి, న్యవేదయన్ - విన్నవించిరి.

వారికి ప్రజాపాలకుడగు రాజుయొక్క జాడ తెలియరాలేదు. ఆ విధముగా వారి ప్రయత్నము వ్యర్థమయ్యెను. అప్పుడు వారు నగరమునకు తిరిగి వచ్చి, అక్కడ సమావేశమైయున్న మహర్షులకు నమస్కరించి, కన్నీటితో రాజు కనబడ లేదని విన్నవించిరి.

శ్రీమద్భాగవత మహాపురాణములోని నాల్గవ స్కంధములో
పృథూపాఖ్యానములో అంగ మహారాజు రాజ్యమును విడిచి
వెళ్లుట అనే పదమూడవ అధ్యాయము ముగిసినది (13).

*****

# అథ చతుర్దశోఽధ్యాయః

## పృథూపాఖ్యానము - వేనరాజు మరణించుట

మైత్రేయ ఉవాచ ।
భృగ్వాదయస్తే మునయో లోకానాం క్షేమదర్శినః ।
గోప్తర్యసతి వై నృణాం పశ్యంతః పశుసామ్యతామ్ ॥ 1

వీరమాతరమాహూయ సునీథాం బ్రహ్మవాదినః ।
ప్రకృత్యసంమతం వేనమభ్యషించన్ పతిం భువః ॥ 2

మైత్రేయః - మైత్రేయ మహర్షి, ఉవాచ - పలికెను, లోకానామ్ - జనులకు, క్షేమదర్శినః - క్షేమమును గురించి చింతిల్లువారు, బ్రహ్మవాదినః - వేదవేత్తలు అగు, తే - ఆ, భృగు-ఆదయః - భృగువు మొదలుగా గల, మునయః - మహర్షులు, గోప్తరి - రక్షించే రాజు, అసతి - లేకపోగా, నృణామ్ - మానవులకు, వై - నిశ్చయముగా, పశుసామ్యతామ్ - పశువు తోడి సమానత్వమును, పశ్యంతః - దర్శించుచున్నవారై, వీరమాతరమ్ - వీరుడగు వేనుని తల్లియగు, సునీథామ్ - సునీథను, ఆహూయ - పిలిచి, ప్రకృతి-అసంమతమ్ - ప్రకృతులకు (జనులకు) సమ్మతము కాని (స్వభావముచే సమ్మతము కాని), వేనమ్ - వేనుని, భువః - రాజ్యమునకు, పతిమ్ - ప్రభువునుగా, అభ్యషించన్ - అభిషేకించిరి.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- వేదవేత్తలగు భృగువు మొదలగు మహర్షులు జనుల క్షేమమును గురించి చింతిల్లెదరు. ప్రజలను రక్షించే రాజు లేకపోతే ప్రజలు పశువుల వలె ఒకరినొకరు దోచుకొనెదరని వారు భావించిరి. వారు వీరుడగు వేనుని తల్లియైన సునీథతో సంప్రదించిరి. మంత్రులు మొదలగు రాజ్యాధికారులకు మరియు ప్రజలకు స్వభావమును

బట్టి వేనుడు సమ్మతము కాదు. అయిననూ, వారు ఆతనినే రాజ్యమునకు ప్రభువుగా పట్టాభిషిక్తుని చేసిరి.

శ్రుత్వా నృపాసనగతం వేనమత్యుగ్రశాసనమ్ ।
నిలిల్యుర్దస్యవస్సద్యస్సర్పత్రస్తా ఇవాఖవః ॥ 3

అతి-ఉగ్రశాసనమ్ - మిక్కిలి క్రూరమగు శాసనము గల, వేనమ్ - వేనుని, నృప-ఆసనగతమ్ - రాజ సింహాసనమును అధిష్ఠించినవానినిగా, శ్రుత్వా - విని, దస్యవః - దొంగలు, సద్యః - వెంటనే, సర్పత్రస్తాః - పాము వలన భయపడిన, ఆఖవః ఇవ - ఎలుకలు వలె, నిలిల్యుః - అజ్ఞాతము లోనికి వెళ్లిపోయిరి.

మిక్కిలి కఠినమగు శిక్షలను విధించే వేనుడు రాజసింహాసనమున ధిష్ఠించినాడని విని దొంగలు వెంటనే, పామునకు భయపడిన ఎలుకలు వలె, తమ కార్యకలాపములను కట్టిబెట్టి, అజ్ఞాతములోనికి వెళ్లిపోయిరి.

స ఆరూఢనృపస్థాన ఉన్నద్ధోఽష్టవిభూతిభిః ।
అవమేనే మహాభాగాన్ స్తబ్ధస్సంభావితస్స్వతః ॥ 4

ఆరూఢనృపస్థానః - అధిష్ఠించబడిన రాజసింహాసనము కలిగినవాడు, అష్టవిభూతిభిః - ఎనిమిది రకముల ఐశ్వర్యములచే, ఉత్-నద్ధః - అడ్డు ఆపు లేనివాడు, స్తబ్ధః - గర్వితుడు, స్వతః - తనను తానే, సంభావితః - గౌరవించుకొనువాడు అగు, సః - ఆ వేనుడు, మహాభాగాన్ - మహాత్ములను, అవమేనే - అవమానించెను.

ఆ వేనుడు రాజసింహాసనముపై కూర్చుండగానే చాల గర్వమును పొందెను. ఎనిమిది దిక్కులలో ఆతని శాసనమునకు తిరుగు లేకుండెను. ఆతడు తన గొప్పలు తానే చెప్పుకుంటూ, అడ్డు ఆపు లేకుండా, మహాత్ములను అవమానించ దొడగెను.

ఏవం మదాంధ ఉత్సిక్తో నిరంకుశ ఇవ ద్విపః ।
పర్యటన్ రథమాస్థాయ కంపయన్నివ రోదసీ ॥ 5

ఏవమ్ - ఈ విధముగా, మద-అంధః - గర్వముచె కన్ను కాన రాని వేనుడు, ఉత్సిక్తః - అడ్డు ఆపు లేనివాడై, నిరంకుశః - మావటీని అంకుసపు భయము లేని, ద్విపః ఇవ - ఏనుగు వలె, రథమ్ - రథమును, ఆస్థాయ - ఎక్కి, రోదసీ - భూమిని అంతరిక్షమును, కంపయన్ ఇవ - వణికించుచున్నవాడు వలె, పర్యటన్ - పర్యటించుచున్నవాడు.

ఈ విధముగా వేనుడు ఐశ్వర్యమదముచే కన్ను మిన్ను కానరా కుండా అడ్డు ఆపు లేని ప్రవృత్తి గలవాడయ్యెను. ఆతడు, మావటీని అంకు శపు భయము లేని ఏనుగు వలె, రథముపై పర్యటిస్తూ భూమిని అంతరిక్ష మును వణికించెను.

న యష్టవ్యం న దాతవ్యం న హోతవ్యం ద్విజాః క్వచిత్ ।
ఇతి న్యవారయద్ధర్మం భేరీఘోషేణ సర్వశః ।। 6

ద్విజాః - బ్రాహ్మణులు, క్వచిత్ - ఎక్కడనైననూ, న యష్టవ్యమ్ - యజ్ఞమును చేయరాదు, న దాతవ్యమ్ - దానములను చేయరాదు, న హోతవ్యమ్ - హోమములను చేయరాదు, ఇతి - అని, భేరీఘోషేణ - భేరీతో చాటింపుచే, సర్వశః - అన్ని విధములుగా, ధర్మమ్ - ధర్మమును, న్యవారయత్ - అడ్డుకొనెను.

బ్రాహ్మణులు ఎక్కడైననూ యజ్ఞములను, దానములను, హోమ ములను చేయరాదు అనే భేరీశబ్దపూర్వకముగా చాటింపు వేయించి, ఆ వేనుడు ధర్మకార్యములను ఆపించెను.

వేనస్యావేక్ష్య మునయో దుర్వృత్తస్య విచేష్టితమ్ ।
విమృశ్య లోకవ్యసనం కృపయోచుస్స్మ సత్రిణః ।। 7

మునయః - మహర్షులు, దుర్వృత్తస్య - చెడు స్వభావము గల, వేనస్య - వేనుని, విచేష్టితమ్ - చేష్టను, అవేక్ష్య - చూచి, లోకవ్యసనమ్ - జనుల కష్టమును గురించి, విమృశ్య - విచారించి, కృపయా - దయతో, సత్రిణః - ఒకచోట సమావేశమైనవారై, ఊచుః స్మ - పలికిరి.

చెడు స్వభావము గల వేనుని ఈ దుశ్చేష్టలను చూచి మహర్షులు జనులకు కలిగిన కష్టమును గురించి ఆలోచించి, దయ గలవారగుటచే ఒక చోట సమావేశమై ఇట్లు పలికిరి.

**అహో ఉభయతః ప్రాప్తం లోకస్య వ్యసనం మహత్ ।**
**దారుణ్యుభయతో దీప్త ఇవ తస్కరపాలయోః ॥ 8**

**అహో** - ఆశ్చర్యము!, **ఉభయతః** - రెండు వైపులయందు, **దీప్తే** - మండించబడిన, **దారుణి ఇవ** - కట్టెయందు వలె, **లోకస్య** - లోకమునకు, **ఉభయతః** - రెండు వైపులనుండి, **తస్కరపాలయోః** - చోరుల మరియు పాలకుని, **మహత్** - పెద్ద, **వ్యసనమ్** - ఆపద, **ప్రాప్తమ్** - వచ్చి పడినది.

ఆశ్చర్యము! జనులకు ఒకవైపు చోరులనుండి, రెండవవైపు రాజు నుండి పెద్ద ఆపద రెండు వైపులా వచ్చి పడినది. కట్టెకు రెండు వైపులా మంట పెట్టినప్పుడు మధ్యలోనుండే పురుగుల వలె, జనులు ఒకవైపు చోరులు, మరియొక వైపు రాజు వీరి మధ్యలో నలిగిపోవుచున్నారు.

**అరాజకభయాదేష కృతో రాజాఽతదర్హణః ।**
**తతోఽప్యాసీద్భయం త్వద్య కథం స్యాత్స్వస్తి దేహినామ్ ॥9**

**అరాజకభయాత్** - అరాచకమగుననే భయము వలన, **అతత్-అర్హణః** - ఆ రాజపదవికి అర్హత లేని, **ఏషః** - ఈ వేనుడు, **రాజా** - రాజుగా, **కృతః** - చేయబడినాడు, **తు** - కాని, **అద్య** - ఈనాడు, **తతః అపి** - వాని వలన కూడ, **భయమ్** - భయము, **ఆసీత్** - కలిగెను, **దేహినామ్** - ప్రజలకు, **స్వస్తి** - మంగళము, **కథమ్** - ఏ విధముగా, **స్యాత్** - కలుగును?

దేశములో అరాచకము వచ్చునేమో యను భయముతో రాజసింహాసనమునకు అర్హత లేని ఈ వేనుని మనము రాజుగా చేసినాము. కాని, ఇప్పుడు వీని వలన కూడ ప్రజలకు భయము వచ్చి పడినది. ఈ స్థితిలో జనులకు మేలు కలిగే ఉపాయమేమి?

**అహేరివ పయఃపోషః పోషకస్యాప్యనర్థభృత్ ।**
**వేనః ప్రకృత్యైవ ఖలస్సునీథాగర్భసంభవః ॥ 10**

**అహేః** - పామునకు, **పయః-పోషః** - పాలను పోసి పెంచుట, **పోషకస్య అపి** - పెంచినవానికి కూడ, **అనర్థభృత్ ఇవ** - అనర్థమును తెచ్చిపెట్టే విధముగా, **సునీథాగర్భసంభవః** - సునీథాదేవి కడుపున పుట్టిన, **వేనః** - వేనుడు, **ప్రకృత్యా ఏవ** - స్వభావము చేతనే, **ఖలః** - దుష్టుడు.

త్రాచుపామునకు పాలను పోసి పెంచినచో, అది పెంచినవానినే కాటు వేయును. అదే విధముగా ఈ వేనుడు మనకు చేసినాడు. సునీథా దేవి కడుపున పుట్టిన ఈ వేనుడు స్వభావము చేతనే దుష్టుడు.

**నిరూపితః ప్రజాపాలస్స జిఘాంసతి వై ప్రజాః ।**
**తథాఽపి సాంత్వయేమాముం నాస్మాంస్తత్పాతకం స్పృశేత్ ॥11**

**ప్రజాపాలః** - ప్రజలకు పాలకుడుగా, **నిరూపితః** - చేయబడిన, **సః వై** - ఆ వేనుడే, **ప్రజాః** - ప్రజలను, **జిఘాంసతి** - హానిని చేయగోరుచున్నాడు, **తథా అపి** - అయినప్పటికీ, **అముమ్** - వీనిని, **సాంత్వయేమ** - నచ్చజెప్పెదము, **తత్-పాతకమ్** - వాని పాపము, **అస్మాన్** - మనలను, **న స్పృశేత్** - తగలకుండు గాక!

మనము ప్రజలను పాలించే రాజుగా అభిషేకించిన ఈ వేనుడు తానే స్వయముగా ప్రజలను హింసించ గోరుచున్నాడు. అయినప్పటికీ, మనము వీనికి నచ్చజెప్పెదము. అట్లు చేయుట వలన, వీడు చేసే పాపము మనకు చుట్టుకొనకుండును.

**తద్విద్వద్భిరసద్వృత్తో వేనోఽస్మాభిః కృతో నృపః ।**
**సాంత్వితో యది నో వాచం న గ్రహీష్యత్యధర్మకృత్ ।**
**లోకధిక్కారసందగ్ధం దహిష్యామస్స్వతేజసా ॥ 12**

**తత్-విద్వద్భిః** - ఆ వేనుని దుష్టత్వమునెరింగిన, **అస్మాభిః** - మనలచే, **అసత్-వృత్తః** - దుష్టమగు స్వభావము గల, **వేనః** - వేనుడు, **నృపః** - రాజుగా, **కృతః** - చేయబడినాడు, **అధర్మకృత్** - అధర్మములను

చేసే వేనుడు, సాంత్వితః - నచ్చచెప్ప బడినవాడై, నః - మన, వాచమ్ - మాటను, యది న గ్రహీష్యతి - గ్రహించకపోయిన పక్షములో, లోకధిక్కారసందగ్ధమ్ - జనుల తిరస్కారముచే బాగుగా దహించబడియున్న వేనుని, స్వతేజసా - మన తేజస్సుచే, దహిష్యామః - దహించెదము.

వేనుడు దుష్టుడని తెలిసియే మనము దుష్టశీలుడగు ఆ వేనుని రాజుగా చేసినాము. అధర్మములను చేయుచున్న ఆ వేనునకు మనము నచ్చజెప్పెదము. ఇప్పటికే ఆతడు జనుల ధిక్కారముచే మృతప్రాయుడై ఉన్నాడు. మనము చెప్పిన సలహాను ఆతడు వినని పక్షములో, మనమాతనిని మన తేజస్సుచే దహించి వేసెదము.

ఏవమధ్యవసాయైనం మునయో గూఢమన్యవః ।
ఉపవ్రజ్యాబ్రువన్ వేనం సాంత్వయిత్వా చ సామభిః ।। 13

గూఢమన్యవః - రహస్యమగు కోపము గల, మునయః - మహర్షులు, ఏవమ్ - ఈ విధముగా, అధ్యవసాయ - నిశ్చయించుకొని, ఏనమ్ - ఈ, వేనమ్ - వేనుని, ఉపవ్రజ్య - సమీపించి, సామభిః - మంచి మాటలతో, సాంత్వయిత్వా చ - ప్రసన్నునిగా చేసుకొని, అబ్రువన్ - పలికిరి.

మహర్షుల కోపము రహస్యముగా నుండును. వారీ విధముగా నిశ్చయించుకొని, ఈ వేనుని వద్దకు వెళ్లిరి. వారు ముందుగా ఆతనిని ప్రియోక్తులతో తమకు అనుకూలముగా చేసుకొని, తరువాత ఇట్లు పలికిరి.

మునయ ఊచుః ।
నృపవర్య నిబోధైతద్యత్తే విజ్ఞాపయామ భోః ।
ఆయుశ్శ్రీర్బలకీర్తీనాం తవ తాత వివర్ధనమ్ ।। 14

భోః - ఓయీ!, నృపవర్య - మహారాజా!, తాత - వత్సా!, ఏతత్ - ఈ విషయమును, నిబోధ - తెలియుము, యత్ - దేనిని, తే - నీ కొరకు, విజ్ఞాపయామ - విన్నవించుచున్నామో అది, తవ - నీకు, ఆయుః-శ్రీః-బలకీర్తీనామ్ - ఆయుర్దాయమునకు సంపదకు బలమునకు కీర్తికి, వివర్ధనమ్ - వర్ధిల్ల జేయునది.

మహర్షులు ఇట్లు పలికిరి --- ఓ మహారాజా! వత్సా! మేము నీకు ఒక విన్నపమును చేసెదము. దీనిని పాటించినచో, నీ ఆయుర్దాయము, సంపద, బలము మరియు కీర్తి వర్ధిల్లును. నీవు దీనిని జాగ్రత్తగా విని తెలుసుకొనుము.

ధర్మ ఆచరితః పుంసాం వాఙ్మనఃకాయబుద్ధిభిః ।
లోకాన్ విశోకాన్ వితరత్యథానంత్యమసంగినామ్ ।। 15

వాక్-మనఃకాయబుద్ధిభిః - వాక్కు మనస్సు శరీరము బుద్ధి అను వాటిచే, ఆచరితః - ఆచరించబడిన, ధర్మః - ధర్మము, పుంసామ్ - మానవులకు, లోకాన్ - లోకములను, విశోకాన్ - శోకము లేనివాటినిగా, వితరతి - చేయుచున్నది, అథ - మరియు, అసంగినామ్ - భోగాసక్తి లేనివారలకు, ఆనంత్యమ్ - మోక్షమును, వితరతి - ఇచ్చుచున్నది.

మానవుడు బుద్ధితో ధర్మమును నిశ్చయించుకొని మనోవాక్కాయములతో దానిని ఆచరించవలెను. అట్లు చేయుట వలన వానికి ఇహపరలోకములలో శోకము ఉండదు. మరియు, అట్టి వ్యక్తి ఇహాముత్రఫలభోగవిరక్తుడైనచో, ఆ ధర్మము వానికి మోక్షమునకు దారి (జ్ఞానము) ని సుగమము చేయును.

స తే మా వినశేద్వీర ప్రజానాం క్షేమలక్షణః ।
యస్మిన్ వినష్టే నృపతిరైశ్వర్యాదవరోహతి ।। 16

వీర - ఓయీ వీరా! ప్రజానామ్ - ప్రజలకు, క్షేమలక్షణః - క్షేమమే లక్షణముగా గల, సః - ఆ ధర్మము, తే - నీకు, మా వినశేత్ - నశించకుండు గాక!, యస్మిన్ - ఏ ధర్మము, వినష్టే - నశించగా, నృపతిః - రాజు, ఐశ్వర్యాత్ - ఐశ్వర్యమునుండి, అవరోహతి - దిగిపోవునో.

ఓయీ వీరా! ప్రజల క్షేమమే ధర్మమునకు చిహ్నము. అట్టి ధర్మము నీయందు నశించకుండును గాక! ఆ ధర్మమే నశించినచో, రాజు తన పదవిని సంపదను కోల్పోయి పతితుడగును.

రాజన్నసాధ్వమాత్యేభ్యశ్చోరాదిభ్యః ప్రజా నృపః ।
రక్షన్ యథా బలిం గృహ్ణన్నిహ ప్రేత్య చ మోదతే ॥ 17

రాజన్ - ఓ రాజా!, ప్రజాః - ప్రజలను, అసాధు-అమాత్యేభ్యః - చెడు మంత్రులనుండియు, చోర-ఆదిభ్యః - చోరులు మొదలగువారినుండి యు, రక్షన్ - రక్షిస్తూ ఉండే, నృపః - రాజు, యథా - శాస్త్రానుసారము గా, బలిమ్ - పన్నును, గృహ్ణన్ - స్వీకరించువాడై, ఇహ - ఈ లోకమునం దు, ప్రేత్య చ - మరణించి కూడా, మోదతే - ఆనందించును.

ఓ రాజా! రాజు ప్రజలను చెడు మంత్రులనుండి, చోరులు మొద లగు వారినుండి రక్షిస్తూ, వారినుండి ధర్మబద్ధముగా పన్నును వసూలు చేయవలెను. అట్లు చేయు రాజు ఈ లోకములో మాత్రమే గాక, పరలోక ములో సుఖముల ననుభవించును.

యస్య రాష్ట్రే పురే చైవ భగవాన్ యజ్ఞపూరుషః ।
ఇజ్యతే స్వేన ధర్మేణ జనైర్వర్ణాశ్రమాన్వితైః ॥ 18

తస్య రాజ్ఞో మహాభాగ భగవాన్ భూతభావనః ।
పరితుష్యతి విశ్వాత్మా తిష్ఠతో నిజశాసనే ॥ 19

మహాభాగ - ఓ మహారాజా!, యస్య - ఎవని, రాష్ట్రే - రాష్ట్రము నందు, పురే చ ఏవ - రాజధానీ నగరమునందు కూడ, యజ్ఞపూరుషః - యజ్ఞేశ్వరుడగు, భగవాన్ - శ్రీహరి భగవానుడు, వర్ణ-ఆశ్రమ-అన్వితైః - వర్ణాశ్రమములతో కూడియున్న, జనైః - జనులచే, స్వేన - తమ, ధర్మేణ - ధర్మముతో, ఇజ్యతే - ఆరాధించ బడుచున్నాడో, నిజశాసనే - తన శాస నమునందు, తిష్ఠతః - నిలిచియున్న, తస్య - అట్టి, రాజ్ఞః - రాజునకు, భూతభావనః - ప్రాణులను పాలించే, విశ్వ-ఆత్మా - జగత్తునకు ఆత్మ (స్వరూపము) అయి ఉన్న, భగవాన్ - శ్రీహరి భగవానుడు, పరితుష్యతి - సంతోషించును.

ఓ మహారాజా! రాజు తన రాజ్యములోనే గాక రాజధానీ నగర ములో కూడ జనులు స్వధర్మ పరాయణులై తమ తమ ధర్మములను నిర్వ

ర్తిస్తూ, యజ్ఞేశ్వరుడగు శ్రీహరి భగవానుని ఆరాధించునట్లు చూడవలెను. అట్లు చేయు రాజు ఆ భగవానుని శాసనమును పాలించినవాడగును. సకల ప్రాణులను పాలించే శ్రీహరియే సకలప్రాణులలో ఆత్మరూపముగా నున్నాడు. అట్టి శ్రీహరి ఆజ్ఞను పాలించే రాజు విషయములో ఆయన సంతుష్టుడగును.

తస్మింస్తుష్టే కిమప్రాప్యం జగతామీశ్వరేశ్వరే ।
లోకాస్సపాలా హ్యేతస్మై హరంతి బలిమాదృతాః ॥ 20

జగతామ్ - జగత్తులకు, ఈశ్వర-ఈశ్వరే - ప్రభువులకు కూడ ప్రభువగు, తస్మిన్ - ఆ శ్రీహరి, తుష్టే - సంతోషించగా, అప్రాప్యమ్ - పొంద శక్యము కానిది, కిమ్ - ఏమి ఉండును?, హి - ఎందువలననగా, సపాలాః - లోకపాలకులతో కూడిన, లోకాః - ప్రాణులు, ఏతస్మై - ఈ శ్రీహరి (భక్తుని) కొరకు, ఆదృతాః - ఆదరము గలవారై, బలిమ్ - పూజా ద్రవ్యమును, హరంతి - సమర్పించుచున్నారు.

జగత్తులో ఇంద్రాది ప్రభువులకు కూడ శ్రీహరియే ప్రభువు. ఆయన సంతోషించినచో, అట్టి భక్తునకు పొంద శక్యము కానిది యేమి ఉండును? ఏలయనగా, లోకపాలకులతో సహా సకలప్రాణులు ఆ శ్రీహరి (లేదా, శ్రీహరి భక్తుని) కొరకు సాదరముగా పూజోపహారములను సమర్పించుచున్నారు.

తం సర్వలోకామరయజ్ఞసంగ్రహం
త్రయీమయం ద్రవ్యమయం తపోమయమ్ ।
యజ్ఞైర్విచిత్రైర్యజతో భవాయ తే
రాజన్ స్వదేశాననురోద్ధుమర్హసి ॥ 21

రాజన్ - ఓ రాజా!, సర్వలోక-అమరయజ్ఞసంగ్రహమ్ - సకలలోకములను దేవతలను యజ్ఞములను చక్కగా నియంత్రించునట్టియు, త్రయీమయమ్ - వేదరూపుడైనట్టియు (వేదప్రతిపాద్యుడైనట్టియు), ద్రవ్యమయమ్ - సకలపదార్థముల రూపములోనున్నట్టియు, తపోమయమ్ - తపస్సు రూపములోనుండే, తమ్ - ఆ శ్రీహరిని, విచిత్రైః - రకరకముల,

యజ్ఞైః - యజ్ఞములచే, తే - నీ, భవాయ - జన్మ (అభివృద్ధి) కొరకు, యజతః - ఆరాధించే, స్వదేశాన్ - నీ దేశవాసులను, అనురోద్ధుమ్ - అను సరించుటకు (యజ్ఞములలో ప్రవర్తింప జేయుటకు), అర్హసి - తగుదువు.

ఓ రాజా! సకలలోకములను, లోకపాలకులను, వాటిని కర్మఫల రూపముగా పొందించే యజ్ఞములను, వేదరూపుడు వేదప్రతిపాద్యుడు అగు శ్రీహరియే నియంత్రించుచున్నాడు. ఆయనయే సకల (యజ్ఞ) ద్రవ్య ముల రూపములో నున్నాడు. తపస్సు కూడ ఆయన రూపమే. అట్టి శ్రీహ రిని రకరకముల యజ్ఞములచే జనులు ఆరాధించుట చేతనే నీవు జన్మించి, వర్ధిల్లుచున్నావు. కావున, నీవు కూడ నీ దేశవాసులను అనుసరించుట, వారిని యజ్ఞములయందు ప్రవర్తిల్ల జేయుట యోగ్యముగా నుండును.

యజ్ఞేన యుష్మద్విషయే ద్విజాతిభిః
వితాయమానేన సురాః కలా హరేః ।
స్విష్టాస్సుతుష్టాః ప్రదిశంతి వాంఛితం
తద్ధేలనం నార్హసి వీర చేష్టితుమ్ ॥ 22

వీర - ఓయీ వీరా!, యుష్మత్-విషయే - నీ సామ్రాజ్యమునందు, ద్విజాతిభిః - బ్రాహ్మణులచే, వితాయమానేన - నిర్వహించబడే, యజ్ఞేన - యజ్ఞముచే, హరేః - శ్రీహరియొక్క, కలాః - అంశలైన, సురాః - దేవత లు, సు-ఇష్టాః - చక్కగా ఆరాధించబడినవారై, సుతుష్టాః - చాల సంతో షించినవారై, వాంఛితమ్ - కోరికను, ప్రదిశంతి - నెరవేర్చుచున్నారు, తత్ -హేలనమ్ - ఆ దేవతల ( ఆ శ్రీహరి) తిరస్కారమును, చేష్టితుమ్ - చేయుటకు, న అర్హసి - తగవు.

ఓ వీరా! నీ సామ్రాజ్యములో బ్రాహ్మణులు యజ్ఞములను చేసి శ్రీహరియొక్క అంశలైన దేవతలను చక్కగా ఆరాధించి సంతోషపెట్టుచు న్నారు. వారు అట్లు చేయుటచే, నీ వాంఛితమును దేవతలు నెరవేర్చెదరు. కావున, ఆ దేవతలను, శ్రీహరిని తిరస్కరించుట నీకు తగదు.

వేన ఉవాచ ।
బాలిశా బత యూయం వా అధర్మే ధర్మమానినః ।
యే వృత్తిదం పతిం హిత్వా జారం పతిముపాసతే ॥ 23

బత - ఆశ్చర్యము!, అధర్మే - అధర్మమునందు, ధర్మమానినః - ధర్మము అనే ధారణ గల, యూయమ్ - మీరు, వై - నిశ్చయముగా, బాలిశాః - మూర్ఖులు, యే - ఏ మీరు, వృత్తిదమ్ - జీవికను కలిగించే, పతిమ్ - ప్రభువును, హిత్వా - విడిచిపెట్టి, జారమ్ - విటుని, పతిమ్ - ప్రభువుగా, ఉపాసతే - ఉపాసించుచున్నారో.

ఆశ్చర్యముగా నున్నది! అధర్మమును ధర్మమని భావించే మీరు నిశ్చయముగా మూర్ఖులు. నేను మీకు జీవికను కలిగించుచున్నాను. అట్టి ప్రభువునగు నన్ను మీరు విడిచిపెట్టి, భర్తను విడిచి జారుని సేవించే స్త్రీవలె, మీరు మరియొక ప్రభువు (విష్ణువు) ను సేవించుచున్నారు.

అవజానంత్యమీ మూఢా నృపరూపిణమీశ్వరమ్ ।
నానువిందంతి తే భద్రమిహ లోకే పరత్ర చ ॥ 24

అమీ - ఈ, మూఢాః - మూర్ఖులు, నృపరూపిణమ్ - రాజు రూపములోనున్న, ఈశ్వరమ్ - ఈశ్వరుని, అవజానంతి - అవమానించుచున్నారు, తే - వారు, ఇహ - ఈ, లోకే - లోకమునందు, పరత్ర చ - పరలోకమునందు కూడ, భద్రమ్ - కల్యాణమును, న అనువిందంతి - ఈ పైన పొందరు.

ఈ మూర్ఖులు రాజు రూపములోనుండే ఈశ్వరుడనైన నన్ను అవమానించుచున్నారు. వీరికి ఈ లోకములో గాని, పరలోకములో గాని ఈ పైన శుభము కలుగదు.

కో యజ్ఞపురుషో నామ యత్ర వో భక్తిరీదృశీ ।
భర్తృస్నేహవిదూరాణాం యథా జారే కుయోషితామ్ ॥ 25

యజ్ఞపురుషః నామ - యజ్ఞపురుషుడనగా, కః - ఎవరు?, యత్ర - ఎవనియందైతే, వః - మీకు, భర్తృస్నేహవిదూరాణామ్ - భర్తయందలి

ప్రేమకు దూరముగానుండే (దూరమైన), కుయోషితామ్ - దుష్టయువతులకు, జారే యథా - జారునియందు వలె, ఈదృశీ - ఇట్టి, భక్తిః - భక్తియో.

భర్త ప్రేమకు దూరమైన (దూరముగానుండే) దుష్టయువతి జారునియందు ప్రీతిని కలిగియుండును. అదే విధముగా, మీరు యజ్ఞపురుషుని యందు గొప్ప భక్తిని కలిగియున్నారు. ఈ యజ్ఞపురుషుడెవరు?

విష్ణుర్విరించో గిరిశ ఇంద్రో వాయుర్యమో రవిః ।
పర్జన్యో ధనదస్సోమః క్షితిరగ్నిరపాం పతిః ॥ 26

ఏతే చాన్యే చ విబుధాః ప్రభవో వరశాపయోః ।
దేహే భవంతి నృపతేస్సర్వదేవమయో నృపః ॥ 27

విష్ణుః - విష్ణువు, విరించః - బ్రహ్మ, గిరిశః - కైలాసాధిపతియగు శివుడు, ఇంద్రః - ఇంద్రుడు, వాయుః - వాయువు, యమః - యముడు, రవిః - సూర్యుడు, పర్జన్యః - మేఘుడు, ధనదః - కుబేరుడు, సోమః - చంద్రుడు, క్షితిః - భూదేవత, అగ్నిః - అగ్ని, అపాం పతిః - జలాధిపతి యగు వరుణుడు, ఏతే - వీరు, వరశాపయోః - వరశాపములయందు, ప్రభవః - సమర్థులగు, అన్యే - ఇతరులగు, విబుధాః చ - దేవతలు కూడ, నృపతేః - రాజుయొక్క, దేహే - దేహమునందు, భవంతి - ఉండెదరు, నృపః - రాజు, సర్వదేవమయః - సర్వదేవాత్మకుడు.

విష్ణువు, బ్రహ్మ, కైలాసాధిపతియగు శివుడు, ఇంద్రుడు, వాయువు, యముడు, సూర్యుడు, మేఘుడు, కుబేరుడు, చంద్రుడు, పృథివీ దేవత, అగ్ని, జలాధిపతియగు వరుణుడు మొదలగు దేవతలందరు వరములను గాని, శాపమును గాని ఇచ్చుటకు సమర్థులు. వీరందరు రాజుయొక్క దేహములో నుండెదరు. రాజు సర్వదేవతాస్వరూపుడు.

తస్మాన్మాం కర్మభిర్విప్రా యజధ్వం గతమత్సరాః ।
బలిం చ మహ్యం హరత మత్తోఽన్యః కోఽగ్రభుక్ పుమాన్॥28

విప్రాః - ఓ బ్రాహ్మణులారా!, తస్మాత్ - అందువలన, గతమత్సరాః - తొలగిన ఓర్వలేనిదనము గలవారై, మామ్ - నన్ను, కర్మభిః -

కర్మలచే, యజధ్వమ్ - ఆరాధించుడు, మహ్యమ్ - నా కొరకు, బలిం చ - పూజోపహారమును కూడ, హరత - సమర్పించుడు, మత్తః - నాకంటె, అన్యః - మరియొకడు, అగ్రభుక్ - అగ్రపూజను స్వీకరించే, పుమాన్ - పురుషుడు, కః - ఎవడు?

ఓ బ్రాహ్మణులారా! కావున, మీరు మీ ఓర్వలేనిదనమును త్రోసిపుచ్చి, కర్మల ద్వారా నన్నే ఆరాధించుడు. పూజోపహారములను నాకే సమర్పించుడు. అగ్రపూజను స్వీకరించదగిన యజ్ఞపురుషుడు నేను తక్క మరియొకడు ఎవడు గలడు?

మైత్రేయ ఉవాచ ।
ఇత్థం విపర్యయమతిః పాపీయానుత్పథం గతః ।
అనునీయమానస్తద్యాచ్ఞాం న చక్రే భ్రష్టమంగలః ॥ 29

ఇత్థమ్ - ఈ తీరున, విపర్యయమతిః - భ్రాంతి చెందిన బుద్ధి గలవాడు, పాపీయాన్ - పాప స్వభావము గలవాడు, ఉత్పథమ్ - తప్పుదారిని, గతః - పొందినవాడు, భ్రష్టమంగలః - నశించిన పుణ్యము గలవాడు అగు వేనుడు, అనునీయమానః - నచ్చచెప్పబడిన వాడైననూ, తత్-యాచ్ఞామ్ - వారి కోరికను, న చక్రే - చేయలేదు.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- ఓ విదురా! పాపస్వభావము గల వేనుని బుద్ధి భ్రాంతమై యుండెను. తప్పు దారిన నడిచే ఆ వేనుని పుణ్యము నశించెను. కావుననే, మహర్షులు నచ్చజెప్పిననూ, ఆతడు వారి కోరికను మన్నించలేదు.

ఇతి తేఽసత్కృతాస్తేన ద్విజాః పండితమానినా ।
భగ్నాయాం భవ్యయాచ్ఞాయాం తస్మై విదుర చుక్రుధుః ॥ 30

విదుర - ఓ విదురా!, ఇతి - ఈ విధముగా, పండితమానినా - తాను పండితుడనని భావించే, తేన - ఆ వేనునిచే, అసత్-కృతాః - అవమానించబడిన, తే - ఆ, ద్విజాః - బ్రాహ్మణులు, భవ్యయాచ్ఞాయామ్ -

గొప్ప కోరిక, భగ్నాయామ్ - భగ్నము కాగా, తస్మై - వాని కొరకు, చుక్రుధుః - కోపించిరి.

ఓ విదురా! తాను పండితుడనని తలపోసే ఆ వేనుడు ఈ విధముగా ఆ బ్రాహ్మణులను అవమానించి,.వారి భవ్యమగు (మంగళకరమగు) కోరికను భగ్నము చేసెను. అపుడు వారికి ఆతనిపై కోపము కలిగెను.

హన్యతాం హన్యతామేష పాపః ప్రకృతిదారుణః ।
జీవఞ్జగదసావాశు కురుతే భస్మసాద్ధ్రువమ్ ॥ 31

పాపః - పాపి, ప్రకృతిదారుణః - స్వభావము చేతనే క్రూరుడు అగు, ఏషః - ఈ వేనుడు, హన్యతామ్ - సంహరించబడుగాక!, హన్యతామ్ - సంహరించబడు గాక!, అసౌ - ఈతడు, జీవన్ - జీవించియున్నవాడై, ఆశు - శీఘ్రముగా, జగత్ - జగత్తును, ధ్రువమ్ - నిశ్చయముగా, భస్మసాత్ - బూడిదగా, కురుతే - చేయుచున్నాడు.

పాపి, స్వభావము చేతనే క్రూరుడు అగు ఈ వేనుని చంపుడు, చంపుడు. వీడు జీవించియున్నచో, సామ్రాజ్యమును తొందరలోనే నిశ్చయముగా బూడిదగా మార్చును.

నాయమర్హత్యసద్వృత్తో నరదేవవరాసనమ్ ।
యోఽధియజ్ఞపతిం విష్ణుం వినిందత్యనపత్రపః ॥ 32

అసత్-వృత్తః - దుష్టప్రవృత్తి గల, అయమ్ - ఈతడు, నరదేవవర -ఆసనమ్ - శ్రేష్ఠమగు రాజసింహాసనమును, న అర్హతి - తగడు, యః - ఏ ఈతడు, అనపత్రపః - సిగ్గు లేనివాడై, అధియజ్ఞపతిమ్ - యజ్ఞేశ్వరుడు పాలకుడు అగు, విష్ణుమ్ - శ్రీహరిని, వినిందతి - అధికముగా నిందించుచున్నాడో.

దుష్టప్రవృత్తిగల ఈ వేనుడు శ్రేష్ఠమగు రాజసింహాసనమునకు తగినవాడు కాదు. యజ్ఞేశ్వరుడై జగత్తును పాలించే శ్రీహరిని, ఈతడు సిగ్గును విడచి, అధికముగా నిందించుచున్నాడు.

కో వైనం పరిచక్షీత వేనమేకమృతేఽశుభమ్ ।
ప్రాప్త ఈదృశమైశ్వర్యం యదనుగ్రహభాజనః ॥ 33

అశుభమ్ - పాపియగు, వేనమ్ - వేనుని, ఏకమ్ - ఒక్కనిని, ఋతే - మినహాయించి, ఈదృశమ్- ఇట్టి, ఐశ్వర్యమ్ - ఐశ్వర్యమును, ప్రాప్తః - పొందినవాడు, యత్-అనుగ్రహభాజనః - ఏ శ్రీహరియొక్క అనుగ్రహమునకు పాత్రుడైనాడో, కః వా - ఎవడు, ఏనమ్ - ఈ శ్రీహరిని, పరిచక్షీత - నిందించును?

పాపియగు ఈ వేనుడు తాను ఎవని అనుగ్రహమునకు పాత్రుడై ఇట్టి మహైశ్వర్యమును పొందినాడో, అట్టి శ్రీహరిని నిందించుచున్నాడు. అట్టి పనిని ఈ వేనుడు ఒక్కడు తక్క మరియెవ్వరు చేయుదురు?

ఇత్థం వ్యవసితా హంతుమృషయో రూఢమన్యవః ।
నిజఘ్నుర్హుంకృతైర్వేనం హతమచ్యుతనిందయా ॥ 34

రూఢమన్యవః - స్పష్టముగా ప్రకటమైన కోపము గల, ఋషయః - మహర్షులు, ఇత్థమ్ - ఈ విధముగా, హంతుమ్ - సంహరించుటకు, వ్యవసితాః - నిశ్చయించుకున్నవారై, అచ్యుతనిందయా - శ్రీహరిని నిందించుటచే, హతమ్ - మృతప్రాయుడై ఉన్న, వేనమ్ - వేనుని, హుంకృతైః - హుంకారములచే, నిజఘ్నుః - సంహరించిరి.

మహర్షులలో కోపము స్పష్టముగా కానవచ్చుచుండెను. వారాతనిని సంహరించుటకే నిశ్చయించిరి. శ్రీహరిని నిందించి అతడు అప్పటికే మృతప్రాయుడై ఉండెను. వారు హుంకారములను చేయగానే అతడు మరణించెను.

ఋషిభిస్స్వాశ్రమపదం గతే పుత్రకళేవరమ్ ।
సునీథా పాలయామాస విద్యాయోగేన శోచతీ ॥ 35

ఋషిభిః - మహర్షులచే, స్వ-ఆశ్రమపదమ్ - తమ ఆశ్రమస్థానమును గురించి, గతే - వెళ్లబడగా, శోచతీ - దుఃఖించుచున్న, సునీథా -

సునీథ, పుత్రకలేవరమ్ - పుత్రుని దేహమును, విద్యాయోగేన - మంత్రమ హిమచే మరియు ఇతరోపాయములచే, పాలయామాస - కాపాడెను.

అప్పుడా మహర్షులు తమ తమ ఆశ్రమములకు వెళ్లిరి. సునీథ దుఃఖిస్తూనే, మంత్రప్రభావముచే మరియు ఇతరములగు ఉపాయములతో, తన పుత్రుని దేహమును కాపాడెను.

ఏకదా మునయస్తే తు సరస్వత్సలిలాప్లుతాః ।
హుత్వాఽగ్నీన్ సత్కథాశ్చక్రురుపవిష్టాస్సరిత్తటే ।। 36

ఏకదా - ఒకనాడు, తే - ఆ, మునయః తు - మహర్షులైతే, సరస్వ త్-సలిల-ఆప్లుతాః - సరస్వతీ నదిలో స్నానమును చేసినవారై, అగ్నీన్ - అగ్నులను, హుత్వా - హోమము చేసి, సరిత్-తటే - నదీతీరమునందు, ఉపవిష్టాః - కూర్చున్నవారై, సత్-కథాః - ఈశ్వరుని గాథలను, చక్రుః - చెప్పుకొనిరి.

ఒకనాడా మహర్షులు సరస్వతీనదిలో స్నానమాడి, అగ్నిహోత్రక ర్మను పూర్తి చేసుకొని, ఆ నది ఒడ్డున కూర్చుండి ఈశ్వరుని గాథలను చెప్పుకొనుచుండిరి.

వీక్ష్యోత్థితాన్ మహోత్పాతానాహుర్లోకభయంకరాన్ ।
అప్యభద్రమనాథాయా దస్యుభ్యో న భవేద్భువః ।। 37

లోకభయంకరాన్ - జనులకు భయమును గొల్పే, ఉత్థితాన్ - ఒక్క ఉదుటున బయట పడిన, మహా-ఉత్పాతాన్ - పెద్ద చెడు శకునము లను, వీక్ష్య - చూచి, ఆహుః - పలికిరి, అనాథాయాః - రాజు లేని, భువః - సామ్రాజ్యమునకు, దస్యుభ్యః - చోరుల వలన, అభద్రమ్ - అమంగళ ము, అపి న భవేత్ - కలుగదు గదా?

జనులకు మహాభయమును గొల్పే చెడు శకునములు ఒక్క ఉదు టున ఆవిర్భవించినవి. అపుడా మహర్షులు వాటిని చూచి ఇట్లు తలచిరి : రాజు లేని ఈ దేశమునకు చోరుల వలన అమంగళములు కలుగవు గదా?

**ఏవం మృశంత ఋషయో ధావతాం సర్వతోదిశమ్ ।**
**పాంసుస్సముత్థితో భూరిశ్చోరాణామపి లుంపతామ్ ॥ 38**

ఋషయః - మహర్షులు, ఏవమ్ - ఈ విధముగా, మృశంతః - ఆలోచించుచున్నవారు, లుంపతామ్ - దోపిడీని చేయుచున్నట్టియు, సర్వతః-దిశమ్ - అన్ని దిక్కులయందు, ధావతామ్ - పరుగులిడుచున్న, చోరాణామ్ - చోరులయొక్క, భూరిః - అధికమగు, పాంసుః అపి - ధూళి కూడ, సముత్థితః - బాగా పైకి లేచినది.

ఆ మహర్షులు ఈ విధముగా చర్చించుచుండిరి. ఇంతలోనే చోరులు దోపిడీలను చేయుచూ అన్ని దిక్కులయందు పరుగులను తీయు చుండగా, అధికమగు దుమ్ము బాగా పైకి లేచినది.

**తదుపద్రవమాజ్ఞాయ లోకస్య వసు లుంపతామ్ ।**
**భర్తర్యుపరతే తస్మిన్నన్యోఽన్యం చ జిఘాంసతామ్ ॥ 39**

**చోరప్రాయం జనపదం హీనసత్త్వమరాజకమ్ ।**
**లోకాన్నావారయన్ శక్తా అపి తద్దోషదర్శినః ॥ 40**

భర్తరి - రాజగు, తస్మిన్ - ఆ వేనుడు, ఉపరతే - మరణించగా, వసు - ధనమును, లుంపతామ్ - దోపిడీ చేయుచున్నవారియొక్క, చ - మరియు, అన్యోన్యమ్ - ఒకరినొకరు, జిఘాంసతామ్ - సంహరించగోరు వారియొక్క, తత్ - ఆ, లోకస్య - లోకమునకు, ఉపద్రవమ్ - బెడదను, చోరప్రాయమ్ - చోరులతో నిండియున్నట్టియు, హీనసత్త్వమ్ - విడువబ డిన ధైర్యము కలిగినట్టియు, అరాజకమ్ - రాజు లేని, జనపదమ్ - సామ్రా జ్యమును, ఆజ్ఞాయ - చూచి, శక్తాః అపి - సమర్థులే అయిననూ, తత్-దో షదర్శినః - అట్లు చేయుటలోని దోషమును దర్శించే మహర్షులు, లోకాన్ - జనులను, న అవారయన్ - వారించలేదు.

వేన మహారాజు మరణించగానే దోపిడీగాండ్రు దోపిడీలను చేయు చుండిరి. జనుల మధ్య వైరములు హింస పెచ్చరిల్లి జనులకు బెడద కలుగుచుండెను. రాజు లేని ఆ రాజ్యములో చోరుల బెడద పెరిగిపోయె

ము. జనులకు ధైర్యము క్షీణించెను. మహర్షులు ఈ పరిస్థితిని పరికించిరి. వారు దీనిని నివారించే సామర్థ్యము గలవారే అయినా, అట్టి రాజకీయము లలో తమకు దోషము సంక్రమించగలదనే భావనతో, వారు జనులను వారించలేదు.

బ్రాహ్మణస్సమదృక్ఛాంతో దీనానాం సముపేక్షకః ।
స్రవతే బ్రహ్మ తస్యాపి భిన్నభాండాత్పయో యథా ॥ 41

సమదృక్ - సర్వత్రా బ్రహ్మను దర్శించువాడు, శాంతః - శాంత మగు స్వభావము గలవాడు అగు, బ్రాహ్మణః - వేదవేత్తయైననూ, దీనా నామ్ - దీనులకు, సముపేక్షకః - ఉపేక్షించువాడైనచో, తస్య - వాని, బ్రహ్మ అపి - తపస్సు కూడ, భిన్నభాండాత్ - చిల్లు పడిన కుండనుండి, పయః యథా - నీరు (పాలు) వలె, స్రవతే - జారిపోవును.

సర్వత్రా పరబ్రహ్మను దర్శించే శాంతస్వభావము గల బ్రహ్మవేత్త యైననూ దీనులనుపేక్షించినచో, ఆయన తపస్సు చిల్లు పడిన కుండలోని నీరు (పాలు) వలె, క్షీణించిపోవును.

నాంగస్య వంశో రాజర్షేరేష సంస్థాతుమర్హతి ।
అమోఘవీర్యా హి నృపా వంశేఽస్మిన్ కేశవాశ్రయాః ॥ 42

రాజర్షేః - రాజర్షియగు, అంగస్య - అంగుని, ఏషః - ఈ, వంశః - వంశము, సంస్థాతుమ్ - అంతరించుటకు, న అర్హతి - తగదు, హి - ఏల యనగా, అస్మిన్ - ఈ, వంశే - వంశమునందలి, నృపాః - రాజులు, అమోఘవీర్యాః - మొక్కవోని పరాక్రమము గలవారు, కేశవ-ఆశ్రయాః - శ్రీహరిని శరణు పొందినవారు.

రాజర్షియగు అంగుని ఈ వంశము వినాశమగుట తగదు. ఏలయ నగా, ఈ వంశములోని రాజులు శ్రీహరిని శరణు జొచ్చి మొక్కవోని పరాక్ర మమును చూపినవారే.

వినిశ్చిత్యైవమృషయో విపన్నస్య మహీపతేః ।
మమంథురూరుం తరసా తత్రాసీద్బాహుకో నరః ॥ 43

ఋషయః - మహర్షులు, ఏవమ్ - ఈ విధముగా, వినిశ్చిత్య - నిశ్చయించి, విపన్నస్య - మరణించిన, మహీపతేః - వేనరాజుయొక్క, ఊరుమ్ - తొడను, తరసా - వేగముగా, మమంథుః - మథించిరి, తత్ర - దానినుండి, బాహుకః - పొట్టి, నరః - మానవుడు, ఆసీత్ - పుట్టెను.

ఆ మహర్షులు ఈ విధముగా నిశ్చయించుకొని, మరణించిన వేన రాజుయొక్క తొడను వేగముగా మథించగా, అక్కడనుండి ఒక పొట్టివాడు పుట్టెను.

కాకకృష్ణోఽతిహ్రస్వాంగో హ్రస్వబాహుర్మహాహనుః ।
హ్రస్వపాన్నిమ్నానాసాగ్రో రక్తాక్షస్తామ్రమూర్ధజః ॥ 44

కాకకృష్ణః - కాకివలె నల్లనివాడు, అతిహ్రస్వ-అంగః - మిక్కిలి పొట్టి శరీరము గలవాడు, హ్రస్వబాహుః - పొట్టి చేతులు గలవాడు, మహా హనుః - పెద్ద దవడలు గలవాడు, హ్రస్వపాత్ - పొట్టి కాళ్లు గలవాడు, నిమ్ననాసా-అగ్రః - చప్పిడి ముక్కు కొన గలవాడు, రక్త-అక్షః - ఎర్రని కన్నులు గలవాడు, తామ్రమూర్ధజః - రాగి జుట్టు గలవాడు.

కాకివలె నల్లని ఆ పురుషుని శరీరము మిక్కిలి పొట్టిగానుండెను. వాని చేతులు, కాళ్లు పొట్టి. కాని, దవడలు పెద్దవి. చప్పిడి ముక్కు కొన గల ఆ పురుషుని కన్నులు ఎర్రగనుండెను. వానికి రాగి రంగు జుట్టు ఉండెను.

తం తు తేఽవనతం దీనం కిం కరోమీతి వాదినమ్ ।
నిషీదేత్యబ్రువంస్తాత స నిషాదస్తతోఽభవత్ ॥ 45

తాత - ఓ వత్సా!, అవనతమ్ - తల దించుకొని ఉన్నట్టియు, దీనమ్ - దీనుడైనట్టియు, కిం కరోమి - నేను ఏమి చేయవలెను?, ఇతి - అని, వాదినమ్ - పలికిన, తం తు - ఆ వ్యక్తినైతే, నిషీద - కూర్చుండుము, ఇతి - అని, అబ్రువన్ - పలికిరి, తతః - అందువలన, సః - ఆతడు, నిషాదః - నిషాదుడు (అడవిలో వేటగాడు), అభవత్ - ఆయెను.

వత్సా విదురా! తల దించుకొని దీనుడైయున్న ఆ పురుషుడు, నేను ఏమి చేయాలి? అని వారిని ప్రశ్నించగా, వారాతనిని కూర్చుండుము అనిరి. వారు నిషీద (కూర్చుండుము) అని పలుకుట వలన, ఆతడు నిషాదుడు అయెను.

తస్య వంశ్యాస్తు నైషాదా గిరికాననగోచరాః ।
యేనాహరజ్జాయమానో వేనకల్మషముల్బణమ్ ॥ 46

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే చతుర్థస్కంధే పృథూపాఖ్యానే
వేనసంహారో నామ చతుర్దశోఽధ్యాయః ॥

తస్య - వాని, వంశ్యాః తు - వంశములో పుట్టినవారైతే, నైషాదాః - నైషాదులు, గిరికాననగోచరాః - పర్వతములయందు అడవులయందు సంచరించువారు, యేన - ఏ కారణముచేనైతే, జాయమానః - పుట్టుచున్న ఈతడు, ఉల్బణమ్ - భయంకరమగు, వేనకల్మషమ్ - వేనుని పాపమును, అహరత్ - తీసుకొనెనో.

వాని వంశీయులగు నైషాదులు కొండకోనలలో సంచరించెదరు. ఆతడు పుట్టుచుండగనే వేనుని భయంకరమగు పాపమును తీసుకొనెను.

శ్రీమద్భాగవత మహాపురాణములోని నాల్గవ స్కంధములో
పృథూపాఖ్యానమునందు వేనుని మృతిని వర్ణించే
పదునాల్గవ అధ్యాయము ముగిసినది (14).

*****

## అథ పంచదశోఽధ్యాయః

## పృథూపాఖ్యానము - పృథువు పట్టాభిషిక్తుడగుట

మైత్రేయ ఉవాచ ।
అథ తస్య పునర్విప్రైరపుత్రస్య మహీపతేః ।
బాహుభ్యాం మథ్యమానాభ్యాం మిథునం సమపద్యత ॥ 1

మైత్రేయః - మైత్రేయ మహర్షి, ఉవాచ - పలికెను, అథ - తరువాత, అపుత్రస్య - పుత్రుడు లేని, తస్య - ఆ, మహీపతేః - వేనరాజుయొక్క, పునః - మరల, విప్రైః - మహర్షులచే, మథ్యమానాభ్యామ్ - మథించబడుచున్న, బాహుభ్యామ్ - బాహువులనుండి, మిథునమ్ - జంట, సమపద్యత - పుట్టెను.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- తరువాత మరల ఆ మహర్షులు పుత్రసంతానము లేని ఆ వేనరాజుయొక్క భుజములను మథించగా, ఒక స్త్రీపురుషుల జంట పుట్టెను.

తద్దృష్ట్వా మిథునం జాతమృషయో బ్రహ్మవాదినః ।
ఊచుః పరమసంతుష్టా విదిత్వా భగవత్కలామ్ ॥ 2

జాతమ్ - పుట్టిన, తత్ - ఆ, మిథునమ్ - జంటను, దృష్ట్వా - చూచి, బ్రహ్మవాదినః - బ్రహ్మవేత్తలగు, ఋషయః - మహర్షులు, భగవత్ -కలామ్ - భగవానుని అంశను, విదిత్వా - తెలుసుకొని, పరమసంతుష్టాః - గొప్ప సంతోషమును పొందినవారై, ఊచుః - పలికిరి.

ఆ విధముగా పుట్టిన ఆ జంటను చూచి బ్రహ్మవేత్తలగు ఆ మహర్షులు వారిలో భగవానుని అంశను గుర్తించి చాల సంతోషించినవారై, ఇట్లు పలికిరి.

ఋషయ ఊచుః ।
ఏష విష్ణోర్భగవతః కలా భువనపాలినీ ।
ఇయం చ లక్ష్మ్యాస్సంభూతిః పురుషస్యానపాయినీ ।। 3

ఏషః - ఈతడు, భగవతః విష్ణోః - శ్రీహరి భగవానుని, భువనపాలినీ - లోకములను పాలించే, కలా - అంశ, ఇయం చ - ఈమె కూడ, పురుషస్య - పరమపురుషుడగు శ్రీహరియొక్క, అనపాయినీ - విడిచిపెట్టని, లక్ష్మ్యాః - లక్ష్మీదేవియొక్క, సంభూతిః - అవతారము.

మహర్షులు ఇట్లు పలికిరి --- ఈతడు శ్రీహరి భగవానుని లోకములను పాలించే అంశయే. పరమపురుషుడగు శ్రీహరిని లక్ష్మీదేవి ఏ కాలమునందైనా విడిచియుండదు. ఈమె అట్టి లక్ష్మీదేవియొక్క అవతారము.

అత్ర తు ప్రథమో రాజ్ఞాం పుమాన్ ప్రథయితా యశః ।
పృథుర్నామ మహారాజో భవిష్యతి పృథుశ్రవాః ।। 4

అత్ర తు - వీరిద్దరిలోనైతే, పుమాన్ - పురుషుడు, రాజ్ఞామ్ - రాజులలో, ప్రథమః - మొదటివాడై, యశః - కీర్తిని, ప్రథయితా - విస్తరింపజేయగలడు, పృథుః నామ - పృథువు అని ప్రసిద్ధిని గాంచిన, పృథుశ్రవాః - గొప్ప కీర్తిగల, మహారాజః - మహారాజు, భవిష్యతి - కాగలడు.

వీరిద్దరిలో పురుషుడు రాజులలో ప్రథముడై కీర్తిని విస్తరింప జేయగలడు. ఈతడు పృథువు అనే పేరుతో ప్రసిద్ధిని గాంచి, గొప్ప కీర్తి గల మహారాజు అగును.

ఇయం చ సుదతీ దేవీ గుణభూషణభూషణా ।
అర్చిర్నామ వరారోహా పృథుమేవావరుంధతీ ।। 5

సుదతీ - చక్కని దంతములు గలది, దేవీ - ప్రకాశించునది, గుణ భూషణభూషణా - గుణములకు భూషణములకు కూడ భూషణమైనది, వరారోహా - సుందరి అగు, ఇయం చ - ఈమె కూడ, అర్చిః నామ - అర్చి అని ప్రసిద్ధిని గాంచినదై, పృథుం ఏవ - పృథువునే, అవరుంధతీ - వశము చేసుకొనునది.

చక్కని దంతములతో ప్రకాశించే ఈ సుందరి గుణములకు, భూషణములకు కూడ అలంకారము. ఈమె కూడ అర్చి అనే పేరుతో ప్రసిద్ధిని గాంచి, పృథువును తన వశము చేసుకొనగలదు.

ఏష సాక్షాద్ధరేరంశో జాతో లోకరిరక్షయా ।
ఇయం చ తత్పరా హి శ్రీరనుజజ్ఞేఽనపాయినీ ।। 6

ఏషః - ఈతడు, సాక్షాత్ - సాక్షాత్తుగా, హరేః - శ్రీహరియొక్క, అంశః - అంశ, లోకరిరక్షయా - లోకములను రక్షించే కోరికతో, జాతః - పుట్టినాడు, తత్-పరా - ఆ శ్రీహరియే పరాయణముగా గలది, అనపాయినీ - ఆయనను విడిచిపెట్టనిది అగు, శ్రీః - లక్ష్మీదేవి, ఇయం చ - ఈమెయై, అనుజజ్ఞే హి - వెంటవెంటనే జన్మించెను గదా!

సాక్షాత్తుగా శ్రీహరియే లోకములను రక్షించగోరి ఈ పృథువు రూపములో అవతరించినాడు. లక్ష్మీదేవి శ్రీహరియే పరాయణము గలదియై, ఆయనను ఏ కాలమునందైననూ విడిచియుండదు. కావుననే, ఆయన వెంటవెంటనే లక్ష్మీదేవి ఈ అర్చియై అవతరించినది.

మైత్రేయ ఉవాచ ।
ప్రశంసంతి స్మ తం విప్రా గంధర్వప్రవరా జగుః ।
ముముచుస్సుమనోధారాస్సిద్ధా నృత్యంతి స్వఃస్త్రియః ।। 7

తమ్ - ఆ పృథువును, విప్రాః - బ్రాహ్మణులు, ప్రశంసంతి స్మ - కొనియాడిరి, గంధర్వప్రవరాః - గంధర్వులలో శ్రేష్ఠులైన తుంబురుడు మొదలగువారు, జగుః - గానమును చేసిరి, సిద్ధాః - సిద్ధులు, సుమనః-

ధారాః - పుష్పవర్షమును, ముముచుః - విడిచిపెట్టిరి, స్వః-స్త్రియః - అప్సరసలు, నృత్యంతి స్మ - నాట్యమాడిరి.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- బ్రాహ్మణులు ఆ పృథువును కొనియాడిరి. గంధర్వులలో ఉత్తములగు తుంబురుడు మొదలగువారు గానమును చేసిరి. సిద్ధులు పుష్పవృష్టిని కురిపించిరి. అప్సరసలు నాట్యమాడిరి.

శంఖతూర్యమృదంగాద్యా నేదుర్దుందుభయో దివి ।
తత్ర సర్వ ఉపాజగ్ముర్దేవర్షిపితౄణాం గణాః ॥ 8

శంఖతూర్యమృదంగ-ఆద్యాః - శంఖములు తూర్యములు మద్దెళ్లు మొదలగునవి, దుందుభయః - దుందుభులు, దివి - అంతరిక్షమునందు, నేదుః - మ్రోగినవి, తత్ర - అచటకు, దేవ-ఋషిపితౄణామ్ - దేవతల మహర్షుల మరియు పితృదేవతల, గణాః - గణములు, సర్వే - అన్నీ, ఉపాజగ్ముః - వచ్చినవి.

అంతరిక్షములో శంఖములు తూర్యములు మద్దెళ్లు దుందుభులు మొదలగు వాద్యములు మ్రోగినవి. అచటకు దేవతలు, మహర్షులు, పితృదేవతలు అందరు గణములుగా విచ్చేసిరి.

బ్రహ్మా జగద్గురుర్దేవైస్సహాసృత్య సురేశ్వరైః ।
వైన్యస్య దక్షిణే హస్తే దృష్ట్వా చిహ్నం గదాభృతః ॥ 9

పాదయోరరవిందం చ తం వై మేనే హరేః కలామ్ ।
యస్యాఽప్రతిహతం చక్రమంశస్స పరమేష్ఠినః ॥ 10

జగత్-గురుః - జగత్తునకు తండ్రియగు, బ్రహ్మా - బ్రహ్మగారు, సుర-ఈశ్వరైః - లోకపాలకులతో, దేవైః సహ - దేవతలతో గూడి, ఆసృత్య - వచ్చి, వైన్యస్య - వేనపుత్రుడగు పృథుని, దక్షిణే - కుడి, హస్తే - చేతియందు, గదాభృతః - గదాధారియగు శ్రీహరియొక్క, చిహ్నమ్ - గుర్తును, పాదయోః - పాదములయందు, అరవిందం చ - పద్మమును కూడ, దృష్ట్వా - చూచి, తమ్ - ఆ పృథువును, వై - నిశ్చయముగా, హరేః -

శ్రీహరియొక్క, కలామ్ - అంశగా, మేనే - తలచెను, యస్య - ఎవనికి, అప్రతిహతమ్ - ఇతరరేఖలచే భిన్నము కాని, చక్రమ్ - చక్రము ఉండునో, సః - వాడు, పరమేష్ఠినః - పరమేశ్వరుని, అంశః - అంశయే.

జగత్తునకు తండ్రియగు బ్రహ్మగారు దేవతలతో మరియు లోకపాలకులతో కూడి అచటకు వచ్చెను. ఆయన పృథువు కుడిచేతిలో గదాధారి యగు శ్రీహరియొక్క చిహ్నమగు చక్రమును, పాదములయందు పద్మమును చూచెను. ఎవని చేతిలో ఇతరరేఖలతో తెగిపోకుండా చక్రము ఉండునో, అతడు పరమేశ్వరుని అంశయే యగును.

తస్యాఽభిషేక ఆరబ్ధో బ్రాహ్మణైర్బ్రహ్మవాదిభిః ।
ఆభిషేచనికాన్ యస్మై ఆజహ్రుస్సర్వతో జనాః ॥ 11

బ్రహ్మవాదిభిః - వేదవేత్తలగు, బ్రాహ్మణైః - బ్రాహ్మణులచే, తస్య - ఆ పృథువుయొక్క, అభిషేకః - పట్టాభిషేకము, ఆరబ్ధః - ఆరంభించబడెను, యస్మై - ఎవని కొరకైతే, జనాః - జనులు, సర్వతః - అన్ని స్థానములనుండి, ఆభిషేచనికాన్ - అభిషేక ద్రవ్యములను, ఆజహ్రుః - తీసుకొని వచ్చిరో.

వేదవేత్తలగు బ్రాహ్మణులు ఆ పృథువుయొక్క పట్టాభిషేకమును ఆరంభించిరి. జనులు అన్ని దిక్కులనుండియు అభిషేక ద్రవ్యములను తీసుకు వచ్చిరి.

సరిత్సముద్రా గిరయో నాగా గావః ఖగా మృగాః ।
ద్యౌః క్షితిస్సర్వభూతాని సమాజహ్రురుపాయనమ్ ॥ 12

సరిత్-సముద్రాః - నదులు సముద్రములు, గిరయః - పర్వతములు, నాగాః - సర్పములు, గావః - గోవులు, ఖగాః - పక్షులు, మృగాః - మృగములు, ద్యౌః - ద్యులోకము, క్షితిః - భూదేవి, సర్వభూతాని - సకల ప్రాణులు, ఉపాయనమ్ - ఉపహారమును, సమాజహ్రుః - తీసుకు వచ్చిరి.

నదులు, సముద్రములు, పర్వతములు (వాటి అధిష్ఠాన దేవతలు), సర్పములు, గోవులు, పక్షులు, మృగములు, స్వర్గలోకము, భూదేవి, సకల ప్రాణులు బహుమతులను తీసుకు వచ్చారి.

సోఽభిషిక్తో మహారాజస్సువాసాస్సాధ్వలంకృతః ।
పత్న్యార్చిషాఽలంకృతయా విరేజేఽగ్నిరివాపరః ॥ 13

సువాసాః - చక్కని వస్త్రములను దాల్చినవాడు, సాధు - చక్కగా, అలంకృతః - అలంకరించబడిన, సః - ఆ పృథువు, మహారాజః - మహారాజుగా, అభిషిక్తః - అభిషేకించబడినవాడై, అలంకృతయా - అలంకరించబడిన, పత్న్యా - భార్యయగు, అర్చిషా - అర్చిస్సుతో, అపరః - రెండవ, అగ్నిః ఇవ - అగ్ని వలె, విరేజే - విశేషముగా ప్రకాశించెను.

చక్కని వస్త్రములను దాల్చి, బాగుగా అలంకరించబడిన పృథువు మహారాజుగా పట్టాభిషిక్తుడైనాడు. ఆతడు చక్కగా అలంకరించుకున్న తన భార్యయగు అర్చిస్సుతోగూడి రెండవ అగ్నివలె విశేషముగా ప్రకాశించెను.

తస్మై జహార ధనదో హైమం వీర వరాసనమ్ ।
వరుణస్సలిలస్రావమాతపత్రం శశిప్రభమ్ ॥ 14

వీర - వీరుడవగు ఓ విదురా!, తస్మై - వాని కొరకు, ధనదః - కుబేరుడు, హైమమ్ - బంగరు, వర-ఆసనమ్ - ఉత్తమమగు ఆసనమును, వరుణః - వరుణుడు, సలిలస్రావమ్ - నీరు స్రవించే, శశిప్రభమ్ - చంద్రుని కాంతివంటి కాంతి గల, ఆతపత్రమ్ - గొడుగును, జహార - తీసుకొని వచ్చెను.

వీరుడవగు ఓ విదురా! కుబేరుడు ఉత్తమమగు బంగరు సింహాసనమును, వరుణుడు నీటిని స్రవిస్తూ చంద్రుని వలె ప్రకాశించే శ్వేతచ్ఛత్రమును పృథువునకు బహుమతిగా ఇచ్చిరి.

వాయుశ్చ వాలవ్యజనే ధర్మః కీర్తిమయీం స్రజమ్ ।
ఇంద్రః కిరీటముత్కృష్టం దండం సంయమనం యమః ॥15

వాయుః చ - వాయువు కూడ, వాలవ్యజనే - వింజామరలను, ధర్మః - ధర్ముడు, కీర్తిమయీమ్ - కీర్తిని వర్ధిల్లజేసే, స్రజమ్ - మాలను, ఇంద్రః - ఇంద్రుడు, ఉత్కృష్టమ్ - చాల గొప్పదియగు, కిరీటమ్ - కిరీటమును, యమః - యముడు, సంయమనమ్ - శత్రువులను వశము చేసుకొనే, దండమ్ - దండమును (ఇచ్చిరి).

పృథువునకు వాయువు వింజామరలను, ధర్ముడు కీర్తిని వర్ధిల్లజేసే మాలను, ఇంద్రుడు చాల గొప్ప కిరీటమును, యముడు శత్రువులను వశము చేసుకొనే దండమును బహుమతులుగా ఇచ్చిరి.

బ్రహ్మ బ్రహ్మమయం వర్మ భారతీ హారముత్తమమ్ ।
హరిస్సుదర్శనం చక్రం తత్పత్న్యవ్యాహతాం శ్రియమ్ ॥16

బ్రహ్మ - బ్రహ్మగారు, బ్రహ్మమయమ్ - వేదరూపమగు, వర్మ - కవచమును, భారతీ - సరస్వతీ దేవి, ఉత్తమమ్ - ఉత్తమమగు, హారమ్ - హారమును, హరిః - శ్రీహరి, సుదర్శనమ్ - సుదర్శనమనే, చక్రమ్ - చక్రమును, తత్-పత్నీ - శ్రీహరి పత్నియగు లక్ష్మిదేవి, అవ్యాహతామ్ - నాశము లేని, శ్రియమ్ - సంపదను.

బ్రహ్మగారు వేదరూపమగు కవచమును, సరస్వతీ దేవి ఉత్తమమగు హారమును, శ్రీహరి సుదర్శన చక్రమును, ఆయన భార్యయగు లక్ష్మిదేవి నాశము లేని సంపదను పృథువునకు ఇచ్చిరి.

దశచంద్రమసిం రుద్రశ్శతచంద్రం తథాఽంబికా ।
సోమోఽమృతమయానశ్వాంస్త్వష్టా రూపాశ్రయం రథమ్॥17

రుద్రః - రుద్రుడు, దశచంద్రమ్ - పది చంద్రబింబముల (బుడిపెల) ఒర గల, అసిమ్ - కత్తిని, తథా - అదే విధముగా, అంబికా - పార్వతీ దేవి, శతచంద్రమ్ - వంద చంద్రబింబములు (బుడిపెలు) గల డాలును, సోమః - చంద్రుడు, అమృతమయాన్ - అమృతరూపములగు, అశ్వాన్ - గుర్రములను, త్వష్టా - త్వష్ట, రూప-ఆశ్రయమ్ - సౌందర్యమునకు నిధానమగు, రథమ్ - రథమును.

పృథువునకు రుద్రుడు కత్తినీయగా, పార్వతీదేవి డాలును ఇచ్చెను. ఆ కత్తి ఒరకు చంద్రబింబమును పోలియున్న పది బుడిపెలు, డాలుకు వంద బుడిపెలు ఉండెను. చంద్రుడు అలసట, మరణము లేని గుర్రముల నిచ్చెను. త్వష్ట (విశ్వకర్మ) సౌందర్యనిధానమగు రథమునిచ్చెను.

అగ్నిరాజగవం చాపం సూర్యో రశ్మిమయానిషూన్ ।
భూః పాదుకే యోగమయ్యౌ ద్యౌః పుష్పావలిమన్వహమ్ ॥ 18

అగ్నిః - అగ్ని, ఆజగవమ్ - మేక మరియు గోవుయొక్క కొమ్ములతో చేసిన, చాపమ్ - ధనస్సును, సూర్యః - సూర్యుడు, రశ్మిమయాన్ - రశ్మిరూపములగు, ఇషూన్ - బాణములను, భూః - భూదేవి, యోగమయ్యౌ - యథేచ్ఛాగమనశక్తి గల, పాదుకే - పాదరక్షలను, ద్యౌః - స్వర్గాధిష్ఠాన దేవత, అను-అహమ్ - ప్రతిరోజు, పుష్ప-అవలిమ్ - పుష్పమాలను.

అగ్ని పృథువునకు మేక మరియు గోవుయొక్క కొమ్ముతో చేసిన ధనస్సును, సూర్యుడు కిరణముల వలె వేగముగా పయనించే బాణములను, భూదేవి ఎక్కడికైననూ క్షణకాలములో తీసుకుపోయే శక్తి గల పాదరక్షలను, స్వర్గాధిష్ఠాన దేవత ప్రతిదినము పుష్పమాలను ఇచ్చిరి.

నాట్యం సుగీతం వాదిత్రమంతర్ధానం చ ఖేచరాః ।
ఋషయశ్చాశిషస్సత్యాస్సముద్రశ్శంఖమాత్మజమ్ ॥ 19

ఖేచరాః - ఆకాశసంచారులగు గంధర్వాదులు, నాట్యమ్ - నాట్యమును, సుగీతమ్ - చక్కని సంగీతమును, వాదిత్రమ్ - వాద్యమును, అంతర్ధానమ్ - అంతర్ధానమును, ఋషయః - మహర్షులు, సత్యాః - అమోఘములగు, ఆశిషః చ - ఆశీర్వచనములను, సముద్రః - సముద్రుడు, ఆత్మజమ్ - తనయందు పుట్టిన, శంఖమ్ - శంఖమును.

ఆకాశసంచారులగు గంధర్వాదులు పృథువునకు నాట్యములో, చక్కని సంగీతములో, వాద్యములను వాయించుటలో సామర్థ్యమును మాత్రమే గాక, అంతర్ధానమయ్యే శక్తిని కూడ ఇచ్చిరి. మహర్షులు

అమోఘములగు ఆశీర్వచనములను పలికిరి. సముద్రుడు తనలో పుట్టిన శంఖమును పృథువునకు ఇచ్చెను.

సింధవః పర్వతా నద్యో రథవీథీర్మహాత్మనః ।
సూతోఽథ మాగధో బందీ తం స్తోతుముపతస్థిరే ॥ 20

సింధవః - సముద్రములు, పర్వతాః - పర్వతములు, నద్యః - నదులు, మహా-ఆత్మనః - విశాలహృదయుడగు పృథువునకు, రథవీథీః - రథమార్గములను, అథ - తరువాత, సూతః - సూతుడు, మాగధః - మాగధుడు, బందీ - వంది, తమ్ - ఆ పృథువును, స్తోతుమ్ - స్తుతించుటకు, ఉపతస్థిరే - ఉపక్రమించిరి.

సముద్రములు, పర్వతములు, నదులు విశాలహృదయుడగు పృథువుయొక్క రథము తమగుండా నిరాటంకముగా పయనించునట్లు వరమునిచ్చినవి. అపుడు సూతుడు (పురాణకథలు తెలిసినవాడు), మాగధుడు (రాజుయొక్క వంశవృక్షము తెలిసినవాడు) మరియు వంది (తెలివిగా సందర్భోచితముగా మాటలాడువాడు) పృథువును స్తుతించుటకు ఉపక్రమించిరి.

స్తావకాంస్తానభిప్రేత్య పృథుర్వైన్యః ప్రతాపవాన్ ।
మేఘనిర్హ్రాదయా వాచా ప్రహసన్నిదమబ్రవీత్ ॥ 21

వైన్యః - వేనుని పుత్రుడు, ప్రతాపవాన్ - ప్రతాపము గలవాడు అగు, పృథుః - పృథువు, ప్రహసన్ - నవ్వుచున్నవాడై, తాన్ - వారిని, స్తావకాన్ - స్తోత్రము చేయుచున్నవారినిగా, అభిప్రేత్య - గమనించి, మేఘనిర్హ్రాదయా - మేఘముల ధ్వనివంటి ధ్వనిగల, వాచా - వాక్కుతో, ఇదమ్ - ఈ మాటను, అబ్రవీత్ - పలికెను.

స్తోత్రపాఠకులు స్తుతించుటకు ఉపక్రమించుచుండగా, ఆ విషయమును వేనుని పుత్రుడగు పృథువు గమనించెను. ప్రతాపశీలియగు ఆయన నవ్వుతూ మేఘధ్వనివలె గంభీరమగు వాక్కుతో ఆ స్తోత్రపాఠకులనుద్దేశించి ఇట్లు పలికెను.

పృథురువాచ ।
భోస్సూత హే మాగధ సౌమ్య వందిన్
లోకేఽధునాఽస్పష్టగుణస్య మే స్యాత్ ।
కిమాశ్రయో మే స్తవ ఏష యోజ్యతాం
మా మయ్యభూవన్ వితథా గిరో వః ॥ 22

భోః - ఓయీ!, సూత - సూతా!, మాగధ - మాగధా!, సౌమ్య - ప్రసన్నమగు శీలము గలవాడా!, వందిన్ - వందీ!, లోకే - లోకమునందు, అస్పష్టగుణస్య - స్పష్టము కాని గుణములు గల, మే - నాకు, అధునా - ఇప్పుడు, కిమ్-ఆశ్రయః - ఏ విషయము ఆధారముగా గల, స్తవః - స్తోత్రము, స్యాత్ - ఉండును?, ఏషః - ఈ స్తుతి, మే - నాకు, మా యోజ్యతామ్ - ప్రయోగించబడకుండు గాక!, మయి - నాయందు, వః - మీ, గిరః - వాక్కులు, వితథాః - వ్యర్థములు, అభూవన్ - అగును.

ఓయీ సూతా! ఓయీ మాగధా! ప్రసన్నమగు శీలము గల ఓ వందీ! నా గుణములు ఇంకనూ లోకములో వెల్లడి కాలేదు. అట్టి స్థితిలో ఇప్పుడు మీకు నన్ను స్తుతించుటకు విషయమేమున్నది? కావున, మీరు నన్ను స్తుతించవలదు. నన్ను స్తుతించుట ద్వారా మీ వాక్కులు పొల్లు కారాదు.

తస్మాత్పరోక్షేఽస్మదుపశ్రుతాన్యలం
కరిష్యథ స్తోత్రమపీచ్యవాచః ।
సత్యుత్తమశ్లోకగుణానువాదే
జుగుప్సితం న స్తవయంతి సభ్యాః ॥ 23

అపీచ్యవాచః - మధురమగు వాక్కులు గలవారా!, తస్మాత్ - కావున, పరోక్షే - మరియొక సమయమునందు (పరోక్షమునందు), అస్మత్-ఉపశ్రుతాని - మా కీర్తులను, అలమ్ - అధికముగా, స్తోత్రమ్ - స్తుతిని, కరిష్యథ - చేయగలరు, ఉత్తమశ్లోకగుణ-అనువాదే - పవిత్రమగు కీర్తిగల శ్రీహరియొక్క గుణగానము, సతి - ఉండగా, సభ్యాః - శిష్ట పురుషులు, జుగుప్సితమ్ - అల్పుడగు మానవుని, న స్తవయంతి - స్తుతించరు.

మీ వాక్కులు మధురమైనవి. కావున, మీరు మరియొక సమయములో నేను లేనప్పుడు నా కీర్తిని గురించి అధికముగా స్తుతించవచ్చును. పవిత్రమగు కీర్తి గల శ్రీహరియొక్క గుణగానము ఉండగా, శిష్ట పురుషులు అల్పుడగు మానవుని స్తుతించరు.

మహద్గుణానాత్మని కర్తుమీశః కః స్తావకైః స్తావయతేఽసతోఽపి ।
తేఽస్యాభవిష్యన్నితి విప్రలబ్ధో జనావహాసం కుమతిర్న వేద ।। 24

మహత్-గుణాన్ - మహాత్ముల గుణములను, ఆత్మని - తనయందు, కర్తుమ్ - కలుగునట్లు చేయుటకు, ఈశః అపి - సమర్థుడైననూ, కః - ఎవడు, స్తావకైః - స్తుతులను చేయువారిచే, అసతః - లేని గుణములను, స్తావయతే - స్తుతింప జేయును?, తే - ఆ గుణములు, అస్య - వీనికి, అభవిష్యన్ - కలిగి యుండెడివి, ఇతి - అని, విప్రలబ్ధః - నిందించబడినవాడై, కుమతిః - బుద్ధిహీనుడు, జన-అవహాసమ్ - జనుల అవహేళనను, న వేద - తెలియకుండును.

ఒకడు మహాత్ముల గుణములను తనలో సంపాదించుటయందు సమర్థుడు కావచ్చును. కాని, అట్టివాడు తనలో లేని గుణములను ఉటంకిస్తూ చేసే స్తుతులను ఎట్లు ఇతరులచే చేయించును? వీడు శ్రమించి ఉంటే ఈ గుణములు వీనిలో ఉండి ఉండెడివి అని జనులు అట్లు స్తుతులను చేయించుకొనే వ్యక్తిని నిందించెదరు. జనులు చేసే ఈ అవహేళనమును కూడ అట్టి మందబుద్ధి గ్రహించలేకపోవును.

ప్రభవో హ్యాత్మనః స్తోత్రం జుగుప్సంత్యపి విశ్రుతాః ।
హ్రీమంతః పరమోదారాః పౌరుషం వా విగర్హితమ్ ।। 25

హ్రీమంతః - వినయము గలవారు, పరమ-ఉదారాః - మిక్కిలి విశాలమగు హృదయము గలవారు, విశ్రుతాః - ప్రఖ్యాతిని గాంచినవారు, ప్రభవః అపి - సమర్థులే అయిననూ, ఆత్మనః - తన, స్తోత్రమ్ - స్తుతిని, విగర్హితమ్ - నిందించబడిన, పౌరుషం వా - పరాక్రమమును వలె, జుగుప్సంతి హి - ఏవగించుకొనెదరు గదా!

వినయము, గొప్ప ఔదార్యము గల వారు తాము అధర్మమార్గ ములో చూపిన నిందితమైన పత్యాశమునుయొక్క ప్రస్తావమును వినగించు కొనెదరు. అదే విధముగా, లోకప్రఖ్యాతిని గాంచినవారు సమర్థులే అయి ఉన్నమా, ఆత్మస్తుతిని వినగించుకొనెదరు.

వయం త్వవిదితా లోకే సూతాద్యాపి వరీమభిః ।
కర్మభిః కథమాత్మానం గాపయిష్యామ బాలవత్ ॥ 26

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే చతుర్థస్కంధే పృథూపాఖ్యానే
పృథుపట్టాభిషేకవర్ణనం నామ పంచదశోఽధ్యాయః ॥

సూత - ఓ సూతా!, వయం తు - మేమైతే, అద్య అపి - ఇప్ప టికీ, వరీమభిః - ఉత్తమములగు, కర్మభిః - కర్మలచే, లోకే - లోకెమునం దు, అవిదితాః - తెలియబడలేదు, ఆత్మానమ్ - నన్ను, బాలవత్ - అవివేకి వలె, కథమ్ - ఏ విధముగా, గాపయిష్యామ - స్తుతి చేయించవలెను?

ఓ సూతా! మేము ఇంకమా ఉత్తమమగు కర్మలను చేసి లోక ములో ప్రతిష్ఠను గడించినవారము కాము. అట్టిచో, అవివేకి వలె నా స్తుతిని నేనే ఎట్లు చేయించుకొన గల్గుదును?

శ్రీమద్భాగవత మహాపురాణములోని నాల్గవ స్కంధములో
పృథూపాఖ్యానమునందు పృథువు పట్టాభిషేకమును వర్ణించే
పదిహేనవ అధ్యాయము ముగిసినది (15).

*****

# అథ షోడశోऽధ్యాయః

## పృథూపాఖ్యానము - పృథువుయొక్క కీర్తిప్రతిష్ఠలు

మైత్రేయ ఉవాచ ।
ఇతి బ్రువాణం నృపతిం గాయకా మునిచోదితాః ।
తుష్టువుస్తుష్టమనసస్తద్వాగమృతసేవయా ॥ 1

మైత్రేయః - మైత్రేయ మహర్షి, ఉవాచ - పలికెను, ఇతి - ఈ విధముగా, బ్రువాణమ్ - పలుకుచున్న, నృపతిమ్ - పృథు మహారాజును, మునిచోదితాః - మహర్షులచే ప్రేరేపించబడిన, గాయకాః - గాయకులు, తత్-వాక్-అమృతసేవయా - ఆయన వాక్కు అనే అమృతమును సేవించుటచే, తుష్టమనసః - సంతోషించిన మనస్సులు గలవారై, తుష్టువుః - స్తుతించిరి.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- పృథు మహారాజుయొక్క అమృతమువంటి ఈ మాటలను విన్న గాయకుల మనస్సులు సంతోషముతో నిండిపోయెను. మహర్షులచే ప్రేరేపించబడినవారై ఆ గాయకులు ఇట్లు స్తుతించిరి.

నాలం వయం తే మహిమానువర్ణనే
యో దేవవర్యోऽవతతార మాయయా ।
వేనాంగజాతస్య చ పౌరుషాణి తే
వాచస్పతీనామపి బభ్రముర్ధియః ॥ 2

తే - నీ, మహిమా-అనువర్ణనే - మహిమలను వర్ణించుటయందు, వయమ్ - మేము, న అలమ్ - సమర్థులము కాము, దేవవర్యః - దేవతోత్త

ముడవగు, యః - ఏ నీవు, మాయయా - మాయాశక్తిచే (శక్తితో గూడి), అవతతార - అవతరించితివో, వేన-అంగజాతస్య - వేనుని దేహమునుండి పుట్టిన, తే - నీ, పౌరుషాణి - పౌరుషములను గురించి, వాచస్పతీనామ్ - వాక్కులకు ప్రభువులగు బ్రహ్మాదుల, ధియః అపి - బుద్ధులు కూడ, బభ్రముః - భ్రమించినవి.

నీవు దేవతోత్తముడవగు శ్రీహరివి. నీవు మాయాశక్తిచే (మాయాశక్తియగు అర్చిస్సుతో గూడి) అవతరించితివి. నీ ప్రభావముల విషయములో గొప్ప జ్ఞానులగు బ్రహ్మాదుల బుద్ధులు కూడ భ్రమలో పడుచుండును. అట్టి నీ మహిమలను వర్ణించుటకు మేము సమర్థులము కాము.

అథాప్యుదారశ్రవసః పృథోర్హరేః
కలాఽవతారస్య కథాఽమృతాదృతాః ।
యథోపదేశం మునిభిః ప్రచోదితాః
శ్లాఘ్యాని కర్మాణి వయం వితన్మహి ॥ 3

అథాపి - అయినప్పటికీ, ఉదారశ్రవసః - గొప్ప కీర్తి కలిగినట్టియు, హరేః - శ్రీహరియొక్క, కలా-అవతారస్య - అంశావతారమైన, పృథోః - పృథువుయొక్క, కథా-అమృత-ఆదృతాః - కథ అనే అమృతమునందు ఆదరము గల, వయమ్ - మేము, మునిభిః - మహర్షులచే, ప్రచోదితాః - ప్రేరేపించబడినవారమై, యథా-ఉపదేశమ్ - మహాత్ములు ఉపదేశించిన దానిని అతిక్రమించకుండగా, శ్లాఘ్యాని - కొనియాడదగిన, కర్మాణి - కర్మలను, వితన్మహి - విస్తారముగా వర్ణించెదము.

అయినప్పటికీ మీ గాథ అనే అమృతమునందు మాకు ఆదరము గలదు. కావున, మేము మహర్షుల ఉపదేశమును అతిక్రమించకుండగా వారిచే ప్రేరితులమై పృథు మహారాజు (మీ) యొక్క కొనియాడదగిన కర్మలను విస్తారముగా వర్ణించెదము. శ్రీహరియొక్క అంశావతారమగు మీ కీర్తి చాల గొప్పది.

ఏష ధర్మభృతాం శ్రేష్ఠో లోకం ధర్మేఽనువర్తయన్ ।
గోప్తా చ ధర్మసేతూనాం శాస్తా తత్పరిపంథినామ్ ॥ 4

ధర్మభృతామ్ - ధర్మమును పాలించువారిలో, శ్రేష్ఠః - ఉత్తముడగు, ఏషః - ఈ పృథువు, లోకమ్ - లోకమును, ధర్మే - ధర్మమునందు, అనువర్తయన్ - ప్రవర్తిల్ల జేయుచున్నవాడై, ధర్మసేతూనామ్ - ధర్మమర్యాదలకు, గోప్తా - రక్షకుడు కాగలడు, తత్-పరిపంథినామ్ - ధర్మమునకు విఘాతమును కలిగించువారలకు, శాస్తా - శిక్షకుడు కాగలడు.

ధర్మమును పాలించువారిలో ఉత్తముడగు ఈ పృథు మహారాజు జనులను ధర్మమునందు ప్రవర్తిల్ల జేయును. ఈయన ధర్మమర్యాదలను రక్షించి, ధర్మమునకు విఘాతమును కలిగించు వారలను శిక్షించగలడు.

ఏష వై లోకపాలానాం బిభర్త్యేకస్తనౌ తనూః ।
కాలే కాలే యథాభాగం లోకయోరుభయోర్హితమ్ ॥ 5

ఏషః - ఈతడు, ఏకః - ఒక్కడే, తనౌ - శరీరమునందు, లోకపాలానామ్ - లోకపాలకుల, తనూః - మూర్తులను, వై - నిశ్చయముగా, యథాభాగమ్ - యోగ్యతను ఉత్క్రమించకుండగా, ఉభయోః - రెండు, లోకయోః - లోకములకు, హితమ్ - హితము కలుగునట్లుగా, కాలే కాలే - ఆయా కాలములయందు, బిభర్తి - ధరించును.

ఈతడు ఒక్కడే తన శరీరమునందు ఆయా కాలములలో ఆయా రాజకార్యములకు అనురూపముగా లోకపాలకుల మూర్తులను నిశ్చయముగా ధరించును. ఈతడు అట్లు చేయుట వలన ఇహలోక (వర్షము వలన) పరలోకము (యజ్ఞము ద్వారా) లకు రెండింటికీ హితమును చేగూర్చును.

వసు కాల ఉపాదత్తే కాలే చాయం విముంచతి ।
సమస్సర్వేషు భూతేషు ప్రతపన్ సూర్యవద్విభుః ॥ 6

సర్వేషు - అన్ని, భూతేషు - ప్రాణులయందు, సమః - సమానమైనవాడు, సూర్యవత్ - సూర్యునివలె, ప్రతపన్ - ప్రకాశించుచున్నవాడు, విభుః - సమర్థుడు అగు, అయమ్ - ఈతడు, కాలే - తగిన కాలమునందు, వసు - సంపదను, ఉపాదత్తే - స్వీకరించును, చ - మరియు, కాలే - తగిన కాలమునందు, విముంచతి - విడిచిపెట్టును.

సూర్యుడు సర్వమును ప్రకాశింప చేయుచూ, సకలప్రాణులకు ప్రకాశమును శక్తిని సమానముగా ఇచ్చును. ఒక కాలములో నీటిని పైకి లాగివేసి, మరియొక కాలములో వర్షము రూపములో జనులకు ఇచ్చును. సర్వసమర్థుడగు ఈతడు కూడ సూర్యుని వలె ప్రకాశిస్తూ, ఒక కాలములో పన్నును వసూలు చేసి, మరియొక కాలములో ఆ ధనమును ప్రజల క్షేమ మునకే వినియోగించును. ఈతడు కూడ సకలజనుల యెడల పక్షపాతము లేని విధముగా వ్యవహరించును.

తితిక్షత్యక్రమం వైన్య ఉపర్యాక్రమతామపి ।
భూతానాం కరుణశ్శశ్వదార్తానాం క్షితవృత్తిమాన్ ॥ 7

కరుణః - దయాళువు, క్షితివృత్తిమాన్ - భూమియొక్క ప్రవృత్తి గలవాడు అగు, వైన్యః - వేనపుత్రుడగు పృథువు, ఉపరి - తనపై, ఆక్ర మతామ్ - దండెత్తే, ఆర్తానామ్ - ఆపదలను పొందియున్న దీనుల, అక్ర మం అపి - అపరాధమును కూడ, శశ్వత్ - అన్ని కాలములలో, తితిక్షతి - సహించును.

భూమి తనను తొక్కే జనుల అయోగ్యప్రవృత్తిని నిరంతరముగా సహించుచుండును. అదే విధముగా దయాళువగు ఈ వేనపుత్రుడు, దీనులు తన మీద పడిపోతున్నా, వారి అపరాధములను కూడ అన్ని కాల ములలో ఓపికతో సహించును.

దేవేఽవర్షత్యసౌ దేవో నరదేవవపుర్హరిః ।
కృచ్ఛ్రప్రాణాః ప్రజా హ్యేష రక్షిష్యత్యంజసేంద్రవత్ ॥ 8

దేవే - ఇంద్రుడు, అవర్షతి - వర్షించుట మానివేయగా, ఏషః - ఈ, దేవః - పృథు మహారాజు, కృచ్ఛ్రప్రాణాః - సంకటములో పడిన ప్రాణ ములు గల, ప్రజాః - ప్రజలను, అంజసా - తేలికగా, ఇంద్రవత్ - ఇంద్రుని వలె, రక్షిష్యతి - రక్షించగలడు, హి - ఏలయనగా, అసౌ - ఈతడు, నరదే వవపుః - రాజు రూపములోనున్న, హరిః - శ్రీహరి.

వర్షములు కురవక ప్రాణసంకటమును పొందియున్న ప్రజలను ఈతడు ఇంద్రుని వలె తేలికగా రక్షించగలడు. ఏలయనగా, ఈతడు మహారాజు రూపములోనున్న శ్రీహరియే.

**ఆప్యాయయత్యసౌ లోకం వదనామృతమూర్తినా ।**
**సానురాగావలోకేన విశదస్మితచారుణా ॥ 9**

**అసౌ** - ఈతడు, **స-అనురాగ-అవలోకేన** - ప్రేమతో కూడిన చూపు గలిగినట్టియు, **విశదస్మితచారుణా** - స్వచ్ఛమగు చిరునవ్వుతో సుందరమైన, **వదన-అమృతమూర్తినా** - చంద్రుని పోలిన ముఖముతో, **లోకమ్** - లోకమును, **ఆప్యాయయతి** - తృప్తిని కలిగించగలడు.

వెన్నెలవంటి స్వచ్ఛమగు నవ్వుతో, వెన్నెలవలె చల్లనైన ప్రేమను ఒలకబోసే ఈతని సుందరమగు ముఖము అమృతనిధానమగు చంద్రుని పోలియున్నది. ఈతని ముఖమును దర్శించుటచే జనులకు ఆహ్లాదము కలుగును.

**అవ్యక్తవర్త్మైష నిగూఢకార్యో**
**గంభీరవేధా ఉపగుప్తవిత్తః ।**
**అనంతమాహాత్మ్యగుణైకధామా**
**పృథుః ప్రచేతా ఇవ సంవృతాత్మా ॥ 10**

**అవ్యక్తవర్త్మా** - తెలియబడని మార్గము గలవాడు, **నిగూఢకార్యః** - అత్యంతరహస్యమగు కార్యములు గలవాడు, **గంభీరవేధాః** - నిబ్బరముగా పనులను చేయువాడు, **ఉపగుప్తవిత్తః** - సురక్షితమైన సంపద గలవాడు, **అనంతమాహాత్మ్యగుణ-ఏకధామా** - అనంతమగు మహిమ (అనంతుని ప్రభావము) గలవాడు మరియు సద్గుణములకు ఏకైక నిధానము అగు, **పృథుః** - పృథువు, **ప్రచేతాః ఇవ** - వరుణుడు వలె, **సంవృత-ఆత్మా** - నిగూఢమైన ఆలోచన గలవాడు.

వరుణుని (సముద్రుని) మార్గము జనులకు తెలియదు. సముద్రము చాల గంభీరముగా నుండును. దాని లోతులలో రత్నములు దాగి

యుండును. అనంతునకు నివాసమగు సముద్రము అనంతమగు మహిమలు గలది. ఈ పృథు చక్రవర్తి కూడ ఆ వరుణుని (సముద్రుని) వంటివాడే. ఏలయనగా, ఈతని ప్రవృత్తి జనులకు తెలిసిపోయేది కాదు. ఈయన ప్రజాకార్యములను నిశ్శబ్దముగా చేయుచుండును. వాటి ఫలము కనబడనంతవరకు ఆయన ఆ కార్యములను చేయుచున్నాడని ఊహించుటయైననూ జనులకు సంభవము కానంత రహస్యముగా ఈయన కార్యములను నిర్వర్తించును. ఈయన రాజ్యసంపదను భద్రముగా కాపాడును. అనంతుని అంశయగు ఈతని ప్రభావము కూడ అనంతమే. సకలసద్గుణములకు ఏకైక నిధానమగు ఈ పృథువు చేసే ఆలోచనను ముఖకవళికలను బట్టి ఊహించుట అసంభవము.

దురాసదో దుర్విషహ ఆసన్నోఽపి విదూరవత్ ।
నైవాభిభవితుం శక్యో వేనారణ్యుత్థితోఽనలః ।। 11

దురాసదః - సమీపించ శక్యము కానివాడు, దుర్విషహః - సహించ శక్యము కానివాడు, వేన-అరణి-ఉత్థితః - వేనుడు అనే అరణి నుండి పుట్టిన, అనలః - అగ్నియగు ఈ పృథువు, ఆసన్నః అపి - దగ్గరగా నున్నవాడైననూ, విదూరవత్ - దూరముగానున్నవాని వంటివాడు, అభిభవితుమ్ - తిరస్కరించుటకు, న ఏవ శక్యః - శక్యమైనవాడు కానే కాదు.

ఈ పృథువు వేనుడు అనే అరణి (నిప్పును మథించే కట్టె) నుండి పుట్టిన అగ్ని. శత్రువులకు ఈతనిని సమీపించుట గాని, ఈతని ప్రతాపమును సహించుట గాని సంభవము కాదు. ఈతడు గొప్ప పరాక్రమశాలి యగుటచే శత్రువులకు దగ్గరగా ఉన్నా, చాల దూరములోనున్న వానితో సమానము. కావున, శత్రువులీతనిని పరాభవించుటకు అవకాశము లేనే లేదు.

అంతర్బహిశ్చ భూతానాం పశ్యన్ కర్మాణి చారణైః ।
ఉదాసీన ఇవాధ్యక్షో వాయురాత్మేవ దేహినామ్ ।। 12

దేహినామ్ - ప్రాణులకు, ఆత్మా - అంతర్యామియగు, వాయుః ఇవ - వాయువు వలె, భూతానామ్ - జనుల (ప్రాణుల), అంతః - లోపల,

బహిః చ - బయట కూడ, కర్మాణి - చేష్టలను, చారణైః - చారులచే (చేష్ట లచే), పశ్యన్ - చూచుచున్నవాడై, ఉదాసీనః - ఉన్నతమగు సింహాసనము నందు కూర్చున్నవాడు (సాక్షియై), అధ్యక్షః ఇవ - వికారములు లేనివాడు వలె నుండును.

ఈతడు వాయువు వంటివాడు. అంతటా సంచరించే వాయువు సకలప్రాణుల లోపల అంతర్యామియై తన సన్నిధిలో ఘటిల్లే సకలచేష్ట లను నిర్వికారముగా కేవలసాక్షియై దర్శించుచుండును. అదే విధముగా, ఈతడు జనులు బహిరంగముగా చేసే పనులను, రహస్యముగా చేసే పనులను కూడ చారుల ద్వారా కనిపెట్టియుండును. ఉన్నతమగు సింహాస నము (రాజ్యాధికారము) ను అధిష్ఠించి ఉండే ఈ పృథువు జనుల నిందా స్తుతులలో నిర్వికారుడై కేవలసాక్షిగా రాజకార్యములను చక్కబెట్టును.

నాదండ్యం దండయత్యేష సుతమాత్మద్విషామపి ।
దండయత్యాత్మజమపి దండ్యం ధర్మపథే స్థితః ॥ 13

ధర్మపథే - ధర్మమార్గమునందు (యమధర్మరాజు పోకడలయం దు), స్థితః - ఉన్న, ఏషః - పృథువు, ఆత్మద్విషామ్ - తన శత్రువుల, సుతం అపి - కుమారుని యైననూ, అదండ్యమ్ - శిక్షకు అర్హుడు కానివాని ని, న దండయతి - శిక్షించదు, ఆత్మజం అపి - తన కొడుకే అయిననూ, దండ్యమ్ - శిక్షించ దగినవానిని, దండయతి - శిక్షించును.

ఈతడు యమధర్మరాజు వలె ధర్మమును ఖచ్చితముగా పాలిం చును. యమునకు ప్రాణుల యెడల పక్షపాత బుద్ధి లేదు. ఈతడు కూడ అదే విధముగా, శిక్ష పడకూడని వ్యక్తి తన శత్రువుల పుత్రుడే అయినా, శిక్ష వేయకుండగా విడిచిపెట్టును. శిక్ష పడదగిన వ్యక్తి తన కొడుకే అయినా, శిక్షించి తీరును.

అస్యాప్రతిహతం చక్రం పృథోరామానసాచలాత్ ।
వర్తతే భగవానర్కో యావత్తపతి గోగణైః ॥ 14

అన్వ - ఈ, పృథోః - పృథువుయొక్క, అప్రతిహతమ్ - ఎదురులే ని, చక్రమ్ - శాసనము (సేన, లేక రథగమనము), ఆ మానస-అచలాత్ - మానసపర్వతము వరకు, వర్తతే - ప్రవర్తిల్లును, యావత్ - ఎంతవరకైతే, భగవాన్ - పూజ్యుడగు, అర్కః - సూర్యుడు, గోగణైః - కిరణముల సమూహములతో, తపతి - తపించుచున్నాడో.

ఈ పృథువుయొక్క నిరాటంకమగు శాసనము (సైన్యము, లేక రథగమనము) మానస పర్వతము వరకు వ్యాపించును. సూర్యుడు తన కిరణముల సమూహములతో ప్రకాశించేది కూడ అంతవరకు మాత్రమే.

రంజయిష్యతి యల్లోకమయమాత్మవిచేష్టితైః ।
అథాముమాహూ రాజానం మనోరంజనకైః ప్రజాః ॥ 15

యత్ - ఏ కారణముచేనైతే, అయమ్ - ఈతడు, మనోరంజనకైః - మనస్సునకు ఆహ్లాదమును కలిగించే, ఆత్మవిచేష్టితైః - తన కార్యముల చే, లోకమ్ - లోకమును, రంజయిష్యతి - రంజిల్ల జేయగలడో, అథ - ఆ కారణముచే, అముమ్ - ఈతనిని, ప్రజాః - ప్రజలు, రాజానమ్ - రాజును గా, ఆహుః - పిలిచెదరు.

ఈతడు ప్రజల మనస్సునకు ఆహ్లాదమును కలిగించే తన కార్యముల ద్వారా జనులను రంజింపజేయును. ఆ కారణముచే ఈతనిని జనులు రాజు (రంజింప జేయువాడు) అని సార్థక నామముతో పిలిచెదరు.

దృఢవ్రతస్సత్యసంధో బ్రహ్మణ్యో వృద్ధసేవకః ।
శరణ్యస్సర్వభూతానాం మానదో దీనవత్సలః ॥ 16

దృఢవ్రతః - దృఢమగు నిష్ఠ గలవాడు, సత్యసంధః - సత్యము నకు కట్టుబడినవాడు, బ్రహ్మణ్యః - వేదవేత్తలయెడ భక్తి గలవాడు, వృద్ధసేవకః - పెద్దలను సేవించువాడు, సర్వభూతానామ్ - సకలప్రాణులకు, శరణ్యః - శరణు పొందదగినవాడు, మానదః - మర్యాదనిచ్చువాడు, దీనవత్సలః - దీనులయెడ ప్రేమ గలవాడు.

సత్యమునకు కట్టుబడి ఉండే ఈతడు దృఢమగు నిష్ఠను, వేదవే త్తల యెడల భక్తిని కలిగియుండును. ఈతడు పెద్దలను సేవిస్తూ, సకలప్రా ణులకు శరణు కాగలడు. ఇతరులకు మర్యాదనిచ్చే ఈ పృథువు దీనుల యెడల ప్రేమను కలిగియుండును.

మాతృభక్తిః పరస్త్రీషు పత్న్యామర్ధ ఇవాత్మనః ।
ప్రజాసు పితృవత్ స్నిగ్ధః కింకరో బ్రహ్మవాదినామ్ ॥ 17

పరస్త్రీషు - ఇతరుల భార్యలయందు, మాతృభక్తిః - తల్లియందు వలె భక్తి, ఆత్మనః - తన, పత్న్యామ్ - భార్యయందు, అర్ధే ఇవ - దేహ ములో సగభాగమునందు వలె, ప్రజాసు - ప్రజలయందు, పితృవత్ - తండ్రివలె, స్నిగ్ధః - ప్రేమ గలవాడు, బ్రహ్మవాదినామ్ - వేదవేత్తలకు, కింకరః - సేవకుడు.

ఈతడు పరభార్యలయందు తల్లియందు వలె భక్తిని కలిగియుండు ను. తన భార్యను తన శరీరములో సగభాగమును వలె ప్రేమించును. ప్రజ లను తండ్రివలె ప్రేమించును. వేదవేత్తలకు సేవకునివలె సేవను చేయును.

దేహినామాత్మవత్ప్రేష్ఠస్సుహృదాం నందివర్ధనః ।
ముక్తసంగప్రసంగోఽయం దండపాణిరసాధుషు ॥ 18

అయమ్ - ఈతడు, దేహినామ్ - ప్రాణులకు, ఆత్మవత్ - ఆత్మవ లె, ప్రేష్ఠః - మిక్కిలి ప్రియమైనవాడు, సుహృదామ్ - మిత్రులకు, నందివ ర్ధనః - ఆనందమును వర్ధిల్లజేయువాడు, ముక్తసంగప్రసంగః - సర్వసంగప రిత్యాగులయందు (సంగములేని శ్రీహరియందు) సత్సంగము గలవాడు, అసాధుషు - దుష్టులయందు, దండపాణిః - దండధారియగు యముడు.

ప్రాణులకు ఆత్మవలె మిక్కిలి ప్రియమైన ఈతడు మిత్రుల ఆనం దమును వర్ధిల్ల జేయును. సర్వసంగపరిత్యాగులతో సత్సంగము చేసే ఈతనికి ముక్తసంగుడగు శ్రీహరియందు భక్తి మెండు. ఈతడు దుష్టుల యెడల దండపాణియగు యమునివంటి వాడు.

అయం తు సాక్షాద్భగవాంస్త్ర్యధీశః
కూటస్థ ఆత్మా కలయాఽవతీర్ణః ।
యస్మిన్నవిద్యారచితం నిరర్థకం
పశ్యంతి నానాత్వమపి ప్రతీతమ్ ॥ 19

అయమ్ - ఈతడు, సాక్షాత్ - సాక్షాత్తుగా, కూటస్థః - నిర్వికారుడు, ఆత్మా - ఆత్మరూపుడు, కలయా - అంశచే (శక్తితో గూడి), అవతీర్ణః - అవతరించినవాడు, త్రి-అధి-ఈశః - ముల్లోకములకు (మూడు గుణములకు) ప్రభువు అగు, భగవాన్ - శ్రీహరి భగవానుడే, యస్మిన్ - ఏ భగవానునియందు, ప్రతీతం అపి - కానవచ్చేదే అయిననూ, నానాత్వమ్ - భేదమును, అవిద్యారచితమ్ - అజ్ఞానముచే కల్పితమైనదిగను, నిరర్థకమ్ - వాస్తవము కానిదిగను, పశ్యంతి - చూచుచున్నారో.

నిర్వికారుడు, సకలప్రాణుల ఆత్మరూపుడు, ముల్లోకములకు నాథుడు అగు శ్రీహరి భగవానుడే సాక్షాత్తుగా ఈతని రూపములో అంశచే అవతరించినాడు. శక్తిరూపిణియగు లక్ష్మీదేవి కూడ అర్చిస్సు రూపములో అవతరించినది. ప్రపంచము రూపములో కానవచ్చే ఈ భేదజాతము సత్త్వ రజస్తమోగుణాత్మకమగు ప్రకృతికి అధీశ్వరుడగు ఆయనయందే లేకున్ననూ ప్రకాశించుచున్నది. ఇట్టి నానాత్వము అజ్ఞానముచే కల్పించబడినదనియు, అవాస్తవమనియు మహాత్ములు దర్శించుచున్నారు.

అయం భువో మండలమోదయాద్రేః
గోప్త్రైకవీరో నరదేవనాథః ।
ఆస్థాయ జైత్రం రథమాత్తచాపః
పర్యస్యతే దక్షిణతో యథార్కః ॥ 20

ఏకవీరః - సాటిలేని వీరుడు, నరదేవనాథః - రాజాధిరాజు, ఆ-ఉదయ-అద్రేః - ఉదయపర్వతము వరకు, భువః - భూమియొక్క, మండలమ్ - మండలమును, గోప్తా - రక్షించువాడు అగు, అయమ్ - ఈతడు, జైత్రమ్ - జయమునిచ్చే, రథమ్ - రథమును, ఆస్థాయ - అధిష్ఠించి, ఆత్త

చాపః - ఎక్కుపెట్టబడిన ధనస్సు గలవాడై, అర్కః యథా - సూర్యుడు వలె, దక్షిణతః - ప్రదక్షిణముగా, పర్యస్యతే - తిరుగగలడు.

రాజాధిరాజగు ఈ పృథువు సాటిలేని వీరుడు. ఈతడు భూమండలమును ఉదయపర్వతము వరకు రక్షించును. ఈతడు జయప్రదమగు రథమునెక్కి ఉద్యతమగు ధనస్సు గలవాడై, సూర్యుడు వలె భూమండలమును ప్రదక్షిణము చేయును.

అస్మై నృపాలాః కిల తత్ర తత్ర
బలిం హరిష్యంతి సలోకపాలాః ।
మంస్యంత ఏషాం స్త్రియ ఆదిరాజం
చక్రాయుధం తద్యశ ఉద్ధరంత్యః ॥ 21

అస్మై - ఈతని కొరకు, సలోకపాలాః - లోకపాలకులతో కూడిన, నృపాలాః - రాజులు, తత్ర తత్ర - అక్కడక్కడ, బలిమ్ - కప్పమును, హరిష్యంతి కిల - సమర్పించగలరు సుమా!, తత్-యశః - ఆయన కీర్తిని, ఉద్ధరంత్యః - కీర్తించుచున్నవారై, ఏషామ్ - వీరి, స్త్రియః - భార్యలు, ఆదిరాజమ్ - ఆదిరాజగు ఈతనిని, చక్ర-ఆయుధమ్ - చక్రమే ఆయుధముగా గల శ్రీహరినిగా, మంస్యంతే - భావించగలరు.

ఈయన సామ్రాజ్యములో సంచరించుచుండగా అక్కడక్కడ లోకపాలకులు ఈయనకు పూజోపహారములను, రాజులు కప్పములను సమర్పించెదరు. ఆదిరాజగు ఈతడు సాక్షాత్తుగా చక్రాయుధుడగు శ్రీహరియే నని వారి పత్నులు ఈయన కీర్తిని గానము చేయుదురు.

అయం మహీం గాం దుదుహేఽధిరాజః
ప్రజాపతిర్వృత్తికరః ప్రజానామ్ ।
యో లీలయాఽద్రీన్ స్వశరాసకోట్యా
భిందన్ సమాం గామకరోద్యథేంద్రః ॥ 22

**అధిరాజః - రాజరాజు, ప్రజాపతిః - ప్రజలకు ప్రభువు, ప్రజానామ్ - ప్రజలకు, వృత్తికరః - జీవికను కల్పించువాడు అగు, అయమ్ - ఈతడు,**

గామ్ - గోవు రూపములోనున్న, మహీమ్ - భూమిని, దుదుహే - పితికె ను, యః - ఏ పృథువు, ఇంద్రః యథా - ఇంద్రుడు వలె, స్వశరాసకోట్యా - తన ధనస్సుయొక్క కొనతో, లీలయా - అవలీలగా, అద్రీన్ - పర్వతముల ను, భిందన్ - పగులగొట్టు చున్నవాడై, గామ్ - భూమిని, సమామ్ - సమ తలముగా, అకరోత్ - చేసెనో.

రాజాధిరాజగు ఈయన ప్రజలను పాలిస్తూ వారికి జీవికను కల్పించును. ఈయన ఆవు రూపములోనున్న భూమినుండి సకలసంపదలను పితుకును. ఈయన ఇంద్రుడు వలె తన ధనస్సు కొనతో అవలీలగా పర్వతములను పగులగొట్టి భూమిని సమతలముగా చేయును.

విస్ఫూర్జయన్నాజగవం ధనుస్స్వయం
యదాచరత్క్ష్మామవిషహ్యమాజౌ ।
తదా నిలిల్యుర్దిశి దిశ్యసంతో
లాంగూలముద్యమ్య యథా మృగేంద్రః ॥ 23

యదా - ఏ కాలములోనైతే, లాంగూలమ్ - తోకను, ఉద్యమ్య - పైకి ఎత్తి, మృగ-ఇంద్రః యథా - సింహము వలె, ఆజౌ - యుద్ధమునందు, అవిషహ్యమ్ - సహింప శక్యము కాని, అజగవమ్ - మేక ఆవుల కొమ్ములతో చేసిన, ధనుః - ధనస్సును, విస్ఫూర్జయన్ - టంకారము చేయుచున్నవాడై, క్ష్మామ్ - భూమిని, స్వయమ్ - స్వయముగా, అచరత్ - సంచరించెనో, తదా - అప్పుడు, అసంతః - దుష్టులు, దిశి దిశి - ప్రతి దిక్కునందు, నిలిల్యుః - దాగుకొనిరి.

సింహము తోకను పైకి ఎత్తి అడవిలో సంచరించే సమయములో క్షుద్రమృగములు నలు దిక్కులకు పారిపోయి దాగుకొనును. అదే విధముగా పృథువు మేక కొమ్ము ఆవు కొమ్ములతో చేసిన ధనస్సును పట్టుకొని యుద్ధరంగములో అడుగు పెట్టినప్పుడు ఆయన ఎదుట నిలబడుట శత్రువులకు సంభవము కాదు. ఆయన అట్టి ధనస్సును టంకారము చేయుచూ భూమండలమును సంచరించునప్పుడు, దుష్టులు నలు దిక్కులలో చెల్లాచెదరై దాగుకొనెదరు.

ఏషోఽశ్వమేధాన్ శతమాజహార
 సరస్వతీ ప్రాదురభావి యత్ర ।
అహారషీద్యస్య హయం పురందరః
 శతక్రతుశ్చరమే వర్తమానే ।। 24

ఏషః - ఈతడు, శతమ్ - వంద, అశ్వమేధాన్ - అశ్వమేధ యాగములను, ఆజహార - చేసెను, యత్ర - ఎక్కడనైతే, సరస్వతీ - సరస్వతీ నది, ప్రాదుః-అభావి - పుట్టెనో, చరమే - ఆఖరి యాగము, వర్తమానే - జరుగుచుండగా, శతక్రతుః - వంద యజ్ఞములను చేసినవాడు, పురందరః - శత్రునగరములను పగులగొట్టినవాడు అగు ఇంద్రుడు, యస్య - ఎవని, హయమ్ - గుఱ్ఱమును, అహారషీత్ - అపహరించెనో.

ఈతడు సరస్వతీ నది పుట్టిన చోట వంద అశ్వమేధ యాగములను చేయును. వంద యజ్ఞములను చేసి శత్రువుల నగరములను పగులగొట్టిన ఇంద్రుడు, వందవ యాగము జరుగుచుండగా, ఈతని గుఱ్ఱమును అపహరించును.

ఏష స్వసద్మోపవనే సమేత్య
 సనత్కుమారం భగవంతమేకమ్ ।
ఆరాధ్య భక్త్యాఽలభతామలం తజ్-
 జ్ఞానం యతో బ్రహ్మ పరం విదంతి ।। 25

ఏషః - ఈతడు, స్వసద్మ-ఉపవనే - తన ప్రాసాదమునకు ఆనుకొనియున్న ఉద్యాన వనమునందు, భగవంతమ్ - పూజ్యుడైన, ఏకమ్ - ఒంటరిగానున్న (సాటిలేని), సనత్కుమారమ్ - సనత్కుమారుని, సమేత్య - కలుసుకొని, భక్త్యా - భక్తితో, ఆరాధ్య - ఆరాధించి, తత్ - ఆ, అమలమ్ - శుద్ధమగు, జ్ఞానమ్ - జ్ఞానమును, అలభత - పొందెను, యతః - దేనివలన, పరం బ్రహ్మ - పరబ్రహ్మను, విదంతి - పొందెదరో.

ఈతడు తన ప్రాసాదమునకు ఆనుకొనియున్న ఉద్యాన వనములో పూజ్యుడు, సాటి లేనివాడు అగు సనత్కుమారుని ఒంటరిగా కలుసుకొని,

ఆయనను భక్తితో ఆరాధించి శుద్ధమగు ఆత్మజ్ఞానమును పొందును. ఈ జ్ఞానమును పొందినవారు బ్రహ్మభూతులగుదురు.

తత్ర తత్ర గిరస్తాస్తా ఇతి విశ్రుతవిక్రమః ।
శ్రోష్యత్యాత్మాశ్రితా గాథాః పృథుః పృథుపరాక్రమః ॥ 26

పృథుపరాక్రమః - గొప్ప పరాక్రమము గలవాడు, విశ్రుతవిక్రమః - లోకప్రఖ్యాతిని గాంచిన విక్రమము గలవాడు అగు, పృథుః - పృథువు, ఇతి - ఈ విధమైన, తాః తాః - ఆయా, ఆత్మా శ్రితాః - తనకు సంబంధించిన, గాథాః - గాథలరూపములోనుండే, గిరః - వచనములను, తత్ర తత్ర - అక్కడక్కడ, శ్రోష్యతి - వినగలడు.

ఈతడు లోకప్రఖ్యాతిని గాంచిన గొప్ప ధైర్యసాహసములు గలవాడు. ఈయనకు అక్కడక్కడ ఈ తీరున వర్ణించబడే తనకు సంబంధించిన ఆయా గాథలు వినబడుచునే యుండును.

దిశో విజిత్యాఽప్రతిరుద్ధచక్రః
స్వతేజసోత్పాటితలోకశల్యః ।
సురాసురేంద్రైరుపగీయమాన-
మహానుభావో భవితా పతిర్భువః ॥ 27

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే చతుర్థస్కంధే
పృథుకీర్తివర్ణనం నామ షోడశోఽధ్యాయః ॥

అప్రతిరుద్ధచక్రః - అడ్డుకొనబడని శాసనము (సైన్యము, లేక రథ చక్రముల గమనము) గలవాడు, స్వతేజసా - తన తేజస్సుతో, ఉత్పాటిత లోకశల్యః - పెరికివేయబడిన జనుల కష్టములు (జనకంటకులైన దుష్టులు) గలవాడు, సుర-అసుర-ఇంద్రైః - దేవతల మరియు రాక్షసుల నాయకులచే, ఉపగీయమానమహా-అనుభావః - కీర్తించబడుచున్న గొప్ప ప్రభావము గలవాడు అగు పృథువు, దిశః - దిక్కులను, విజిత్య - జయించి, భువః - భూమికి, పతిః - ప్రభువు, భవితా - కాగలడు.

ఈ పృథువుయొక్క శాసనమునకు (సైన్యమునకు, రథచక్రముల గమనమునకు) అడ్డు లేదు. ఈతడు జనకంటకులగు దుష్టులను సంహరించి జనుల కష్టములను తొలగించును. ఈతని కీర్తిని దేవనాయకులే గాక, అసురనాయకులు కూడ కీర్తించెదరు. ఈతడు దిక్కులను జయించి భూమికి ప్రభువు కాగలడు.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి నాల్గవ స్కంధములో
పృథూపాఖ్యానములో పృథువుయొక్క కీర్తిప్రతిష్ఠలను వర్ణించే
పదునారవ అధ్యాయము ముగిసినది (16).

*****

# అథ సప్తదశోఽధ్యాయః

## పృథూపాఖ్యానము - పృథివి శ్రీహరిని స్తుతించుట

మైత్రేయ ఉవాచ ।
ఏవం స భగవాన్ వైన్యః ఖ్యాపితో గుణకర్మభిః ।
ఛందయామాస తాన్ కామైః ప్రతిపూజ్యాభినంద్య చ ॥ 1

మైత్రేయః - మైత్రేయ మహర్షి, ఉవాచ - పలికెను, ఏవమ్ - ఈ విధముగా, భగవాన్ - పూజ్యుడగు, సః - ఆ, వైన్యః - వేనపుత్రుడగు పృథువు, గుణకర్మభిః - గుణములచే మరియు కర్మలచే, ఖ్యాపితః - స్తుతించబడినవాడై, తాన్ - వారిని, అభినంద్య - అభినందించి, చ - మరియు, కామైః - కోరికలచే, ప్రతిపూజ్య - సత్కరించి, ఛందయామాస - సంతోషపెట్టెను.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- పూజ్యుడగు ఆ వేనపుత్రుడైన పృథువును స్తోత్రపాఠకులు, ఆయన గుణములను మరియు కర్మలను వర్ణించి స్తుతించిరి. అపుడాయన వారిని అభినందించి, వారి కోరికలను తీర్చి, సత్కరించి సంతోషపెట్టెను.

బ్రాహ్మణప్రముఖాన్ వర్ణాన్ భృత్యామాత్యపురోధసః ।
పౌరాన్ జానపదాన్ శ్రేణీః ప్రకృతీస్సమపూజయత్ ॥ 2

బ్రాహ్మణప్రముఖాన్ - బ్రాహ్మణులు మొదలుగాగల, వర్ణాన్ - వర్ణములను, అమాత్యపురోధసః - మంత్రులను పురోహితులను, పౌరాన్ - నగరవాసులను, జానపదాన్ - పల్లె వాసులను, శ్రేణీః - అంగరక్షకులను, ప్రకృతీః - రాజ్యాధికారులను, భృత్యైః - భక్తితో, సమపూజయత్ - చక్కగా సత్కరించెను.

బ్రాహ్మణులు మొదలగు వర్ణములవారిని, మంత్రులను, పురోహితులను, నగరవాసులను, పల్లె వాసులను, అంగరక్షకులను, రాజ్యాధికారులను పృథువు భక్తితో చక్కగా సత్కరించెను.

విదుర ఉవాచ ।
కస్మాద్దధార గోరూపం ధరిత్రీ బహురూపిణీ ।
యాం దుదోహ పృథుస్తత్ర కో వత్సో దోహనం చ కిమ్ ॥ 3

బహురూపిణీ - అనేకరూపములు గల, ధరిత్రీ - భూదేవి, కస్మాత్ - ఎందువలన, గోరూపమ్ - గోరూపమును, దధార - ధరించెను?, యామ్ - ఏ గోవును, పృథుః - పృథువు, దుదోహ - పితికెనో, తత్ర - ఆ పితుకుటయందు, వత్సః - దూడ, కః - ఎవరు?, దోహనం చ - పాలు పితికే పాత్ర, కిమ్ - ఏయ్యది?

విదురుడు ఇట్లు పలికెను --- పృథువు గోరూపములోనున్న పృథివిని పితికెను గదా! అనేకరూపములను ధరించగల పృథివి గోరూపమును దాల్చుటకు కారణమేమి? ఆ పితుకుటలో దూడ ఎవరు? పాలను పితికే పాత్ర ఏది?

ప్రకృత్యా విషమా దేవీ కృతా తేన సమా కథమ్ ।
తస్య మేధ్యం హయం దేవః కస్య హేతోరపాహరత్ ॥ 4

ప్రకృత్యా - స్వభావముచే, విషమా - ఎగుడు దిగుడుగానుండే, దేవీ - భూదేవి, తేన - ఆ పృథువుచే, కథమ్ - ఏ విధముగా, సమా - సమానముగా, కృతా - చేయబడినది? తస్య - ఆ పృథువుయొక్క, మేధ్యమ్ - పవిత్రమగు, హయమ్ - గుర్రమును, దేవః - ఇంద్రదేవుడు, కస్య - ఏ, హేతోః - కారణము వలన, అపాహరత్ - అపహరించెను?

భూమి సహజముగా ఎగుడుదిగుడుగా నుండును. అట్టి భూమిని పృథువు సమతలముగా ఎట్లు చేసెను? పృథువుయొక్క పవిత్రమగు యాగాశ్వమును ఇంద్రదేవుడు అపహరించుటకు కారణమేమి?

సనత్కుమారాద్భగవతో బ్రహ్మన్ బ్రహ్మవిదుత్తమాత్ ।
లబ్ధ్వా జ్ఞానం సవిజ్ఞానం రాజర్షిః కాం గతిం గతః ॥ 5

బ్రహ్మన్ - ఓ మహాత్మా!, భగవతః - పూజ్యుడైనట్టియు, బ్రహ్మవిత్-ఉత్తమాత్ - బ్రహ్మవేత్తలలో ఉత్తముడగు, సనత్కుమారాత్ - సనత్కుమారుని వలన, సవిజ్ఞానమ్ - అపరోక్ష జ్ఞానముతో కూడిన, జ్ఞానమ్ - బ్రహ్మజ్ఞానమును, లబ్ధ్వా - పొంది, రాజ-ఋషిః - రాజర్షియగు పృథువు, కామ్ - ఏ, గతిమ్ - ఫలమును, గతః - పొందినాడు?

ఓ మహాత్మా! పూజ్యుడు, బ్రహ్మవేత్తలలో ముందుగా ఎన్నదగినవాడు అగు సనత్కుమారుని వద్ద రాజర్షియగు పృథువు బ్రహ్మజ్ఞానమును, బ్రహ్మసాక్షాత్కారమును పొందెను గదా! అతడు ఏ ఫలమును పొందినాడు?

యచ్చాన్యదపి కృష్ణస్య భవాన్ భగవతః ప్రభో ।
శ్రవస్సుశ్రవసః పుణ్యం పూర్వదేహకథాశ్రయమ్ ॥ 6

భక్తాయ మేఽనురక్తాయ తవ చాధోక్షజస్య చ ।
వక్తుమర్హసి యోఽదుహ్యద్వైన్యరూపేణ గామిమామ్ ॥ 7

ప్రభో - ఓ ప్రభూ!, సుశ్రవసః - మంచి కీర్తి గల, కృష్ణస్య భగవతః - శ్రీకృష్ణ భగవానునియొక్క, పూర్వదేహకథా-ఆశ్రయమ్ - పూర్వమునందలి అవతారమగు పృథువుయొక్క గాథ ఆశ్రయముగాగల, పుణ్యమ్ - పవిత్రమగు, శ్రవః - కీర్తి, అన్యత్ అపి - మరియొకటి కూడ, యత్ - ఏది గలదో దానిని, భవాన్ - నీవు, తవ - నీకు, చ - మరియు, అధోక్షజస్య చ - శ్రీహరికి కూడ, భక్తాయ - భక్తుడనైనట్టియు, అనురక్తాయ - అనురాగము గల, మే - నా కొరకు, వక్తుమ్ - చెప్పుటకు, అర్హసి - తగుదువు, యః - ఏ శ్రీకృష్ణుడు, వైన్యరూపేణ - పృథువు రూపముతో, ఇమామ్ - ఈ, గామ్ - భూమిని, అదుహ్యత్ - పితికెనో.

ఓ ప్రభూ! ఇంద్రియములకు గోచరుడు కాని శ్రీకృష్ణ భగవానుడు పూర్వావతారములో వేనుని పుత్రుడగు పృథువుగా అవతరించి భూమిని

పితికినాడు. ఆ పృథువుయొక్క గాథ విషయముగా గల భగవానుని పవిత్రకీర్తి ఇంకనూ ఏమైన వేను ప్రస్తావించనిది ఉన్నచో, దానిని కూడ నీవు నాకు చెప్ప దగుదువు. గొప్ప కీర్తి గల భగవానునియందు మరియు నీయందు కూడ నాకు భక్తి, అనురాగము గలవు.

సూత ఉవాచ ।
చోదితో విదురేణైవం వాసుదేవకథాం ప్రతి ।
ప్రశస్య తం ప్రీతమనా మైత్రేయః ప్రత్యభాషత ।। 8

ఏవమ్ - ఈ విధముగా, విదురేణ - విదురునిచే, వాసుదేవకథాం ప్రతి - వాసుదేవుని గాథను గురించి, చోదితః - ప్రేరేపించబడిన, మైత్రేయః - మైత్రేయ మహర్షి, ప్రీతమనాః - సంతసించిన మనస్సు గలవాడై, తమ్ - ఆ విదురుని, ప్రశస్య - కొనియాడి, ప్రతి-అభాషత - బదులు చెప్పెను.

సూత మహర్షి ఇట్లు పలికెను --- ఈ విధముగా విదురుడు వాసుదేవుని గాథను చెప్పుమని ప్రేరేపించగా, మైత్రేయ మహర్షి మనస్సులో చాల సంతసమును పొందెను. ఆయన విదురుని కొనియాడి ఇట్లు బదులు చెప్పెను.

మైత్రేయ ఉవాచ ।
యదాభిషిక్తః పృథురంగ విప్రైరామంత్రితో జనతాయాశ్చ పాలః ।
ప్రజా నిరన్నే క్షితిపృష్ఠ ఏత్య క్షుత్క్షామదేహాః పతిమభ్యవోచన్ ।।9

అంగ - ఓ విదురా!, యదా - ఏ కాలమునందైతే, పృథుః - పృథువు, విప్రైః - మహర్షులచే, అభిషిక్తః - అభిషేకించబడినవాడై, జనతాయాః - ప్రజల, పాలః - పాలకుడుగా, ఆమంత్రితః - నియోగించబడినాడో అప్పుడు, నిరన్నే - ఆహారము లేని, క్షితిపృష్ఠే - భూతలమునందు, క్షుత్-క్షామదేహాః - ఆకలిచే కృశించిన దేహములు గల, ప్రజాః - జనులు, ఏత్య - వచ్చి, పతిమ్ - రాజును, అభి-అవోచన్ - ఎదురుగా ఇట్లు పలికిరి.

ఓ విదురా! మహర్షులు పృథువును అభిషేకించి ప్రజాపాలకునిగా నియోగించిరి. అప్పుడు సామ్రాజ్యములో ప్రజలకు తిండి లేకుండెను. వారు ఆకలితో కృశించిన దేహములను కలిగియుండిరి. వారు వచ్చి రాజునకు ఎదురుగా ఇట్లు విన్నవించుకొనిరి.

వయం రాజన్ జాఠరేణాభితప్తా
యథాగ్నినా కోటరస్థేన వృక్షాః ।
త్వామద్య యాతాశ్శరణం శరణ్యం
యస్సాధితో వృత్తికరః పతిర్నః ॥ 10

రాజన్ - రాజా!, కోటరస్థేన - తొర్రయందున్న, అగ్నినా - నిప్పుతో, వృక్షాః యథా - చెట్లు వలె, జాఠరేణ - జఠరమునందున్న, అగ్నినా - అగ్నిచే, అభితప్తాః - అధికముగా తపింప జేయబడిన, వయమ్ - మేము, అద్య - ఈ నాడు, శరణ్యమ్ - శరణు పొందదగిన, త్వామ్ - నిన్ను, శరణమ్ - శరణమును, యాతాః - పొందినాము, యః - ఏ నీవు, నః - మాకు, వృత్తికరః - జీవికను కల్పించే, పతిః - ప్రభువుగా, సాధితః - సంపాదించబడినావో.

ఓ రాజా! తొర్రలో నిప్పు ఉన్న చెట్లు వలె, మేము కడుపులలోని ఈ జఠరాగ్నిచే తపింపజేయబడుచున్నాము. అనగా, ఆకలికి మల మల మాడుచున్నాము. ఈనాడు మేము నిన్ను శరణు పొందినాము. నీవు శరణు పొందినవారిని రక్షించువాడవు. నిన్ను మహర్షులు వేనుని శరీరమును మథించి సంపాదించి, మాకు ప్రభువుగా అభిషేకించినారు.

తన్నో భవానీహతు రాతవేఽన్నం
క్షుధాఽర్దితానాం నరదేవదేవ ।
యావన్న నఙ్క్ష్యామహ ఉజ్ఝితోర్జా
వార్తాపతిస్త్వం కిల లోకపాలః ॥ 11

నరదేవదేవ - ఓ రాజాధిరాజా!, తత్ - కావున, భవాన్ - నీవు, క్షుధా - ఆకలిచే, అర్దితానామ్ - పీడించబడిన, నః - మాకు, అన్నమ్ -

ఆహారమును, రాతవే - ఇచ్చుట కొరకు, ఈహతు - ప్రయత్నమును చేయుదువు గాక!, యావత్ - ఎంతలో, ఉజ్ఝిత-ఊర్జాః - విడువబడిన అన్నము గల మేము, న నంక్ష్యామహే - నశించిపోమో, త్వమ్ - నీవు, వార్తాపతిః - జీవికకు ప్రభువగు, లోకపాలః కిల - జనులను పాలించే రాజువు గదా!

ఓ రాజాధిరాజా! మేము తిండి తిని రోజులు అయినది. మేము ఆకలితో మాడిపోవుచున్నాము. మా ప్రాణములు పోయే లోపులో మాకు అన్నమును పెట్టే వ్యవస్థను నీవు చేయుము. నీవు జనులను పాలించే రాజువు. జనులకు జీవికను కల్పించవలసినది నీవే గదా!

మైత్రేయ ఉవాచ ।
పృథుః ప్రజానాం కరుణం నిశమ్య పరిదేవితమ్ ।
దీర్ఘం దధ్యౌ కురుశ్రేష్ఠ నిమిత్తం సోఽన్వపద్యత ॥ 12

కురుశ్రేష్ఠ - కురువంశములో ఉత్తముడవగు ఓ విదురా!, ప్రజానామ్ - జనుల, కరుణమ్ - జాలిని గొలిపే, పరిదేవితమ్ - విలాపమును, నిశమ్య - విని, సః - ఆ పృథువు, దీర్ఘమ్ - చాల సేపు, దధ్యౌ - ఆలోచించెను, నిమిత్తమ్ - కారణమును, అను-అపద్యత - తెలుసుకొనెను.

కురువంశములో ఉత్తముడవగు ఓ విదురా! ప్రజల ఈ జాలిని గొలిపే గోడును విని ఆ పృథువు దీర్ఘముగా ఆలోచించెను. అపుడాతనికి కరువునకు గల కారణము అవగతమయ్యెను.

ఇతి వ్యవసితో బుద్ధ్యా ప్రగృహీతశరాసనః ।
సందధే విశిఖం భూమేః క్రుద్ధస్త్రిపురహా యథా ॥ 13

ఇతి - ఈ విధముగా, బుద్ధ్యా - బుద్ధిచే, వ్యవసితః - నిశ్చయించుకున్నవాడై, ప్రగృహీతశర-ఆసనః - స్వీకరించబడిన ధనస్సు గలవాడై, భూమేః - భూదేవికి, క్రుద్ధః - కోపించినవాడై, త్రిపురహా యథా - త్రిపురాసుర సంహారకుడగు శివుడు వలె, విశిఖమ్ - బాణమును, సందధే - ఎక్కుపెట్టెను.

అతడు తాను చేయవలసిన పనిని బుద్ధిలో నిశ్చయించుకొని, ధనస్సును చేతిలోనికి తీసుకొనెను. ఆయనకు భూదేవిపై చాల కోపము వచ్చెను. అపుడాతడు త్రిపురాసురులను సంహరించిన శివుని వలె బాణమును ఎక్కు పెట్టెను.

ప్రవేపమానా ధరణీ నిశామ్యోదాయుధం చ తమ్ ।
గౌస్సత్యపాద్రవద్భీతా మృగీవ మృగయుద్రుతా ॥ 14

ఉత్-ఆయుధమ్ - ఎక్కు పెట్టబడిన ఆయుధము గల, తమ్ - ఆ పృథువును, నిశామ్య - చూచి, ధరణీ - పృథివి, ప్రవేపమానా - వణికిపోవుచున్నదై, గౌః సతీ - ఆవుగా అయినదై, మృగయుద్రుతా - వేటగానిచే తరుమబడినదై, భీతా - భయపడిపోయిన, మృగీ ఇవ - లేడి వలె, అప-అద్రవత్ - దూరముగా పారిపోయెను.

పృథువు ధనస్సునెక్కుపెట్టుటను గాంచిన భూమి భయముతో వణికిపోతూ గోరూపమును దాల్చి, వేటగాడు తరుముకొచ్చిన లేడి వలె, పారిపోయెను.

తామన్వధావత్తద్వైన్యః కుపితోఽత్యరుణేక్షణః ।
శరం ధనుషి సంధాయ యత్ర యత్ర పలాయతే ॥ 15

తత్ - అప్పుడు, కుపితః - కోపించినవాడు, అతి-అరుణ-ఈక్షణః - మిక్కిలి ఎర్రని కన్నులు గలవాడు అగు, వైన్యః - వేనపుత్రుడగు పృథువు, ధనుషి - ధనస్సునందు, శరమ్ - బాణమును, సంధాయ - ఎక్కుపెట్టి, తామ్ - ఆమెను, అను-అధావత్ - వెంట పరుగెత్తెను, యత్ర యత్ర - ఎక్కడెక్కడికి, పలాయతే - పారిపోవుచున్నదో.

అప్పుడు కోపముతో చాల ఎరుపెక్కిన కన్నులు గల పృథువు ధనస్సునందు బాణమునెక్కుపెట్టి, ఆ గోవు పరుగెత్తిన ప్రదేశములన్నింటికీ దాని వెనుక పరుగెత్తెను.

సా దిశో విదిశో దేవీ రోదసీ చాంతరం తయోః ।
ధావంతీ తత్ర తత్రైనం దదర్శానూద్యతాయుధమ్ ॥ 16

సా - ఆ, దేవీ - భూదేవి, దిశః - దిక్కులను, విదిశః - విదిక్కులను, రోదసీ - భూలోక స్వర్గలోకములను, తయోః - వాటి, అంతరం చ - అంతరాళ దేశమును కూడ, ధావంతీ - పరుగెత్తుచున్నదై, తత్ర తత్ర - అక్కడక్కడ, అను - వెనుక, ఉద్యత-ఆయుధమ్ - ఎక్కుపెట్టబడిన ఆయుధము గల, ఏనమ్ - ఈ పృథువును, దదర్శ - చూచెను.

ఆ భూదేవి దిక్కులలో, విదిక్కులలో, భూలోకములో, స్వర్గలోకములో, అంతరిక్షములో అంతటా ఎక్కడకు పరుగెత్తినా, అక్కడ ఆమెకు తన వెనుక బాణమునెక్కుపెట్టిన పృథువే కానవచ్చెను.

లోకే నావిందత త్రాణం వైన్యాన్మృత్యోరివ ప్రజాః ।
త్రస్తా తదా నివవృతే హృదయేన విదూయతా ॥ 17

త్రస్తా - భయపడిపోయిన పృథివి, లోకే - లోకమునందు, వైన్యాత్ - వేనపుత్రుడగు పృథువునుండి, ప్రజాః - ప్రజలు, మృత్యోః ఇవ - మృత్యువునుండి వలె, త్రాణమ్ - రక్షణను, న అవిందత - పొందలేదు, తదా - అప్పుడు, విదూయతా - కలత జెందిన, హృదయేన - హృదయముతో, నివవృతే - మరలి వచ్చెను.

లోకములో జనులను మృత్యువునుండి రక్షించగలవారు లేరు. అదే విధముగా, భయపడిపోయిన ఆ భూదేవికి లోకములో పృథువుమండి రక్షించేవారు కనబడలేదు. అపుడామె కలత జెందిన మనస్సుతో వెనుకకు తిరిగి వచ్చెను.

ఉవాచ చ మహాభాగం ధర్మజ్ఞాఽఽపన్నవత్సల ।
త్రాహి మామపి భూతానాం పాలనేఽవస్థితో భవాన్ ॥ 18

మహాభాగమ్ - మహాత్ముడగు పృథువునుద్దేశించి, ఉవాచ చ - పలికెను, ధర్మజ్ఞ - ధర్మమునెరింగినవాడా!, ఆపన్నవత్సల - ఆపదలలో నున్నవారియెడల ప్రేమ గలవాడా!, మాం అపి - నన్ను కూడ, త్రాహి - రక్షించుము, భవాన్ - నీవు, భూతానామ్ - ప్రాణుల, పాలనే - రక్షణయందు, అవస్థితః - నిష్ఠ గలవాడవు.

ఆ పృథివి మహాత్ముడగు పృథువుతో నిట్లనెను : ధర్మమునెరింగిన ఓ పృథూ! నీవు ఆపదలలోనున్నవారి యెడల ప్రేమ గలవాడవు. నన్ను కూడ రక్షించుము. ప్రాణులను రక్షించుటలో నీకు నిష్ఠ కలదు గదా!

స త్వం జిఘాంససే కస్మాద్దీనామకృతకిల్బిషామ్ ।
అహనిష్యత్కథం యోషాం ధర్మజ్ఞ ఇతి యో మతః ॥ 19

సః - అట్టి, త్వమ్ - నీవు, దీనామ్ - దీనురాలను, అకృతకిల్బిషామ్ - చేయబడని పాపము గలదానను అగు నన్ను, కస్మాత్ - ఏ కారణము వలన, జిఘాంససే - సంహరించ గోరుచున్నావు?, యః - ఎవడైతే, ధర్మజ్ఞః - ధర్మమునెరిగినవాడు, ఇతి - అని, మతః - అంగీకరించబడినాడో ఆతడు, యోషామ్ - స్త్రీని, కథమ్ - ఏ విధముగా, అహనిష్యత్ - చంపగలడు?

అట్టి నీవు దీనురాలనగు నన్ను ఏల చంప గోరుచున్నావు? నేను ఏ పాపమునూ చేయలేదు. నీవు ధర్మజ్ఞుడవని ప్రఖ్యాతి. నీవు స్త్రీని చంపుట ధర్మము ఎట్లు అగును?

ప్రహరంతి న వై స్త్రీషు కృతాగస్స్వపి జంతవః ।
కిముత త్వద్విధా రాజన్ కరుణా దీనవత్సలాః ॥ 20

రాజన్ - ఓ రాజా!, జంతవః - ప్రాణులు (మూర్ఖులు), కృత-ఆగస్సు - చేయబడిన అపరాధము గల, స్త్రీషు అపి - స్త్రీలయందు కూడ, న ప్రహరంతి - ఆయుధమును ప్రయోగించరు, వై - నిశ్చయము, కరుణాః - దయామయులు, దీనవత్సలాః - దీనులయందు ప్రేమగలవారు అగు, త్వత్-విధాః - నీవంటి వారలు, కిముత - చెప్పునదేమున్నది?

ఓ రాజా! మూఢజనులు కూడ అపరాధము చేసిననూ స్త్రీలపై ఆయుధమును ప్రయోగించరు. దయామయులు, దీనులయందు ప్రేమ గలవారు అగు నీవంటి వారు స్త్రీలను హింసించరని వేరుగా చెప్పవలయునా?

మాం విపాట్యాఽజరాం నావం యత్ర విశ్వం ప్రతిష్ఠితమ్ ।
ఆత్మానం చ ప్రజాశ్చేమాః కథమంభసి ధాస్యసి ।। 21

అజరామ్ - దృఢమగు, నావమ్ - నావవగు, మామ్ - నన్ను, విపాట్య - పగులగొట్టి, ఆత్మానమ్ - నిన్ను, చ - మరియు, ఇమాః - ఈ, ప్రజాః చ - ప్రజలను కూడ, కథమ్ - ఎట్లు, అంభసి - నీటియందు, ధాస్యసి - నిలబెట్టెదవు?, యత్ర - ఏ నాయందైతే, విశ్వమ్ - జగత్తు, ప్రతిష్ఠితమ్ - నిలిచియున్నదో.

నేను దృఢమగు నావ వంటి దానను. ఈ జగత్తు అంతా నాయందు నిలిచియున్నది. అట్టి నన్ను పగుల గొట్టినచో, ఈ జనులు నీవు కూడ నిలువ తావు లేక, నీటిలో మునిగిపోయెదరు. అట్టి పనిని నీవు ఎట్లు చేయగలవు?

పృథురువాచ ।
వసుధే త్వాం వధిష్యామి మచ్ఛాసనపరాఙ్ముఖీమ్ ।
భాగం బర్హిషి యా వృంక్తే న తనోషి చ నో వసు ।। 22

వసుధే - ఓ భూదేవీ!, మత్-శాసనపరాక్-ముఖీమ్ - నా శాసనమునకు పెడ ముఖమును పెట్టే, త్వామ్ - నిన్ను, వధిష్యామి - సంహరించెదను, యా - ఏ నీవు, బర్హిషి - యజ్ఞమునందు, భాగమ్ - హవిర్భాగమును, వృంక్తే - పొందుచున్నావో అట్టి నీవు, నః - మాకు, వసు - సంపదను, న తనోషి - విస్తరింప జేయుట లేదు.

పృథు మహారాజు ఇట్లు పలికెను --- ఓ భూదేవీ! నీవు నా శాసనమునుల్లంఘించినచో, నేను నిన్ను సంహరించెదను. నీవు యజ్ఞములో హవిర్భాగమును స్వీకరించుచున్నావు. కాని, మాకు సంపదను విస్తరిల్ల జేయుట లేదు.

యవసం జగ్ధ్యనుదివం నైవ దోగ్ధ్యౌధసం పయః ।
తస్యామేవం హి దుష్టాయాం దండో నాత్ర న శస్యతే ।। 23

అనుదినమ్ - ప్రతిరోజు, యవసమ్ - గడ్డిని, జగ్ధి - తినును, ఔధ సం పయః - పాలను, న ఏవ దోగ్ధి - పితుకుట లేదు, అత్ర - ఈ లోకము నందు, ఏవమ్ - ఈ విధముగా, దుష్టాయామ్ - చెడ్డదియగు, తస్యామ్ - ఆ గోవునందు, దండః - శిక్ష, న శస్యతే - యుక్తము కాదని, న - కాదు.

ప్రతిరోజు గడ్డిని తింటూ పాలను ఈయని చెడ్డ ఆవును దండిం చుట యుక్తము కాదని చెప్పువారు ఈ లోకములో లేరు. నీవు అట్టి దానవు గనుక, నీకు దండము యుక్తము కాదనుట సరి కాదు.

త్వం ఖల్వోషధిబీజాని ప్రాక్ సృష్టాని స్వయంభువా ।
న ముంచస్యాత్మరుద్ధాని మామవజ్ఞాయ మందధీః ॥ 24

మందధీః - మందబుద్ధివగు, త్వం ఖలు - నీవైతే, మామ్ - నన్ను, అవజ్ఞాయ - తిరస్కరించి, ప్రాక్ - పూర్వము, స్వయంభువా - స్వయంభువుడగు బ్రహ్మగారిచే, సృష్టాని - సృష్టించబడిన, ఓషధిబీజాని - ఓషధుల బీజములను, ఆత్మరుద్ధాని - నీయందు దాచబడిన వాటిని, న ముంచసి - విడిచిపెట్టుట లేదు.

స్వయంభువుడగు బ్రహ్మగారు సృష్ట్యాదియందు వరి, గోధుమ మొదలగు ఓషధుల బీజములను సృష్టించినాడు. కాని, మందబుద్ధివగు నీవు వాటిని నీలో నొక్కిపెట్టి విడిచిపెట్టుట లేదు. ఈ విధముగా నీవు ఈశ్వ రుడనగు నన్ను అవమానించినావు.

అమూషాం క్షుత్పరీతానామార్తానాం పరిదేవితమ్ ।
శమయిష్యామి మద్బాణైర్భిన్నాయాస్తవ మేదసా ॥ 25

మత్-బాణైః - నా బాణములచే, భిన్నాయాః - పగులగొట్టబడిన, తవ - నీ, మేదసా - మాంసముతో, క్షుత్-పరీతానామ్ - ఆకలిచే చాల పీడించబడినట్టియు, ఆర్తానామ్ - దుఃఖితులైయున్న, అమూషామ్ - వీరి, పరిదేవితమ్ - గోడును, శమయిష్యామి - చల్లార్చగలను.

వీరు ఆకలి బాధకు తాళలేక దుఃఖించుచున్నారు. నేను నా బాణ ములతో నిన్ను పగులగొట్టి నీ మాంసముతో వారి గోడును చల్లార్చెదను.

పుమాన్ యోషిదుత క్లీబ ఆత్మసంభావనోఽధమః ।
భూతేషు నిరనుక్రోశో నృపాణాం తద్వధోఽవధః ।। 26

పుమాన్ - పురుషుడు, యోషిత్ - స్త్రీ, ఉత క్లీబః - నపుంసకుడే గాని, ఆత్మసంభావనః - తనను మాత్రమే పోషించుకొనువాడు, అధమః - అధముడు, భూతేషు - ప్రాణులయందు, నిరనుక్రోశః - దయ లేనివాడు, నృపాణామ్ - రాజులకు, తత్-వధః - వానిని వధించుట, అవధః - వధ కాదు.

పురుషుడు గాని, స్త్రీగాని, నపుంసకుడే గాని ఏ అధముడైతే ప్రాణులయందు దయ లేకుండగా, తన పొట్టను మాత్రమే పోసుకొనునో, అట్టి వానిని రాజు వధించిననూ, అది హింస కాదు.

త్వాం స్తబ్ధాం దుర్మదాం నీత్వా మాయాగాం తిలశశ్శరైః ।
ఆత్మయోగబలేనేమా ధారయిష్యామ్యహం ప్రజాః ।। 27

స్తబ్ధామ్ - గర్వించి యున్నట్టియు, దుర్మదామ్ - మదోన్మత్తురాలై నట్టియు, మాయాగామ్ - కపటమగు గోరూపములోనున్న, త్వామ్ - నిన్ను, శరైః - బాణములతో, తిలశః - ముక్క ముక్కలుగా, నీత్వా - చేసి, అహమ్ - నేను, ఆత్మయోగబలేన - నా యోగబలముచే, ప్రజాః - ప్రజల ను, ధారయిష్యామి - పాలించెదను.

నీవు గర్వించి మదోన్మత్తురాలవై యున్నావు. కపటమగు గోరూపమును దాల్చియున్న నిన్ను నేను బాణములతో ముక్క ముక్కలుగా చేసి, నా యోగబలముచే ఈ ప్రజలను రక్షించి పాలించగలను.

ఏవం మన్యుమయీం మూర్తిం కృతాంతమివ బిభ్రతమ్ ।
ప్రణతా ప్రాంజలిః ప్రాహ మహీ సంజాతవేపథుః ।। 28

ఏవమ్ - ఈ విధముగా, కృత-అంతమ్ - యమునివలె, మన్యుమయీమ్ - కోపముతో నిండిన, మూర్తిమ్ - రూపమును, బిభ్రతమ్ - ధరించియున్న పృథువును ఉద్దేశించి, ప్ర-అంజలిః - దోసిలి ఒగ్గినట్టియు,

ప్రణతా - నమస్కరించిన, మహీ - భూమి, సంజాతవేపథుః - పుట్టిన వణుకు గలదై, ప్రాహ - పలికెను.

ఈ విధముగా కోపముతో నిండియున్న పృథు మహారాజు యమ ధర్మరాజును పోలియుండెను. ఆయనను చూచి భూదేవి గడ-గడ వణికిపో యెను. ఆమె చేతులను జోడించి ఆయనకు నమస్కరించి ఇట్లు పలికెను.

ధరోవాచ ।
నమః పరస్మై పురుషాయ మాయయా
విన్యస్తనానాతనవే గుణాత్మనే ।
నమస్స్వరూపానుభవేన నిర్ధుత-
ద్రవ్యక్రియాకారకవిభ్రమోర్మయే ॥ 29

మాయయా - మాయాశక్తిచే, విన్యస్తనానాతనవే - ధరించబడిన వివిధములగు దేహములు కలిగినట్టియు, గుణ-ఆత్మనే - సత్త్వరజ స్తమోగుణములయందు ప్రకటమగునట్టియు, స్వరూప-అనుభవేన - స్వరూపమునందు నిలిచియుండుటచే, నిర్ధుతద్రవ్యక్రియాకారకవిభ్రమ-ఊ ర్మయే - తిరస్కరించబడిన శరీరము ఇంద్రియములు వాటి అధిష్ఠానదేవత లయందలి మోహముచే పుట్టే రాగద్వేషములు మొదలగునవి కలిగిన, పరస్మై పురుషాయ - పురుషోత్తమునకు, నమః నమః - అనేక నమస్కార ములు.

భూదేవి ఇట్లు పలికెను --- పరబ్రహ్మ సత్త్వరజస్తమోగుణాత్మక మగు మాయాశక్తిచే అనేకములగు శరీరములను ధరించును. ఈ విధముగా పరమాత్మ గుణాత్మకములగు ఉపాధులయందు ప్రకటమగుచున్నాడు. కాని, పరమాత్మ నిత్యము స్వరూపనిష్ఠుడై యున్నాడు. కావుననే, శరీరము ఇంద్రియములు వాటి అధిష్ఠాన దేవతలతో కూడియున్న ఈ ఉపాధుల యందు ఆయనకు నేను, నాది అనే భ్రాంతి ఉండదు. కావుననే, ఆయనకు అట్టి భ్రాంతి వలన కలిగే రాగద్వేషములు, జన్మమరణములు, ఆకలిదప్పి కలు అనే ఆరు ఊర్ములు ఉండవు. అట్టి పురుషోత్తమునకు నేను పలు మార్లు నమస్కరించుచున్నాను.

యేనాహమాత్మాయతనం వినిర్మితా
ధాత్రా యతోఽయం గుణసర్గసంగ్రహః ।
స ఏవ మాం హంతుముదాయుధస్స్వరాట్
ఉపస్థితోఽన్యం శరణం కమాశ్రయే ॥ 30

ధాత్రా - సృష్టికర్తయగు, యేన - ఎవనిచే, ఆత్మా-ఆయతనమ్ - ప్రాణులకు ఆశ్రయముగా, అహమ్ - నేను, వినిర్మితా - నిర్మించబడినానో, యతః - ఎవనియందు, అయమ్ - ఈ, గుణసర్గసంగ్రహః - త్రిగుణాత్మకమగు సృష్టి ధరించబడియున్నదో, సః - అట్టి, స్వరాట్ ఏవ - స్వయంప్రకాశ స్వరూపుడు (స్వతంత్రుడు, చక్రవర్తి) అగు ఈశ్వరుడే, మామ్ - నన్ను, హంతుమ్ - సంహరించుటకు, ఉదాయుధః - ఎత్తబడిన ఆయుధము గలవాడై, ఉపస్థితః - నిలిచియున్నవాడైనచో, అన్యమ్ - మరియొకనిని, కమ్ - ఎవ్వానిని, శరణమ్ - రక్షకునిగా, ఆశ్రయే - ఆశ్రయించెదను?

సృష్టికర్తయగు ఆ పరమేశ్వరుడే సకలప్రాణులకు ఆశ్రయమునిచ్చుటకై నన్ను సృష్టించినాడు. ఈ త్రిగుణాత్మకమగు జగత్తును నిలబెట్టునది ఆయనయే. స్వయంప్రకాశ స్వరూపుడు, సర్వస్వతంత్రుడు అగు అట్టి పరమేశ్వరుడే స్వయముగా పృథు చక్రవర్తి రూపములో ఆయుధమును పైకెత్తి నన్ను సంహరింప బూనుకున్నచో, నేను ఇంకెవరిని ఆశ్రయించగలను? నాకు రక్షకుడు మరియెవరు గలరు?

య ఏతదాదావసృజచ్చరాచరం
స్వమాయయాఽఽత్మాశ్రయయాఽవితర్క్యయా ।
తయైవ సోఽయం కిల గోప్తుముద్యతః
కథం ను మాం ధర్మపరో జిఘాంసతి ॥ 31

యః - ఏ పరమేశ్వరుడు, ఆదౌ - సృష్ట్యాదియందు, ఆత్మా-ఆశ్రయయా - తానే ఆశ్రయముగా కలిగినది, అవితర్క్యయా - ఊహకు అందనిది అగు, స్వమాయయా - తన మాయాశక్తిచే, ఏతత్ - ఈ, చర-అచరమ్ - స్థావర జంగమాత్మకమగు జగత్తును, అసృజత్ - సృష్టించెనో, ధర్మపరః - ధర్మపరాయణుడగు, సః - అట్టి, అయమ్ - ఈయన, తయా ఏవ -

ఆ మాయాశక్తిచేతనే, గోప్తుమ్ - రక్షించుటకు, ఉద్యతః కిల - సంసిద్ధుడై వాడు గదా!, మామ్ - నన్ను, కథం ను - ఎట్లు, జిఘాంసతి - సంహరించ గోరుచున్నాడు?

ఆ పరమేశ్వరుడు సృష్ట్యాదియందు తనను ఆశ్రయించి ఉండే మాయాశక్తిచే స్థావర జంగమాత్మకమగు ఈ జగత్తును సృష్టించెను. ఆ మాయాశక్తియొక్క ప్రభావము ఊహకు అందదు. ఆయన ఇప్పుడు ఆ మాయాశక్తి చేతనే పృథురూపుడై ధర్మమునందు నిష్ఠ గలవాడై, ఆ జగత్తును రక్షించుటకు పూనుకున్నాడు. అట్టి ఆ ప్రభుడు నన్ను సంహరించ గోరుటకు హేతువు ఏమి గలదు?

నూనం బతేశస్య సమీహితం జనైః
తన్మాయయా దుర్జయయాఽకృతాత్మభిః ।
న లక్ష్యతే యస్త్వకరోదకారయత్
యోఽనేక ఏకః పరతశ్చ ఈశ్వరః ॥ 32

నూనమ్ - నిశ్చయము, బత - ఆశ్చర్యము!, దుర్జయయా - జయింప శక్యము కాని, తత్-మాయయా - ఆ ఈశ్వరుని మాయచే, అకృత-ఆత్మభిః - మోహింప జేయబడిన చిత్తములు గల (నిగ్రహించబడని మనస్సులు గల), జనైః - జనులచే, ఈశస్య - ఈశ్వరుని, సమీహితమ్ - చేష్టితము, న లక్ష్యతే - తెలియబడుట లేదు, యః - ఏ, ఈశ్వరః - ఈశ్వరుడు, అకరోత్ - చేసెనో, అకారయత్ - చేయించెనో, చ - మరియు, ఏకః - ఒక్కడే, పరతః - మాయ వలన, అనేకః - అనేకుడో (అనేకః - అనేకముగా ఉన్న, యః - ఏ ఈశ్వరుడు, పరతః - పరమార్థమునందు, ఏకః - ఒక్కడో).

ఆశ్చర్యము! జనులు ఈశ్వరుని మాయచే మోహింప జేయబడియున్నారు. ఈశ్వరుని మాయను జయించుట దుర్ఘటము. కావుననే, ఇంద్రియజయమునెరుంగని ఈ జనులకు ఈశ్వరుని చేష్టితము తెలియకున్నది. ఇది నిశ్చయము. ఈశ్వరుడు ముందుగా బ్రహ్మగారిని సృష్టించి, ఆయనచే జగత్తును సృష్టింప జేసెను. ఆ ఈశ్వరుడు రెండవది లేనివాడే అయిననూ,

మాయా శక్తిచే అనేకముగా అయినాడు. ఈ జగత్తులో అనేకము భాసించిన నూ, పరమార్థములో తత్త్వము ఈశ్వరుడొక్కడు మాత్రమే.

సర్గాది యోఽస్యానురుణద్ధి శక్తిభిః
ద్రవ్యక్రియాకారకచేతనాత్మభిః ।
తస్మై సమున్నద్ధనిరుద్ధశక్తయే
నమః పరస్మై పురుషాయ వేధసే।। 33

యః - ఏ పురుషోత్తముడు, ద్రవ్యక్రియాకారకచేతన-ఆత్మభిః - పంచభూతములు ఇంద్రియములు అధిష్ఠాన దేవతలు మహత్తత్త్వము మరియు అహంకారములనే, శక్తిభిః - శక్తులచే, అస్య - ఈ జగత్తుయొక్క, సర్గ-అది - సృష్టి మొదలగు కార్యములను, అనురుణద్ధి - చేయుచున్నాడో, సమున్నద్ధనిరుద్ధశక్తయే - సంసిద్ధముగా మరియు నిరోధింపబడి యున్న శక్తులు గలిగినట్టియు, వేధసే - అంతర్యామియగు, తస్మై - అట్టి, పరస్మై పురుషాయ - పురుషోత్తముని కొరకు, నమః - నమస్కారము.

పరమేశ్వరుని మాయాశక్తినుండి మహత్తత్త్వము, దానినుండి అహంకారము, దానినుండి సూక్ష్మపంచభూతములు, వాటినుండి ప్రాణుల ఇంద్రియములు, వాటి అధిష్ఠాన దేవతలు ప్రకటమగుచున్నవి. తన మాయాశక్తియొక్క రూపములైన ఈ తత్త్వములన్నింటి ద్వారా పరమేశ్వరుడు ఈ జగత్తును సృష్టించి పాలించి ఉపసంహరించుచున్నాడు. సృష్టికాలమునందు పరమేశ్వరునినుండి ఉద్బుద్ధములైన ఈ శక్తులు ప్రళయకాలములో ఆయనయందే విలీనమై యుండును. సర్వాంతర్యామి అగు అట్టి పురుషోత్తమునకు నమస్కారము.

స వై భవానాత్మవినిర్మితం జగత్
భూతేంద్రియాంతఃకరణాత్మకం విభో ।
సంస్థాపయిష్యన్నజ మాం రసాతలాత్
అభ్యుజ్జహారాంభస ఆదిసూకరః ।। 34

విభో - ఓ ప్రభూ!, అజ - పుట్టుక లేనివాడా!, సః - అట్టి, భవాన్ - నీవు, ఆత్మవినిర్మితమ్ - నీచే నిర్మించబడినట్టియు, భూత-ఇంద్రియ-అంతఃకరణ-ఆత్మకమ్ - పంచభూతములు ఇంద్రియములు అంతఃకరణముల రూపములోనున్న, జగత్ - జగత్తును, సంస్థాపయిష్యన్ - చక్కగా నిలబెట్ట బోవువాడవై, ఆదిసూకరః - ఆదివరాహమూర్తివై, మామ్ - నన్ను, రసాతలాత్ - పాతాళమునుండి, అంభసః - నీటినుండి, అభి-ఉత్-జహార - పైకి తీసుకు వచ్చితివి, వై - నిశ్చయము.

ఓ ప్రభూ! నీకు పుట్టుక లేదు. పంచభూతములు, ఇంద్రియములు, అంతఃకరణముల రూపములోనున్న ఈ జగత్తును నీవే సృష్టించినావు. దీనికి చక్కని స్థితిని కల్పించగోరి, నీవు ఆదివరాహమూర్తిగా అవతరించి, పాతాళములోని నీటినుండి నన్ను పైకి తీసుకు వచ్చితివి.

అపాముపస్థే మయి నావ్యవస్థితాః
ప్రజా భవానద్య రిరక్షిషుః కిల ।
స వీరమూర్తిస్సమభూద్ధరాధరో
యో మాం పయస్యుగ్రశరో జిఘాంససి ॥ 35

అపాం ఉపస్థే - జలముల పైన, నావి - పడవనగు, మయి - నాయందు, అవస్థితాః - నిలిచియున్న, ప్రజాః - ప్రాణులను, భవాన్ - నీవు, అద్య - ఇప్పుడు, రిరక్షిషుః కిల - రక్షించ గోరువాడవు గదా!, సః - అట్టి నీవు, వీరమూర్తిః - మూర్తీభవించిన పరాక్రమమగు, ధరాధరః - పృథు మహారాజువై (భూమిని ధరించిన ఆదివరాహము), సమభూత్ - అవతరించితివి, యః - ఏ నీవు, ఉగ్రశరః - భయంకరమగు బాణము గలవాడవై, పయసి - నీరు విషయములో, మామ్ - నన్ను, జిఘాంససి - సంహరించ గోరుచున్నావో.

జలములో నావయందు వలె సకలప్రాణులు నాయందు నిలిచి యున్నవి. ఆది వరాహ మూర్తివై భూమిని నిలబెట్టిన నీవు పృథు మహారాజుగా అవతరించినది ప్రజలను రక్షించుట కొరకే గదా! మూర్తీభవించిన

పరాక్రమమే అయిన అట్టి నీవు భయంకరమగు బాణముతో నన్ను పాలను (ఆహారమును) గురించి సంహరించ గోరుచున్నావు.

నూనం జనైరీహితమీశ్వరాణా-
మస్మద్విధైస్తద్గుణసర్గమాయయా।
న జ్ఞాయతే మోహితచిత్తవర్త్మభిః
తేభ్యో నమో వీరయశస్కరేభ్యః॥ 36

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే చతుర్థస్కంధే
ధరాకృతశ్రీహరిస్తుతిర్నామ సప్తదశోఽధ్యాయః ॥

తత్-గుణసర్గమాయయా - ఆ ఈశ్వరుని త్రిగుణాత్మకమగు సృష్టి రూపములోనున్న మాయచే, మోహితచిత్తవర్త్మభిః - మోహింప జేయబడిన చిత్తమే మార్గముగా (చిత్తముయొక్క పోకడలు) గల, అస్మత్-విధైః - మావంటి, జనైః - జనులచే, ఈశ్వరాణామ్ - హరిభక్తుల (అవతారమూర్తుల), ఈహితమ్ - చేష్టితము, న జ్ఞాయతే - తెలియబడుట లేదు, నూనమ్ నిశ్చయము, వీరయశః-కరేభ్యః - దయావీరులకు కీర్తిని కలిగించే, తేభ్యః ఆ హరిభక్తుల (అవతారమూర్తుల) కొరకు, నమః - నమస్కారము.

ఈశ్వరుని ఈ త్రిగుణాత్మకమగు సృష్టియొక్క మాయచే మావంటి వారల చిత్తములు, వాటి పోకడలు మోహమును పొందియున్నవి. మాకు హరిభక్తుల చేష్టితములు గాని, నీవంటి అవతారమూర్తుల చేష్టితములు గాని తెలియవు. ఇది నిశ్చయము. దయను చూపుట వీరలక్షణము. దాని వలన వారి కీర్తి ఇనుమడించును. అట్టి అవతారమూర్తులకు (అనగా నీకు, లేదా హరిభక్తులకు) నమస్కారము.

శ్రీమద్భాగవత మహాపురాణములోని నాల్గవ స్కంధమునందు
భూదేవి శ్రీహరిని స్తుతించుట అనే పదునేడవ
అధ్యాయము ముగిసినది (17).

*****

# అథ అష్టాదశోऽధ్యాయః

## పృథూపాఖ్యానము - పృథివీ దోహనము

మైత్రేయ ఉవాచ ।
ఇత్థం పృథుమభిష్టూయ రుషా ప్రస్ఫురితాధరమ్ ।
పునరాహాऽవనిర్భీతా సంస్తభ్యాత్మానమాత్మనా ॥1 1

మైత్రేయః - మైత్రేయ మహర్షి, ఉవాచ - పలికెను, ఇత్థమ్ - ఈ విధముగా, రుషా - కోపముతో, ప్రస్ఫురిత-అధరమ్ - బాగా వణికిన క్రింది పెదవి గల, పృథుమ్ - పృథువును, అభిష్టూయ - స్తుతించి, భీతా - భయ పడిన, అవనిః - పృథివి, ఆత్మనా - బుద్ధితో, ఆత్మానమ్ - మనస్సును, సంస్తభ్య - నిలద్రొక్కుకొని, పునః - మరల, ఆహ - పలికెను.

పృథువునకు కోపము వలన క్రింది పెదవి వణుకుచుండెను. భయ పడిపోయిన భూదేవి ఆయనను ఈ విధముగా స్తుతించెను. అపుడామె తన సంకల్పశక్తిచే మనస్సును నిలద్రొక్కుకొని, మరల ఆయనతో నిట్లనెను.

సన్నియచ్ఛాభి భో మన్యుం నిబోధ శ్రావితం చ మే ।
సర్వతస్సారమాదత్తే యథా మధుకరో బుధః ॥ 2

అభిభో - ఓ ప్రభూ!, (భోః - ఓ ప్రభూ!, అభి - అభయము కలుగునట్లుగా), మన్యుమ్ - కోపమును, సన్నియచ్ఛ - ఉపసంహరించుము, మే - నా, శ్రావితం చ - విన్నపమును కూడ, నిబోధ - ఆలకించుము, బుధః - వివేకి, మధుకరః యథా - తుమ్మెద వలె, సర్వతః - సర్వమునుండి, సారమ్ - సారమును, ఆదత్తే - స్వీకరించును.

ఓ ప్రభూ! కోపమును ఉపసంహరించి అభయమునిమ్ము. నా విన్నపమును కూడ ఆలకించుము. వివేకి తుమ్మెదవలె సర్వమునుండి మంచిని స్వీకరించును.

**అస్మిన్ లోకేఽథ వాముష్మిన్మునిభిస్తత్త్వదర్శిభిః ।**
**దృష్టా యోగాః ప్రయుక్తాశ్చ పుంసాం శ్రేయఃప్రసిద్ధయే ॥ 3**

అస్మిన్ - ఈ, లోకే - లోకమునందు, అథవా - లేక, అముష్మిన్ - పరలోకమునందు, పుంసామ్ - మానవులకు, శ్రేయః-ప్రసిద్ధయే - శ్రేయస్సు లభించుట కొరకై, తత్త్వదర్శిభిః - తత్త్వవేత్తలైన, మునిభిః - మహర్షులచే, యోగాః - ఉపాయములు, దృష్టాః - దర్శించబడినవి, ప్రయుక్తాః చ - అనుష్ఠించబడినవి కూడా.

తత్త్వవేత్తలగు మహర్షులు ఇహలోక పరలోకములలో మానవునకు శ్రేయస్సును కలుగజేసే (క్రమముగా వ్యవసాయము, యజ్ఞము మొదలగు) ఉపాయములను కనుగొని ఆచరణలో పెట్టినారు.

**తానాతిష్ఠతి యస్సమ్యగుపాయాన్ పూర్వదర్శితాన్ ।**
**అవరః శ్రద్ధయోపేత ఉపేయాన్ విందతేఽంజసా ॥ 4**

పూర్వదర్శితాన్ - పూర్వీకులచే కనుగొనబడిన, తాన్ - ఆ, ఉపాయాన్ - ఉపాయములను, అవరః - ఇప్పటి కాలము వాడు, యః - ఎవడైతే, సమ్యక్ - చక్కగా, శ్రద్ధయా - శ్రద్ధతో, ఉపేతః - కూడుకున్నవాడై, ఆతిష్ఠతి - అనుష్ఠించునో వాడు! అంజసా - తేలికగా, ఉపేయాన్ - లక్ష్యములను, విందతే - పొందును.

పూర్వీకులు కనుగొన్న ఆ ఉపాయములను వర్తమానకాలములోని మానవులు శ్రద్ధ గలవారై చక్కగా ఆచరణలో పెట్టవలెను. అట్లు చేయువారు తమ లక్ష్యములను తేలికగా చేరెదరు.

**తాననాదృత్య యోఽవిద్వానర్థానారభతే స్వయమ్ ।**
**తస్య వ్యభిచరంత్యర్థా ఆరబ్ధాశ్చ పునః పునః ॥ 5**

అవిద్వాన్ - అవివేకియగు, యః - ఎవరైతే, (యః - ఎవరైతే, విద్వాన్ - తెలిసినవాడే అయినా), తాన్ - వాటిని, అనాదృత్య - నిర్ల క్ష్యము చేసి, అర్థాన్ - ప్రణాళికలను, స్వయమ్ - తనంత తానుగా, ఆర భతే - మొదలుపెట్టునో, తస్య - వానికి, పునః పునః - మరల మరల, ఆరబ్ధాః చ - మొదలుపెట్టబడినప్పటికీ, అర్థాః - ప్రణాళికలు, వ్యభిచరంతి - ఫలమునీయవు.

తెలిసి గాని, తెలియక గాని ఎవరైతే పూర్వీకులు చూపిన ఉపాయ ములను ఉపేక్ష చేసి, తన స్వంత తెలివి తేటలతో కార్యములనారంభించు నో, వానికి ఆ కార్యములు ఫలమునీయవు. ఒకప్పుడు ఒకే కార్యమును పలుమార్లు మొదలు పెట్టినమా ప్రయోజనము ఉండక పోవచ్చును.

పురా సృష్టా హ్యోషధయో బ్రహ్మణా యా విశాం పతే ।
భుజ్యమానా మయా దృష్టా అసద్భిరధృతవ్రతైః ॥ 6

విశాం పతే - ఓ భూపతీ!, బ్రహ్మణా - బ్రహ్మగారిచే, పురా - సృష్ట్యాదియందు, యాః - ఏ, ఓషధయః హి - ఓషధులైతే, సృష్టాః - సృష్టించబడినవో అవి, అధృతవ్రతైః - యోగ్యమగు ప్రవృత్తి లేని, అసద్భిః - దుష్టులచే, భుజ్యమానాః - భుజింపబడుచున్నవిగా, మయా - నాచే, దృష్టాః - కనుగొనబడినవి.

ఓ మహారాజా! బ్రహ్మగారు సృష్ట్యాదియందు సృష్టించిన ఓషధు లను ఈ నాడు యోగ్యమగు ప్రవృత్తి లేని దుష్టులు మాత్రమే అనుభవిం చుచున్నారు. ఈ పరిస్థితి నా కంట బడినది.

అపాలితాऽనాదృతా చ భవద్భిర్లోకపాలకైః ।
చోరీభూతేऽథ లోకేऽహం యజ్ఞార్థేऽగ్రసమోషధీః ॥ 7

లోకపాలకైః - లోకములను పాలించే, భవద్భిః - మీచే, అపాలితా - రక్షింపబడనట్టియు, చ - మరియు, అనాదృతా - ఉపేక్ష చేయబడిన, అహమ్ - నేను, లోకే - లోకము, చోరీభూతే - చోరులుగా తయారు కాగా,

అథ - అప్పుడు, యజ్ఞ-అర్థే - యజ్ఞము అనే ప్రయోజనమునందు, ఓషధీః - ఓషధులను, అగ్రసమ్ - మ్రింగి వేసితిని.

లోకములను పాలించ వలసిన మీరు నన్ను రక్షించుట మానివేసి, ఉపేక్ష చేసినారు. లోకులు చోరులుగా తయారైనారు. కావుననే, భవిష్యత్తులో యజ్ఞమునకు పనికి వచ్చుననే భావనతో, నేను ఓషధులను మ్రింగి కూర్చున్నాను.

నూనం తా వీరుధః క్షీణా మయి కాలేన భూయసా ।
తత్ర యోగేన దృష్టేన భవానాదాతుమర్హతి ॥ 8

భూయసా కాలేన - చాల కాలముచే, తాః - ఆ, వీరుధః - ఓషధులు, మయి - నాయందు, క్షీణాః - క్షీణములైనవి, తత్ర - ఆ విషయమునందు, భవాన్ - నీవు, దృష్టేన - పూర్వజులచే దర్శించబడిన, యోగేన - ఉపాయముచే, ఆదాతుమ్ - తీసుకొనుటకు, అర్హతి - తగుదువు.

చాల కాలమగుటచే ఆ ఓషధులు నాయందు క్షీణించినవి. నీవు వాటిని తిరిగి పొందుటకై, పూర్వజులు దర్శించిన ఉపాయమునను ష్ఠించుము. ఆ విధముగా నీవు వాటిని తిరిగి పొందుము.

వత్సం కల్పయ మే వీర యేనాహం వత్సలా తవ ।
ధోక్ష్యే క్షీరమయాన్ కామానను రూపం చ దోహనమ్ ॥ 9

దోగ్ధారం చ మహాబాహో భూతానాం భూతభావన ।
అన్నమీప్సితమూర్జస్వద్భగవాన్ వాంఛతే యది ॥ 10

వీర - ఓ వీరుడా!, మహాబాహో - గొప్ప బాహువులు గలవాడా!, భూతభావన - ప్రాణులను రక్షించువాడా!, భగవాన్ - పూజ్యుడవగు నీవు, భూతానామ్ - ప్రాణులకు, ఈప్సితమ్ - అభీష్టమైన, ఊర్జస్వత్ - పుష్టికరమైన, అన్నమ్ - ఆహారమును, యది వాంఛతే - కోరుచున్నచో, మే - నాకు, వత్సమ్ - దూడను, అనురూపమ్ - తగిన, దోహనమ్ - పాలను పితికే పాత్రను, చ - మరియు, దోగ్ధారం చ - పితుకువానిని కూడ, కల్పయ - ఏర్పాటు చేయుము, యేన - దేనిచే, వత్సలా - దూడయందు

ప్రేమ గల, అహమ్ - నేను, క్షీరమయాన్ - పాలరూపములో నుండే, తవ - నీ, కామాన్ - కోరికలను, ధోక్ష్యే - పూర్ణము చేయగలను.

ఓ వీరా! గొప్ప పరాక్రమశాలివగు నీవు ప్రాణులకు రక్షకుడవు. ప్రాణులకు అభీష్టము మరియు పుష్టికరము అగు ఆహారము లభించాలని పూజ్యుడవగు నీవు కోరుచున్నావా? అట్లైనచో, నాకు ఒక దూడను, పాలను పితికే వానిని, పితుకుటకు తగిన ఒక పాత్రను కూడ ఏర్పాటు చేయుము. దూడయందలి ప్రేమచే, నేను పాలను ఇచ్చెదను. ఆ పాలరూపముగా నేను నీ కోరికలనన్నింటినీ పరిపూర్ణము చేసెదను.

సమాం చ కురు మాం రాజన్ దేవవృష్టం యథా పయః ।
అపర్తావపి భద్రం త ఉపావర్తేత మే విభో ॥ 11

రాజన్ - ఓ రాజా!, విభో - ఓ ప్రభూ!, మామ్ - నన్ను, సమాం చ - సమానముగా కూడ, కురు - చేయుము, యథా - ఏ విధముగానైతే, దేవవృష్టమ్ - ఇంద్రునిచే వర్షించబడిన, పయః - నీరు, అప-ఋతౌ అపి - వర్షర్తువు వెళ్లిపోయినా, మే - నాకు, ఉపావర్తేత - నిలిచియుండునో, తే - నీ కొరకు, భద్రమ్ - మంగళమగు గాక!

ఓ రాజా! నీవు సర్వసమర్థుడవు. నన్ను సమతలముగా కూడ చేయుము. అట్లు చేయుట వలన వానదేవుడు కురిపించిన నీరు వర్షకాలము తరువాత కూడ నాపై నిలిచియుండగలదు. నీకు శుభమగు గాక!

ఇతి ప్రియం హితం వాక్యం భువ ఆదాయ భూపతిః ।
వత్సం కృత్వా మనుం పాణావదుహత్సకలౌషధీః ॥ 12

భూపతిః - పృథు మహారాజు, భువః - భూదేవియొక్క, ఇతి - ఈ విధమైన, ప్రియమ్ - సొంపైన, హితమ్ - హితకరమైన, వాక్యమ్ - వాక్యమును, ఆదాయ - స్వీకరించి, మనుమ్ - మనువును, వత్సమ్ - దూడనుగా, కృత్వా - చేసి, పాణౌ - చేతియందు, సకల-ఓషధీః - అన్ని ఓషధులను, అదుహత్ - పితికెను.

భూదేవి ఈ విధముగా, హితకరమైన వచనములను సొంపుగా చెప్పెను. పృథు మహారాజు ఆమె మాటను స్వీకరించి, స్వాయంభువ మనువును దూడగా చేసి, తన చేతిలోనికి అన్ని ఓషధులను పాల రూప ములో పితికెను.

తథా పరే చ సర్వత్ర సారమాదదతే బుధాః ।
తతోఽన్యే చ యథాకామం దుదుహుః పృథుభావితామ్ ।।13

తథా - అదే విధముగా, సర్వత్ర - అంతటా, బుధాః - వివేకవంతు లగు, పరే చ - ఇతరులు కూడ, సారమ్ - సారమును, ఆదదతే - స్వీకరిం చుచున్నారు, తతః - తరువాత, అన్యే చ - ఇతరులు కూడ, పృథుభావి తామ్ - పృథువుచే వశము చేసుకొనబడిన భూమిని, యథాకామమ్ - యథేచ్ఛగా, దుదుహుః - పితికిరి.

పృథువు వలెనే వివేకవంతులగు జనులందరు ఎక్కడ ఉన్నా సార మును గ్రహించుచుందురు. పృథువు వశము చేసుకున్న భూమిని ఇతరజ నులు కూడ యథేచ్ఛగా పితికిరి (అనగా, సకలాభీష్టములను భూమినుం డియే పొందిరి).

ఋషయో దుదుహుర్దేవీమింద్రియేష్వథ సత్తమ ।
వత్సం బృహస్పతిం కృత్వా పయశ్ఛందోమయం శుచి ।।14

సత్తమ - సత్పురుషులలో శ్రేష్ఠుడవగు ఓ విదురా!, అథ - తరు వాత, ఋషయః - మహర్షులు, బృహస్పతిమ్ - బృహస్పతిని, వత్సమ్ - దూడనుగా, కృత్వా - చేసి, దేవీమ్ - భూదేవిని, ఇంద్రియేషు - ఇంద్రియ ములయందు, ఛందోమయమ్ - వేదరూపమైన, శుచి - పవిత్రమగు, పయః - పాలను, దుదుహుః - పితికిరి.

సత్పురుషులలో శ్రేష్ఠుడవగు ఓ విదురా! తరువాత మహర్షులు బృహస్పతిని దూడనుగా చేసిరి. వారు మనస్సు, వాక్కు, చెవి అనే ఇంద్రి యములనే పాత్రలుగా చేసి, వేదరూపములైన పవిత్రమగు పాలను భూదే వినుండి పితికిరి.

కృత్వా వత్సం సురగణా ఇంద్రం సోమమదూదుహన్ ।
హిరణ్మయేన పాత్రేణ వీర్యమోజో బలం పయః ।। 15

సురగణాః - దేవతాగణములు, ఇంద్రమ్ - ఇంద్రుని, వత్సమ్ - దూడనుగా, కృత్వా - చేసి, హిరణ్మయేన - బంగరు, పాత్రేణ - పాత్రతో, వీర్యమ్ - మనశ్శక్తిని, ఓజః- ఇంద్రియశక్తిని, బలమ్ - దేహశక్తిని, సోమమ్ - అమృతరూపమగు, పయః - పాలనుగా, అదూదుహన్ - పితికిరి.

దేవతాగణములు ఇంద్రుని దూడనుగా చేసి, అమృతరూపమగు పాలను బంగరు పాత్రలోనికి పితికిరి. అది వారి ఇంద్రియములకు, మనస్సునకు, దేహమునకు కూడ శక్తిని కలిగించెను.

దైతేయా దానవా వత్సం ప్రహ్లాదమసురర్షభమ్ ।
విధాయాదూదుహన్ క్షీరమయఃపాత్రే సురాఽఽసవమ్ ।। 16

దైతేయాః - దితి వంశీయులు, దానవాః - దను వంశీయులు, అసుర-ఋషభమ్ - రాక్షసోత్తముడగు, ప్రహ్లాదమ్ - ప్రహ్లాదుని, వత్సమ్ - దూడనుగా, విధాయ - చేసి, అయఃపాత్రే - ఇనుపపాత్రయందు, సురా-ఆసవమ్ - సారాయి అనే విషా ద్రవమును, క్షీరమ్ - పాలనుగా, అదూదుహన్ - పితికిరి.

దితి వంశీయులు, దను వంశీయులు అగు రాక్షసులు రాక్షసోత్తముడగు ప్రహ్లాదుని దూడనుగా చేసి, మత్తెక్కించే సారాయిని పాల రూపములో ఇనుప పాత్రలోనికి పితికిరి.

గంధర్వాప్సరసోఽధుక్షన్ పాత్రే పద్మమయే పయః ।
వత్సం విశ్వావసుం కృత్వా గాంధర్వం మధుసౌభగమ్ ।।17

గంధర్వ-అప్సరసః - గంధర్వులు అప్సరసలు, విశ్వావసుమ్ - విశ్వావసువును, వత్సమ్ - దూడనుగా, కృత్వా - చేసి, పద్మమయే - పద్మరూపమైన, పాత్రే - పాత్రయందు, గాంధర్వమ్ - గంధర్వులకు మహిమను కలిగించే, మధుసౌభగమ్ - స్వరమాధురిని సౌందర్యమును, పయః - పాలనుగా, అధుక్షన్ - పితికిరి.

గంధర్వులు, అప్సరసలు విశ్వావసువు అనే గొప్ప గంధర్వుని దూడనుగా చేసి, పద్మము అనే పాత్రలోనికి స్వరమాధురి మరియు అందము అనే పాలను పితికిరి. వాటి వలననే గంధర్వులు మహిమను గాంచిరి.

వత్సేన పితరోఽర్యమ్ణా కవ్యం క్షీరమధుక్షత ।
ఆమపాత్రే మహాభాగాః శ్రద్ధయా శ్రాద్ధదేవతాః ॥ 18

మహాభాగాః - మహాత్ములు, శ్రాద్ధదేవతాః - శ్రాద్ధమునందలి దేవతలు అగు, పితరః - పితృదేవతలు, వత్సేన - దూడయగు, అర్యమ్ణా - అర్యమునిచే, ఆమపాత్రే - పచ్చి కుండయందు, కవ్యమ్ - కవ్యము అనే, క్షీరమ్ - పాలను, అధుక్షత - పితికిరి.

శ్రాద్ధమునందు దేవతలుగా ఆరాధించబడే మహాత్ములగు పితృదేతలు అర్యముని దూడనుగా చేసి, కవ్యము (స్వధా అని చెప్పి సమర్పించే హవిస్సు) ను పాలనుగా పితికిరి.

ప్రకల్ప్య వత్సం కపిలం సిద్ధాః సంకల్పనామయీమ్ ।
సిద్ధిం నభసి విద్యాం చ యే చ విద్యాధరాదయః ॥ 19

సిద్ధాః - సిద్ధులు, కపిలమ్ - కపిలుని, వత్సమ్ - దూడనుగా, ప్రకల్ప్య - చేసి, సంకల్పనామయీమ్ - సంకల్పమాత్రముచే పుట్టే, సిద్ధిమ్ - సిద్ధిని, నభసి - ఆకాశమునందు, విద్యాధర-ఆదయః - విద్యాధరులు మొదలగువారు, యే చ - ఎవరు గలరో.

సిద్ధులు కపిలుని దూడనుగా చేసి ఆకాశము అనే పాత్రలోనికి సంకల్పమాత్రముచే పుట్టే అణిమ (తేలికనై గాలిలో ఎగురుట) మొదలగు సిద్ధులను పితికిరి. విద్యాధరులు మొదలగు వారు కూడ అటులనే అంతర్ధాన శక్తి మొదలగు శక్తులను సంపాదించిరి.

అన్యే చ మాయినో మాయామంతర్ధానాద్భుతాత్మనామ్ ।
మయం ప్రకల్ప్య వత్సం తే దుదుహుర్ధారణామయీమ్॥20

మాయినః - మాయావులగు, అన్యే - ఇతరులు ఎవరు గలరో, తే చ - వారు కూడ, మయమ్ - మయుని, వత్సమ్ - దూడగా, ప్రకల్ప్య - చేసి, అంతర్ధాన-అద్భుత-ఆత్మనామ్ - అంతర్ధానముచే అద్భుతమగు మనస్సులు గలవారికి చెందిన (అంతర్ధానమయ్యే మరియు ఆశ్చర్యమును గొలిపే రూపము గలవారికి చెందిన), ధారణామయీమ్ - సంకల్పమాత్ర ముచే పుట్టే, మాయామ్ - మాయను, దుదుహుః - పితికిరి.

మాయావులైన కింపురుషులు మొదలగు ఇతరులు కూడ మయాసురుని దూడనుగా చేసి, సంకల్పమాత్రముచే పుట్టే మాయాశక్తిని సంపాదించిరి. ఆ శక్తిచే వారు అంతర్ధానమగుట, విచిత్రమగు రూపమును దాల్చుట మొదలగు అద్భుతములను చేయగలవారైరి.

యక్షరక్షాంసి భూతాని పిశాచాః పిశితాశనాః ।
భూతేశవత్సా దుదుహుః కపాలే క్షతజాసవమ్ ॥ 21

యక్షరక్షాంసి - యక్షులు రాక్షసులు, భూతాని - భూతములు, పిశిత-అశనాః - మాంసమును తినే, పిశాచాః - పిశాచములు, భూత-ఈశ వత్సాః - భూతములకు ప్రభువగు రుద్రుడు దూడగా గలవై, కపాలే - పుర్రె యందు, క్షతజ-ఆసవమ్ - రక్తము అనే మాదకద్రవమును, దుదుహుః - పితికినవి.

యక్షులు, రాక్షసులు, భూతములు, మాంసమును తినే పిశాచములు భూతములకు ప్రభువగు రుద్రుని దూడగా చేసి, పుర్రెలో రక్తమును పితికినవి. వాటికి అదియే నిషాను కలిగించును.

తథాఽహయో దందశూకాస్సర్పా నాగాశ్చ తక్షకమ్ ।
విధాయ వత్సం దుదుహుర్బిలపాత్రే విషం పయః ॥ 22

తథా - అదే విధముగా, అహయః - పడగ లేని పాములు, దందశూకాః - తేళ్లు, సర్పాః - త్రాచుపాములు, నాగాః చ - ఇతర విషసర్పములు, తక్షకమ్ - తక్షకుని, వత్సమ్ - దూడనుగా, విధాయ - చేసి, బిలపాత్రే

- నోరు అనే పాత్రయందు, విషమ్ - విషమునే, పయః - పాలనుగా, దుదుహుః - పితికినవి.

అదే విధముగా పడగ లేని పాములు, పడగ ఉండే త్రాచు పాములు, ఇతర విషసర్పములు మరియు తేళ్లు మొదలగు కుట్టే విషజంతువులు తక్షకుని దూడగా చేసి, తమ నోళ్లలోనికి విషమునే పాలుగా పితికినవి.

పశవో యవసం క్షీరం వత్సం కృత్వా తు గోవృషమ్ ।
అరణ్యపాత్రే చాధుక్షన్మృగేంద్రేణ చ దంష్ట్రిణః ॥ 23

క్రవ్యాదాః ప్రాణినః క్రవ్యం దుదుహుస్స్వే కళేవరే ।
సుపర్ణవత్సా విహగాశ్చరం వాऽచరమేవ చ ॥ 24

పశవః తు - పశువులైతే, గోవృషమ్ - ఎద్దును, వత్సమ్ - దూడనుగా, కృత్వా - చేసి, యవసమ్ - గడ్డిని, క్షీరమ్ - పాలనుగా, అరణ్యపాత్రే - అడవి అనే పాత్రయందు, అధుక్షన్ - పితికినవి, క్రవ్య-అదాః - మాంసమును తినే, దంష్ట్రిణః - కోరలు గల, ప్రాణినః - ప్రాణులు, మృగేంద్రేణ - సింహముతో, స్వే - తమ, కళేవరే - దేహమునందు, క్రవ్యమ్ - మాంసమును, దుదుహుః - పితికినవి, విహగాః - పక్షులు, సుపర్ణవత్సాః - గరుత్మంతుడు దూడగా గలవియై, చరమ్ - కదిలే క్రిమికీటకాదులను, అచరం ఏవ చ - కదలని పండ్లు మొదలగు వాటిని.

పశువులు నందీశ్వరుని దూడగా చేసి అడవి అనే పాత్రలో గడ్డి అనే పాలను పితికినవి. మాంసమును తినే కోరలు గల పెద్దపులి మొదలగు జంతువులు సింహమును దూడగా చేసి తమ దేహము అనే పాత్రలో పచ్చి మాంసము అనే పాలను పితికినవి. పక్షులు గరుత్మంతుని దూడగా చేసి, తమ దేహము అనే పాత్రలోనే కదిలే క్రిమికీటకములను, కదలని పళ్లు మొదలగు వాటిని ఆహారముగా పితికినవి.

వటవత్సా వనస్పతయః పృథగ్రసమయం పయః ।
గిరయో హిమవద్వత్సా నానాధాతూన్ స్వసానుషు ॥ 25

వనస్పతయః - చెట్లు, వటవత్సాః - మఱ్ఱిచెట్టు దూడగా గలవి యై, పృథక్-రసమయమ్ - అనేకరసములతో కూడిన, పయః - పాలను, గిరయః - పర్వతములు, హిమవత్-వత్సాః - హిమవంతుడే దూడగా గల విమై, స్వసానుషు - తమ చరియలయందు, నానాధాతూన్ - అనేకము లగు ధాతువు (రాళ్ల రంగులు) లను.

చెట్లు మఱ్ఱిచెట్టును దూడగా చేసి అనేకరసములనే పాలగా పితికి నవి. పర్వతములు హిమవంతుని దూడగా చేసి, గైరికము మొదలగు ధాతు వులను తమ చరియలు అనే పాత్రలయందు పితికినవి.

సర్వే స్వముఖ్యవత్సేన స్వే స్వే పాత్రే పృథక్ పయః ।
సర్వకామదుఘాం పృథ్వీం దుదుహుః పృథుభావితామ్ ॥26

సర్వే - సకలప్రాణులు, స్వముఖ్యవత్సేన - తమ జాతిలో ప్రము ఖుడే దూడగా, స్వే స్వే - తమ తమ, పాత్రే - పాత్రయందు, పృథక్ - వేర్వేరుగా, పయః - పాలను, పృథుభావితామ్, - పృథువుచే వశము చేసు కొనబడిన, సర్వకామదుఘామ్ - అన్ని కోరికలను పితికే, పృథ్వీమ్ - భూమిని, దుదుహుః - పితికినవి.

సకలప్రాణులు తమ జాతిలోని ప్రముఖమైన ప్రాణిని దూడగా చేసుకొని, తమ తమ పాత్రలలో వేర్వేరుగా తమ తమ ఆహారములను పాలుగా పితికినవి. పృథువుచే వశము చేసుకొనబడిన పృథివి ప్రాణులన్ని టికి వాటి కోర్కెలను పాలు (సార పదార్థము) రూపములో అర్పించినది.

ఏవం పృథ్వాదయః పృథ్వీమన్నాదాస్స్వన్నమాత్మనః ।
దోహవత్సాదిభేదేన క్షీరభేదం కురూద్వహ ॥ 27

కురు-ఉద్వహ - కురువంశ శ్రేష్ఠా!, ఏవమ్ - ఈ విధముగా, అన్న -అదాః - ఆహారభక్షకులగు, పృథు-ఆదయః - పృథువు మొదలగువారు, పృథ్వీమ్ - భూమిని, ఆత్మనః - తమకు, సు-అన్నమ్ - చక్కని ఆహారము ను, దోహవత్స-ఆదిభేదేన - పాత్ర దూడ పితుకువాడు అనే భేదముచే, క్షీరభేదమ్ - పాలలో భేదము.

కురవంశ శ్రేష్ఠుడవగు ఓ విదురా! ఈ విధముగా ఆహారమును భక్షించే పృథువు మొదలగు ప్రాణులు తమ తమ చక్కని ఆహారమును భూమినుండి సంపాదించిరి. ప్రాణిజాతిని బట్టి పితికే (ఆహారమును స్వీకరించే) పాత్ర, దూడ, పితుకువాడు, పితకబడే పాలు (ఆహారము) మారెను.

తతో మహీపతిః ప్రీతస్సర్వకామదుఘాం పృథుః ।
దుహితృత్వే చకారేమాం ప్రేమ్ణా దుహితృవత్సలః ॥ 28

తతః - అప్పుడు, మహీపతిః - భూపతియగు, పృథుః - పృథువు, ప్రీతః - సంతోషించినవాడై, సర్వకామదుఘామ్ - అన్ని కోరికలను పాల రూపములో ఇచ్చిన, ఇమామ్ - ఈ భూమిని, ప్రేమ్ణా - ప్రేమతో, దుహితృత్వే - కూతురు స్థానములో, చకార - చేసెను, దుహితృవత్సలః - కూతురునందు ప్రేమ గలవాడు.

అప్పుడు పృథు మహారాజు సంతోషించి కోరికలనన్నిటినీ పాల రూపములో సమర్పించిన భూదేవిని తన కూతురుగా స్వీకరించి, ఆమె యందు పుత్రికయందలి ప్రేమను చూపెను.

చూర్ణయన్ స్వధనుష్కోట్యా గిరికూటాని రాజరాట్ ।
భూమండలమిదం వైన్యః ప్రాయశ్చక్రే సమం విభుః ॥ 29

రాజరాట్ - రాజాధిరాజు, విభుః - సర్వసమర్థుడు, వైన్యః - వేన పుత్రుడు అగు పృథువు, స్వధనుః-కోట్యా - తన ధనస్సు కొనతో, గిరికూటాని - పర్వత శిఖరములను, చూర్ణయన్ - పొడి చేయుచున్నవాడై, ఇదమ్ - ఈ, భూమండలమ్ - భూమండలమును, ప్రాయః - చాల భాగము, సమమ్ - సమమైనదిగా, చక్రే - చేసెను.

రాజాధిరాజు, సర్వసమర్థుడు, వేనపుత్రుడు అగు పృథువు తన ధనస్సు కొనతో కొండ కొమ్ములను నుగ్గు చేయుచూ, ఈ భూమండలమును ఇంచుమించు సమతలముగా చేసెను.

అథాస్మిన్ భగవాన్ వైన్యః ప్రజానాం వృత్తిదః పితా ।
నివాసాన్ కల్పయాంచక్రే తత్ర తత్ర యథార్హతః ॥ 30

అథ - తరువాత, భగవాన్ - పూజ్యుడు, ప్రజానామ్ - ప్రజలకు, వృత్తిదః - జీవికను కల్పించే, పితా - తండ్రి, వైన్యః - వేనుని పుత్రుడు అగు పృథువు, అస్మిన్ - ఈ భూమండలమునందు, తత్ర తత్ర - అక్కడ క్కడ, యథా-అర్హతః - అర్హతను అతిక్రమించకుండగా, నివాసాన్ - మకా ములను, కల్పయాంచక్రే - ఏర్పాటు చేసెను.

పూజ్యుడగు వేనుడు జనులకు జీవికను కల్పించి తండ్రి వలె వారిని కాపాడెను. అపుడాయన భూమండలమునందు అక్కడక్కడ ఆయా ప్రదేశములకు అనురూపముగా ఇళ్లను కట్టించెను.

గ్రామాన్ పురః పత్తనాని దుర్గాణి వివిధాని చ ।
ఘోషాన్ వ్రజాన్ సశిబిరానాకరాన్ ఖేటఖర్వటాన్ ॥ 31

గ్రామాన్ - గ్రామమ్ములను, పురః - నగరములను, పత్తనాని - పట్ట ణములను, వివిధాని - రకరకముల, దుర్గాణి చ - దుర్గములను, ఘోషాన్ - గొల్లపల్లెలను, వ్రజాన్ - పశువుల కొట్టములను, సశిబిరాన్ - సేనల శిబి రములతో కూడియున్న, ఆకరాన్ - గనులను, ఖేటఖర్వటాన్ - వ్యవసాయ గ్రామములను కొండలలో గ్రామములను.

పృథువు గ్రామములను, పట్టణములను, నగరములను, రకరక ముల దుర్గములను, గొల్లపల్లెలను, పశువుల కొట్టములను, వ్యవసాయ గ్రామములను, కొండలలో గ్రామములను నిర్మించెను. ఆయన గనులను అభివృద్ధి చేసి, వాటికి సమీపములో సేనానివాసములను ఏర్పాటుచేసెను.

ప్రాక్ పృథోరిహ నైవైషా పురగ్రామాదికల్పనా ।
యథాసుఖం వసంతి స్మ తత్ర తత్రాఽకుతోభయాః ॥ 32

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే చతుర్థస్కంధే పృథూపాఖ్యానే
పృథివీదోహనవర్ణనం నామ అష్టాదశోఽధ్యాయః ॥

పృథోః - పృథువునకు, ప్రాక్ - ముందు, ఇహ - ఈ లోకమునం దు, ఏషా - ఈ, పురగ్రామ-ఆదికల్పనా - నగరములు గ్రామములు మొద లగు వ్యవస్థ, న - లేదు, తత్ర తత్ర - అక్కడక్కడ, అకుతః-భయాః - దేని

నుండియైననూ భయము లేని జనులు, యథాసుఖమ్ - సుఖముగా, వసంతి స్మ - నివసించిరి.

గ్రామములు, నగరములు మొదలగు ఇట్టి వ్యవస్థ పృథువునకు పూర్వము లేకుండెను. అప్పుడు జనులు తమకు తోచిన చోట నివసించు చుండిరి. కాని, పృథువు అట్టి వ్యవస్థను చేసిన తరువాత, జనులు ఆయా స్థానములలో ఏ విధమైన భయము లేకుండగా సుఖముగా నివసించిరి.

శ్రీమద్భాగవత మహాపురాణములోని నాల్గవ స్కంధములో
పృథివీదోహనము అనే పదునెనిమిదవ
అధ్యాయము ముగిసినది (18).

*****

# అథ ఏకోనవింశోఽధ్యాయః

## పృథూపాఖ్యానము - పృథువు ఇంద్రునితో మైత్రిని నెరపుట

మైత్రేయ ఉవాచ ।
అథాదీక్షత రాజా తు హయమేధశతేన సః ।
బ్రహ్మావర్తే మనోః క్షేత్రే యత్ర ప్రాచీ సరస్వతీ ॥ 1

మైత్రేయః - మైత్రేయ మహర్షి, ఉవాచ - పలికెను, అథ - తరువాత, సః - ఆ, రాజా తు - పృథు మహారాజైతే, మనోః - స్వాయంభువ మనువుయొక్క, క్షేత్రే - యజ్ఞస్థానమగు, బ్రహ్మావర్తే - బ్రహ్మావర్తమునందు, హయమేధశతేన - వంద అశ్వమేధములచే, అదీక్షత - దీక్షను చేపట్టెను, యత్ర - ఎక్కడనైతే, సరస్వతీ - సరస్వతీ నది, ప్రాచీ - తూర్పుగా ప్రవహించునో.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- తరువాత ఆ పృథు మహారాజు బ్రహ్మావర్తమునందు వంద అశ్వమేధయాగములను చేయుటకు సంకల్పించెను. స్వాయంభువ మనువు కూడ అక్కడనే యజ్ఞములను చేసెను. అచట సరస్వతీ నది తూర్పు వైపునకు ప్రవహించును.

తదభిప్రేత్య భగవాన్ కర్మాతిశయమాత్మనః ।
శతక్రతుర్న మమృషే పృథోర్యజ్ఞమహోత్సవమ్ ॥ 2

భగవాన్ - పూజ్యుడు, శతక్రతుః - వంద యజ్ఞములను చేసినవాడు అగు ఇంద్రుడు, ఆత్మనః - తనయొక్క, కర్మ-అతిశయమ్ - కర్మను అతిక్రమించుటను, అభిప్రేత్య - తెలుసుకొని, పృథోః - పృథువుయొక్క, తత్ - ఆ, యజ్ఞమహా-ఉత్సవమ్ - యజ్ఞము అనే గొప్ప ఉత్సవమును, న మమృషే - సహించలేకపోయెను.

పృథువు వంద యజ్ఞములను చేసి తనకంటె గొప్ప కర్మానుష్ఠానప రుడుగా కాదలచుకున్న సంగతి తెలిసిన ఇంద్రుడు ఆ యజ్ఞముల గొప్ప ఉత్సవమును చూచి సహించ లేకపోయెను.

యత్ర యజ్ఞపతిస్సాక్షాద్భగవాన్ హరిరీశ్వరః ।
అన్వభూయత సర్వాత్మా సర్వలోకగురుః ప్రభుః ॥ 3

యత్ర - ఏ యజ్ఞమునందు, యజ్ఞపతిః - యజ్ఞములకు ప్రభువు, ఈశ్వరః - జగన్నాథుడు, సర్వలోకగురుః - సకలలోకములకు తండ్రి, ప్రభుః - సర్వసమర్థుడు అగు, భగవాన్ హరిః - శ్రీహరి భగవానుడు, సాక్షాత్ - స్వయముగా, అను-అభూయత- ప్రత్యక్షముగా దర్శించబడెనో.

యజ్ఞములకు ప్రభువు, జగన్నాథుడు, సకలలోకములకు తండ్రి, సర్వశక్తిమంతుడు అగు శ్రీహరి భగవానుడు ఆ పృథువు యజ్ఞములో స్వయముగా దర్శనమిచ్చెను.

అన్వితో బ్రహ్మశర్వాభ్యాం లోకపాలైస్సహానుగైః ।
ఉపగీయమానో గంధర్వైర్మునిభిశ్చాప్సరోగణైః ॥ 4

బ్రహ్మశర్వాభ్యామ్ - బ్రహ్మగారిచే మరియు శివునిచే, సహ-అనుగైః - అనుయాయులతో కూడియున్న, లోకపాలైః - లోకపాలకులచే, అన్వితః - అనుసరించబడినవాడు, గంధర్వైః - గంధర్వులచే, మునిభిః - మహర్షులచే, అప్సరోగణైః - అప్సరసల గణములచే, ఉపగీయమానః - కీర్తించబడుచున్నవాడు.

అపుడు బ్రహ్మగారు, శివుడు, లోకపాలకులు, వారి అనుయాయులు ఆ శ్రీహరి వెంట నడచిరి. గంధర్వులు, మహర్షులు, అప్సరసల గణములు ఆయనను కీర్తించుచుండెను.

సిద్ధవిద్యాధరా దైత్యా దానవా గుహ్యకాదయః ।
సునందనందప్రముఖాః పార్షదప్రవరా హరేః ॥ 5

కపిలో నారదో దత్తో యోగేశస్సనకాదయః ।
తమన్వీయుర్భాగవతా యే చ తత్సేవనోత్సుకాః ॥ 6

సిద్ధవిద్యాధరాః - సిద్ధులు విద్యాధరులు, దైత్యాః - దితి వంశీయులు, దానవాః - దను వంశీయులు, గుహ్యాక-ఆదయః - యక్షులు మొదలగువారు, సునందనందప్రముఖాః - సునందుడు నందుడు మొదలుగా గల, హరేః - శ్రీహరియొక్క, పార్షదప్రవరాః - అనుచరులలో ప్రముఖులు, కపిలః - కపిలుడు, నారదః - నారదుడు, యోగ-ఈశః - యోగులకు ప్రభువగు, దత్తః - దత్తాత్రేయులు, సనక-ఆదయః - సనకుడు మొదలగువారు, యే - ఏ, భాగవతాః చ - భగవద్భక్తులు, తత్-సేవన-ఉత్సుకాః - ఆ శ్రీహరిని సేవించాలనే ఉత్సాహము గలవారో, తమ్ - ఆ శ్రీహరిని, అను-ఈయుః - అనుసరించి నడిచిరి.

సిద్ధులు, విద్యాధరులు, దితి దను వంశములకు చెందిన రాక్షసులలో భగవద్భక్తులైనవారు, యక్షులు మొదలగువారు, శ్రీహరి అనుచరులలో ప్రముఖులగు సునందుడు నందుడు మొదలగువారు శ్రీహరిని అనుసరించి అచటకు వెళ్లిరి. కపిలాచార్యుడు, నారద మహర్షి, యోగులకు ప్రభువగు దత్తాత్రేయ మహర్షి, సనక సనందనాదులు శ్రీహరిని సేవించాలనే ఉత్సాహము గల భగవద్భక్తులు. వారు కూడ వెళ్లిరి.

యత్ర ధర్మదుఘా భూమిస్సర్వకామదుఘా సతీ ।
దోగ్ధి స్మాభీప్సితానర్థాన్ యజమానస్య భారత ॥ 7

భారత - భరత వంశీయుడవగు ఓ విదురా!, యత్ర - ఎక్కడనైతే, ధర్మదుఘా - ధర్మమును వర్ధిల్లజేయు, భూమిః - భూమి, సర్వకామదుఘా సతీ - అన్ని కోరికలను సంపాదించునదై, యజమానస్య - యజమానునకు, అభి-ఈప్సితాన్ - అభీష్టములగు, అర్థాన్ - ప్రయోజనములను, దోగ్ధి స్మ - సంపాదించి పెట్టునో.

భరత వంశీయుడవగు ఓ విదురా! ఆ యజ్ఞమునందు భూమి కామిత పదార్థములనన్నింటినీ సంపాదించి పెట్టి ధర్మమును వర్ధిల్ల జేసె

ను. యజ్ఞమును చేయుచున్న పృథువునకు భూమి కామధేనువు రూప ములో అభీష్టములగు ప్రయోజనములను సంపాదించి పెట్టెను.

ఊహుస్సర్వరసాన్నద్యః క్షీరదధ్యన్నగోరసాన్ ।
తరవో భూరివర్ష్మాణః ప్రాసూయంత మధుచ్యుతః ।। 8

నద్యః - నదులు, క్షీరదధి-అన్నగోరసాన్ - పాలు పెరుగు పానకము నేయి మజ్జిగలను, సర్వరసాన్ - అన్ని రసములను, ఊహుః - ప్రవహించినవి, భూరివర్ష్మాణః - పెద్ద మ్రానులు గల, మధుచ్యుతః - తేనెను స్రవించు, తరవః - చెట్లు, ప్రాసూయంత - గొప్పగా ఫలించినవి.

పాలు, పెరుగు, పానకము, నేయి, మజ్జిగ మొదలగు రసములు అన్నీ నదులై పారినవి. పెద్ద మ్రానులు గల చెట్లు తేనెలను స్రవించి, పుష్కలముగా పండ్లను సమకూర్చినవి.

సింధవో రత్ననికరాన్ గిరయోఽన్నం చతుర్విధమ్ ।
ఉపాయనముపాజహ్రుస్సర్వే లోకాస్సపాలకాః ।। 9

సింధవః - సముద్రములు, రత్ననికరాన్ - రత్నరాశులను, గిరయః - పర్వతములు, చతుర్విధమ్ - నాలుగు రకముల, అన్నమ్ - ఆహారమును, సర్వే - అందరు, లోకాః - జనులు, సపాలకాః - పాలకులతో కూడినవారై, ఉపాయనమ్ - బహుమతిని, ఉపాజహ్రుః - సమర్పించిరి.

సముద్రములు రత్నముల రాశులను, పర్వతములు భక్ష్యము (నమిలి తినదగినది) భోజ్యము (త్రాగదగినది) లేహ్యము (నాలుకతో ఆస్వాదించదగినది) చోష్యము (పీల్చదగినది) అనే నాలుగు రకముల ఆహారమును సమర్పించినవి. జనులు, సామంత ప్రభువులు అనేక పదార్థములను బహుమతులుగా సమర్పించిరి.

ఇతి చాధోక్షజేశస్య పృథోస్తు పరమోదయమ్ ।
అసూయయన్ భగవానింద్రః ప్రతిఘాతమచీకరత్ ।। 10

అధోక్షజ-ఈశస్య - శ్రీహరియే ప్రభువుగా గల, పృథోః - పృథువు యొక్క, ఇతి - ఈ విధమగు, పరమ-ఉదయమ్ - గొప్ప అభివృద్ధిని ఉద్దే శించి, అసూయన్ - అసూయను చేయుచున్న, భగవాన్ - పూజ్యుడగు, ఇంద్రః - ఇంద్రుడు, ప్రతిఘాతమ్ - విఘ్నమును, అచీకరత్ - చేసెను.

ప్రత్యక్షాది ప్రమాణములకు గోచరము కాని శ్రీహరియే పృథువు నకు నాథుడు. ఆయనకు పట్టిన ఈ గొప్ప అభివృద్ధిని చూచి పూజ్యుడగు ఇంద్రుడు ఓర్వలేక, విఘ్నమును చేసెను.

చరమేణాఽశ్వమేధేన యజమానే యజుష్పతిమ్ ।
వైన్యే యజ్ఞపశుం స్పర్ధన్నపోవాహ తిరోహితః ॥ 11

వైన్యే - వేనపుత్రుడగు పృథువు, చరమేణ - ఆఖరి, అశ్వమేధేన - అశ్వమేధముచే, యజుః-పతిమ్ - యజ్ఞేశ్వరుడగు శ్రీహరిని, యజమానే - ఆరాధించుచుండగా, స్పర్ధన్ - స్పర్ధను చేయుచున్న ఇంద్రుడు, తిరో హితః - కంటికి కానరానివాడై, యజ్ఞపశుమ్ - యజ్ఞపశువును, అప-ఉ వాహ - అపహరించెను.

వేనపుత్రుడగు పృథువు తన ఆఖరి వందవ అశ్వమేధయాగమును చేయుచూ యజ్ఞేశ్వరుడగు శ్రీహరిని ఆరాధించుచుండెను. దీనిని చూచి ఓర్వలేకపోయిన ఇంద్రుడు కంటికి కానరానివాడై యజ్ఞాశ్వమును అపహ రించెను.

తమత్రిర్భగవానైక్షత్త్వరమాణం విహాయసా ।
ఆముక్తమివ పాఖండం యోఽధర్మే ధర్మవిభ్రమః ॥ 12

ఆముక్తం ఇవ - కవచమువంటి, పాఖండమ్ - పాఖండరూపుడై, విహాయసా - ఆకాశముచే, త్వరమాణమ్ - వేగముగా వెళ్లుచున్న, తమ్ - ఆ ఇంద్రుని, భగవాన్ - పూజ్యుడగు, అత్రిః - అత్రి మహర్షి, ఐక్షత్ - చూచెను, యః - ఎవడైతే, అధర్మే - అధర్మమునందు, ధర్మవిభ్రమః - ధర్మము అనే భ్రమను కలిగించునో.

ఇంద్రుడు పాఖండుని వేషమునే కవచముగా ధరించి ఆకాశమార్గ ములో వేగముగా వెళ్లిపోవుచుండగా, పూజ్యుడగు అత్రి మహర్షి చూచెను. ధార్మికవేషమును వేసుకొని జనులకు అధర్మమునందు ధర్మమనే భ్రాంతిని కలిగించువాడు పాఖండుడు.

అత్రిణా చోదితో హంతుం పృథుపుత్రో మహారథః ।
అన్వధావత సంక్రుద్ధస్తిష్ఠ తిష్ఠేతి చాబ్రవీత్ ॥ 13

అత్రిణా - అత్రి మహర్షిచే, చోదితః - ప్రేరితుడైన, మహారథః - మహారథుడగు, పృథుపుత్రః - పృథువుయొక్క పుత్రుడు, సంక్రుద్ధః - చాల కోపించినవాడై, అను-అధావత - వెంట పరుగెత్తెను, తిష్ఠ తిష్ఠ - నిలు నిలు, ఇతి చ - అని, అబ్రవీత్ - పలికెను.

అత్రి మహర్షి పృథువుయొక్క పుత్రుని ప్రేరేపించెను. మహారథు డగు (రథయుద్ధములో దిట్ట) ఆతడు చాల కోపించి ఇంద్రుని వెంబడి పరు గెత్తి, నిలు నిలు అని పలికెను.

తం తాదృశాకృతిం వీక్ష్య మేనే ధర్మం శరీరిణమ్ ।
జటిలం భస్మనాచ్ఛన్నం తస్మై బాణం న ముంచతి ॥ 14

జటిలమ్ - జటలను ధరించినట్టియు, భస్మనా - భస్మచే, ఛన్నమ్ - పూయబడినట్టియు, తాదృశ-ఆకృతిమ్ - అట్టి ఆకారము గల, తమ్ - ఆతనిని, వీక్ష్య - చూచి, శరీరిణమ్ - దేహమును దాల్చిన, ధర్మమ్ - ధర్మ మునుగా, మేనే - తలచెను, తస్మై - వాని కొరకు, బాణమ్ - బాణమును, న ముంచతి - విడుచుట లేదు.

ఇంద్రుడు ఆ వేషములో జటలను దాల్చి భస్మను పూసుకొని యుండెను. ఆతనిని చూచి పృథుపుత్రుడు మూర్తి దాల్చిన ధర్మమే అని భావించి, వానిపై బాణమును విడిచిపెట్టలేదు.

వధాన్నివృత్తం తం భూయో హంతవేఽత్రిరచోదయత్ ।
జహి యజ్ఞహనం తాత మహేంద్రం విబుధాధమమ్ ॥ 15

వధాత్ - వధనుండి, నివృత్తమ్ - నివృత్తుడైయున్న, తమ్ - వాని ని, అత్రిః - అత్రి మహర్షి, భూయః - మరల, హంతవే - సంహరించుటకు, అచోదయత్ - ప్రేరేపించెను, తాత - కుమారా!, యజ్ఞహనమ్ - యజ్ఞ మును చెడగొట్టునట్టియు, విబుధ-అధమమ్ - దేవతలలో అధముడగు, మహా-ఇంద్రమ్ - మహేంద్రుని, జహి - చంపుము.

పృథుపుత్రుడు ఇంద్రుని బాణముతో కొట్టకుండుటను చూచి, అత్రి మహర్షి మరల అతనిని ఇంద్రుని వధించుమని ఇట్లు ప్రేరేపించెను: ఓ. కుమారా! దేవతలలో అధముడగు ఈ మహేంద్రుడు యజ్ఞమును చెడగొట్టి నాడు. కావున, వీనిని వధించుము.

ఏవం వైన్యసుతః ప్రోక్తస్త్వరమాణం విహాయసా ।
అన్వద్రవదభిక్రుద్ధో రావణం గృధ్రరాడివ ।। 16

వైన్యసుతః - వేనుని పుత్రుడగు పృథువుయొక్క పుత్రుడు, ఏవమ్ - ఈ విధముగా, ప్రోక్తః - ప్రేరేపించబడినవాడై, అభిక్రుద్ధః - చాల కోపించి నవాడై, విహాయసా - ఆకాశముచే, త్వరమాణమ్ - తొందరగా వెళ్లుచున్న ఇంద్రుని, గృధ్రరాట్ - జటాయువు, రావణం ఇవ - రావణుని వలె, అను -అద్రవత్ - వెంట పరుగెత్తెను.

వేనుని పుత్రుడగు పృథువుయొక్క పుత్రుని అత్రి మహర్షి ఈ విధ ముగా ప్రోత్సహించెను. అపుడాతడు చాల కోపించి, జటాయువు రావణుని తరిమిన విధముగా, ఆకాశమార్గములో తొందరగా వెళ్లిపోవుచున్న ఇంద్రుని వెంట పరుగెత్తెను.

సోఽశ్వం రూపం చ తద్ధిత్వా తస్మా అంతర్హితస్స్వరాట్ ।
వీరస్స్వపశుమాదాయ పితుర్యజ్ఞముపేయివాన్ ।। 17

స్వరాట్ - స్వర్గాధిపతియగు, సః - ఆ ఇంద్రుడు, తత్ - ఆ, రూపమ్ - రూపమును, తస్మై - వాని కొరకు, అశ్వం చ - గుర్రమును కూడ, హిత్వా - విడిచిపెట్టి, అంతర్హితః - అంతర్ధానమును చెందెను, వీరః - వీరుడగు పృథుపుత్రుడు, స్వపశుమ్ - తమ యజ్ఞపశువును, ఆదాయ -

తీసుకొని, పితుః - తండ్రియొక్క, యజ్ఞమ్ - యజ్ఞమును, ఉపేయివాన్ - చేరుకొనెను.

అపుడు స్వర్గాధిపతియగు ఇంద్రుడు ఆ పాఖండ వేషమును మార్చివేసి, గుఱ్ఱమును పృథుపుత్రునకు విడిచిపెట్టి, అంతర్ధానమాయెను. వీరుడగు ఆ పృథుపుత్రుడు యజ్ఞపశువగు ఆ గుఱ్ఱమును దోడ్కొని, తండ్రి యజ్ఞము జరుగుచున్న స్థానమును చేరుకొనెను.

తత్తస్య చాద్భుతం కర్మ విచక్ష్య పరమర్షయః ।
నామధేయం దదుస్తస్మై విజితాశ్వ ఇతి ప్రభో ॥ 18

ప్రభో - సమర్థుడవగు ఓ విదురా!, పరమ-ఋషయః - మహర్షులు, తస్య - ఆ పృథుపుత్రుని, తత్ - ఆ, అద్భుతమ్ - ఆశ్చర్యకరమగు, కర్మ - పనిని, విచక్ష్య - చూచి, తస్మై - వాని కొరకు, విజితాశ్వః - విజితాశ్వుడు అని, నామధేయమ్ - పేరును, దదుః - ఇచ్చిరి.

సమర్థుడవగు ఓ విదురా! ఆ పృథుపుత్రుని ఆ ఆశ్చర్యకరమగు చేష్టితమును చూచిన మహర్షులు ఆతనికి విజితాశ్వుడు (జయించబడిన గుఱ్ఱము గలవాడు) అని పేరు పెట్టిరి.

ఉపసృజ్య తమస్తీవ్రం జహారాశ్వం పునర్హరిః ।
చషాలయూపతశ్ఛన్నో హిరణ్యరశనం విభుః ॥ 19

విభుః - సర్వసమర్థుడగు, హరిః - ఇంద్రుడు, తీవ్రమ్ - దట్టని, తమః - చీకటిని, ఉపసృజ్య - సృష్టించి, ఛన్నః - కప్పబడినవాడై, హిరణ్యరశనమ్ - బంగరు జీను గల, అశ్వమ్ - గుఱ్ఱమును, చషాలయూపతః - చషాలముతో కూడిన యూపము వద్దనుండి, పునః - మరల, జహార - అపహరించెను.

సర్వసమర్థుడగు ఇంద్రుడు దట్టని చీకటిని సృష్టించి దానిలో కనబడకుండా వచ్చి, బంగరు జీనుతో కూడియున్న ఆ గుఱ్ఱమును మరల, చషాలము (చెక్కతో చేసిన కడియము, యూపమునకు కొనయందుండునది)

తో కూడియున్న యూపము (పశువును కట్టే రాట) వద్దనుండి అపహరించెను.

అత్రిస్సందర్శయామాస త్వరమాణం విహాయసా ।
కపాలఖట్వాంగధరం వీరో నైనమబాధత ॥ 20

విహాయసా - ఆకాశముచే, త్వరమాణమ్ - తొందరగా వెళ్ళుచున్నట్టియు, కపాలఖట్వాంగధరమ్ - పుర్రెతో కర్రను ధరించియున్న ఇంద్రుని, అత్రిః - అత్రి మహర్షి, సందర్శయామాస - చూపించెను, వీరః - వీరుడగు విజితాశ్వుడు, ఏనమ్ - వీనిని, న అబాధత - బాధించలేదు.

ఇంద్రుడు ఆకాశమార్గము గుండా వేగముగా వెళ్ళుచుండగా అత్రి మహర్షి వీరుడగు విజితాశ్వునకు చూపించెను. కాని, ఆ ఇంద్రుడు చేతికర్రపై పుర్రెను దాల్చి ధార్మికవేషములోనుండుటచే, విజితాశ్వుడాతనికి ఇబ్బందిని కలిగించలేదు.

అత్రిణా చోదితస్తస్మై సందధే విశిఖం రుషా ।
సోఽశ్వం రూపం చ తద్ధిత్వా తస్థావంతర్హితస్స్వరాట్ ॥ 21

అత్రిణా - అత్రి మహర్షిచే, చోదితః - ప్రేరేపించబడిన విజితాశ్వుడు, తస్మై - వాని కొరకు, రుషా - కోపముతో, విశిఖమ్ - బాణమును, సందధే - ఎక్కు పెట్టెను, స్వరాట్ - స్వర్గాధిపతియగు, సః - ఆ ఇంద్రుడు, తత్ - ఆ, రూపమ్ - వేషమును, అశ్వం చ - గుర్రమును కూడ, హిత్వా - విడిచిపెట్టి, అంతర్హితః - అంతర్ధానమును చెందినవాడై, తస్థౌ - నిలబడెను.

అత్రి మహర్షి ప్రేరేపించగా, విజితాశ్వుడు కోపించి వానిని కొట్టుటకు బాణమునెక్కుపెట్టెను. అప్పుడు స్వర్గాధిపతియగు ఆ ఇంద్రుడు ఆ వేషమును గుర్రమును కూడ విడిచిపెట్టి, అంతర్ధానమును చెందెను.

వీరశ్చాశ్వముపాదాయ పితృయజ్ఞమథావ్రజత్ ।
తదవద్యం హరేః రూపం జగృహుర్జ్ఞానదుర్బలాః ॥ 22

అథ - తరువాత, వీరః - వీరుడగు విజితాశ్వుడు, అశ్వమ్ - గుఱ్ఱమును, ఉపాదాయ - తీసుకొని, పితృయజ్ఞమ్ - తండ్రిగారి యజ్ఞమును గురించి, అవ్రజత్ - వెళ్లెను, జ్ఞానదుర్బలాః - జ్ఞానమునందు దుర్బలులగు జనులు, హరేః - ఇంద్రునియొక్క, తత్ - ఆ, అవద్యమ్ - నిందనీయమైన, రూపమ్ - రూపమును, జగృహుః - స్వీకరించిరి.

అప్పుడు వీరుడగు విజితాశ్వుడు ఆ గుఱ్ఱమును దోడ్కొని తన తండ్రి యజ్ఞమును చేయుచున్న స్థానమును చేరుకొనెను. ఇంద్రుని ఆ నింద్యమగు వేషమును జ్ఞానయోగమునందు శక్తిలేని జనులు స్వీకరించిరి.

యాని రూపాణి జగృహే ఇంద్రో హయజిహీర్షయా ।
తాని పాపస్య ఖండాని లింగం ఖండమిహోచ్యతే ॥ 23

ఇంద్రః - ఇంద్రుడు, హయజిహీర్షయా - గుఱ్ఱమును అపహరించే కోరికతో, యాని - ఏ, రూపాణి - రూపములను, జగృహే - స్వీకరించెనో, తాని - ఆ రూపములు, పాపస్య - పాపమునకు, ఖండాని - గుర్తులు, ఇహ - ఈ ప్రసంగములో,లింగమ్ - చిహ్నము, ఖండమ్ - ఖండమని, ఉచ్యతే - చెప్పబడుచున్నది.

ఇంద్రుడు గుఱ్ఱమును అపహరించగోరి, ఏయే వేషములను వేసుకొనెనో, అవి పాపమునకు గుర్తులు. పాపముయొక్క ఖండములు (అనగా, పాపచిహ్నములు) అని పాఖండ శబ్దమునకు శాస్త్రములో నిర్వచనము చెప్పబడినది.

ఏవమింద్రే హరత్యశ్వం వైన్యయజ్ఞజిఘాంసయా ।
తద్గృహీతవిసృష్టేషు పాఖండేషు మతిర్నృణామ్ ॥ 24

ధర్మ ఇత్యుపధర్మేషు నగ్నరక్తపటాదిషు ।
ప్రాయేణ సజ్జతే భ్రాంత్యా పేశలేషు చ వాగ్మిషు ॥ 25

ఏవమ్ - ఈ విధముగా, వైన్యయజ్ఞజిఘాంసయా - వేనపుత్రుడగు పృథువుయొక్క యజ్ఞమును చెడగొట్టాలనే కోరికతో, ఇంద్రే - ఇంద్రుడు, అశ్వమ్ - గుఱ్ఱమును, హరతి - అపహరించుచుండగా, తత్-గృహీతవిసృ

ష్వేషు - వానిచే స్వీకరించబడి విడిచిపెట్టబడిన, ఉపధర్మేషు - ధర్మాభాస లగు, పాఖండేషు - పాపపు గురుతులు గలవారియందు, పేశలేషు - చాతుర్యము గల, చ - మరియు, వాగ్మిషు - వక్తలు అగు, నగ్నరక్తపట-ఆదిషు - దిగంబరులు ఎఱ్ఱని వస్త్రమును ధరించువారు మొదలగువారియందు, నృణామ్ - మానవుల, మతిః - బుద్ధి, ధర్మః - ధర్మము, ఇతి - అని, భ్రాంత్యా - భ్రమచే, ప్రాయేణ - తరచుగా, సజ్జతే - లగ్నమగుచున్నది.

ఈ విధముగా ఇంద్రుడు వేనపుత్రుడగు పృథువుయొక్క యజ్ఞమును చెడగొట్టగోరి, గుఱ్ఱమును అపహరిస్తూ అనేకవేషములను దాల్చి విడిచిపెట్టెను. పాపపు గురుతులగు ఆ వేషములను కొందరు దాల్చి పాఖండులైనారు. ఇట్టివారిని చూచి జనులు ధార్మికులని భ్రమపడుచుందురు. వీరు పాలించేది ధర్మాభాసమే (ధర్మము వలె కన్పట్టుట) గాని ధర్మము కాదు. వీరిలో కొందరు దిగంబరులు కాగా, మరికొందరు ఎఱ్ఱని వస్త్రములను ధరింతురు. ఇంకొందరు కాపాలికులు. వీరు జనులను ఆకర్షించుటలో నిపుణులు, మంచి తర్కకౌశలము గలవారు. కావుననే, జనుల బుద్ధి తరచుగా వీరియందు లగ్నమగుచుండును.

తదభిజ్ఞాయ భగవాన్ పృథుః పృథుపరాక్రమః ।
ఇంద్రాయ కుపితో బాణమాదత్తోద్యతకార్ముకః ॥ 26

భగవాన్ - పూజ్యుడు, పృథుపరాక్రమః - గొప్ప పరాక్రమము గలవాడు అగు, పృథుః - పృథువు, తత్ - ఆ విషయమును, అభిజ్ఞాయ - తెలుసుకొని, ఇంద్రాయ - ఇంద్రుని కొరకు, కుపితః - కోపించినవాడై, ఉద్యతకార్ముకః - ఎక్కు పెట్టబడిన ధనస్సు గలవాడై, బాణమ్ - బాణమును, ఆదత్త - తీసుకొనెను.

పూజ్యుడు, గొప్ప పరాక్రమము గలవాడు అగు పృథు మహారాజునకు ఆ విషయము తెలిసెను. ఆయనకు ఇంద్రునిపై కోపము కలిగెను. ఆయన ధనస్సును సంధానము చేసి, చేతిలోనికి బాణమును తీసుకొనెను.

తమృత్విజశ్శక్రవధాభిసంధితం
విచక్ష్య దుఃప్రేక్ష్యమసహ్యరంహసమ్ ।
నివారయామాసురహో మహామతే
న యుజ్యతేఽత్రాన్యవధః ప్రచోదితాత్ ॥ 27

శక్రవధ-అభిసంధితమ్ - ఇంద్రుని వధించే అభిప్రాయము కలిగినట్టియు, దుః-ప్రేక్ష్యమ్ - చూడ శక్యము కానట్టియు, అసహ్యరంహసమ్ - సహింప శక్యము కాని వేగము గల, తమ్ - ఆ పృథువును, విచక్ష్య - చూచి, ఋత్విజః - ఋత్విక్కులు, నివారయామాసుః - వారించిరి, అహో - అయ్యో!, మహామతే - ఓ గొప్ప బుద్ధిశాలీ!, అత్ర - ఈ యజ్ఞశాలయందు, ప్రచోదితాత్ - వేదముచే నిర్దేశించబడినదానికంటె, అన్యవధః - మరియొక ప్రాణియొక్క వధ, న యుజ్యతే - తగదు.

ఇంద్రుని వధించాలనే నిర్ణయమునకు వచ్చిన పృథువుయొక్క తేజస్సు చూడ శక్యము గాకుండ నుండెను. ఆయన వేగమును శత్రువులు ఓర్చుకోలేరు. ఆయనను ఆ విధముగా చూచిన ఋత్విక్కులు ఆయనను ఆ ప్రయత్నమునుండి విరమింప జేయుచూ, ఇట్లు బోధించిరి: ఓ మహారాజా! నీవు గొప్ప బుద్ధిశాలివి. అయ్యో! యజ్ఞశాలలో వేదవిహితమైన పశువును తప్ప, ఇతరమగు ప్రాణిని దేనినైననూ వధించుట తగదు.

వయం మరుత్వంతమిహార్థనాశనం
హ్వయామహే త్వచ్ఛ్రవసా హతత్విషమ్ ।
అయాతయామోపహవైరనంతరం
ప్రసహ్య రాజన్ జుహవామ తేఽహితమ్ ॥ 28

రాజన్ - ఓ రాజా!, వయమ్ - మేము, అయాతయామ-ఉపహవైః - వశించని శక్తి గల ఆహ్వానమంత్రములచే, అర్థనాశనమ్ - యజ్ఞమనే ప్రయోజనమును చెడగొట్టినట్టియు, త్వత్-శ్రవసా - నీ కీర్తిచే, హతత్విషమ్ - నశింపజేయబడిన కాంతి కలిగినట్టియు, తే - నీకు, అహితమ్ - శత్రువైన, మరుత్వంతమ్ - ఇంద్రుని, ఇహ - ఇచటకు, హ్వయామహే -

ఆహ్వానించెదము, అనంతరమ్ - తరువాత, ప్రసహ్య - బలాత్కారముగా, జుహవామ - హోమము చేసెదము.

ఓ రాజా! ఇంద్రుడు నీ యజ్ఞమును చెడగొట్టుటకు యత్నించి నీకు శత్రువైనాడు. నీ కీర్తియొక్క ప్రభావముచే ఇప్పటికే వాని తేజస్సు క్షీణించి నది. అట్టి ఇంద్రుని మేము ఇచటకు మంత్రములతో ఆహ్వానించెదము. మా ఆహ్వానమంత్రముల శక్తి ఇంకనూ నశించలేదు. తరువాత వానిని వెంటనే అగ్నిలో బలాత్కారముగా హోమము చేయుదము.

ఇత్యామంత్ర్య క్రతుపతిం విదురాస్యర్త్విజో రుషా ।
స్రుగ్ఘస్తాన్ జుహ్వతోఽభ్యేత్య స్వయంభూః ప్రత్యషేధత ।।29

విదుర - ఓ విదురా!, ఇతి - ఈ విధముగా, క్రతుపతిమ్ - యజ్ఞ మునకు అధిపతియగు పృథువును, ఆమంత్ర్య - ఒప్పించి, రుషా - కోప ముతో, జుహ్వతః - హోమమును చేయుచున్నట్టియు, స్రుక్-హస్తాన్ - స్రుక్కులు చేతులయందు గలిగియున్న, అస్య - ఈ పృథువుయొక్క, ఋత్విజః - ఋత్విక్కులను, స్వయంభూః - స్వయంభువుడగు బ్రహ్మగా రు, అభ్యేత్య - వచ్చి, ప్రత్యషేధత - నివారించెను.

ఓ విదురా! ఈ విధముగా యజమానుడగు పృథువుయొక్క ఋత్విక్కులు ఆయనను ఒప్పించి, స్రుక్కు (హోమసాధనము) లను చేతి లోనికి తీసుకొని కోపముగా ఆహ్వానమంత్రములతో హోమమును చేయ బోవుచుండగా, స్వయంభువుడగు బ్రహ్మగారు అచటకు వచ్చి వారిని వారించిరి.

న వధ్యో భవతామింద్రో యద్యజ్ఞో భగవత్తనుః ।
యం జిఘాంసథ యజ్ఞేన యస్యేష్టాస్తనవస్సురాః ।। 30

భవతామ్ - మీకు, ఇంద్రః - ఇంద్రుడు, వధ్యః - వధించ దగినవా డు, న - కాదు, యత్ - ఏలయనగా, యజ్ఞః - యజ్ఞుడనబడే ఇంద్రుడు (యజ్ఞము), భగవత్-తనుః - భగవానుని దేహమే, యమ్ - ఏ ఇంద్రుని, యజ్ఞేన - యజ్ఞముచే, జిఘాంసథ - సంహరించ గోరుచున్నారో, యస్య -

ఏ ఇంద్రునకు (ఏ శ్రీహరికి), సురాః - దేవతలు, ఇష్టాః - ప్రియములగు, తనవః - శరీరములో.

మీరు యజ్ఞవిఘాతము నిమిత్తముగా, మరల యజ్ఞమును చేసి, ఇంద్రుని సంహరించ గోరుచున్నారు. కాని, ఇంద్రుని సంహరించుట మీకు తగదు. ఇంద్రునకు యజ్ఞుడు అని పేరు. ఆయన భగవానుని శరీరమే. దేవ తలు ఇంద్రునకు ప్రియమైన శరీరములవంటి వారు. (యజ్ఞము శ్రీహరి స్వరూపమే. యజ్ఞములో ఆరాధించబడే ఇంద్రాది దేవతలు శ్రీహరికి ప్రియమగు శరీరములవంటి వారే).

తదిదం పశ్యత మహద్ధర్మవ్యతికరం ద్విజాః ।
ఇంద్రేణానుష్ఠితం రాజ్ఞః కర్మైతద్విజిఘాంసతా ॥ 31

ద్విజాః - ఓ బ్రాహ్మణులారా!, తత్ - అందువలన, రాజ్ఞః - పృథుమహారాజుయొక్క, ఏతత్ - ఈ, కర్మ - యజ్ఞమును, విజిఘాంసతా - నాశనము చేయగోరిన, ఇంద్రేణ - ఇంద్రునిచే, అనుష్ఠితమ్ - చేయబడి న, ఇదమ్ - ఈ, మహత్-ధర్మవ్యతికరమ్ - మహాత్ముల ధర్మముయొక్క ఉల్లంఘనమును, (మహత్ - పెద్ద, ధర్మవ్యతికరమ్ - అధర్మమును), పశ్యత - గమనించుడు.

ఓ బ్రాహ్మణులారా! పృథుమహారాజుయొక్క యజ్ఞమును చెడగొ ట్టగోరి ఇంద్రుడు మహాత్ములు అనుష్ఠించే ధర్మము యెడల పెద్ద అపరాధ మును చేసి, పెద్ద అధర్మము (పాఖండము) ను సృష్టించినాడు. ఈ విష యమును మీరు గమనించుడు.

పృథుకీర్తేః పృథోర్భూయాత్తర్హ్యేకోనశతక్రతుః ।
అలం తే క్రతుభిస్స్విష్టైర్యద్భవాన్మోక్షధర్మవిత్ ॥ 32

తర్హి - అట్లైనచో, పృథుకీర్తేః - గొప్ప కీర్తి గల, పృథోః - పృథు మహారాజునకు, ఏక-ఊనశతక్రతుః - ఒకటి తక్కువ వందవ క్రతువే, భూయాత్ - అగుగాక!, సు-ఇష్టైః - చక్కగా అనుష్ఠించబడిన, క్రతుభిః -

క్రతువులచే, తే - నీకు, అలమ్ - చాలును, యత్ - ఏలయనగా, భవాన్ - నీవు, మోక్షధర్మవిత్ - మోక్షధర్మములు తెలిసినవాడవు.

అట్లైనచో, గొప్ప కీర్తి గల పృథువునకు ఒక క్రతువు తగ్గి, తొంభై తొమ్మిది మాత్రమే క్రతువులు మాత్రమే పూర్తి యగువందురా? అటులనే యగుగాక! మహారాజా! నీవు చాలినన్ని చక్కని క్రతువులను చేసితివి. పైగా, నీవు మోక్షధర్మములను తెలిసినవాడవు.

నైవాత్మనే మహేంద్రాయ రోషమాహర్తుమర్హసి ।
ఉభావపి హి భద్రం త ఉత్తమశ్లోకవిగ్రహౌ ॥ 33

ఆత్మనే - నీ రూపమే అయిన, మహేంద్రాయ - మహేంద్రుని కొరకు, రోషమ్ - కోపమును, ఆహర్తుమ్ - కలిగించుటకు, న ఏవ అర్హసి - సుతరాము తగవు, హి - ఏలయనగా, ఉభౌ అపి - మీరిద్దరు కూడ, ఉత్తమశ్లోకవిగ్రహౌ - పవిత్రమగు కీర్తి గల భగవానుని అవతారములే, తే - నీ కొరకు, భద్రమ్ - మంగళమగు గాక!

మహేంద్రుడు నీ రూపమే గనుక, నీవాయనకు కోపమును తెప్పించుట సుతరాము తగదు. ఏలయన, మీరిద్దరు పవిత్రమగు కీర్తి గల భగవానుని అవతారములే. నీకు మంగళమగు గాక!

మాఽస్మిన్మహారాజ కృథాస్స్మ చింతాం
నిశామయాఽస్మద్వచ ఆదృతాత్మా ।
యద్ధ్యాయతో దైవహతం ను కర్తుం
మనోఽతిరుష్టం విశతే తమోఽంధమ్ ॥ 34

మహారాజ - ఓ మహారాజా!, అస్మిన్ - ఈ విషయమునందు, చింతామ్ - చింతను, మా కృథాః స్మ - చేయకుము, ఆదృత-ఆత్మా - ఆదరముతో కూడిన చిత్తము గలవాడవై, అస్మత్-వచః - మా మాటను, నిశామయ - వినుము, యత్ - ఏలయనగా, దైవహతమ్ - దైవముచే విఘ్నము కలిగించబడిన పనిని, కర్తుమ్ - చేయుటకు, ధ్యాయతః - ఆలో

చించువాని, అతిరుష్టమ్ - మిక్కిలి రోషముతో కూడిన, మనః - మనస్సు, అంధమ్ - మిక్కిలి దట్టవి, తమః - అజ్ఞానమును, విశతే - పొందును.

ఓ మహారాజా! నీవీ విషయములో చింతిల్లకుము. నీవు అదర ముతో మా మాటను వినుము. దైవము విఘ్నమును కలిగించిన కార్య మును గురించి మాత్రమే చింతిల్లువాని మనస్సులో అధికమగు కోపము పుట్టును. దాని వలన వాని మనస్సు గాఢమగు అజ్ఞానములో కూరుకొని పోవును.

క్రతుర్విరమతామేష దేవేషు దురవగ్రహః ।
ధర్మవ్యతికరో యత్ర పాఖండైరింద్రనిర్మితైః ॥ 35

ఏషః - ఈ, క్రతుః - యజ్ఞము, విరమతామ్ - విరమించబడు గాక!, దేవేషు - దేవతలయందు, దురవగ్రహః - దురాగ్రహము, యత్ర - ఏ క్రతువునందైతే, ఇంద్రవిర్మితైః - ఇంద్రునిచే నిర్మించబడిన, పాఖండైః - పాపస్వభావము గలవారిచే, ధర్మవ్యతికరః - ధర్మమునకు ముప్పు గలదో.

ఈ యజ్ఞమును ఇంతటితో అపుడు. దేవతలకు దురాగ్రహము ఉండును. ఈ క్రతువు కారణముగా ఇంద్రుడు నిర్మించే పాఖండులచే ధర్మ మునకు ముప్పు వాటిల్లుచున్నది.

ఏభిరింద్రోపసంసృష్టైః పాఖండైర్హారిభిర్జనమ్ ।
హ్రియమాణం విచక్ష్వైనం యస్తే యజ్ఞధ్రుగశ్వముట్ ॥ 36

ఇంద్ర-ఉపసంసృష్టైః - ఇంద్రునిచే ప్రవర్తిల్ల జేయబడిన, హారిభిః - మనస్సును హరించే, ఏభిః - ఈ, పాఖండైః - పాఖండులచే, హ్రియమాణమ్ - ఆకర్షించబడుచున్న, ఏనమ్ - ఈ, జనమ్ - జనమును, విచక్ష్వ - చూడుము, యః - ఏ ఇంద్రుడు, తే - నీ, యజ్ఞధ్రుక్ - యజ్ఞమునకు ద్రోహమును చేసినవాడో, అశ్వముట్ - అశ్వమునపహరించినవాడో.

ఇంద్రుడు నీ గుర్రమునపహరించి నీ యజ్ఞమునకు ద్రోహమును చేసినాడు. అదే ఇంద్రునిచే లోకములో ప్రవర్తిల్ల జేయబడిన ఈ పాఖం

దులు జనులను తమ వైపునకు ఆకర్షించుచున్నారు. వారి వెంట పడి పోవు చున్న ఈ జనమును చూడుము.

భవాన్ పరిత్రాతుమిహావతీర్ణో
 ధర్మం జనానాం సమయానురూపమ్ ।
వేనాపచారాదవలుప్తమద్య
 తద్దేహతో విష్ణుకలాఽసి వైన్య ॥ 37

వైన్య - ఓ వేనపుత్రా!, వేన-అపచారాత్ - వేనుని అపరాధము వలన, అవలుప్తమ్ - లోపించిన, జనానామ్ - జనులయొక్క, సమయ-అ నురూపమ్ - కాలమునకు అనురూపముగానుండే, ధర్మమ్ - ధర్మమును, పరిత్రాతుమ్ - రక్షించుటకు, భవాన్ - నీవు, ఇహ - ఈ లోకములో, అద్య - ఈ కాలములో, తత్-దేహతః - ఆ వేనుని శరీరమునుండి, అవతీర్ణః - అవతరించితివి, విష్ణుకలా - విష్ణువుయొక్క అంశము, అసి - అగుదువు.

ఓ వేనపుత్రా! వేనుని అపరాధముచే జనులలో ధర్మము లోపించి నది. అట్టి ధర్మమును దేశకాలములకు అనురూపముగా పరిరక్షించుటకై నీవు వేనుని దేహమునుండి ఈ లోకములో ఈ కాలములో అవతరించితివి. నీవు శ్రీహరియొక్క అంశము అగుచున్నావు.

స త్వం విమృశ్యాస్య భవం ప్రజాపతే
 సంకల్పనం విశ్వసృజాం పిపీపృహి ।
ఐంద్రీం చ మాయాముపధర్మమాతరం
 ప్రచండపాఖండపథం జహి ప్రభో ॥ 38

ప్రజాపతే - ఓ మహారాజా!, సః - అట్టి, త్వమ్ - నీవు, అస్య - ఈ జగత్తుయొక్క, భవమ్ - పుట్టుకను గురించి, విమృశ్య - ఆలోచించి, విశ్వ సృజామ్ - ప్రజాపతుల, సంకల్పనమ్ - సంకల్పమును, పిపీపృహి - పూర్ణము చేయుము, ప్రభో - ఓ ప్రభూ!, చ - మరియు, ఐంద్రీమ్ - ఇంద్రునకు చెందిన, మాయామ్ - మాయ అయినట్టియు, ఉపధర్మమాత

రమ్ - అధర్మమునకు తల్లియగు, ప్రచండపాఖండపథమ్ - తీవ్రమగు దురాచారుల మార్గమును, జహి - నివారించుము.

ఓ మహారాజా! శ్రీహరి అంశవగు నీవు ఈ జగత్తుయొక్క ఉత్పత్తిని గురించి విచారించుము. విశ్వమును సృష్టించిన ప్రజాపతుల సంకల్పమును నెరవేర్చుము. నీవు సర్వసమర్థుడవు. ఇంద్రుని మాయచే అనేకులు దురాచారులు పాఖండులు అగుచున్నారు. అధర్మము వేగముగా ప్రబలిపోవుచున్నది. ఈ ముప్పును నివారించుము.

మైత్రేయ ఉవాచ ।
ఇత్థం స లోకగురుణా సమాదిష్టో విశాం పతిః ।
తథా చ కృత్వా వాత్సల్యం మఘోనాఽపి చ సందధే ।। 39

విశాం పతిః - నరపాలుడగు, సః - ఆ పృథువు, ఇత్థమ్ - ఈ విధముగా, లోకగురుణా - లోకములకు తండ్రియగు బ్రహ్మగారిచే, సమాదిష్టః - ఆదేశించబడినవాడై, తథా చ - అదే విధముగా, వాత్సల్యమ్ - స్నేహమును, కృత్వా - చేసి, మఘోనా అపి - ఇంద్రునితో గూడ, సందధే - సంధిని చేసుకొనెను.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- నరపాలుడగు పృథువును లోకములకు తండ్రియగు బ్రహ్మగారు ఈ విధముగా ఆదేశించెను. పృథువు ఆ ఆదేశమును స్వీకరించి, ఇంద్రునితో స్నేహపూర్వకమగు సంధిని చేసుకొనెను.

కృతావభృథస్నానాయ పృథవే భూరికర్మణే ।
వరాన్ దదుస్తే వరదా యే తద్బర్హిషి తర్పితాః ।। 40

కృత-అవభృథస్నానాయ - చేయబడిన అవభృథ స్నానము గలిగినట్టియు, భూరికర్మణే - అనేకములగు యజ్ఞములను చేసిన, పృథవే - పృథువు కొరకు, వరదాః - వరములనిచ్చే, తే - వారు, వరాన్ - వరములను, దదుః - ఇచ్చిరి, యే - ఎవరైతే, తత్-బర్హిషి - ఆయన యజ్ఞమునందు, తర్పితాః - సంతోషపెట్టబడినారో.

ఈ విధముగా అనేకములగు యజ్ఞములను చేసిన పృథు మహారాజు ఆ యజ్ఞములో హవిస్సులనిచ్చి దేవతలను సంతోషపెట్టెను. వరమ్ములనిచ్చే ఆ దేవతలు అవభృథ (యజ్ఞమునకు అంతమునందు చేసే) స్నానమును చేసిన పృథువునకు వరములనిచ్చిరి.

విప్రాస్సత్యాశిషస్తుష్టాశ్శ్రద్ధయా లబ్ధదక్షిణాః ।
ఆశిషో యుయుజుః క్షత్తరాదిరాజాయ సత్కృతాః ।। 41

క్షత్తః - ఓ విదురా!, సత్య-ఆశిషః - అమోఘములగు ఆశీర్వచనములు గలవారు, శ్రద్ధయా - శ్రద్ధచే, లబ్ధదక్షిణాః - పొందబడిన దక్షిణలు గలవారు అగు, విప్రాః - బ్రాహ్మణులు, సత్కృతాః - సత్కరించబడినవారై, తుష్టాః - సంతోషించినవారై, ఆదిరాజాయ - ఆదిరాజగు పృథువు కొరకు, ఆశిషః - ఆశీస్సులను, యుయుజుః - ఇచ్చిరి.

ఓ విదురా! ఆదిరాజగు పృథువు అమోఘమగు ఆశీర్వచనము గల ఆ బ్రాహ్మణులకు శ్రద్ధతో దక్షిణలనిచ్చి సత్కరించెను. వారు సంతోషించి, ఆయనకు ఆశీస్సులనిచ్చిరి.

త్వయాఽఽహూతా మహాబాహో సర్వ ఏవ సమాగతాః ।
పూజితా దానమానాభ్యాం పితృదేవర్షిమానవాః ।। 42

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే చతుర్థస్కంధే పృథూపాఖ్యానే
ఇంద్రేణ పృథోః మైత్రీవర్ణనం నామ ఏకోనవింశోఽధ్యాయః ।।

మహాబాహో - ఓ గొప్ప బాహువులు గలవాడా!, త్వయా - నీచే, ఆహూతాః - ఆహ్వానించబడిన, పితృదేవ-ఋషిమానవాః - పితృదేవతలు దేవతలు మహర్షులు మరియు మానవులు, సర్వే ఏవ - అందరు, సమాగతాః - వచ్చిరి, దానమానాభ్యామ్ - దానముచే మరియు సత్కారముచే, పూజితాః - పూజించబడిరి.

ఆ బ్రాహ్మణులు పృథువుతో ఇట్లు పలికిరి : గొప్ప బాహువులు (పరాక్రమము) గల ఓ మహారాజా! నీవు ఆహ్వానించిన పితరులు, దేవ

తలు, మహర్షులు, మానవులు అందరు విచ్చేసిరి. నీవు వారిని చక్కగా సత్కరించి ఆయా ద్రవ్యములనిచ్చి పూజించినావు.

శ్రీమద్భాగవత మహాపురాణములోని నాల్గవ స్కంధములో
పృథూపాఖ్యానమునందు పృథువు ఇంద్రునితో మైత్రిని
నెరపుటను వర్ణించే పందొమ్మిదవ
అధ్యాయము ముగిసినది (19).

*****

# అథ వింశోఽధ్యాయః

## పృథూపాఖ్యానము - శ్రీహరి పృథు సంవాదము

మైత్రేయ ఉవాచ ।
భగవానపి వైకుంఠస్సాకం మఘవతా విభుః ।
యజ్ఞైర్యజ్ఞపతిస్తుష్టో యజ్ఞభుక్తమభాషత ॥ 1

మైత్రేయః - మైత్రేయ మహర్షి, ఉవాచ - పలికెను, భగవాన్ - భగవానుడు, విభుః - సర్వవ్యాపకుడు, యజ్ఞపతిః - యజ్ఞేశ్వరుడు, యజ్ఞభుక్ - యజ్ఞములోని హవిర్భాగములను భుజించువాడు, వైకుంఠః అపి - వైకుంఠవాసి (బుద్ధిగుహయందు ఆత్మరూపముగా నుండువాడు) అగు శ్రీహరి కూడ, యజ్ఞైః - యజ్ఞములచే, తుష్టః - సంతోషించినవాడై, మఘవతా సాకమ్ - ఇంద్రునితో గూడి, తమ్ - ఆ పృథువును ఉద్దేశించి, అభాషత - పలికెను.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- సర్వవ్యాపకుడు, యజ్ఞేశ్వరుడు, యజ్ఞములోని హవిర్భాగములను భుజించువాడు, సకలప్రాణుల బుద్ధిగుహలో ఆత్మరూపముగా నుండువాడు, వైకుంఠవాసి అగు శ్రీహరి భగవానుడు కూడ పృథువు చేసిన యజ్ఞములకు సంతోషించెను. ఆయన ఇంద్రునితో గూడియున్నవాడై పృథువుతో నిట్లు పలికెను.

శ్రీభగవానువాచ ।
ఏష తేఽకారషీద్భంగం హయమేధశతస్య చ ।
క్షమాపయత ఆత్మానమముష్య క్షంతుమర్హసి ॥ 2

తే - నీ, హయమేధశతస్య - వంద అశ్వమేధములకు, ఏషః - ఈ ఇంద్రుడు, భంగమ్ - విఘ్నమును, అకారషీత్ - చేసెను, ఆత్మానమ్ - నిన్ను, క్షమాపయతః - క్షమించునట్లుగా చేయుచున్న, అముష్య - ఈ ఇంద్రునకు, క్షంతుమ్ - క్షమించుటకు, అర్హసి - తగుచున్నావు.

శ్రీహరి భగవానుడిట్లు పలికెను --- నీ వందవ అశ్వమేధ యాగమును ఈ ఇంద్రుడు భంగము చేసినాడు. ఈతడు ఇప్పుడు నిన్ను క్షమించుమని కోరుచున్నాడు. నీవీతనిని క్షమించుము.

సుధియస్సాధవో లోకే నరదేవ నరోత్తమాః ।
నాభిద్రుహ్యంతి భూతేభ్యో యర్హి నాత్మా కలేవరమ్ ।। 3

నరదేవ - ఓ నరపతీ!, లోకే - లోకమునందు, సుధియః - మంచి బుద్ధి గలవారు, నర-ఉత్తమాః - మానవులలో ఉత్తములు అగు, సాధవః - మంచివారు, భూతేభ్యః - ప్రాణుల కొరకు, న అభిద్రుహ్యంతి - ద్రోహబుద్ధిని చేయరు, యర్హి - ఎందువలననగా, కలేవరమ్ - దేహము, ఆత్మా - ఆత్మ, న - కాదు.

ఓ మహారాజా! లోకములో మంచి బుద్ధి కలిగిన సాధుపురుషులు ఇతర ప్రాణులయెడల ద్రోహబుద్ధిని, కోపమును కలిగియుండరు. ఇట్టివారే మానవులలో ఉత్తములు. ఏలయనగా, ఈ దేహము మానవుని ఆత్మ (యథార్థస్వరూపము) కాదు.

పురుషా యది ముహ్యంతి త్వాదృశా దేవమాయయా ।
శ్రమ ఏవ పరం జాతో దీర్ఘయా వృద్ధసేవయా ।। 4

త్వాదృశాః - నీవంటి, పురుషాః - పురుషులు, దేవమాయయా - ఈశ్వరుని మాయాశక్తిచే, ముహ్యంతి యది - మోహమును పొందినచో, దీర్ఘయా - చిరకాలము చేయబడిన, వృద్ధసేవయా - పెద్దల సేవచే, పరమ్ - కేవలము, శ్రమః ఏవ - శ్రమ మాత్రమే, జాతః - కలిగినది.

నీవంటి పురుషులు కూడ ఈశ్వరుని మాయచే మోహితులై ద్రోహాదులను చేసినచో, చిరకాలము పెద్దలను సేవించినఅందు వలన ఏ ప్రయోజనము కలుగలేదు. ఆ సేవ కేవలము వ్యర్థమగు శ్రమయే యగును.

**అతః కాయమిమం విద్వానవిద్యాకామకర్మభిః ।**
**ఆరబ్ధ ఇతి నైవాస్మిన్ ప్రతిబుద్ధోఽనుషజ్జతే ॥ 5**

**అతః** - ఇందువలన, **అవిద్యాకామకర్మభిః** - అజ్ఞానము కామనలు కర్మలచే, **ఆరబ్ధః** - ఆరంభించబడినది, **ఇతి** - అని, **ఇమమ్** - ఈ, **కాయమ్** - దేహమును, **ప్రతిబుద్ధః** - తెలుసుకున్న, **విద్వాన్** - వివేకి, **అస్మిన్** - దీనియందు, **న ఏవ అనుషజ్జతే** - సుతరాము ఆసక్తిని కలిగి యుండదు.

మానవునకు తన స్వరూపము పూర్ణమని తెలియకపోవుట చేతనే మనస్సులో కామనలు పుట్టి వాటిని తీర్చుకొనుటకై కర్మలను చేసి, ఆ కర్మల ఫలరూపముగా ఈ దేహమును పొందును. కావుననే, ఈ సత్యమును తెలుసుకున్న వివేకి ఈ దేహమునందు నేను, నాది అనే ఆసక్తిని సుతరాము కలిగియుండదు.

**అసంసక్తశ్శరీరేఽస్మిన్నమునోత్పాదితే గృహే ।**
**అపత్యే ద్రవిణే వాపి కః కుర్యాన్మమతాం బుధః ॥ 6**

**అస్మిన్** - ఈ, **శరీరే** - దేహమునందు, **అసంసక్తః** - ఆసక్తి లేని, **బుధః** - వివేకి, **కః** - ఎవ్వాడు, **అమునా** - దీనిచే, **ఉత్పాదితే** - నిర్మించబడిన, **గృహే** - ఇంటియందు, **అపత్యే** - సంతానమునందు, **ద్రవిణే వా అపి** - ధనమునందైననూ, **మమతామ్** - మమకారమును, **కుర్యాత్** - చేయును?

వివేకి ఈ దేహమునందైననూ ఆసక్తి లేకుండ నుండును. అట్టి స్థితిలో వివేకము గలవాడు ఎవడైననూ, ఈ దేహసంబంధమును బట్టి వచ్చిన ఇల్లు, సంతానము, ధనము అనువాటియందు మమకారమును కలిగియుండునా?

ఏకశ్శుద్ధస్స్వయంజ్యోతిర్నిర్గుణోఽసౌ గుణాశ్రయః ।
సర్వగోఽనావృతస్సాక్షీ నిరాత్మాత్మాత్మనః పరః ॥ 7

అసౌ - ఈ, ఆత్మా - ఆత్మ, ఏకః - ఒక్కటి, శుద్ధః - శుద్ధము, స్వయం-జ్యోతిః - స్వయంప్రకాశము, నిర్గుణః - గుణములు లేనిది, గుణ-ఆశ్రయః - గుణములకు అధిష్ఠానము, సర్వగః - సర్వవ్యాపకము, అనావృతః - ఆవరించబడి లేనిది, సాక్షీ - సాక్షి, నిరాత్మా - స్వగత భేదము లేనిది, ఆత్మనః - దేహము కంటె, పరః - విలక్షణమైనది.

ఈ ఆత్మ రెండవది లేనిది (దేహములు అనేకములు), పుణ్యాపాపముల సంసర్గము లేనిది (దేహము మలినము), స్వయముగా ప్రకాశించునది (దేహము జడము), సత్త్వరజస్తమోగుణములకు అధిష్ఠానము అయి ఉన్ననూ, తన స్వరూపమునందు గుణములు లేనిది (దేహము ఈ గుణముల కార్యము). సర్వము ఆత్మచైతన్యమునందే భాసించును గనుక, ఆత్మ సర్వవ్యాపకము (దేహము దేశకాలములయందు పరిచ్ఛిన్నము). ఆత్మ అద్వితీయము గనుక, దానికి మరియొక ఆవరణ లేదు (దేహమునకు ఇల్లు మొదలగు ఆవరణలు ఉండును). ఆత్మ సర్వమునకు సాక్షి (దేహము చూడబడేది మాత్రమే). చైతన్య-ఆత్మ ద్రవ్యము కాదు గనుక, దానియందు స్వగతభేదము లేదు (ద్రవ్యమగు దేహమునందు వేర్వేరు అవయవములు గలవు). కావున, ఆత్మ దేహముకంటె విలక్షణమైనది (కాని, ఆత్మను వీడి దేహము మనలేదు).

య ఏవం సంతమాత్మానమాత్మస్థం వేద పూరుషః ।
నాజ్యతే ప్రకృతిస్థోఽపి తద్గుణైస్స మయి స్థితః ॥ 8

యః - ఏ, పూరుషః - వ్యక్తి, ఆత్మస్థమ్ - తనయందు ఉన్న, ఏవమ్ - ఈ విధముగా, సంతమ్ - సత్-స్వరూపమైయున్న, ఆత్మానమ్ - ఆత్మను, వేద - తెలియునో, సః - అతడు, మయి - నాయందు, స్థితః - ఉన్నవాడై, ప్రకృతిస్థః అపి - ప్రకృతియందున్నవాడైననూ, తత్-గుణైః - ఆ ప్రకృతియొక్క గుణములచే, న అజ్యతే - లేపమును పొందడు.

సత్-స్వరూపమగు ఆత్మ ప్రతి ప్రాణిలో నేను అనే భావనలో ప్రకటమగుచున్నది. అట్టి ఆత్మను శరీరముకంటె విలక్షణముగా తెలుసుకున్నవాడు ఆత్మరూపుడ నగు నా (పరబ్రహ్మ) యందే ఐక్యమును చెందియుండును. ఆతడు ప్రకృతియొక్క సత్త్వరజస్తమోగుణముల కార్యమగు దేహమువందున్నట్లు కానవచ్చిననూ, ఆ గుణములు ఆత్మస్వరూపుడగు ఆతనికి పుణ్యపాపాది లేపమును కలిగించవు.

యస్స్వధర్మేణ మాం నిత్యం నిరాశీశ్శ్రద్ధయాన్వితః ।
భజతే శనకైస్తస్య మనో రాజన్ ప్రసీదతి ॥ 9

రాజన్ - ఓ రాజా!, యః - ఎవడైతే, నిరాశీః - కోరికలు లేనివాడై, శ్రద్ధయా - శ్రద్ధతో, అన్వితః - కూడుకున్నవాడై, స్వధర్మేణ – తన ధర్మముచే, మామ్ - నన్ను, నిత్యమ్ - నిత్యము, భజతే - భజించునో, తస్య - వానికి, శనకైః - మెల్లగా, మనః - మనస్సు, ప్రసీదతి - ప్రసన్నమగును.

ఓ రాజా! ఎవడైతే కామనలు లేకుండా నిత్యము తన కర్తవ్యమును శ్రద్ధతో అనుష్ఠిస్తూ ఆ విధముగా నన్ను భజించునో, వాని మనస్సు మెల్లగా ప్రసన్నమగును.

పరిత్యక్తగుణస్సమ్యగ్దర్శనో విశదాశయః ।
శాంతిం మే సమవస్థానం బ్రహ్మకైవల్యమశ్నుతే ॥ 10

పరిత్యక్తగుణః - విడిచిపెట్టబడిన గుణములు గలవాడు, సమ్యక్-దర్శనః - సమదర్శనము గలవాడు, విశద-ఆశయః - స్వచ్ఛమగు అంతఃకరణము గలవాడు, శాంతిమ్ - శాంతి అయినట్టియు, మే - నా, సమవస్థానమ్ - నిష్ఠ అయిన, బ్రహ్మకైవల్యమ్ - అద్వయ పరబ్రహ్మము, అశ్నుతే - పొందును.

ఈ విధముగా స్వచ్ఛమైన అంతఃకరణము గల సాధకుడు సత్త్వరజస్తమోగుణకార్యములగు సుఖదుఃఖమోహాత్మకములైన మనోవృత్తుల యందు తాదాత్మ్యమును విడిచిపెట్టి, సర్వమువందు పరబ్రహ్మము దర్శించును. అట్టివానికి పరమశాంతి (పూర్తిగా సంసారము నివృత్తమగుట) రూప

మగు జీవన్ముక్తి లభించును. ఆ స్థితిలో అతడు ఆత్మరూపుడవగు నాయందే నిష్ఠను కలిగియుండును. ఇదియే బ్రహ్మీభావము అనే అద్వైత స్థితి.

ఉదాసీనమివాధ్యక్షం ద్రవ్యజ్ఞానక్రియాత్మనామ్ ।
కూటస్థమిమమాత్మానం యో వేదాప్నోతి శోభనమ్ ॥ 11

ద్రవ్యజ్ఞానక్రియా-ఆత్మనామ్ - దేహము జ్ఞానేంద్రియములు కర్మేంద్రియములు మరియు మనస్సు అనువాటికి, అధ్యక్షమ్ - సాక్షి అయినట్టియు, ఉదాసీనం ఇవ - ఉదాసీనుడుగనే (అతీతుడుగనే) ఉన్నట్టియు, కూటస్థమ్ - వికారములు లేని, ఇమమ్ - ఈ, ఆత్మానమ్ - ఆత్మను, యః - ఎవడైతే, వేద - తెలియునో అతడు, శోభనమ్ - కల్యాణమును, ఆప్నోతి - పొందును.

దేహము, జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు మరియు మనస్సులకు సాక్షిగా ఉండే ఆత్మ వాటికి అతీతముగనే యుండును గనుక, వాటిచే ప్రభావితము గాదు. కావునవే, ఆత్మయందు వికారములేమియు ఉండవు. అట్టి ఆత్మను (తన స్వరూపమును) తెలుసుకున్న వ్యక్తి పరమకల్యాణమగు జీవన్ముక్తిని పొందును.

భిన్నస్య లింగస్య గుణప్రవాహో
ద్రవ్యక్రియాకారకచేతనాత్మనః ।
దృష్టాసు సంపత్సు విపత్సు సూరయో
న విక్రియంతే మయి బద్ధసౌహృదాః ॥ 12

ద్రవ్యక్రియాకారకచేతనా-ఆత్మనః - పంచభూతములు ఇంద్రియములు వాటి అధిష్ఠాన దేవతలు మరియు చిదాభాసము (పరిచ్ఛిన్న జీవుడు) అనేవాటి సముదాయరూపమైనట్టియు. భిన్నస్య - ఆత్మకంటె విలక్షణమైన, లింగస్య - సూక్ష్మశరీరమునకు, గుణప్రవాహః - సత్త్వరజస్తమోగుణముల ప్రవాహము, మయి - నాయందు, బద్ధసౌహృదాః - దృఢముగా చేయబడిన ప్రీతి గల, సూరయః - విద్వాంసులు, సంపత్సు - సంపదలు,

విపత్సు - ఆపదలు, దృష్టాసు - కానవచ్చుచుండగా, న విక్రియంతే - వికారమును పొందరు.

పంచభూతములు, అధిష్ఠానదేవతలతో కూడిన ఇంద్రియములు, అంతఃకరణము అనే ఈ సంఘాతమునందు ఆత్మ ప్రతిఫలించుటచే ఇవి మనుగడను సాగిస్తూ ప్రకాశించుచున్నవి. ఈ పరిచ్ఛిన్నమగు ఉపాధి యందు ఆత్మభావము గల లింగ శరీర రూపుడగు జీవునకు సత్త్వరజస్తమోగుణముల కార్యములగు సుఖదుఃఖమోహములు నిరంతరముగా జన్మ తరువాత జన్మలో కలుగుచునే యుండును. కాని, ఆత్మరూపుడనగు నాయందు దృఢమగు నిష్ఠ (ప్రీతి) గల జ్ఞానులు సంపదలు కలిగినప్పుడు హర్షము అనే వికారమును గాని, ఆపదలు వచ్చినప్పుడు విషాదము అనే వికారమును గాని పొందకుండగా, సాక్షులుగా నిలిచియుందురు.

సమస్సమానోత్తమమధ్యమాధమః
సుఖే చ దుఃఖే చ జితేంద్రియాశయః ।
మయోపక్లుప్తాఖిలలోకసంయుతో
విధత్స్వ వీరాఽఖిలలోకరక్షణమ్ ॥ 13

వీర - ఓ వీరుడా!, సుఖే చ - సుఖమునందు, దుఃఖే చ - దుఃఖమునందు కూడ, సమః - సముడవై, సమాన-ఉత్తమమధ్యమ-అధమః - సమానమగు ఉత్తముడు మధ్యముడు అధముడు గలవాడవై, జిత-ఇంద్రియ-ఆశయః - జయించబడిన ఇంద్రియములు మనస్సు గలవాడవై, మయా - నాచే, ఉపక్లుప్త-అఖిలలోకసంయుతః - నిర్మించబడిన సకలమగు జనులతో కూడినవాడవై, అఖిలలోకరక్షణమ్ - సకలప్రాణుల రక్షణమును, విధత్స్వ - చేయుము.

ఓ వీరా! నీవు ఇంద్రియములను మనస్సును నిగ్రహించి, సుఖదుఃఖములయందు సమమగు చిత్తమును కలిగియుండుము. జనులలో క్కొందరు ఉత్తములు కాగా, మరికొందరు మధ్యములు, ఇంకొందరు అధములు ఉండెదరు. వారియందు నీవు సమానమగు ప్రీతిని కలిగియుండు

ము. నేను సృష్టించిన ఈ లోకమంతయు నీ యెదుట నున్నది. దానిలోని జనుల సహకారముతో, నీవు సకలప్రాణులకు రక్షణను కల్పించుము.

శ్రేయః ప్రజాపాలనమేవ రాజ్ఞో
యత్సాంపరాయే సుకృతాత్ షష్ఠమంశమ్ ।
హర్తాఽన్యథా హృతపుణ్యః ప్రజానా-
మరక్షితా కరహారోఽఘమత్తి ।। 14

రాజ్ఞః - రాజునకు, ప్రజాపాలనం ఏవ - ప్రజా రక్షణమే, శ్రేయః - శ్రేయస్సు, యత్ - ఎందువలననగా, సుకృతాత్ - పుణ్యమునుండి, షష్ఠమ్ - ఆరవ, అంశమ్ - భాగమును, సాంపరాయే - పరలోకమునందు, హర్తా - కొని పోగలడు, అన్యథా - అట్లు గానిచో, ప్రజానామ్ - ప్రజలకు, అరక్షితా - రక్షించనివాడు, కరహారః - పన్నును తీసుకొనువాడు, హృత పుణ్యః - అపహరించబడిన పుణ్యము గలవాడై, అఘమ్ - పాపమును, అత్తి - అనుభవించును.

ప్రజలకు రక్షణను కల్పించుటయే రాజునకు శ్రేయస్కరము. ఏలయన, ప్రజలను రక్షించే రాజునకు ప్రజల చేసుకున్న పుణ్యములో ఆరవ వంతు లభించి, అతడు పరలోకములో ఆ పుణ్యమునను భవించును. అట్లుగాక, ప్రజలను రక్షించకుండా వారివద్ద పన్నును వసూలు చేసే రాజునకు ప్రజల పాపము చుట్టుకొని, అతడు పాపఫలమును అనుభవించును. అతని పుణ్యమును ప్రజలు తీసుకొనెదరు.

ఏవం ద్విజాగ్ర్యానుమతానువృత్త-
ధర్మప్రధానోఽన్యతమోఽవితాఽస్యాః ।
హ్రస్వేన కాలేన గృహోపయాతాన్
ద్రష్టాసి సిద్ధాననురక్తలోకః ।। 15

ఏవమ్ - ఈ విధముగా, ద్విజ-అగ్ర్య-అనుమత-అనువృత్తధర్మ ప్రధానః - మహర్షులకు సమ్మతమైన పరంపరాప్రాప్తమైన ధర్మమే ప్రధానముగా గలవాడవై, అన్యతమః - కేవలము సాక్షిగా మాత్రమే ఉన్నవాడవై,

అస్యాః - ఈ భూమికి, అవితా - రక్షకుడవై, అనురక్తలోకః - రంజింపజేయ బడిన జనులు గలవాడవై, హ్రస్వేన - కొద్ది, కాలేన - కాలముచే, స్వగృహ -ఉపయాతాన్ - నీ ఇంటికి వచ్చిన, సిద్ధాన్ - సిద్ధపురుషులను, ద్రష్టాసి - దర్శించగలవు.

నీవు ఈ విధముగా మహర్షులకు సమ్మతమైన ధర్మమే ప్రముఖ ముగా గలవాడవై, సర్వమునందు కేవలము సాక్షిభావముతో ఉంటూ, దేశ మును రక్షిస్తూ, ప్రజారంజకముగా పరిపాలించుము. ఈ ప్రజాపాలన ధర్మము రాజులకు పరంపరాప్రాప్తమై యున్నది. అట్లు చేసినచో, నీకు కొద్ది కాలములోనే నీ ఇంటికి తరలివచ్చిన సిద్ధపురుషుల దర్శనము కాగలదు.

వరం చ మత్కంచన మానవేంద్ర
వృణీష్వ తేఽహం గుణశీలయంత్రితః ।
నాహం మఖైర్వా సులభస్తపోభిః
యోగేన వా యత్సమచిత్తవర్తీ ।। 16

మానవ-ఇంద్ర - ఓ నరపతీ!, మత్ - నానుండి, కంచన - ఏదో ఒక, వరం చ - వరమును కూడ, వృణీష్వ - కోరుకొనుము, అహమ్ - నేను, తే - నీ, గుణశీలయంత్రితః - గుణములచే మరియు శీలముచే వశమైనవాడను, యత్ - ఏలయనగా, సమచిత్తవర్తీ - సమచిత్తులయందు ఉండే స్వభావము గల, అహమ్ - నేను, మఖైః వా - యజ్ఞములచే గాని, తపోభిః - తపస్సులచే గాని, యోగేన వా - యోగముచే గాని, సులభః - తేలికగా లభించువాడను, న - కాదు.

ఓ మహారాజా! నీవు నానుండి ఏదేని వరమును కోరుకొనుము. నేను నీ గుణములకు, శీలమునకు వశుడనైతిని. సుఖదుఃఖములయందు సమమగు చిత్తము గలవారికి (పరబ్రహ్మయందు లగ్నమైన మనస్సు గల వారికి) లభించినంత తేలికగా, నేను ఆ గుణములు శీలము లేకుండగా, కేవలము యజ్ఞములచే గాని, తపస్సులచే గాని, అష్టాంగయోగము మొద లగు సాధనలచే గాని లభించను.

మైత్రేయ ఉవాచ ।
స ఇత్థం లోకగురుణా విష్వక్సేనేన విశ్వజిత్ ।
అనుశాసిత ఆదేశం శిరసా జగృహే హరేః ।। 17

లోకగురుణా - లోకములకు తండ్రియగు, విష్వక్సేనేన - అంతటా వ్యాపించిన కాంతులు గల శ్రీహరిచే, విశ్వజిత్ - జగత్తును జయించిన, సః - ఆ పృథువు, ఇత్థమ్ - ఈ విధముగా, అనుశాసితః - ఆదేశించబడినవాడై, హరేః - శ్రీహరియొక్క, ఆదేశమ్ - ఆదేశమును, శిరసా - శిరస్సుచే, జగృహే - స్వీకరించెను.

లోకములకు తండ్రి, సూర్యరూపములో అంతటా వ్యాపించిన కాంతులు గలవాడు అగు శ్రీహరి జగద్విజేతయగు పృథువును ఈ విధముగా ఆదేశించెను. పృథువు భగవానుని ఆదేశమును శిరసా వహించెను.

స్పృశంతం పాదయోః ప్రేమ్ణా వ్రీడితం స్వేన కర్మణా ।
శతక్రతుం పరిష్వజ్య విద్వేషం విససర్జ హ ।। 18

స్వేన - తన, కర్మణా - కర్మచే, వ్రీడితమ్ - సిగ్గు పడినట్టియు, పాదయోః - పాదములకు, స్పృశంతమ్ - స్పృశించుచున్న, శతక్రతుమ్ - వంద యజ్ఞములను చేసిన ఇంద్రుని, ప్రేమ్ణా - ప్రేమతో, పరిష్వజ్య - కౌగిలించుకొని, విద్వేషమ్ - ద్వేషభావమును, విససర్జ హ - విడిచిపెట్టెనట.

వంద యజ్ఞములను చేసిన ఇంద్రుడు తాను చేసిన పనికి సిగ్గు చెంది పృథువు పాదములపై పడెను. పృథువు ఆయనను ప్రేమతో కౌగిలించుకొని వైరభావమును విడిచిపెట్టెను.

భగవానథ విశ్వాత్మా పృథునోపహృతార్హణః ।
సముజ్జిహానయా భక్త్యా గృహీతచరణాంబుజః ।। 19

అథ - తరువాత, ఉపహృత-అర్హణః - సమర్పించబడిన పూజాద్రవ్యములు గలవాడు, విశ్వ-ఆత్మా - జగత్తు రూపములో ప్రకటమైనవాడు (జగత్తునకు ఆత్మ అయినవాడు) అగు, భగవాన్ - శ్రీహరి భగవానుడు, పృథునా - పృథువుచే, సముజ్జిహానయా - వర్ధిల్లుచున్న, భక్త్యా - భక్తితో,

గృహీతచరణ-అంబుజః - పట్టుకొనబడిన పద్మములవంటి పాదములు గల వాడు.

జగత్తు రూపములో ప్రకటమైన శ్రీహరి భగవానుడే జగత్తుయొక్క యథార్థస్వరూపమై యున్నాడు. అప్పుడు పృథువు ఆయనకు పూజాద్రవ్యములను సమర్పించి, క్షణక్షణప్రవర్ధమానమగు భక్తితో, పద్మములవంటి ఆయన పాదములను పట్టుకొనెను.

ప్రస్థానాభిముఖోఽప్యేనమనుగ్రహవిలంబితః ।
పశ్యన్ పద్మపలాశాక్షో న ప్రతస్థే సుహృత్సతామ్ ॥ 20

సతామ్ - సత్పురుషులకు, సుహృత్ - మిత్రుడు, పద్మపలాశ-అక్షః - పద్మపు రేకులవంటి కన్నులు గలవాడు అగు శ్రీహరి, ప్రస్థాన-అభిముఖః అపి - వెళ్ళుటకు సంసిద్ధుడైనప్పటికీ, ఏనమ్ - ఈ పృథువును, పశ్యన్ - చూచుచున్నవాడై, అనుగ్రహవిలంబితః - అనుగ్రహముచే కలిగిన విలంబము గలవాడై, న ప్రతస్థే - బయలు దేరలేదు.

పద్మపత్రములవంటి కన్నులు గల శ్రీహరి సత్పురుషులకు మిత్రుడు. ఆయన బయలు దేరుటకు సంసిద్ధుడాయెను. కాని, పృథువును అనుగ్రహముతో చూస్తూ ఉండిపోవుటచే, బయలు దేరుట ఆగిపోయి, ఆయనకు విలంబము కలిగెను.

స ఆదిరాజో రచితాంజలిర్హరిం
విలోకితుం నాశకదశ్రులోచనః ।
న కించనోవాచ స బాష్పవిక్లవో
హృదోపగుహ్యాముమధాదవస్థితః ॥ 21

రచిత-అంజలిః - ఒగ్గబడిన దోసిలి గల, సః - ఆ, ఆదిరాజః - ఆదిరాజగు పృథువు, అశ్రులోచనః - కన్నీరు కన్నులయందు గలవాడై, హరిమ్ - శ్రీహరిని, విలోకితుమ్ - చూచుటకు, న అశకత్ - సమర్థుడు కాలేదు, బాష్పవిక్లవః - కన్నీటిచే వ్యాకులుడైన, సః - అతడు, కించన - ఏమియు, న ఉవాచ - పలుకలేదు, అవస్థితః - తలవంచి నిలబడి ఉన్నవా

దై, అముమ్ - ఈ శ్రీహరిని, హృదా - హృదయముచే, ఉపగుహ్య - కౌగిలించుకొని, అధాత్ - పట్టుకొనెను.

ఆదిరాజగు ఆ పృథువు చేతులను జోడించి శ్రీహరికి నమస్కరించెను. కాని, ఆయన కన్నులు ఆనందబాష్పములతో నిండిపోవుటచే, అతడు వ్యాకులతను చెంది, శ్రీహరిని చూడలేకపోయెను. కేవలము నిల బడి హృదయముతో ఆయనను కౌగిలించి పట్టుకొనెను.

అథావమృజ్యాశ్రుకలా విలోకయన్
అతృప్తదృగ్గోచరమాహ పూరుషమ్ ।
పదా స్పృశంతం క్షితిమంస ఉన్నతే
విన్యస్తహస్తాగ్రమురంగవిద్విషః ॥ 22

అథ - తరువాత, అశ్రుకలాః - కన్నీటి బిందువులను, అవమృజ్య - తుడుచుకొని, అతృప్తదృక్-గోచరమ్ - తృప్తిని చెందని కన్నులకు కానవచ్చుచున్నట్టియు, పదా - పాదముతో, క్షితిమ్ - నేలను, స్పృశంతమ్ - స్పృశించుచున్నట్టియు, ఉరంగవిద్విషః - నాగములకు శత్రువు అగు గరుత్మంతుని, ఉన్నతే - ఎత్తైన, అంసే - భుజముపై, విన్యస్తహస్త-అగ్రమ్ - ఉంపబడిన చేతి కొన గల, పూరుషమ్ - పూర్ణస్వరూపుడగు హరిని ఉద్దేశించి, ఆహ - పలికెను.

అప్పుడు పృథువు కన్నీటిని తుడుచుకొని పూర్ణస్వరూపుడగు శ్రీహరితో నిట్లనెను. పాదములతో నేలను స్పృశిస్తున్న ఆయనను చూచుచున్న పృథువుయొక్క కన్నులకు తృప్తి కలుగకుండెను. ఆయన తన అర చేతిని నాగశత్రువు అగు గరుత్మంతుని ఎత్తైన భుజముపై నుంచెను.

పృథురువాచ ।
వరాన్ విభో త్వద్వరదేశ్వరాద్బుధః
కథం వృణీతే గుణవిక్రియాత్మనామ్ ।
యే నారకాణామపి సంతి దేహినాం
తానీశ కైవల్యపతే వృణే న చ ॥ 23

విభో - ఓ ప్రభూ!, వరద-ఈశ్వరాత్ - వరములనిచ్చే దేవతలకు నాథుడవగు, త్వత్ - నీనుండి, బుధః - వివేకి, కః - ఎవడు, గుణవిక్రియ-ఆత్మనామ్ - గుణకార్యములగు శబ్దాదులచే వికారమును పొందే చిత్తములు గలవారి, వరాన్ - వరములను, కథమ్ - ఎట్లు, వృణీతే - కోరును?, యే - ఏ వరములు, నారకాణామ్ - నరకమునకు చెందిన, దేహినాం అపి - ప్రాణులకు కూడ, సంతి - గలవో, కైవల్యపతే - మోక్షము నిచ్చే ఓ ప్రభూ!, తాన్ - అట్టి వరములను, న వృణే చ - నేను కోరుట లేదు.

పృథు మహారాజు ఇట్లు పలికెను --- ఓ ప్రభూ! వరములనిచ్చే దేవతలకు కూడ నీవు నాథుడవు. భోగపరాయణుల చిత్తములు త్రిగుణాత్మకయగు ప్రకృతియొక్క కార్యములైన శబ్దాది విషయములచే వికారమును పొంది అనేకములగు కామనలను కలిగియుండును. అట్టి కామనలను నీనుండి వరముగా పొందవలెనని వివేకియైనవాడు ఎవడు కోరును? అట్టి భోగములు నరకములోని జీవులకు కూడ లభించుచునే యుండును. నీవు మోక్షమునిచ్చే ప్రభుడవు. నేను నిన్ను అట్టి వరములను కోరుట లేదు.

న కామయే నాథ తదప్యహం క్వచిత్
న యత్ర యుష్మచ్చరణాంబుజాసవః ।
మహత్తమాంతర్హృదయాన్ముఖచ్యుతో
విధత్స్వ కర్ణాయుతమేష మే వరః ॥ 24

నాథ - ఓ ప్రభూ!, తత్ అపి - ఆ మోక్షమును కూడ, అహమ్ - నేను, క్వచిత్ - ఏ కాలమునందైననూ, న కామయే - కోరుట లేదు, యత్ర - దేనియందైతే, మహత్తమ-అంతః-హృదయాత్ - మహాత్ముల హృదయము లోపలినుండి, ముఖచ్యుతః - నోటిగుండా జాలువారే, యుష్మత్-చరణ-అంబుజ-ఆసవః - నీ పాదపద్మముల మధురసము, న - లేదో, కర్ణ-అయుతమ్ - పది వేల చెవులను, విధత్స్వ - ఇమ్ము, ఏషః - ఇదియే, మే - నాకు, వరః - వరము.

ఓ ప్రభూ! మహాత్ముల హృదయములోపల ఉండే నీ పాదపద్మముల మధురసము వారి నోటినుండి నీ గాథల రూపములో జాలువారు చుండును. అది మోక్షమునందు లభించనిచో, అట్టి మోక్షము కూడ నాకు ఏ కాలమునందైననూ అభీష్టము కాదు. నీ గాథలను వినుటకు నాకు పది వేల చెవులనిమ్ము. అదియే నాకు గొప్ప వరము.

స ఉత్తమశ్లోక మహన్ముఖచ్యుతో
భవత్పదాంభోజసుధాకణానిలః ।
స్మృతిం పునర్విస్మృతతత్త్వవర్త్మనాం
కుయోగినాం నో వితరత్యలం వరైః ॥ 25

ఉత్తమశ్లోక - ఉత్తమమగు కీర్తి గలవాడా!, మహత్-ముఖచ్యుతః - మహాత్ముల నోటినుండి జాలువారే, సః - అట్టి, భవత్-పద-అంభః-జసుధా కణ-అనిలః - నీ పాదపద్మముల అమృతకణముల గాలి, విస్మృతతత్త్వవ ర్త్మనామ్ - మరువబడిన జ్ఞానమార్గము గల, కుయోగినామ్ - చంచలచిత్తులమగు, నః - మాకు, పునః - మరల, స్మృతిమ్ - నీ స్మరణమును, వితరతి - కలిగించుచున్నది, వరైః - వరములచే, అలమ్ - చాలును.

ఉత్తమమగు కీర్తి గల ఓ ప్రభూ! మేము జ్ఞానమార్గమును విస్మరించి చంచలమగు చిత్తములు గలవారమై యున్నాము. మహాత్ముల నోటి నుండి జాలువారే నీ పాదపద్మముల కీర్తి అనే అమృతకణముల గాలి తగిలిననూ, మాకు మరల నీ స్మరణము కలుగును. కావున, ఇతరములగు వరములతో పని లేదు.

యశశ్శివం సుశ్రవ ఆర్యసంగమే
యదృచ్ఛయా చోపశృణోతి తే సకృత్ ।
కథం గుణజ్ఞో విరమేద్వినా పశుం
శ్రీర్యత్ప్రవవ్రే గుణసంగ్రహేచ్ఛయా ॥ 26

సుశ్రవ - పవిత్రమగు కీర్తి గలవాడా!, ఆర్యసంగమే - మహాత్ముల తోడి సమావేశమునందు, శివమ్ - మంగళకరమగు, తే - నీ, యశః - కీర్తి

ని, యదృచ్ఛయా - అనుకోకుండా (ఈశ్వరేచ్ఛచే), సకృత్ - ఒక్కసారి, ఉపశృణోతి - వినునో, పశుం వినా - మూర్ఖుని మినహాయించి, గుణజ్ఞః - గుణము తెలిసినవాడు, కథమ్ - ఎట్లు, విరమేత్ - విరమించును?, శ్రీః - లక్ష్మీదేవి, గుణసంగ్రహ-ఇచ్ఛయా - పురుషార్థములను తనయందు సంపాదించుకోవాలనే కోరికతో, యత్ - ఏ శ్రవణమును, ప్రవవ్రే - అధికముగా కోరినదో.

పవిత్రమగు కీర్తి గల ఓ శ్రీహరీ! ఏ వ్యక్తియైననూ మహాత్ముల తోడి సమావేశమైనప్పుడు ఒక్కసారి అనుకోకుండా ఈశ్వరేచ్ఛచే నీ మంగళకరమగు కీర్తిని శ్రవణము చేయునో, అట్టి వ్యక్తి మూర్ఖుడైతే తప్ప, గుణమును తెలుసుకొనే శక్తి గలవాడైనచో, నీ కీర్తి శ్రవణమును విడిచిపెట్టడు. అట్లు విడిచిపెట్టువాడు పశుప్రాయుడే. ఏలయనగా, లక్ష్మీదేవి కూడ తనయందు పురుషార్థములను సంపాదించగోరి, నీ కీర్తిని శ్రవణమును చేయాలనే వరమును నీనుండి చాల గట్టిగా కోరుకొనెను.

అథో భజే త్వాఽఖిలపూరుషోత్తమం
గుణాలయం పద్మకరేవ లాలసః ।
అప్యావయోరేకపతిస్పృధోః కలిః
న స్యాత్కృతత్వచ్చరణైకతానయోః ॥ 27

అథో - అందువలన, అఖిలపూరుష-ఉత్తమమ్ - సకలప్రాణులలో అంతర్యామిగా ఉండే పూర్ణపురుషుడవైనట్టియు, గుణ-ఆలయమ్ - త్రిగుణాత్మకయగు ప్రకృతికి అధిష్ఠానమైన, త్వా - నిన్ను, పద్మకరా ఇవ - పద్మము చేతియందు గల లక్ష్మీదేవి వలె, లాలసః - ఉత్సుకుడనై, భజే - సేవించెదను, ఏకపతిస్పృధోః - ఒకే ప్రభువగు నీయందు స్పర్ధ కలిగినట్టియు, కృతత్వత్-చరణ-ఏకతానయోః - చేయబడిన నీ పాదములయందలి నిరంతరమగు మనస్సమాధానము గల, ఆవయోః - మాకిద్దరికి, కలిః - కలహము, అపి న స్యాత్ - కలుగకుండు గాక!

కావున, సకలప్రాణులలో అంతర్యామిగా ఉండే పూర్ణపురుషుడవగు నిన్ను నేను లక్ష్మీదేవితో సమానమైన ఉత్సుకతతో సేవించెదను. నీవు

త్రిగుణాత్మికయగు ప్రకృతికి అధిష్ఠానమవు. ఈ విధముగా నేను, లక్ష్మీదేవి నిన్ను మాత్రమే ప్రభువుగా సేవించుటకు పోటీ పడుచున్నాము. మా ఇద్దరి మనస్సు నీ పాదములయందు మాత్రమే అఖండముగా ఏకాగ్రమై యున్న ది. ఇట్టి స్థితిలో ఈ పోటీ వలన మాకిద్దరికి కలహము రాకుండు గాక!

జగజ్జనన్యాం జగదీశ వైశసం
స్యాదేవ యత్కర్మణి నస్సమీహితమ్ ।
కరోషి ఫల్గ్వప్యురు దీనవత్సలః
స్వ ఏవ ధిష్ణ్యేఽభిరతస్య కిం తయా ॥ 28

జగత్-ఈశ - ఓ జగన్నాథా!, జగత్-జనన్యామ్ - జగన్మాతయగు లక్ష్మీదేవి విషయములో, వైశసమ్ - విరోధము, స్యాత్ ఏవ - వచ్చి తీరును, యత్-కర్మణి - ఏ లక్ష్మీదేవియొక్క కర్మయందు, నః - మాకు, సమీహితమ్ - కోరిక గలదో, దీనవత్సలః - దీనులయందు వాత్సల్యము గల నీవు, ఫల్గు అపి - అల్పమునైననూ, ఉరు - గొప్పదిగా, కరోషి - చేయుచున్నావు, స్వే - తన, ధిష్ణ్యే ఏవ - స్వరూపమునందు మాత్రమే, అభిరతస్య - ప్రీతిని పొందే నీకు, తయా - ఆమెతో, కిమ్ - పని యేమి?

ఓ జగన్నాథా! జగన్మాతయగు లక్ష్మీదేవితో మాకు విరోధము వచ్చి తీరును. ఏలయనగా, నిన్ను సేవించుట అనే పనిని ఆమె చేయుచుండును. కాని, ఇప్పుడు ఆ పనిని మేము చేయగోరుచున్నాము. పైగా, దీనులయందు వాత్సల్యము గల నీవు, భక్తులమగు మేము చేసేది అల్పమే అయినా, అదే గొప్పది అని మన్నించెదవు. నీ స్వరూపము పూర్ణము. అట్టి పూర్ణస్వరూపమునందు మాత్రమే ఆనందఘనుడవై యుండే నీకు ఆమెతో పని యేమి?

భజంత్యథ త్వామత ఏవ సాధవో
వ్యుదస్తమాయాగుణవిభ్రమోదయమ్ ।
భవత్పదానుస్మరణాదృతే సతాం
నిమిత్తమన్యద్భగవన్న విద్మహే ॥ 29

భగవన్ - ఓ భగవానుడా!, అతః ఏవ - ఇందువలననే, సాధవః - మహాత్ములు, అథ - జ్ఞానము కలిగిన తరువాత, వ్యుదస్తమాయాగుణవిభ్రమ-ఉదయమ్ - తిరస్కరించబడిన మాయయొక్క గుణముల విలాస (భ్రాంతి) యొక్క ఉదయము (కార్యము) గల, త్వామ్ - నిన్ను, భజంతి - సేవించుచున్నారు, సతామ్ - మహాత్ములకు, భవత్-పద-అనుస్మరణాత్ ఋతే - నీ పాదములను స్మరించుటను మినహాయించి, అన్యత్ - మరి యొక, నిమిత్తమ్ - ప్రయోజనము, న విద్మహే - తెలియదు.

ఓ భగవానుడా! నీవు దీనవత్సలుడవు గనుకనే, మహాత్ములు ఆత్మజ్ఞానము కలిగిన తరువాత కూడ నిన్ను సేవించుచున్నారు. నీయందు మాయాశక్తియొక్క గుణముల విలాసము (గుణముల వలన కలిగే భ్రాంతి) లేశమైననూ లేదు. మహాత్ములకు నీ పాదములను స్మరించుట కంటె మరి యొక ప్రయోజనము లేదని మాకు తెలియును.

మన్యే గిరం తే జగతాం విమోహినీం
వరం వృణీష్వేతి భజంతమాత్థ యత్ ।
వాచా ను తంత్యా యది తే జనోఽసితః
కథం పునః కర్మ కరోతి మోహితః ॥ 30

తే - నీ, గిరమ్ - వాక్కును, జగతామ్ - జగత్తులకు, విమోహినీమ్ - మోహమును కలిగించు దానినిగా, మన్యే - తలచుచున్నాను, యత్ - ఏలయనగా, భజంతమ్ - సేవించుచున్నవానిని, వరమ్ - వరమును, వృణీష్వ - కోరుకొనుము, ఇతి - అని, ఆత్థ - పలికితివి, తే - నీ, వాచా - వేదవాక్కు అనే, తంత్యా - త్రాటిచే, జనః - మానవుడు, యది అసితః ను - బద్ధుడు కానిచో, మోహితః - మోహమును పొందినవాడై, కర్మ - కర్మను, కథం - ఎట్లు, పునః - మరల, కరోతి - చేయుచున్నాడు?

నీ వాక్కు లోకులకు మోహమును కలిగించునది యని నా అభిప్రాయము. ఏలయనగా, నిన్ను సేవించే నాతో నీవు, వరమును కోరుకొమ్మని పలికితివి. వేదరూపమైన నీ వాక్కు మానవుని బంధించియున్నది. అట్లు

గానిచో, మోహమును పొందియున్న మానవుడు మరల మరల కామ్యకర్మలనేల చేయును?

త్వన్మాయయాऽద్ధా జన ఈశ ఖండితో
యదన్యదాశాస్త ఋతాత్మనోऽబుధః ।
యథా చరేద్బాలహితం పితా స్వయం
తథా త్వమేవార్హసి నస్సమీహితుమ్ ॥ 31

ఈశ - ఓ ప్రభూ!, అబుధః - అజ్ఞానియగు, జనః - మానవుడు, త్వత్-మాయయా - నీ మాయచే, ఋత-ఆత్మనః - పరమార్థమగు తన స్వరూపమునుండి, అద్ధా - ఖచ్చితముగా, ఖండితః - ఖండింపబడినాడు, యత్ - ఏలయనగా, అన్యత్ - ఇతరమును, ఆశాస్తే - కోరుచున్నాడో, యథా - ఏ విధముగానైతే, పితా - తండ్రి, స్వయమ్ - తనంత తానుగా, బాలహితమ్ - బాలకుని హితమును, చరేత్ - ఆచరించునో, తథా - అదే విధముగా, త్వం ఏవ - నీవే, నః - మాకు, హితమ్ - హితమును, సమీహితుమ్ - చేయుటకు, అర్హసి - తగుచున్నావు.

ఓ ప్రభూ! అజ్ఞానియగు మానవుడు నీ మాయచే మోహితుడై తన యథార్థస్వరూపమునుండి ఖచ్చితముగా విడిపోయినాడు. ఏలయనగా, మానవుడు ఆత్మరూపుడవగు నిన్ను గాక, ఇతరములను కోరుచున్నాడు. తండ్రి పిల్లవాని హితమును తనంత తానుగా నిర్ణయించి తదనుగుణముగా ఆచరించును. అదే విధముగా, నీవు కూడ మాకు ఏది హితమో నిశ్చయించి, దానిని సంపాదించి పెట్టుము.

మైత్రేయ ఉవాచ ।
ఇత్యాదిరాజేన నుతస్స విశ్వదృక్
తమాహ రాజన్మయి భక్తిరస్తు తే ।
దిష్ట్యేదృశీ ధీర్మయి తే కృతా యయా
మాయాం మదీయాం తరతి స్మ దుస్త్యజామ్ ॥ 32

విశ్వదృక్ - సర్వమునకు సాక్షియగు, సః - ఆ శ్రీహరి, ఇతి - ఈ విధముగా, ఆదిరాజేన - ఆదిరాజగు పృథువుచే, నుతః - స్తుతించబడినవాడై, తమ్ - అతనిని ఉద్దేశించి, ఆహ - పలికెను, రాజన్ - ఓ రాజా!, తే - నీకు, మయి - నాయందు, భక్తిః - భక్తి, అస్తు - ఉండుగాక!, తే - నీచే, మయి - నాయందు, దిష్ట్యా - దైవవశముచే, ఈదృశీ - ఇట్టి, ధీః - బుద్ధి, కృతా - చేయబడినది, యయా - ఏ బుద్ధిచే, దుస్త్యజామ్ - విడిచిపెట్ట శక్యము కాని, మదీయామ్ - నాకు చెందిన, మాయామ్ - మాయను, తరతి స్మ - తరించునో.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- సర్వసాక్షియగు ఆ శ్రీహరిని ఆదిరాజగు పృథువు ఇట్లు స్తుతించగా, అయన పృథువుతో నిట్లనెను : ఓ రాజా! నీకు నాయందు భక్తి స్థిరముగా నుండుగాక! నీవు దైవవశముచే నాయందు ఇట్టి నిష్కామమగు ప్రేమను కలిగియున్నావు. ఇట్టి బుద్ధిచే మానవుడు తరింప శక్యము కాని నా మాయను తరించి వేయును సుమా!

తత్త్వం కురు మయాదిష్టమప్రమత్తః ప్రజాపతే ।
మదాదేశకరో లోకస్సర్వత్రాప్నోతి శోభనమ్ ।। 33

ప్రజాపతే - ప్రజాపాలకుడా!, తత్ - అందువలన, త్వమ్ - నీవు, అప్రమత్తః - జాగరూకుడవై, మయా - నాచే, ఆదిష్టమ్ - ఆదేశించబడిన దానిని, కురు - చేయుము, మత్-ఆదేశకరః - నా ఆదేశమును చేయు, లోకః - మానవుడు, సర్వత్ర - అంతటా, శోభనమ్ - కల్యాణమును, ఆప్నోతి - పొందుచున్నాడు.

ప్రజలను పాలించే ఓ రాజా! కావున, నీవు నేను చెప్పినట్లు చేయుము. నా ఆదేశమును పాలించే మానవుడు అన్ని కాలములలో అన్ని దేశములలో (ఇహ పరములలో) కల్యాణమును పొందును.

మైత్రేయ ఉవాచ ।
ఇతి వైన్యస్య రాజర్షేః ప్రతినంద్యార్థవద్వచః ।
పూజితోఽనుగృహీత్వైనం గంతుం చక్రేఽచ్యుతో మతిమ్ ।।34

వైన్యస్య - వేనుని పుత్రుడు, రాజర్షేః - రాజర్షి అగు పృథువుయొక్క, అర్థవత్ - గంభీరమగు అర్థము గల, వచః - వచనమును, ఇతి - ఈ విధముగా, ప్రతినంద్య - అభినందించి, అచ్యుతః - శ్రీహరి, పూజితః - పూజించబడినవాడై, ఏనమ్ - ఈ పృథువును, అనుగృహీత్వా - అనుగ్రహించి, గంతుమ్ - వెళ్లుటకు, మతిమ్ - నిశ్చయమును, చక్రే - చేసెను.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- రాజర్షి, వేనపుత్రుడు అగు పృథువుయొక్క వచనమును శ్రీహరి ఈ విధముగా అభినందించెను. పృథువుచే పూజించబడిన శ్రీహరి ఆయనను అనుగ్రహించి, వెళ్లుటకు సంసిద్ధుడాయెను.

దేవర్షిపితృగంధర్వసిద్ధచారణపన్నగాః ।
కిన్నరాప్సరసో మర్త్యాః ఖగా భూతాన్యనేకశః ॥ 35

యజ్ఞేశ్వరధియా రాజ్ఞా వాగ్విత్తాంజలిభక్తితః ।
సభాజితా యయుస్సర్వే వైకుంఠానుగతాస్తతః ॥ 36

దేవ-ఋషిగంధర్వసిద్ధచారణపన్నగాః - దేవతలు మహర్షులు గంధర్వులు సిద్ధులు చారణులు నాగులు, కిన్నర-అప్సరసః - కిన్నరులు అప్సరసలు, మర్త్యాః - మానవులు, ఖగాః - పక్షులు, అనేకశః - అనేకరకములైన, భూతాని - ప్రాణులు, వైకుంఠ-అనుగతాః - శ్రీహరియొక్క భక్తులు (పార్షదులు), సర్వే - అందరు, యజ్ఞ-ఈశ్వరధియా - యజ్ఞేశ్వరుడగు శ్రీహరియే అనే భావనతో, రాజ్ఞా - మహారాజుచే, వాక్-విత్త-అంజలిభక్తితః - వచనములు ధనము చేతులను జోడించి నమస్కరించుట అనువాటితో భక్తి వలన, సభాజితాః - సత్కరించబడినవారై, తతః - అక్కడనుండి, యయుః - వెళ్లిరి.

దేవతలు, మహర్షులు, గంధర్వులు, సిద్ధులు, చారణులు, నాగులు, కిన్నరులు, అప్సరసలు, శ్రీహరి భక్తులగు మానవులు, పక్షులు, అనేక రకముల ప్రాణులు, శ్రీహరి అనుచరులు వీరినందరినీ పృథువు సాక్షాత్తుగా యజ్ఞేశ్వరుడగు శ్రీహరియే అనే భావనతో పలకరించి, చేతులను జోడించి

నమస్కరించి, ధనాదులను భక్తిపూర్వకముగా సమర్పించి సత్కరించెను. వారందరు అక్కడనుండి తమ తమ స్థానములకు వెళ్లిరి.

భగవానపి రాజర్షేస్సోపాధ్యాయస్య చాచ్యుతః ।
హరన్నివ మనోఽముష్య స్వధామ ప్రత్యపద్యత ।। 37

భగవాన్ - భగవానుడగు, అచ్యుతః అపి - శ్రీహరి కూడ, స-ఉపాధ్యాయస్య - ఋత్విక్కులతో కూడుకొనియున్న, రాజర్షేః - రాజర్షియగు, అముష్య - ఈ పృథువుయొక్క, మనః - మనస్సును, హరన్ ఇవ - హరించుచున్నవాడు వలె, స్వధామ - తన ధామమును, ప్రత్యపద్యత - చేరుకొనెను.

శ్రీహరి భగవానుడు కూడ రాజర్షియగు పృథువుయొక్క మనస్సును, ఆతని ఋత్విక్కుల మనస్సులను దోచుకున్నవాని వలె వైకుంఠమునకు చేరుకొనెను.

అదృష్టాయ నమస్కృత్య నృపస్సందర్శితాత్మనే ।
అవ్యక్తాయ చ దేవానాం దేవాయ స్వపురం యయౌ ।। 38

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే చతుర్థస్కంధే పృథూపాఖ్యానే
శ్రీహరి పృథు సంవాదో నామ వింశోఽధ్యాయః ।।

నృపః - పృథు మహారాజు, అదృష్టాయ - కనుచూపు మేర దాటి వెళ్లినట్టియు, అవ్యక్తాయ - ఇంద్రియగోచరుడు కానట్టియు, సందర్శిత-ఆత్మనే - చూపబడిన తన రూపము కలిగినట్టియు, దేవానాం చ దేవాయ - దేవాధిదేవుడగు శ్రీహరి కొరకు, నమస్కృత్య - నమస్కరించి, స్వపురమ్ - తన నగరమును గురించి, యయౌ - వెళ్లెను.

శ్రీహరి ఇంద్రియగోచరుడు కాడు. అయినను, దేవాధిదేవుడగు ఆయన తన సగుణ రూపమును పృథువునకు చూపించెను. అట్టి శ్రీహరి కనుచూపు మేర దాటి వెళ్లెను. పృథువు ఆయనకు నమస్కరించి, తన నగరమునకు చేరుకొనెను.

శ్రీమద్భాగవత మహాపురాణములోని నాల్గవ స్కంధములో
పృథూపాఖ్యానమునందు శ్రీహరిపృథుసంవాదమును
వర్ణించే ఇరువదియవ అధ్యాయము
ముగిసినది (20).

*****

# అథ ఏకవింశోऽధ్యాయః

## పృథూపాఖ్యానము - పృథువు చేసిన ఉపదేశము

మైత్రేయ ఉవాచ ।
మౌక్తికైః కుసుమస్రగ్భిర్దుకూలైస్స్వర్ణతోరణైః ।
మహాసురభిభిర్ధూపైర్మండితం తత్ర తత్ర వై ।। 1

మైత్రేయః - మైత్రేయ మహర్షి, ఉవాచ - పలికెను, మౌక్తికైః - ముత్యాల తోరణములతో, కుసుమస్రగ్భిః - పుష్పమాలలతో, దుకూలైః - వస్త్రములతో, స్వర్ణతోరణైః - బంగరు బహిర్ద్వారములతో, తత్ర తత్ర వై - అక్కడక్కడ, మహాసురభిభిః - గొప్ప సుగంధము గల, ధూపైః - ధూపములతో, మండితమ్ - అలంకరించబడిన (నగరమును చేరుకొనెను).

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- పృథు మహారాజుయొక్క నగరములోని బంగరు బహిర్ద్వారములను ముత్యాల హారములతో, పుష్పమాలలతో, వస్త్రములతో అలంకరించిరి. ఆ నగరములో అక్కడక్కడ గొప్ప పరిమళము గల ధూపములను ఏర్పాటు చేసిరి.

చందనాగురుతోయార్ద్రరథ్యాచత్వరమార్గవత్ ।
పుష్పాక్షతఫలైస్తోక్మైర్లాజైరర్చిభిరర్చితమ్ ।। 2

చందన-అగురుతోయ-ఆర్ద్రరథ్యాచత్వరమార్గవత్ - చందనము అగరు కలిపిన నీళ్లతో తడిసిన రథమార్గములు కూడళ్లు మరియు ఇతర మార్గములు కలిగినట్టియు, పుష్ప-అక్షతఫలైః - పుష్పములతో అక్షతలతో పళ్లతో, తోక్మైః - చిగుళ్లతో, లాజైః - పేలాలతో, అర్చిభిః - దీపములతో, అర్చితమ్ - అలంకరించబడిన (నగరమును చేరెను).

ఆ నగరములోని రథమార్గములలో, కూడళ్లలో మరియు ఇతర మార్గములలో గంధము, అగరు కలిపిన నీళ్లను చల్లి, పుష్పములు ఫలములు అక్షతలు చిగుళ్లు పేలాలు మరియు దీపములతో అలంకరించిరి.

సవృంద్రైః కదలీస్తంభైః పూగపోతైః పరిష్కృతమ్ ।
తరుపల్లవమాలాభిస్సర్వతస్సమలంకృతమ్ ॥ 3

సవృంద్రైః - గెలలతో కూడిన, కదలీస్తంభైః - అరటి చెట్ల బోదెలతో, పూగపోతైః - లేత పోక చెట్లతో, పరిష్కృతమ్ - అలంకరించబడినట్టియు, తరుపల్లవమాలాభిః - చెట్ల చిగుళ్ల మాలలతో, సర్వతః - అంతటా, సమలంకృతమ్ - చక్కగా అలంకరించబడిన (నగరమును చేరెను).

ఆ నగరమును గెలలతో కూడియున్న అరటి బోదెలతో, లేత పోక చెట్లతో మరియు చెట్ల చిగుళ్ల మాలలతో అంతటా చక్కగా అలంకరించిరి.

ప్రజాస్తం దీపబలిభిస్సంభృతాశేషమంగలైః ।
అభీయుర్మృష్టకన్యాశ్చ మృష్టకుండలమండితాః ॥ 4

ప్రజాః - జనులు, మృష్టకుండలమండితాః - ఉజ్జ్వలమగు కుండలములతో అలంకరించబడిన, మృష్టకన్యాః చ - ప్రకాశించే కన్యలు కూడ, దీపబలిభిః - దీపములతో మరియు పూజాద్రవ్యములతో, సంభృత-అశేషమంగలైః - సంపాదించబడిన సకలమంగళద్రవ్యములతో, తమ్ - ఆ పృథువును, అభి-ఈయుః - ఎదురేగిరి.

పృథువు నగరమునకు వచ్చుచుండగా, ఉజ్జ్వలములగు కుండలములనలంకరించుకొని గొప్పగా ప్రకాశించుచున్న కన్యలు మరియు ఇతర జనులు కూడ దీపములను, పూజాద్రవ్యములను మరియు సకలమంగళద్రవ్యములను సమకూర్చుకొని ఆయనకు ఎదురేగిరి.

శంఖదుందుభిఘోషేణ బ్రహ్మఘోషేణ చర్త్విజామ్ ।
వివేశ భవనం వీరః స్తూయమానో గతస్మయః ॥ 5

వీరః - వీరుడు, గతస్మయః - తొలగిన గర్వము గలవాడు అగు పృథువు, శంఖదుందుభిఘోషేణ - శంఖముల మరియు భేరీల ధ్వనుల తో, చ - మరియు, ఋత్విజామ్ - ఋత్విక్కుల, బ్రహ్మఘోషేణ - వేద ఘోషతో కూడి, స్తూయమానః - స్తుతించబడుచున్నవాడై, భవనమ్ - ప్రాసాదమును, వివేశ - ప్రవేశించెను.

పృథువు గర్వము లేని వీరుడు. ఆయనను వందిమాగధులు స్తుతించుచుండిరి. శంఖములను పూరించిరి. భేరీలను మ్రోగించిరి. ఋత్వి క్కులు వేదమంత్రములను పఠించుచుండగా ఆయన రాజప్రాసాదములో నికి ప్రవేశించెను.

పూజితః పూజయామాస తత్ర తత్ర మహాయశాః ।
పౌరాన్ జానపదాంస్తాంస్తాన్ ప్రీతః ప్రియవరప్రదః ॥ 6

మహాయశాః - గొప్ప కీర్తి గలవాడు, ప్రియవరప్రదః - ప్రియము లగు వరములనిచ్చువాడు అగు పృథువు, తత్ర తత్ర - అక్కడక్కడ, పూజితః - పూజించబడినవాడై, ప్రీతః - సంతసించినవాడై, తాన్ తాన్ - ఆయా, పౌరాన్ - పౌరులను, జానపదాన్ - పల్లె (దేశ) వాసులను, పూజ యామాస - పూజించెను.

గొప్ప కీర్తి గల పృథువు ప్రజలకు అభీష్టములగు వరములనిచ్చె ను. ఆయనను నగరములో పలు స్థానములలో జనులు పూజించుటచే ఆయన చాల సంతోషించెను. నగరములో మరియు రాజ్యములోని పల్లె లలో నివసించే ప్రముఖులను ఆయన కూడ పూజించెను.

స ఏవమాదీన్యనవద్యచేష్టితః
కర్మాణి భూయాంసి మహాన్మహత్తమః ।
కుర్వన్ శశాసావనిమండలం యశః
స్ఫీతం నిధాయారురుహే హరేః పదమ్ ॥ 7

అనవద్యచేష్టితః - నిర్దుష్టమైన చేష్టితములు గలవాడు, మహాన్ - గొప్పవాడు, మహత్-తమః - పూజించ దగినవాడు అగు, సః - ఆ పృథు

వు, ఏవం-ఆదీని - ఇటువంటి, భూయాంసి - అనేకములగు, కర్మాణి - కర్మలను, కుర్వన్ - చేయుచున్నవాడై, అవనిమండలమ్ - భూమండలమును, శశాస - శాసించెను, స్ఫీతమ్ - సమృద్ధమగు, యశః - కీర్తిని, నిధాయ - ఉంచి, హరేః - శ్రీహరియొక్క, పదమ్ - ధామమును, అరురుహే - అధిష్ఠించెను.

గుణములచే గొప్పవాడగు ఆ పృథువు నిర్దుష్టమగు కార్యములు గలవాడగుటచే పూజనీయుడు. ఆయన ఈ భూమండలమును ఈ విధమగు అనేకకర్మలను చేయుచూ పాలించెను. ఆయన ఈ లోకములో అతిశయించిన కీర్తిని వర్ధిల్లజేసి, శ్రీహరియొక్క ధామమును అధిష్ఠించెను.

సూత ఉవాచ ।
తదాదిరాజస్య యశో విజృంభితం
గుణైరశేషైర్గుణవత్సభాజితమ్ ।
క్షత్తా మహాభాగవతస్సదస్పతే
కౌషారవిం ప్రాహ గృణంతమర్చయన్ ।। 8

సదస్పతే - సభాపతివగు ఓ శౌనక మహర్షీ!, అశేషైః - సకలములగు, గుణైః - సద్గుణములచే, విజృంభితమ్ - వర్ధిల్ల జేయబడినట్టియు, గుణవత్-సభాజితమ్ - సద్గుణములు గలవారిచే ఆదరించబడిన, తత్ - అట్టి, ఆదిరాజస్య - ఆదిరాజగు పృథువుయొక్క, యశః - కీర్తిని, గృణంతమ్ - వర్ణించుచున్న, కౌషారవిమ్ - మైత్రేయ మహర్షిని, మహాభాగవతః - గొప్ప భగవద్భక్తుడగు, క్షత్తా - విదురుడు, అర్చయన్ - పూజించుచున్నవాడై, ప్రాహ - పలికెను.

సూత మహర్షి ఇట్లు పలికెను --- సభాపతివగు ఓ శౌనక మహర్షీ! ఆదిరాజగు పృథువుయొక్క అట్టి కీర్తి అతని సకలసద్గుణములచే మరింత విజృంభించెను. గుణవంతులు ఆయన కీర్తిని ఆదరించిరి. అట్టి ఆ కీర్తిని వర్ణించుచున్న మైత్రేయ మహర్షిని, భాగవతోత్తముడగు విదురుడు సత్కరించి, ఇట్లు పలికెను.

విదుర ఉవాచ ।
సోఽభిషిక్తః పృథుర్విప్రైర్లబ్ధాఽశేషసురార్హణః ।
బిభ్రచ్ఛ వైష్ణవం తేజో బాహ్వోర్యాభ్యాం దుదోహ గామ్ ॥9

విప్రైః - మహర్షులచే, అభిషిక్తః - అభిషేకించ బడినవాడు, లబ్ధ-అశేషసుర-అర్హణః - పొందబడిన సకలములగు దేవతలనుండి బహుమతులు గలవాడు అగు, సః - ఆ పృథువు, బాహ్వోః - బాహువులయందు, వైష్ణవమ్ - శ్రీహరికి సంబంధించిన, తేజః - తేజస్సును, బిభ్రత్ - ధరించుచున్నవాడు, యాభ్యామ్ - ఏ బాహువులచే, గామ్ - భూమిని, దుదోహ - పితికెనో.

విదురుడు ఇట్లు పలికెను --- మహర్షులు పృథువును చక్రవర్తిగా అభిషేకించగానే, దేవతలందరు ఆయనకు బహుమతులను సమర్పించిరి. ఆయన తన బాహువులయందు శ్రీహరియొక్క పాలనాశక్తిని ధరించినవాడై, భూమినుండి సకలసంపదలను సంపాదించెను.

కో న్వస్య కీర్తిం న శృణోత్యభిజ్ఞో
యద్విక్రమోచ్ఛిష్టమశేషభూపాః।
లోకాస్సపాలా ఉపజీవంతి కామ-
మద్యాపి తన్మే వద కర్మ శుద్ధమ్ ॥ 10

అభిజ్ఞః - వివేకియగు, కః ను - ఎవ్వాడు, అస్య - ఈ పృథువుయొక్క, కీర్తిమ్ - కీర్తిని, న శృణోతి - వినడు?, యత్-విక్రమ-ఉచ్ఛిష్టమ్ - ఎవని పరాక్రమముయొక్క శేషము అగు (శేషమును), కామమ్ - భోగ్యమును (యథేచ్ఛగా), అశేషభూపాః - సకలభూపాలురు, సపాలాః - లోకపాలకులతో గూడిన, లోకాః - లోకములు, అద్య అపి - ఇప్పటికి కూడా, ఉపజీవంతి - అనుభవించుచున్నారో, తత్ - ఆ పృథువుయొక్క, శుద్ధమ్ - పవిత్రమగు, కర్మ - చేష్టితమును గురించి, మే - నా కొరకు, వద - చెప్పుము.

పృథువు తన పరాక్రమముచే భూమినుండి సంపదలను సంపాదించెను. ఈ నాటికీ భూపాలురు, లోకపాలకులు మరియు లోకములు ఆ సంపదలలో మిగిలిన వాటినే యథేచ్ఛగా భోగించుచున్నారు. అట్టి పృథువుయొక్క కీర్తిని వివేకియైనవాడు ఎవడు వినకుండును? అతని పవిత్రమగు ఆచరణమును గురించి నాకు చెప్పుము.

మైత్రేయ ఉవాచ ।
గంగాయమునయోర్నద్యోరంతరా క్షేత్రమావసన్ ।
ఆరబ్ధానేవ బుభుజే భోగాన్ పుణ్యజిహాసయా ॥ 11

గంగాయమునయోః నద్యోః - గంగా యమునా నదులయొక్క, అంతరా - మధ్యనున్న, క్షేత్రమ్ - భూభాగమును, ఆవసన్ - మకాము చేయుచున్నవాడై, పుణ్యజిహాసయా - పుణ్యమును వదిలించుకొను కోరికతో, ఆరబ్ధాన్ భోగాన్ ఏవ - ప్రారబ్ధకర్మఫలరూపముగా లభించిన భోగములను మాత్రమే, బుభుజే - అనుభవించెను.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- పృథువు గంగా యమునా నదుల మధ్యనున్న భూభాగములో మకాము చేసెను. ఆయన పుణ్యమును కూడ బంధముగనే భావించి, దానిని వదిలించుకొనుటకై ప్రారబ్ధకర్మఫలరూపములగు భోగములను మాత్రమే అనుభవించెను.

సర్వత్రాస్ఖలితాదేశస్సప్తద్వీపైకదండధృక్ ।
అన్యత్ర బ్రాహ్మణకులాదన్యత్రాచ్యుతగోత్రతః ॥ 12

సర్వత్ర - అంతటా, అస్ఖలిత-ఆదేశః - నిరాకరించబడని ఆజ్ఞలు గల పృథువు, బ్రాహ్మణకులాత్ అన్యత్ర - బ్రాహ్మణ సమూహమును విడిచిపెట్టి, అచ్యుతగోత్రతః అన్యత్ర - శ్రీహరియే గోత్రముగా గలవారిని విడిచిపెట్టి, సప్తద్వీప-ఏకదండధృక్ - ఏడు ద్వీపములయందు ఒకే ఒక దండధారి.

బ్రాహ్మణ సమూహమును, విష్ణువును శరణు జొచ్చిన భక్తులను విడిచిపెట్టి, పృథువు ఏడు ద్వీపములలో ఏకైకసమ్రాట్టుయై శాసనమును చేసెను. ఆయన ఆజ్ఞకు ఎదురు లేకుండెను.

ఏకదాసీన్మహాసత్రదీక్షా తత్ర దివౌకసామ్ ।
సమాజో బ్రహ్మర్షీణాం చ రాజర్షీణాం చ సత్తమ ॥ 13

సత్తమ - సత్పురుషులలో శ్రేష్ఠుడవగు ఓ విదురా!, ఏకదా - ఒక ప్పుడు, మహాసత్రదీక్షా - గొప్ప సత్రయాగదీక్ష, ఆసీత్ - జరిగెను, తత్ర - దానియందు, దివ-ఓకసామ్ - స్వర్గవాసులగు దేవతలయొక్క, బ్రహ్మ-ఋషీణామ్ - బ్రహ్మర్షులయొక్క, చ - మరియు, రాజర్షీణాం చ - రాజర్షులయొక్క, సమాజః - సమావేశము.

సత్పురుషులలో శ్రేష్ఠుడవగు ఓ విదురా! ఒకప్పుడు పృథువు గొప్ప సత్రయాగమును చేయుటకు దీక్ష బూనెను. ఆ యాగమునందు దేవతలు, బ్రహ్మర్షులు మరియు రాజర్షులు కూడ సమావేశమైరి.

తస్మిన్నర్హత్సు సర్వేషు స్వర్చితేషు యథార్హతః ।
ఉత్థితస్సదసో మధ్యే తారాణాముడురాడివ ॥ 14

తస్మిన్ - ఆ యాగమునందు, అర్హత్సు - పూజ్యులగు, సర్వేషు - అందరు, యథార్హతః - వారి వారి యోగ్యతలను బట్టి, సు-అర్చితేషు - చక్కగా పూజించబడగా, సదసః - సభయొక్క, మధ్యే - మధ్యయందు, తారాణామ్ - నక్షత్రముల, మధ్యే - మధ్యయందు, ఉడురాట్ ఇవ - చంద్రుడు వలె, ఉత్థితః - లేచి నిలబడినవాడు.

ఆ యాగములో పూజ్యులగు సర్వులను వారి వారి యోగ్యతలకు తగినట్లుగా సత్కరించిరి. సభామధ్యములో పృథువు లేచి, తారల మధ్యలో చంద్రుడు వలె, నిలబడెను.

ప్రాంశుః పీనాయతభుజో గౌరః కంజారుణేక్షణః ।
సునాసస్సుముఖస్సౌమ్యః పీనాంసస్సుద్విజస్మితః ॥ 15

ప్రాంశుః - పొడవైనవాడు, పీన-ఆయతభుజః - బలిసిన పొడవైన చేతులు గలవాడు, గౌరః - పచ్చనివాడు, కంజ-అరుణ-ఈక్షణః - పద్మములవలె ఎఱ్ఱని కన్నులు గలవాడు, సునాసః - చక్కని ముక్కు గలవాడు, సుముఖః - ప్రసన్నమగు ముఖము గలవాడు, సౌమ్యః - చూచుటకు ఆహ్లాదమును కలిగించువాడు, పీన-అంసః - పుష్టిగానున్న భుజస్కంధములు గలవాడు, సుద్విజస్మితః - చక్కని పళ్లు చిరునవ్వు గలవాడు.

పచ్చని దేహవర్ణము గల పృథువు పొడవాటి వ్యక్తి. ఆయన చేతులు బలిసి పొడవుగా నుండెను. పద్మములవలె ఎఱ్ఱని కన్నులు గల ఆయన ముక్కు అందముగా నుండెను. ప్రసన్నమగు ముఖము గల ఆయనను చూచువారలకు ఆహ్లాదము కలుగును. పుష్టిగానుండే భుజస్కంధములు గల ఆయన చక్కని పలువరుసలతో చిరునవ్వు కలిగియుండును.

వ్యూఢవక్షా బృహచ్ఛ్రోణిర్వలివల్గుదలోదరః ।
ఆవర్తనాభిరోజస్వీ కాంచనోరురుదగ్రపాత్ ॥ 16

వ్యూఢవక్షాః - విశాలమగు వక్షఃస్థలము గలవాడు, బృహత్-శ్రోణిః - పెద్ద పిరుదులు గలవాడు, వలివల్గుదల-ఉదరః - ముడుతలతో సుందరమైన రావియాకు వలె సన్నని నడుము గలవాడు, ఆవర్తనాభిః - సుడి తిరిగిన లోతైన బొడ్డు గలవాడు, ఓజస్వీ - శక్తి గలవాడు, కాంచన-ఊరుః - బంగరు రంగు గల ఊరువులు గలవాడు, ఉదగ్రపాత్ - ఎత్తైన కొనలు గల పాదములు గలవాడు.

ఆయన విశాలమగు వక్షఃస్థలముతో, రావియాకు వలె పైన విశాలముగా క్రింద సన్నగా ఉండే నడుముతో ప్రకాశించెను. ఆయన ఉదరముపై ముడుతలు ఉండెను. విశాలమగు కటిభాగము గల ఆయన ఊరువులు బంగరు వర్ణము కలిగియుండెను. మహాశక్తిమంతుడగు ఆయన నాభి సుడి తిరిగి లోతుగానుండెను. ఆయన పాదములు ఎత్తైన కొనలను కలిగియుండెను.

సూక్ష్మవక్రాసితస్నిగ్ధమూర్ధజః కంబుకంధరః ।
మహాధనే దుకూలాగ్ర్యే పరిధాయోపవీయ చ ॥ 17

సూక్ష్మవక్ర-అసితస్నిగ్ధమూర్ధజః - సన్నని వంకరలు తిరిగిన నల్లని చిక్కని శిరోజములు గలవాడు, కంబుకంధరః - శంఖమువంటి మెడ గలవాడు, మహాధనే - మిక్కిలి విలువైన, దుకూల-అగ్ర్యే - శ్రేష్ఠమగు వస్త్రములను, పరిధాయ - ధరించి, ఉపవీయ చ - ఉత్తరీయముగా కూడ వేసుకొని.

శంఖమువంటి మెడ గల ఆయన జుట్టు సన్నగా నల్లగా చిక్కగా వంకరలు తిరిగి యుండెను. ఆయన మిక్కిలి విలువైన శ్రేష్ఠమగు ధోవతిని ధరించి, ఉత్తరీయమును వేసుకొని యుండెను.

వ్యంజితాశేషగాత్రశ్రీర్నియమే న్యస్తభూషణః ।
కృష్ణాజినధరః శ్రీమాన్ కుశపాణిః కృతోచితః ॥ 18

నియమే - యజ్ఞనియమమునందు, న్యస్తభూషణః - విడిచిపెట్టబడిన అలంకారములు గలవాడు, వ్యంజిత-అశేషగాత్రశ్రీః - ప్రకటమైన సకలావయవముల శోభ గలవాడు, కృష్ణ-అజినధరః - కృష్ణమృగచర్మమును ధరించినవాడు, శ్రీమాన్ - శోభాయుక్తుడు, కుశపాణిః - దర్భలు చేతియందు గలవాడు, కృత-ఉచితః - చేయబడిన ఆవశ్యక కర్మలు గలవాడు.

యజ్ఞనియమమును బట్టి ఆయన ఆభరణములను విడిచిపెట్టి కృష్ణమృగచర్మమును ధరించియుండెను. కావుననే, ఆయన అవయవము లన్నింటి శోభ ప్రకటమగుచుండెను. శోభాయుక్తుడగు ఆ పృథువు నిత్యకర్మలను పూర్తి చేసుకొని చేతియందు దర్భలను పట్టుకొని యుండెను.

శిశిరస్నిగ్ధతారాక్షస్సమైక్షత సమంతతః ।
ఊచివానిదముర్వీశస్సదస్సంహర్షయన్నివ ॥ 19

శిశిరస్నిగ్ధతార-అక్షః - తాపమును పోగొట్టే నునుపైన (ప్రేమగల) పాపలు గల కన్నులు గలవాడు, ఉర్వీ-ఈశః - భూపతి అగు ఆ పృథువు, సమంతతః - అన్ని వైపులా, సమైక్షత - సావధానముగా చూచెను, సదః - సభను, సంహర్షయన్ ఇవ - ఆనందపరచుచున్నవాడు వలె, ఇదమ్ - ఈ మాటను, ఊచివాన్ - పలికెను.

పృథు మహారాజు నునుపైన కనుపాపలు గల కన్నులతో సభ నంతా తిలకించి, తన ప్రేమపూర్ణమైన చూపులతో వారి తాపమును పోగొట్టి ఆనందమును కలిగించుచున్నాడా యన్నట్లు ఈ మాటలను పలికెను.

చారుచిత్రపదం శ్లక్ష్ణం మృష్టం గూఢమవిక్లవమ్ ।
సర్వేషాముపకారార్థం తదా అనువదన్నివ ।। 20

తదా - అప్పుడు, చారుచిత్రపదమ్ - మధురమైన వైవిధ్యము గల పదములు కలిగినట్టియు, శ్లక్ష్ణమ్ - ప్రశస్తమైనట్టియు, మృష్టమ్ - శుద్ధమైనట్టియు, గూఢమ్ - గంభీరమైనట్టియు, అవిక్లవమ్ - తొందరపాటు లేని (వ్యాకులతను కలిగించని) మాటను, సర్వేషామ్ - అందరి, ఉపకార-అర్థమ్ - ఉపకారము కొరకు, అనువదన్ ఇవ - తన అనుభవమును చెప్పుచున్నాడా యన్నట్లుండెను.

అప్పుడాయన మధురమైన వైవిధ్యము గల ప్రశస్తమైన శుద్ధమైన గంభీరార్థము గల వ్యాకులతను కలిగించని పలుకులను తొందరపాటు లేని విధముగా పలికెను. ఆయన తన అనుభవమును అందరి ఉపకారము కొరకై చెప్పుచున్నాడా యన్నట్లు అనిపించెను.

రాజోవాచ ।
సభ్యాశ్శృణుత భద్రం వస్సాధవో య ఇహాగతాః ।
సత్సు జిజ్ఞాసుభిర్ధర్మమావేద్యం స్వమనీషితమ్ ।। 21

సభ్యాః - సభాసదులారా!, శృణుత - వినుడు, వః - మీకు, భద్రమ్ - మంగళమగు గాక!, సాధవః - సాధుపురుషులగు, యే - ఏ మీరు, ఇహ - ఇచటకు, ఆగతాః - వచ్చితిరో, ధర్మమ్ - ధర్మమును, జిజ్ఞాసుభిః - తెలియగోరువారిచే, స్వమనీషితమ్ - తనచే విచారించబడిన, సత్సు - సత్పురుషులయందు, ఆవేద్యమ్ - విన్నవించ దగినది.

పృథు మహారాజు ఇట్లు పలికెను --- సభాసదులారా! సత్పురుషులగు మీరు ఇచటకు వచ్చితిరి. మీకు మంగళమగు గాక! నా మాటను

వినుడు. ధర్మమును తెలియగోరు జనులు తమ అభిప్రాయములను సత్పురుషుల యెదుట విన్నవించవలెను.

అహం దండధరో రాజా ప్రజానామిహ యోజితః ।
రక్షితా వృత్తిదస్స్వేషు సేతుషు స్థాపితా పృథక్ ॥ 22

అహమ్ - నేను, ఇహ - ఈ సామ్రాజ్యమునందు, ప్రజానామ్ - ప్రజలకు, రాజా - రాజుగా, యోజితః - నియోగించ బడితిని, దండధరః - దుష్టులను శిక్షించువాడను, రక్షితా - శిష్టులను రక్షించువాడను, వృత్తిదః - జీవికను ఇచ్చువాడను, స్వేషు - తమ, సేతుషు - ధర్మమర్యాదలయందు, పృథక్ - వేర్వేరుగా, స్థాపితా - స్థాపించువాడను.

నన్ను మహర్షులు ఈ సామ్రాజ్యములో ప్రజాపాలకునిగా నియోగించిరి. కావున, నేను దుష్టులను శిక్షించి, శిష్టులను రక్షిస్తూ, ప్రజలకు జీవికను కల్పించి, వారిని యథాయోగ్యముగా తమ తమ ధర్మమర్యాదలయందు స్థాపించుచున్నాను.

తస్య మే తదనుష్ఠానాద్యానాహుర్బ్రహ్మవాదినః ।
లోకాస్స్యుః కామసందోహా యస్య తుష్యతి దిష్టదృక్ ॥ 23

తత్-అనుష్ఠానాత్ - అట్టి ధర్మమును అనుష్ఠించుట వలన, తస్య - అట్టి, మే - నాకు, కామసందోహాః - కోరికలు ఈడేరే, లోకాః - లోకములు, స్యుః - కలుగును, బ్రహ్మవాదినః - వేదవేత్తలు, యాన్ - ఏ లోకములను, ఆహుః - చెప్పిరో, యస్య - ఏ నాకు, దిష్టదృక్ - కర్మసాక్షియగు ఈశ్వరుడు, తుష్యతి - సంతోషించునో.

నేను నా ధర్మమును అనుష్ఠించుచున్నాను. స్వధర్మానుయాయులకు కోరికలీడేరే పుణ్యలోకములు లభించునని వేదవేత్తలు చెప్పుచున్నారు. కర్మసాక్షియగు ఈశ్వరుడు నా యెడల ప్రసన్నుడై, నాకు కూడ అట్టి పుణ్యలోకములు లభించును.

య ఉద్ధరేత్కరం రాజా ప్రజా ధర్మేష్వశిక్షయన్ ।
ప్రజానాం శమలం భుంక్తే భగం చ స్వం జహాతి సః ॥ 24

యః - ఏ, రాజా - రాజు, ప్రజాః - ప్రజలను, ధర్మేషు - ధర్మములయందు, అశిక్షయన్ - ప్రవర్తిల్ల జేయకుండగా, కరమ్ - పన్నును, ఉద్ధరేత్ - వసూలు చేయునో, సః - అతడు, ప్రజానామ్ - ప్రజలయొక్క, శమలమ్ - పాపమును, భుంక్తే - అనుభవించును, చ - మరియు, స్వమ్ - తనదైన, భగమ్ - భాగ్యమును, జహాతి - పోగొట్టుకొనును.

ఏ రాజైతే ప్రజలను ధర్మమునందు నడిపించకుండగా వారివద్ద నుండి పన్నును వసూలు చేయునో, అతడు ప్రజల పాపమును తాను పొంది, తన భాగ్యమును పోగొట్టుకొనును.

తత్ప్రజా భర్తృపిండార్థం స్వార్థమేవానసూయవః ।
కురుతాఽధోక్షజధియస్తర్హి మేఽనుగ్రహః కృతః ॥ 25

ప్రజాః - ఓ ప్రజలారా!, తత్ - అందువలన, అనసూయవః - దోషైకదృష్టి లేనివారై, అధోక్షజధియః - ప్రత్యక్షాది ప్రమాణములకు లభ్యము కాని శ్రీహరియందు బుద్ధి గలవారై, భర్తృపిండ-అర్థమ్ - రాజు యొక్క పరలోకము కొరకు, స్వ-అర్థం ఏవ - స్వధర్మమును మాత్రమే, కురుత - అనుష్ఠించుడు, తర్హి - అట్లైనచో, మే - నా కొరకు, అనుగ్రహః - అనుగ్రహము, కృతః - చేయబడినది.

ఓ ప్రజలారా! కావున, మీరు దోషములను మాత్రమే పట్టుకొనే బుద్ధిని విడనాడి, ఆ బుద్ధిని శ్రీహరిపై నిలుపుడు. శ్రీహరి ప్రత్యక్షాది ప్రమాణములకు లభ్యుడు కాడు. మీ రాజునగు నేను పుణ్యలోకములను పొందాలంటే, మీరు మీ మీ ధర్మములను అనుష్ఠించవలెను. మీరు అట్లు చేసినచో, నన్ను అనుగ్రహించినవారు అగుదురు.

యూయం తదనుమోదధ్వం పితృదేవర్షయోఽమలాః ।
కర్తుశ్శాస్తురనుజ్ఞాతుస్తుల్యం యత్ప్రేత్య తత్ఫలమ్ ॥ 26

పితృదేవ-ఋషయః - పితరులారా! దేవతలారా! మహర్షులారా!, అమలాః - పవిత్రులగు, యూయమ్ - మీరు, తత్ - దానిని, అనుమోదధ్వమ్ - అనుమోదించుడు, యత్ - ఏలయన, కర్తుః - చేయువానికి,

శాస్తుః - ఉపదేశించువానికి, అనుజ్ఞాతుః - అనుమోదించువానికి, ప్రేత్య - మరణించిన పిదప, తత్ - దాని, ఫలమ్ - ఫలము, తుల్యమ్ - సమము.

ఓ పితృదేవతలారా! దేవతలారా! మహర్షులారా! నేను చెప్పిన మాటను పవిత్రులగు మీరు అనుమోదించుడు. ఏలయనగా, అట్టి ధర్మ మును చేయువానికి, ఉపదేశించువానికి, అనుమోదించువానికి కూడ దాని ఫలము పరలోకములో సమానముగా లభించును.

అస్తి యజ్ఞపతిర్నామ కేషాంచిదర్హసత్తమాః ।
ఇహాముత్ర చ లక్ష్యంతే జ్యోత్స్నావత్యః క్వచిద్భువః ॥ 27

అర్హసత్తమాః - పూజించదగిన మహాత్ములారా!, కేషాంచిత్ - కొందరికి, యజ్ఞపతిః నామ - యజ్ఞేశ్వరుడనువాడు, అస్తి - ఉన్నాడు, ఇహ - ఇహలోకములో, అముత్ర చ - పరలోకములో కూడ, జ్యోత్స్నా వత్యః - తేజోమయములగు, భువః - భూములు, క్వచిత్ - అక్కడక్కడ, లక్ష్యంతే - కానవచ్చుచున్నవి.

పూజించదగిన మహాత్ములారా! యజ్ఞేశ్వరుడు, కర్మఫలదాత అగు భగవానుడు ఉన్నాడు అని కొందరు మహానుభావుల సిద్ధాంతము. ఇదియే యథార్థము. ఏలయనగా, ఇహపరలోకములలో తేజోమయములగు ప్రదేశ ములు (సుఖకరములగు శరీరములు) అక్కడక్కడ కానవచ్చుచున్నవి.

మనోరుత్తానపాదస్య ధ్రువస్యాపి మహీపతేః ।
ప్రియవ్రతస్య రాజర్షేరంగస్యాస్మత్పితుః పితుః ॥ 28

ఈదృశానామథాన్యేషామజస్య చ భవస్య చ ।
ప్రహ్లాదస్య బలేశ్చాపి కృత్యమస్తి గదాభృతా ॥ 29

దౌహిత్రాదీనృతే మృత్యోశ్శోచ్యాన్ ధర్మవిమోహితాన్ ।
వర్గస్వర్గాపవర్గాణాం ప్రాయేణైకాత్మ్యహేతునా ॥ 30

మనోః - స్వాయంభువ మనువునకు, ఉత్తానపాదస్య - ఉత్తానపా దునకు, ధ్రువస్య మహీపతేః అపి - ధ్రువ మహారాజునకు కూడ, రాజర్షేః -

రాజర్షియగు, ప్రియవ్రతస్య - ప్రియవ్రతునకు, అస్మత్-పితుః - మా తండ్రి గారి, పితుః - తండ్రియగు, అంగస్య - అంగ మహారాజునకు, అథ - మరియు, ఈదృశానామ్ - ఇటువంటి, అన్యేషామ్ - ఇతర మహారాజులకు, అజస్య - బ్రహ్మగారికి, భవస్య చ - శివునకు కూడ, ప్రహ్లాదస్య - ప్రహ్లాదునకు, బలేః చ అపి - బలి చక్రవర్తికి కూడ, శోచ్యాన్ - శోకించవలసినట్టియు, ధర్మవిమోహితాన్ - ధర్మము విషయములో వ్యామోహమును పొందిన, మృత్యోః దౌహిత్రాదీన్ ఋతే - మృత్యువు మనుమడగు వేనుడు మొదలగువారిని మినహాయించి, వర్గస్వర్గ-అపవర్గాణామ్ - ధర్మార్థకామములు స్వర్గము మోక్షము అనువాటికి, ప్రాయేణ - ప్రధానముగా, ఐకాత్మ్యహేతునా - ఒకే రూపము ఉండుట అనే కారణముచే, గదాభృతా - గదాధారియగు శ్రీహరితో, కృత్యమ్ - ప్రయోజనము, అస్తి - ఉన్నది.

జీవులకు ధర్మార్థకామములను, పుణ్యలోకములను మరియు మోక్షమును వారి వారి యోగ్యతలను బట్టి అనుగ్రహించే ఏకైక నియామక తత్త్వము ఒకటి ప్రధానముగా ఉండి తీరవలెను (కర్మాదులు అప్రధానములు). అదియే గదాధారియగు శ్రీహరి. ఈ విషయమును స్వాయంభువ మనువు, ఉత్తానపాదుడు, ధ్రువ మహారాజు, రాజర్షియగు ప్రియవ్రతుడు, మా తాతగారైన అంగ మహారాజు, ఇతరులగు ఇట్టి చక్రవర్తులు మాత్రమే కాకుండా, బ్రహ్మ, శివుడు, ప్రహ్లాదుడు, బలి చక్రవర్తి కూడ అంగీకరించినారు. కేవలము మృత్యువుయొక్క కూతురు కొడుకగు వేనుడు మొదలగువారు శ్రీహరిని అంగీకరించలేదు. వారు ధర్మము విషయములో వ్యామోహమును పొంది శోచనీయమగు స్థితిని చేరుకున్నారు.

యత్పాదసేవాభిరుచిస్తపస్వినా-
మశేషజన్మోపచితం మలం ధియః ।
సద్యః క్షిణోత్యన్వహమేధతీ సతీ
యథా పదాంగుష్ఠవినిస్సృతా సరిత్ ॥ 31

యత్-పాదసేవా-అభిరుచిః - ఎవ్వాని పాదముల సేవయందలి ప్రీతి, అను-అహమ్ - ప్రతిరోజు, ఏధతీ సతీ - పెరుగుచున్నదై, తపస్వినామ్ - తపశ్శాలురకు (సంసారతాపము ననుభవించుచున్నవారికి), అశే

షజన్మ-ఉపచితమ్ - అనేకములగు జన్మలలో ప్రోగుచేయబడిన, ధియః - అంతఃకరణముయొక్క, మలమ్ - మాలిన్యమును, పద-అంగుష్ఠవినిస్సృతా - కాలి బొటనవ్రేలునుండి ఆవిర్భవించిన, సరిత్ యథా - గంగానది వలె, సద్యః - వెంటనే, క్షిణోతి - నశింపజేయునో.

సంసారతాపముచే పీడితులై తపస్సును చేసుకొనువారలకు శ్రీహరియొక్క పాదములను సేవించాలనే అభిరుచి దినదినప్రవర్ధమానమై, వారు అనేకజన్మలలో ప్రోగు చేసుకున్న మనోమాలిన్యమును, ఆ శ్రీహరి యొక్క పాదము బొటనవ్రేలినుండి ఆవిర్భవించిన గంగానది వలె, వెంటనే నశింప జేయును.

వినిర్ధుతాశేషమనోమలః పుమాన్
అసంగవిజ్ఞానవిశేషవీర్యవాన్ ।
యదంఘ్రిమూలే కృతకేతనః పునః
న సంసృతిం క్లేశవహాం ప్రపద్యతే ॥ 32

వినిర్ధుత-అశేషమనః-మలః - పూర్తిగా కడిగివేయబడిన సమస్తమైన మనోమాలిన్యములు గలవాడు, అసంగవిజ్ఞానవిశేషవీర్యవాన్ - వైరాగ్యముచే కలిగిన ఆత్మజ్ఞానముయొక్క సాక్షాత్కారముచే మనోబలము గలవాడు, యత్-అంఘ్రిమూలే - ఏ శ్రీహరియొక్క పాదముల మూలమునందు, కృతకేతనః - చేయబడిన నివాసము గలవాడు అగు, పుమాన్ - పురుషుడు, పునః - మరల, క్లేశవహామ్ - దుఃఖకరమగు, సంసృతిమ్ - సంసారమును, న ప్రపద్యతే - పొందుట లేదో.

మానవుడు తన మనస్సులోని మాలిన్యములను పూర్తిగా కడిగివేసుకొని శ్రీహరియొక్క పాదమూలములను శరణు పొందవలెను. అట్టివానికి వైరాగ్యముచే ఆత్మసాక్షాత్కారము, దాని వలన విశిష్టమగు మనోబలము కలుగును. అట్టి వ్యక్తి మరల దుఃఖరూపమగు ఈ సంసారమును పొందడు.

తమేవ యూయం భజతాత్మవృత్తిభిః
మనోవచఃకాయగుణైస్స్వకర్మభిః ।

అమాయినః కామదుఘాంఘ్రిపంకజం
యథాఽధికారావసితార్థసిద్ధయః ॥ 33

అమాయినః - కపటము లేనివారు, యథా-అధికార-అవసిత-అర్థ సిద్ధయః - యోగ్యతననుసరించి అనుష్ఠించబడిన అర్థముల సంసిద్ధి గల వారు అగు, యూయమ్ - మీరు, ఆత్మవృత్తిభిః - మీ మీ వృత్తులచే, మనః -వచఃకాయగుణైః - మనోవాక్కాయముల గుణములగు ధ్యానము స్తుతి నమస్కారాదులచే, స్వకర్మభిః - మీ మీ కర్తవ్యములననుష్ఠించుటచే, కామ దుఘ-అంఘ్రిపంకజమ్ - కోరికలనీడేర్చే పాదపద్మములు గల, తం ఏవ - ఆ శ్రీహరిని మాత్రమే, భజత - సేవించుడు.

మీరు కపటము లేనివారు. మీరు మీ యోగ్యతననుసరించి మీ మీ ధర్మములననుష్ఠించి సిద్ధిని బడసి యున్నారు. అట్టి మీరు మీ మీ వృత్తుల ను, మీ మీ కర్తవ్యములను చేసుకుంటూనే, వాటి ద్వారానే ఆ శ్రీహరిని ఆరాధించుడు. మీరు మనస్సులో శ్రీహరిని ధ్యానిస్తూ, వాక్కుతో స్తుతిస్తూ, శరీరముతో నమస్కారాదులనాచరించుడు. శ్రీహరి పాదపద్మము మీ కోరిక లనీడేర్చే కామధేనువు.

అసావిహానేకగుణోఽగుణోఽధ్వరః
పృథగ్విధద్రవ్యగుణక్రియోక్తిభిః ।
సంపద్యతేఽర్థాశయలింగనామభిః
విశుద్ధవిజ్ఞానఘనస్స్వరూపతః ॥ 34

అగుణః - నిర్గుణుడు, స్వరూపతః - స్వరూపముచే, విశుద్ధవిజ్ఞాన ఘనః - అసంగము ఏకరసము అగు జ్ఞానమే అయినవాడు అగు, అసౌ - ఈ శ్రీహరియే, ఇహ - ఈ లోకములో, పృథక్-విధద్రవ్యగుణక్రియా-ఉ క్తిభిః - అనేకవిధములైన ద్రవ్యములు గుణములు కర్మలు మరియు మంత్ర ములచే, అర్థ-ఆశయలింగనామభిః - ప్రయోజనము సంకల్పము పదార్థ ముల శక్తి మరియు నామము అనువాటిచే, అనేకగుణః - అనేకగుణములు గల, అధ్వరః - యజ్ఞముగా, సంపద్యతే - సంపన్నమగుచున్నాడు.

శ్రీహరి స్వరూపముచే నిర్గుణుడు, అసంగుడు, ఏకరసుడు, జ్ఞాన ఘనుడు. కాని, ఆయన ఈ లోకములో కర్మమార్గములో, పురోడాశము మొదలగు ద్రవ్యములచే, తెలుపు మొదలగు గుణములచే, ధాన్యమును (హోమము కొరకై) దంచుట మొదలగు క్రియలచే, మంత్రములచే యజ్ఞ రూపముగా సంపన్నమగుచున్నాడు. ఆ యజ్ఞమునకు ప్రయోజనము, సంకల్పము, పదార్థముల శక్తి మరియు నామము అనే అనేకములగు విశే షణములు కూడ సంపన్నమగుచున్నవి.

ప్రధానకాలాశయధర్మసంగ్రహే
శరీర ఏష ప్రతిపద్య చేతనామ్ ।
క్రియాఫలత్వేన విభుర్విభావ్యతే
యథాఽనలో దారుషు తద్గుణాత్మకః ॥ 35

ప్రధానకాల-ఆశయధర్మసంగ్రహే - మాయాశక్తి కాలము వాస నలు అదృష్టముల కలయికచే పుట్టే, శరీరే - శరీరమునందు, విభుః - సర్వ వ్యాపకుడగు, ఏషః - ఈ శ్రీహరి, చేతనామ్ - విషయముల రూపములో నుండే బుద్ధిని, ప్రతిపద్య - పొంది, దారుషు - కట్టెలయందు, యథా - ఏ విధముగానైతే, అనలః - అగ్ని, తత్-గుణ-ఆత్మకః - వాటి గుణములే రూ పముగా గలది అగునో అదే విధముగా, క్రియాఫలత్వేన - కర్మల ఫలము రూపముగా, విభావ్యతే - కానవచ్చుచున్నాడు.

ఈశ్వరుని మాయాశక్తి, దానిలో సంక్షోభమును కలిగించే కాలము, జీవవాసనలు, జీవుని ప్రారబ్ధకర్మ (అదృష్టము) ఇవన్నీ కలిసి శరీరము పుట్టును. అగ్ని కట్టెలయందు ప్రకటమై ఆ కట్టెల రూపమే తన రూపమా యన్నట్లు కానవచ్చును. అదే విధముగా, సర్వవ్యాపకుడగు ఈశ్వరుడు ఆ శరీరమునందు విషయముల రూపములోనుండే బుద్ధితో తాదాత్మ్యమును చెంది, కర్మల ఫలములు గలవాడుగా కానవచ్చుచున్నాడు (అటులనే జను లచే జీవరూపముగా స్వీకరించబడుచున్నాడు).

అహో మమామీ వితరంత్యనుగ్రహం
హరిం గురుం యజ్ఞభుజామధీశ్వరమ్ ।

స్వధర్మయోగేన యజంతి మామకా
నిరంతరం క్షోణితలే దృఢవ్రతాః ।। 36

మామకాః - నావారైన, అమీ - వీరు, క్షోణితలే - భూతలమునందు, దృఢవ్రతాః - దృఢమగు నిష్ఠ గలవారై, స్వధర్మయోగేన - స్వధర్మానుష్ఠానము అనే ఉపాయముచే, గురుమ్ - లోకములకు తండ్రి అయినట్టియు, యజ్ఞభుజామ్ - యజ్ఞభాగములను భుజించే దేవతలకు, అధి-ఈశ్వరమ్ - అధినాయకుడగు, హరిమ్ - శ్రీహరిని, నిరంతరమ్ - నిరంతరముగా, యజంతి - ఆరాధించుచున్నారు, అహో - ఆశ్చర్యము!, మమ - నాకు, అనుగ్రహమ్ - అనుగ్రహమును, వితరంతి - చేయుచున్నారు.

ఈ నా ప్రజలు భూలోకములో దృఢమగు నిష్ఠను కలిగి స్వధర్మమును అనుష్ఠిస్తూ శ్రీహరిని నిరంతరముగా ఆరాధిస్తూ, ఆ విధముగా నన్ను అనుగ్రహించుచున్నారు. ఇది ఎంతటి భాగ్యమో గదా! యజ్ఞభాగములను భుజించే దేవతలకు అధీశ్వరుడగు శ్రీహరి ముల్లోకములకు తండ్రి.

మా జాతు తేజః ప్రభవేన్మహర్ద్ధిభిః
తితిక్షయా తపసా విద్యయా చ ।
దేదీప్యమానేఽజితదేవతానాం
కులే స్వయం రాజకులాద్ద్విజానామ్ ।। 37

మహా-ఋద్ధిభిః - గొప్ప సంపదలచే, రాజకులాత్ - రాజవంశము నుండి, తేజః - తేజస్సు, తితిక్షయా - సహనముచే, తపసా - తపస్సుచే, చ - మరియు, విద్యయా - విద్యచే, స్వయమ్ - తనంత తానుగా, దేదీప్యమానే - గొప్పగా ప్రకాశించుచున్న, అజితదేవతనామ్ - పరాజయమునెరుంగని శ్రీహరియే దైవముగా గల, ద్విజానామ్ - వేదవేత్తల, కులే - సముదాయమునందు, జాతు - ఒక్కనాడైనన్నూ, మా ప్రభవేత్ - ప్రభావమును చూపకుండుగాక!

వేదవేత్తల ఈ సముదాయము పరాజయమునెరుంగని శ్రీహరిని కులదైవముగా ఆరాధిస్తూ, సహనము తపస్సు మరియు విద్య అనువాటిచే

తనంత తానుగా గొప్పగా ప్రకాశించుచున్నది. రాజవంశములోని తేజస్సు నకు గొప్ప సంపదలే మూలము. అట్టి క్షత్రియతేజస్సు ఈ బ్రాహ్మతేజ మును ఏనాడైననూ ప్రభావితము చేయకుండు గాక!

బ్రహ్మణ్యదేవః పురుషః పురాతనో
నిత్యం హరిర్యచ్చరణాభివందనాత్ ।
అవాప లక్ష్మీమనపాయినీం యశో
జగత్పవిత్రం చ మహత్తమాగ్రణీః ॥ 38

బ్రహ్మణ్యదేవః - వేదవేత్తలచే ఆరాధించబడువాడు (ఆత్మజ్ఞాను లను ఆరాధించువాడు), పురుషః - పూర్ణుడు, పురాతనః - కాలమునకు అతీతుడు, మహత్-తమ-అగ్రణీః - గొప్పవారిలో అగ్రేసరుడు అగు, హరిః - శ్రీహరి, నిత్యమ్ - నిత్యము, యత్-చరణ-అభివందనాత్ - ఎవరి పాద ములను నమస్కరించుట వలన, అనపాయినీమ్ - తొలగిపోని, లక్ష్మీమ్ - లక్ష్మీదేవిని (సంపదను), చ - మరియు, జగత్-పవిత్రమ్ - జగత్తును పావ నము చేయు, యశః - కీర్తిని, అవాప - పొందెనో.

పూర్ణుడు, కాలమునకు అతీతుడు అగు శ్రీహరి ఆత్మజ్ఞానులచే తాను ఆరాధించబడుటయే గాక, తానే స్వయముగా వారిని పూజించును. ఆయన ఇంద్రాది దేవతలందరికి అధినాయకుడు. అట్టి శ్రీహరి వేదవేత్తల (ఆత్మజ్ఞానుల) పాదములకు నమస్కరించి, ఆ ప్రభావముచే ఎన్నటికీ తొల గిపోని సంపదను లక్ష్మీదేవి రూపములో పొందెను. అంతే గాక, జగత్తును పావనము చేసే కీర్తి కూడ ఆయనకు లభించెను.

యత్సేవయాఽశేషగుహాశయస్స్వరాట్
విప్రప్రియస్తుష్యతి కామమీశ్వరః ।
తదేవ తద్ధర్మపరైర్వినీతైః
సర్వాత్మనా బ్రహ్మకులం నిషేవ్యతామ్ ॥ 39

యత్-సేవయా - ఏ బ్రహ్మవేత్తల సేవచే, అశేషగుహా-ఆశయః - సకలప్రాణుల బుద్ధిగుహయే నివాసముగా గలవాడు, స్వరాట్ -

స్వయంప్రకాశ స్వరూపుడు, విప్రప్రియః - వేదవేత్తలకు ప్రియుడు (వేదవేత్తలు ప్రియమైనవాడు), ఈశ్వరః - జగన్నాథుడు అగు శ్రీహరి, కామమ్ - మిక్కిలి, తుష్యతి - సంతోషించునో, తత్-ధర్మపరైః - భగవానుని ఆరాధనయే నిష్ఠగా గల, వినీతైః - వినయవంతులగువారిచే, తత్ - అట్టి, బ్రహ్మకులం ఏవ - బ్రహ్మవేత్తల సముదాయమే, సర్వ-ఆత్మనా - సర్వము వీరే అనే భావనతో (అన్ని విధములుగా), నిషేవ్యతామ్ - నిష్ఠతో సేవించబడు గాక!

సకలప్రాణుల బుద్ధిగుహలో ఆత్మరూపముగా నివసించే శ్రీహరి బ్రహ్మవేత్తలచే తాను ప్రేమించబడుటయే గాక, తాను స్వయముగా వారిని ప్రేమించును. అట్టి బ్రహ్మవేత్తలను సేవించినచో, స్వయంప్రకాశ స్వరూపుడు, జగన్నాథుడు అగు శ్రీహరి మిక్కిలి సంతోషించును. కావున, భగవానుని ఆరాధనయందు పరాయణులైన భక్తులు వినయముతో బ్రహ్మవేత్తల సముదాయమును, సర్వము వీరే అనే భావనతో, అన్ని విధములుగా నిష్ఠతో సేవించవలెను.

పుమాన్ లభేతానతివేలమాత్మనః
ప్రసీదతోఽత్యంతశమం స్వతస్స్వయమ్ ।
యన్నిత్యసంబంధనిషేవయా తతః
పరం కిమత్రాస్తి ముఖం హవిర్భుజామ్ ॥ 40

యత్-నిత్యసంబంధనిషేవయా - ఏ బ్రహ్మవేత్తలతోడి నిత్యసంపర్కముచే మరియు నిష్ఠతోడి సేవచే, స్వతః - తనంత తానుగా, ప్రసీదతః - ప్రసన్నమయ్యే, ఆత్మనః - చిత్తము వలన, పుమాన్ - మానవుడు, అనతివేలమ్ - శీఘ్రముగా, స్వయమ్ - సాక్షాత్తుగా, అత్యంతశమమ్ - సంసారము పూర్తిగా విరమించుట అనే మోక్షమును, లభేత - పొందునో, తతః - ఆ బ్రహ్మవేత్తల సేవకంటె, పరమ్ - గొప్పది, అత్ర - ఈ లోకమునందు, హవిర్భుజామ్ - హవిర్భాగములను భుజించే దేవతల, ముఖమ్ - ముఖము, కిమ్ - ఏది, అస్తి - కలదు?

బ్రహ్మవేత్తలతోడి నిత్యసంగమును పెట్టుకొని వారిని నిష్ఠతో సేవించే మానవునకు తొందరలోనే అంతఃకరణము శుద్ధమై సాక్షాత్తు ఆత్యంతిక సంసారోపరమము అనే మోక్షము తనంత తానుగా లభించును. కావున, దేవతలకు హవిర్భాగములను సమర్పించుటకు బ్రహ్మవేత్తలే ముఖము. అనగా, వీరిని సేవించినచో, సకలదేవతలను సేవించినట్లే. దేవతలనారాధించే ఉపాయము ఇంతకంటె గొప్పది మరియొకటి లేదు.

అశ్నాత్యనంతః ఖలు తత్త్వకోవిదైః
శ్రద్ధాహుతం యన్ముఖ ఇజ్యనామభిః ।
న వై తథా చేతనయా బహిష్కృతే
హుతాశనే పారమహంస్యపర్యగుః ॥ 41

ఇజ్యనామభిః - పూజించదగిన ఇంద్రాదుల పేర్లతో, యత్-ముఖే - ఏ బ్రహ్మవేత్తల ముఖమునందు, తత్త్వకోవిదైః - తత్త్వమునెరింగినవారిచే, శ్రద్ధాహుతమ్ - శ్రద్ధతో హోమము చేయబడిన హవిస్సును, పారమహంస్యపర్యగుః - పరమహంసల జ్ఞానమునకు అర్థములైన వాక్కులకు గమ్యమైనవాడు, అనంతః - అనంతుడు అగు శ్రీహరి, అశ్నాతి ఖలు - భుజించును గదా!, తథా - ఆ విధముగా, చేతనయా - చేతనచే, బహిష్కృతే - బహిష్కరించబడిన, హుతాశనే - అగ్నియందు, వై - నిశ్చయముగా, న - భుజించదు.

తత్త్వవేత్తలు పూజ్యులైన ఇంద్రాదుల నామములతో బ్రహ్మవేత్తల ముఖమునందు శ్రద్ధతో హవిస్సును హోమము చేయుదురు, అనగా బ్రహ్మవేత్తలకు భోజనాదులను సమర్పించి సేవను చేయుదురు. ఇట్లు హోమము చేయబడిన హవిస్సును అనంతుడగు శ్రీహరి చాల ప్రీతితో భుజించును. అచేతనమగు అగ్నియందు హోమము చేయబడిన హవిస్సును శ్రీహరి అంతటి ప్రీతితో భుజించదు. ఇది నిశ్చయము. పరమహంసల జ్ఞాననిష్ఠకు దారి చూపిన ఉపనిషద్వచనములు పరమతాత్పర్యరూపముగా శ్రీహరి యొక్క జ్ఞానఘన స్వరూపమును మాత్రమే బోధించును.

యద్బ్రహ్మ నిత్యం విరజం సనాతనం
శ్రద్ధాతపోమంగలమౌనసంయమైః ।
సమాధినా బిభ్రతి హార్థదృష్టయే
యత్రేదమాదర్శ ఇవావభాసతే ॥ 42

యత్ - ఏ జ్ఞానులు, విరజమ్ - దోషములు లేనిది, సనాతనమ్ - అనాది అగు, బ్రహ్మ - వేదమును, శ్రద్ధాతపః-మంగలమౌనసంయమైః - శ్రద్ధ తపస్సు నిషిద్ధాచరణమును విడిచిపెట్టుట మౌనము ఇంద్రియనిగ్రహములచే, సమాధినా - చిత్తైకాగ్రతచే, అర్థదృష్టయే - అర్థజ్ఞానము కొరకు, నిత్యమ్ - నిత్యము, బిభ్రతి హ - ధరించుచున్నారో, యత్ర - ఏ వేదమునందు, ఇదమ్ - ఈ శ్రేయస్సాధనమగు ధర్మము, ఆదర్శే ఇవ - అద్దమునందు వలె, అవభాసతే - సుస్పష్టముగా గోచరించునో.

వేదములో పురుషుల రాగద్వేషాది దోషములకు తావు లేదు. అది ఈశ్వరునినుండి ఆవిర్భవించినది గనుక అనాది. దానియందు పురుషార్థములు అద్దములో ముఖము వలె స్పష్టముగా గోచరించును. ఈ వేదవేత్తలు శ్రద్ధతో తపస్సును చేసి, ఇతరమగు వాగ్వ్యాపారమును కట్టిబెట్టి, ఇంద్రియనిగ్రహముతో అట్టి వేదమును వల్లించి, దానిని చిత్తైకాగ్రతతో బుద్ధియందు ధారణ చేసి, నిషిద్ధాచరణమునకు దూరముగా ఉంటూ, దాని అర్థమును తెలియుచున్నారు.

తేషామహం పాదసరోజరేణు-
మార్యా వహేయాధికిరీటమాఽఽయుః ।
యం నిత్యదా బిభ్రత ఆశు పాపం
నశ్యత్యముం సర్వగుణా భజంతి ॥ 43

ఆర్యాః - పూజ్యులారా!, తేషామ్ - వారి, పాదసరోజరేణుమ్ - పాదపద్మముల ధూళి కణమును, అహమ్ - నేను, ఆ ఆయుః - ఆయుర్దాయమున్నంత వరకు, అధికిరీటమ్ - కిరీటమునందు, వహేయ - ధరించెదను, యమ్ - దేనిని, నిత్యదా - సర్వకాలములలో, బిభ్రతః - ధరించువాని

కి, పాపమ్ - పాపము, ఆశు - వెంటనే, నశ్యతి - నశించునో, అముమ్ - వీనిని, సర్వగుణాః - అన్ని గుణములు, భజంతి - సేవించునో.

పూజ్యులారా! నేను జీవించి యున్నంత కాలము వారి పాదపద్మముల ధూళి కణమును కిరీటముపై ధరించెదను. అట్లు నిత్యము ధరించువాని పాపము వెంటనే నశించును. వానిని సకల గుణములు సేవించును.

గుణాయనం శీలధనం కృతజ్ఞం
వృద్ధాశ్రయం సంవృణతేఽనుసంపదః ।
ప్రసీదతాం బ్రహ్మకులం గవాం చ
జనార్దనస్సానుచరశ్చ మహ్యమ్ ॥ 44

గుణ-అయనమ్ - గుణములకు నిధానమైనట్టియు, శీలధనమ్ - సచ్ఛీలమే సంపదగా కలిగినట్టియు, కృతజ్ఞమ్ - చేసిన ఉపకారమును గుర్తులోనుంచుకొనునట్టియు, వృద్ధ-ఆశ్రయమ్ - పెద్దలను సేవించు వాని ని, అను - వరుసగా, సంపదః - సంపదలు, సంవృణతే - చక్కగా వరించును, బ్రహ్మకులమ్ - బ్రహ్మవేత్తల సముదాయము, చ - మరియు, గవామ్ - గోవుల సముదాయము, స-అనుచరః - అనుచరులతో కూడిన, జనార్దనః చ - దుష్టజనశిక్షకుడగు శ్రీహరి కూడ, మహ్యమ్ - నా కొరకు, ప్రసీదతామ్ - ప్రసన్నమగు గాక!

గుణములకు నిలయమై, సచ్ఛీలమే సంపదగా కలిగి, ఇతరులు చేసిన ఉపకారమును గుర్తులో నుంచుకొని, పెద్దలను సేవిస్తూ ఉండే వ్యక్తిని వరుసగా సంపదలు చక్కగా వరించును. నా విషయములో బ్రహ్మవేత్తల సముదాయము, గోవుల సముదాయము, అనుచరుల (భక్తుల) తో కూడిన జనార్దనుడు ప్రసన్నమగు గాక!

మైత్రేయ ఉవాచ ।
ఇతి బ్రువాణం నృపతిం పితృదేవద్విజాతయః ।
తుష్టువుర్హృష్టమనసస్సాధువాదేన సాధవః ॥ 45

ఇతి - ఈ విధముగా, బ్రువాణమ్ - పలుకుచున్న, నృపతిమ్ - మహారాజును, పితృదేవద్విజాతయః - పితృదేవతలు దేవతలు మరియు ఋత్విక్కులు, సాధవః - సాధుపురుషులు, హృష్టమనసః - సంతోషముతో నిండిన మనస్సులు గలవారై, సాధువాదేన - బాగు బాగు అను వచనములచే, తుష్టువుః - స్తుతించిరి.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- ఈ విధముగా పలికిన పృథు మహారాజును, పితృదేవతలు దేవతలు ఋత్విక్కులు మరియు సాధుపురుషులు చాల సంతోషించిన మనస్సులతో బాగు బాగు అని కొనియాడిరి.

పుత్రేణ జయతే లోకానితి సత్యవతీ శ్రుతిః ।
బ్రహ్మదండహతః పాపో యద్వేనోऽత్యతరత్తమః ॥ 46

పుత్రేణ - పుత్రునిచే, లోకాన్ - పుణ్యలోకములను, జయతే - జయించును, ఇతి - అనే, శ్రుతిః - వేదవాక్కు, సత్యవతీ - యథార్థము, యత్ - ఏలయనగా, బ్రహ్మదండహతః - బ్రహ్మవేత్తల శాపముచే సంహరించబడిన, పాపః - పాపియగు, వేనః - వేనుడు, తమః - నరకమును, అత్యతరత్ - తరించెనో.

సత్పుత్రుని కన్న తండ్రి పుణ్యలోకములను పొందునని వేదము చెప్పే వచనము యథార్థము. ఏలయనగా, పాపియగు వేనుడు బ్రహ్మవేత్తల శాపముచే సంహరించబడిననూ, ఈ పృథువుయొక్క పుణ్యబలముచే నరకమును దాటివేసినాడు.

హిరణ్యకశిపుశ్చాపి భగవన్నిందయా తమః ।
వివిక్షురత్యగాత్సూనోః ప్రహ్లాదస్యానుభావతః ॥ 47

అపి - ఇంతేగాక, హిరణ్యకశిపుః చ - హిరణ్యకశిపుడు కూడ, భగవత్-నిందయా - భగవానుని నిందించుటచే, తమః - నరకమును, వివిక్షుః - ప్రవేశించెదననే ఆశంక గలవాడై, సూనోః - పుత్రుడగు, ప్రహ్లాదస్య - ప్రహ్లాదుని, అనుభావతః - ప్రభావము వలన, అత్యగాత్ - తరించెను.

హిరణ్యకశిపుడు కూడ భగవానుని నిందించుటచే నరకమును పొందుననే ఆశంక ఉండెను కాని, పుత్రుడగు ప్రహ్లాదుని భక్తియొక్క మహిమచే ఆతడు నరకమును దా. వేసెను.

వీరవర్య పితః పృథ్వ్యాస్సమాస్సంజీవ శాశ్వతీః ।
యస్యేదృశ్యచ్యుతే భక్తిస్సర్వలోకైకభర్తరి ॥ 48

వీరవర్య - వీరులలో శ్రేష్ఠుడైనవాడా!, పృథ్వ్యాః - భూమికి, పితః - తండ్రీ!, శాశ్వతీః - అనంతములగు, సమాః - సంవత్సరములను, సంజీవ - చక్కగా జీవించుము, యస్య - ఏ నీకు, సర్వలోక-ఏకభర్తరి - అన్ని లోకములకు ఏకైక ప్రభుడగు, అచ్యుతే - శ్రీహరియందు, ఈదృశీ - ఇట్టి, భక్తిః - భక్తియో.

వీరులలో శ్రేష్ఠుడవగు ఓ పృథూ! భూదేవికి నీవు తండ్రివి. నీవు శాశ్వత కాలము చక్కగా జీవించుము. ఏలయన, సకలలోకములకు ఏకైక ప్రభుడు, అవినాశి అగు శ్రీహరియందు నీకు ఇట్టి భక్తి గలదు.

అహో వయం హ్యద్య పవిత్రకీర్తే
త్వయైవ నాథేన ముకుందనాథాః ।
య ఉత్తమశ్లోకతమస్య విష్ణోః
బ్రహ్మణ్యదేవస్య కథాం వ్యనక్తి ॥ 49

అహో - ఏమి భాగ్యము!, పవిత్రకీర్తే - పావనమగు కీర్తి గలవాడా!, అద్య - ఈనాడు, నాథేన - నాథుడవగు, త్వయా ఏవ - నీ చేతనే, వయమ్ - మేము, ముకుందనాథాః - శ్రీహరి నాథుడుగా గలవారము, యః - ఏ నీవు, ఉత్తమశ్లోకతమస్య - పవిత్రమగు కీర్తి గలవారిలో శ్రేష్ఠుడైనట్టియు, బ్రహ్మణ్యదేవస్య - వేదవేత్తల దైవమైన, విష్ణోః - శ్రీహరియొక్క, కథామ్ - గాథను, వ్యనక్తి - ప్రచారము చేయుచున్నావో.

ఏమి భాగ్యము! పవిత్రమగు కీర్తి గల ఓ రాజా! ఈనాడు నీవు మాకు నాథుడవగుటచేతనే, మేము మోక్షదాతయగు శ్రీహరి నాథుడుగా గలవారమైతిమి. ఏలయనగా, శ్రీహరియొక్క పవిత్రమైన గాథను నీవు

ప్రచారము చేయుచున్నావు. పావనమగు కీర్తి గలవారిలో శ్రీహరి అగ్రేసరుడు. ఆయనను వేదవేత్తలు తమ దైవముగా కొలిచెదరు.

నాత్యద్భుతమిదం నాథ తవాఽఽజీవ్యానుశాసనమ్ ।
ప్రజానురాగో మహతాం ప్రకృతిః కరుణాత్మనామ్ ॥ 50

నాథ - ఓ ప్రభూ!, తవ - నీయొక్క, ఇదమ్ - ఈ, ఆజీవి-ఆ-అనుశాసనమ్ - ఆశ్రితులను సమగ్రముగా ఆదేశించుట, అతి-అద్భుతమ్ - గొప్ప ఆశ్చర్యము, న - కాదు, కరుణా-ఆత్మనామ్ - దయాహృదయులగు, మహతామ్ - గొప్పవారికి, ప్రజా-అనురాగః - ప్రజలయందు అనురాగము, ప్రకృతిః - సహజసిద్ధము.

ఓ ప్రభూ! నీవీ విధముగా నీ ఆశ్రితులను సమగ్రముగా ఆదేశించుట గొప్ప ఆశ్చర్యము కానేరదు. ఏలయన, దయాహృదయులగు గొప్పవారికి ప్రజలయందు అనురాగము సహజసిద్ధముగా నుండును.

అద్య నస్తమసః పారస్త్వయోపాసాదితః ప్రభో ।
భ్రామ్యతాం నష్టదృష్టీనాం కర్మభిర్దైవసంజ్ఞితైః ॥ 51

ప్రభో - ఓ ప్రభూ!, అద్య - ఈనాడు, త్వయా - నీచే, నష్టదృష్టీనామ్ - నశించిన వివేకము కలిగినట్టియు, దైవసంజ్ఞితైః - ప్రారబ్ధము అనే పేరు గల, కర్మభిః - కర్మలచే, భ్రామ్యతామ్ - తిరుగాడుచున్న, నః - మాకు, తమసః - అజ్ఞానముయొక్క, పారః - ఆవలి తీరము, ఉపాసాదితః - పొందించబడినది.

ఓ ప్రభూ! మేము వివేకదృష్టి లోపించినవారమై, దైవము అని పిలువబడే ప్రారబ్ధకర్మల ప్రభావముచే సంసారములో తిరుగాడుచుంటిమి. నీవీ నాడు మమ్ములను అజ్ఞానసముద్రపు ఆవలి తీరమును చేర్చితివి.

నమో వివృద్ధసత్త్వాయ పురుషాయ మహీయసే ।
యో బ్రహ్మ క్షత్రమావిశ్య బిభర్తీదం స్వతేజసా ॥ 52

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే చతుర్థస్కంధే పృథూపాఖ్యానే
పృథూపదేశ వర్ణనం నామ ఏకవింశోఽధ్యాయః ||

వివృద్ధసత్త్వాయ - విశేషముగా వర్ధిల్లిన సత్త్వగుణము కలిగినట్టి యు, మహీయసే - సర్వోత్కృష్టుడగు, పురుషాయ - పురుషుని కొరకు, నమః - నమస్కారము, యః - ఎవ్వాడు, బ్రహ్మ - బ్రాహ్మణులను, క్షత్రమ్ - క్షత్రియులను, స్వతేజసా - తన తేజస్సుచే, ఆవిశ్య - ఆవేశించి, ఇదమ్ - ఈ జగత్తును, బిభర్తి - నిలబెట్టుచున్నాడో.

పురుషోత్తముడు, విశేషముగా వర్ధిల్లిన సత్త్వగుణమే ఉపాధిగా గలవాడు అగు శ్రీహరికి నమస్కారము. ఆయనయే బ్రాహ్మణ క్షత్రియుల యందు తన తేజస్సును నింపి తద్ద్వారా పరస్పరమును మరియు జగత్తును నిలబెట్టుచున్నాడు.

శ్రీమద్భాగవత మహాపురాణములోని నాల్గవ స్కంధమునందు
పృథూపాఖ్యానములో పృథువు సభాసదులకు చేసిన
ఉపదేశమును వర్ణించే ఇరువది ఒకటవ
అధ్యాయము ముగిసినది (21).

*****

# అథ ద్వావింశోఽధ్యాయః

## పృథూపాఖ్యానము - పృథు సనత్కుమార సంవాదము

మైత్రేయ ఉవాచ ।
జనేషు ప్రగృణత్స్వేవం పృథుం పృథులవిక్రమమ్ ।
తత్రోపజగ్ముర్మునయశ్చత్వారస్సూర్యవర్చసః ॥ 1

మైత్రేయః - మైత్రేయ మహర్షి, ఉవాచ - పలికెను, జనేషు - జనులు, పృథులవిక్రమమ్ - గొప్ప పరాక్రమము గల, పృథుమ్ - పృథువును, ఏవమ్ - ఈ విధముగా, ప్రగృణత్సు - స్తుతించుచుండగా, సూర్యవర్చసః - సూర్యుని కాంతి వంటి కాంతి గల, చత్వారః - నలుగురు, మునయః - మహర్షులు, తత్ర - అచటకు, ఉపజగ్ముః - విచ్చేసిరి.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- జనులు గొప్ప పరాక్రమము గల పృథువును ఈ విధముగా స్తుతించుచుండగా, సూర్యుని వలె వెలిగిపోతున్న నలుగురు మహర్షులు అచటకు విచ్చేసిరి.

తాంస్తు సిద్ధేశ్వరాన్ రాజా వ్యోమ్నోఽవతరతోఽర్చిషా ।
లోకానపాపాన్ కుర్వత్యా సానుగోఽచష్ట లక్షితాన్ ॥ 2

లోకాన్ - జనులను, అపాపాన్ - పాపము లేనివారినిగా, కుర్వత్యా - చేయుచున్న, అర్చిషా - ప్రకాశముచే, లక్షితాన్ - గుర్తించబడినట్టియు, వ్యోమ్నః - ఆకాశమునుండి, అవతరతః - దిగుచున్న, సిద్ధ-ఈశ్వరాన్ - మునీశ్వరులను, స-అనుగః - అనుచరులతో కూడియున్న, రాజా - పృథు మహారాజు, అచష్ట - చూచెను.

ఆ మునీశ్వరులను పృథు మహారాజు వారి కాంతిని బట్టియే గుర్తించెను. వారు తమ కాంతిచే లోకులను పాపనిర్ముక్తులను చేయుచూ ఆకాశమునుండి దిగుచుండగా, ఆ మహారాజు మరియు ఆయన అనుచరులు వారిని చూచిరి.

తద్దర్శనోద్గతాన్ ప్రాణాన్ ప్రత్యాదిత్సురివోత్థితః ।
ససదస్యానుగో వైన్య ఇంద్రియేశో గుణానివ ।। 3

తత్-దర్శన-ఉద్గతాన్ - వారి దర్శనముచే పైకి పోయిన, ప్రాణాన్ - ప్రాణములను, ఇంద్రియ-ఈశః - ఇంద్రియములకు ప్రభువగు మనస్సు, గుణాన్ ఇవ - శబ్దాదులను వలె, ప్రతి-ఆదిత్సుః ఇవ - తిరిగి వెనుకకు తెచ్చుకొన గోరిక కలవాడు వలె, వైన్యః - వేనపుత్రుడగు పృథువు, ససదస్య-అనుగః - సభాసదులతో మరియు అనుచరులతో కూడినవాడై, ఉత్థితః - లేచి నిలబడెను.

వారిని చూచిన తోడనే పైకి పోయిన ప్రాణములను, ఇంద్రియములకు ప్రభువగు మనస్సు శబ్దాది విషయములను వలె, తిరిగి లోపలికి తెచ్చుకొనే కోరిక గలవాడా యన్నట్లు, వేనపుత్రుడగు పృథువు లేచి నిలబడెను. ఆయనను అనుసరించి సభాసదులు, ఆయన అనుచరులు కూడ లేచి నిలబడిరి.

గౌరవాద్యంత్రితస్సభ్యః ప్రశ్రయానతకంధరః ।
విధివత్పూజయాంచక్రే గృహీతాధ్యర్హణాసనాన్ ।। 4

గౌరవాత్ - మర్యాద వలన, యంత్రితః - వశమైనవాడు, సభ్యః - సత్పురుషుడు, ప్రశ్రయ-ఆనతకంధరః - వినయముచే వంగిన మెడ గలవాడు అగు పృథువు, గృహీత-అధి-అర్హణ-ఆసనాన్ - స్వీకరించబడిన అర్ఘ్యము ఆసనము గల ఆ మునీశ్వరులను, విధివత్ - యథావిధిగా, పూజయాంచక్రే - పూజించెను.

వారియందలి గౌరవముచే సత్పురుషుడగు పృథువు వారికి వశుడై పోయెను. ఆయన వినయముతో వంగిన మెడ గలవాడై, వారికి

అర్ఘ్యమును ఆసనమును సమర్పించెను. వారు వాటిని స్వీకరించి ఉపవిష్టు లైన పిదప ఆయన వారిని యథావిధిగా పూజించెను.

**తత్పాదశౌచసలిలైర్మార్జితాలకబంధనః ।**
**తత్ర శీలవతాం వృత్తమాచరన్మానయన్నివ ।। 5**

తత్-పాదశౌచసలిలైః - వారి పాదములను కడిగిన నీటితో, మార్జి త-అలకబంధనః - తడుపబడిన జుట్టుముడి గల పృథువు, తత్ర - ఆ సభ యందు, శీలవతామ్ - సచ్ఛీలము గలవారి, వృత్తమ్ - నడవడిని, మాన యన్ ఇవ - ఆదరించుచున్నవాడై, ఆ-అచరత్ - పూర్తిగా ఆచరించెను.

ఆయన వారి పాదములను కడిగి ఆ జలమును తన తలపై చల్లు కొనెను. ఆ నీటితో ఆయన జుట్టు ముడి తడిసెను. ఈ విధముగా సచ్ఛీ లము గలవారి నడవడిని ఆయన ఆ సభలో సమగ్రముగా ఆచరించెను.

హాటకాసన ఆసీనాన్ స్వధిష్ణ్యేష్వివ పావకాన్ ।
శ్రద్ధాసంయమసంయుక్తః ప్రీతః ప్రాహ భవాగ్రజాన్ ।। 6

హాటక-ఆసనే - బంగరు ఆసనమునందు, స్వధిష్ణ్యేషు - తమ వేదులయందలి, పావకాన్ ఇవ - అగ్నులవలె, ఆసీనాన్ - కూర్చున్న, భవ -అగ్రజాన్ - రుద్రునకు అన్నలగు ఆ మహర్షులను, శ్రద్ధాసంయమసం యుక్తః - శ్రద్ధతో మరియు చిత్తైకాగ్రతతో కూడియున్న పృథువు, ప్రీతః - సంతసించినవాడై, ప్రాహ - పలికెను.

సనకాది మహర్షులు రుద్రునకు కూడ అన్నలు. వారు బంగరు ఆసనములయందు, వేదులయందు అగ్నులవలె, కూర్చుండిరి. వారి యెడల శ్రద్ధ మరియు చిత్త సమాధానము కలిగియున్న పృథువు వారి రాకచే సంతసిల్లి, వారితో నిట్లనెను.

పృథురువాచ ।
**అహో ఆచరితం కిం మే మంగలం మంగలాయనాః ।**
యస్య వో దర్శనం హ్యాసీద్దుర్దర్శానాం చ యోగిభిః ।। 7

అహో - ఏమి భాగ్యము!, మంగల-అయనాః - మంగళకరమగు రాక గల ఓ మహర్షులారా!, మే - నాచే, కిమ్ - ఏమి, మంగలమ్ - పుణ్యము, ఆచరితం హి - చేయబడినదో గదా!, యస్య - ఏ నాకు, యోగిభిః చ - యోగులచేనైనమూ, దుర్దర్శానామ్ - దర్శించ శక్యము కాని, వః - మీయొక్క, దర్శనమ్ - దర్శనము, ఆసీత్ - కలిగెనో.

పృథు మహారాజు ఇట్లు పలికెను --- ఏమి భాగ్యము! ఓ మహర్షులారా! మీ రాక మంగళకరమైనది. నేను ఏమి పుణ్యమును చేసితినో! యోగులకైనను దుర్లభమగు మీ దర్శనము నాకు కలిగినది.

కిం తస్య దుర్లభతరమిహ లోకే పరత్ర చ ।
యస్య విప్రాః ప్రసీదంతి శివో విష్ణుశ్చ సానుగః ॥ 8

తస్య - వానికి, ఇహ - ఈ, లోకే - లోకమునందు, పరత్ర చ - పరలోకమునందు కూడ, కిమ్ - ఏది, దుర్లభతరమ్ - మిక్కిలి లభించ శక్యము కానిది?, యస్య - ఎవనికైతే, విప్రాః - వేదవేత్తలు, స-అనుగః - అనుయాయులతో కూడిన, శివః - శివుడు, విష్ణుః చ - శ్రీహరి, ప్రసీదంతి - ప్రసన్నులగుదురో.

ఎవనికైతే వేదవేత్తలు మరియు అనుచరులతో కూడిన శివవిష్ణువులు ప్రసన్నులగుదురో, వానికి ఇహ పరలోకములలో మిక్కిలి లభించ శక్యము కానిది ఏమి ఉండును?

నైవ లక్షయతే లోకో లోకాన్ పర్యటతోఽపి యాన్ ।
యథా సర్వదృశం సర్వ ఆత్మానం యేఽస్య హేతవః ॥ 9

సర్వదృశమ్ - సర్వసాక్షియగు, ఆత్మానమ్ - ఆత్మను, సర్వే యథా - అందరు జనులు వలె, అస్య - ఈ దృశ్యజగత్తునకు, హేతవః - కారణములగు మహత్తత్త్వము మొదలైనవి, యే యథా - ఏవి గలవో వాటివి వలె, లోకః - లోకము, లోకాన్ - లోకములను, పర్యటతః అపి - పర్యటించువారే అయినమూ, యాన్ - ఏ మిమ్ములను, న ఏవ లక్షయతే - కొంచెమైనమూ గుర్తించుట లేదో.

సర్వసాక్షియగు ఆత్మస్వరూపమును మానవులు గుర్తించ లేకున్నారు. దృశ్యమగు ఈ జగత్తునకు కారణమగు మహత్తత్త్వము మొదలగు తత్త్వములను జనులు గుర్తించ లేకున్నారు. అదే విధముగా, మీరు లోకములను పర్యటించుచున్ననూ, సామాన్య జనులు మిమ్ములను గుర్తు పట్ట లేరు.

అధనా అపి తే ధన్యాస్సాధవో గృహమేధినః ।
యద్గృహా హ్యర్హవర్యాంబుతృణభూమీశ్వరావరాః ।। 10

సాధవః - సాధుపురుషులగు, తే - ఆ, గృహమేధినః - గృహస్థులు, అధనాః అపి - నిర్ధనులే అయిననూ, ధన్యాః - ధన్యులు, యత్-గృహాః - ఎవరి గృహములు, అర్హవర్య-అంబుతృణభూమి-ఈశ్వర-అవరాః - మహాత్ములకు స్వీకరించదగిన నీరు గడ్డి స్థానము గృహయజమాని మరియు సేవకులు గలవియో.

ఏ గృహస్థుల గృహములకు మహాత్ములు విచ్చేసి, వారి ఇంట్లో కూర్చుండి, వారిచ్చిన నీటిని త్రాగెదరో, ఏ గృహస్థులు మరియు వారి సేవకులు కూడ మహాత్ములకు సేవ చేసెదరో, అట్టి సాధుపురుషులగు గృహస్థులు నిర్ధనులే అయిననూ, ధన్యులు అగుదురు.

వ్యాలాలయద్రుమా వై తేఽప్యరిక్తాఖిలసంపదః ।
యద్గృహాస్తీర్థపాదీయపాదతీర్థవివర్జితాః ।। 11

యత్-గృహాః - ఎవరి ఇళ్లు, తీర్థపాదీయపాదతీర్థవివర్జితాః - పాదములయందు గంగ గల శ్రీహరియొక్క భక్తుల పాదములను కడిగిన పవిత్ర జలములు లేనివియో, తే - ఆ గృహములు, వై - నిశ్చయముగా, అరిక్త-అఖిలసంపదః అపి - పూర్ణమగు సకలసంపదలు గలవియే అయిననూ, వ్యాల-ఆలయద్రుమాః - పాములకు నెలవైన చెట్లు.

శ్రీహరి పాదములనుండి గంగ పుట్టినది. అట్టి శ్రీహరియొక్క భక్తుల పాదములను కడిగి ఏ గృహములలో సత్కరించరో, అట్టి గృహ

ములు, సకలసంపదలు పూర్ణముగా కలిగియున్ననూ, పాములకు నెలవైన చెట్ల వంటివి.

స్వాగతం వో ద్విజశ్రేష్ఠా యద్వ్రతాని ముముక్షవః ।
చరంతి శ్రద్ధయా ధీరా బాలా ఏవ బృహంతి చ ॥ 12

ద్విజశ్రేష్ఠాః - ఓ మహర్షులారా!, వః - మీకు, స్వాగతమ్ - స్వాగతము, యత్ - ఏలయన, ధీరాః - ధీరులగు మీరు, బాలాః ఏవ - బాలురుగనుండగనే, ముముక్షవః - మోక్షమును కోరువారై, శ్రద్ధయా - శ్రద్ధతో, బృహంతి - గొప్ప, వ్రతాని - వ్రతములను, చరంతి - ఆచరించుచున్నారు.

ఓ మహర్షులారా! మీకు స్వాగతము. వివేకవంతులగు మీరు బాల్యములోనే మోక్షకాములై శ్రద్ధతో గొప్ప వ్రతములనాచేరించుచున్నారు.

కచ్చిన్నః కుశలం నాథా ఇంద్రియార్థార్థవేదినామ్ ।
వ్యసనావాప ఏతస్మిన్ పతితానాం స్వకర్మభిః ॥ 13

నాథాః - ఓ ప్రభువులారా!, ఇంద్రియ-అర్థ-అర్థవేదినామ్ - ఇంద్రియములకు విషయములగు శబ్దాదులే పురుషార్థములని భావించునట్టియు, వ్యసన-ఆవాపే - దుఃఖములకు పాదు అయిన, ఏతస్మిన్ - ఈ సంసారమునందు, స్వకర్మభిః - తమ కర్మలచే, పతితానామ్ - పడియున్న, నః - మాకు, కుశలమ్ - క్షేమము, కచ్చిత్ - ఉన్నదా?

ఓ ప్రభువులారా! ఇంద్రియములకు విషయములగు శబ్దాదులే (భోగ్యములే) పురుషార్థములని భావించి మేము మా కర్మల చేతనే సంసారములో బద్ధులమై పడి యున్నాము. ఈ సంసారము దుఃఖములకు క్షేత్రము. అట్టి మాకు క్షేమము గలదా?

భవత్సు కుశలప్రశ్న ఆత్మారామేషు నేష్యతే ।
కుశలాకుశలా యత్ర న సంతి మతివృత్తయః ॥ 14

ఆత్మ-ఆరామేషు - ఆత్మానందమునమభవించే, భవత్సు - మీ విషయములో, కుశలప్రశ్నః - కుశలప్రశ్న, న ఇష్యతే - యుక్తము కాదు,

యత్ర - ఏ మీయందు, కుశల-అకుశలాః - కుశలము మరియు కుశలము కాదు అనే, మతివృత్తయః - మనోవృత్తులు, న సంతి - ఉండవో.

ఆత్మనిష్ఠులై ఆత్మానందమునను భవించే మిమ్ములను కుశలముగా నున్నారా యని ప్రశ్నించుట యుక్తియుక్తము కాదు. మీ మనస్సులలో ఇది కుశలము, ఇది కుశలము కాదు అనే ఆలోచనలకే తావు లేదు.

తదహం కృతవిశ్రంభస్సుహృదో వస్తపస్వినామ్ ।
సంపృచ్ఛే భవ ఏతస్మిన్ క్షేమః కేనాంజసా భవేత్ ॥ 15

తపస్వినామ్ - శోకతాపమును పొందియున్నవారికి, సుహృదః - హితమును చేయు, వః - మిమ్ములను, తత్ - అందువలననే, కృతవిశ్రంభః - చేయబడిన విశ్వాసము గల, అహమ్ - నేను, సంపృచ్ఛే - ప్రశ్నించుచున్నాను, ఏతస్మిన్ - ఈ, భవే - సంసారమునందు, కేన - దేనిచే, క్షేమః - క్షేమము, అంజసా - తేలికగా, భవేత్ - కలుగును?

శోకతాపమును పొందియున్నవారికి మీరు హితమును చేయుదురు. కావున, మీయందు విశ్వాసము ఏర్పడియున్న నేను మిమ్ములను ఒక ప్రశ్నను వేసెదను. ఈ సంసారములో మానవునకు తేలికగా క్షేమము కలిగే ఉపాయమేది?

వ్యక్తమాత్మవతామాత్మా భగవానాత్మభావనః ।
స్వానామనుగ్రహాయేమాం సిద్ధరూపీ చరత్యజః ॥ 16

ఆత్మవతామ్ - ధైర్యము (వివేకము, గలవారలకు, ఆత్మా - ఆత్మ, ఆత్మభావనః - తన స్వరూపమును ప్రకాశింప జేయువాడు, అజః - పుట్టుక లేనివాడు అగు, భగవాన్ - శ్రీహరి భగవానుడు, స్వానామ్ - తన భక్తుల, అనుగ్రహాయ - అనుగ్రహము కొరకు, సిద్ధరూపీ - సిద్ధుల రూపము గలవాడై, చరతి - సంచరించుచున్నాడు, వ్యక్తమ్ - నిశ్చితము.

పుట్టుక లేని శ్రీహరి భగవానుడు సకలప్రాణులలో ఆత్మరూపుడై యున్ననూ, ఆత్మానాత్మవివేకము గల ధీరులకు మాత్రమే ఆ రూపముగా

ప్రకాశించుచున్నాడు. అట్టి శ్రీహరి తన భక్తుల ననుగ్రహించుటకై మీవంటి సిద్ధపురుషుల రూపములో సంచరించుచున్నాడు. ఇది నిశ్చయము.

మైత్రేయ ఉవాచ ।
పృథోస్తత్సూక్తమాకర్ణ్య సారం సుష్ఠు మితం మధు ।
స్మయమాన ఇవ ప్రీత్యా కుమారః ప్రత్యువాచ హ ॥ 17

పృథోః - పృథువుయొక్క, తత్ - ఆ, సారమ్ - సారమైనట్టియు, సుష్ఠు - బాగుగానున్నట్టియు, మితమ్ - మితముగా నున్నట్టియు, మధు - మధురమైన, సు-ఉక్తమ్ - మంచి మాటను, ఆకర్ణ్య - విని, కుమారః - సనత్కుమారుడు, ప్రీత్యా - ప్రేమతో, స్మయమానః ఇవ - చిరునవ్వు నవ్వుచున్నవాడు వలె, ప్రతి-ఉవాచ హ - బదులు చెప్పెనట.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- పృథువు సారవంతములైన గంభీరమగు మధురవాక్యములను మితముగా చక్కగా చెప్పెను. ఆ మాటలను విని సనత్కుమారుడు ప్రేమతో చిరునవ్వు నవ్వుచున్నాడా యన్నట్లు ఈ విధముగా బదులు చెప్పెను.

సనత్కుమార ఉవాచ ।
సాధు పృష్టం మహారాజ సర్వభూతహితాత్మనా ।
భవతా విదుషా చాపి సాధూనాం మతిరీదృశీ ॥ 18

మహారాజ - ఓ మహారాజా!, విదుషా చ అపి - స్వయముగా విద్వాంసుడవైననూ, సర్వభూతహిత-ఆత్మనా - సకలప్రాణుల హితము బుద్ధియందు కలిగిన, భవతా - నీచే, సాధు - చక్కగా, పృష్టమ్ - ప్రశ్నించబడినది, సాధూనామ్ - సాధుపురుషుల, మతిః - బుద్ధి, ఈదృశీ - ఇట్టిది.

సనత్కుమారుడు ఇట్లు పలికెను --- ఓ మహారాజా! నీవు స్వయముగా విద్వాంసుడవు. అయిననూ, సకలప్రాణుల హితమును గోరి నీవు చక్కగా ప్రశ్నించితివి. సాధు పురుషులు ఆలోచించే తీరు ఇటులనే యుండును.

సంగమః ఖలు సాధూనాముభయేషాం చ సంమతః ।
యత్సంభాషణసంప్రశ్నస్సర్వేషాం వితనోతి శమ్ ॥ 19

సాధూనామ్ - సాధు పురుషుల, సంగమః - సమాగమము, ఉభయేషాం చ - ఇద్దరికీ కూడ, సంమతః ఖలు - అభిమతమే గదా!, యత్-సంభాషణసంప్రశ్నః - ఎవరితోడి సంభాషణము మరియు యోగ్యమగు ప్రశ్నను వేయుట, సర్వేషామ్ - అందరికీ, శమ్ - సుఖమును, వితనోతి - విస్తరింప జేయునో.

సాధు పురుషులతోడి సమాగమము శ్రోత మరియు వక్త అనే ఇద్దరికీ కూడ అభిమతమే యగును. ఏలయనగా, మహాత్ములను కలిసి వారిని యోగ్యమగు రీతిలో ప్రశ్నించుట వలన అందరికీ సుఖము విస్తరిల్లును.

అస్త్యేవ రాజన్ భవతో మధుద్విషః
పాదారవిందస్య గుణానువాదనే ।
రతిర్దురాపా విధునోతి నైష్ఠికీ
కామం కషాయం మలమంతరాత్మనః ॥ 20

రాజన్ - ఓ రాజా!, భవతః - నీకు, మధుద్విషః - మధువైరియగు శ్రీహరియొక్క, పాద-అరవిందస్య - పాదపద్మముయొక్క, గుణ-అనువాదనే - గుణముల వర్ణనయందు, దురాపా - పొంద శక్యము కాని, నైష్ఠికీ - నిశ్చలమగు, రతిః - ప్రీతి, అస్తి ఏవ - నిశ్చయముగా నున్నది, అంతరాత్మనః - అంతఃకరణముయొక్క, కామమ్ - కోరికను, కషాయమ్ - వాసనను, మలమ్ - దోషమును, విధునోతి - పూర్తిగా తుడిచివేయును.

ఓ రాజా! నీకు మధుసూదనుని పాదపద్మముల గుణములయొక్క వర్ణనయందు నిశ్చలమగు ప్రీతి నిశ్చయముగా గలదు. ఇట్టి ప్రీతిని కలిగి యుండుట దుష్కరము. ఈ ప్రీతి వ్యక్తియొక్క కామనలను, రాగద్వేషాది వాసనలను పోగొట్టి అంతఃకరణమును పరిశుద్ధము చేయును.

శాస్త్రేష్వియానేవ సునిశ్చితో నృణాం
క్షేమస్య సధ్య్రగ్విమృశేషు హేతుః ।

అసంగ ఆత్మవ్యతిరిక్త ఆత్మని
దృఢా రతిర్బ్రహ్మణి నిర్గుణే చ యా ॥ 21

సధ్ర్యక్ - బాగుగా, విమృశేషు - విచారము చేయబడిన, శాస్త్రేషు - శాస్త్రములయందు, నృణామ్ - మానవుల, క్షేమస్య - క్షేమమునకు, హేతుః - సాధనము, ఇయాన్ ఏవ - ఇంతమాత్రమే, సునిశ్చితః - బాగుగా నిశ్చయించబడినది, ఆత్మవ్యతిరిక్తే - అనాత్మయగు ప్రపంచమునందు, అసంగః - అసంగము, చ - మరియు, ఆత్మని - ఆత్మరూపముగు, నిర్గుణే - నిర్గుణమైన, బ్రహ్మణి - పరబ్రహ్మయందు, దృఢా - దృఢముగు, యా - ఏ, రతిః - నిష్ఠ గలదో అది.

అనాత్మయగు ఈ ప్రపంచమునందు వైరాగ్యమును కలిగి, నిర్గుణ పరబ్రహ్మయందు ఆత్మరూపముగా దృఢమగు నిష్ఠను కలిగియుండుట మాత్రమే మానవుల క్షేమమునకు ఏకైక సాధనము. ఇది శాస్త్రము (వేదము) లను బాగుగా విచారించి తేల్చి చెప్పిన సంగతి.

సా శ్రద్ధయా భగవద్ధర్మచర్యయా
జిజ్ఞాసయాఽఽధ్యాత్మికయోగనిష్ఠయా ।
యోగేశ్వరోపాసనయా చ నిత్యం
పుణ్యశ్రవఃకథయా పుణ్యయా చ ॥ 22

సా - అట్టి దృఢమగు ఆత్మనిష్ఠ, శ్రద్ధయా - శ్రద్ధతో, నిత్యమ్ - నిత్యము, భగవత్-ధర్మచర్యయా - భగవంతునకు ప్రీతిని కలిగించే ధర్మములను చేయుటచే, జిజ్ఞాసయా - ఆత్మజ్ఞానమును పొందాలనే ఆకాంక్షచే, ఆధ్యాత్మికయోగనిష్ఠయా - అధ్యాత్మయోగమునందలి నిష్ఠచే, చ - మరియు, యోగ-ఈశ్వర-ఉపాసనయా - యోగులకు ప్రభువగు శ్రీహరి యొక్క ఉపాసనచే, పుణ్యయా - పవిత్రమగు, పుణ్యశ్రవఃకథయా - పవిత్రమగు కీర్తి గల శ్రీహరియొక్క గాథచే.

సాధకుడు నిత్యము శ్రద్ధతో భగవానునకు ప్రీతిని కలిగించే ధర్మములనాచరించవలెను. ఆత్మజ్ఞానమువందాకాంక్ష గలవాడై సర్వకాలములలో ఆత్మనిష్ఠను అభ్యసించవలెను. మరియు, యోగులకు ప్రభువగు

శ్రీహరిని నిత్యము ఉపాసించవలెను. శ్రీహరియొక్క కీర్తి జనులను పావనము చేయును. కావున, సాధకుడు అట్టి శ్రీహరియొక్క గాథలను నిత్యము వినవలెను. ఇట్లు చేయుచున్నచో, సాధకునకు ప్రత్యగభిన్నబ్రహ్మనిష్ఠ కుదురును.

అర్థేంద్రియారామసగోష్ఠ్యతృష్ణయా తత్సంమతానామపరిగ్రహేణ।
వివిక్తరుచ్యా పరితోష ఆత్మన్వినా హరేర్గుణపీయూషపానాత్॥23

అర్థ-ఇంద్రియ-ఆరామసగోష్ఠి-అతృష్ణయా - ధనమునందు ఇంద్రియములయందు రమించే వారితోడి సంగమునందు తృష్ణ లేకుండుటచే, తత్-సమ్మతానామ్ - వారికి అభీష్టములైనవాటియొక్క, అపరిగ్రహేణ - స్వీకరించకుండుటచే, హరేః - శ్రీహరియొక్క, గుణపీయూషపానాత్ వినా - గుణములు అనే అమృతముయొక్క పానమును మినహాయించి, ఆత్మన్ - తనయందే, పరితోషే - సంతోషము కలుగగా, వివిక్తరుచ్యా - ఏకాంతమునందు ప్రీతిచే.

సంసారమునందలి జనులు ధనమునందు, ఇంద్రియభోగమునందు ఆసక్తి గలవారై ధనము వెనుక, భోగ్యవస్తువుల వెనుక పరుగులెత్తుదురు. సాధకుడు వారితోడి సంగమునందు తృష్ణను కలిగియుండరాదు. వారికి అభీష్టమైన ధనభోగాదులకు దూరముగా నుండవలెను. సాధకుడు శ్రీహరియొక్క గుణానువాదము అనే అమృతపానము వలన తృప్తిని చెందవలెను. లేదా, ఏకాంతమునందు ప్రీతి గలవాడై ఆత్మస్వరూపమునందే సంతోషమును పొందవలెను. ఇట్లు చేయు సాధకునకు దృఢమగు ఆత్మనిష్ఠ కుదురును.

అహింసయా పారమహంస్యచర్యయా
స్మృత్యా ముకుందాచరితాగ్ర్యసీధునా ।
యమైరకామైర్నియమైశ్చాప్యనిందయా
నిరీహయా ద్వంద్వతితిక్షయా చ ॥ 24

అహింసయా - అహింసచే, పారమహంస్యచర్యయా - పరమహంసధర్మములగు శమదమాదులనాచరించుటచే, స్మృత్యా - తన లక్ష్య

మును గుర్తులో నుంచుకొనుటచే, ముకుంద-అచరిత-అగ్ర్యసీధునా - ముకుందుని లీలలనే శ్రేష్ఠమగు అమృతముచే, అకామైః - కామన లేని, యమైః - యమములచే, నియమైః - నియమములచే, అనిందయా - నిందించకుండుటచే, నిరీహయా - స్వార్థము కొరకు ప్రయత్నించకుండుట చే, చ - మరియు, ద్వంద్వతితిక్షయా చ - శీతోష్ణాది ద్వంద్వములను సహించుటచే కూడ.

సాధకుడు అహింసను, శమము దమము మొదలగు పరమహం సల ధర్మములను పాటిస్తూ, జీవన్ముక్తి అనే తన లక్ష్యమును గుర్తులో నుంచుకొని మెలగవలెను. అతడు మోక్షప్రదాతయగు శ్రీహరియొక్క లీలలు అనే శ్రేష్ఠమగు అమృతమును సేవించవలెను (లీలలను స్మరించి ఆనందించవలెను). అహింస, సత్యము, అస్తేయము (పరధనమును ఆశిం చకుండుట), బ్రహ్మచర్యము, అపరిగ్రహము (భోగవస్తువులను ప్రోగుచేయ కుండుట) అను ఐదు యమములు. శౌచము (బాహ్యమునందు, అంతఃకర ణమునందు శుచిగా నుండుట), సంతోషము, తపస్సు, స్వాధ్యాయము (మోక్షశాస్త్రమును అధ్యయనము చేయుట), ఈశ్వర ప్రణిధానము (శరణా గతి) అను ఐదు నియమములు. సాధకుడు ఈ యమ నియమములను నిష్కామముగా ఆచరించవలెను. సాధకుడు ఇతరులను నిందించరాదు. అతడు స్వార్థము కొరకై ప్రయత్నమును చేయరాదు. ఇంతేగాక, అతడు శీతోష్ణములు, సుఖదుఃఖములు మొదలగు ద్వంద్వములను సమచిత్త ముతో సహించవలెను. ఇట్లు చేయు సాధకునకు ఆత్మసాక్షాత్కారము కలిగి జీవన్ముక్తుడగును.

హరేర్ముహుస్తత్పరకర్ణపూర-
గుణాభిధానేన విజృంభమాణయా ।
భక్త్యా హ్యసంగస్సదసత్యనాత్మని
స్యాన్నిర్గుణే బ్రహ్మణి చాంజసా రతిః ॥ 25

విజృంభమాణయా - వర్ధిల్లుచున్న, హరేః - శ్రీహరియొక్క, భక్త్యా - భక్తిచే, ముహుః - పలుమార్లు, తత్-పరకర్ణపూరగుణ-అభిధానేన - శ్రీహరియందు పరాయణులైనవారికి చెవులకు అలంకారమువంటి భగ

వాసుని గుణముల కీర్తనముచే, సత్-అసతి - కార్యకారణరూపమగు, అనా త్మని - అనాత్మ ప్రపంచమునందు, అసంగః - అనాసక్తి, స్యాత్ - కలుగు ను, చ - మరియు, నిర్గుణే - నిర్గుణమగు, బ్రహ్మణి - బ్రహ్మయందు, అంజసా - తేలికగా, రతిః - ప్రీతి.

సాధకుడు దినదినప్రవర్ధమానమగు హరిభక్తి గలవాడై శ్రీహరి గుణములను పలుమార్లు కీర్తించవలెను. ఈ గుణములు హరిభక్తుల చెవు లకు అలంకారములు. ఇట్లు చేయు భక్తునకు కార్య (భౌతికపదార్థములు) కారణ (పంచభూతములు) రూపమగు ఈ అనాత్మప్రపంచమునందు వైరా గ్యము కలిగి, నిర్గుణ పరబ్రహ్మయందు తేలికగా నిష్ఠ కుదురును.

యదా రతిర్బ్రహ్మణి నైష్ఠికీ పుమా-
నాచార్యవాన్ జ్ఞానవిరాగరంహసా ।
దహత్యవీర్యం హృదయం జీవకోశం
పంచాత్మకం యోనిమివోత్థితోఽగ్నిః ॥ 26

యదా - ఏ కాలమునందు, బ్రహ్మణి - పరబ్రహ్మయందు, నైష్ఠికీ - నిశ్చలమగు, రతిః - ప్రేమ కలుగునో అప్పుడు, ఆచార్యవాన్ - ఆచా ర్యుడు గల, పుమాన్ - సాధకుడు, జ్ఞానవిరాగరంహసా - జ్ఞానవైరాగ్య ముల వేగముచే, జీవకోశమ్ - జీవునకు ఆవరకమైనట్టియు, పంచాత్మకమ్ - అయిదు క్లేశముల రూపములోనుండే, హృదయమ్ - లింగశరీరమును, అవీర్యమ్ - తిరిగి పుట్టే సామర్థ్యము లేని విధముగా, ఉత్థితః - పుట్టిన, అగ్నిః - అగ్ని, యోనిం ఇవ - తాను పుట్టిన కట్టెను వలె, దహతి - దహిం చును.

ఆచార్యుడు గల సాధకునకు పరబ్రహ్మయందు నిశ్చలమగు ప్రీతి కలిగిన వెంటనే జ్ఞానవైరాగ్యముల తీవ్రతచే లింగశరీరము (నేను పరిచ్ఛిన్న వ్యక్తిననే తప్పుడు ధారణ), కట్టెయందు పుట్టిన అగ్నిచే కట్టె వలె, దహించ బడును. జ్ఞానముచే దగ్ధమైన లింగశరీరము తిరిగి పుట్టే ప్రసక్తి లేదు. అవి ద్య, అస్మిత (అహంకారము), రాగము, ద్వేషము మరియు అభినివేశము

(మరణభయము) అనే అయిదు లక్షణములతో కూడిన ఈ లింగ శరీరమే జీవునకు బంధహేతువు అగుచున్నది.

దగ్ధాశయో ముక్తసమస్తతద్గుణో
నైవాత్మనో బహిరంతర్విచష్టే ।
పరాత్మనోర్యద్వ్యవధానం పురస్తాత్
స్వప్నే యథా పురుషస్తద్వినాశే ॥ 27

పర-ఆత్మనోః - పరబ్రహ్మకు తనకు, పురస్తాత్ - జ్ఞానమునకు పూర్వమునందు, యత్ - ఏ, వ్యవధానమ్ - భేదము ఉండెనో, తత్-వి నాశే - దాని వినాశము కలుగగా, దగ్ధ-ఆశయః - దహించబడిన లింగశరీ రోపాధి గలవాడు, ముక్తసమస్తతత్-గుణః - విడిచిపెట్టబడిన సకలములగు దాని గుణములు గలవాడు అగు, పురుషః - సాధకుడు, స్వప్నే యథా - స్వప్నము విషయములో వలె, ఆత్మనః - తనకంటె, బహిః - బయట, అంతః - లోపల, న ఏవ విచష్టే - చూడనే చూడడు.

జీవునకు జ్ఞానము కలుగుటకు ముందు తనకు పరబ్రహ్మకు భేదము గలదనే ధారణ ఉండును. కాని, జ్ఞానముచే ఆ ధారణ నశించగానే, ఆత్మకు (అజ్ఞానకల్పితమైన) లింగశరీరోపాధి (జ్ఞానముచే) దహించబడు ను. దానితో బాటు దాని గుణములగు కర్తృత్వ భోక్తృత్వములు కూడ దూర ముగా విడువబడును. వ్యక్తి స్వప్నములో తనను, తనకంటె భిన్నమగు జగ త్తును చూచును. కాని, స్వప్నమునుండి తెలివి రాగానే ఆ సర్వము తన యందే విలీనమగును. అదే విధముగా, అప్పుడా జ్ఞాని తనకంటె భిన్న ముగా బయట ప్రపంచమును దర్శించడు. ప్రపంచముకంటె వ్యతిరిక్తముగా తాను దేహిననే భావన కూడ ఆతనికి ఉండదు.

ఆత్మానమింద్రియార్థం చ పరం యదుభయోరపి ।
సత్యాశయ ఉపాధౌ వై పుమాన్ పశ్యతి నాన్యదా ॥ 28

ఉపాధౌ - ఉపాధియగు, ఆశయే - అంతఃకరణము, సతి వై - ఉన్నప్పుడు మాత్రమే, ఆత్మానమ్ - దేహమును (ద్రష్టయగు తనను), ఇంద్రియ-అర్థం చ - ఇంద్రియములకు గోచరమయ్యే విషయమును

కూడ, అపి - మరియు, ఉభయోః - ఈ రెండింటికీ, పరమ్ - అతీతమగు, యత్ - ఏ అహంకారము (సాక్షి చైతన్యము) గలదో దానిని, పుమాన్ - వ్యక్తి, -శ్యతి - దర్శించుచున్నాడు, అన్యదా - ఇతరమగు అవస్థయందు, న - చూచుట లేదు.

అంతఃకరణము అనే ఉపాధి (పరికరము) క్రియాశీలముగా నున్నప్పుడు మాత్రమే వ్యక్తికి ద్రష్టనగు తాను, ఇంద్రియములకు గోచరమయ్యే దృశ్యజగత్తు మరియు ఈ రెండింటికీ సాక్షియగు చైతన్యము అను భేదము అనుభవమునకు వచ్చును. లేదా, దృశ్యజగత్తు, అజ్ఞానముచే దానికంటె భిన్నముగా స్వీకరించబడే దేహము, మరియు అహంకారము అనే భేదము అనుభవమునకు వచ్చును. గాఢనిద్ర మొదలగు అవస్థలయందు అంతఃకరణము విలీనము కాగా, ఈ భేదములేమియు దర్శించబడుట లేదు.

నిమిత్తే సతి సర్వత్ర జలాదావపి పూరుషః ।
ఆత్మనశ్చ పరస్యాపి బి ాం పశ్యతి నాన్యదా ॥ 29

జల-ఆదౌ - నీ ెదలగు, నిమిత్తే - నిమిత్తము, సతి అపి - ఉన్నప్పుడు మాత్రమే, ఆ  తనకు, పరస్య - తనకంటె భిన్నముగా కన్పించే ప్రతిబింబమునకు, ఛదామ్ - భేదమును, పూరుషః - వ్యక్తి, సర్వత్ర - అంతటా, పశ్యతి - చూ చుచున్నాడు, అన్యదా - నిమిత్తము లేని అవస్థయందు, న - చూచుట లేదు.

నీరు, అద్దము మొదలగు కాంతిని పరావర్తనము చేసే నిమిత్తము ఉన్నప్పుడు మాత్రమే వ్యక్తి తనకు, తన ప్రతిబింబమునకు భేదమును చూచుచున్నాడు. అట్టి నిమిత్తము లేనప్పుడు ఆ ప్రతిబింబము తనలో విలీనమై యుండునే గాని, భిన్నముగా కనబడదు. ఈ స్థితి లోకములో ఎట్లో, తన విషయములో కూడ అంతే.

ఇంద్రియైర్విషయాకృష్టైరాక్షిప్తం ధ్యాయతాం మనః ।
చేతనాం హరతే బుద్ధేః స్తంబస్తోయమివ హ్రదాత్ ॥ 30

ధ్యాయతామ్ - విషయములను గురించి ఆలోచించే వారి, మనః - మనస్సు, విషయ-ఆకృష్టైః - విషయములచే ఆకర్షించబడిన, ఇంద్రియైః - ఇంద్రియములచే, ఆక్షిప్తమ్ - లాగివేయబడినదై, బుద్ధేః - బుద్ధినుండి, చేతనామ్ - వివేకజ్ఞానమును, స్తంబః - చిన్న నీటి మొక్క, హ్రదాత్ - సరస్సునుండి, తోయం ఇవ - నీటిని వలె, హరతి - హరించి వేయును.

సరస్సు ఒడ్డున మొలిచే చిన్న గడ్డి మొక్క ఆ సరస్సులోని నీటిని వ్రేళ్ల ద్వారా లాగివేయును. అదే విధముగా, వ్యక్తి విషయభోగములను గురించి ఆలోచించుచున్నచో, ఆ భోగముల ఆకర్షణకు లోనైన ఇంద్రియములు మనస్సు ద్వారా వాని బుద్ధినుండి వివేకశక్తిని అపహరించును.

భ్రశ్యత్యనుస్మృతిశ్చిత్తం జ్ఞానభ్రంశస్స్మృతిక్షయే ।
తద్రోధం కవయః ప్రాహురాత్మాపహ్నవమాత్మనః ॥ 31

చిత్తం అను - వివేకజ్ఞానమునననుసరించి, స్మృతిః - స్మరణము, భ్రశ్యతి - భ్రష్టమగును, స్మృతిక్షయే - స్మృతి నశించగా, జ్ఞానభ్రంశః - జ్ఞానము భ్రష్టమగును, తత్-రోధమ్ - అట్టి జ్ఞానముయొక్క నాశమును, ఆత్మనః - తనవలన, ఆత్మ-అపహ్నవమ్ - తన నాశమునుగా, కవయః - జ్ఞానులు, ప్రాహుః - చెప్పిరి.

వివేకజ్ఞానము నశించుట తోడనే పూర్వాపరముల స్మరణము లేకుండ పోవును. అట్టి స్మరణము లేనివాడు స్వరూపజ్ఞానమును కోల్పోవును (ఆత్మజ్ఞానమును పొందే అవకాశమును జారవిడుచుకొనును). అట్లు వ్యక్తి ఆత్మజ్ఞానమునకు దూరమగుట ఆత్మహత్యయే అగునని విద్వాంసులు చెప్పుచున్నారు.

నాతః పరతరో లోకే పుంసస్స్వార్థవ్యతిక్రమః ।
యదధ్యన్యస్య ప్రేయస్త్వమాత్మనస్స్వవ్యతిక్రమాత్ ॥ 32

లోకే - లోకమునందు, పుంసః - వ్యక్తికి, అతః - ఈ, ఆత్మనః - తనయొక్క, స్వవ్యతిక్రమాత్ - తనచేతనే నాశమగుటకంటె, పరతరః -

పెద్దదగు, స్వ-అర్థవ్యతిక్రమః - స్వీయప్రయోజనముయొక్క నాశము, న - లేదు, యత్ అధి - ఏ ఆత్మను అధిష్ఠానముగా చేసుకొని, అన్యస్య - ఇతరమునకు, ప్రేయస్త్వమ్ - మిక్కిలి ప్రియమగుట సంభవమగుచున్నదో.

వ్యక్తికి ఆత్మ అత్యంతము ప్రియము. ఆత్మసంబంధమును బట్టియే వ్యక్తికి అనాత్మలగు దేహాదులయందు ప్రీతి కలుగుచున్నది. మానవుడు ఈ జన్మలో అట్టి ఆత్మస్వరూపజ్ఞానమునకు తనకు తానే భంగము కలిగించుకున్నచో, అంతకంటె పెద్ద స్వార్థవినాశము మరియొకటి ఉండదు.

అర్థేంద్రియార్థాభిధ్యానం సర్వార్థాపహ్నవో నృణామ్ ।
భ్రంశితో జ్ఞానవిజ్ఞానాద్యేనావిశతి ముఖ్యతామ్ ॥ 33

నృణామ్ - మానవులకు, అర్థ-ఇంద్రియ-అర్థ-అభిధ్యానమ్ - ధనమును గురించి ఇంద్రియభోగములను గురించి ఏకాగ్రముగా ఆలోచించుట, సర్వ-అర్థ-అపహ్నవః - సకలపురుషార్థముల వినాశము, యేన - ఏ ఆలోచనచే, జ్ఞానవిజ్ఞానాత్ - జ్ఞానవిజ్ఞానములనుండి, భ్రంశితః - భ్రష్టుడై, ముఖ్యతామ్ - వృక్షము మొదలగు జన్మను, ఆవిశతి - పొందునో.

వ్యక్తి ధనమును గురించి, ఇంద్రియభోగములను గురించి అదే పనిగా ఆలోచించరాదు. అట్లు చేసినచో, వ్యక్తి నాలుగు పురుషార్థములను చెడగొట్టుకొనును. అట్టి ఆలోచన వలన వ్యక్తికి శాస్త్రముచే బోధించబడే ఆత్మజ్ఞానము గాని, ఆత్మసాక్షాత్కారము గాని కలిగే అవకాశము జారిపోయి, ఆతడు మరుజన్మలో చెట్టుచేమల రూపములో జన్మించును.

న కుర్యాత్కర్హిచిత్సంగం తమస్తీవ్రం తితీరిషుః ।
ధర్మార్థకామమోక్షాణాం యదత్యంతవిఘాతకమ్ ॥ 34

తీవ్రమ్ - తీవ్రమగు, తమః - అజ్ఞానమును, తితీరిషుః - తరించగోరువాడు, కర్హిచిత్ - ఏ కాలమునందైననూ, సంగమ్ - ఆసక్తిని, న కుర్యాత్ - చేయరాదు, యత్ - ఏ ఆసక్తి, ధర్మ-అర్థకామమోక్షాణామ్ - ధర్మార్థకామమోక్షములకు, అత్యంతవిఘాతకమ్ - మిక్కిలి వినాశమును కలిగించునదియో.

భయంకరమగు అజ్ఞానమనే సముద్రమును దాటగోరు వ్యక్తి ఏ కాలమునందైననూ సంసారమునందు ఆసక్తిని పెంచుకొనరాదు. ఇట్టి ఆసక్తి వలన మానవుడు ధర్మార్థకామమోక్షములనే పురుషార్థములను పూర్తిగా పోగొట్టుకొనును.

తత్రాపి మోక్ష ఏవార్థ ఆత్యంతికతయేష్యతే ।
త్రైవర్గ్యోఽర్థో యతో నిత్యం కృతాంతభయసంయుతః ।। 35

తత్ర అపి - ఆ నాలుగింటిలో కూడ, మోక్షః - మోక్షమనే, అర్థః ఏవ - పురుషార్థమే, ఆత్యంతికతయా - సర్వోత్కృష్టముగా, ఇష్యతే - అంగీకరించబడుచున్నది, యతః - ఎందువలననగా, త్రైవర్గ్యః - త్రివర్గమునకు చెందిన, అర్థః - పురుషార్థము, నిత్యమ్ - నిత్యము, కృతాంతభయసంయుతః - కాలపురుషుని వలని భయముతో కూడియున్నది.

ధర్మార్థకామములనే త్రివర్గమునకు చెందిన పురుషార్థములు సర్వదా కాలపురుషుని భయమునకు లోబడి యున్నవి. అనగా, ఈ పురుషార్థములు అనిత్యము. కాని, మోక్షము అనే పురుషార్థము నిత్యము గనుక, అదియే నాలుగు పురుషార్థములలో సర్వోత్కృష్టమైనదిగా స్వీకరించబడుచున్నది.

పరేఽవరే చ యే భావా గుణవ్యతికరాదను ।
న తేషాం విద్యతే క్షేమమీశవిధ్వంసితాశిషామ్ ।। 36

పరే - ఉత్కృష్టమైనవి, చ - మరియు, అవరే - నికృష్టమైనవి అగు, భావాః - ప్రాణులు, గుణవ్యతికరాత్ - గుణముల పరిణామము వలన, అను - పుట్టినవి, ఈశవిధ్వంసిత-ఆశిషామ్ - కాలపురుషునిచే నశింపజేయబడిన మనోరథములు గల, తేషామ్ - ఆ ప్రాణులకు, క్షేమమ్ - క్షేమము, న విద్యతే - లేదు.

దేవతలు మొదలగు గొప్ప ప్రాణులు, పశువులు మొదలగు నికృష్టప్రాణులు అన్నీ సత్త్వరజస్తమోగుణముల పరిణామముచే మాత్రమే పుట్టి

నవి. ఇట్టి ప్రాణుల మనోరథములను కాలపురుషుడు వినష్టము చేయుచుం డును. కావున, ఈ ప్రాణులకు ఆత్యంతికమగు క్షేమము లేదు.

తత్త్వం నరేంద్ర జగతామథ తస్థుషాం చ
దేహేంద్రియాఽసుధిషణాత్మభిరావృతానామ్ ।
యః క్షేత్రవిత్తపతయా హృది విశ్వగావిః
ప్రత్యక్ చకాస్తి భగవాంస్తమవేహి సోఽస్మి ॥ 37

నర-ఇంద్ర - ఓ నరపతీ!, తత్ - అందువలన, దేహ-ఇంద్రియ-అ సుధిషణ-ఆత్మభిః - దేహము ఇంద్రియములు ప్రాణములు బుద్ధి మరియు అహంకారములచే, ఆవృతానామ్ - కప్పివేయబడిన, జగతామ్ - కదిలేవి, అథ - మరియు, తస్థుషాం చ - కదలనివి అగు ప్రాణుల, హృది - హృద యమునందు, యః - ఏ, భగవాన్ - భగవానుడు, క్షేత్రవిత్-తపతయా - క్షేత్రజ్ఞుడగు జీవుని నియమించువాడుగా, ఆవిః - ప్రత్యక్షమగుచున్నవాడై, ప్రత్యక్ - సర్వసాక్షియై, విశ్వక్ - అంతటా, చకాస్తి - ప్రకాశించుచున్నాడో, తమ్ - ఆ పరమాత్మను, సః - ఆ పరమాత్మ, అస్మి - అగుచున్నాను అని, త్వమ్ - నీవు, అవేహి - తెలియుము.

ఓ మహారాజా! చరాచరములగు సకలప్రాణులు దేహము, ఇంద్రి యములు, ప్రాణములు, బుద్ధి మరియు అహంకారములయందు ఆత్మభా వము గలవారై వాటిచే కప్పివేయబడిన స్వరూపమును కలిగియున్నారు. అట్టి సకలప్రాణుల హృదయములో భగవానుడు దేహేంద్రియమనస్సులకు (క్షేత్రము) సాక్షియై, సర్వమును నియంత్రించే అంతర్యామియై, ప్రత్య గాత్మ (అంతరతమమగు స్వరూపము) రూపముగా స్వానుభూతి రూప ములో ప్రకాశించుచునే యున్నాడు. అట్టి పరమాత్మను నేనే అనే విధ ముగా అభేదజ్ఞానముతో తెలియుము.

యస్మిన్నిదం సదసదాత్మతయా విభాతి
మాయా వివేకవిధుతి స్రజి వాఽహిబుద్ధిః ।
తం నిత్యముక్తపరిశుద్ధవిబుద్ధతత్త్వం
ప్రత్యూఢకర్మకలిలప్రకృతిం ప్రపద్యే ॥ 38

వివేకవిధుతి - వివేకజ్ఞానముచే తిరస్కరించబడు, ఇదమ్ - ఈ జగత్తు, సత్-అసత్-ఆత్మతయా - కార్యకారణరూపముగా, స్రజి - మాల యందు, అహిబుద్ధిః వా - పాము అనే బుద్ధి వలె, యస్మిన్ - ఏ పరమా త్మయందు, మాయా - మాయయే, భాతి - ప్రకాశించుచున్నదో, నిత్య ముక్తపరిశుద్ధవిబుద్ధతత్త్వమ్ - నిత్యముక్తము నిత్యశుద్ధము మరియు నిత్య బుద్ధము అగు స్వరూపము గల, ప్రత్యూఢకర్మకలిలప్రకృతిమ్ - తిరస్కరిం చబడిన కర్మలచే మలినమైన ప్రకృతి గల, తమ్ - అట్టి పరమాత్మను, ప్రపద్యే - శరణు పొందుచున్నాను.

మాలయందు వాస్తవముగా పాము లేకున్ననూ అజ్ఞానముచే ఉన్నట్లుగా భాసించును. విషయము తెలియగానే ఆ పాము కనబడుట మానివేయును. అదే విధముగా ఆ పరమాత్మయందు కార్య (భౌతికము లు) కారణ (పంచభూతములు) రూపమగు జగత్తు వాస్తవముగా లేకు న్ననూ ఉన్నట్లుగా భాసించును. వివేకజ్ఞానము కలుగగానే జగత్తు మిథ్య యని తేలిపోవును. ఆ పరమాత్మ సర్వకాలములలో ముక్తుడు, పుణ్యపాప ముల సంసర్గము లేనివాడు, అఖండజ్ఞానస్వరూపుడు. కర్మఫలములగు సుఖదుఃఖములతోడి సంసర్గము అనే మాలిన్యము ప్రకృతికార్యములగు దేహేంద్రియాదులలో ఉండునే గాని, ఆ పరమాత్మకు ఈ మాలిన్యము అంటదు. అట్టి ఆ పరమాత్మను నేను శరణు పొందుచున్నాను.

యత్పాదపంకజపలాశవిలాసభక్త్యా
కర్మాశయం గ్రథితముద్గ్రథయంతి సంతః ।
తద్వన్న రిక్తమతయో యతయోఽపి రుద్ధ-
స్రోతోగణాస్తమరణం భజ వాసుదేవమ్ ॥ 39

సంతః - సత్పురుషులు, గ్రథితమ్ - అహంకారము అనే ముడిగా వేయబడిన, కర్మ-ఆశయమ్ - కర్మసమూహమును, యత్-పాదపంకజప లాశవిలాసభక్త్యా - ఏ వాసుదేవుని పాదపద్మముల వ్రేళ్ల కాంతులయందలి భక్తిచే, ఉత్-గ్రథయంతి - విప్పి వేయుచున్నారో, రిక్తమతయః - ఖాళీగా నున్న అంతఃకరణములు గల, యతయః - యోగులు, రుద్ధస్రోతోగణాః అపి - నిరోధించబడిన ఇంద్రియముల సముదాయము గలవారే అయి

ననూ, తద్వత్ - అంత తేలికగా, న - విప్పలేకున్నారో, తమ్ - అట్టి, వాసు దేవమ్ - వాసుదేవుని, అరణమ్ - శరణముగా, భజ - సేవించుము.

పూర్వకర్మల వాసనలన్నియు కలిసి జీవునకు అహంకారగ్రంథి రూపములో నుండును. సత్పురుషులు వాసుదేవుని పాదపద్మముల వ్రేళ్ల కాంతియందు భక్తిని చేసి, దాని ప్రభావముచే ఆ అహంకారగ్రంథిని తేలి కగా విప్పుకొని కృతార్థులగుచున్నారు. కాని, యోగాభ్యాసపరులు ఇంద్రి యముల సమూహమును విరోధించి (ప్రత్యాహారము) అంతఃకరణవృత్తు లను ఆపివేసి (సమాధి) కూడ అంత తేలికగా గ్రంథిభేదనమును చేయలేకు న్నారు. అట్టి వాసుదేవుని నీవు శరణు పొంది సేవించుము.

కృచ్ఛ్రో మహానిహ భవార్ణవమప్లవేశాం
షడ్వర్గనక్రమసుఖేన తితీరషంతి ।
తత్త్వం హరేర్భగవతో భజనీయమంఘ్రిం
కృత్వోడుపం వ్యసనముత్తర దుస్తరార్ణమ్ ॥ 40

షట్-వర్గనక్రమ్ - ఆరు ఇంద్రియముల సమూహము అనే మొసలి గల, భవ-అర్ణవమ్ - సంసారసముద్రమును, అసుఖేన - కఠినమైన పద్ధతి తో, తితీరషంతి - తరించ గోరుచున్నారు, అప్లవ-ఈశామ్ - తరింపజేసే ఈశ్వరుడు లేనివారలకు, ఇహ - ఈ తరించుటయందు, మహాన్ - పెద్ద, కృచ్ఛ్రః - క్లేశము, తత్ - అందువలన, త్వమ్ - నీవు, భగవతః హరేః - శ్రీహరి భగవానునియొక్క, భజనీయమ్ - సేవించదగిన, అంఘ్రిమ్ - పాదమును, ఉడుపమ్ - పడవగా, కృత్వా - చేసుకొని, దుస్తర-అర్ణమ్ - తరింప శక్యము కాని సముద్రమువంటి, వ్యసనమ్ - సంసారదుఃఖమును, ఉత్-తర - తరించివేయుము.

సంసారమనే సముద్రము అయిదు జ్ఞానేంద్రియములు, మనస్సు అనే ఆరు మొసళ్లతో కూడియున్నది. దీనిని కొందరు కఠినమైన యోగసాధ నలచే తరించ గోరెదరు. వారు ఈశ్వరుడు అనే పడవవానిని ఆశ్ర యించరు. వారికి దీనిని తరించుట చాల కఠినము. కావున, నీవు శ్రీహరి

భగవానుని పాదమును పడవగా చేసుకొని, తరింప శక్యము కాని సము
ద్రము వంటి ఈ సంసారదుఃఖమును తేలికగా తరించి వేయుము.

మైత్రేయ ఉవాచ ।
స ఏవం బ్రహ్మపుత్రేణ కుమారేణాత్మమేధసా ।
దర్శితాత్మగతిస్సమ్యక్ ప్రశస్యోవాచ తం నృపః ॥ 41

ఏవమ్ - ఈ విధముగా, బ్రహ్మపుత్రేణ - బ్రహ్మగారి పుత్రుడైనట్టి
యు, ఆత్మమేధసా - ఆత్మజ్ఞానము గల, కుమారేణ - సనత్కుమారునిచే,
దర్శిత-ఆత్మగతిః - చూపబడిన ఆత్మస్వరూపము గల, సః - ఆ, నృపః -
మహారాజు, సమ్యక్ - బాగుగా, ప్రశస్య - ప్రశంసించి, ఉవాచ - పలికెను.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- బ్రహ్మపుత్రుడు, ఆత్మజ్ఞాని
అగు సనత్కుమారుడు ఈ విధముగా ఆత్మతత్త్వమును వివరించి చెప్పగా,
ఆ పృథు మహారాజు ఆయనను బాగా కొనియాడి, ఇట్లు పలికెను.

రాజోవాచ ।
కృతో మేఽనుగ్రహః పూర్వం హరిణాఽఽర్తానుకంపినా ।
తమాపాదయితుం బ్రహ్మన్ భగవన్ యూయమాగతాః ॥42

బ్రహ్మన్ - ఓ మహాత్మా!, భగవన్ - ఓ పూజ్యా!, ఆర్త-అనుకం
పినా - ఆపదలోనున్నవారిపై దయను చూపే, హరిణా - శ్రీహరిచే,
పూర్వమ్ - ఇంతకు ముందే, మే - నా కొరకు, అనుగ్రహః - అనుగ్రహ
ము, కృతః - చేయబడినది, తమ్ - ఆ అనుగ్రహమును, ఆపాదయితుమ్
- సంపాదించుటకు, యూయమ్ - తమరు, ఆగతాః - వచ్చినారు.

పృథు మహారాజు ఇట్లు పలికెను --- పూజ్యుడవగు ఓ మహాత్మా!
దీనులపై దయ చూపే శ్రీహరి ఇంతకుముందే నన్ను అనుగ్రహించినాడు.
ఆ అనుగ్రహమును పూర్ణము చేయుటకై తాము విచ్చేసినారు.

నిష్పాదితశ్చ కార్త్స్న్యేన భగవద్భిర్ఘృణాలుభిః ।
సాధూచ్ఛిష్టం హి సర్వం మ ఆత్మనా సహ కిం దదే ॥ 43

ఘృణాలుభిః - దయామయులైనట్టియు, భగవద్భిః - పూజ్యులగు మీచే, కార్త్స్న్యేన - పూర్తిగా, నిష్పాదితః చ - సంపన్నము చేయబడిన ది, మే - నా, సర్వమ్ - సర్వము, ఆత్మనా సహ - దేహముతో బాటు, సాధు-ఉచ్ఛిష్టమ్ - సత్పురుషుల ప్రసాదమే, కిమ్ - దేనిని, దదే - ఈయ వలెను?

దయామయులు, పూజ్యులు అగు మీరు సర్వమును సంపన్నము చేసినారు. ఈ దేహముతో సహా నా సర్వము సత్పురుషులు నాకు ప్రసాదము రూపముగా అనుగ్రహించినదియే. నేను మీకేమి ఈయగలను?

ప్రాణో దారాస్సుతా బ్రహ్మన్ గృహాశ్చ సపరిచ్ఛదాః ।
రాజ్యం బలం మహీ కోశ ఇతి సర్వం నివేదితమ్ ॥ 44

బ్రహ్మన్ - ఓ మహాత్మా!, ప్రాణః - ప్రాణము, దారాః - భార్య, సుతాః - పుత్రులు, చ - మరియు, సపరిచ్ఛదాః - సామగ్రితో కూడిన, గృహాః - ఇల్లు, రాజ్యమ్ - రాజ్యము, బలమ్ - సైన్యము, మహీ - భూమి, కోశః - ఖజానా, ఇతి - అనే, సర్వమ్ - సర్వము, నివేదితమ్ - సమర్పించబడినది.

ఓ మహాత్మా! నా ప్రాణములు, భార్య, పుత్రులు, సామగ్రితో కూడిన భవనము, రాజ్యము, సైన్యము, భూమి, ఖజానా అనే సర్వమును మీకు సమర్పించుచున్నాను.

సైనాపత్యం చ రాజ్యం చ దండనేతృత్వమేవ చ ।
సర్వలోకాధిపత్యం చ వేదశాస్త్రవిదర్హతి ॥ 45

సైనాపత్యమ్ - సేనాపతి పదవిని, రాజ్యమ్ - రాజ్యమును, దండ నేతృత్వమ్ - దుష్టులను శిక్షించే అధికారమును, చ - మరియు, సర్వలోక -ఆధిపత్యం ఏవ చ - సర్వలోకములపై ఆధిపత్యమును కూడ, వేదశాస్త్ర విత్ - వేదశాస్త్రవేత్త, అర్హతి - తగియున్నాడు.

వేదశాస్త్రములను తెలిసిన విద్వాంసుడు సేనాపతి పదవికి, రాజ్యాధికారమునకు, దుష్టులను శిక్షించే అధికారమునకు మాత్రమే గాక ముల్లోకముల అధిపత్యమునకు కూడ అర్హుడే.

స్వమేవ బ్రాహ్మణో భుంక్తే స్వం వస్తే స్వం దదాతి చ ।
తస్యైవానుగ్రహేణాన్నం భుంజతే క్షత్రియాదయః ।। 46

బ్రాహ్మణః - వేదవేత్త, స్వం ఏవ - తన స్వంతమును మాత్రమే, భుంక్తే - భుజించుచున్నాడు, స్వమ్ - తన స్వంత వస్త్రమును, వస్తే - ధరించుచున్నాడు, చ - మరియు, స్వమ్ - తన స్వంతమును, దదాతి - ఇచ్చుచున్నాడు, తస్య - అట్టి వేదవేత్తయొక్క, అనుగ్రహేణ ఏవ - అనుగ్రహముచే మాత్రమే, క్షత్రియ-ఆదయః - క్షత్రియులు మొదలగువారు, భుంజతే - భోగించుచున్నారు.

వేదవేత్త తన స్వంత ఆహారమును మాత్రమే భుజించి, స్వంత వస్త్రమును మాత్రమే దాల్చి, స్వంత ధనమును మాత్రమే దానము చేయుచున్నాడు. క్షత్రియులు మొదలగువారు వేదవేత్తయొక్క అనుగ్రహముచే మాత్రమే భోగముల ననుభవించుచున్నారు.

యైరీదృశీ భగవతో గతిరాత్మవాద
ఏకాంతతో నిగమిభిః ప్రతిపాదితా నః ।
తుష్యంత్వదభ్రకరుణాస్స్వకృతేన నిత్యం
కో నామ తత్ప్రతికరోతి వినోదపాత్రమ్ ।। 47

ఏకాంతతః - నిశ్చయముగా, నిగమిభిః - వేదవేత్తలగు, యైః - ఏ మీచే, ఆత్మవాదే - అధ్యాత్మవిచారమునందు, భగవతః - భగవానుని, ఈదృశీ - ఇట్టి, గతిః - తత్త్వము, నః - మాకు, ప్రతిపాదితా - నిరూపించబడినదో, నిత్యమ్ - సర్వకాలములలో, అదభ్రకరుణాః - మిక్కిలి దయాళువులగు తమరు, స్వకృతేన - తమరు చేసిన ఉపకారముతోనే, తుష్యంతు - సంతోషించెదరు గాక!, ఉదపాత్రమ్ వినా - దోసిలి యొగ్గుటను మినహాయించి, కః నామ - ఎవ్వాడు, తత్ - దానిని, ప్రతికరోతి -

ప్రత్యుపకారమును చేయును? (వినోదపాత్రమ్ - పరిహాసభాజనుడగువాడు).

మీరు సర్వకాలములలో అతిశయించిన కరుణగలవారు. గొప్ప వేదవేత్తలగు మీరు నాకు అధ్యాత్మవిచారములో భాగముగా ఇట్టి అపూర్వమగు భగవత్తత్త్వము నుపదేశించితిరి. ఈ విధముగా నాకు గొప్ప ఉపకారమును చేసిన మీరు మీ ఉపకారముతోనే సంతోషించెదరు గాక! ఏలయన, మీకు దోసిలి యొగ్గుటను మినహాయించి ఎవ్వరైననూ మీ ఉపకారమునకు ప్రత్యుపకారమును చేయగల్గుదురా? అట్లు చేయ బూనుకున్నవాడు ఎవరైననూ పరిహాస భాజనుడగును.

మైత్రేయ ఉవాచ ।
త ఆత్మయోగపతయ ఆదిరాజేన పూజితాః ।
శీలం తదీయం శంసంతః ఖేఽభూవన్మిషతాం నృణామ్ ।।48

ఆత్మయోగపతయః - ఆత్మజ్ఞానులలో శ్రేష్ఠులగు, తే - ఆ మహర్షులు, ఆదిరాజేన - ఆదిరాజగు పృథువుచే, పూజితాః - పూజించబడినవారై, తదీయమ్ - ఆయనకు చెందిన, శీలమ్ - సచ్ఛీలమును, శంసంతః - కొనియాడుచున్నవారై, నృణామ్ - జనులు, మిషతామ్ - చూచుచుండగా, ఖే - ఆకాశమునందు, అభూవన్ - ఉండిరి.

ఆత్మజ్ఞానులలో శ్రేష్ఠులగు ఆ మహర్షులను ఆదిరాజగు పృథువు సత్కరించెను. వారప్పుడు అతని సచ్ఛీలమును కొనియాడుతూ, జనులు చూచుచుండగనే, ఆకాశమార్గముగుండా వెళ్లిరి.

వైన్యస్తు ధుర్యో మహతాం సంస్థిత్యాఽధ్యాత్మశిక్షయా ।
ఆప్తకామమివాత్మానం మేన ఆత్మన్యవస్థితః ।। 49

మహతామ్ - గొప్పవారిలో, ధుర్యః - ముఖ్యుడగు, వైన్యః తు - వేనపుత్రుడగు పృథువైతే, అధ్యాత్మశిక్షయా - ఆత్మతత్త్వముయొక్క ఉపదేశముచే కలిగిన, సంస్థిత్యా - చిత్తైకాగ్రతచే, ఆత్మని - తన స్వరూపము

నందు, అవస్థితః - నిలిచియున్నవాడై, ఆత్మానమ్ - తనను, ఆప్తకామం ఇవ - పూర్ణమైన కామనలు గలవానినిగనే, మేనే - తలచెను.

వేనపుత్రుడగు పృథువు గొప్పవారిలో ముఖ్యుడు. ఆయన సనత్కుమారుని ఆత్మతత్త్వోపదేశముచే తన స్వరూపమునందు నిశ్చలమగు మనస్సుతో నిలిచియుండెను. ఆయన తాను పూర్ణకాముడైన జీవన్ముక్తుడనైతినని భావించెను.

కర్మాణి చ యథాకాలం యథాదేశం యథాబలమ్ ।
యథోచితం యథావిత్తమకరోద్బ్రహ్మసాత్కృతమ్ ॥ 50

యథాకాలమ్ - కాలమునతిక్రమించకుండగా, యథాదేశమ్ - దేశమును అతిక్రమించకుండగా, యథాబలమ్ - శక్తిని అతిక్రమించకుండగా, యథా-ఉచితమ్ - ఔచిత్యమునతిక్రమించకుండగా, యథావిత్తమ్ - ధనమునతిక్రమించకుండగా, బ్రహ్మసాత్కృతమ్ - ఈశ్వరార్పణగా, కర్మాణి చ - కర్మలను కూడ, అకరోత్ - చేసెను.

పృథువు దేశకాలములకు తగ్గట్లుగా తన శక్తిని సంపదను మించకుండగా యథోచితమగు కర్మలను ఈశ్వరార్పణబుద్ధితో చేసెను.

ఫలం బ్రహ్మణి విన్యస్య నిర్విషంగస్సమాహితః ।
కర్మాధ్యక్షం చ మన్వాన ఆత్మానం ప్రకృతేః పరమ్ ॥ 51

ఫలమ్ - కర్మఫలమును, బ్రహ్మణి - ఈశ్వరునియందు, విన్యస్య - సమర్పించి, నిర్విషంగః - కర్తృత్వాసక్తి లేనివాడై, సమాహితః - ఏకాగ్రమగు చిత్తము గలవాడై, ఆత్మానమ్ - తనను, ప్రకృతేః - ప్రకృతికంటె, పరమ్ - అతీతమగు, కర్మ-అధ్యక్షమ్ - కర్మలకు సాక్షినిగా, మన్వానః - తలంచువాడు.

ఆయన కర్మఫలమును ఈశ్వరునకు సమర్పించి, కర్తృత్వాసక్తి లేనివాడై, ఏకాగ్రచిత్తముతో కర్మలను చేసెను. ఆయన ప్రకృతి (దేహేంద్రియమనస్సంఘాతము) కంటె అతీతమైన సాక్షిభావములో నిలిచి యుండెను.

గృహేషు వర్తమానోఽపి స సామ్రాజ్యశ్రియాఽన్వితః ।
నాసజ్జతేంద్రియార్థేషు నిరహంమతిరర్కవత్ ।। 52

సామ్రాజ్యశ్రియా - సామ్రాజ్యలక్ష్మితో, అన్వితః - కూడియున్నవాడు, నిరహంమతిః - అహంకారము లేనివాడు అగు, సః - ఆ పృథువు, గృహేషు - ఇంటియందు, వర్తమానః అపి - ఉంటున్నవాడే అయిననూ, అర్కవత్ - సూర్యుడు వలె, ఇంద్రియ-అర్థేషు - ఇంద్రియభోగములయందు, న అసజ్జత - ఆసక్తుడు కాలేదు.

సామ్రాజ్యలక్ష్మితో కూడియున్న ఆ పృథువు అహంభావము లేనివాడు. ఆయన ఇంటిలో ఉంటున్నా, సూర్యుడు తాను ప్రకాశింపజేసే దేశముతో సంపర్కమును పొందని విధముగా, ఇంద్రియభోగ్యములగు శబ్దాది విషయములయందు ఆసక్తి లేకుండ నుండెను.

ఏవమధ్యాత్మయోగేన కర్మాణ్యనుసమాచరన్ ।
పుత్రానుత్పాదయామాస పంచాఽర్చిష్యాత్మసంమతాన్ ।
విజితాశ్వం ధూమ్రకేశం హర్యక్షం ద్రవిణం వృకమ్ ।। 53

ఏవమ్ - ఈ విధముగా, అధ్యాత్మయోగేన - ఆత్మనిష్ఠను కలిగియుండుటచే, కర్మాణి - కర్మలను, అను - శాస్త్రానుసారముగా, సమాచరన్ - చక్కగా చేయుచున్నవాడై, అర్చిషి - అర్చిస్సునందు, విజితాశ్వమ్ - విజితాశ్వుని, ధూమ్రకేశమ్ - ధూమ్రకేశుని, హర్యక్షమ్ - హర్యక్షుని, ద్రవిణమ్ - ద్రవిణుని, వృకమ్ - వృకుని, ఆత్మసంమతాన్ - తనకు తగియున్న, పంచ - అయిదుగురు, పుత్రాన్ - కొడుకులను, ఉత్పాదయామాస - కనెను.

ఈ విధముగా పృథువు ఆత్మనిష్ఠయందుంటూనే శాస్త్రవిహితములగు కర్మలను చక్కగా ఆచరించెను. ఆయనకు భార్యయగు అర్చిస్సునందు విజితాశ్వుడు, ధూమ్రకేశుడు, హర్యక్షుడు, ద్రవిణుడు, వృకుడు అనే అయిదుగురు తనకు తగ్గ కొడుకులు కలిగిరి.

సర్వేషాం లోకపాలానాం దధారైకః పృథుర్గుణాన్ ।
గోపీథాయ జగత్సృష్టేః కాలే స్వే స్వేఽచ్యుతాత్మకః ॥ 54

అచ్యుత-ఆత్మకః - అచ్యుతుని అవతారమగు, పృథుః - పృథువు, ఏకః - ఒక్కడే, సర్వేషామ్ - అందరు, లోకాపాలానామ్ - లోకపాలకుల, గుణాన్ - గుణములను, జగత్-సృష్టేః - జగత్తులోని ప్రాణులయొక్క, గోపీథాయ - రక్షణ కొరకు, స్వే స్వే - తమ తమ, కాలే - కాలమునందు, దధార - ధరించెను.

అచ్యుతుడగు శ్రీహరియొక్క అవతారమైన పృథువు ఒక్కడే లోక పాలకులందరి గుణములను ధరించి, వారి వారి కాలములలో జగత్తులోని ప్రాణులను రక్షించెను.

మనోవాగ్వృత్తిభిస్సౌమ్యైర్గుణైస్సంరంజయన్ ప్రజాః ।
రాజేత్యధాన్నామధేయం సోమరాజ ఇవాపరః ॥ 55

మనః-వాక్-వృత్తిభిః - మనస్సు వాగింద్రియము అనువాటి వ్యాపారములచే, సౌమ్యైః - మనోహరములగు, గుణైః - గుణములతో, ప్రజాః - ప్రజలను, సంరంజయన్ - చక్కగా రంజిల్ల జేయువాడై, అపరః - రెండవ, సోమరాజః ఇవ - ఓషధులకు రాజగు చంద్రుని వలె, రాజా ఇతి - రాజు అనే, నామధేయమ్ - పేరును, అధాత్ - ధరించెను.

ఓషధులకు హితమును చేకూర్చే చంద్రుడు సోమరాజు అనే సార్థ కనామమును కలిగియున్నాడు. అదే విధముగా పృథువు ప్రజల హిత మును గురించి తన మనస్సులో చింతిస్తూ, వారి హితమునే పలుకుతూ, తన మనోహరమగు గుణములచే వారిని రంజింపజేసి, చంద్రుని తరువాత రాజు అనే సార్థకనామధేయము గల రెండవ రాజు అయెను.

సూర్యవద్విసృజన్ గృహ్ణన్ ప్రతపంశ్చ భువో వసు ।
దుర్ధర్షస్తేజసేవాగ్నిర్మహేంద్ర ఇవ దుర్జయః ॥ 56

సూర్యవత్ - సూర్యుడు వలె, ప్రతపన్ - బాగా తపించు చున్నవాడై (ప్రతాపమును చూపుచున్నవాడై), భువః - భూమియొక్క,

వసు - సంపదను (నీటిని), గృహ్ణన్ - స్వీకరించుచున్నవాడై, చ - మరి యు, విసృజన్ - విడిచిపెట్టుచున్నవాడు, అగ్నిః ఇవ - అగ్ని వలె, తేజసా - తేజస్సుచే, దుర్ధర్షః - తిరస్కరించుటకు శక్యము కానివాడు, మహా-ఇంద్రః ఇవ - మహేంద్రుడు వలె, దుర్జయః - జయించశక్యము కానివాడు.

సూర్యుడు బాగా ఎండలు కాసి భూమిపై ఉండే నీటిని అవిరిగా తీసుకొని మరల వర్షము రూపములో విడిచిపెట్టును. అదే విధముగా ప్రతా పశాలియగు పృథువు భూమియొక్క సంపదను పన్నుల రూపములో వసూలు చేసి, ప్రజాహితకార్యముల రూపములో ఖర్చు పెట్టెడివాడు. అగ్నివలె తేజశ్శాలియగు ఆయనకు శత్రువుల భయము లేకుండెను. ఆయన మహేంద్రుని వలె అజేయుడుగ నుండెను.

తితిక్షయా ధరిత్రీవ ద్యౌరివాభీష్టదో నృణామ్ ।
వర్షతి స్మ యథాకామం పర్జన్య ఇవ తర్పయన్ ॥ 57

తితిక్షయా - సహనముచే, ధరిత్రీ ఇవ - భూమి వలె, ద్యౌః ఇవ - స్వర్గము వలె, నృణామ్ - మానవులకు, అభీష్టదః - అభీష్టములనిచ్చువా డు, పర్జన్యః ఇవ - మేఘుని వలె, యథాకామమ్ - కోరికలకు తగ్గట్లుగా, తర్పయన్ - తృప్తిని కలిగించువాడై, వర్షతి స్మ - వర్షించెను.

ఆయన సహనములో భూదేవితో సమానమైనవాడు. ఆయన స్వర్గము వలె మానవుల అభీష్టములను నెరవేర్చెడివాడు. మేఘము మాన వులకు చాలినంతగా వర్షించి తృప్తిని కలిగించును. అదే విధముగా ఆయన జనుల కోరికలకు తగ్గట్లు సంపదలను వర్షించి, వారికి తృప్తిని కలిగించెను.

సముద్ర ఇవ దుర్బోధస్సత్త్వేనాచలరాడివ ।
ధర్మరాడివ శిక్షాయామాశ్చర్యే హిమవానివ ॥ 58

సముద్రః ఇవ - సముద్రము వలె, దుర్బోధః - తెలియ శక్యము కాని లోతు గలవాడు, సత్త్వేన - ధైర్యముచే, అచలరాట్ ఇవ - గొప్ప పర్వ తము వంటివాడు, శిక్షాయామ్ - శిక్షించుటయందు, ధర్మరాట్ ఇవ -

యమధర్మరాజు వంటివాడు, ఆశ్చర్యే - అద్భుతమువందు, హిమవాన్ ఇవ - హిమవంతుడు వంటివాడు.

సముద్రపు లోతును తెలియుట కష్టము. అదే విధముగా ఆయన మనస్సు లోతు ఇతరులకు అంతు పట్టెడిది కాదు. ఆయన పర్వతమువలె చలనము లేని ధైర్యము గలవాడు. తప్పు చేసినవారిని యమధర్మరాజు వలె ఆయన నిష్పక్షపాతముగా శిక్షించెడివాడు. ఆయనను చూచినప్పుడు హిమవత్పర్వతమును చూచినంత ఆశ్చర్యము కలిగెడిది.

కుబేర ఇవ కోశాఢ్యో గుప్తార్థో వరుణో యథా ।
మాతరిశ్వేవ సర్వాత్మా బలేన సహసౌజసా ॥ 59

కుబేరః ఇవ - కుబేరుడు వలె, కోశ-ఆఢ్యః - అధికమగు ధనమునకు ప్రభువు, వరుణః యథా - వరుణుడు వలె, గుప్త-అర్థః - రహస్యమగు ప్రయోజనము గలవాడు, మాతరిశ్వా ఇవ - వాయువు వలె, బలేన - శరీరబలముచే, సహసా - మనోబలముచే, ఓజసా - ఇంద్రియపటుత్వముచే, సర్వ-ఆత్మా - సర్వులను నియంత్రించువాడు.

పృథువు కుబేరుడు వలె సమృద్ధమగు ధనమునకు స్వామి. ఆయన తాను చేపట్టే ప్రణాళికలు కార్యరూపమును దాల్చునంతవరకు రహస్యముగా నుంచెడివాడు. ఇట్టి రహస్యగోపనములో ఆయన వరుణుడు వంటివాడు. వాయువు సకలప్రాణులను ప్రాణశక్తిరూపముగా నియంత్రిస్తూ వాటి దేహములకు ఇంద్రియములకు మనస్సునకు శక్తిని కలిగించుచుండును. అదే విధముగా, పృథువు తన దేహబలముచే ఇంద్రియముల పటుత్వముచే మనోబలముచే సకలజనులను నియంత్రించెడి వాడు.

అవిషహ్యతయా దేవో భగవాన్ భూతరాడివ ।
కందర్ప ఇవ సౌందర్యే మనస్వీ మృగరాడివ ॥ 60

అవిషహ్యతయా - సహింప శక్యము కాని తేజస్సును కలిగియుండుటచే, దేవః - స్వయంప్రకాశ స్వరూపుడు, భూతరాట్ - సకలప్రాణులకు ప్రభువు అగు, భగవాన్ ఇవ - రుద్రదేవుని వలె, సౌందర్యే - అందమునం

దు, కందర్పః ఇవ - మన్మథుడు వలె, మృగరాట్ ఇవ - సింహము వలె, మనస్వీ - ఠీవి గలవాడు.

ఆ పృథువు సహింప శక్యము కాని తేజస్సులో స్వయంప్రకాశ స్వరూపుడగు రుద్రభగవానుని పోలియుండెను. అందములో మన్మథుని పోలియున్న ఆ రాజు ఠీవిలో సింహమును పోలియుండెను.

వాత్సల్యే మనువన్నౄణాం ప్రభుత్వే భగవానజః ।
బృహస్పతిర్బ్రహ్మవాద ఆత్మవత్త్వే స్వయం హరిః ॥ 61

వాత్సల్యే - ప్రేమయందు, మనువత్ - స్వాయంభువ మనువు వలె, నౄణామ్ - మానవుల, ప్రభుత్వే - పాలించుటయందు, భగవాన్ అజః - బ్రహ్మదేవుడు, బ్రహ్మవాదే - బ్రహ్మవిచారమునందు, బృహస్పతిః - బృహస్పతి, ఆత్మవత్త్వే - జితేంద్రియుడగుటయందు, స్వయమ్ - సాక్షాత్తుగా, హరిః - శ్రీహరి.

స్వాయంభువ మనువు వలె ప్రేమపూర్ణుడగు ఆ పృథువు జనులను పాలించుటలో బ్రహ్మదేవుని వంటివాడు. బ్రహ్మవిచారములో ఆయన బృహస్పతియే. జితేంద్రియత్వములో ఆయన సాక్షాత్తుగా శ్రీహరియే.

భక్త్యా గోగురువిప్రేషు విష్వక్సేనానువర్తిషు ।
హ్రియా ప్రశ్రయశీలాభ్యామాత్మతుల్యః పరోద్యమే ॥ 62

గోగురువిప్రేషు - గోవులయందు గురువులయందు వేదవేత్తలయందు, విష్వక్సేనానువర్తిషు - సర్వవ్యాపకమగు చైతన్యప్రసారము గల శ్రీహరియొక్క భక్తులయందు, భక్త్యా - భక్తిచే, హ్రియా - బిడియముచే, ప్రశ్రయశీలాభ్యామ్ - వినయముచే మంచి స్వభావముచే, పర-ఉద్యమే - ఇతరుల కొరకు ఉద్యమించుటయందు, ఆత్మతుల్యః - తనకు తానే సాటి.

గోవులు, గురుజనులు, వేదవేత్తలు, శ్రీహరి భక్తులు అనువారి యెడల భక్తి, బిడియము, వినయము, మంచి స్వభావములను కలిగియుండుటలో, మరియు పరోపకారము కొరకు నడుము బిగించుటలో ఆ పృథు మహారాజు తనకు తానే సాటి.

**కీర్త్యోర్ధ్వగీతయా పుంభిస్త్రైలోక్యే తత్ర తత్ర హ ।**
**ప్రవిష్టః కర్ణరంధ్రేషు స్త్రీణాం రామస్సతామివ ।। 63**

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే చతుర్థస్కంధే పృథూపాఖ్యానే పృథు సనత్కుమార సంవాదో నామ ద్వావింశోఽధ్యాయః ।।**

**త్రైలోక్యే** - ముల్లోకములయందు, **తత్ర తత్ర** - అక్కడక్కడ, **పుంభిః** - పురుషులచే, **ఊర్ధ్వగీతయా** - బిగ్గరగా గానము చేయబడిన, **కీర్త్యా** - కీర్తిచే, **స్త్రీణామ్** - స్త్రీలయొక్క, **కర్ణరంధ్రేషు** - చెవి వివరముల యందు, **సతామ్** - సత్పురుషులయొక్క (చెవుల వివరములయందు), **రామః ఇవ** - శ్రీరాముడు వలె, **ప్రవిష్టః హ** - ప్రవేశించినవాడట.

ముల్లోకములలో ఆయా స్థానములలో పురుషులు బిగ్గరగా పృథువు **కీర్తి**ని గానము చేయగా ఆ కీర్తి, శ్రీరాముడు సత్పురుషుల హృదయములలో ప్రవేశించిన విధముగా, గృహకార్యములలో వ్యగ్రముగానుండే స్త్రీల చెవులకు కూడ వినవచ్చెను.

శ్రీమద్భాగవత మహాపురాణములోని నాల్గవ స్కంధమునందు
పృథూపాఖ్యానములో పృథుసనత్కుమారసంవాదమనే
ఇరువది రెండవ అధ్యాయము ముగిసినది (22).

*****

## అథ త్రయోవింశోఽధ్యాయః

## పృథూపాఖ్యానము - పృథువు పరమగతిని పొందుట

మైత్రేయ ఉవాచ ।
దృష్ట్వాత్మానం ప్రవయసమేకదా వైన్య ఆత్మవాన్ ।
ఆత్మనా వర్ధితాశేషస్వానుసర్గః ప్రజాపతిః ।। 1

జగతస్తస్థుషశ్చాపి వృత్తిదో ధర్మభృత్సతామ్ ।
నిష్పాదితేశ్వరాదేశో యదర్థమిహ జజ్ఞివాన్ ।। 2

ఆత్మజేష్వాత్మజాం న్యస్య విరహాద్రుదతీమివ ।
ప్రజాసు విమనస్స్వేకస్సదారోఽగాత్తపోవనమ్ ।। 3

మైత్రేయః - మైత్రేయ మహర్షి, ఉవాచ - పలికెను, ఆత్మవాన్ - ధైర్యము గలవాడు, ఆత్మనా - తనచే, వర్ధిత-అశేషస్వ-అనుసర్గః - వర్ధిల్ల జేయబడిన సకలములగు తన నిర్మాణములు కలిగినవాడు, ప్రజాపతిః - ప్రజాపాలకుడు, జగతః - కదిలే ప్రాణికి, తస్థుషః చ అపి - కదలని ప్రాణికి కూడ, వృత్తిదః - బ్రతుకు దెరువును కల్పించువాడు, సతామ్ - సత్పురుషులయొక్క, ధర్మభృత్ - ధర్మమును రక్షించువాడు, నిష్పాదిత-ఈశ్వర-ఆదేశః - నిర్వహించబడిన భగవానుని ఆదేశము గలవాడు, యత్-అర్థమ్ - దేని కొరకైతే, ఇహ - ఈ లోకమునందు, జజ్ఞివాన్ - జన్మించినాడో, వైన్యః - వేనపుత్రుడగు పృథువు, ఏకదా - ఒకనాడు, ఆత్మానమ్ - తనను, ప్రవయసమ్ - వయసు మళ్లిన వానిగా, దృష్ట్వా - గమనించి, విరహాత్ - వియోగముచే, రుదతీం ఇవ - ఏడ్చుచున్నదా యన్నట్లున్న, ఆత్మజామ్ - కుమార్తెయగు భూదేవిని, ఆత్మజేషు - కొడుకులయందు, న్యస్య - అప్పజెప్పి, ప్రజాసు - ప్రజలు, విమనస్సు - దుఃఖితులు కాగా, సదారః -

భార్యతో గూడినవాడై, ఏకః - అనుచరులు లేనివాడై, తపోవనమ్ - తపోవనమును గురించి, అగాత్ - వెళ్లెను.

వేనపుత్రుడగు పృథువు గొప్ప ధైర్యము గలవాడు. ఆయన ప్రజలను పాలిస్తూ స్వయముగా పల్లెలు, పట్టణములు మొదలగు వాటిని నిర్మించి, వాటిని స్వయముగా అభివృద్ధి చేసెను. ఆయన కదిలే ప్రాణులకు, కదలని ప్రాణులకు కూడ బ్రతుకు దెరువును కల్పించి, సత్పురుషుల ధర్మమును రక్షించెను. ఆయన ఏ ప్రయోజనము కొరకై ఈ లోకములో అవతరించినాడో, అట్టి ఈశ్వరాదేశమును పూర్ణముగా సంపన్నము చేసెను. ఆయన భూమిని తన కుమార్తెగా స్వీకరించియుండెను. ఆయన తనను విడిచిపెట్టుచున్నాడనే దుఃఖముతో భూమి ఏడ్చుచున్నదా యన్నట్లుండెను. ఆయన ఆ భూమిని తన కొడుకులకు అప్పజెప్పి, తాను భార్యతో గూడి తపస్సును చేయుటకై అడవికి వెళ్లెను. ఆయన అనుచరులు లేకుండగా వెళ్లిపోవుచుండగా, ప్రజలు విశేషముగా దుఃఖించిరి.

తత్రాప్యదాభ్యనియమో వైఖానససుసంమతే ।
ఆరబ్ధ ఉగ్రతపసి యథా స్వవిజయే పురా ॥ 4

తత్ర అపి - ఆ తపోవనమునందు కూడ, అదాభ్యనియమః - చెడగొట్టబడని నియమములు గల పృథువు, పురా - పూర్వము, స్వవిజయే యథా - తన విజయయాత్రయందు వలె, వైఖానససుసంమతే - వానప్రస్థులకు మిక్కిలి అభీష్టమైన, ఉగ్రతపసి - తీవ్రమగు తపస్సునందు, ఆరబ్ధః - ప్రవర్తిల్లినాడు.

పృథువు ఆ తపోవనములో తన నియమములు చెడిపోకుండా జాగ్రత్త వహిస్తూ, వానప్రస్థులకు మిక్కిలి అభీష్టమైన తీవ్రమగు తపస్సును చేయుటకారంభించెను. ఆయన ఒకప్పుడు పృథివిని జయించుటయందు ఎట్టి ప్రయత్నమును చేసెనో, ఇప్పుడు తపస్సునందు కూడ అట్టి పట్టుదలనే కలిగియుండెను.

కందమూలఫలాహారశ్శుష్కపర్ణాశనః క్వచిత్ ।
అబ్భక్షః కతిచిత్పక్షాన్ వాయుభక్షస్తతః పరమ్ ॥ 5

కందమూలఫల-ఆహారః - దుంపలు వ్రేళ్లు పళ్లు ఆహారముగా గలవాడై, క్వచిత్ - ఒకప్పుడు, శుష్కపర్ణ-అశనః - ఎండుటాకులను తిను వాడై, కతిచిత్ - కొన్ని, పక్షాన్ - పక్షములను, అప్-భక్షః - నీటిని మాత్రమే త్రాగువాడై, తతః పరమ్ - ఆ తరువాత, వాయుభక్షః - గాలి మాత్రమే ఆహారముగా గలవాడై (తపస్సును చేసెను).

ఆ పృథువు దుంపలను, వ్రేళ్లను, పళ్లను తిని తపస్సును చేయు చుండెను. ఒకప్పుడు ఆతడు ఎండుటాకులను మాత్రమే తినెడివాడు. కొన్ని పక్షములు ఆయన నీటిని మాత్రమే త్రాగి, ఆ తరువాత గాలి మాత్రమే ఆహారముగా గలవాడై తపస్సును కొనసాగించెను.

గ్రీష్మే పంచతపా వీరో వర్షాస్వాసారషాణ్మునిః ।
ఆకంఠమగ్నశ్శిశిర ఉదకే స్థండిలేశయః ।। 6

వీరః - వీరుడు, మునిః - మననశీలుడు (వానప్రస్థుడు) అగు పృథువు, గ్రీష్మే - వేసవియందు, పంచతపాః - అయిదు అగ్నుల తాపము గలవాడై, వర్షాసు - వర్షములయందు, ఆసారషాట్ - వర్షధారలను సహించువాడై, శిశిరే - శిశిర ఋతువునందు, ఉదకే - నీటియందు, ఆకంఠమగ్నః - కంఠము వరకు మునిగినవాడై, స్థండిలేశయః - నేలపై పరుండు వాడు.

వీరుడగు (మననశీలి అగు) ఆ పృథువు వానప్రస్థుడై వేసవియందు అయిదు అగ్నుల (నాలుగు దిక్కులలో మంటలు, పైన సూర్యుడు) తాపమును సహిస్తూ, వర్షాకాలములో వర్షపు ధారలను సహిస్తూ, చలికాలమునందు కంఠము వరకు నీటిలో నిలబడి, తపస్సును చేసెను. ఆయన ఆ కాలములో నేలపై పరుండెడివాడు.

తితిక్షుర్యతవాగ్దాంత ఊర్ధ్వరేతా జితానిలః ।
ఆరిరాధయిషుః కృష్ణమచరత్తప ఉత్తమమ్ ।। 7

తితిక్షుః - సహనము గలవాడు, యతవాక్ - నియంత్రితమైన వాక్కు గలవాడు, దాంతః - ఇంద్రియనిగ్రహము గలవాడు, ఊర్ధ్వరేతాః -

బ్రహ్మచారి, జిత-అనిలః - ప్రాణాయామమును చేయువాడు, కృష్ణమ్ - శ్రీకృష్ణుని, ఆరిరాధయిషుః - ఆరాధించ గోరువాడై, ఉత్తమమ్ - ఉత్తమమగు, తపః - తపస్సును, అచరత్ - చేసెను.

ఇంద్రియనిగ్రహము గల పృథువు శీతోష్ణాది ద్వంద్వములను సహిస్తూ వాగింద్రియముపై నియంత్రణను కలిగియుండెను. ఆయన బ్రహ్మచర్యమును పాటిస్తూ ప్రాణాయామమునభ్యసించెను. ఆయన శ్రీకృష్ణుని ఆరాధించ గోరువాడై ఉత్తమమగు తపస్సును చేసెను.

తేన క్రమానుసిద్ధేన ధ్వస్తకర్మామలాశయః ।
ప్రాణాయామైస్సంనిరుద్ధషడ్వర్గశ్ఛిన్నబంధనః ॥ 8

క్రమ-అనుసిద్ధేన - క్రమముగా మెల్లగా పరిపక్వమైన, తేన - ఆ తపస్సుచే, ధ్వస్తకర్మమల-ఆశయః - నష్టమైన కర్మవాసనలు గలవాడు మరియు పవిత్రమగు అంతఃకరణము గలవాడు, ప్రాణాయామైః - ప్రాణాయామములచే, సంనిరుద్ధషట్-వర్గః - చక్కగా నిరోధించబడిన ఆరు ఇంద్రియముల సముదాయము గలవాడు, ఛిన్నబంధనః - ఛేదించబడిన అజ్ఞానబంధము గలవాడు.

ఆ పృథువుయొక్క తపస్సు క్రమముగా మెల్లగా పరిపక్వమై, ఆతని కర్మవాసనలన్నియు నశించి, అంతఃకరణము పరిశుద్ధమయ్యెను. ఆతడు ప్రాణాయామమును అభ్యసించి, కన్ను ముక్కు చెవి నాలుక చర్మము అనే అయిదు జ్ఞానేంద్రియములను మరియు మనస్సు అనే అంతరింద్రియమును చక్కగా నియంత్రించెను. ఈ విధముగా ఆతడు సంసారబంధమునుండి విముక్తుడయ్యెను.

సనత్కుమారో భగవాన్ యదాహాధ్యాత్మికం పరమ్ ।
యోగం తేనైవ పురుషమభజత్పురుషర్షభః ॥ 9

భగవాన్ - పూజ్యుడగు, సనత్కుమారః - సనత్కుమారుడు, పరమ్ - సర్వశ్రేష్ఠమైనది, ఆధ్యాత్మికమ్ - అంతర్ముఖ రూపములోనుండునది అగు, యత్ - ఏ, యోగమ్ - ఈశ్వరుని పొందే ఉపాయమును, ఆహ

- చెప్పెనో, పురుష-ఋషభః - మానవులలో శ్రేష్ఠుడగు పృథువు, తేన ఏవ - ఆ యోగము చేతనే, పురుషమ్ - పురుషోత్తముని, అభజత్ - సేవించెను.

సనత్కుమార భగవానుడు పృథువునకు సర్వశ్రేష్ఠమగు అధ్యాత్మ యోగమును బోధించెను. ఈ యోగములో సాధకుడు అంతర్ముఖుడై ఆత్మరూపముగా ఈశ్వరుని దర్శించును. మనుజశ్రేష్ఠుడగు పృథువు ఈ యోగము చేతనే ఆ పురుషోత్తముని సేవించెను.

భగవద్ధర్మిణస్సాధోశ్శ్రద్ధయా యతతస్సదా ।
భక్తిర్భగవతి బ్రహ్మణ్యనన్యవిషయాఽభవత్ ॥ 10

భగవత్-ధర్మిణః - భగవదారాధనము అనే ధర్మము కలిగినట్టియు, సాధోః - సత్పురుషుడైనట్టియు, సదా - అన్ని కాలములలో, శ్రద్ధయా - శ్రద్ధతో, యతతః - సాధన చేయుచున్న పృథువునకు, బ్రహ్మణి - పరబ్రహ్మ స్వరూపుడగు, భగవతి - శ్రీహరి భగవానునియందు, అనన్య విషయా - ఇతర విషయములు లేని, భక్తిః - భక్తి, అభవత్ - కలిగెను.

సత్పురుషుడగు పృథువు అన్ని కాలములలో శ్రద్ధతో భగవానుని ఆరాధనయే ధర్మముగా గలవాడై సాధన చేసెను. అపుడాయనకు పర బ్రహ్మ స్వరూపుడగు శ్రీహరి భగవానునియందు ఇతరములగు సాంసారిక విషయముల ప్రసక్తి లేని భక్తి ఉదయించెను.

తస్యానయా భగవతః పరికర్మశుద్ధ-
సత్త్వాత్మనస్తదనుసంస్మరణానుపూర్త్యా ।
జ్ఞానం విరక్తిమదభూన్నిశితేన యేన
చిచ్ఛేద సంశయపదం నిజజీవకోశమ్ ॥ 11

భగవతః - భగవానుని, పరికర్మశుద్ధసత్త్వ-ఆత్మనః - ఆరాధనచే శుద్ధమైన సత్త్వగుణము ప్రముఖముగానుండే అంతఃకరణము గల, తస్య - ఆ పృథువునకు, తత్-అనుసంస్మరణ-అనుపూర్త్యా - ఆ భగవానుని నిరంతరమగు స్మరణముచే వర్ధిల్లిన, అనయా - ఈ భక్తిచే, విరక్తిమత్ - వైరాగ్య

ముతో కూడిన, జ్ఞానమ్ - జ్ఞానము, అభూత్ - కలిగెను, నిశితేన - తీక్ష్ణ మగు, యేన - ఏ జ్ఞానముచే, సంశయపదమ్ - సంశయములకు ఆశ్రయ మగు, నిజజీవకోశమ్ - తన జీవపరిచ్ఛేదమును, చిచ్ఛేద - ఛేదించెనో.

భగవత్సేవచే పృథువుయొక్క అంతఃకరణము శుద్ధమగు సత్త్వగుణము ప్రముఖముగా గలది ఆయెను. ఆయన ఆ భగవానుని నిరంతరముగా స్మరించుటచే భక్తి వర్ధిల్లెను. ఆ భక్తిచే వైరాగ్యము, ఆత్మజ్ఞానము కలిగెను. ఆ తీక్ష్ణమగు జ్ఞానముచే ఆయన తాను దేహము, ప్రాణము, మనస్సు, బుద్ధి, అహంకారము అనే భ్రాంతధారణల రూపములోనుండే సంసారబంధమును ఛేదించెను. ఆయనకు గల సంశయములన్నియు పటాపంచలయ్యెను. ఈ సంశయములు తాను జీవుడనే భ్రాంతధారణను ఆశ్రయించి ఉండునవి మాత్రమే.

ఛిన్నాన్యధీరధిగతాత్మగతిర్నిరీహః
తత్తత్యజేఽచ్ఛినదిదం వయునేన యేన ।
తావన్న యోగగతిభిర్యతిరప్రమత్తో
యావద్గదాగ్రజకథాసు రతిం న కుర్యాత్ ॥ 12

ఛిన్న-అన్యధీః - నశించిన భేదబుద్ధి గలవాడు, అధిగత-ఆత్మగతిః - తెలియబడిన ఆత్మతత్త్వము గలవాడు, నిరీహః - కామనలు లేనివాడు అగు పృథువు, తత్ - దానిని, తత్యజే - విడిచిపెట్టెను, యేన - ఏ, వయునేన - జ్ఞానముచే, ఇదమ్ - ఈ జీవభావమును, అచ్ఛినత్ - ఛేదించెనో, యతిః - యతనశీలుడగు సాధకుడు, యోగగతిభిః - యోగసిద్ధులచే, అప్రమత్తః - ప్రమత్తుడు కానివాడు, తావత్ - అంతవరకు, న - కాడు, యావత్ - ఎంతవరకైతే, గదాగ్రజకథాసు - శ్రీహరియొక్క గాథలయందు, రతిమ్ - ప్రేమను, న కుర్యాత్ - చేయకుండునో.

ఆత్మతత్త్వమును తెలియుట తోడనే పృథువునకు భేదబుద్ధి నశించి, కామనలు తొలగిపోయెను. అపుడాతడు జీవభావమును ఛేదించే జ్ఞానమును కలిగించిన ఆ అధ్యాత్మయోగమును కూడ విడిచిపెట్టెను. యతనశీలుడగు సాధకుడు తనకు శ్రీహరి గాథలయందు ప్రీతి కలుగునంతవరకు,

యోగసిద్ధులయందు ఆసక్తిని విడనాడలేదు. పృథువునకు అట్టి ప్రీతి కలుగుటచే, యోగసిద్ధులయందు ఆసక్తి కలుగలేదు.

ఏవం స వీరప్రవరస్సంయోజ్యాత్మానమాత్మని ।
బ్రహ్మభూతో దృఢం కాలే తత్యాజ స్వం కలేవరమ్ ॥ 13

వీరప్రవరః - వీరులలో ఉత్తముడగు, సః - ఆ పృథువు, ఏవమ్ - ఈ విధముగా, ఆత్మానమ్ - బుద్ధిని, ఆత్మని - ఆత్మస్వరూపమునందు, సంయోజ్య - విలీనము చేసి, బ్రహ్మభూతః - పరబ్రహ్మమై, కాలే - సమయమునందు, దృఢమ్ - దృఢమగు, స్వమ్ - తనదైన, కలేవరమ్ - దేహమును, తత్యాజ - విడిచిపెట్టెను.

వీరులలో ఉత్తముడగు ఆ పృథువు ఈ విధముగా తన బుద్ధిని ఆత్మస్వరూపమునందు నిలిపి, బ్రహ్మీభూతుడాయెను. సమయము వచ్చినప్పుడు ఆయన దృఢమగు దేహమును విడిచిపెట్టెను.

సంపీడ్య పాయుం పార్ష్ణిభ్యాం వాయుముత్సారయన్ శనైః।
నాభ్యాం కోష్ఠేష్వవస్థాప్య హృదురః కంఠశీర్షణి ॥ 14

ఉత్సర్పయంస్తు తం మూర్ధ్ని క్రమేణావేశ్య నిస్స్పృహః ।
వాయుం వాయౌ క్షితౌ కాయం తేజస్తేజస్యయూయుజత్॥15

పాయుమ్ - విసర్జనేంద్రియమును, పార్ష్ణిభ్యామ్ - మడమలతో, సంపీడ్య - గట్టిగా నొక్కిపెట్టి, వాయుమ్ - ప్రాణశక్తిని, శనైః - మెల్లగా, ఉత్సారయన్ - పైకి లేవదీయుచున్నవాడై, నాభ్యామ్ - నాభియందు, (కోష్ఠేషు - ప్రేవులయందు), హృత్-ఉరఃకంఠశీర్షణి - హృదయము వక్షఃస్థలము కంఠము తల అనే, కోష్ఠేషు - స్థానములయందు, అవస్థాప్య - నిలబెట్టి, తమ్ - ఆ వాయువును, క్రమేణ - క్రమముగా, ఉత్-సర్పయన్ - పైకి ప్రసరింప జేయుచున్నవాడై, మూర్ధ్ని - బ్రహ్మరంధ్రమునందు, ఆవేశ్య - ప్రవేశపెట్టి, నిః-స్పృహః - తొలగిన కామనలు గలవాడై, వాయుమ్ - వాయువును, వాయౌ - వాయువునందు, కాయమ్ - శరీర

మును, క్షితౌ - పృథివియందు, తేజః - వేడిని, తేజసి - అగ్నియందు. అయూయుజత్ - కలిపి వేసెను.

ఆతడు కాలి మడమలతో విసర్జనేంద్రియమును గట్టిగా నొక్కిపెట్టి (మూలబంధము), ప్రాణశక్తిని మెల్లగా పైకి లేవదీయుచూ, ప్రేగులు (స్వాధిష్ఠాన చక్రము), బొడ్డు (మణిపూరము), వక్షఃస్థలము (అనాహతము), కంఠము క్రింది భాగము (విశుద్ధి), కంఠము, కనుబొమల నడుమ (ఆజ్ఞా చక్రము) అనే స్థానములయందు వరుసగా నిలిపి, దానిని క్రమముగా పైకి ప్రసరింప జేసి, శిరస్సునందలి బ్రహ్మరంధ్రమునందు ప్రవేశపెట్టెను. కామనలు లేని ఆ పృథువు అప్పుడు తన శరీరరూపములోనున్న పృథివి, అగ్ని, వాయువులను సమష్టి పృథివి, అగ్ని, వాయువులతో కలిపి వేసెను. అనగా, దేహాభిమానమును త్యజించెను.

ఖాన్యాకాశే ద్రవం తోయే యథాస్థానం విభాగశః ।
క్షితిమంభసి తత్తేజస్యదో వాయుం నభస్యముమ్ ॥ 16

ఇంద్రియేషు మనస్తాని తన్మాత్రేషు యథోద్భవమ్ ।
భూతాదినాఽమూన్యుత్క్షిప్య మహత్యాత్మని సందధే ॥ 17

ఖాని - ఇంద్రియములను, ఆకాశే - ఆకాశమునందు, ద్రవమ్ - ద్రవపదార్థమును, తోయే - నీటియందు, యథాస్థానమ్ - స్థానమునతిక్రమించకుండగా, విభాగశః - విడివిడిగా (కలిపి వేసెను), క్షితిమ్ - పృథివిని, అంభసి - జలమునందు, తత్ - దానిని, తేజసి - అగ్నియందు, అదః - దీనిని, అముమ్ - ఈ, వాయుమ్ - వాయువును, నభసి - ఆకాశమునందు, మనః - మనస్సును, ఇంద్రియేషు - ఇంద్రియములయందు, తాని - వాటిని, తన్మాత్రేషు - సూక్ష్మ పంచభూతములయందు, యథా-ఉద్భవమ్ - పుట్టిన తీరును అతిక్రమించకుండగా, అమూని - వీటిని, భూత-ఆదినా - పంచభూతములకు కారణమగు అహంకారముతో, ఉత్క్షిప్య - విలీనము చేసి, మహతి ఆత్మని - మహత్తత్త్వమునందు, సందధే - సంధానించెను.

ఆతడు ఇంద్రియముల (వివరముల) ను మహాకాశమునందు, శరీరములోని ద్రవపదార్థమును మహాజలమునందు, ఈ విధముగా శరీర

మును నిర్మించిన పంచభూతములను స్థానము తప్పకుండగా మహాభూత ములయందు కలిపి వేసెను. మరియు, ఆయన తత్త్వములు ఏ క్రమ ములో పుట్టినవో, దానికి విపరీతక్రమములో వాటిని విలీనము చేసెను. ఆ విధముగా పృథివిని జలమునందు, జలమును అగ్నియందు, అగ్నిని వాయువునందు, వాయువును ఆకాశమునందు విలీనము చేసెను. మన స్సును ఇంద్రియములయందు, ఇంద్రియములను పంచ సూక్ష్మభూతము లయందు, వాటిని భూతాది అనబడే అహంకారమునందు, దానిని మహత్త త్త్వమునందు విలీనము చేసెను.

తం సర్వగుణవిన్యాసం జీవే మాయామయే న్యధాత్ ।
తం చానుశయమాత్మస్థమసావనుశయీ పుమాన్ ।
జ్ఞానవైరాగ్యవీర్యేణ స్వరూపస్థోఽజహాత్ప్రభుః ।। 18

సర్వగుణవిన్యాసమ్ - అన్ని గుణకార్యములకు ఆశ్రయమైన, తమ్ - ఆ మహత్తత్త్వమును, మాయామయే - మాయయే ఉపాధిగా గల, జీవే - జీవునియందు, న్యధాత్ - ఉంచెను, అసౌ - ఈ, అనుశయీ - ఉపాధి యందు అభిమానము గల, పుమాన్ - జీవభావాపన్నుడైన, ప్రభుః - పృథు ప్రభుడు, జ్ఞానవైరాగ్యవీర్యేణ - జ్ఞానవైరాగ్యముల ప్రభావముచే, స్వరూపస్థః - స్వరూపమునందున్నవాడై, తమ్ - ఆ, అనుశయం చ - లింగ శరీరోపాధిని కూడ, అజహాత్ - విడిచిపెట్టెను.

సత్త్వరజస్తమోగుణముల కార్యములన్నింటికీ ఆశ్రయమగు ఆ మహత్తత్త్వమును మాయోపాధికుడగు జీవునియందు విలీనము చేసెను. లింగశరీరోపాధియందు అభిమానముచే జీవభావాపన్నుడై యున్న పృథు మహారాజు జ్ఞానవైరాగ్యముల ప్రభావముచే స్వస్వరూపమునందున్నవాడై, ఆ లింగశరీరోపాధిని కూడ విడిచిపెట్టెను.

అర్చిర్నామ మహారాజ్ఞీ తత్పత్న్యనుగతా వనమ్ ।
సుకుమార్యతదర్హా చ యత్పద్భ్యాం స్పర్శనం భువః ।। 19

తత్-పత్నీ - ఆ పృథువుయొక్క భార్య, అర్చిః నామ - అర్చిస్సు అని ప్రసిద్ధిని గాంచినది, సుకుమారీ - సుకుమారి, పద్భ్యామ్ - పాదముల

తో, భువః - నేలయొక్క, స్పర్శనం యత్ - స్పృశించుట యేది గలదో, అతదర్హా - దానికి కూడ తగనిది అగు, మహారాజ్ఞీ చ - మహారాణి కూడ, వనమ్ - అడవిని గురించి, అనుగతా - అనుసరించి వెళ్లెను.

పృథువుయొక్క భార్య అర్చిస్సు అని ప్రసిద్ధిని గాంచిన మహారాణి. ఆమె నేలపై అడుగు పెట్టలేనంతటి సుకుమారి. ఆమె కూడ ఆయన వెంట అడవికి వెళ్లెను.

అతీవ భర్తుర్వ్రతధర్మనిష్ఠయా
  శుశ్రూషయా చారషదేహయాత్రయా ।
నావిందతార్తిం పరికర్శితాఽపి సా
  ప్రేయస్కరస్పర్శనమాననిర్వృతిః ॥ 20

భర్తుః - భర్తయగు పృథువుయొక్క, వ్రతధర్మనిష్ఠయా - వ్రతములయందు ధర్మానుష్ఠానమునందు ఉన్న తత్పరతచే, శుశ్రూషయా - భర్తయొక్క సేవచే, చ - మరియు, ఆరషదేహయాత్రయా - మహర్షులకు సంబంధించిన ఆహారవ్యవహారములచే, అతీవ - మిక్కిలి, పరికర్శితా అపి - అన్ని విధములుగా కృశించియున్ననూ, సా - ఆమె, ప్రేయః-కరస్పర్శనమాననిర్వృతిః - ప్రియునియొక్క చేతితో స్పృశించుట మరియు సత్కరించుటచే గొప్ప ఆనందము గలదియై, ఆర్తిమ్ - దుఃఖమును, న అవిందత - పొందలేదు.

భర్తయగు పృథువు వ్రతనిష్ఠతో ధర్మము నాచరించుచుండగా ఆ అర్చిస్సు ఆయనకు సేవను చేస్తూ, మహర్షులకు సహజమైన ఆహారవ్యవహారములతో అన్ని విధములుగా చిక్కిపోయెను. అయినప్పటికీ, ఆమె ప్రియుడగు పృథువు తనను చేతితో స్పృశించి సత్కరించుటచే గొప్ప ఆనందమునే పొందినదే గాని, దుఃఖమునునుభవించలేదు.

దేహం విపన్నాఖిలచేతనాదికం
  పత్యుః పృథివ్యా దయితస్య చాత్మనః ।

ఆలక్ష్య కించిచ్చ విలప్య సా సతీ
చితామథారోపయదద్రిసానుని ॥ 21

సతీ - పతివ్రతయగు, సా - ఆ అర్చిస్సు, పృథివ్యాః - భూదేవికి, పత్యుః - పాలకుడైనట్టియు, ఆత్మనః - తనకు, దయితస్య - ప్రియుడైన పృథువుయొక్క, విపన్న-అఖిలచేతన-ఆదికమ్ - వినష్టమైన అన్ని ప్రాణ వ్యాపారములు మొదలగునవి గల, దేహమ్ - దేహమును, ఆలక్ష్య - చూచి, కించిత్ చ - కొంచెము, విలప్య - ఏడ్చి, అథ - అప్పుడు, అద్రిసానుని - కొండ చరియయందు, చితామ్ - చితిని, ఆరోపయత్ - అధిరోహింప జేసెను.

పతివ్రతయగు ఆ అర్చిస్సు తనకు ప్రియుడైన పృథు మహారాజుయొక్క దేహమును చూచెను. ఆ దేహములో ప్రాణవ్యాపారములన్నియు తొలగిపోయెను. ఆమె అప్పుడు కొద్దిగా ఏడ్చి, కొండ చరియపై ఏర్పాటైన చితియందు ఆ దేహమును అధిరోహింప జేసెను.

విధాయ కృత్యం హ్రదినీజలాప్లుతా
దత్త్వోదకం భర్తురుదారకర్మణః ।
నత్వా దివిస్థాంస్త్రిదశాంస్త్రిః పరీత్య
వివేశ వహ్నిం ధ్యాయతీ భర్తృపాదౌ ॥ 22

కృత్యమ్ - కర్మను, విధాయ - చేసి, హ్రదినీజల-ఆప్లుతా - నదియందలి నీటితో స్నానమును చేసినదై, ఉదారకర్మణః - గొప్ప ప్రజాకార్యములు గల, భర్తుః - భర్తకు, ఉదకం దత్త్వా - జలదానకర్మను చేసి, దివిస్థాన్ - స్వర్గమునందుండే, త్రిదశాన్ - దేవతలను, నత్వా - నమస్కరించి, త్రిః - మూడు సార్లు, పరీత్య - ప్రదక్షిణము చేసి, భర్తృపాదౌ - భర్తయొక్క పాదములను, ధ్యాయతీ - ధ్యానించుచున్నదై, వహ్నిమ్ - అగ్నిని, వివేశ - ప్రవేశించెను.

ఆమె దహనకర్మను చేసి, నదిలో స్నానమును చేసి, గొప్ప ప్రజా కార్యములను చేసిన తన పెనిమిటికి జలదానకర్మను చేసి, స్వర్గవాసులగు

దేవతలకు నమస్కరించి, మూడు సార్లు ప్రదక్షిణము చేసి, భర్త పాదములనే స్మరించుచున్నదై, అగ్నిలో ప్రవేశించెను.

విలోక్యానుగతాం సాధ్వీం పృథుం వీరవరం పతిమ్ ।
తుష్టువుర్వరదా దేవైర్దేవపత్న్యస్సహస్రశః ॥ 23

వీరవరమ్ - వీరులలో ఉత్తముడైనట్టియు, పతిమ్ - తన భర్తయగు, పృథుమ్ - పృథువును, అనుగతామ్ - అనుసరించి వెళ్లిన, సాధ్వీమ్ - పతివ్రతయగు అర్చిస్సును, దేవైః - దేవతలతో బాటు, సహస్రశః - వేల సంఖ్యలో, విలోక్య - చూచి, వరదాః - వరములనిచ్చే, దేవపత్న్యః - దేవతల భార్యలు, తుష్టువుః - కొనియాడిరి.

వీరులలో ఉత్తముడగు భర్తను అనుసరించి వెళ్లిపోయిన ఆ పతివ్రతను దేవతల భార్యలు తమ భర్తలతో గూడి వేల సంఖ్యలో దర్శించిరి. వరములనిచ్చే ఆ దేవతల పత్నులు భర్తలతో సహా ఆమెను ప్రశంసించిరి.

కుర్వత్యః కుసుమాసారం తస్మిన్మందరసానుని ।
నదత్స్వమరతూర్యేషు గృణంతి స్మ పరస్పరమ్ ॥ 24

అమరతూర్యేషు - దేవదుందుభులు, నదత్సు - మ్రోగుచుండగా, తస్మిన్ - ఆ, మందరసానుని - మందరపర్వతముయొక్క చరియయందు, కుసుమ-ఆసారమ్ - పుష్పవృష్టిని, కుర్వత్యః - చేయుచున్నవారై, పరస్పరమ్ - ఒకరితో నొకరు, గృణంతి స్మ - పలికిరి.

వారు దేవదుందుభులు మ్రోగుచుండగా ఆ మందరపర్వతముయొక్క చరియపై పుష్పవర్షమును కురిపించిరి. మరియు వారిలో వారు ఇట్లు చెప్పుకొనిరి.

దేవ్య ఊచుః ।
అహో ఇయం వధూర్ధన్యా యా చైవం భూభుజాం పతిమ్ ।
సర్వాత్మనా పతిం భేజే యజ్ఞేశం శ్రీర్వధూరివ ॥ 25

అహో - ఆశ్చర్యము!, ఇయమ్ - ఈ, వధూః - పతివ్రత, ధన్యా - ధన్యురాలు, యా - ఎవతె, భూభుజామ్ - రాజులకు, పతిమ్ - ప్రభుడగు, పతిమ్ - భర్తను, యజ్ఞేశమ్ - యజ్ఞేశ్వరుడగు శ్రీహరిని, వధూః - పతివ్రత యగు, శ్రీః ఇవ - లక్ష్మీదేవి వలె, ఏవమ్ - ఈ విధముగా, సర్వ-ఆత్మనా - అన్ని విధములుగా, భేజే - సేవించెనో.

దేవపత్నులు ఇట్లు పలికిరి --- ఆశ్చర్యము! ఈ పతివ్రత ధన్యురాలు. ఈమె భర్తయగు పృథువు రాజాధిరాజు. పతివ్రతయగు లక్ష్మీదేవి యజ్ఞేశ్వరుడగు శ్రీహరిని వలె, ఈమె తన భర్తను ఈ తీరున సకలవిధములుగా (మనోవాక్కాయములతో) సేవించినది.

సైషా నూనం వ్రజత్యూర్ధ్వమను వైన్యం పతిం సతీ ।
పశ్యతాస్మానతీత్యార్చిర్దుర్విభావ్యేన కర్మణా ॥ 26

సా - అట్టి, ఏషా - ఈ, సతీ - పతివ్రతయగు, అర్చిః - అర్చిస్సు, నూనమ్ - నిశ్చయముగా, పతిమ్ - భర్తయైనట్టియు, వైన్యమ్ - వేనపుత్రుడగు పృథువును, అను - అనుసరించి, దుర్విభావ్యేన - ఊహించ శక్యము కాని, కర్మణా - కర్మచే, అస్మాన్ - మనలను, అతీత్య - అతిక్రమించి, ఊర్ధ్వమ్ - పైకి, వ్రజతి - వెళ్ళుచున్నది, పశ్యత - చూడుడు.

చూడుడు! పతివ్రతయగు ఈ అర్చిస్సు ఊహించ శక్యము కాని పతిసేవారూపమగు కర్మచే తన భర్త, వేనపుత్రుడు అగు పృథువును అనుసరిస్తూ మనలను దాటుకొని నిశ్చయముగా పై లోకములకు వెళ్ళుచున్నది.

తేషాం దురాపం కిం త్వన్యన్మర్త్యానాం భగవత్పదమ్ ।
భువి లోలాయుషో యే వై నైష్కర్మ్యం సాధయంత్యుత॥27

భువి - భూలోకమునందు, తేషామ్ - అట్టి, మర్త్యానామ్ - మానవులకు, దురాపమ్ - పొంద శక్యము కానిది, అన్యత్ - మరియొకటి, కిం తు - ఏమి గలదు?, లోల-ఆయుషః - అల్పమగు ఆయుర్దాయము గల, యే వై - ఏ మానవులు, భగవత్-పదమ్ - భగవానుడు పొందబడే, నైష్కర్మ్యమ్ - ఆత్మజ్ఞానమును, సాధయంతి ఉత - సంపాదించుచున్నారో.

భూలోకములో మానవులు అల్పమగు ఆయుర్దాయము గలవారే అయిననూ, ఆత్మ అకర్త అని తెలుసుకొని నివృత్తి ధర్మ పరాయణులై ఈశ్వరునిలో ఐక్యమగుచున్నారు. అట్టి మానవులు సాధించ లేనిది మరి యొకటి ఏమి ఉండును?

స వంచితో బతాత్మధృక్ కృచ్ఛ్రేణ మహతా భువి ।
లబ్ధ్వాఽపవర్గ్యం మానుష్యం విషయేషు విషజ్జతే ॥ 28

బత - అయ్యో!, మహతా - పెద్ద, కృచ్ఛ్రేణ - కష్టముచే, భువి - భూలోకమునందు, అపవర్గ్యమ్ - మోక్షసాధనమగు, మానుష్యమ్ - మనుష్యజన్మను, లబ్ధ్వా - పొంది, విషయేషు - ఇంద్రియ భోగములయందు, విషజ్జతే - విశేషమగు ఆసక్తిని కలిగియున్నాడు, సః - వాడు, వంచితః - మోసగించబడినాడు, ఆత్మధ్రుక్ - తనకు తానే ద్రోహము చేసుకున్నవాడు.

అయ్యో! ఎవడైతే మోక్షమునీయగలిగే మనుష్యజన్మను భూలోకములో పెద్ద కష్టము మీద పొందియు, ఇంద్రియ భోగములయందు తగుల్కొనినాడో, వాడు వాటిచే వంచితుడై, తనకు తానే ద్రోహమును చేసుకొనుచున్నాడు.

మైత్రేయ ఉవాచ ।
స్తువంతీష్వమరస్త్రీషు పతిలోకం గతా వధూః ।
యం వా ఆత్మవిదాం ధుర్యో వైన్యః ప్రాపాచ్యుతాశయః ॥29

అమరస్త్రీషు - దేవస్త్రీలు, స్తువంతీషు - స్తుతించుచుండగా, వధూః - ఆ పతివ్రత, పతిలోకమ్ - భర్తయొక్క లోకమును, గతా - పొందెను, ఆత్మవిదామ్ - ఆత్మవేత్తలలో, ధుర్యః - అగ్రేసరుడు, అచ్యుత-ఆశయః - శ్రీహరియందే మనస్సు గలవాడు, వైన్యః - వేనపుత్రుడు అగు పృథువు, యం వై - దేనినైతే, ప్రాప - పొందెనో.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- దేవస్త్రీలు ఈ విధముగా స్తుతించుచుండగా ఆ పతివ్రత భర్త పొందిన లోకమునే పొందెను. ఆత్మవేత్త

లలో అగ్రేసరుడు, అచ్యుతుడగు శ్రీహరిపై లగ్నమైన మనస్సు గలవాడు అగు పృథువు పొందిన ఉత్తమలోకమునే ఆమె కూడ పొందెను.

ఇత్థంభూతానుభావోఽసౌ పృథుస్స భగవత్తమః ।
కీర్తితం తస్య చరితముద్దామచరితస్య తే ॥ 30

భగవత్-తమః - అతిశయించిన ఐశ్వర్యము గల, సః - అట్టి, అసౌ - ఈ, పృథుః - పృథువు, ఇత్థంభూత-అనుభావః - ఇట్టి అలౌకికమగు ప్రభావము గలవాడు, ఉద్దామచరితస్య - శ్రేష్ఠమగు చరితము గల, తస్య - ఆయనయొక్క, చరితమ్ - చరితము, తే - నీ కొరకు, కీర్తితమ్ - కీర్తించబడినది.

అతిశయించిన ఐశ్వర్యము గల ఆ ఈ పృథువు ఇట్టి అలౌకికమగు ప్రభావము గలవాడు. ఆయనయొక్క శ్రేష్ఠమగు చరితమును నేను నీకు వివరముగా చెప్పితిని.

య ఇదం సుమహత్పుణ్యం శ్రద్ధయాఽవహితః పఠన్ ।
శ్రావయేచ్ఛృణుయాద్వాఽపి స పృథోః పదవీమియాత్ ॥ 31

సుమహత్ - చాల గొప్పది, పుణ్యమ్ - పవిత్రమైనది అగు, ఇదమ్ - ఈ చరితమును, యః - ఎవడైతే, అవహితః - సావధానుడై, శ్రద్ధయా - శ్రద్ధతో, పఠన్ - పఠించువాడై, శ్రావయేత్ - వినిపించునో, శృణుయాత్ వా - లేక వినునో, సః అపి - వాడు కూడ, పృథోః - పృథువు యొక్క, పదవీమ్ - లోకమును, ఇయాత్ - పొందును.

ఈ చరితము చాల గొప్పది, పవిత్రమైనది. దీనిని సావధానముగా శ్రద్ధతో పఠించువాడు, ఇతరులకు వినిపించువాడు మాత్రమే గాక, విను వాడు కూడ పృథువు పొందిన లోకమును పొందెదరు.

బ్రాహ్మణో బ్రహ్మవర్చస్వీ రాజన్యో జగతీపతిః ।
వైశ్యః పఠన్ విట్పతిస్స్యాచ్ఛూద్రస్సత్తమతామియాత్ ॥ 32

బ్రాహ్మణః - బ్రాహ్మణుడు, పఠన్ - పఠించువాడై, బ్రహ్మవర్చస్వీ - బ్రహ్మవర్చస్సు (వేదాధ్యయనముచే కలిగే తేజస్సు) గలవాడు, రాజన్యః - క్షత్రియుడు, జగతీపతిః - భూపతి, వైశ్యః - వైశ్యుడు, విట్-పతిః - వైశ్య ప్రభుడు, స్యాత్ - అగును, శూద్రః - శూద్రుడు, సత్తమతామ్ - ఉత్తము లలో అగ్రస్థానమును, ఇయాత్ - పొందును.

దీనిని పఠించు బ్రాహ్మణుడు బ్రహ్మవర్చస్సును పొందును. క్షత్రి యుడు భూపతి అగును. వైశ్యుడు వైశ్యప్రభుడు అగును. శూద్రుడు ఉత్త ములలో అగ్రేసరుడు అగును.

త్రిఃకృత్వ ఇదమాకర్ణ్య నరో నార్యథ వాఽఽదృతా ।
అప్రజస్సుప్రజతమో నిర్ధనో ధనవత్తమః ।
అస్పష్టకీర్తిస్సుయశా మూర్ఖో భవతి పండితః ॥ 33

నరః - పురుషుడు గాని, అథవా - లేక, నారీ - స్త్రీ గాని, ఆదృతా - శ్రద్ధ గలదియై, ఇదమ్ - దీనిని, త్రిఃకృత్వః - మూడు సార్లు, ఆకర్ణ్య - విని, అప్రజః - సంతానము లేనివాడు, సుప్రజతమః - మంచి సంతానము గలవారిలో అగ్రేసరుడు, నిర్ధనః - ధనము లేనివాడు, ధనవత్తమః - ధనము గలవారిలో అగ్రేసరుడు, అస్పష్టకీర్తిః - వ్యాపకము కాని కీర్తి గల వాడు, సుయశాః - మంచి కీర్తి గలవాడు, మూర్ఖః - మూర్ఖుడు, పండితః - పండితుడుగను, భవతి - అగును.

పురుషుడు గాని, స్త్రీ గాని దీనిని శ్రద్ధతో మూడు సార్లు విన్నచో, సంతానము లేనివారు మంచి సంతానము గలవారిలో శ్రేష్ఠులుగను, ధనము లేనివారు ధనవంతులలో అగ్రేసరులుగను, వ్యాపించని కీర్తి గల వాడు మంచి కీర్తి గలవాడుగను, మూర్ఖుడు పండితుడుగను అగుదురు.

ఇదం స్వస్త్యయనం పుంసామమంగల్యనివారణమ్ ।
ధన్యం యశస్యమాయుష్యం స్వర్గ్యం కలిమలాపహమ్ ॥34

ఇదమ్ - ఇది, స్వస్తి-అయనమ్ - మంగళములకు నిధానము, పుంసామ్ - మానవులకు, అమంగల్యనివారణమ్ - అమంగళములగు

దుఃఖము మొదలగువాటికి నివారించునది, ధన్యమ్ - ధనమునిచ్చునది, యశస్యమ్ - కీర్తినిచ్చునది, ఆయుష్యమ్ - ఆయుర్దాయమునిచ్చునది, స్వర్గ్యమ్ - స్వర్గమునిచ్చునది, కలిమల-అపహమ్ - కలిదోషములను పోగొట్టునది.

ఈ చరితము మానవులకు మంగళములకు నిధానము. ఇది అమంగళములగు దుఃఖాదులను నివారించి, ధనమును కీర్తిని ఆయుర్దాయమును ఇచ్చును. ఇది కలిదోషములను పోగొట్టి స్వర్గమునిచ్చును.

ధర్మార్థకామమోక్షాణాం సమ్యక్ సిద్ధిమభీప్సుభిః ।
శ్రద్ధయైతదనుశ్రావ్యం చతుర్ణాం కారణం పరమ్ ॥ 35

ధర్మ-అర్థకామమోక్షాణామ్ - ధర్మార్థకామమోక్షములనే పురుషార్థములయొక్క, సమ్యక్-సిద్ధిమ్ - చక్కని సంసిద్ధిని, అభీప్సుభిః - పొందగోరువారిచే, ఏతత్ - ఇది, శ్రద్ధయా - శ్రద్ధతో, అను - అనుదినము, శ్రావ్యమ్ - వినదగినది (అనుశ్రావ్యమ్ - పండితుడు చెప్పగా వినదగినది), చతుర్ణామ్ - నాలుగింటికి, పరమ్- సర్వోత్తమమగు, కారణమ్ - కారణము.

ధర్మార్థకామమోక్షములనే నాలుగు పురుషార్థములలో చక్కని సంసిద్ధిని కోరు మానవులు దీనిని శ్రద్ధతో అనుదినము పండితుడు చెప్పగా వినవలెను. ఈ నాలుగు పురుషార్థములను సిద్ధింప జేయు సాధనములలో ఇది సర్వోత్తమమైనది.

విజయాభిముఖో రాజా శ్రుత్వైతదభియాతి యాన్ ।
బలిం తస్మై హరంత్యగ్రే రాజానః పృథవే యథా ॥ 36

విజయ-అభిముఖః - విజయదిశలో ముందుకు వెళ్లే, రాజా - రాజు, ఏతత్ - దీనిని, శ్రుత్వా - విని, యాన్ - ఏ దేశములను, అభియాతి - అభిముఖముగా వెళ్లునో, రాజానః - ఆ దేశపు రాజులు, తస్మై - వాని కొరకు, పృథవే యథా - పృథువు కొరకు వలె, అగ్రే - ఎదుట, బలిమ్ - బహుమతిని (కప్పమును), హరంతి - తీసుకొని వచ్చెదరు.

పృథువు ఏ రాజ్యమునకు వెళ్లినా, ఆ రాజు బహుమతులతో ఆయనకు ఎదురేగెడివాడు. అదే విధముగా, విజయమార్గములో పయనించే రాజు ఈ గాథను శ్రవణము చేసి ముందుకు సాగినచో, ఆయా దేశపు రాజులు ఎదురు వచ్చి బహుమతులను (కప్పములను) సమర్పించెదరు.

ముక్తాన్యసంగో భగవత్యమలాం భక్తిముద్వహన్ ।
వైన్యస్య చరితం పుణ్యం శృణుయాచ్ఛ్రావయేత్పఠేత్ ॥37

ముక్త-అన్యసంగః - విడిచి పెట్టబడిన ఇతరవిషయములయందలి ఆసక్తి గలవాడై, భగవతి - భగవానునియందు, అమలామ్ - నిర్మలమగు, భక్తిమ్ - భక్తిని, ఉద్వహన్ - కలిగియున్నవాడై, పుణ్యమ్ - పవిత్రమగు, వైన్యస్య - వేనపుత్రుడగు పృథువుయొక్క, చరితమ్ - చరితమును, శృణుయాత్ - వినవలెను, శ్రావయేత్ - వినిపించవలెను, పఠేత్- పఠించవలెను.

సాధకుడు ఇతరవిషయములయందలి ఆసక్తిని విడిచిపెట్టి, భగవంతునియందు నిర్మలమగు (నిష్కామ) భక్తిని కలిగియున్నవాడై, వేనపుత్రుడగు పృథువుయొక్క పవిత్రమగు చరితమును వినవలెను, లేదా ఇతరులకు వినిపించవలెను, లేదా పఠించవలెను.

వైచిత్రవీర్యాభిహితం మహన్మాహాత్మ్యసూచకమ్ ।
అస్మిన్ కృతమతిర్మర్త్యః పార్థివీం గతిమాప్నుయాత్ ॥ 38

వైచిత్రవీర్య - విచిత్రవీర్యుని పుత్రుడవగు ఓ విదురా!, మహత్-మాహాత్మ్యసూచకమ్ - శ్రీహరియొక్క (మహాత్ములయొక్క) మహిమను సూచించే చరితము, అభిహితమ్ - చెప్పబడినది, అస్మిన్ - దీనియందు, కృతమతిః - నిలుపబడిన బుద్ధి గల, మర్త్యః - మానవుడు, పార్థివీమ్ - పృథువునకు సంబంధించిన, గతిమ్ - గతిని, ఆప్నుయాత్ - పొందును.

విచిత్రవీర్యుని పుత్రుడవగు ఓ విదురా! శ్రీహరియొక్క (మహాత్ములయొక్క) మహిమను సూచించే ఈ చరితమును నీకు చెప్పితిని. దీనియందు భక్తి గల మానవుడు పృథువు పొందిన ఉత్తమగతిని పొందును.

అనుదినమిదమాదరేణ శృణ్వన్
పృథుచరితం ప్రథయన్ విముక్తసంగః।
భగవతి భవసింధుపోతపాదే
స చ నిపుణాం లభతే రతిం మనుష్యః ॥ 39

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే చతుర్థస్కంధే పృథూపాఖ్యానే పృథోః పరమపదప్రాప్తివర్ణనం నామ త్రయోవింశో ऽధ్యాయః ॥

విముక్తసంగః - విడిచిపెట్టబడిన సంసారాసక్తి గల, సః - ఆ, మనుష్యః - మానవుడు, అనుదినమ్ - ప్రతిదినము, ఇదమ్ - ఈ, పృథుచరితమ్ - పృథుచరితమును, ఆదరేణ - ఆదరముతో, శృణ్వన్ - వినుచున్నవాడై, చ - మరియు, ప్రథయన్ - విస్తరింప జేయుచున్నవాడై, భవసింధుపోతపాదే - సంసారసముద్రమునకు నావయైన పాదము గల, భగవతి - భగవానునియందు, నిపుణామ్ - సర్వసమర్థమగు (దృఢమగు), రతిమ్ - ప్రేమను, లభతే - పొందును.

సాధకుడైన మానవుడు సంసారమునందలి ఆసక్తిని విడిచిపెట్టి, ప్రతిదినము ఈ పృథుచరితమును వింటూ, పది మందికి చెప్పుచున్నచో, వానికి భగవానునియందు దృఢమగు ప్రేమ (భక్తి) కలుగును. సంసారమనే సముద్రమును దాటుటకు భగవానుని పాదము నావ వంటిది. భగవానుని యందలి భక్తి భక్తునకు సర్వమును చేకూర్చే సామర్థ్యము గలది.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి నాల్గవ స్కంధములో
పృథూపాఖ్యానమునందు పృథువు పరమగతిని పొందుటను వర్ణించే
ఇరువది మూడవ అధ్యాయము ముగిసినది (23).

*****

# అథ చతుర్వింశోఽధ్యాయః

## రుద్రగీతము - రుద్రుడు ప్రచేతసులకు చేసిన ఉపదేశము

మైత్రేయ ఉవాచ ।
విజితాశ్వోఽధిరాజాఽఽసీత్పృథుపుత్రః పృథుశ్రవాః ।
యవీయోభ్యోఽదదాత్కాష్ఠా భ్రాతృభ్యో భ్రాతృవత్సలః ॥ 1

మైత్రేయః - మైత్రేయ మహర్షి, ఉవాచ - పలికెను, పృథుపుత్రః - పృథువుయొక్క పుత్రుడు, పృథుశ్రవాః - గొప్ప కీర్తి గలవాడు అగు, విజితాశ్వః - విజితాశ్వుడు, అధిరాజః - చక్రవర్తి, ఆసీత్ - ఆయెను, భ్రాతృవత్సలః - సోదరులయందు ప్రేమ గల ఆతడు, యవీయోభ్యః భ్రాతృభ్యః - తన తమ్ముళ్లకు, కాష్ఠాః - దిక్కులను, అదదాత్ - ఇచ్చెను.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- పృథువు తరువాత ఆయన పుత్రుడు, గొప్ప కీర్తి గలవాడు అగు విజితాశ్వుడు చక్రవర్తి ఆయెను. సోదరులయందు ప్రేమ గల ఆయన తన నలుగురు తమ్ముళ్లకు నాలుగు దిక్కులయందు అధికారమును అప్పజెప్పెను.

హర్యక్షాయాదిశత్ప్రాచీం ధూమ్రకేశాయ దక్షిణామ్ ।
ప్రతీచీం వృకసంజ్ఞాయ తుర్యాం ద్రవిణసే విభుః ॥ 2

విభుః - సర్వసమర్థుడగు విజితాశ్వుడు, హర్యక్షాయ - హర్యక్షుని కొరకు, ప్రాచీమ్ - తూర్పు దిక్కును, ధూమ్రకేశాయ - ధూమ్రకేశుని కొరకు, దక్షిణామ్ - దక్షిణ దిక్కును, వృకసంజ్ఞాయ - వృకుడను పేరు గలవానికి, ప్రతీచీమ్ - పశ్చిమ దిక్కును, ద్రవిణసే - ద్రవిణుని కొరకు, తుర్యామ్ - నాల్గవదియగు ఉత్తరదిక్కును, అదిశత్ - ఇచ్చెను.

సర్వసమర్థుడగు విజితాశ్వుడు తూర్పు దిక్కును హర్యక్షునకు, దక్షిణమును ధూమ్రకేశునకు, పడమరను వృకునకు, ఉత్తరమును ద్రవిణునకు ఇచ్చెను.

అంతర్ధానగతిం శక్రాల్లబ్ధ్వాంతర్ధానసంజ్ఞితః ।
అపత్యత్రయమాధత్త శిఖండిన్యాం సుసంమతమ్ ॥ 3

శక్రాత్ - ఇంద్రుని వలన, అంతర్ధానగతిమ్ - అంతర్ధానమయ్యే శక్తిని, లబ్ధ్వా - పొంది, అంతర్ధానసంజ్ఞితః - అంతర్ధానుడు అనే పేరు గలవాడై, శిఖండిన్యామ్ - శిఖండినియందు, సుసంమతమ్ - బాగా ఆదరించబడిన, అపత్యత్రయమ్ - ముగ్గురు సంతానమును, ఆధత్త - కనెను.

విజితాశ్వునకు ఇంద్రుడు అంతర్ధానమయ్యే శక్తిని ఇచ్చెను. దానిని బట్టి ఆయనకు అంతర్ధానుడు అని పేరు కలిగెను. ఆయనకు భార్యయగు శిఖండినియందు ముగ్గురు కొడుకులు కలిగిరి. వారందరు జనులచే బాగా ఆదరించబడిరి.

పావకః పవమానశ్చ శుచిరిత్యగ్నయః పురా ।
వశిష్ఠశాపాదుత్పన్నాః పునర్యోగగతిం గతాః ॥ 4

పావకః - పావకుడు, పవమానః - పవమానుడు, శుచిః చ - శుచి, ఇతి - అనే, అగ్నయః - అగ్నులు, పురా - పూర్వము, వశిష్ఠశాపాత్ - వశిష్ఠుని శాపము వలన, ఉత్పన్నాః - పుట్టినారు, పునః - మరల, యోగగతిమ్ - యోగమార్గముచే అగ్నిలోకమును, గతాః - పొందినారు.

పావకుడు, పవమానుడు మరియు శుచి అనే మూడు అగ్నులు పూర్వములో వశిష్ఠ మహర్షి ఇచ్చిన శాపము కారణముగా విజితాశ్వుని పుత్రులై జన్మించిరి. వారు యోగమార్గమునునుష్ఠించి మరల తమ లోకమును చేరిరి.

అంతర్ధానో నభస్వత్యాం హవిర్ధానమవిందత ।
య ఇంద్రమశ్వహర్తారం విద్వానపి న జఘ్నివాన్ ॥ 5

అంతర్ధానః - అంతర్ధానుడనబడే విజితాశ్వుడు, నభస్వత్యామ్ - నభస్వతియందు, హవిర్ధానమ్ - హవిర్ధానుడనే పుత్రుని, అవిందత - పొందెను, యః - ఏ విజితాశ్వుడు, ఇంద్రమ్ - ఇంద్రుని, అశ్వహర్తారమ్ - గుర్రమునపహరించువానినిగా, విద్వాన్ అపి - తెలిసినవాడే అయిననూ, న జఘ్నివాన్ - సంహరించలేదో.

ఇంద్రుడు గుర్రమునపహరించుచుండగా చూచియు విజితాశ్వుడు ఆతనిని సంహరించ లేదు. అంతర్ధానుడనబడే అట్టి విజితాశ్వునకు నభస్వతియందు హవిర్ధానుడనే కొడుకు కలిగెను.

రాజ్ఞాం వృత్తిం కరాదానదండశుల్కాదిదారుణామ్ ।
మన్యమానో దీర్ఘసత్రవ్యాజేన విససర్జ హ ॥ 6

రాజ్ఞామ్ - రాజులయొక్క, వృత్తిమ్ - జీవికను, కర-ఆదానదండ శుల్క-ఆదిదారుణామ్ - పన్నును వసూలు చేయుట శిక్షలను విధించుట మరియు అపరాధ రుసుమును వసూలు చేయుట మొదలగువాటిచే క్రూరమైనదిగా, మన్యమానః - తలపోయువాడై, దీర్ఘసత్రవ్యాజేన - చిరకాలము జరిగే సత్రయాగముయొక్క మిషచే, విససర్జ హ - విడిచిపెట్టెనట.

రాజులు పన్నులను, అపరాధ రుసుములను వసూలు చేయుచూ అపరాధులను శిక్షించుట మొదలగు కార్యములను చేయుదురు. కావున, అంతర్ధానుడు వారి జీవనశైలి క్రూరమైనదని తలపోసి, చిరకాలము జరిగే సత్రయాగమునను నుష్ఠించే సాకుతో రాజ్యాధికారమును విడిచిపెట్టెను.

తత్రాపి హంసం పురుషం పరమాత్మానమాత్మదృక్ ।
యజంస్తల్లోకతామాప కుశలేన సమాధినా ॥ 7

తత్ర అపి - ఆ సత్రయాగమునందు కూడ, ఆత్మదృక్ - అంతర్ముఖుడగు ఆతడు, కుశలేన - నిపుణమైన, సమాధినా - సమాధిచే, హంసమ్ - అజ్ఞానమును పోగొట్టునట్టియు, పురుషమ్ - పూర్ణుడైన, పరమాత్మానమ్ - పరమాత్మను, యజన్ - ఆరాధించువాడై, తత్-లోకతామ్ - ఆ పరమాత్మయొక్క సాక్షాత్కారమును, ఆప - పొందెను.

ఆ సత్రయాగములో కూడ అంతర్ముఖుడగు ఆ అంతర్ధానుడు దృఢమగు చిత్తైకాగ్రతతో అజ్ఞానమును పోగొట్టే పూర్ణ పరమాత్మను ఆరాధించి, ఆ పరమాత్మ సాక్షాత్కారమును (దివ్యలోకమును) పొందెను.

హవిర్ధానాద్ధవిర్ధానీ విదురాసూత షట్ సుతాన్ ।
బర్హిషదం గయం శుక్లం కృష్ణం సత్యం జితవ్రతమ్ ॥ 8

విదుర - ఓ విదురా!, హవిర్ధానాత్ - హవిర్ధానుని వలన, హవిర్ధానీ - హవిర్ధాని, బర్హిషదమ్ - బర్హిషదుని, గయమ్ - గయుని, శుక్లమ్ - శుక్లుని, కృష్ణమ్ - కృష్ణుని, సత్యమ్ - సత్యుని, జితవ్రతమ్ - జితవ్రతుని, షట్ - ఆర్గురు, సుతాన్ - పుత్రులను, అసూత - కనెను.

విదురా! హవిర్ధానునకు హవిర్ధానియందు బర్హిషదుడు, గయుడు, శుక్లుడు, కృష్ణుడు, సత్యుడు, జితవ్రతుడు అనే ఆర్గురు పుత్రులు కలిగిరి.

బర్హిషత్సుమహాభాగో హావిర్ధానిః ప్రజాపతిః ।
క్రియాకాండేషు నిష్ణాతో యోగేషు చ కురూద్వహ ॥ 9

కురు-ఉద్వహ - కురువంశ శ్రేష్ఠుడవగు ఓ విదురా!, సుమహాభాగః - గొప్ప మహానుభావుడు, హావిర్ధానిః - హవిర్ధానుని పుత్రుడు, ప్రజాపతిః - మహారాజు అగు, బర్హిషత్ - బర్హిషత్తు, క్రియాకాండేషు - కర్మకాండలయందు, యోగేషు చ - యోగాంగములయందు కూడ, నిష్ణాతః - నిష్ణాతుడు.

కురువంశ శ్రేష్ఠుడవగు ఓ విదురా! హవిర్ధానుని పుత్రుడగు బర్హిషత్ మహారాజు గొప్ప మహానుభావుడు. ఆయన వేదోక్తమగు కర్మలను చేయుటయందు మాత్రమే గాక, ఎనిమిది యోగాంగములయందు కూడ నిష్ణాతుడు.

యస్యేదం దేవయజనమను యజ్ఞం వితన్వతః ।
ప్రాచీనాగ్రైః కుశైరాసీదాస్తృతం వసుధాతలమ్ ॥ 10

దేవయజనం అను - యజ్ఞవాటము సమీపమునందు, యజ్ఞమ్ - యజ్ఞమును, వితన్వతః - విస్తరింప జేయుచున్న, యస్య - ఏ బర్హిషత్తున కు, ఇదమ్ - ఈ, వసుధాతలమ్ - భూతలము, ప్రాచీన-అగ్రైః - తూర్పు వైపు కొనలుగల, కుశైః - దర్భలచే, ఆస్తృతమ్ - కప్పబడినదై, ఆసీత్ - ఆయెనో.

బర్హిషత్ ఒక యజ్ఞమును చేసి, ఆ యజ్ఞవాటమునకు ప్రక్కనే మరి యొక యజ్ఞమును చేయుచూ, ఈ విధముగా యజ్ఞములను విస్తరింప జేసుకుంటూ పోవుటచే, ఈ భూతలమంతయు తూర్పు వైపు కొనలు గల దర్భలచే కప్పబడి పోయెను.

సాముద్రీం దేవదేవోక్తాముపయేమే శతద్రుతిమ్ ।
యాం వీక్ష్య చారుసర్వాంగీం కిశోరీం సుష్ఠ్వలంకృతామ్ ।
పరిక్రమంతీముద్వాహే చకమేఽగ్నిశ్శుకీమివ ।। 11

దేవదేవ-ఉక్తామ్ - దేవదేవుడగు బ్రహ్మచే నిర్దేశించబడిన, సాము ద్రీమ్ - సముద్రకన్యయైన, శతద్రుతిమ్ - శతద్రుతిని, ఉపయేమే - వివా హమాడెను, చారుసర్వ-అంగీమ్ - సుందరమగు అన్ని అవయవములు గలిగినట్టియు, కిశోరీమ్ - యౌవనవతియైనట్టియు, సుష్ఠు - చక్కగా, అలంకృతామ్ - అలంకరించబడినట్టియు, ఉద్వాహే - వివాహమునందు, పరిక్రమంతీమ్ - ప్రదక్షిణము చేయుచున్న, యామ్ - ఏ శతద్రుతిని, అగ్నిః - అగ్ని, వీక్ష్య - చూచి, శుకీం ఇవ - శుకిని వలె, చకమే - కామించెనో.

బర్హిషత్ దేవదేవుడగు బ్రహ్మగారి సలహా ప్రకారముగా సముద్రక న్యకయగు శతద్రుతిని వివాహమాడెను. యౌవనవతియగు ఆ శతద్రుతి సక లావయవములు సుందరముగా నుండెను. వివాహములో ఆమె చక్కగా అలంకరించుకొని అగ్నిని ప్రదక్షిణము చేయుచుండెను. అపుడామెను చూచి అగ్ని, పూర్వము శుకిని వలె, కామించెను.

విబుధాసురగంధర్వమునిసిద్ధనరోరగాః ।
విజితాస్సూర్యయా దిక్షు క్వణయంత్యైవ నూపురైః ।। 12

నూపురైః - కాలి అందెలతో, దిక్షు - దిక్కులయందు, క్వణ యంత్యా ఏవ - ధ్వనిని మాత్రమే చేయుచున్న, నూర్యయా - కొత్త పెళ్లి కూతురుచే, విబుధ-అసురగంధర్వమునిసిద్ధనర-ఉరగాః - దేవతలు రాక్షసులు గంధర్వులు మహర్షులు సిద్ధులు మానవులు మరియు నాగులు, విజితాః - జయించబడిరో.

కొత్త పెళ్లి కూతురగు ఆ శతద్రుతి నడచుచుండగా కాలి అందెల ధ్వని దిక్కులయందు ప్రసరించెను. ఆ ధ్వనిమాత్రముచే ఆమె దేవతలు, రాక్షసులు, గంధర్వులు, మహర్షులు, సిద్ధులు, మానవులు మరియు నాగుల మనస్సులను దోచివేసెను.

ప్రాచీనబర్హిషః పుత్రాశ్శతద్రుత్యాం దశాభవన్ ।
తుల్యనామవ్రతాస్సర్వే ధర్మస్నాతాః ప్రచేతసః ॥ 13

ప్రాచీనబర్హిషః - ప్రాచీనబర్హి అని పేరు గాంచిన బర్హిషత్ నకు, శత ద్రుత్యామ్ - శతద్రుతియందు, దశ - పదిమంది, పుత్రాః - కొడుకులు, అభవన్ - కలిగిరి, సర్వే - అందరు, తుల్యనామవ్రతాః - సమానమగు పేరు మరియు ఆచరణము గలవారు, ధర్మస్నాతాః - ధర్మములో నిష్ణాతులు, ప్రచేతసః - ప్రచేతసులు అనువారలు.

ప్రాచీనబర్హి అని పేరు గాంచిన బర్హిషత్ నకు శతద్రుతియందు ప్రచేతసులు అనే పదిమంది కొడుకులు కలిగిరి. ధర్మములో నిష్ణాతులగు వారందరు సమానమగు పేరును మరియు ఆచరణమును కలిగియుండిరి.

పిత్రాదిష్టాః ప్రజాసర్గే తపసేఽర్ణవమావిశన్ ।
దశ వర్షసహస్రాణి తపసాఽర్చంస్తపస్పతిమ్ ॥ 14

ప్రజాసర్గే - సంతానమును కనుటయందు, పిత్రా - తండ్రిచే, ఆదిష్టాః - ఆదేశించబడినవారై, తపసే - తపస్సు కొరకు, అర్ణవమ్ - సముద్రమును, ఆవిశన్ - ప్రవేశించిరి, దశ వర్షసహస్రాణి - పదివేల సంవత్సరములు, తపసా - తపస్సుచే, తపః-పతిమ్ - తపస్సునకు ప్రభువగు శ్రీహరిని, అర్చన్ - ఆరాధించిరి.

వివాహము చేసుకొని వంశమును వృద్ధి చేయుడని తండ్రి వారిని ఆదేశించగా, వారు దాని కొరకు ఈశ్వరానుగ్రహమును పొందుటకై తపస్సును చేయగోరి, సముద్రములో ప్రవేశించిరి. వారు పది వేల సంవత్సరములు తపస్సును చేసి, తపస్సునకు ప్రభువు (తపస్సుచే ఆరాధించబడువాడు, తపస్సునకు ఫలమునొసంగువాడు) అగు శ్రీహరిని ఆరాధించిరి.

యదుక్తం పథి దృష్టేన గిరిశేన ప్రసీదతా ।
తద్ధ్యాయంతో జపంతశ్చ పూజయంతశ్చ సంయతాః ।। 15

పథి - మార్గమునందు, దృష్టేన - కనబడినట్టియు, ప్రసీదతా - ప్రసన్నుడైన, గిరిశేన - కైలాసవాసియగు రుద్రునిచే, యత్ - ఏది, ఉక్తమ్ - ఉపదేశించబడినదో, తత్ - దానిని, సంయతాః - జితేంద్రియులై, ధ్యాయంతః - ధ్యానించుచున్నవారై, జపంతః - జపించుచున్నవారై, చ - మరియు, పూజయంతః చ - పూజించుచున్నవారు కూడా.

మార్గములో వారికి కైలాసవాసియగు రుద్రుడు కనబడెను. ఆయన ప్రసన్నుడై వారికి తత్త్వమునుపదేశించెను. వారు జితేంద్రియులై ఆ తత్త్వమునే ధ్యానిస్తూ, జపిస్తూ, ఆ ప్రకారముగనే పూజించుచుండిరి.

విదుర ఉవాచ ।
ప్రచేతసాం గిరిత్రేణ యథాసీత్పథి సంగమః ।
యదుతాహ హరః ప్రీతస్తన్నో బ్రహ్మన్ వదార్థవత్ ।। 16

బ్రహ్మన్ - ఓ మహర్షీ!, గిరిత్రేణ - కైలాసపతియగు రుద్రునితో, ప్రచేతసామ్ - ప్రచేతసులకు, పథి - మార్గమునందు, సంగమః - సమాగమము, యథా - ఏ విధముగా, ఆసీత్ - కలిగెనో, ఉత - మరియు, ప్రీతః - ప్రసన్నుడైన, హరః - రుద్రుడు, యత్ - దేనిని, ఆహ - చెప్పెనో, అర్థవత్ - అర్థవంతమగు, తత్ - దానిని, నః - మా కొరకు, వద - చెప్పుము.

విదురుడిట్లు పలికెను --- ఓ మహర్షీ! తపస్సునకు వెళ్లుచున్న ప్రచేతసులకు మార్గములో కైలాసపతియగు రుద్రునితో సమాగమము ఏ

విధముగా కలిగెను? మరియు ప్రసన్నుడైన ఆ రుద్రుడు వారికి చెప్పిన ప్రయోజనకారియగు ఉపదేశము ఎట్టిది? మాకీ విషయమును చెప్పుము.

సంగమః ఖలు విప్రర్షే శివేనేహ శరీరిణామ్ ।
దుర్లభో మునయో దధ్యురసంగాద్యమభీప్సితమ్ ॥ 17

విప్రర్షే - ఓ బ్రహ్మర్షీ!, శరీరిణామ్ - ప్రాణులకు, ఇహ - ఈ లోకమునందు, శివేన - శివునితో, సంగమః - సమాగమము, దుర్లభః ఖలు - పొంద శక్యము కానిది గదా!, అభీప్సితమ్ - పొంద గోరబడే, యమ్ - ఏ శివుని, మునయః - మహర్షులు, అసంగాత్ - సంగమును విడుచుట వలన, దధ్యుః - ధ్యానించిరో.

ఓ బ్రహ్మర్షీ! ఈ లోకములో ప్రాణులకు శివునితోడి సమాగమము పొంద శక్యము కానిది గదా! మహర్షులు సైతము శివుని పొంద గోరి సంసారమునందలి ఆసక్తిని విడనాడి ఆయనను ధ్యానించుచున్నారు (కాని, పొందుట లేదు).

ఆత్మారామోఽపి యస్త్వస్య లోకకల్పస్య రాధసే ।
శక్త్యా యుక్తో విచరతి ఘోరయా భగవాన్ భవః ॥ 18

యః - ఏ, భగవాన్ భవః తు - శివ భగవానుడైతే, ఆత్మ-ఆరామః అపి - ఆత్మయందు ఆనందము గలవాడే అయిననూ, అస్య - ఈ, లోకకల్పస్య - లోకరచనయొక్క, రాధసే - పాలన కొరకు, ఘోరయా - భయంకరమగు, శక్త్యా - శక్తితో, యుక్తః - కూడినవాడై, విచరతి - సంచరించునో.

శివ భగవానుడు ఆత్మయందే ఆనందము గలవాడు. అయిననూ, ఆయన ఈ లోకముల రచనను పాలించుట కొరకై భయంకరమగు శక్తితో గూడి సంచరించును.

మైత్రేయ ఉవాచ ।
ప్రచేతసః పితుర్వాక్యం శిరసాఽఽదాయ సాధవః ।
దిశం ప్రతీచీం ప్రయయుస్తపస్యాదృతచేతసః ॥ 19

సాధవః - సత్పురుషులగు, ప్రచేతసః - ప్రచేతసులు, పితుః - తండ్రియొక్క, వాక్యమ్ - మాటను, శిరసా - శిరస్సుచే, ఆదాయ - స్వీక రించి, తపసి - తపస్సునందు, ఆదృతచేతసః - ఆదరముతో కూడిన మన స్సులు గలవారై, ప్రతీచీం దిశమ్ - పడమర దిక్కును గురించి, ప్రయయుః - బయలు దేరిరి.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- సత్పురుషులగు ప్రచేతసు లకు మనస్సులో తపస్సునందు ఆదరము మెండు. వారు తండ్రి ఆదేశ మును శిరసా వహించి పడమర దిక్కునకు బయలు దేరిరి.

సముద్రముపవిస్తీర్ణమపశ్యన్ సుమహత్సరః ।
మహన్మన ఇవ స్వచ్ఛం ప్రసన్నసలిలాశయమ్ ॥ 20

సముద్రం ఉప - సముద్రమునకు దగ్గరగా నున్నట్టియు, విస్తీర్ణమ్ - విస్తరించి ఉన్నట్టియు, మహత్-మనః ఇవ - మహాత్ముల మనస్సు వలె, స్వచ్ఛమ్ - స్వచ్ఛముగా నున్నట్టియు, ప్రసన్నసలిల-ఆశయమ్ - ప్రసన్న మగు జలజంతువులు కలిగినట్టియు, సుమహత్ - చాల పెద్ద, సరః - సర స్సును, అపశ్యన్ - చూచిరి.

వారు సముద్రమా అనదగ్గంత పెద్ద విశాలమగు సరస్సును చూచి రి. అది మహాత్ముల మనస్సు వలె స్వచ్ఛమైన నీటితో నిండి యుండెను. దానియందలి జలజంతువులు కూడ ప్రసన్నముగా కనబడెను.

నీలరక్తోత్పలాంభోజకహ్లారేందీవరాకరమ్ ।
హంససారసచక్రాహ్వకారండవనికూజితమ్ ॥ 21

నీలరక్త-ఉత్పల-అంభోజకహ్లార-ఇందీవర-ఆకరమ్ - ఎర్ర నల్ల రంగులు కలిసిన కలువలు పద్మములు అధికపరిమళము గల ఎర్ర కలు వలు నల్ల కలువలు గలిగినట్టియు, హంససారసచక్రాహ్వకారండవనికూజి తమ్ - హంసలు బెగ్గురు పక్షులు జక్కవ పిట్టలు మరియు కన్నెలేడు పక్షుల అధికమగు కూతలు గల (సరస్సును చూచిరి).

ఆ సరస్సులో నల్ల కలువలు ఎక్కువగా నుండెను. ఎఱ్ఱ నల్ల రంగులు కలిసియున్న కలువలు, పద్మములు, అధిక పరిమళము గల ఎఱ్ఱ కలువలు మరియు నల్ల కలువలు ఉండెను. హంసలు బెగ్గురు పక్షులు జక్కవ పిట్టలు మరియు కన్నెలేడు పక్షుల కూతలతో ఆ సరస్సు ప్రతిధ్వనించుచుండెను.

మత్తభ్రమరసౌస్వర్యహృష్టరోమలతాంఘ్రిపమ్ ।
పద్మకోశరజో దిక్షు విక్షిపత్పవనోత్సవమ్ ॥ 22

మత్తభ్రమరసౌస్వర్యహృష్టరోమలతా-అంఘ్రిపమ్ - మత్తెక్కిన తుమ్మెదల చక్కని అఖండఝుంకారముచే హర్షమును పొంది పులకాంకురములవంటి చిగుళ్లు గల లతలతో గూడిన చెట్లు గలిగినట్టియు, పద్మకోశ రజః - పద్మగర్భములయందలి పుప్పొడిని, దిక్షు - దిక్కులయందు, విక్షిపత్-పవన-ఉత్సవమ్ - వెదజల్లుచున్న గాలిచే ఉత్సవమును చేసుకొనుచున్న (సరస్సును చూచిరి).

మత్తెక్కిన తుమ్మెదల చక్కని అఖండఝుంకారముచే తీగలతో కూడిన చెట్లు హర్షమును పొంది పులకాంకురములను పొందినవా యన్నట్లు వాటి చిగుళ్లు ప్రకాశించెను. ఆ సరస్సు తనయందలి పద్మముల గర్భములోని పుప్పొడిని దిక్కులలో వాయువు ద్వారా వెదజల్లుతూ ఉత్సవమును చేయుచున్నదా యన్నట్లు ఉండెను.

తత్ర గాంధర్వమాకర్ణ్య దివ్యమార్గమనోహరమ్ ।
విసిస్మ్యూ రాజపుత్రాస్తే మృదంగపణవాద్యను ॥ 23

తే - ఆ, రాజపుత్రాః - రాజపుత్రులు, తత్ర - అచట, దివ్యమార్గమనోహరమ్ - దివ్యములగు స్వరభేదములచే మనస్సును దోచివేయుచున్నట్టియు, మృదంగపణవ-ఆది అను - మద్దెల భేరీ మొదలగు వాద్యముల ధ్వనిని అనుసరించియున్న, గాంధర్వమ్ - గానమును, ఆకర్ణ్య - విని, విసిస్మ్యుః - విస్మయమును చెందిరి.

ఆ రాజపుత్రులకు అచట దివ్యమగు స్వరభేదములతో మనోహర మైన గానము వినబడెను. ఆ గానమును మద్దెల, భేరీ మొదలగు వాద్యముల ధ్వని అనుసరించి యుండెను. వారా గానమును విని విస్మితులైరి.

తర్హ్యేవ సరసస్తస్మాన్నిష్క్రామంతం సహానుగమ్ ।
ఉపగీయమానమమరప్రవరం విబుధానుగైః ॥ 24

తప్తహేమనికాయాభం శితికంఠం త్రిలోచనమ్ ।
ప్రసాదసుముఖం వీక్ష్య ప్రణేముర్జాతకౌతుకాః ॥ 25

తర్హి ఏవ - అదే సమయములో, తస్మాత్ - ఆ, సరసః - సరస్సు నుండి, నిష్క్రామంతమ్ - బయటకు వచ్చుచున్నట్టియు, సహ-అనుగమ్ - అనుచరులతో కూడియున్నట్టియు, విబుధ-అనుగైః - దేవతల అనుయాయులగు గంధర్వులచే, ఉపగీయమానమ్ - కీర్తించబడుచున్నట్టియు, అమరప్రవరమ్ - దేవతలలో శ్రేష్ఠుడైనట్టియు, తప్తహేమనికాయ-ఆభమ్ - పుటము పెట్టిన బంగారపు ముద్ద వలె ప్రకాశించునట్టియు, శితికంఠమ్ - నల్లని కంఠము కలిగినట్టియు, ప్రసాదసుముఖమ్ - అనుగ్రహించుటకు సుముఖముగానున్న, త్రిలోచనమ్ - ముక్కంటి దేవుని, వీక్ష్య - చూచి, జాతకౌతుకాః - పుట్టిన ఉత్సాహము గలవారై, ప్రణేముః - నమస్కరించిరి.

అదే సమయములో ఆ సరస్సునుండి అనుచరులతో గూడి ముక్కంటి దేవుడు బయటకు వచ్చుచుండెను. దేవతలలో శ్రేష్ఠుడగు ఆయనను దేవతల అనుయాయులగు గంధర్వులు కీర్తించుచుండిరి. పుటము పెట్టిన బంగారపు ముద్దవలె ప్రకాశించుచున్న ఆ నీలకంఠుడు భక్తులననుగ్రహించుటకు సుముఖముగా నుండెను. ఆయనను చూచుట తోడనే ప్రచేతసులు ఉత్సాహముతో ఆయనకు నమస్కరించిరి.

స తాన్ ప్రపన్నార్తిహరో భగవాన్ ధర్మవత్సలః ।
ధర్మజ్ఞాన్ శీలసంపన్నాన్ ప్రీతః ప్రీతానువాచ హ ॥ 26

ప్రపన్న-ఆర్తిహరః - శరణు పొందినవారి దుఃఖమును పోగొట్టువాడు, ధర్మవత్సలః - ధర్మమునందు ప్రేమ గలవాడు, ప్రీతః - సంతసించి

యున్నవాడు అగు, సః - ఆ, భగవాన్ - శివ భగవానుడు, ధర్మజ్ఞాన్ - ధర్మము తెలిసినట్టియు, శీలసంపన్నాన్ - శీలము నిండా కలిగియు న్నట్టియు, ప్రీతాన్ - సంతోషముతోనున్న, తాన్ - ఆ ప్రచేతసులను ఉద్దే శించి, ఉవాచ హ - పలికెనట.

శరణు పొందినవారి కష్టములనీడేర్చే శివభగవానుడు ధర్మము నందు ప్రేమ గలవాడు. ధర్మము తెలిసినవారు, శీలము నిండా కలవారు అగు ప్రచేతసులు శివుని దర్శనముచే ప్రీతులైరి. వారి విషయములో ప్రస న్నుడైన ఆ శివుడు వారితోనిట్లనెను.

శ్రీరుద్ర ఉవాచ ।
యూయం వేదవిదః పుత్రా విదితం వశ్చికీర్షితమ్ ।
అనుగ్రహాయ భద్రం వ ఏవం మే దర్శనం కృతమ్ ॥ 27

యూయమ్ - మీరు, వేదవిదః - వేదవేత్తయగు బర్హిషత్ యొక్క, పుత్రాః - పుత్రులు, వః - మీ, చికీర్షితమ్ - చేయగోరునది, విదితమ్ - తెలి యబడినది, వః - మీకు, భద్రమ్ - మంగళమగు గాక!, అనుగ్రహాయ - అనుగ్రహించుట కొరకై, ఏవమ్ - ఈ విధముగా, మే - నా, దర్శనమ్ - దర్శనము, కృతమ్ - ఈయబడినది.

శ్రీరుద్రుడు ఇట్లు పలికెను --- వేదవేత్తలగు మీరు వేదవేత్తయగు బర్హిషత్ మహారాజుయొక్క పుత్రులని నాకు తెలియును. మీరు ఏమి చేయ గోరుచున్నారో కూడ నాకు తెలియును. మీకు మంగళమగు గాక! మిమ్ము లను అనుగ్రహించుట కొరకై నేను మీకు ఈ తీరున దర్శనమునిచ్చినాను.

యః పరం రంహసస్సాక్షాత్త్రిగుణాజ్జీవసంజ్ఞితాత్ ।
భగవంతం వాసుదేవం ప్రపన్నస్స ప్రియో హి మే ॥ 28

యః - ఎవడైతే, రంహసః - సూక్ష్మమైన, త్రిగుణాత్ - త్రిగుణా త్మికయగు ప్రకృతికంటె, జీవసంజ్ఞితాత్ - జీవుడనబడువాని కంటె, పరమ్ - అతీతుడగు, వాసుదేవం భగవంతమ్ - వాసుదేవ భగవానుని, సాక్షాత్ -

సాక్షాత్తుగా, ప్రపన్నః - శరణు జొచ్చినాడో, సః - ఆతడు, మే - నా కొరకు, ప్రియః హి - నిశ్చయముగా ప్రియుడు.

వాసుదేవ భగవానుడు సూక్ష్మము, త్రిగుణాత్మకము అగు ప్రకృతి కంటె, మరియు జీవతత్త్వము కంటె అతీతుడు. ఆయనను సాక్షాత్తుగా శరణు పొందిన వ్యక్తి నాకు నిశ్చితముగా ప్రియుడు.

స్వధర్మనిష్ఠశ్శతజన్మభిః పుమాన్
విరించతామేతి తతః పరం హి మామ్ ।
అవ్యాకృతం భాగవతోఽథ వైష్ణవం
పదం యథాహం విబుధాః కలాత్యయే ॥ 29

స్వధర్మనిష్ఠః - తన ధర్మమునందు నిష్ఠ గల, పుమాన్ - వ్యక్తి, శతజన్మభిః - వంద జన్మలచే, విరించతామ్ - బ్రహ్మ పదవిని, తతః పరమ్ - ఆ పైన, మామ్ - నన్ను, ఏతి హి - పొందును, అథ భాగవతః - భగవద్భక్తుడైతే, కలా-అత్యయే - అధికారము సమాప్తమైనప్పుడు (లింగ శరీరము భంగమైనప్పుడు), విబుధాః అహం యథా - దేవతలు మరియు నేను వలె, అవ్యాకృతమ్ - జగత్తునకు అతీతమైన, వైష్ణవం పదమ్ - వైష్ణవ ధామమును (పొందును).

వంద జన్మలు తన ధర్మమునందు నిష్ఠ గల వ్యక్తి బ్రహ్మ పదవిని, అంతకంటె ఎక్కువ పుణ్యమున్నచో నన్ను పొందును. కాని, భగవద్భక్తుడు వైష్ణవ ధామమును పొందును. దేవతలు మరియు నేను కూడ మా మా అధికారములు సమాప్తమైనప్పుడు లింగ శరీర భంగముచే పొందేది జగత్తునకు అతీతమైన ఆ ధామమే.

అథ భాగవతా యూయం ప్రియాః స్థ భగవాన్ యథా ।
న మద్భాగవతానాం చ ప్రేయానన్యోఽస్తి కర్హిచిత్ ॥ 30

యూయమ్ - మీరు, భాగవతాః - భగవద్భక్తులు, అథ - అందువలన, భగవాన్ యథా - భగవానుడు వలె, ప్రియాః - ప్రియమైనవారు, స్థ - అగుచున్నారు, భాగవతానాం చ - భగవద్భక్తులకు కూడ, మత్ - నాకంటె,

ప్రేయాన్ - ప్రియమైనవాడు, కర్హిచిత్ - ఏ కాలమునందైననూ, అన్యః - మరియొకడు, న అస్తి - లేడు.

మీరు భగవద్భక్తులు గనుక, నాకు భగవంతుడు ఎంతటి ప్రియుడో, మీరు కూడ అంతే ప్రియులు. భగవద్భక్తులకు కూడ ఏ కాలమునందైననూ నాకంటె ప్రియమైనవాడు మరియొకడు లేడు.

ఇదం వివిక్తం జప్తవ్యం పవిత్రం మంగలం పరమ్ ।
నిఃశ్రేయసకరం చాపి శ్రూయతాం తద్వదామి వః ॥ 31

ఇదమ్ - ఇది, పవిత్రమ్ - పావనము, పరమ్ - గొప్ప, మంగలమ్ - కల్యాణము, నిఃశ్రేయసకరం చ అపి - మోక్షమునిచ్చునది కూడా, శ్రూయతామ్ - వినబడుగాక!, తత్ - దానిని, వః - మీ కొరకు, వదామి - చెప్పుచున్నాను, వివిక్తమ్ - కలగాపులగము చేయకుండా, జప్తవ్యమ్ - జపించదగినది.

నేను మీకు పావనము, గొప్ప కల్యాణకారి, మోక్షమును సైతము ఇచ్చేది అగు ఈ గీతమును చెప్పెదను. వినుడు. దీనిని కలగాపులగము చేయకుండా జపించుడు.

మైత్రేయ ఉవాచ ।
ఇత్యనుక్రోశహృదయో భగవానాహ తాన్ శివః ।
బద్ధాంజలీన్ రాజపుత్రాన్నారాయణపరో వచః ॥ 32

అనుక్రోశహృదయః - దయ హృదయమునందు గలవాడు, నారాయణపరః - నారాయణుడే పరాయణముగా గలవాడు అగు, భగవాన్ శివః - శివ భగవానుడు, బద్ధ-అంజలీన్ - దోసిలి యొగ్గిన, తాన్ - ఆ, రాజపుత్రాన్ - రాజపుత్రులగు ప్రచేతసులను ఉద్దేశించి, వచః - వచనమును, ఇతి - ఈ విధముగా, ఆహ - పలికెను.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- ఆ రాజపుత్రులు చేతులను జోడించి యుండిరి. దయాహృదయుడు, నారాయణుడే పరాయణముగా గలవాడు అగు శివ భగవానుడు వారినుద్దేశించి ఇట్లు పలికెను.

శ్రీరుద్ర ఉవాచ ।
జితం త ఆత్మవిద్ధుర్యస్వస్తయే స్వస్తిరస్తు మే ।
భవతా రాధసా రాద్ధం సర్వస్మా ఆత్మనే నమః ।। 33

ఆత్మవిత్-ధుర్యస్వస్తయే - ఆత్మవేత్తలలో అగ్రేసరులగు వారి కల్యాణము కొరకు, తే - నీచే, జితమ్ - జయించబడినది, మే - నా కొరకు, స్వస్తిః - మంగళము, అస్తు - అగుగాక!, భవతా - నీచే, రాధసా - ఆనందరూపముచే, రాద్ధమ్ - సంసిద్ధముగా నుండబడెను, సర్వస్మై - సర్వము రూపములోనున్న, ఆత్మనే - ఆత్మరూపుడవగు నీ కొరకు, నమః - నమస్కారము.

ఆత్మవేత్తలలో అగ్రేసరులగువారి కల్యాణము (ఆత్మానందము) కొరకై నీవు నీ ఉత్కర్షను ఆవిష్కరించినావు. నాకు కూడ మంగళమగు గాక! పరమానందరూపుడవగు నీవు ఆత్మరూపముగా నిత్యసిద్ధుడవై యున్నావు. సర్వము రూపములో ఉన్న నీవు ఆత్మరూపుడవై యున్నావు. నీకు నమస్కారము.

నమః పంకజనాభాయ భూతసూక్ష్మేంద్రియాత్మనే ।
వాసుదేవాయ శాంతాయ కూటస్థాయ స్వరోచిషే ।। 34

పంకజనాభాయ - పద్మము నాభియందు గలిగినట్టియు, భూత సూక్ష్మ-ఇంద్రియ-ఆత్మనే - సూక్ష్మభూతములకు ఇంద్రియములకు ఆత్మ (నియంత) అయినట్టియు, శాంతాయ - శాంతుడైనట్టియు, కూటస్థాయ - నిర్వికారుడైనట్టియు, స్వరోచిషే - స్వయంప్రకాశస్వరూపుడైన, వాసుదేవాయ - వాసుదేవుని కొరకు, నమః - నమస్కారము.

పద్మనాభుడు (లోకమనే పద్మము తనయందు ప్రకటమైన ఆకాశమునందు గలవాడు), ప్రాణులలో సూక్ష్మభూతముల కార్యములగు ఇంద్రియములలో ఆయా శక్తుల రూపముగా ప్రకటమై ఆ ఇంద్రియములకు తానే ఆత్మ (నియంత) అయి ఉన్నవాడు, ప్రకృతిలోని చలనము తన స్వరూపమునందు లేనివాడు, ప్రకృతి వికారములకు అతీతుడు, స్వయంప్రకాశచైతన్యస్వరూపుడు, వాసుదేవుడు (సకలప్రాణులలో అంతర్యామియగు ఆత్మ

రూపముగా నున్నవాడు, మరియు చిత్తమునకు అధిష్ఠాత) అగు శ్రీహరికి నమస్కారము.

సంకర్షణాయ సూక్ష్మాయ దురంతాయాంతకాయ చ ।
నమో విశ్వప్రబోధాయ ప్రద్యుమ్నాయాంతరాత్మనే ।। 35

సూక్ష్మాయ - వ్యక్తము కాని స్వరూపము కలిగినట్టియు, దురంతాయ - అంతము లేనట్టియు, అంతకాయ - లోకములను అంతము చేయు, సంకర్షణాయ - సంకర్షణునకు, విశ్వప్రబోధాయ - జగత్తునకు ప్రకృష్టమగు బోధను కలిగించునట్టియు, అంతరాత్మనే - అంతర్యామియగు, ప్రద్యుమ్నాయ - ప్రద్యుమ్నుని కొరకు, నమః - నమస్కారము.

అవ్యక్త స్వరూపుడు, అంతము లేనివాడు, లోకములను అంతము చేయువాడు అగు సంకర్షణ దేవునకు (అహంకారమునకు అధిష్ఠాత, జగత్తును తన లోనికి ఉపసంహరించువాడు) నమస్కారము. చైతన్యాధిష్ఠాన రూపములో సకలప్రాణులకు వివిధరూపముల జ్ఞానమును కలిగించువాడు, సకలప్రాణుల అంతర్యామి అగు ప్రద్యుమ్నునకు (ప్రకృష్టమగు ద్యుమ్నము, అనగా శక్తి లేక చైతన్యప్రకాశము గలవాడు, బుద్ధికి అధిష్ఠాత) నమస్కారము.

నమో నమోఽనిరుద్ధాయ హృషీకేశేంద్రియాత్మనే ।
నమః పరమహంసాయ పూర్ణాయ నిభృతాత్మనే ।। 36

హృషీక-ఈశ-ఇంద్రియ-ఆత్మనే - కన్ను మొదలగు ఇంద్రియములకు ప్రభువగు మనస్సు రూపములో ప్రకటమయ్యే, అనిరుద్ధాయ - అనిరుద్ధుని కొరకు, నమః - నమస్కారము, పరమహంసాయ - గొప్ప హంస (చీకటిని పోగొట్టువాడు) అగు సూర్యుని (ఆత్మజ్ఞాని) కొరకు, పూర్ణాయ - పూర్ణుని కొరకు, నిభృత-ఆత్మనే - వృద్ధిక్షయములు లేని స్వరూపము గలవాని కొరకు.

కన్ను మొదలగు ఇంద్రియములకు ప్రభువైన మనస్సునకు అధిష్ఠాన దేవతయగు అనిరుద్ధునకు (ఆటంకములు, లేక ఆవరణము లేనివా

డు) అనేక నమస్కారములు. జగత్తులోని చీకట్లను పోగొట్టే గొప్ప తేజోమండలమైన సూర్యుని (ఆత్మజ్ఞాని) రూపములోనున్న శ్రీహరికి నమస్కారము. శ్రీహరి పూర్ణుడగుటచే ఆయన స్వరూపమునందు వృద్ధిక్షయములు ఉండవు. అట్టి శ్రీహరికి నమస్కారము.

స్వర్గాపవర్గద్వారాయ నిత్యం శుచిషదే నమః ।
నమో హిరణ్యవీర్యాయ చాతుర్హోత్రాయ తంతవే ॥ 37

నిత్యమ్ - నిత్యము, శుచిషదే - మంచివారి హృదయములయందుండునట్టియు, స్వర్గ-అపవర్గద్వారాయ - స్వర్గమునకు మోక్షమునకు ద్వారమైనట్టియు, హిరణ్యవీర్యాయ - తేజోమయమగు శక్తి గలిగినట్టియు, చాతుర్హోత్రాయ - చాతుర్హోత్రమగు కర్మకు సాధనమైనట్టియు, తంతవే - కర్మను విస్తరింప జేయు అగ్నిరూపుడగు శ్రీహరి కొరకు, నమః - నమస్కారము.

నిత్యము మంచివారిచే తమ హృదయములో ఆరాధించబడే శ్రీహరికి నమస్కారము. అగ్నిదేవుడు కామనతో ఆరాధించువారికి స్వర్గాది పుణ్యలోకములను, నిష్కామముగా ఆరాధించువారికి అంతఃకరణశుద్ధి ద్వారా మోక్షమును ఇచ్చును. హోత, ఉద్గాత, అధ్వర్యుడు, బ్రహ్మ అనే నల్గురు ఋత్విక్కులచే సంపాదించబడే అగ్నిహోత్రకర్మకు సాధనము అగ్నిదేవుడే. ఆ విధముగా శ్రీహరియొక్క తేజోమయమగు శక్తియే అగ్నిదేవుడు. అగ్నిదేవుని రూపములో వైదికకర్మను విస్తరింపజేసే శ్రీహరికి నమస్కారము.

నమ ఊర్జ ఇషే త్రయ్యాః పతయే యజ్ఞరేతసే ।
తృప్తిదాయ చ జీవానాం నమస్సర్వరసాత్మనే ॥ 38

ఊర్జే - పితృదేవతల అన్నము కొరకు, ఇషే - దేవతల అన్నము కొరకు, త్రయ్యాః - ఋగ్యజుస్సామవేదముల, పతయే - ప్రభువు కొరకు, యజ్ఞరేతసే - యజ్ఞముయొక్క ఫలము రూపములోనున్నట్టియు, జీవానామ్ - ప్రాణులకు, తృప్తిదాయ - తృప్తిని ఇచ్చే, సర్వరస-ఆత్మనే - సకల రసముల రూపములోనున్న నీటి కొరకు, నమః - నమస్కారము.

పితృదేవతలకు మరియు దేవతలకు ఆహారము, యజ్ఞము చేసిన మానవులకు ఫలము చంద్రుడే. ఆ చంద్రుని రూపములోనున్నది, కర్మకు మూలమైన ఋగ్యజుస్సామవేదములకు ప్రభువు అగు శ్రీహరియే. సకలరసముల రూపములోనుండి ప్రాణులకు దాహశాంతిని కలిగించే నీరు రూపములోనున్న శ్రీహరికి నమస్కారము.

సర్వసత్త్వాత్మదేహాయ విశేషాయ స్థవీయసే ।
నమస్త్రైలోక్యపాలాయ సహఓజోబలాయ చ ॥ 39

సర్వసత్త్వాత్మదేహాయ - సకలప్రాణులకు దేహమైనట్టియు, విశేషాయ - పృథివిరైయెనట్టియు, స్థవీయసే - విరాడ్రూపములోనున్నట్టియు, చ - మరియు, త్రైలోక్యపాలాయ - ముల్లోకములను పాలించునట్టియు, సహః-ఓజః-బలాయ - ఇంద్రియశక్తి మనశ్శక్తి దేహశక్తి అయిన వాయువు కొరకు.

సకలప్రాణుల వ్యష్టి దేహము, ఈ పృథివి మరియు సమష్టిస్థూల బ్రహ్మాండము (విరాట్) కూడ శ్రీహరియే. ముల్లోకములలోని ప్రాణులకు ఇంద్రియమనోదేహముల శక్తిని ఒసగే వాయువు రూపములో శ్రీహరియే ఉన్నాడు. అట్టి శ్రీహరికి నమస్కారము.

అర్థలింగాయ నభసే నమోఽంతర్బహిరాత్మనే ।
నమః పుణ్యాయ లోకాయ అముష్మై భూరివర్చసే ॥ 40

అర్థలింగాయ - పదార్థముల భేదమునకు సూచకమైనట్టియు, అంతః-బహిరాత్మనే - లోపల బయట అనే వ్యవహారమునకు మూలమైన, నభసే - ఆకాశము కొరకు, నమః - నమస్కారము, పుణ్యాయ - పుణ్యముచే పొందదగినట్టియు, భూరివర్చసే - గొప్ప ప్రకాశము గల, అముష్మై లోకాయ - స్వర్గలోకము కొరకు, నమః - నమస్కారము.

పదార్థముల పరస్పరభేదమునకు సూచకము, లోపల బయట అనే వ్యవహారమునకు మూలము అగు ఆకాశము శ్రీహరి రూపమే. పుణ్య

ముచే లభించే గొప్ప ప్రకాశము గల స్వర్గము మొదలగు ఊర్ధ్వలోకములు కూడ శ్రీహరి రూపములే. అట్టి శ్రీహరి కొరకు నమస్కారము.

ప్రవృత్తాయ నివృత్తాయ పితృదేవాయ కర్మణే ।
నమోఽధర్మవిపాకాయ మృత్యవే దుఃఖదాయ చ ॥ 41

ప్రవృత్తాయ నివృత్తాయ కర్మణే - ప్రవృత్తి నివృత్తి రూపములలోనుండే కర్మ కొరకు, పితృదేవాయ - పితృదేవత కొరకు, అధర్మవిపాకాయ - అధర్మముయొక్క ఫలమైనట్టియు, దుఃఖదాయ - దుఃఖమునిచ్చే, మృత్యవే చ - మృత్యువు కొరకు కూడ, నమః - నమస్కారము.

ప్రవృత్తి (యజ్ఞాది), నివృత్తి (శమదమాది) అని కర్మ రెండు రూపములలో నున్నది. ఈ కర్మయు, దాని ప్రభావము వలన లభించే పితృలోకము, స్వర్గలోకము కూడ శ్రీహరి రూపములే. పితృదేవతలు, దేవతలు కూడ శ్రీహరి రూపములే. అధర్మమునాచరించువారు మరణించి దుఃఖభాజనులగుదురు. ఆ మృత్యువు, దుఃఖమునిచ్చే నరకలోకము కూడ శ్రీహరి రూపములే. అట్టి శ్రీహరికి నమస్కారము.

నమస్త ఆశిషామీశ మనవే కారణాత్మనే ।
నమో ధర్మాయ బృహతే కృష్ణాయాకుంఠమేధసే ।
పురుషాయ పురాణాయ సాంఖ్యయోగేశ్వరాయ చ ॥ 42

ఈశ - ఓ ప్రభూ!, ఆశిషామ్ - కామనలకు, కారణ-ఆత్మనే - కారణమగు స్వరూపము గలిగినట్టియు, మనవే - సర్వజ్ఞుడవైనట్టియు (మనువు లేక మంత్రము), బృహతే - పరబ్రహ్మ అయినట్టియు, ధర్మాయ - ధర్మస్వరూపుడవైన, తే - నీ కొరకు, నమః - నమస్కారము, అకుంఠమేధసే - మొక్కవోని మేధాశక్తి గలిగినట్టియు, సాంఖ్యయోగ-ఈశ్వరాయ - జ్ఞానయోగ కర్మయోగములకు ప్రవర్తకుడైన, కృష్ణాయ - శ్రీకృష్ణుని కొరకు, పురుషాయ - సర్వప్రాణులలో అంతర్యామి రూపుడైనట్టియు (పూర్ణుడైనట్టియు), పురాణాయ - అనాదియగు శ్రీహరి కొరకు, నమః - నమస్కారము.

ఓ ప్రభూ! కర్మఫలరూపముగా కామనలనీడేర్చువాడవు నీవే. నీవు సర్వజ్ఞుడవు. మంత్రము నీ స్వరూపమే. స్వాయంభువ మనువు నీ రూపమే. గొప్ప ధర్మము నీ రూపమే. పరబ్రహ్మ నీ స్వరూపమే. మొక్కవోని మేధాశక్తి గలవాడై లోకములో సాంఖ్యయోగ కర్మయోగములను ప్రవర్తిల్ల జేసిన గీతాచార్యుడగు శ్రీకృష్ణుడు నీ అవతారమే. అనాదియగు నీవు సకల ప్రాణులలో అంతర్యామిగా నుండే పూర్ణుడవు. నీకు నమస్కారము.

శక్తిత్రయసమేతాయ మీఢుషేఽహంకృతాత్మనే ।
చేతఆకూతిరూపాయ నమో వాచోవిభూతయే ॥ 43

శక్తిత్రయసమేతాయ - మూడు శక్తులతో కూడియున్నట్టియు, మీఢుషే - కామనలను వర్షించునట్టియు, అహంకృత-ఆత్మనే - అహంకారరూపుడైన రుద్రుని కొరకు, చేతః-ఆకూతిరూపాయ - జ్ఞానము వివిధక్రియల రూపములోనుండునట్టియు, వాచః-విభూతయే - వాక్కుయొక్క వివిధమగు సృష్టి గల బ్రహ్మ కొరకు, నమః - నమస్కారము.

కర్త (చేయువాడు), కరణము (చేసే సాధనము), క్రియ అనే మూడు శక్తులను కలిగి అహంకారరూపుడై భక్తులకు కామనలను వర్షించే రుద్రుని రూపములోనుండే శ్రీహరికి నమస్కారము. సృష్టిజ్ఞానమును కలిగి వివిధసృష్టులను చేస్తూ, వేదరూపమగు వైవిధ్యము గల వాక్కును వెలయించే బ్రహ్మదేవుని రూపములోనుండే శ్రీహరికి నమస్కారము. ప్రాణుల దేహములోనుండి పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ అనే నాల్గు రకముల వాక్కును ప్రకటించే ప్రాణశక్తిరూపముగా నీవే ఉన్నావు.

దర్శనం నో దిదృక్షూణాం దేహి భాగవతార్చితమ్ ।
రూపం ప్రియతమంస్వానాం సర్వేంద్రియగుణాంజనమ్॥44

దిదృక్షూణామ్ - చూడగోరే, నః - మాకు, భాగవత-అర్చితమ్ - భగవద్భక్తులచే కోరబడునట్టియు, స్వానామ్ - తనవారికి, ప్రియతమమ్ - మిక్కిలి ప్రియమైనట్టియు, సర్వ-ఇంద్రియగుణ-అంజనమ్ - అన్ని ఇంద్రియములను గుణములచే రంజింపజేయు, రూపమ్ - రూపమును, దర్శనమ్ - దర్శనమును, దేహి - ఇమ్ము.

భక్తులకు నీ రూపము మిక్కిలి ప్రియమైనది. నీ రూపము తన గరిమచే మా ఇంద్రియములను రంజింప జేయగలదు. భక్తులచే ఆదరించబడే అట్టి నీ రూపమును మేము చూడగోరుచున్నాము. మాకు దర్శనమిమ్ము.

స్నిగ్ధప్రావృడ్ఘనశ్యామం సర్వసౌందర్యసంగ్రహమ్ ।
చార్వాయతచతుర్బాహుం సుజాతరుచిరాననమ్ ॥ 45

స్నిగ్ధప్రావృట్-ఘనశ్యామమ్ - దట్టని వర్షాకాలమేఘము వలె నల్లనైనట్టియు, సర్వసౌందర్యసంగ్రహమ్ - సకలసౌందర్యములు ఒక్కచో గూర్చినట్టియు, చారు-ఆయతచతుః-బాహుమ్ - అందమైన పొడవాటి నాలుగు చేతులు గలిగినట్టియు, సుజాతరుచిర-ఆననమ్ - కోమలమగు అందమైన ముఖము గలిగిన (రూపమును దర్శనమిమ్ము).

దట్టని వర్షాకాలమేఘము వలె నల్లని శ్రీహరి రూపము సకలసౌందర్యములు ఒకచో గ్రుమ్మరించినట్లు ఉండును. ఆయన పొడవాటి నాలుగు చేతులతో, కోమలమగు ముఖముతో అందముగా నుండును.

పద్మకోశపలాశాక్షం సుందరభ్రు సునాసికమ్ ।
సుద్విజం సుకపోలాస్యం సమకర్ణవిభూషణమ్ ॥ 46

పద్మకోశపలాశ-అక్షమ్ - పద్మముయొక్క గర్భమునందలి రేకల వంటి కన్నులు గలిగినట్టియు, సుందరభ్రు - అందమగు కనుబొమలు కలిగినట్టియు, సునాసికమ్ - అందమగు ముక్కు కలిగినట్టియు, సుద్విజమ్ - అందమగు దంతములు కలిగినట్టియు, సుకపోల-ఆస్యమ్ - అందమగు చెక్కిళ్లు గల ముఖము కలిగినట్టియు, సమకర్ణవిభూషణమ్ - సమానమగు చెవులే అలంకారముగా గల (రూపమును దర్శనమిమ్ము).

అందమైన కనుబొమలు, ముక్కు, దంతములు మరియు చెక్కిళ్లతో శ్రీహరి ముఖము అందముగా నుండును. పద్మగర్భమునందలి రేకల వంటి కళ్లు, సమమైన చెవులు ఆ ముఖమునకు శోభను చేకూర్చుచున్నవి.

ప్రీతిప్రహసితాపాంగమలకైరుపశోభితమ్ ।
లసత్పంకజకింజల్కదుకూలం మృష్టకుండలమ్ ॥ 47

ప్రీతిప్రహసిత-అపాంగమ్ - ప్రేమపూర్వకమగు చిరునవ్వుతో కూడిన కడగన్నులు గలిగినట్టియు, అలకైః - ముంగురులతో, ఉపశోభితమ్ - ప్రకాశించునట్టియు, లసత్-పంకజకింజల్కదుకూలమ్ - ప్రకాశించే పద్మముయొక్క పరాగమువంటి నాజూకు వస్త్రములు కలిగినట్టియు, మృష్టకుండలమ్ - ఉజ్జ్వలమగు కుండలములు కలిగిన (రూపము).

ఆయన ముఖము ప్రేమపూర్వకమగు చిరునవ్వుతో కూడిన కడగంటి చూపులతో, ముంగురులతో మరియు ఉజ్జ్వలమగు కుండలములతో ప్రకాశించును. ఆయన పద్మపరాగమువలె ప్రకాశించే నాజూకైన వస్త్రములను దాల్చును.

స్ఫురత్కిరీటవలయహారనూపురమేఖలమ్ ।
శంఖచక్రగదాపద్మమాలామణ్యుత్తమర్ద్ధిమత్ ॥ 48

స్ఫురత్-కిరీటవలయహారనూపురమేఖలమ్ - ప్రకాశించే కిరీటము కంకణములు హారములు నూపురములు మరియు మొలత్రాడు గలిగినట్టియు, శంఖచక్రగదాపద్మమాలామణి-ఉత్తమ-ఋద్ధిమత్ - శంఖము చక్రము గద పద్మము వనమాల కౌస్తుభమాణిక్యములచే ఉత్తమమైన శోభ గలిగిన (రూపమును దర్శనమిమ్ము).

కిరీటము, కంకణములు, హారములు, నూపురములు, మొలనూలులతో ప్రకాశించే శ్రీహరి రూపము, శంఖము చక్రము గద పద్మము వనమాల మరియు కౌస్తుభమణులతో ఉత్తమమగు శోభను కలిగియుండును.

సింహస్కంధత్విషో బిభ్రత్సౌభగగ్రీవకౌస్తుభమ్ ।
శ్రియానపాయిన్యా క్షిప్తనికషాశ్మోరసోల్లసత్ ॥ 49

సింహస్కంధత్విషః - సింహముయొక్క భుజస్కంధములవంటి భుజస్కంధముల కాంతులను, బిభ్రత్ - కలిగియున్నట్టియు, సౌభగగ్రీవకౌస్తుభమ్ - అందమగు మెడయందు కౌస్తుభమాణిక్యము కలిగినట్టియు, అనపాయిన్యా - తొలగిపోని, శ్రియా - లక్ష్మితో, క్షిప్తనికష-అశ్మ-ఉరసా- తిరస్కరించబడిన గీటురాయి గల వక్షఃస్థలముతో, ఉల్లసత్ - ప్రకాశించునది.

బంగరు ఆభరణముల కాంతులతో విలసిల్లే శ్రీహరి భుజస్కంధ ములు జూలుతో ప్రకాశించే సింహపు మూపును పోలియున్నవి. కౌస్తుభ మాణిక్యముతో ఆయన మెడకు శోభ ఇనుమడించెను. లక్ష్మీదేవి బంగరు రేఖ రూపములో నిత్యనివాసముండే ఆయన వక్షఃస్థలము బంగరు గీత గల గీటురాయి శోభను తల దన్నుచున్నది.

పూరరేచకసంవిగ్నవలివల్గుదలోదరమ్ ।
ప్రతిసంక్రామయద్విశ్వం నాభ్యాఽఽవర్తగభీరయా ॥ 50

పూరరేచకసంవిగ్నవలివల్గుదల-ఉదరమ్ - నిశ్శ్వాసోచ్ఛ్వాసలచే కదలాడే రేఖలతో అందమైన రావియాకువంటి ఉదరము కలిగినట్టియు, ఆవర్తగభీరయా - సుడిగుండము వలె లోతైన, నాభ్యా - నాభిగుండా, విశ్వమ్ - జగత్తును, ప్రతిసంక్రామయత్ - మరల ప్రవేశపెట్టుచున్నట్టియు.

రావియాకును పోలియున్న శ్రీహరియొక్క ఉదరము ఉచ్ఛ్వాసని శ్శ్వాసలతో బాటు కదలాడే మూడు ముడుతలతో అందముగా నుండెను. సుడిగుండమువలె లోతైన నాభి తనగుండా బయటకు వచ్చిన జగత్తును తిరిగి తనలోనికి ఉపసంహరించుటకు సంసిద్ధముగా యున్నదా యన్నట్లు ప్రకాశించును.

శ్యామశ్రోణ్యధిరోచిష్ణుదుకూలస్వర్ణమేఖలమ్ ।
సమచార్వంఘ్రిజంఘోరు నిమ్నజాను సుదర్శనమ్ ॥ 51

శ్యామశ్రోణి-అధిరోచిష్ణుదుకూలస్వర్ణమేఖలమ్ - నల్లని శ్రోణుల యందు అధికముగా ప్రకాశించే నాజూకు వస్త్రము మరియు బంగరు మొలనూలు గలిగినట్టియు, సమచారు-అంఘ్రిజంఘా-ఊరు - సమముగా నుండుటచే అందమైన పాదములు పిక్కలు తొడలు కలిగినట్టియు, నిమ్న జాను - ఎత్తు కాని మోకాళ్లు కలిగినట్టియు, సుదర్శనమ్ - చూచుటకు అందమైన (రూపమును దర్శనమిమ్ము).

శ్యామవర్ణము గల కటిభాగమునందు పీతాంబరము మరియు బంగరు మొలనూలు ప్రకాశించుచుండును. పాదములు, పిక్కలు, తొడలు

సమముగను, మోకాళ్లు ఎత్తు లేకుండగను ఉండుటచే శ్రీహరి రూపము చూడ చక్కగా నుండును.

పదా శరత్పద్మపలాశరోచిషా
నఖద్యుభిర్నోఽంతరఘం విధున్వతా।
ప్రదర్శయ స్వీయమపాస్తసాధ్వసం
పదం గురో మార్గగురుస్తమోజుషామ్ ॥ 52

గురో - తండ్రీ!, తమః-జుషామ్ - అజ్ఞానులకు, మార్గగురుః - మార్గమును చూపే గురుడవగు నీవు, శరత్-పద్మపలాశరోచిషా - శరత్కాలమునందలి పద్మముయొక్క దళమువంటి కాంతి గలిగినట్టియు, నఖద్యుభిః - నఖకాంతులచే, నః - మాయొక్క, అంతః - లోపలి, అఘమ్ - పాపమును, విధున్వతా - పోనాడు, పదా - పాదముచే, అపాస్తసాధ్వసమ్ - నశింపజేయబడిన భయము గల, స్వీయమ్ - నీకు సంబంధించిన, పదమ్ - స్వరూపమును, ప్రదర్శయ - దర్శనమిమ్ము.

ఓ తండ్రీ! అజ్ఞానాంధకారములో పడి కొట్టుకుపోవువారలకు నీవు మార్గమును చూపే గురుడవు. శరత్కాలపద్మదళమువంటి కాంతి గలదై, నఖకాంతులచే మా అంతఃకరణమునందలి మాలిన్యమును పోనాడే నీ పాదము మాకు గల సంసారభయమును చెదరగొట్టును. అట్టి నీ స్వరూపమును మాకు దర్శనమిమ్ము.

ఏతద్రూపమనుధ్యేయమాత్మశుద్ధిమభీప్సతా ।
యద్భక్తియోగోఽభయదస్స్వధర్మమనుతిష్ఠతామ్ ॥ 53

ఆత్మశుద్ధిమ్ - అంతఃకరణశుద్ధిని, అభీప్సతా - కోరువానిచే, ఏతత్ - ఈ, రూపమ్ - రూపము, అనుధ్యేయమ్ - నిరంతరముగా ధ్యానించదగినది, యత్ - ఏలయనగా, స్వధర్మమ్ - తమ ధర్మమును, అనుతిష్ఠతామ్ - అనుష్ఠించు వారలకు, భక్తియోగః - భక్తి అనే ఉపాయము, అభయదః - అభయమునిచ్చునది.

అంతఃకరణశుద్ధిని గోరు భక్తులు ఈ రూపమును నిరంతరముగా ధ్యానించవలెను. ఏలయనగా, స్వధర్మానుష్ఠానపరులగు భక్తులకు భక్తియోగమే అభయమునిచ్చును.

భవాన్ భక్తిమతా లభ్యో దుర్లభస్సర్వదేహినామ్ ।
స్వారాజ్యస్యాప్యభిమత ఏకాంతేనాత్మవిద్గతిః ॥ 54

సర్వదేహినామ్ - సకలప్రాణులకు, దుర్లభః - పొంద శక్యము కానివాడవు, స్వః-రాజ్యస్య అపి - స్వర్గలోకాధిపత్యము గల ఇంద్రునకు కూడ, అభిమతః - అభీష్టమైనవాడవు, ఏకాంతేన - తన స్వరూపము నందలి నిష్ఠచే, ఆత్మవిత్-గతిః - ఆత్మవేత్తలచే పొందబడువాడవు అగు, భవాన్ - నీవు, భక్తిమతా - భక్తి గలవానిచే, లభ్యః - పొందబడువాడవు.

నిన్ను పొందుట సకలప్రాణులకు సంభవము కాదు. స్వర్గలోకాధిపతియగు ఇంద్రుడు కూడ నిన్ను పొంద గోరుచుండును. ఆత్మవేత్తలు ఏకాంతమునందు ఆత్మనిష్ఠచే పొందేది నిన్ను మాత్రమే. అట్టి నీవు భక్తులకు లభించెదవు.

తం దురారాధ్యమారాధ్య సతామపి దురాపయా ।
ఏకాంతభక్త్యా కో వాంఛేత్పాదమూలం వినా బహిః ॥ 55

దురారాధ్యమ్ - ఆరాధించ శక్యము కాని, తమ్ - ఆ శ్రీహరిని, సతాం అపి - సత్పురుషులకైననూ, దురాపయా - పొంద శక్యము కాని, ఏకాంతభక్త్యా - ఏకాంతభక్తిచే, ఆరాధ్య - ఆరాధించి, పాదమూలం వినా - పాదముల మూలమును విడిచిపెట్టి, బహిః - బాహ్యమునందలి దానిని, కః - ఎవడు, వాంచేత్ - కోరును?

సంసారాసక్తులకు శ్రీహరిని ఆరాధించుట శక్యము కాదు. సత్పురుషులకైననూ ఏకాంతమగు (అన్యము లేని) భక్తి దుర్లభమే. అట్టి భక్తితో నిన్ను ఆరాధించువాడు ఎవ్వాడు, నీ పాదమూలమును గాక బాహ్యవిషయములను కోరును?

యత్ర నిర్విష్టమరణం కృతాంతో నాభిమన్యతే ।
విశ్వం విధ్వంసయన్ వీర్యశౌర్యవిస్ఫూర్జితభ్రువా ।। 56

వీర్యశౌర్యవిస్ఫూర్జితభ్రువా - వీర్యోత్సాహములతో కదల్పబడిన కనుబొమతో, విశ్వమ్ - జగత్తును, విధ్వంసయన్ - నశింపజేయు, కృతాంతః - కాలుడు, యత్ర - ఏ పాదమూలమునందు, అరణమ్ - శరణను, నిర్విష్టమ్ - పొందినవానిని గురించి, న అభిమన్యతే - అభిమానము చూపడో.

యముడు వీర్యోత్సాహములతో కనుబొమలను ముడివేసి జగత్తును నశింపజేయ సమర్థుడు. కాని, అట్టి కాలుడు కూడ నీ పాదమూలమును శరణు జొచ్చినవాని పట్ల తన ప్రతాపమును చూప పూనుకొనడు.

క్షణార్ధేనాపి తులయే న స్వర్గం నాపునర్భవమ్ ।
భగవత్సంగిసంగస్య మర్త్యానాం కిముతాశిషః ।। 57

భగవత్-సంగిసంగస్య - భగవద్భక్తులతోడి సంగముయొక్క, క్షణ-అర్ధేన అపి - అర్ధక్షణముతో నైననూ, స్వర్గమ్ - స్వర్గమును, న తులయే - సమానముగా లెక్కించను, అపునర్భవమ్ - మరల జన్మ లేని మోక్షమును, న - లెక్కించను, మర్త్యానామ్ - మానవుల, ఆశిషః - కామనలను గురించి, కిం ఉత - చెప్పునదేమున్నది?

భగవద్భక్తులతోడి అర్ధక్షణకాలము సత్సంగముతో స్వర్గము గాని, పునర్జన్మ లేని మోక్షము గాని సమానము కాదన్నచో, ఇక మర్త్యులు కోరే కామనలు దానికి సాటి కావని వేరుగా చెప్ప వలయునా?

అథానఘాంఘ్రేస్తవ కీర్తితీర్థయోః
అంతర్బహిస్స్నానవిధూతపాప్మనామ్ ।
భూతేష్వనుక్రోశసుసత్త్వశీలినాం
స్యాత్సంగమోఽనుగ్రహ ఏష నస్తవ ।। 58

అథ - కావున, అనఘ-అంఘ్రేః - పాపములను పోగొట్టే పాదములు గల, తవ - నీ, కీర్తితీర్థయోః - కీర్తి మరియు గంగానదులలో,

అంతః-బహిః-స్నానవిధూతపాప్మనామ్ - లోపల మరియు బయట స్నానము చేయుటచే కడిగివేయబడిన మాలిన్యములు గలిగినట్టియు, భూతేషు - ప్రాణులయందు, అనుక్రోశసుసత్త్వశీలినామ్ - దయ పవిత్రమగు అంతఃకరణము మరియు సచ్ఛీలము గలవారల, సంగమః - సమాగమము, స్యాత్ - కలుగు గాక!, ఏషః - ఇదియే, నః - మాకు, తవ - నీ, అనుగ్రహః - అనుగ్రహము.

కావున, పాపములను పోగొట్టే పాదములు గల నీ కీర్తియందు అంతస్స్నానము (అంతఃకరణములో కీర్తిని స్మరించుట) ను, నీ పాదముల నుండి పుట్టి తీర్థమైన గంగయందు బాహ్య (శారీరక) స్నానమును సాధు పురుషులు ఆచరించి, తమ మాలిన్యములను పోగొట్టుకొనెదరు. వారు సకలప్రాణులయందు దయ గలవారై, పవిత్రమగు అంతఃకరణమును మరియు సచ్ఛీలమును కలిగియుందురు. అట్టి సాధు పురుషులతో మాకు సమాగమము కలుగు గాక! ఇదియే నీవు మాయందు చూపదగిన అనుగ్రహము.

న యస్య చిత్తం బహిరర్థవిభ్రమం
తమోగుహాయాం చ విశుద్ధమావిశత్ ।
యద్భక్తియోగానుగృహీతమంజసా
మునిర్విచష్టే నను తత్ర తే గతిమ్ ॥ 59

యత్ - ఏ కాలమునందు, భక్తియోగ-అనుగృహీతమ్ - భక్తి యొక్క అభ్యాసముచే అనుగ్రహించబడినట్టియు, విశుద్ధమ్ - పవిత్రమగు, యస్య - ఎవనియొక్క, చిత్తమ్ - అంతఃకరణము, బహిః-అర్థవిభ్రమమ్ - బాహ్యమునందలి విషయములయందు విశేషమగు భ్రాంతి గలది, న - కాదో, తమః-గుహాయామ్ - అజ్ఞానమనే గుయ్యారమునందు, ఆవిశత్ - ప్రవేశించినది, న - కాదో, మునిః - మననశీలుడగు అతడు, నను - నిశ్చయముగా, తత్ర - అదే కాలమునందు, అంజసా - తేలికగా, తే - నీయొక్క, గతిమ్ - తత్త్వమును, విచష్టే - దర్శించుచున్నాడు.

సాధకుడు మననశీలుడై తన పవిత్రమగు అంతఃకరణము భక్తి యొక్క అభ్యాసముచే అనుగ్రహించబడునట్లు చూచుకొనవలెను. సాధకుని

మనస్సు బాహ్యవిషయములయందలి ఆసక్తిచే వ్యామోహితమై యుండ రాదు (రజోగుణప్రధానము కారాదు). మరియు సాధకుడు తన చిత్తము అజ్ఞానప ే గుయ్యారములో విలీనము (తమోగుణ ప్రధానము) కాకుండ చూచుకొనవలెను. సాధకుడు ఏ కాలములో అట్టి చిత్తమును తయారు చేసుకొనునో, అదే కాలములో నిశ్చయముగా అనాయాసముగా నీ తత్త్వ మును సాక్షాత్కరించుకొనును.

యత్రేదం వ్యజ్యతే విశ్వం విశ్వస్మిన్నవభాతి యత్ ।
తత్త్వం బ్రహ్మ పరం జ్యోతిరాకాశమివ విస్తృతమ్ ॥ 60

యత్ర - ఏ ఆత్మచైతన్యమునందు, ఇదమ్ - ఈ, విశ్వమ్ - జగత్తు, వ్యజ్యతే - ప్రకటమగుచున్నదో, విశ్వస్మిన్ - విశ్వమునందు, యత్ - ఏ ఆత్మచైతన్యము, అవభాతి - ప్రకాశించుచున్నదో, ఆకాశం ఇవ - ఆకాశమువలె, విస్తృతమ్ - వ్యాపకమగు, తత్ - ఆ, పరం బ్రహ్మ - పరబ్రహ్మ రూపమగు, జ్యోతిః - చైతన్యప్రకాశము, త్వమ్ - నీవే.

ఆత్మచైతన్యమునందే ఈ జగత్తు ప్రకటమగుచున్నది. ఈ జగత్తునందు ఆత్మచైతన్యము ఆకాశము వలె వ్యాప్తమై సచ్చిద్రూపముగా ప్రకాశించుచున్నది. అట్టి ఆత్మజ్యోతి పరబ్రహ్మస్వరూపుడవగు నీవే.

యో మాయయేదం పురురూపయాఽసృజత్
బిభర్తి భూయః క్షపయత్యవిక్రియః ।
యద్భేదబుద్ధిస్సదివాత్మదుఃస్థయా
తమాత్మతంత్రం భగవన్ ప్రతీమహి ॥ 61

భగవన్ - ఓ భగవానుడా!, అవిక్రియః - వికారములు లేని, యః - ఏ నీవు, పురురూపయా - అనేకరూపములు గలిగినట్టియు, ఆత్మదుఃస్థయా - నీయందు ఉండ శక్యము కాని, మాయయా - మాయాశక్తిచే, సత్ ఇవ - ఉన్నట్లు కనబడే, ఇదమ్ - ఈ జగత్తును, అసృజత్ - సృజించితివో, బిభర్తి - పాలించుచున్నావో, భూయః - మరల, క్షపయతి - నశింప జేయుచున్నావో, యత్ - ఏ మాయాశక్తి వలన, భేదబుద్ధిః - భేదబుద్ధి కలుగుచు

న్నదో, తమ్ - అట్టి, ఆత్మతంత్రమ్ - స్వతంత్రుడవగు నిన్ను, ప్రతీమహి - తెలియుచున్నాము.

ఓ భగవానుడా! అనేకరూపములు గల ఈ మాయాశక్తి నిన్ను మోహింప జేయలేదు. నీవు వికారములు లేకుండగనే ఈ మాయాశక్తిచే యథార్థము వలె కానవచ్చే ఈ జగత్తును సృష్టించి, పాలించి, మరల ఉప సంహరించుచున్నావు. జీవులకు ఈ మాయయొక్క ప్రభావము వలననే జగత్తు రూపముగా కనబడే భేదము యథార్థమనే ధారణ కలుగుచున్నది. కాని, నీవు ఆ మాయాశక్తికి అతీతముగా స్వతంత్రుడవై యున్నావని మేము తెలియుచున్నాము.

క్రియాకలాపైరిదమేవ యోగినః
శ్రద్ధాన్వితాస్సాధు యజంతి సిద్ధయే ।
భూతేంద్రియాంతఃకరణోపలక్షితం
వేదే చ తంత్రే చ త ఏవ కోవిదాః ।। 62

యోగినః - కర్మయోగులు, శ్రద్ధా-అన్వితాః - శ్రద్ధతో కూడినవారై, క్రియాకలాపైః - వివిధక్రియలచే, సిద్ధయే - సంసిద్ధి కొరకు, భూత-ఇంద్రి య-అంతఃకరణ-ఉపలక్షితమ్ - పంచభూతములు ఇంద్రియములు అంతః కరణములచే ఉపలక్షితమయ్యే, ఇదం ఏవ - ఈ సగుణరూపమును మాత్ర మే, సాధు - చక్కగా, యజంతి - ఆరాధించుచున్నారు, తే ఏవ - వారు మాత్రమే, వేదే చ - వేదమునందు, తంత్రే చ - శాస్త్రమునందు కూడ, కోవిదాః - పండితులు.

పంచభూతములు, ఇంద్రియములు, అంతఃకరణము అనునవి సృష్టిస్థితిసంహారకారణమగు నీ సగుణరూపమును లక్షితము చేయుచున్న వి (అనగా, వీటిచే వీటి ప్రేరకుడవగు నీవు నిర్దేశించబడుచున్నావు). అట్టి నీ సగుణరూపమును ఎవరైతే కర్మపరాయణులు (నిష్కామభావనతో కర్మను ఆచరించు భక్తులు) శ్రద్ధతో గూడి అనేకములగు పూజాపద్ధతులతో చక్కగా ఆరాధించెదరో, వారే వేదశాస్త్రముల సారమునెరింగినవారు.

త్వమేక ఆద్యః పురుషస్సుప్తశక్తిః
తయా రజస్సత్త్వతమో విభిద్యతే ।
మహానహం ఖం మరుదగ్నివార్ధరాః
సురర్షయో భూతగణా ఇదం యతః ॥ 63

త్వమ్ - నీవు, ఏకః - అద్వితీయుడవు, ఆద్యః - సర్వకారణుడవు, పురుషః - పూర్ణుడవు, సుప్తశక్తిః - నిద్రించుచున్న మాయాశక్తి గలవాడవు, తయా - ఆ శక్తి చేతనే, రజః-సత్త్వతమః - రజస్సు సత్త్వము తమస్సు అను మూడు గుణముల సముదాయము, విభిద్యతే - భేదరూపముగా ప్రకటమగుచున్నది, యతః - ఏ గుణములనుండి, మహాన్ - మహత్తత్త్వము, అహమ్ - అహంకారము, ఖమ్ - ఆకాశము, మరుత్ - వాయువు, అగ్ని వార్-ధరాః - అగ్ని నీరు మరియు పృథివి, సుర-ఋషయః - దేవతలు మహర్షులు, భూతగణాః - సకలప్రాణుల సమూహములు, ఇదమ్ - ఈ జగత్తు (ప్రకటమగుచున్నవో).

నీవు అద్వితీయ పూర్ణ పరబ్రహ్మవు. మాయాశక్తిచే నీవు ఈ జగత్తునకు కారణమగుచున్నావు. ప్రళయములో మాయాశక్తి నీలో విలీనమై యుండును. సృష్టి కాలములో దానియందలి సత్త్వరజస్తమోగుణములలో సంక్షోభము కలిగి మహత్తత్త్వము, అహంకారము, ఆకాశము వాయువు అగ్ని జలము పృథివి అనే పంచభూతములు, దేవతలు, మహర్షులు, సకల ప్రాణుల సమూహములతో కూడిన ఈ జగత్తు ప్రకటమగుచున్నవి.

సృష్టం స్వశక్త్యేదమనుప్రవిష్టః
చతుర్విధం పురమాత్మాంశకేన ।
అథో విదుస్తం పురుషం సంతమంతః
భుంక్తే హృషీకైర్మధు సారఘం యః ॥ 64

స్వశక్త్యా - తన మాయాశక్తిచే, సృష్టమ్ - సృష్టించబడిన, చతుర్విధమ్ - నాలుగు రకముల, ఇదమ్ - ఈ, పురమ్ - శరీరమనే పురమును, ఆత్మ-అంశకేన - తన అంశచే, అనుప్రవిష్టః - సృష్టించిన తరువాత ప్రవేశించినవాడు, అథో - అందువలన, అంతః - పురము లోప

ల, సంతమ్ - ఉన్న, తమ్ - ఆ చైతన్యమును, పురుషమ్ - పురుషునిగా, విదుః - తెలియుచున్నారు, యః - ఎవడైతే, సారఘం మధు - తేనెటీగలచే ప్రోగుచేయబడిన తేనెవలె అల్పమైన భోగమును, హృషీకైః - ఇంద్రియములచే, భుంక్తే - భోగించుచున్నాడో.

పరబ్రహ్మ తన మాయాశక్తిచే జరాయుజములు (మానవులు మొదలగు ప్రాణులు జరాయువు అనగా గర్భవేష్టన చర్మమునుండి పుట్టునవి), అండజము (పక్షులు మొదలగు ప్రాణులు, గ్రుడ్డునుండి పుట్టునవి), స్వేదజములు (క్రిమి కీటకములు, మాలిన్యమునందు పుట్టునవి) మరియు ఉద్భిజ్జములు (చెట్లు చేమలు, నేలను పగుల్చుకొని పుట్టునవి) అనే నాలుగు రకముల ప్రాణులను సృష్టించెను. అట్లు సృష్టించిన తరువాత చైతన్యఘనమగు ఆ పరబ్రహ్మ తనచే సృష్టించబడిన పురములవంటి ఈ నాలుగు రకముల దేహములలో ప్రవేశించినాడు. దేహముల అల్పత్వము చైతన్యమునందారోపించబడుటచే ఈ దేహములలో ప్రకటమగుచున్న చైతన్యము పరబ్రహ్మచైతన్యముయొక్క అంశ వలె భాసించును. ఈ విధముగా సకలప్రాణులలో చైతన్యరూపముగా ప్రకటమగుచుండుట చేతనే పరబ్రహ్మ పురుషుడు (పురమునందుండువాడు) అని జ్ఞానులు చెప్పుచున్నారు. తేనెటీగలు ప్రోగుచేసుకునే తేనెవలె అల్పమగు విషయముల సుఖమును ఆ పురుషుడు ఈ ఉపాధియందు అజ్ఞానముచే ఇంద్రియముల ద్వారా భోగించుచున్నాడు.

స ఏష లోకానతిచండవేగో
వికర్షసి త్వం ఖలు కాలయానః ।
భూతాని భూతైరనుమేయతత్త్వో
ఘనావలీర్వాయురివాఽవిషహ్యః ॥ 65

సః - అట్టి, ఏషః - ఈ, అనుమేయతత్త్వః - నిషేధవాక్యములచే లక్ష్యమగు స్వరూపము గల, త్వమ్ - నీవు, అతిచండవేగః - ప్రచండమగు వేగము గలవాడవై, అవిషహ్యః - సహింప శక్యము కాని, వాయుః - వాయువు, ఘన-అవలీః ఇవ - మేఘముల పంక్తులను వలె, భూతైః -

భూతములచే, భూతాని - భూతములను, కాలయానః - కదల్చుచున్నవా డవై, లోకాన్ - లోకములను, వికర్షసి - ఉపసంహరించుచున్నావు.

ఈ విధముగా జగత్తును సృష్టించి దానిలో చైతన్యము రూపముగా ప్రకటమైన నీ స్వరూపము అనాత్మనిషేధరూపముగా మాత్రమే లక్షితమగు చున్నది. మాయాశక్తియొక్క ప్రచండమగు వేగము గల నీవు ప్రళయకాల ములో, సహించ శక్యము కాని వేగము గల వాయువు మేఘపంక్తులను వలె, ఆకాశము మొదలగు భూతములచే పృథివి మొదలగు భూతములను ఇటునటు కదల్చుచూ (అనగా విలోమక్రమములో ఉపసంహరిస్తూ), ఈ లోకములను ఉపసంహరించెదవు.

ప్రమత్తముచ్చైరితికృత్యచింతయా
ప్రవృద్ధలోభం విషయేషు లాలసమ్ ।
త్వమప్రమత్తస్సహసాఽభిపద్యసే
క్షుల్లేలిహానోఽహిరివాఖుమంతకః ।। 66

ఇతికృత్యచింతయా - ఈ పనిని ఇట్లు చేయవలెను అనే చింతతో, ఉచ్చైః - చాల, ప్రమత్తమ్ - అజాగ్రత్తగానున్నట్టియు, ప్రవృద్ధలోభమ్ - బాగా పెరిగిపోయిన లోభము కలిగినట్టియు, విషయేషు - భోగ్యవస్తువుల యందు, లాలసమ్ - లంపటము కలిగిన వ్యక్తిని, అప్రమత్తః - సావధాను డవైన, అంతకః - కాలరూపుడవగు, త్వమ్ - నీవు, సహసా - అకస్మాత్తు గా, ఆఖుమ్ - ఎలుకను, క్షుత్-లేలిహానః - ఆకలితో మ్రింగగోరుచున్న, అహిః ఇవ - పాము వలె, అభిపద్యసే - ఆక్రమించుచున్నావు.

మానవుడు వేర్వేరు పనులను చేసుకొనే హడావుడిలోనున్నవాడై, భోగ్యవస్తువులయందు ధనమునందు లంపటమును పెంచుకొని, తన స్వరూపము విషయములో అసావధానుడుగ నుండును. కాని, కాలరూపు డవగు నీవు అసావధానుడుగ నుండవు. వానిని కాలరూపుడవగు నీవు, ఆక లిగొన్న పాము ఎలుకను వలె, అకస్మాత్తుగా ఆక్రమించి, మ్రింగి వేసెదవు.

కస్త్వత్పదాబ్జం విజహాతి పండితో
యస్తేఽవమానవ్యయమానకేతనః ।

విశంకయాఽస్మద్గురురర్చతి స్మ యత్
వినోపపత్తిం మనవశ్చతుర్దశ ॥ 67

యః - ఎవడైతే, తే - నీయొక్క, అవమానవ్యయమానకేతనః - అనాదరముచే ఖర్చు అగుచున్న శరీరము గలవాడో, పండితః - వివేకియగు, కః - ఎవ్వాడు, త్వత్-పద-అబ్జమ్ - నీ పాదపద్మమును, విజహాతి - విడిచిపెట్టును? యత్ - దేనివి, అస్మత్-గురుః - మాకు తండ్రియగు బ్రహ్మగారు, విశంకయా - నశించుననే శంకచే, అర్చతి స్మ - పూజించుచున్నాడో, ఉపపత్తిం వినా - కామన లేకుండగనే, చతుర్దశ - పదునల్గురు, మనవః - మనువులు (పూజించుచున్నారో).

ఈశ్వరుడవగు నిన్ను ఉపేక్షించిన కాలములో ఈ శరీరము వృథాగా ఖర్చు అయిపోవుచుండును. ఈ సత్యమును గుర్తించిన వివేకియగు ఏ వ్యక్తి నీ పాదపద్మమును విడిచిపెట్టును? మాకు తండ్రియగు బ్రహ్మగారు కూడ ఆయుర్దాయము వృథయగుననే ఆశంకతో నీ పాదపద్మమువారాధించుచున్నాడు. పదునల్గురు మనువులు కూడ నిష్కామముగా నీ పాదపద్మమువారాధించెదరు.

అథ త్వమసి నో బ్రహ్మన్ పరమాత్మన్ విపశ్చితామ్ ।
విశ్వం రుద్రభయధ్వస్తమకుతశ్చిద్భయా గతిః ॥ 68

బ్రహ్మన్ - ఓ పరబ్రహ్మా!, పరమాత్మన్ - ఓ పరమాత్మా!, విశ్వమ్ - జగత్తు, రుద్రభయధ్వస్తమ్ - రుద్రుని వలని భయముచే ధ్వస్తమైనది, అథ - అందువలన, విపశ్చితామ్ - వివేకవంతులమగు, నః - మాకు, త్వమ్ - నీవు, అకుతశ్చిత్-భయా - దేనివలనైననూ భయము లేని, గతిః - గతివి, అసి - అగుచున్నావు.

ఓ పరబ్రహ్మా! (సర్వజగత్కారణుడు) పరమాత్మా! (ప్రాణియొక్క అంతరతమమగు స్వరూపము) కాలరూపుడగు రుద్రుని (సంహారకుని) భయముచే ఈ జగత్తు ధ్వస్తమైనది. కావున, వివేకవంతులగు మావంటివారలకు దేనివలనైననూ భయము లేని శరణము నీవే అగుచున్నావు.

**ఇదం జపత భద్రం వో విశుద్ధా నృపనందనాః ।**
**స్వధర్మమనుతిష్ఠంతో భగవత్యర్పితాశయాః ॥ 69**

నృపనందనాః - రాజకుమారులారా!, విశుద్ధాః - పరిశుద్ధులై, స్వధర్మమ్ - స్వధర్మమును, అనుతిష్ఠంతః - అనుష్ఠించుచున్నవారై, భగవతి - భగవంతునియందు, అర్పిత-ఆశయాః - అర్పించబడిన హృదయము గలవారై, ఇదమ్ - దీనిని, జపత - జపించుడు, వః - మీకు, భద్రమ్ - మంగళమగు గాక!

రాజకుమారులారా! మీరు పరిశుద్ధహృదయులై స్వధర్మమును అనుష్ఠించుచుండుడు. భగవంతునియందు మనస్సును నిలిపి ఈ స్తోత్రమును జపించుడు. మీకు మంగళమగు గాక!

**తమేవాత్మానమాత్మస్థం సర్వభూతేష్వవస్థితమ్ ।**
**పూజయధ్వం గృణంతశ్చ ధ్యాయంతశ్చాసకృద్ధరిమ్ ॥ 70**

సర్వభూతేషు - సకలప్రాణులలో, ఆత్మస్థమ్ - బుద్ధిగుహాయందు స్థితియు, ఆత్మానమ్ - ఆత్మరూపుడై, అవస్థితమ్ - ఉన్న, తమ్ - ఆ, హరిం ఏవ - శ్రీహరిని నిశ్చయముగా, అసకృత్ - పలుమార్లు, గృణంతః - కీర్తించుచున్నవారై, చ - మరియు, ధ్యాయంతః - ధ్యానించుచున్నవారై, పూజయధ్వమ్ - పూజించుడు.

శ్రీహరి సకలప్రాణుల బుద్ధియందు ఆత్మరూపుడై ఉన్నాడు. మీరు ఆయనను తప్పని సరిగా నిరంతరముగా కీర్తిస్తూ ధ్యానిస్తూ పూజించుడు.

**యోగాదేశముపాసాద్య ధారయంతో మునివ్రతాః ।**
**సమాహితధియస్సర్వ ఏతదభ్యసతాదృతాః ॥ 71**

యోగాదేశమ్ - యోగాదేశమనే ఈ స్తోత్రమును, ఉపాసాద్య - పొంది, ధారయంతః - గుర్తులోనుంచుకున్నవారై, మునివ్రతాః - భగవామని మననమే వ్రతముగా గలవారై, సమాహితధియః - ఏకాగ్రచిత్తులై, సర్వే - మీరందరు, ఏతత్ - దీనిని, ఆదృతాః - ఆదరము గలవారై, అభ్యసత - అభ్యసించుడు.

ఈ స్తోత్రమునకు యోగాదేశము (భగవత్ప్రాప్తికి ఉపాయముగా శివునిచే బోధించబడినది) అని పేరు. దీనిని మీరందరు నానుండి పొంది, గుర్తులోనుంచుకొని, నిష్ఠతో మననము చేయుడు. మీరు ఏకాగ్రచిత్తులై ఆదరముతో ఈ స్తోత్రమునభ్యసించుడు.

ఇదమాహ పురాఽస్మాకం భగవాన్ విశ్వసృక్పతిః ।
భృగ్వాదీనామాత్మజానాం సిసృక్షుస్సంసిసృక్షతామ్ ॥ 72

విశ్వసృక్-పతిః - ప్రజాపతులకు ప్రభువగు, భగవాన్ - బ్రహ్మదేవుడు, పురా - పూర్వము, సిసృక్షుః - సృష్టిని చేయగోరువాడై, సంసిసృక్షతామ్ - చక్కగా సృష్టిని చేయగోరుచున్న, భృగు-ఆదీనామ్ - భృగువు మొదలగు, ఆత్మజానామ్ - పుత్రులమగు, అస్మాకమ్ - మాకు, ఇదమ్ - ఈ స్తోత్రమును, ఆహ - చెప్పెను.

ప్రజాపతులకు ప్రభువగు బ్రహ్మదేవుడు పూర్వము సృష్టిని చేయ గోరెను. అపుడాయన సృష్టిని చక్కగా చేయగోరుచున్న తన పుత్రులగు భృగువు మొదలైన మాకు ఈ స్తోత్రమునుపదేశించెను.

తే వయం నోదితాస్సర్వే ప్రజాసర్గే ప్రజేశ్వరాః ।
అనేన ధ్వస్తతమసస్సిసృక్ష్మో వివిధాః ప్రజాః ॥ 73

ప్రజాసర్గే - ప్రాణుల సృష్టియందు, నోదితాః - ప్రేరేపించబడిన, ప్రజా-ఈశ్వరాః - ప్రజాపతులమగు, తే - అట్టి, వయమ్ - మేము, సర్వే - అందరము, అనేన - ఈ స్తోత్రముచే, ధ్వస్తతమసః - నశింపజేయబడిన అజ్ఞానము గలవారమై, వివిధాః - అనేకరకముల, ప్రజాః - ప్రాణులను, సిసృక్ష్మః - సృష్టించితిమి.

ప్రాణులను సృష్టించుడని ప్రజాపతులమగు మమ్ములనందరిని బ్రహ్మదేవుడు ప్రేరేపించెను. మేమీ స్తోత్రమును పఠించగా మా అజ్ఞానము నశించెను. అపుడు మేము అనేకరకముల ప్రాణులను సృష్టించితిమి.

అథేదం నిత్యదా యుక్తో జపన్నవహితః పుమాన్ ।
అచిరాచ్ఛ్రేయ ఆప్నోతి వాసుదేవపరాయణః ॥ 74

అథ - కావున, వాసుదేవపరాయణః - వాసుదేవుడే పరమలక్ష్యముగా గల, పుమాన్ - వ్యక్తి, ఇదమ్ - ఈ స్తోత్రమును, నిత్యదా - నిత్యము, యుక్తః - ఏకాగ్రమగు చిత్తము గలవాడై, అవహితః - సావధానుడై, జపన్ - జపించువాడై, అచిరాత్ - తొందరలోనే, శ్రేయః - హితమును, ఆప్నోతి - పొందుచున్నాడు.

కావున, వాసుదేవుడే పరమలక్ష్యముగా గల వ్యక్తి ఏకాగ్రమగు చిత్తముతో ఈ స్తోత్రమును సావధానముగా జపించవలెను. అట్లు చేయు వ్యక్తి తొందరలోనే శ్రేయస్సును పొందుచున్నాడు.

శ్రేయసామిహ సర్వేషాం జ్ఞానం నిఃశ్రేయసం పరమ్ ।
సుఖం తరతి దుష్పారం జ్ఞాననౌర్వ్యసనార్ణవమ్ ।। 75

ఇహ - ఈ లోకములో, సర్వేషామ్ - అన్ని, శ్రేయసామ్ - శ్రేయస్సులలో, జ్ఞానమ్ - ఆత్మజ్ఞానము, నిఃశ్రేయసమ్ - అంతకంటె గొప్ప శ్రేయస్సు మరియొకటి లేనిది, పరమ్ - సర్వోత్కృష్టమైనది, జ్ఞాననౌః - ఆత్మజ్ఞానమనే నావ గలవాడు, దుష్పారమ్ - తరించ శక్యము కాని, వ్యసన-అర్ణవమ్ - దుఃఖసముద్రమును, సుఖమ్ - తేలికగా, తరతి - తరించుచున్నాడు.

ఈ లోకములో హితములన్నింటిలో ఆత్మజ్ఞానము సర్వోత్కృష్టమైన హితము. జీవన్ముక్తి రూపమగు ఆత్మజ్ఞానము కంటె గొప్పది అగు శ్రేయస్సు మరియొకటి లేదు. అట్టి ఆత్మజ్ఞానమనే నావ గల వ్యక్తి దుఃఖసముద్రమును తేలికగా తరించును. ఈ సంసారసముద్రమును మరియొక విధముగా తరించుట శక్యము కాదు.

య ఇమం శ్రద్ధయా యుక్తో మద్గీతం భగవత్స్తవమ్ ।
అధీయానో దురారాధ్యం హరిమారాధయత్యసౌ ।। 76

యః - ఎవడైతే, మత్-గీతమ్ - నాచే కీర్తించబడిన, ఇమమ్ - ఈ, భగవత్-స్తవమ్ - శ్రీహరియొక్క స్తోత్రమును, శ్రద్ధయా - శ్రద్ధతో, యుక్తః - కూడుకున్నవాడై, అధీయానః - అధ్యయనము చేయుచున్నవాడో, అసౌ

- వీడే, దురారాధ్యమ్ - ఆరాధించుట శక్యము కాని, హరిమ్ - శ్రీహరిని, ఆరాధయతి - ఆరాధించుచున్నాడు.

శ్రీహరిని ఆరాధించుట అంత తేలిక కాదు. కాని, ఎవడైతే నాచే కీర్తించబడిన ఈ శ్రీహరి స్తోత్రమును శ్రద్ధతో అధ్యయనము చేయునో, అట్టి వాడు తద్ద్వారా శ్రీహరిని సునాయాసముగా ఆరాధించుచునే యున్నాడు.

విందతే పురుషోఽముష్మాద్యద్యదిచ్ఛత్యసత్వరమ్ ।
మద్గీతగీతాత్సుప్రీతాచ్ఛ్రేయసామేకవల్లభాత్ ॥ 77

అసత్వరమ్ - తొందరపాటు లేని విధముగా, మత్-గీతగీతాత్ - నా గీతముచే కీర్తించబడినట్టియు, సుప్రీతాత్ - మిక్కిలి ప్రసన్నుడైనట్టి యు, శ్రేయసామ్ - శ్రేయస్సులకు, ఏకవల్లభాత్ - మంగళములకు ఏకైక మగు ఆశ్రయమైన, అముష్మాత్ - ఈ శ్రీహరినుండి, పురుషః - మానవు డు, యత్ యత్ - దేనిని దేనిని, ఇచ్ఛతి - కోరుచున్నాడో దానిని, విందతే - పొందుచున్నాడు.

నేను తొట్రుపాటు లేకుండగా ఈ గీతముతో శ్రీహరిని స్తుతించితి వి. శ్రీహరి సకలకల్యాణములకు ఏకైకమగు ప్రియనిధానము. ఆయనను ఈ గీతముతో స్తుతించినచో ఆయన ప్రసన్నుడగును. అట్లు స్తుతించు వ్యక్తికి కోరికలన్నియు ఈడేరును.

ఇదం యః కల్య ఉత్థాయ ప్రాంజలిశ్శ్రద్ధయాఽన్వితః ।
శృణుయాచ్ఛ్రావయేన్మర్త్యో ముచ్యతే కర్మబంధనైః ॥ 78

యః - ఏ, మర్త్యః - మానవుడైతే, కల్యే - తెల్లవారుజామున, ఉత్థాయ - నిద్ర లేచి, ప్రాంజలిః - చేతులను జోడించినవాడై, శ్రద్ధయా - శ్రద్ధతో, అన్వితః - కూడుకున్నవాడై, ఇదమ్ - ఈ గీతమును, శృణుయాత్ - వినునో, శ్రావయేత్ - వినిపించునో అట్టివాడు, కర్మబంధనైః - కర్మ బంధములనుండి, ముచ్యతే - విముక్తుడగుచున్నాడు.

ఏ వ్యక్తియైతే తెల్లవారు జామున నిద్ర లేచి చేతులను జోడించి ఈ గీతమును శ్రద్ధతో వినునో, లేక ఇతరులకు వినిపించునో, అట్టి వ్యక్తి కర్మబంధములనుండి విముక్తిని పొందుచున్నాడు.

గీతం మయేదం నరదేవనందనాః
పరస్య పుంసః పరమాత్మనః స్తవమ్ ।
జపంత ఏకాగ్రధియస్తపో మహత్
చరధ్వమంతే తత ఆప్స్యథేప్సితమ్ ॥ 79

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే చతుర్థస్కంధే
రుద్రగీతం నామ చతుర్వింశోఽధ్యాయః ॥

నరదేవనందనాః - రాజకుమారులారా!, పరస్య పుంసః - పరమ పురుషుడైనట్టియు, పరమాత్మనః - పరమాత్మయగు శ్రీహరియొక్క, మయా - నాచే, గీతమ్ - కీర్తించబడిన, ఇదమ్ - ఈ, స్తవమ్ - స్తోత్రమును, ఏకాగ్రధియః - ఏకాగ్రమగు చిత్తము గలవారై, జపంతః - జపించుచున్నవారై, మహత్ - గొప్ప, తపః - తపస్సును, చరధ్వమ్ - చేయుడు, అంతే - ఆఖరున, తతః - ఆ శ్రీహరినుండి, ఈప్సితమ్ - కోరినదానిని, ఆప్స్యథ - పొందుదురు.

రాజకుమారులారా! పరమపురుషుడగు శ్రీహరి సకలప్రాణులలో అంతరతమమగు ఆత్మరూపుడై యున్నాడు. నేనాయనను స్తుతించిన ఈ గీతమును ఏకాగ్రచిత్తముతో జపిస్తూ మీరు గొప్ప తపస్సును ఆచరించుడు. తపస్సునకు అంతమునందు ఆ శ్రీహరి మీ కోరికనీడేర్చును.

శ్రీమద్భాగవత మహాపురాణములోని నాల్గవ స్కంధమునందు రుద్రగీత మనే ఇరువది నాల్గవ అధ్యాయము ముగిసినది (24).

*****

# అథ పంచవింశోఽధ్యాయః

## పురంజనోపాఖ్యానము - పురంజనీ పురంజనుల సమాగమము

మైత్రేయ ఉవాచ ।
ఇతి సందిశ్య భగవాన్ బార్హిషదైరభిపూజితః ।
పశ్యతాం రాజపుత్రాణాం తత్రైవాంతర్దధే హరః ॥ 1

మైత్రేయః - మైత్రేయ మహర్షి, ఉవాచ - పలికెను, భగవాన్ హరః - శివ భగవానుడు, ఇతి - ఈ విధముగా, సందిశ్య - ఉపదేశించి, బార్హిషదైః - బర్హిషత్ పుత్రులగు ప్రచేతసులచే, అభిపూజితః - పూజించబడినవాడై, రాజపుత్రాణామ్ - ఆ రాజకుమారులు, పశ్యతామ్ - చూచుచుండగా, తత్ర ఏవ - అక్కడనే (అప్పుడే), అంతర్దధే - అంతర్ధానమాయెను.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- శివ భగవానుడు బర్హిషత్ మహారాజుయొక్క పుత్రులగు ఆ ప్రచేతసులకు ఈ విధముగా ఉపదేశించి, వారు చూచుచుండగనే అప్పుడే అక్కడనే అంతర్ధానమాయెను.

రుద్రగీతం భగవతః స్తోత్రం సర్వే ప్రచేతసః ।
జపంతస్తే తపస్తేపుర్వర్షాణామయుతం జలే ॥ 2

రుద్రగీతమ్ - రుద్రునిచే కీర్తించబడిన, భగవతః - శ్రీహరి భగవానునియొక్క, స్తోత్రమ్ - స్తోత్రమును, తే - ఆ, ప్రచేతసః - ప్రచేతసులు, సర్వే - అందరు, జపంతః - జపించుచున్నవారై, జలే - నీటియందు, వర్షాణాం అయుతమ్ - పదివేల సంవత్సరములు, తపః - తపస్సును, తేపుః - చేసిరి.

రుద్రునిచే కీర్తించబడిన శ్రీహరి భగవానుని స్తోత్రమును ఆ ప్రచేతసులందరు జపిస్తూ పదివేల సంవత్సరములు నీటిలో ఉండి తపస్సును చేసిరి.

ప్రాచీనబర్హిషం క్షత్తః కర్మస్వాసక్తమానసమ్ ।
నారదోఽధ్యాత్మతత్త్వజ్ఞః కృపాలుః ప్రత్యబోధయత్ ॥ 3

క్షత్తః - ఓ విదురా!, కర్మసు - కర్మలయందు, ఆసక్తమానసమ్ - తగుల్కొన్న మనస్సు గల, ప్రాచీనబర్హిషమ్ - ప్రాచీనబర్హిషుని, అధ్యాత్మతత్త్వజ్ఞః - ఆత్మస్వరూపము తెలిసినవాడు, కృపాలుః - దయామయుడు అగు, నారదః - నారదుడు, ప్రత్యబోధయత్ - మేల్కొలిపెను.

ఓ విదురా! బర్హిషత్ మహారాజు కర్మలలో నిమగ్నమైన మనస్సు గలవాడై యుండగా, ఆత్మతత్త్వము తెలిసిన దయామయుడగు నారదుడు ఆతనికి (ఉపదేశించి) మేల్కొలిపెను.

శ్రేయస్త్వం కతమద్రాజన్ కర్మణాత్మన ఈహసే ।
దుఃఖహానిస్సుఖావాప్తిశ్శ్రేయస్తన్నేహ చేష్యతే ॥ 4

రాజన్ - ఓ రాజా!, త్వమ్ - నీవు, కర్మణా - కర్మచే, ఆత్మనః - నీకు, కతమత్ - ఎట్టి, శ్రేయః - శ్రేయస్సును, ఈహసే - కోరుచున్నావు?, దుఃఖహానిః - దుఃఖము తొలగుట, సుఖ-అవాప్తిః - సుఖము లభించుట అనే, తత్ - ఆ, శ్రేయః - శ్రేయస్సు, ఇహ - ఈ కర్మమార్గమునందు, న ఇష్యతే - అంగీకరించబడుట లేదు.

ఓ రాజా! నీవు కర్మమార్గముచే ఎట్టి శ్రేయస్సును సంపాదించ గోరుచున్నావు? దుఃఖము తొలగుట, సుఖము లభించుట అనే రెండు కలిసి శ్రేయస్సు అగును. కర్మమార్గములో ఇట్టి శ్రేయస్సు పూర్ణముగా లభించునని విద్వాంసులు అంగీకరించుట లేదు.

రాజోవాచ ।
న జానామి మహాభాగ పరం కర్మాపవిద్ధధీః ।
బ్రూహి మే విమలం జ్ఞానం యేన ముచ్యేయ కర్మభిః ॥ 5

మహాభాగ - ఓ మహాత్మా!, కర్మ-అపవిద్ధధీః - కర్మలచే విక్షిప్తమైన బుద్ధిగల నేను, పరమ్ - సర్వోత్తమమగు శ్రేయస్సును, న జానామి - తెలియకున్నాను, మే - నా కొరకు, విమలమ్ - దోషరహితము గు (అజ్ఞానమును పోగొట్టే), జ్ఞానమ్ - జ్ఞానమును, బ్రూహి - చెప్పుము, యేన - దేనిచే, కర్మభిః - కర్మలచే, ముచ్యేయ - విముక్తుడనగుదునో.

బర్హిషత్ మహారాజు ఇట్లు పలికెను --- ఓ మహాత్మా! నా బుద్ధి కర్మలచే చెల్లాచెదరుగా నున్నది. కావుననే, సర్వోత్తమమగు మోక్షమును గురించి నాకు తెలియకున్నది. నాకు మీరు దోషరహితమగు జ్ఞానమునుప దేశించి, అజ్ఞానమును పోగొట్టి, కర్మలనుండి విముక్తిని కలిగించుడు.

గృహేషు కూటధర్మేషు పుత్రదారధనార్థధీః ।
న పరం విందతే మూఢో భ్రామ్యన్ సంసారవర్త్మసు ॥ 6

గృహేషు - ఇంటియందు, పుత్రదారధన-అర్థధీః - సంతానము భార్య ధనము అనునవియే పురుషార్థములనే భావన గలవాడై, మూఢః - వ్యామోహమును పొందియున్న జనుడు, సంసారవర్త్మసు - సంసారము నకు దారితీసే, కూటధర్మేషు - వ్యర్థములగు కామ్యకర్మలయందు, భ్రామ్యన్ - తిరుగాడుచున్నవాడై, పరమ్ - మోక్షమును, న విందతే - పొందుట లేదు.

గృహస్థుడు తన సంతానము భార్య ధనము అనునవియే పురుషా ర్థములనే భావనలో వ్యామోహితుడై యుండును. అట్టివాడు సంసార మును స్థిరము చేసే వ్యర్థములగు కామ్యకర్మలను అనుష్ఠిస్తూ సంసార ములో పరిభ్రమించును. వానికి మోక్షము లభించదు.

నారద ఉవాచ ।
భో భోః ప్రజాపతే రాజన్ పశూన్ పశ్య త్వయాఽధ్వరే ।
సంజ్ఞాపితాన్ జీవసంఘాన్నిర్ఘృణేన సహస్రశః ॥ 7

భోః భోః - ఓయీ!, ప్రజాపతే - ప్రజాపతీ! రాజన్ - రాజా!, నిర్ఘృ ణేన - దయ లేని, త్వయా - నీచే, అధ్వరే - యజ్ఞమునందు, సహస్రశః -

వేల సంఖ్యలో, సంజ్ఞాపితాన్ - చంపబడిన, పశూన్ - పశువులను, జీవసం ఘాన్ - ప్రాణుల సమూహములను, పశ్య - చూడుము.

ఓ ప్రజాపతీ! మహారాజా! నీవు నిర్దయగా యజ్ఞములో పశువులను, ఇతరప్రాణుల సమూహములను వేల సంఖ్యలో సంహరించితివి. వాటిని గుర్తుకు తెచ్చుకొనుము.

ఏతే త్వాం సంప్రతీక్షంతే స్మరంతో వైశసం తవ ।
సంపరేతమయఃకూటైశ్ఛిందంత్యుత్థితమన్యవః ॥ 8

ఏతే - ఈ పశువులు, తవ - నీయొక్క, వైశసమ్ - పీడను, స్మరంతః - గుర్తుకు తెచ్చుకొనుచున్నవై, ఉత్థితమన్యవః - పైకి తన్నుకు వచ్చుచున్న కోపము గలవై, సంపరేతమ్ - మరణించిన, త్వామ్ - నిన్ను, సంప్రతీక్షంతే - ఎదురు చూచుచున్నవి, అయఃకూటైః - ఇనుప కొమ్ములతో, ఛిందంతి - చీల్చి వేయగలవు.

ఈ పశువులు నీవు పెట్టిన పీడను గుర్తు చేసుకుంటూ నీ మరణము కొరకు ఎదురు చూచుచున్నవి. అవి పైకి తన్నుకు వచ్చిన కోపము గలవియై నిన్ను ఇనుప కొమ్ములతో చీల్చి చెండాడును.

అత్ర తే కథయిష్యేఽముమితిహాసం పురాతనమ్ ।
పురంజనస్య చరితం నిబోధ గదతో మమ ॥ 9

అత్ర - ఈ సందర్భములో, పురంజనస్య - పురంజనునియొక్క, చరితమ్ - చరితము అనే, పురాతనమ్ - ప్రాచీనమగు, అముమ్ - ఈ, ఇతిహాసమ్ - గాథను, తే - నీ కొరకు, కథయిష్యే - చెప్పగలను, గదతః - చెప్పుచున్న, మమ - నా మాటను, నిబోధ - తెలియుము.

ఈ సందర్భములో నీకు ప్రాచీనమగు పురంజనుని వృత్తాంతమును చెప్పెదను. దీనిని నేను చెప్పుచుండగా సావధానుడవై తెలియుము.

**ఆసీత్పురంజనో నామ రాజా రాజన్ బృహచ్ఛ్రవాః ।**
**తస్యావిజ్ఞాతనామాఽఽసీత్సఖాఽవిజ్ఞాతచేష్టితః ॥ 10**

రాజన్ - ఓ రాజా!, పురంజనః నామ - పురంజనుడని ప్రసిద్ధిని గాంచినవాడు, బృహత్-శ్రవాః - గొప్ప కీర్తి గలవాడు అగు, రాజా - రాజు, **ఆసీత్** - ఉండెను, **తస్య** - వానికి, **అవిజ్ఞాతనామా** - **అవిజ్ఞాతుడు అని** ప్రసిద్ధిని గాంచినవాడు, **అవిజ్ఞాతచేష్టితః** - **తెలియబడని చేష్టలు** గలవాడు అగు, సఖా - **మిత్రుడు, ఆసీత్** - ఉండెను.

ఓ రాజా! పురంజనుడు అనే పేరుతో ప్రసిద్ధిని గాంచి గొప్ప కీర్తిని పొందిన రాజు ఉండెను. ఆయనకు అవిజ్ఞాతుడు (తెలియబడని పేరు గల వాడు) అనే మిత్రుడు ఒకడు ఉండెను. ఆ మిత్రుని చేష్టలు ఎవ్వరికైననూ తెలియకుండెను.

**సోఽన్వేషమాణశ్శరణం బభ్రామ పృథివీం ప్రభుః ।**
**నానురూపం యదాఽవిందదభూత్స విమనా ఇవ ॥ 11**

సః - ఆ, ప్రభుః - పురంజన మహారాజు, శరణమ్ - నివాసస్థానమును, అన్వేషమాణః - వెదుకుచున్నవాడై, పృథివీమ్ - భూలోకమును, బభ్రామ - తిరిగెను, యదా - ఎప్పుడైతే, అనురూపమ్ - తగిన స్థానమును, న **అవిందత్** - పొందలేదో, సః - ఆతడు, విమనాః ఇవ - నిశ్చితముగా చెడిన మనస్సు గలవాడు, **అభూత్** - ఆయెను.

ఆ పురంజన మహారాజు నివాసస్థానము కొరకై వెదుకుతూ భూలోకమంతయు తిరిగెను. కాని ఆతనికి తగిన నివాసస్థానము లభించలేదు. అప్పుడాతని మనస్సు వికలమయ్యెను.

**న సాధు మేనే తాస్సర్వా భూతలే యావతీః పురః ।**
**కామాన్ కామయమానోఽసౌ తస్య తస్యోపపత్తయే ॥ 12**

**కామాన్** - **భోగ్యవస్తువులను, కామయమానః** - **కోరుచున్న, అసౌ** - **ఈ** రాజు, **భూతలే** - **భూలోకమునందు, యావతీః** - ఎన్ని, **పురః** - నగరములు గలవో, **తాః** - **వాటిని, సర్వాః** - **అన్నింటినీ, తస్య తస్య** - **అయా**

కామనయొక్క, ఉపపత్తయే - లభించుట కొరకు, సాధు - మంచివిగా, న మేనే - తలంచలేదు.

భూలోకములో ఎన్నో నగరములు గలవు. కాని, అనేకములగు కామనలు గల ఈ రాజునకు తాను కోరే భోగ్యవస్తువులను పొందుటకై వాటిలో ఏ ఒక్కటియైననూ నచ్చలేదు.

స ఏకదా హిమవతో దక్షిణేష్వథ సానుషు ।
దదర్శ నవభిర్ద్వార్భిః పురీం లక్షితలక్షణామ్ ॥ 13

అథ - తరువాత, ఏకదా - ఒకనాడు, సః - ఆతడు, హిమవతః - హిమవత్పర్వతముయొక్క, దక్షిణేషు - దక్షిణదిక్కునందలి, సానుషు - సానువులయందు, నవభిః - తొమ్మిది, ద్వార్భిః - ద్వారములతో, లక్షితలక్షణామ్ - రమ్యములగు నగరలక్షణములు గల, పురీమ్ - నగరమును, దదర్శ - చూచెను.

తరువాత ఒకనాడు ఆయన హిమవత్పర్వతముయొక్క దక్షిణదిక్కునందు కొండచరియలపై ఒక నగరమును చూచెను. తొమ్మిది ద్వారములు గల ఆ నగరము అన్ని మంచి లక్షణములతో రమ్యముగానుండెను.

ప్రాకారోపవనాట్టాలపరిఖైరక్షతోరణైః ।
స్వర్ణరౌప్యాయసైశ్శృంగైస్సంకులాం సర్వతో గృహైః ॥14

ప్రాకార-ఉపవన-అట్టాలపరిఖైః - ప్రాకారము ఉద్యానములు బురుజులు మరియు కందకములతో, అక్షతోరణైః - కిటికీలు నగరబహిర్ద్వారములతో, స్వర్ణరౌప్య-ఆయసైః - బంగరు వెండి ఇనుప, శృంగైః - శిఖరములతో, సర్వతః - అంతటా, గృహైః - ఇళ్లతో, సంకులామ్ - దట్టముగా నున్న (నగరమును చూచెను).

ఆ నగరము ప్రాకారములతో ఉద్యానవనములతో బురుజులతో కందకముతో శోభిల్లెను. దానిలోని శిఖరములవంటి భవనములు బంగారము వెండి ఇనుములతో నిర్మించబడెను. బహిర్ద్వారములతో శోభిల్లే ఆ నగరములో కిటికీలతో కూడిన ఇళ్లు కిటకిటలాడుచుండెను.

నీలస్ఫటికవైడూర్యముక్తామరకతారుణైః ।
క్లుప్తహర్మ్యస్థలీం దీప్తాం శ్రియా భోగవతీమివ ॥ 15

నీలస్ఫటికవైడూర్యముక్తామరకత-అరుణైః - ఇంద్రనీలములు స్ఫటికములు వైడూర్యములు ముత్యములు పచ్చలు మరియు కెంపులతో, క్లుప్తహర్మ్యస్థలీమ్ - పొదగబడిన ప్రాసాదములయందలి నేలలు గలిగినదై, శ్రియా - సంపద (శోభ) తో, భోగవతీం ఇవ - భోగవతీ నగరము వలె, దీప్తామ్ - వెలిగిపోవుచున్న (పురమును చూచెను).

ఆ నగరములోని ప్రాసాదములలో నేలలపై ఇంద్రనీలములు, స్ఫటికములు, వైడూర్యములు, ముత్యములు, పచ్చలు మరియు కెంపులు పొదగబడినవి. ఈ విధముగా ఆ నగరము సంపదల శోభతో భోగవతీ నగరమువలె వెలిగిపోవుచుండెను.

సభాచత్వరరథ్యాభిరాక్రీడాయతనాపణైః ।
చైత్యధ్వజపతాకాభిర్యుక్తాం విద్రుమవేదిభిః ॥ 16

సభాచత్వరరథ్యాభిః - సభలు కూడళ్లు మరియు రాజమార్గములతో, ఆక్రీడా-ఆయతన-ఆపణైః - ఆటపాటల స్థానములతో మరియు అంగళ్ల తో, చైత్యధ్వజపతాకాభిః - విశ్రాంతిగృహములతో మరియు జెండాలపై పతాకలతో, విద్రుమవేదిభిః - పగడపు రచ్చబండలతో, యుక్తామ్ - కూడియున్న (పురమును చూచెను).

సభలు, కూడళ్లు, రాజ (రథ) మార్గములు, ఆటపాటల భవనములు, అంగళ్లు, విశ్రాంతిగృహములు, పగడపు రచ్చబండలతో ఆ పురము ప్రకాశించెను. అచటి ప్రాసాదములపై జెండాకర్రలయందు పతాకములు రెపరెపలాడుచుండెను.

పుర్యాస్తు బాహ్యోపవనే దివ్యద్రుమలతాకులే ।
నదద్విహంగాలికులకోలాహలజలాశయే ॥ 17

హిమనిర్ఝరవిప్రుష్మత్కుసుమాకరవాయునా ।
చలత్ప్రవాలవిటపనలినీతటసంపది ॥ 18

**నానారణ్యమృగవ్రాతైరనాబాధే మునివ్రతైః ।**
**ఆహూతం మన్యతే పాంథో యత్ర కోకిలకూజితైః ॥ 19**

పుర్యాః తు - ఆ నగరముయొక్క, దివ్యద్రుమలతా-ఆకులే - మనోహరములగు చెట్లతో మరియు లతలతో వ్యాపించబడి యున్నట్టియు, నదత్-విహంగ-అలికులకోలాహలజల-ఆశయే - కూసే పక్షుల మరియు తుమ్మెదల గుంపుల కోలాహలము గల సరస్సులు కలిగినట్టియు, హిమని ర్ఝరవిప్రుష్మత్-కుసుమ-ఆకరవాయునా - చల్లని కొండకాలువల తుంపరలు గల పుష్పగుచ్ఛములకు చెందిన గాలిచే, చలత్-ప్రవాలవిటపనలినీతటసం పది - కదలాడే చిగుళ్లతో కూడిన కొమ్మలతో సరస్సుల తటములయందలి సమృద్ధిగలిగినట్టియు, మునివ్రతైః - మహర్షుల వ్రతమగు అహింసను వ్రత ముగా కలిగియున్న, నానా-అరణ్యమృగవ్రాతైః - అనేకములగు అడవి జంతువుల గుంపులతో, అనాబాధే - ఉపద్రవము లేని, బాహ్య-ఉపవనే - బయటనున్న ఉద్యానవనమునందు, యత్ర - ఎక్కడనైతే, పాంథః - బాట సారి, కోకిలకూజితైః - కోకిలల కూతలచే, ఆహూతః - ఆహ్వానించబడిన వానినిగా, మన్యతే - తలంచునో.

ఆ నగరమునకు బయట ఒక ఉద్యానవనము గలదు. అది మనో హరములగు చెట్లతో మరియు లతలతో వ్యాపించబడియున్నది. దానిలోని సరస్సులు కూసే పక్షులతో మరియు తుమ్మెదల గుంపులతో కోలాహల ముగా నున్నవి. ఆ సరస్సుల తీరమునందలి దట్టని చెట్లు చిగుళ్లతో, పుష్ప గుచ్ఛములతో శోభిల్లెను. ఆ పువ్వులపై కొండకాలువల చల్లని నీటి తుంప రలు నిండియుండెను. వాటిపైనుండి వీచే గాలి చిగుళ్లతో కూడిన కొమ్మ లను కదల్చుచుండెను. ఈ విధముగా ఆ స్థానము గొప్పగా ప్రకాశించెను. ఆ ఉద్యానవనమునందు మహర్షుల వలె అహింసావ్రతమును పాటించే పలురకముల అడవి జంతువులు గుంపులుగా తిరుగుచున్ననూ, వాటి వలన జనులకు ఉపద్రవము కలుగుట లేదు. అక్కడ కోకిలలు తమ కూత లతో బాటసారులను ఆహ్వానించుచున్నవా యన్నట్లుండెను.

**యదృచ్ఛయాఽఽగతాం తత్ర దదర్శ ప్రమదోత్తమామ్ ।**
**భృత్యైర్దశభిరాయాంతీమేకైకశతనాయకైః ॥ 20**

తత్ర - అచటకు, యదృచ్ఛయా - అనుకోకుండా, ఆగతామ్ - వచ్చినట్టియు, ఏక-ఏకశతనాయకైః - ఒక్కొక్కరు వందమంది సేవికలపై ఆధిపత్యము కలిగిన, దశభిః - పదిమంది, భృత్యైః - సేవకులతో, ఆయాంతీమ్ - వచ్చుచున్న, ప్రమదా-ఉత్తమామ్ - మత్తు కలిగించే సౌందర్యము గల యువతిని, దదర్శ - చూచెను.

మత్తును కలిగించే సౌందర్యము గల ఒక యువతి అచటకు అనుకోకుండా వచ్చెను. ఆమెతోబాటు పదిమంది సేవకులు నడచుచుండిరి. వారు ఒక్కొక్కరు వందమంది సేవికలపై ఆధిపత్యము గలవారు. ఆమెను ఆ రాజు చూచెను.

పంచశీర్షాహినా గుప్తాం ప్రతీహారేణ సర్వతః ।
అన్వేషమాణామృషభమప్రౌఢాం కామరూపిణీమ్ ॥ 21

ప్రతీహారేణ - ద్వారపాలకుడైన, పంచశీర్ష-అహినా - అయిదు తలల పాముచే, సర్వతః - అన్ని వైపులనుండి, గుప్తామ్ - రక్షించబడినట్టియు, ఋషభమ్ - భర్తను, అన్వేషమాణామ్ - వెదుకుచున్నట్టియు, అప్రౌఢామ్ - కన్య (అమాయకురాలు) యైనట్టియు, కామరూపిణీమ్ - వివిధ పద్ధతులలో సింగారించుకొనే (యువతిని చూచెను).

అనేకరకములుగా సింగారించుకొనే ఆ యువతికి అయిదు పడగల పాము ద్వారపాలకుడుగా ఉండి ఆమెను అన్ని విధములుగా అన్ని వైపుల నుండియు రక్షించుచుండెను. అమాయకురాలు, నూతన యౌవనములో ఉన్నది అగు ఆమె భర్త కొరకు అన్వేషించుచుండెను.

సునాసాం సుదతీం బాలాం సుకపోలాం వరాననామ్ ।
సమవిన్యస్తకర్ణాభ్యాం బిభ్రతీం కుండలశ్రియమ్ ॥ 22

సునాసామ్ - చక్కని ముక్కు గలిగినట్టియు, సుదతీమ్ - చక్కని దంతములు కలిగినట్టియు, సుకపోలామ్ - అందమైన చెక్కిళ్లు కలిగినట్టియు, వర-ఆననామ్ - అందమగు ముఖము కలిగినట్టియు, సమవిన్యస్తక

ర్ణాభ్యామ్ - సమానముగా కూర్చబడిన చెవులతో, కుండలశ్రియమ్ - కుండలముల శోభను, బిభ్రతీమ్ - ధరించియున్న, బాలామ్ - కన్యను.

ఆ కన్య చక్కని ముక్కుతో, అందమైన దంతములతో, చక్కని చెక్కిళ్లతో అందమైన ముఖమును కలిగియుండెను. ఆమె చెవులు సమానముగా అమరియుండెను. ఆ చెవులకు కుండలములు శోభిల్లుచుండెను.

పిశంగనీవీం సుశ్రోణీం శ్యామాం కనకమేఖలామ్ ।
పద్భ్యాం క్వణద్భ్యాం చలతీం నూపురైర్దేవతామివ ॥ 23

పిశంగనీవీమ్ - పచ్చని చీరను నడుమునకు దాల్చినట్టియు, సుశ్రోణీమ్ - చక్కని కటిభాగము కలిగినట్టియు, శ్యామామ్ - శ్యామల వర్ణము కలిగినట్టియు, కనకమేఖలామ్ - బంగరు మొలనూలు కలిగినట్టియు, నూపురైః - కాలి అందెలతో, క్వణద్భ్యామ్ - గణగణలాడుచున్న, పద్భ్యామ్ - పాదములతో, దేవతాం ఇవ - దేవత వలె, చలతీమ్ - నడచుచున్న (యువతిని చూచెను).

శ్యామల వర్ణము గల ఆ యువతి నడుమునకు పచ్చని చీరను దాల్చెను. చక్కని కటిభాగము గల ఆమె బంగరు మొలనూలును కలిగియుండెను. ఆమె దేవతవలె నడచుచుండగా కాలి అందెలు గణగణలాడుచుండెను.

స్తనౌ వ్యంజితకైశోరౌ సమవృత్తౌ నిరంతరౌ ।
వస్త్రాంతేన నిగూహంతీం వ్రీడయా గజగామినీమ్ ॥ 24

వ్యంజితకైశోరౌ - ప్రకటించబడిన వినూత్నయౌవనము కలిగినట్టియు, సమవృత్తౌ - సమానముగా వర్తులముగానున్నట్టియు, నిరంతరౌ - అంతరము లేని, స్తనౌ - స్తనములను, వ్రీడయా - సిగ్గుచే, వస్త్ర-అంతేన - చీరకొంగుతో, నిగూహంతీమ్ - కప్పుకొనుచున్నట్టియు, గజగామినీమ్ - గజగమనయైన (యువతిని చూచెను).

సమానముగా వర్తులముగా అంతరము లేకుండానున్న ఆమె స్తనములు క్రొత్తగా ఆరంభమైన యౌవనమును ప్రకటించుచున్నవి. ఆ గజగమన సిగ్గుచే చీరకొంగుతో నిండా కప్పుకొనెను.

తామాహ లలితం వీరస్సవ్రీడస్మితశోభనామ్ ।
స్నిగ్ధేనాపాంగపుంఖేన స్పృష్టః ప్రేమోద్భ్రమద్భ్రువా ॥25

సవ్రీడస్మితశోభనామ్ - సిగ్గుతో కూడిన చిరునవ్వుతో శోభిల్లుచున్న, తామ్ - ఆమెను ఉద్దేశించి, వీరః - వీరుడగు పురంజనుడు, స్నిగ్ధేన - ప్రేమతో నిండినట్టియు, ప్రేమ-ఉద్భ్రమత్-భ్రువా - ప్రేమచే వంకరతిరిగిన కనుబొమలు గల, అపాంగపుంఖేన - కడగంటి చూపు అనే బాణపు కొనచే, స్పృష్టః - కొట్టబడినవాడై, లలితమ్ - మనోహరముగా, ఆహ - పలికెను.

ఆమె ప్రేమతో పైకి పాగి వంకర తిరిగిన కనుబొమలే ధనస్సు కాగా, ప్రేమతో నిండిన కడగంటి చూపులే బాణపు కొన కాగా, అతనిని కొట్టెను (అనగా, ప్రేమతో అతనిని క్రీగంట చూచెను). అపుడు వీరుడగు ఆ పురంజనుడు, సిగ్గుతో కూడిన చిరునవ్వుతో ఇనుమడించిన శోభ గల ఆమెతో మధురముగా ఇట్లనెను.

కా త్వం కంజపలాశాక్షి కస్యాసీహ కుతస్సతి ।
ఇమాముపపురీం భీరు కిం చికీర్షసి శంస మే ॥ 26

కంజపలాశ-అక్షి - పద్మపు రేకులవంటి కన్నులు గలదానా!, త్వమ్ - నీవు, కా - ఎవతెవు? కస్య అపి - ఎవని దానవు?, సతి - ఓ సాధ్వీ!, ఇహ - ఇచటకు, కుతః - ఎక్కడనుండి?, భీరు - భయపడే ఓ సుందరీ!, ఇమామ్ - ఈ, ఉపపురీమ్ - నగరబాహ్యదేశమును, కిమ్ - ఏమి, చికీర్షసి - చేయగోరుచున్నావు?, మే - నాకు, శంస - చెప్పుము.

పద్మపు రేకులవంటి కన్నులు గల ఓ సుందరీ! నీవెవతెవు? ఎవరి దానవు? ఇచటకు ఎక్కడనుండి వచ్చితివి? భయపడుచున్న ఓ సాధ్వీ! ఈ నగరబాహ్యప్రదేశములో నీవేమి చేయగోరుచున్నావు? నాకు చెప్పుము.

క ఏతేऽనుపథా యే త ఏకాదశమహాభటాః ।
ఏతా వా లలనాస్సుభ్రు కోऽయం తేऽహిః పురస్సరః ॥ 27

సుభ్రు - అందమగు కనుబొమలు గలదానా!, ఏతే - ఈ, తే - నీ, అనుపథాః - అనుచరులు, కే - ఎవరు?, యే - ఎవరైతే, ఏకాదశమహాభటాః - పదకొండవ గొప్ప భటుడు గలవారో, ఏతాః - ఈ, లలనాః - యువతులు, వా - ఎవరు?, తే - నీ, పురః-సరః - ముందు నడిచే, అయమ్ - ఈ, అహిః - పాము, కః - ఎవరు?

అందమైన కనుబొమలు గల ఓ సుందరీ! పదిమంది భటులు, వారి గొప్ప నాయకుడు నీకు అనుచరులై ఉన్నారు. వీరెవరు? ఈ యువతులు ఎవరు? నీ ముందు నడచుచున్న ఈ పాము ఏమిటి?

త్వం హ్రీర్భవాన్యస్యథ వాగ్రమా పతిం
విచిన్వతీ కిం మునివద్రహో వనే ।
త్వదంఘ్రికామాప్తసమస్తకామం
క్వ పద్మకోశః పతితః కరాగ్రాత్ ॥ 28

త్వమ్ - నీవు, మునివత్ - మహర్షివలె, రహః - ఏకాంతములో, వనే - వనమునందు, త్వత్-అంఘ్రికామ-ఆప్తసమస్తకామమ్ - నీవు తన పాదములను సేవించుట వలననే పొందబడిన సకలకామనలు గల, పతిమ్ - భర్తను, విచిన్వతీ - వెదుకుచున్న, కిం హ్రీః - హ్రీదేవివా?, భవానీ అసి - పార్వతివా?, అథ - లేక, వాక్ - సరస్వతివా?, రమా - లక్ష్మీదేవివా?, పద్మకోశః - పద్మపు మొగ్గ, కర-అగ్రాత్ - చేతి కొననుండి, క్వ - ఎక్కడ, పతితః - పడినది?

నీవు మహర్షివలె అడవిలో ఏకాంతమునందు వ్రతనిష్ఠను పాటిస్తూ భర్తయగు ధర్ముని వెదుకుచున్న హ్రీదేవివా? నీవు తన పాదములను సేవించుటచేతనే నీ భర్త సకలకామనలను బడయును సుమా! లేక భర్తయగు శివుని వెదుకుచున్న పార్వతివా? లేక, భర్తయగు బ్రహ్మను వెదుకుచున్న సరస్వతివా? లేక, భర్తయగు శ్రీహరిని వెదుకుచున్న లక్ష్మీదేవివా?

నీవు లక్ష్మీదేవివైనచో, నీవు విలాసము కొరకు చేతికొనయందు పట్టుకొనే పద్మపు మొగ్గ ఎక్కడ జారిపోయినది?

నాసాం వరోర్వన్యతమా భువిస్స్పృక్
పురీమిమాం వీరవరేణ సాకమ్ ।
అర్హస్యలంకర్తుమదభ్రకర్మణా
లోకం పరం శ్రీరివ యజ్ఞపుంసా ॥ 29

వరోరు - ఓ సుందరీ!, భువిస్స్పృక్ - నేలను తాకే నీవు, ఆసామ్ - వీరిలో, అన్యతమా - ఒకతెవు, న - కాదు, యజ్ఞపుంసా - యజ్ఞపురుషు డగు శ్రీహరితో, శ్రీః - లక్ష్మీదేవి, పరం లోకం ఇవ - సర్వోత్కృష్టమగు వైకుంఠమును వలె, ఇమామ్ - ఈ, పురీమ్ - నగరమును, అదభ్రకర్మణా - గొప్ప కార్యములు గలిగినట్టియు, వీరవరేణ సాకమ్ - వీరులలో శ్రేష్ఠుడ నగు నాతో గూడి, అలంకర్తుమ్ - అలంకరించుటకు, అర్హసి - తగుచున్నావు.

ఓ సుందరీ! నీవు నేలను పాదములతో తాకుచున్నావు గాన, ఈ దేవతామూర్తులలో ఒకతెవు కావు. వీరులలో శ్రేష్ఠుడనగు నేను గొప్ప కార్యములను చేయగల దక్షుడను. నీవు అట్టి నాతో కలిసి, లక్ష్మీదేవి యజ్ఞ పురుషుడగు శ్రీహరితో గూడి వైకుంఠమునకు వలె, ఈ నగరమునకు శోభను కలిగించుము.

యదేష మాఽపాంగవిఖండితేంద్రియం
సవ్రీడభావస్మితవిభ్రమద్భ్రువా ।
త్వయోపసృష్టో భగవాన్ మనోభవః
ప్రబాధతేఽథానుగృహాణ శోభనే ॥ 30

శోభనే - ఓ సుందరీ!, యత్ - ఎందువలననైతే, అపాంగవిఖండిత-ఇంద్రియమ్ - కడగంటి చూపుచే మోహింపజేయబడిన మనస్సు గల, మా - నన్ను, సవ్రీడభావస్మితవిభ్రమత్-భ్రువా - సిగ్గుతో కూడిన ప్రేమపూర్వకమగు చిరునవ్వుతో విరువబడిన కనుబొమలు గల, త్వయా -

నీచే, ఉపసృష్టః - ప్రేరితుడైన, ఏషః - ఈ, భగవాన్ - పూజ్యుడగు, మనోభవః - మన్మథుడు, ప్రబాధతే - మిక్కిలి బాధించుచున్నాడో, అథ - అందువలన, అనుగృహాణ - అనుగ్రహించుము.

ఓ సుందరీ! నీవు నీ కడగంటి చూపుచే నా మనస్సును మోహింప జేసితివి. నీవు సిగ్గుతో ప్రేమపూర్వకముగా చిరునవ్వుతో కనుబొమలను విరిచి చూడగా, దానిచే ప్రేరితుడైన ఈ పూజ్యుడగు మన్మథుడు నన్ను మిక్కిలి పీడించుచున్నాడు. కావున, నీవు నన్ను అనుగ్రహించుము.

తదాననం సుభ్రు సుతారలోచనం
వ్యాలంబినీలాలకవృందసంవృతమ్ ।
ఉన్నీయ మే దర్శయ వల్గువాచకం
యద్వ్రీడయా నాభిముఖం శుచిస్మితే ॥ 31

శుచిస్మితే - స్వచ్ఛమగు చిరునగవు గలదానా!, సుభ్రు - అందమగు కనుబొమలు కలిగినట్టియు, సుతారలోచనమ్ - అందమగు నల్లగ్రుడ్లు గల కన్నులు కలిగినట్టియు, వ్యాలంబినీల-అలకవృందసంవృతమ్ - పొడవుగా వ్రేలాడుచున్న నల్లని ముంగురుల గుంపుచే కప్పబడినట్టియు, వల్గువాచకమ్ - మధురమగు పలుకులు గల, తత్ - ఆ, ఆననమ్ - ముఖమును, ఉన్నీయ - పైకెత్తి, మే - నా కొరకు, దర్శయ - చూపుము, యత్ - ఏ ముఖము, వ్రీడయా - సిగ్గుచే, అభిముఖమ్ - యెదుట, న - లేదో.

స్వచ్ఛమగు చిరునగవు గలదానా! అందమైన కనుబొమలు, అందమైన నల్లగ్రుడ్లు గల కన్నులు, మధురమగు వచనములు గల ముఖము, నీవు సిగ్గుచే వంచియుండుటచే నాకు కానరాకున్నది. నల్లని ముంగురుల గుంపు పొడవుగా వ్రేలాడుతూ ముఖమును కప్పివేయుచున్నది. అట్టి నీ ముఖమును పైకెత్తి నా ముఖములోనికి చూడుము.

శ్రీనారద ఉవాచ ।
ఇత్థం పురంజనం నారీ యాచమానమధీరవత్ ।
అభ్యనందత తం వీరం హసంతీ వీర మోహితా ॥ 32

వీర - వీరుడవగు ఓ రాజా!, ఇత్థమ్ - ఈ విధముగా, అధీరవత్ - ధైర్యమును కోల్పోయినవానివలె, యాచమానమ్ - కోరుచున్నట్టియు, వీరమ్ - వీరుడగు, తమ్ - ఆ, పురంజనమ్ - పురంజనుని, మోహితా - పురంజనునిచే మోహింప జేయబడిన, నారీ - ఆ యువతి, హసంతీ - నవ్వుచున్నదై, అభ్యనందత - అభినందించెను (అనుమోదించెను).

శ్రీనారద మహర్షి ఇట్లు పలికెను --- వీరుడవగు ఓ బర్హిషత్ మహా రాజా! ఈ విధముగా వీరుడగు ఆ పురంజనుడు ధైర్యమును కోల్పోయిన వాని వలె ఆమెను కోరెను. వీరుని సౌందర్యమునకు ఆమె కూడ మోహ మును పొందెను. అపుడామె నవ్వుతూ ఆతనిని అభినందించెను.

న విదామ వయం సమ్యక్కర్తారం పురుషర్షభ ।
ఆత్మనశ్చ పరస్యాపి గోత్రం నామ చ యత్కృతమ్ ॥ 33

పురుష-ఋషభ - ఓ పురుష శ్రేష్ఠా!, వయమ్ - మేము, ఆత్మనః - నాకు, పరస్య అపి - ఇతరునకు కూడ, కర్తారమ్ - కర్తను గురించి, గోత్రమ్ - గోత్రమును, నామ చ - పేరును కూడ, యత్-కృతమ్ - ఎవ నిచే చేయబడినదో, సమ్యక్ - బాగుగా, న విదామ - తెలియకున్నాము.

ఓ పురుషశ్రేష్ఠా! నాకు గాని, నా అనుయాయులకు గాని జన్మని చ్చినవారు యెవరు? మా గోత్రములెయ్యవి? మా పేర్లు ఏమి? ఈ విష యములేమియు మాకెవ్వరికీ సరిగా తెలియదు.

ఇహాద్య సంతమాత్మానం న విదామ తతః పరమ్ ।
యేనేయం నిర్మితా వీర పురీ శరణమాత్మనః ॥ 34

వీర - ఓ వీరా!, ఆత్మానమ్ - నన్ను, అద్య - ఇప్పుడు, ఇహ - ఇక్కడ, సంతమ్ - ఉన్నదానినిగా, విదామ - తెలియుదుము, తతః పరమ్ - అంతకు మించి, న విదామ - తెలియకున్నాము, ఆత్మనః - నాకు, శర ణమ్ - నివాసస్థానమగు, ఇయమ్ - ఈ, పురీ - నగరము, యేన - ఎవని చే, నిర్మితా - నిర్మించబడినదో.

ఓ వీరా! నేను ఇప్పుడు ఇక్కడ ఉన్నాను అని మాత్రమే నాకు తెలియును. అంతకు మించి, నాకు నివాసస్థానమగు ఈ నగరమును నిర్మించినదెవరో నాకు తెలియదు.

ఏతే సఖాయస్సఖ్యో మే నరా నార్యశ్చ మానద ।
సుప్తాయాం మయి జాగర్తి నాగోఽయం పాలయన్పురీమ్।।35

మానద - మర్యాదనిచ్చువాడా!, ఏతే - ఈ, నరాః - నరులు, సఖాయః - మిత్రులు, నార్యః చ - యువతులు, సఖ్యః - చెలికత్తెలు, మయి - నేను, సుప్తాయామ్ - నిద్రించుచుండగా, అయమ్ - ఈ, నాగః - సర్పము, పురీమ్ - నగరమును, పాలయన్ - రక్షించుచున్నదై, జాగర్తి - తెలివిగా నుండును.

మర్యాదనిచ్చువాడా! ఈ పురుషులు నాకు మిత్రులు. ఈ స్త్రీలు నా చెలికత్తెలు. నేను నిద్రించునప్పుడు ఈ సర్పము ఈ నగరమును రక్షిస్తూ తెలివిగా నుండును.

దిష్ట్యాఽఽగతోఽసి భద్రం తే గ్రామ్యాన్ కామానభీప్ససే ।
ఉద్వహిష్యామి తాంస్తేఽహం స్వబంధుభిరరిందమ ।। 36

అరిందమ - శత్రువులను దండించువాడా!, దిష్ట్యా - భాగ్యముచే, ఆగతః అసి - వచ్చితివి, తే - నీ కొరకు, భద్రమ్ - మంగళమగు గాక!, గ్రామ్యాన్ కామాన్ - ఇంద్రియభోగములను, అభీప్ససే - కోరుచున్నావు, అహమ్ - నేను, స్వబంధుభిః - నా బంధువులతో గూడి, తాన్ - వాటిని, తే - నీ కొరకు, ఉద్వహిష్యామి - పొందించెదను.

శత్రువులను దండించే ఓ వీరా! నా భాగ్యముచే నీవు విచ్చేసితివి. నీకు మంగళమగు గాక! నీవు ఇంద్రియభోగములను కోరుచున్నావు. నేను నా బంధువులతో గూడి నీకు వాటిని సమకూర్చెదను.

ఇమాం త్వమధితిష్ఠస్వ పురీం నవముఖీం విభో ।
మయోపనీతాన్ గృహ్ణానః కామభోగాన్ శతం సమాః ।। 37

విభో - ఓ ప్రభూ!, త్వమ్ - నీవు, మయా - నాచే, ఉపనీతాన్ - సమకూర్చబడిన, కామభోగాన్ - కోరబడిన భోగములను, గృహ్ణానః - స్వీకరించుచున్నవాడవై, శతమ్ - వంద, సమాః - సంవత్సరములను, ఇమామ్ - ఈ, నవముఖీమ్ - తొమ్మిది ద్వారములు గల, పురీమ్ - నగరమును, అధితిష్ఠస్వ - అధిష్ఠించుము.

ఓ ప్రభూ! నేను సమకూర్చే అభీష్టములగు భోగములననుభవిస్తూ, వంద సంవత్సరములు ఈ తొమ్మిది ద్వారముల నగరమునకు అధిపతివై ఉండుము.

కం ను త్వదన్యం రమయే హ్యరతిజ్ఞమకోవిదమ్ ।
అసంపరాయాభిముఖమశ్వస్తనవిదం పశుమ్ ॥ 38

అరతిజ్ఞమ్ - ప్రేమను తెలియనట్టియు, అకోవిదమ్ - విద్వాంసుడు కానట్టియు, అసంపరాయ-అభిముఖమ్ - పరలోకపు ఆలోచన లేనట్టియు, అశ్వస్తనవిదమ్ - రేపటి గురించి చింత లేనట్టియు, పశుమ్ - పశువు (అజ్ఞాని) అగు, త్వత్ - అన్యమ్ - నీకంటె మరియొకనిని, కం ను - ఎవనిని, రమయే - రమింప జేసెదను?

నిన్ను కాదని నేను మరియొకనిని ఎవనిని రమింప జేసెదను? ఇతరులు ప్రేమను ఎరుగరు. వారికి యుక్తాయుక్తవివేకము ఉండదు. కావునే, వారు పరలోకమును గురించి ఆలోచించరు. రేపటి గురించి చింత చేయని అట్టి అజ్ఞానులు పశువులవంటి వారు.

ధర్మో హ్యత్రార్థకామౌ చ ప్రజానందోఽమృతం యశః ।
లోకా విశోకా విరజా యాన్న కేవలినో విదుః ॥ 39

అత్ర - ఈ గృహస్థాశ్రమమునందు, ధర్మః - ధర్మము, అర్థకామౌ - అర్థకామములు, ప్రజా-ఆనందః - సంతానసుఖము, అమృతమ్ - మోక్షము, యశః - కీర్తి, విశోకాః - శోకము లేనట్టియు, విరజాః - శుద్ధములగు, లోకాః - లోకములు, యాన్ - వేటిని, కేవలినః - ఏకాకులు, న విదుః - తెలియరో.

గృహస్థాశ్రమములో ధర్మార్థకామములు, పుత్రసుఖము, కీర్తి గలవు. దానివలన వ్యక్తికి శోకము లేని శుద్ధములగు పుణ్యలోకములు లభించును. నైష్ఠిక బ్రహ్మచారులు, యతులు మొదలగు ఏకాకులకు ఈ ఫలములు ఊహకైననూ అందవు.

పితృదేవర్షిమర్త్యానాం భూతానామాత్మనశ్చ హ ।
క్షేమ్యం వదంతి శరణం భవేఽస్మిన్ యద్గృహాశ్రమః ।। 40

అస్మిన్ - ఈ, భవే - సంసారమునందు, గృహాశ్రమః యత్ - గృహస్థాశ్రమమనేది యేది గలదో అది, పితృదేవ-ఋషిమర్త్యానామ్ - పితృదేవతలకు దేవతలకు ఋషులకు మరియు మానవులకు, భూతానామ్ - ప్రాణులకు, చ - మరియు, ఆత్మనః హ - తనకు కూడ, క్షేమ్యమ్ - క్షేమమునకు యోగ్యమైన, శరణమ్ - ఆశ్రయమని, వదంతి - చెప్పెదరు.

ఈ సంసారములో గృహస్థాశ్రమమనేది పితృదేవతలకు, దేవతలకు, ఋషులకు, మానవులకు, సర్వప్రాణులకు మరియు వ్యక్తికి కూడ క్షేమదాయకమైన ఆశ్రయమని పెద్దలు చెప్పుచున్నారు.

కా నామ వీర విఖ్యాతం వదాన్యం ప్రియదర్శనమ్ ।
న వృణీత ప్రియం ప్రాప్తం మాదృశీ త్వాదృశం పతిమ్ ।। 41

వీర - ఓ వీరుడా!, మాదృశీ - నా వంటిది, కా నామ - ఎవతె, విఖ్యాతమ్ - ప్రసిద్ధుడైనట్టియు, వదాన్యమ్ - ఉదారుడైనట్టియు, ప్రియదర్శనమ్ - ప్రీతికరమగు దర్శనము కలిగినట్టియు, ప్రియమ్ - ప్రియుడైనట్టియు, ప్రాప్తమ్ - లభించిన, త్వాదృశమ్ - నీవంటి, పతిమ్ - భర్తను, న వృణీత - వరించకుండును?

ఓ వీరుడా! నీవు ప్రఖ్యాతిని గాంచినవాడవు, ఉదారుడవు. నిన్ను చూచుట తోడనే ప్రీతి కలుగును. అట్టి ప్రియుడవు నీవు స్వయముగా నాకు లభించితివి. నీవంటి భర్తను నావంటి సుందరి ఎవతె వరించకుండును?

కస్యా మనస్తే భువి భోగిభోగయోః
స్త్రియా న సజ్జేద్భుజయోర్మహాభుజ ।

యో నాథవర్గాధిమలం ఘృణోద్ధత-
స్మితావలోకేన చరత్యపోహితుమ్ ॥ 42

మహాభుజ - గొప్ప భుజములు గలవాడా!, భోగిభోగయోః - పాము పడగలైన, తే - నీ, భుజయోః - భుజములయందు, భువి - భూలోకమునందు, కస్యాః - ఏ, స్త్రియాః - స్త్రీయొక్క, మనః - మనస్సు, న సజ్జేత్ - ఆసక్తివి పొందకుండును?, యః - ఏ నీవు, ఘృణా-ఉద్ధతస్మిత-అవలోకేన - దయచే ప్రవర్తిల్లిన చిరునవ్వుతో గూడిన చూపుతో, అనాథవర్గ-ఆధిమ్ - అనాథుల సముదాయముయొక్క మనోదుఃఖమును, అలమ్ - మిక్కిలి, అపోహితుమ్ - పోగొట్టుటకై, చరతి - సంచరించుచున్నావో.

గొప్ప భుజములు గలవాడా! పాము పడగలవంటి నీ భుజములపై భూలోకములోని ఏ స్త్రీకి మనస్సులో ప్రేమ కలుగకుండును? నీవు దయాపూర్వకమైన చిరునవ్వుతో గూడిన చూపుతో అనేకులగు అనాథుల మనోవ్యాధిని పూర్తిగా నివారించుటకై లోకములో సంచరించుచున్నావు.

నారద ఉవాచ ।
ఇతి తౌ దంపతీ తత్ర సముద్య్య సమయం మిథః ।
తాం ప్రవిశ్య పురీం రాజన్ ముముదాతే శతం సమాః ॥ 43

రాజన్ - ఓ మహారాజా!, ఇతి - ఈ విధముగా, తౌ - ఆ, దంపతీ - యువతీయువకులు, తత్ర - అచట, మిథః - పరస్పరము, సమయమ్ - ప్రతిజ్ఞను, సముద్య్య - పలికి, తామ్ - ఆ, పురీమ్ - నగరమును, ప్రవిశ్య - ప్రవేశించి, శతమ్ - నంద, సమాః - సంవత్సరములను, ముముదాతే - ఆనందించిరి.

నారద మహర్షి ఇట్లు పలికెను --- ఓ మహారాజా! ఈ విధముగా ఆ యువతీయువకులు ఆ ఉద్యానవనములో పరస్పరము ప్రేమను కలిగి యుండుటకు ప్రతిజ్ఞలను చేసిరి. తరువాత వారా నగరములో ప్రవేశించి నంద సంవత్సరములు నిరంతరముగా ఆనందమునమభవించిరి.

**ఉపగీయమానో లలితం తత్ర తత్ర చ గాయకైః ।**
**క్రీడన్ పరివృతః స్త్రీభిర్హ్రదినీమావిశచ్ఛుచౌ ॥ 44**

తత్ర తత్ర - అక్కడక్కడ, గాయకైః - పాటగాళ్లచే, లలితమ్ - మనోహరముగా, ఉపగీయమానః - కీర్తించబడుచున్నవాడై, స్త్రీభిః - యువతులచే, పరివృతః - చుట్టువారబడినవాడై, శుచౌ - వేసవియందు, హ్రదినీమ్ - సరస్సును, ఆవిశత్ - ప్రవేశించెను.

ఆ రాజును ఆయా స్థానములలో పాటగాళ్లు మనోహరముగా కీర్తించుచుండిరి. వేసవిలో ఆయన యువతులతో చుట్టువారబడి సరస్సులో జలకములాడెను.

**సప్తోపరి కృతా ద్వారః పురస్తస్యాస్తు ద్వే అధః ।**
**పృథగ్విషయగత్యర్థం తస్యాం యః కశ్చనేశ్వరః ॥ 45**

తస్యామ్ - ఆ పురమునందు, యః కశ్చన - ఎవడైతే, ఈశ్వరః - ప్రభువో (వానియొక్క), పృథక్-విషయగతి-అర్థమ్ - వేర్వేరు స్థానములకు వెళ్లుట కొరకై, తస్యాః - ఆ, పురః - పురమునకు, ఉపరి - పైన, సప్త - ఏడు, ద్వారః - ద్వారములు, అధః తు - క్రిందైతే, ద్వే - రెండు, కృతాః - నిర్మించబడినవి.

ఆ పురములో ఏ ప్రభువు నివసించినా, ఆ ప్రభువు వేర్వేరు స్థానములకు వెళ్లుట కొరకై దానియందు పైన ఏడు, క్రింద రెండు ద్వారములు నిర్మించబడినవి.

**పంచ ద్వారస్తు పౌరస్త్యా దక్షిణైకా తథోత్తరా ।**
**పశ్చిమే ద్వే అమూషాం తే నామాని నృప వర్ణయే ॥ 46**

నృప - ఓ రాజా!, పంచ - అయిదు, ద్వారః తు - ద్వారములైతే, పౌరస్త్యాః - తూర్పు దిక్కునందున్నవి, ఏకా - ఒకటి, దక్షిణా - దక్షిణదిక్కునందున్నది, తథా - అదే విధముగా, ఉత్తరా - ఉత్తరదిక్కునందున్నది, ద్వే - రెండు, పశ్చిమే - పడమర దిక్కునందున్నవి, తే - నీ కొరకు, అమూషామ్ - వీటి, నామాని - పేర్లను, వర్ణయే - వర్ణించెదను.

ఓ రాజా! అయిదు ద్వారములు తూర్పువందు, ఒకటి దక్షిణము నందు, ఒకటి ఉత్తరమునందు, రెండు పడమరయందు గలవు. వాటి పేర్లను కూడ నీకు చెప్పెదను.

ఖద్యోతావిర్ముఖీ చ ప్రాగ్ద్వారావేకత్ర నిర్మితే ।
విభ్రాజితం జనపదం యాతి తాభ్యాం ద్యుమత్సఖః ।। 47

ఖద్యోతా - ఖద్యోతము, ఆవిర్ముఖీ - ఆవిర్ముఖి అనే, ద్వారౌ - ద్వారములు, ప్రాక్ - తూర్పునందు, ఏకత్ర - ఒకే చోట, నిర్మితే - నిర్మించబడినవి, ద్యుమత్-సఖః - ద్యుమంతుని మిత్రుడగు పురంజనుడు, తాభ్యామ్ - వాటిగుండా, విభ్రాజితమ్ - విభ్రాజితమనే, జనపదమ్ - దేశమును గురించి, యాతి - వెళ్లును.

ఖద్యోతము, ఆవిర్ముఖి అనే రెండు ద్వారములు తూర్పునందు ఒకే చోట నిర్మించబడినవి. పురంజనుడు తన మిత్రుడగు ద్యుమంతునితో గూడి ఆ ద్వారముల గుండా విభ్రాజితమనే దేశమునకు వెళ్లెడివాడు.

నలినీ నాలినీ చ ప్రాగ్ద్వారావేకత్ర నిర్మితే ।
అవధూతసఖస్తాభ్యాం విషయం యాతి సౌరభమ్ ।। 48

నలినీ - నలిని, నాలినీ చ - నాలిని అనే, ద్వారౌ - రెండు ద్వారములు, ప్రాక్ - తూర్పునందు, ఏకత్ర - ఒకే చోట, నిర్మితే - నిర్మించబడినవి, అవధూతసఖః - అవధూతుని మిత్రుడగు పురంజనుడు, తాభ్యామ్ - వాటిగుండా, సౌరభమ్ - సౌరభమనే, విషయమ్ - దేశమును గురించి, యాతి - వెళ్లును.

తూర్పునందు ఒకే చోట నలిని, నాలిని అనే రెండు ద్వారములు నిర్మించబడినవి. పురంజనుడు తన మిత్రుడగు అవధూతునితో గూడి ఆ ద్వారముల గుండా సౌరభమనే దేశమునకు వెళ్లుచుండును.

ముఖ్యా నామ పురస్తాద్ద్వాస్తయాఽఽపణబహూదనౌ ।
విషయౌ యాతి పురరాడ్రసజ్ఞవిపణాన్వితః ।। 49

పురస్తాత్ - తూర్పునందు, ముఖ్యా నామ - ముఖ్య అని ప్రసిద్ధిని గాంచిన ద్వాః - ద్వారము, పురరాట్ - ఆ పురమునకు ప్రభువగు పురంజనుడు, రసజ్ఞ-విపణ-అన్వితః - రసజ్ఞుడు మరియు విపణునితో గూడినవాడై, ఆపణబహూదనౌ - ఆపణము మరియు బహూదనము అనే, విషయౌ - దేశములను గురించి, యాతి - వెళ్లును.

తూర్పునందు ముఖ్య అని ప్రసిద్ధిని గాంచిన ద్వారము గలదు. నగరప్రభువగు పురంజనుడు రసజ్ఞునితో గూడి బహూదన దేశమునకు, విపణునితో గూడి ఆపణ దేశమునకు ఆ ద్వారము గుండా వెళ్లును.

పితృహూర్నృప పుర్యా ద్వార్దక్షిణేన పురంజనః ।
రాష్ట్రం దక్షిణపంచాలం యాతి శ్రుతధరాన్వితః ॥ 50

నృప - ఓ రాజా!, పుర్యాః - నగరముయొక్క, దక్షిణేన - దక్షిణదిక్కునందు, పితృహూః - పితృహూ అనే, ద్వాః - ద్వారము గలదు, పురంజనః - పురంజనుడు, శ్రుతధర-అన్వితః - శ్రుతధరునితో గూడినవాడై, దక్షిణపంచాలమ్ - దక్షిణపంచాలము అనే, రాష్ట్రమ్ - దేశమును గురించి, యాతి - వెళ్లును.

ఓ బర్హిషత్ మహారాజా! ఆ పురముయొక్క దక్షిణదిక్కునందు పితృహూ అనే ద్వారము గలదు. పురంజనుడు శ్రుతధరునితో గూడి ఆ ద్వారము గుండా దక్షిణపంచాల దేశమునకు వెళ్లును.

దేవహూర్నామ పుర్యా ద్వా ఉత్తరేణ పురంజనః ।
రాష్ట్రముత్తరపంచాలం యాతి శ్రుతధరాన్వితః ॥ 51

పుర్యాః - నగరముయొక్క, ఉత్తరేణ - ఉత్తరదిక్కునందు, దేవహూః నామ - దేవహూ అని ప్రసిద్ధిని గాంచిన, ద్వాః - ద్వారము గలదు, పురంజనః - పురంజనుడు, శ్రుతధర-అన్వితః - శ్రుతధరునితో గూడినవాడై, ఉత్తరపంచాలమ్ - ఉత్తరపంచాలమనే, రాష్ట్రమ్ - దేశమును గురించి, యాతి - వెళ్లును.

ఆ నగరమునకు ఉత్తరమునందు దేవహూ అనే ద్వారము గలదు. పురంజనుడు శ్రుతధరునితో గూడి ఆ ద్వారము గుండా ఉత్తరపంచాల దేశమునకు వెళ్లును.

ఆసురీ నామ పశ్చాద్ద్వాస్తయా యాతి పురంజనః ।
గ్రామకం నామ విషయం దుర్మదేన సమన్వితః ॥ 52

పశ్చాత్ - పడమర దిక్కునందలి, ద్వాః - ద్వారము, ఆసురీ నామ - ఆసురి అని ప్రసిద్ధిని గాంచినది, పురంజనః - పురంజనుడు, దుర్మదేన - దుర్మదునితో, సమన్వితః - కూడినవాడై, తయా - ఆ ద్వారము గుండా, గ్రామకం నామ - గ్రామకమని ప్రసిద్ధి గాంచిన, విషయమ్ - దేశము గురించి, యాతి - వెళ్లును.

పురంజనుడు దుర్మదునితో గూడి ఆసురి అనే పశ్చిమద్వారము గుండా గ్రామకదేశమునకు వెళ్లును.

నిరృతిర్నామ పశ్చాద్ద్వాస్తయా యాతి పురంజనః ।
వైశసం నామ విషయం లుబ్ధకేన సమన్వితః ॥ 53

పశ్చాత్ - పడమర దిక్కునందలి, ద్వాః - ద్వారము, నిరృతిః నామ - నిరృతి అని ప్రసిద్ధి గాంచినది, పురంజనః - పురంజనుడు, లుబ్ధకేన - లుబ్ధకునితో, సమన్వితః - కూడినవాడై, తయా - ఆ ద్వారము గుండా, వైశసం నామ - వైశసము అని ప్రసిద్ధిని గాంచిన, విషయమ్ - దేశము గురించి, యాతి - వెళ్లును.

పడమర దిక్కునందలి నిరృతి అనే ద్వారము గుండా పురంజనుడు లుబ్ధకునితో గూడి వైశసదేశమునకు వెళ్లును.

అంధావమీషాం పౌరాణాం నిర్వాక్పేశస్కృతావుభౌ ।
అక్షణ్వతామధిపతిస్తాభ్యాం యాతి కరోతి చ ॥ 54

అమీషామ్ - ఈ, పౌరాణామ్ - పురవాసులలో, నిర్వాక్-పేశస్కృతౌ - నిర్వాక్కు పేశస్కృతము అనే, ఉభౌ - ఇద్దరు, అంధౌ - గ్రుడ్డి

వారు, అక్షణ్వతామ్ - కన్నులు గలవారికి, అధిపతిః - అధిపతియగు పురంజనుడు, తాభ్యామ్ - వారిద్దరి ద్వారా, యాతి - నడచును, కరోతి చ - చేయును.

ఈ నగరముయొక్క పౌరులలో నిర్వాక్కు పేశస్కృతుడు అనే ఇద్దరు గ్రుడ్డివారు గలరు. పురంజనుడు కళ్లుగల అనేకులకు ప్రభువు అయినప్పటికీ, వారిలో ఒకని సాయముతో నడచును; మరియొకని సాయముతో పనులను చేయును.

స యర్హ్యంతఃపురగతో విషూచీనసమన్వితః ।
మోహం ప్రసాదం హర్షం వా యాతి జాయాత్మజోద్భవమ్ ।। 55

యర్హి - ఏ కాలమునందైతే, సః - ఆ పురంజనుడు, విషూచీనసమన్వితః - విషూచీనునితో కూడినవాడై, అంతఃపురగతః - అంతఃపురమును చేరునో ఆ కాలమునందు, జాయా-ఆత్మజ-ఉద్భవమ్ - భార్యపిల్లల వలన కలిగే, మోహమ్ - వ్యామోహమును గాని, ప్రసాదమ్ - మనఃప్రసన్నతను గాని, హర్షం వా - హర్షమును గాని, యాతి - పొందును.

ఈ పురంజనుడు విషూచీనుడనే సేవకునితో గూడి అంతఃపురమునకు వెళ్లును. అపుడాతడు తన భార్య, పిల్లల వలన మోహమును గాని, మనఃప్రసన్నతను గాని, లేక హర్షమును గాని పొందుచుండును.

ఏవం కర్మసు సంసక్తః కామాత్మా వంచితోఽబుధః ।
మహిషీ యద్యదీహేత తత్తదేవాన్వవర్తత ।। 56

ఏవమ్ - ఈ విధముగా, కర్మసు - కర్మలయందు, సంసక్తః - గట్టిగా తగుల్కొనియున్న, అబుధః - అవివేకియగు పురంజనుడు, కామ-ఆత్మా - కోరికలయందున్న మనస్సు గలవాడై, వంచితః - వంచించబడినవాడై, మహిషీ - భార్య, యత్ యత్ - దేనిని దేనిని, ఈహేత - చేయునో, తత్ తత్ - దానిని దానిని, అను-అవర్తత - అనుకరించెను.

ఈ విధముగా పురంజనుడు అవివేకియై కోరికలకు బానిసయై దైవవంచితుడై, భార్య ఏయే పనులను చేస్తే, అవే పనులను ఆమెను అను

కరిష్యా చేసెడివాడు. ఈ విధముగా ఆతడు కర్మబంధమునందు చిక్కుకొని యుండెను.

క్వచిత్పిబంత్యాం పిబతి మదిరాం మదవిహ్వలః ।
అశ్నంత్యాం క్వచిదశ్నాతి జక్షత్యాం సహ జక్షతి ॥ 57

క్వచిత్ - ఒకప్పుడు, మదిరామ్ - మద్యమును, పిబంత్యామ్ - భార్య త్రాగుచుండగా, పిబతి - త్రాగును, మదవిహ్వలః - మత్తుచే పరవశుడు, క్వచిత్ - ఒకప్పుడు, అశ్నంత్యామ్ - భార్య తినుచుండగా, అశ్నాతి - తినును, జక్షత్యామ్ - భార్య నమలుచుండగా, సహ - ఆమెతో గూడి, జక్షతి - నమలును.

ఆమె ఒకప్పుడు మద్యమును త్రాగగా, ఈతడు కూడ మద్యమును త్రాగి మత్తుచే పరవశుడగును. ఆమె తినే సమయములో ఈతడు కూడ తినును. ఆమె ఏదేని అల్పాహారమును నమలుచున్నచో, ఆమెతో బాటు ఈతడు కూడ నమలును.

క్వచిద్గాయతి గాయంత్యాం రుదంత్యాం రుదతి క్వచిత్ ।
క్వచిద్ధసంత్యాం హసతి జల్పంత్యామను జల్పతి ॥ 58

క్వచిత్ - ఒకప్పుడు, గాయంత్యామ్ - భార్య గానము చేయుచుండగా, గాయతి - గానము చేయును, క్వచిత్ - ఒకప్పుడు, రుదంత్యామ్ - ఏడ్చుచుండగా, రుదతి - ఏడ్చును, క్వచిత్ - ఒకప్పుడు, హసంత్యామ్ - నవ్వుచుండగా, హసతి - నవ్వును, జల్పంత్యామ్ - మాటలాడుచుండగా, అను - అనుసరించి, జల్పతి - మాటలాడును.

ఆమె పాట పాడినప్పుడు ఈతడు కూడ ఆమెననుసరించి పాట పాడును; ఆమె ఏడ్చినచో, ఈతడు ఏడ్చును; ఆమె నవ్వినచో, నవ్వును; ఆమె వాగినచో, వాగును.

క్వచిద్ధావతి ధావంత్యాం తిష్ఠంత్యామను తిష్ఠతి ।
అను శేతే శయానాయామన్వాస్తే క్వచిదాసతీమ్ ॥ 59

క్వచిత్ - ఒకప్పుడు, ధావంత్యామ్ - పరుగెత్తుచుండగా, ధావతి - పరుగెత్తును, తిష్ఠంత్యామ్ - నిలిచియుండగా, అను - అనుసరించి, తిష్ఠతి - నిలిచియుండును, శయానాయామ్ - పరుండగా, అను - అనుస రించి, శేతే - పరుండును, క్వచిత్ - ఒకప్పుడు, ఆసతీమ్ - కూర్చుని యున్న భార్యను, అను - అనుసరించి, ఆస్తే - కూర్చుండును.

ఆమె పరుగెత్తినచో, ఈతడు కూడ ఆమెను అనుకరిస్తూ పరుగె త్తును; అమె నిలబడినచో, ఈతడు నిలబడును; ఆమె పరున్నచో, ఈతడు పరుండును; ఆమె కూర్చున్నచో, ఆమెవెంట ఈతడు కూడ కూర్చుండును.

క్వచిచ్ఛృణోతి శృణ్వంత్యాం పశ్యంత్యామను పశ్యతి ।
క్వచిజ్జిఘ్రతి జిఘ్రంత్యాం స్పృశంత్యాం స్పృశతి క్వచిత్ ॥60

క్వచిత్ - ఒకప్పుడు, శృణ్వంత్యామ్ - వినుచుండగా, శృణోతి - వినును, పశ్యంత్యామ్ - చూచుచుండగా, అను - అనుసరించి, పశ్యతి - చూచును, క్వచిత్ - ఒకప్పుడు, జిఘ్రంత్యామ్ - ఆఘ్రాణించుచుండగా, జిఘ్రతి - ఆఘ్రాణించును, క్వచిత్ - ఒకప్పుడు, స్పృశంత్యామ్ - స్పృశిం చుచుండగా, స్పృశతి - స్పృశించును.

ఆమె దేనిని వినునో, ఈతడు కూడ దానినే ఆమె వెంట వినును; ఆమె దేనిని చూచునో, దానిని ఈతడు అదే సమయములో చూచును; ఆమె దేనిని ఆఘ్రాణించునో, దానినే ఆఘ్రాణించును; ఆమె దేనిని ముట్టు కొనునో, ఆమె వెంట ఈతడు దానినే ముట్టుకొనును.

క్వచిచ్ఛ శోచతీం జాయామను శోచతి దీనవత్ ।
అను హృష్యతి హృష్యంత్యాం ముదితామను మోదతే ॥61

క్వచిత్ - ఒకప్పుడు, శోచతీమ్ - దుఃఖించుచున్న, జాయామ్ - భార్యను, అను - అనుసరించి, దీనవత్ - దీనుని వలె, శోచతి - శోకించు ను, హృష్యంత్యామ్ - హర్షించుచుండగా, అను - అనుసరించి, హృష్యతి - హర్షించును, ముదితామ్ - ప్రసన్నురాలై యుండగా, అను - అనుసరిం చి, మోదతే - ప్రసన్నుడగును.

ఒకప్పుడు తన భార్య దుఃఖించుచున్నచో, ఈతడు కూడ దీనుని వలె దుఃఖించును. ఆమె కేరింతాలు కొట్టుచున్నచో, ఈతడు కూడ కేరింతాలు కొట్టును. ఆమె ప్రసన్నముగా నున్నచో, ఈతడు కూడ అటులనే యుండును.

విప్రలబ్ధో మహిష్యైవం సర్వప్రకృతివంచితః ।
నేచ్ఛన్ననుకరోత్యజ్ఞః క్లైబ్యాత్క్రీడామృగో యథా ॥ 62

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే చతుర్థస్కంధే
పురంజనోపాఖ్యానే పురంజనపురంజనీసమాగమో
నామ పంచవింశో ఽధ్యాయః ॥

ఏవమ్ - ఈ విధముగా, మహిష్యా - భార్యచే, విప్రలబ్ధః - అధికముగా మోహింప జేయబడినవాడై, సర్వప్రకృతివంచితః - అన్నివిధములుగా తన స్వరూపమునుండి వంచితుడై, న ఇచ్ఛన్ - ఇచ్ఛ లేనివాడే అయినను, క్లైబ్యాత్ - పరవశుడగుట వలన, క్రీడామృగః యథా - పెంపుడు కోతి వలె, అజ్ఞః - అజ్ఞానియై, అనుకరోతి - అనుకరించును.

ఈ విధముగా అజ్ఞానియగు పురంజనుడు పురంజనిచే అధికముగా మోహింపజేయబడెను. ఆతడు తన యథార్థస్వరూపమగు అసంగత మొదలగు లక్షణములనుండి పూర్తిగా జారిపోయెను. ఆతడు పరవశుడై యుండుటచే ఇచ్ఛ లేకున్నను, పెంపుడు కోతివలె ఆమెను అనుకరించెడివాడు.

శ్రీమద్భాగవత మహాపురాణములోని నాల్గవ స్కంధములో
పురంజనోపాఖ్యానములో పురంజనుడు పురంజనితో
సమావేశమగుటను వర్ణించే ఇరువది ఐదవ
అధ్యాయము ముగిసినది (25).

*****

# అథ షడ్వింశోఽధ్యాయః

## పురంజనోపాఖ్యానము - పురంజనుడు పురంజనిని అనునయించుట

నారద ఉవాచ ।

స ఏకదా మహేష్వాసో రథం పంచాశ్వమాశుగమ్ ।
ద్వీషం ద్విచక్రమేకాక్షం త్రివేణుం పంచబంధురమ్ ॥ 1

ఏకరశ్మ్యేకదమనమేకనీడం ద్వికూబరమ్ ।
పంచప్రహరణం సప్తవరూథం పంచవిక్రమమ్ ॥ 2

హైమోపస్కరతూణీరః స్వర్ణవర్మాక్షయేషుధిః ।
ఏకాదశచమూనాథః పంచప్రస్థమగాద్వనమ్ ॥ 3

నారదః - నారద మహర్షి, ఉవాచ - పలికెను, మహా-ఇషు-ఆసః - గొప్ప ధనస్సు గలవాడు, స్వర్ణవర్మా - బంగరు కవచము గలవాడు, అక్షయ-ఇషుధిః - తరగని బాణముల తూణీరములు గలవాడు, ఏకాదశచమూనాథః - పదకొండుగురు సేనానాయకులు గలవాడు అగు, సః - ఆ పురంజనుడు, ఏకదా - ఒకనాడు, పంచ-అశ్వమ్ - అయిదు గుఱ్ఱములు కలిగినట్టియు, ఆశుగమ్ - వేగముగా పరుగెత్తునట్టియు, ద్వి-ఈషమ్ - రెండు అడ్డకమ్మీలు కలిగినట్టియు, ద్విచక్రమ్ - రెండు చక్రములు కలిగినట్టియు, ఏక-అక్షమ్ - ఒక యిరుసు కలిగినట్టియు, త్రివేణుమ్ - మూడు ధ్వజములు కలిగినట్టియు, పంచబంధురమ్ - అయిదు కమ్మీలు కలిగినట్టియు, ఏకరశ్మి - ఒక పగ్గము కలిగినట్టియు, ఏకదమనమ్ - ఒక సారథి కలిగినట్టియు, ఏకనీడమ్ - ఒక ఆసనము కలిగినట్టియు, ద్వికూబరమ్ - రెండు

కాడిని గట్టే మ్రానులు కలిగినట్టియు, పంచప్రహరణమ్ - అయిదు అరలు (ఆయుధములు) కలిగినట్టియు, సప్తవరూథమ్ - ఏడు కవచములు కలిగిన ట్టియు, పంచవిక్రమమ్ - అయిదు నడకలు కలిగినట్టియు, హైమ-ఉపస్క రమ్ - బంగరు అలంకారములు కలిగిన, రథమ్ - రథమును, ఆరుహ్య - ఎక్కి, పంచప్రస్థమ్ - పంచప్రస్థమనే, వనమ్ - అడవిని గూర్చి, అగాత్ - వెళ్లెను.

నారదుడిట్లు పలికెను -- పురంజనుడు ఒకనాడు గొప్ప ధన స్సును, అక్షయములగు అంబుల పొదులను తీసుకొని, బంగరు కవచ మును దాల్చి, పదకొండుగురు సేనానాయకులు వెంట రాగా, రథమునెక్కి పంచప్రస్థమనే అడవికి వెళ్లెను. అయిదు గుర్రములను పూన్చిన ఆ రథము వేగముగా పరుగెత్తును. దానికి రెండు అద్దకర్రలు, రెండు చక్రములు, ఒక ఇరుసు, మూడు జెండాలు, అయిదు కమ్మీలు, ఒక పగ్గము, ఒక ఆసనము, రెండు కాడిని గట్టే మ్రానులు, అయిదు అరలు (ఆయుధములు), ఏడు రక్ష ణకవచములు గలవు. ఒక సారథిచే నడుపబడే ఆ రథము బంగరు అలంకా రములను కలిగియుండెను. దానికి అయిదు రకముల నడక గలదు.

చచార మృగయాం తత్ర దృప్త ఆత్తేషుకార్ముకః ।
విహాయ జాయామతదర్హాం మృగవ్యసనలాలసః ।। 4

దృప్తః - దర్పముతో నున్నవాడు, ఆత్త-ఇషుకార్ముకః - పట్టుకొన బడిన బాణములు ధనస్సు గలవాడు, మృగవ్యసనలాలసః - వేటాడుట అనే వ్యసనమునందు తీవ్రమగు ఆసక్తి గలవాడు అగు పురంజనుడు, అత త్-అర్హామ్ - అట్లు చేయుటకు తగని, జాయామ్ - భార్యను, విహాయ - విడిచిపెట్టి, తత్ర - ఆ అడవియందు, మృగయాం చచార - వేటాడెను.

దర్పముతోనున్న పురంజనునకు వేట అనే వ్యసనమునందు తీవ్ర మగు ఆసక్తి ఉండెను. ఆతడు విడిచిపెట్టకూడని భార్యను విడిచిపెట్టి ధన స్సును బాణములను తీసుకొని ఆ అడవిలో వేటాడెను.

ఆసురీం వృత్తిమాశ్రిత్య ఘోరాత్మా నిరనుగ్రహః ।
వ్యహనన్నిశితైర్బాణైర్వనేషు వనగోచరాన్ ।। 5

ఘోర-ఆత్మా - భయంకరమగు ఆకారము గలవాడు, నిరనుగ్రహః - దయ లేనివాడు అగు పురంజనుడు, ఆసురీమ్ - క్రూరమగు, వృత్తిమ్ - ప్రవృత్తిని, ఆశ్రిత్య - ఆశ్రయించి, వనేషు - వనములయందు, వనగోచరాన్ - వనములో సంచరించే జంతువులను, నిశితైః - వాడి, బాణైః - బాణములతో, న్యహనత్ - చంపెను.

దయ లేని ఆ పురంజనుడు భయంకరాకారుడై క్రూరమగు రాక్షస ప్రవృత్తితో అడవిలో చెట్ల గుంపులలో తిరిగే జంతువులను వాడి బాణములతో కొట్టి చంపెను.

తీర్థేషు ప్రతిదృష్టేషు రాజా మేధ్యాన్ పశూన్ వనే ।
యావదర్థమలం లుబ్ధో హన్యాదితి నియమ్యతే ॥ 6

అలమ్ - మిక్కిలి, లుబ్ధః - ఆసక్తి గల, రాజా - రాజు, ప్రతిదృష్టేషు - శాస్త్రవిహితములైన, తీర్థేషు - యజ్ఞాదులయందు, మేధ్యాన్ - పవిత్రములగు, పశూన్ - పశువులను, వనే - అడవియందు, యావత్ అర్థమ్ - ప్రయోజనమున్నంతవరకు మాత్రమే, హన్యాత్ - సంహరించవలెను, ఇతి - అని, నియమ్యతే - నియమించబడుచున్నది.

రాజు మాంసమునందు అధికమగు ఆసక్తి గలవాడైనచో, శాస్త్రవిహితములైన యజ్ఞము మొదలగు సందర్భములలో మాత్రమే అడవియందు మాత్రమే పవిత్రములగు (నిషిద్ధములు కాని) పశువులను మాత్రమే వినియోగమున్నంత వరకు మాత్రమే సంహరించవలెనని నియమించబడినది. అనగా, విశృంఖలముగా పశువులను చంపరాదు.

య ఏవం కర్మ నియతం విద్వాన్ కుర్వీత మానవః ।
కర్మణా తేన రాజేంద్ర జ్ఞానేన న స లిప్యతే ॥ 7

రాజేంద్ర - ఓ మహారాజా!, విద్వాన్ - వివేకియగు, యః - ఏ, మానవః - మానవుడు, నియతం కర్మ - నిత్యకర్మను, కుర్వీత - చేయునో, సః - అతడు, జ్ఞానేన - జ్ఞానము కారణముగా, తేన - ఆ, కర్మణా - కర్మచే, న లిప్యతే - లేపమును పొందడు.

ఓ మహారాజా! వివేకియగు మానవుడు నిత్యకర్మలను చేయుచున్నచో, ఆతని అంతఃకరణము పరిశుద్ధమై ఆత్మజ్ఞానము ఉదయించును. దాని ప్రభావముచే ఆతనికి కర్మఫలముల లేపము (బంధము) ఉండదు.

అన్యథా కర్మ కుర్వాణో మానారూఢో నిబధ్యతే ।
గుణప్రవాహే పతితో నష్టప్రజ్ఞో వ్రజత్యధః ॥ 8

అన్యథా - అట్లు గానిచో, మాన-ఆరూఢః - అభిమానావిష్టుడై, కర్మ - కర్మను, కుర్వాణః - చేయుచున్నవాడై, నిబధ్యతే - గట్టిగా బంధించబడుచున్నాడు, గుణప్రవాహే - సత్త్వరజస్తమోగుణముల ప్రవాహరూపమగు సంసారములో, పతితః - పడినవాడై, నష్టప్రజ్ఞః - నశించిన వివేకము గలవాడై, అధః - అధోగతిని, వ్రజతి - పొందును.

అట్లు గాకుండా, నేను కర్తను అనే అభిమానావేశము గలవాడై కామ్యాది కర్మలను కూడ చేయు మానవుడు సంసారములో గట్టిగా బంధించబడును. అట్టి వాడు వివేకశక్తిని కోల్పోయి సత్త్వరజస్తమోగుణముల ప్రవాహరూపమగు సంసారములో పడి, అధోగతిని (పశుపక్ష్యాధి జన్మను) పొందును.

తత్ర నిర్భిన్నగాత్రాణాం చిత్రవాజైశ్శిలీముఖైః ।
విప్లవో దుఃఖితానాం హి దుస్సహః కరుణాత్మనామ్ ॥ 9

తత్ర - ఆ అడవిలో, చిత్రవాజైః - రంగురంగుల రెక్కలు గల, శిలీముఖైః - వాడి కొనలు గల బాణములచే, నిర్భిన్న గాత్రాణామ్ - ఛేదించబడిన అవయవములు కలిగినట్టియు, దుఃఖితానామ్ - దుఃఖమును పొంది యున్న పశువులయొక్క, కరుణ -ఆత్మనామ్ - దయాహృదయము గలవారలకు, దుస్సహః - సహించ శక్యము కాని, విప్లవః - వినాశము.

ఆ అడవిలో ఆ రాజు రంగురంగుల రెక్కలు గల వాడి బాణములతో పశువుల అవయవములను తెగగొట్టుచుండగా, అవి గొప్ప దుఃఖమును పొందినవి. ఆ సమయములో దయాహృదయులు చూచి సహించలేని ప్రాణినాశము కలిగెను.

శశాన్ వరాహాన్మహిషాన్ గవయాన్ రురుశల్యకాన్ ।
మేధ్యానన్యాంశ్చ వివిధాన్ వినిఘ్నన్ శ్రమమధ్యగాత్ ।। 10

శశాన్ - కుందేళ్లను, వరాహాన్ - అడవి పందులను, మహిషాన్ - అడవి దున్నలను, గవయాన్ - గురుపోతులను, రురుశల్యకాన్ - నల్లచారల దుప్పిలను ముళ్ల పందులను, అన్యాన్ - ఇతరములగు, మేధ్యాన్ - యజ్ఞార్హములగు పశువులను, వినిఘ్నన్ - సంహరించుచున్నవాడై, శ్రమమ్ - అలసటను, అధ్యగాత్ - పొందెను.

పురంజనుడు కుందేళ్లను, అడవి పందులను, అడవి దున్నలను, గురుపోతులను, నల్లచారల దుప్పిలను, ముళ్ల పందులను మరియు ఇతరములగు పవిత్రములైన పశువులను వేటాడుతూ అలసిపోయెను.

తతః క్షుత్తృట్పరిశ్రాంతో నివృత్తో గృహమేయివాన్ ।
కృతస్నానోచితాహారస్సంవివేశ గతక్లమః ।। 11

తతః - తరువాత, క్షుత్-తృట్-పరిశ్రాంతః - ఆకలి దప్పికలచే చాల అలసినవాడై, నివృత్తః - విరమించినవాడై, గృహమ్ - ఇంటిని, ఏయివాన్ - చేరుకున్నవాడు, కృతస్నాన-ఉచిత-ఆహారః - చేయబడిన స్నానము మరియు తగిన ఆహారము గలవాడై, గతక్లమః - తొలగిన శ్రమ గలవాడై, సంవివేశ - కూర్చుండెను.

తరువాత ఆ పురంజనుడు ఆకలి దప్పికలచే చాల అలిసిపోవుటచే వేటను విరమించి ఇంటికి చేరుకొని, స్నానమును చేసి, తగిన ఆహారమును తీసుకొని కూర్చుండగా, ఆతని శ్రమ తొలగిపోయెను.

ఆత్మానమర్హయాంచక్రే ధూపాలేపస్రగాదిభిః ।
సాధ్వలంకృతసర్వాంగో మహిష్యామాదధే మనః ।। 12

ధూప-ఆలేపస్రక్-ఆదిభిః - ధూపము గంధపు పూత పుష్పమాల మొదలగువాటిచే, ఆత్మానమ్ - తనను, అర్హయాంచక్రే - అలంకరించుకొనెను, సాధు - చక్కగా, అలంకృతసర్వ-అంగః - అలంకరించబడిన అన్ని

అవయవములు గలవాడై, మనః - మనస్సును, మహిష్యామ్ - భార్యయం దు, అదధే - నిలిపెను.

అతడు ధూపము, గంధపు పూత, పుష్పమాల మొదలగువాటిచే తనను తాను ముస్తాబు జేసుకొని, అవయవములన్నింటియందు చక్కటి ఆభరణములను ధరించెను. అపుడాతని మనస్సు భార్యపైకి పోయెను.

తృప్తో హృష్టస్సుదృప్తశ్చ కందర్పాకృష్టమానసః ।
న వ్యచష్ట వరారోహాం గృహిణీం గృహమేధినీమ్ ॥ 13

తృప్తః - తృప్తిని జెందినవాడు, హృష్టః - హర్షమును పొందినవా డు, సుదృప్తః చ - మిక్కిలి గర్వించియున్నవాడు అగు ఆ పురంజనుడు, కందర్ప-ఆకృష్టమానసః - మన్మథునిచే ఆకర్షించబడిన మనస్సు గలవా డై, వరారోహామ్ - గొప్ప సుందరియైనట్టియు, గృహమేధినీమ్ - గృహ మును చక్కదిద్దే, గృహిణీమ్ - భార్యను, న వ్యచష్ట - కనలేదు.

మిక్కిలి గర్వించియున్న పురంజనుడు ఆకలి తీరి హర్షమును పొందెను. అపుడాతని మనస్సు మన్మథునిచే ఆకర్షితమయ్యెను. ఇంటిని చక్కదిద్దే గొప్ప సుందరియగు ఆతని భార్య అపుడాతనికి కానరాలేదు.

అంతఃపురస్త్రియోఽపృచ్ఛద్విమనా ఇవ వేదిషత్ ।
అపి వః కుశలం రామాస్సేశ్వరీణాం యథా పురా ।
న తథైతర్హి రోచంతే గృహేషు గృహసంపదః ॥ 14

వేదిషత్ - ఓ బర్హిషత్ మహారాజా!, విమనాః ఇవ - చెడిన మనస్సు గలవాని వలె, అంతఃపురస్త్రియః - అంతఃపురమునందలి పరిచా రికలను, అపృచ్ఛత్ - ప్రశ్నించెను, రామాః - ఓ యువతులారా!, స-ఈశ్వ రీణామ్ - మీ అమ్మగారితో కూడియున్న, వః - మీకు, పురా యథా - పూర్వమునందు వలెనే, అపి కుశలమ్ - క్షేమమేనా?, ఏతర్హి - ఈ సమ యములో, గృహేషు - ఇంటియందు, గృహసంపదః - ఇంటి సంపదలు, తథా - ఆ విధముగా, న రోచంతే - శోభిల్లుట లేదు.

ఓ బర్హిషత్ మహారాజా! భార్య కనబడక పోవుటచే పురంజనుని మనస్సు చెడినట్లాయెను. అతడు అంతఃపురమునందలి పరిచారికలనిట్లు ప్రశ్నించెను: ఓ యువతులారా! మీరు, మీ అమ్మగారు కులాసాయేనా? నేను వేటకు వెళ్లుటకు ముందు ఇంటిలోని సంపదలు ప్రకాశించిన విధము గా, ఇప్పుడు ప్రకాశించుట లేదు.

యది న స్యాద్గృహే మాతా పత్నీ వా పతిదేవతా ।
వ్యంగే రథ ఇవ ప్రాజ్ఞః కో నామాసీత దీనవత్ ॥ 15

గృహే - ఇంటియందు, మాతా - తల్లిగాని, పతిదేవతా - భర్తయే దైవముగా గల, పత్నీ వా - భార్యగాని, యది న స్యాత్ - ఉండనిచో, వి-అంగే - అవయవములు లేని, రథే ఇవ - రథమునందు వలె, ప్రాజ్ఞః - వివేకి, కః నామ - ఎవ్వాడు, దీనవత్ - దీనుడు వలె, ఆసీత - ఉండును?

ఇంటిలో తల్లి గాని, భర్తయే దైవముగా గల భార్య గాని లేనిచో ఆ ఇల్లు విరిగిన అవయవములు గల రథము వంటిది. వివేకియగు వ్యక్తి ఎవ్వాడు అట్టి ఇంటిలో దీనుడు వలె ఉండును?

క్వ వర్తతే సా లలనా మజ్జంతం వ్యసనార్ణవే ।
యా మాముద్ధరతే ప్రజ్ఞాం దీపయంతీ పదే పదే ॥ 16

సా - ఆ, లలనా - సుందరి, క్వ - ఎక్కడ, వర్తతే - ఉన్నది?, యా - ఎవతె, వ్యసన-అర్ణవే - కష్టముల సముద్రములో, మజ్జంతమ్ - మునిగిపోవుచున్న, మామ్ - నన్ను, ప్రజ్ఞామ్ - వివేకశక్తిని, పదే పదే - అడుగడుగునా, దీపయంతీ - ప్రకాశింపజేయుచున్నదై, ఉద్ధరతే - ఉద్ధరించునో.

నేను కష్టముల సముద్రములో మునిగిపోవుచున్న సమయములో, ఆమె నాలో వివేకశక్తిని ఉద్బుద్ధము చేసి నన్ను ఉద్ధరించును. అట్టి ఆ సుందరి ఎక్కడ నున్నది?

రామా ఊచుః ।
నరనాథ న జానీమస్త్వత్ప్రియా యద్వ్యవస్యతి ।
భూతలే నిరవస్తారే శయానాం పశ్య శత్రుహన్ ॥ 17

నరనాథ - ఓ మహారాజా!, త్వత్-ప్రియా - నీ ప్రియురాలు, యత్ - దేనిని, వ్యవస్యతి - నిశ్చయించుచున్నదో, న జానీమః - తెలియకున్నాము, శత్రుహన్ - శత్రువులను సంహరించువాడా!, నిరవస్తారే - చాప లేని, భూతలే - నేలపై, శయానామ్ - పరుండియున్న ఆమెను, పశ్య - చూడుము.

పరిచారికలు ఇట్లు పలికిరి --- ఓ మహారాజా! నీవు శత్రువులను సంహరించినవాడవు. నీ ప్రియురాలి నిశ్చయమేమో మాకు తెలియదు. ఆమె చాప లేని కటిక నేలపై పరుండియున్నది. చూడుము.

నారద ఉవాచ ।
పురంజనస్స్వమహిషీం నిరీక్ష్యావధుతాం భువి ।
తత్సంగోన్మథితజ్ఞానో వైక్లబ్యం పరమం యయౌ ॥ 18

పురంజనః - పురంజనుడు, భువి - నేలపై, అవధుతామ్ - పడియున్న, స్వమహిషీమ్ - తన భార్యను, నిరీక్ష్య - చూచి, తత్-సంగ-ఉన్మథితజ్ఞానః - ఆమెతోడి సంగము వలన శిథిలము చేయబడిన జ్ఞానము గలవాడై, పరమమ్ - గొప్ప, వైక్లబ్యమ్ - అందోళనము, యయౌ - పొందెను.

నారదుడిట్లు పలికెను --- నేలపై పడియున్న తన భార్యను పురంజనుడు చూచెను. ఆమెతోడి సమాగమముచే అతని జ్ఞానము శిథిలమయ్యెను. అతడామెను చూచి చాల అందోళనము చెందెను.

సాంత్వయన్ శ్లక్ష్ణయా వాచా హృదయేన విదూయతా ।
ప్రేయస్యాః స్నేహసంరంభలింగమాత్మని నాభ్యగాత్ ॥ 19

విదూయతా - పీడను పొందియున్న, హృదయేన - హృదయముతో, శ్లక్ష్ణయా - మధురమగు, వాచా - వాక్కుతో, సాంత్వయన్ - ఓదార్చుచున్నవాడై, ఆత్మని - తనయందు, ప్రేయస్యాః - ప్రియురాలియొక్క,

స్నేహసంరంభలింగమ్ - ప్రణయకోపమునకు కారణమును, న అభ్యగాత్ - తెలియకుండెను.

దుఃఖితమైన హృదయము గల పురంజనుడు మధురమగు వచనములతో ఆమెను ఓదార్చుచుండెను. ఆమెకు కలిగిన ప్రణయకోపమునకు కారణమైన తన అపరాధమేమియో ఆతనికి తెలియరాలేదు.

అనునిన్యేఽథ శనకైర్వీరోఽనునయకోవిదః ।
పస్పర్శ పాదయుగలమాహ చోత్సంగలాలితామ్ ॥ 20

అథ - తరువాత, అనునయకోవిదః - అనునయించుటలో నిపుణుడు, వీరః - వీరుడు అగు పురంజనుడు, శనకైః - మెల్లగా, అనునిన్యే - అనునయించెను, పాదయుగలమ్ - పాదముల జంటను, పస్పర్శ - స్పృశించెను, చ - మరియు, ఉత్సంగలాలితామ్ - తొడపై కూర్చుండబెట్టుకొని లాలించబడిన పురంజనిని ఉద్దేశించి, ఆహ - పలికెను.

వీరుడగు పురంజనుడు అనునయించుటలో నిపుణుడు. అతడామెను పాదములను స్పృశిస్తూ మెల్లగా అనునయించెను. తరువాత అతడు ఆమెను తొడపై కూర్చుండబెట్టుకొని లాలిస్తూ ఇట్లు పలికెను.

పురంజన ఉవాచ ।
నూనం త్వకృతపుణ్యాస్తే భృత్యా యేష్వీశ్వరాః శుభే ।
కృతాగస్స్వాత్మసాత్కృత్వా శిక్షాదండం న యుంజతే ॥21

శుభే - ఓ శుభకరమైన దానా!, తే - ఆ, భృత్యాః తు - సేవకులైతే, నూనమ్ - నిశ్చయముగా, అకృతపుణ్యాః - చేయబడిన పుణ్యము గలవారు కాదు, కృత-ఆగస్సు - చేయబడిన అపరాధము గల, యేషు - ఎవరియందైతే, ఈశ్వరాః - ప్రభువులు, ఆత్మసాత్ - తమవారినిగా, కృత్వా - చేసుకొని, శిక్షాదండమ్ - శిక్షణ కొరకై దండమును, న యుంజతే - ప్రయోగించుట లేదో.

పురంజనుడిట్లు పలికెను --- ఓ శుభకరమైన దానా! సేవకులు అపరాధము చేసినప్పుడు ప్రభువులు వారిని తమ వశములో నుంచుకొని,

వారికి నేర్పుట కొరకై తగిన దండము (శిక్ష) ను వేసెదరు. అట్లు ఏ సేవకుల విషయములో జరుగలేదో, వారు పూర్వములో పుణ్యము చేసుకున్న వారు కాదు. ఇది నిశ్చయము.

పరమోఽనుగ్రహో దండో భృత్యేషు ప్రభుణాఽర్పితః ।
బాలో న వేద తత్తన్వి బంధుకృత్యమమర్షణః ॥ 22

తన్వి - ఓ సుందరీ!, ప్రభుణా - ప్రభువుచే, భృత్యేషు - సేవకుల యందు, అర్పితః - ప్రయోగించబడిన, దండః - శిక్ష, పరమః - గొప్ప, అనుగ్రహః - అనుగ్రహము, అమర్షణః - సహనము లేని (కోపియగు), బాలః - అవివేకి, తత్ - ఆ, బంధుకృత్యమ్ - ప్రభువుయొక్క హితకరమైన పనిని, న వేద - తెలియదు.

ఓ సుందరీ! ప్రభువు తప్పు చేసిన సేవకునకు శిక్షను విధించుట వానికి గొప్ప అనుగ్రహము. కాని, సహనము వివేకము లేని కోపిష్ఠియగు మూర్ఖుడు, ప్రభువు తనకు శిక్షను వేసి హితమునే చేసినాడనే సత్యమును గుర్తించడు.

సా త్వం ముఖం సుదతి సుభ్ర్వనురాగభార-
వ్రీడావిలంబవిలసద్ధసితావలోకమ్ ।
నీలాలకాలిభిరుపస్కృతమున్నసం నః
స్వానాం ప్రదర్శయ మనస్విని వల్గువాక్యమ్ ॥ 23

సుదతి - సుందరమగు పలువరుస గలదానా!, సుభ్రు - అందమగు కనుబొమలు గలదానా!, మనస్విని - ఓ అభిమానవతీ!, సా - అట్టి, త్వమ్ - నీవు, అనురాగభారవ్రీడావిలంబవిలసత్-హసిత-అవలోకమ్ - అధికమగు ప్రేమ మరియు సిగ్గులచే మాంద్యమును పొంది ప్రకాశించే చిరునవ్వుతో కూడిన చూపు గలిగినట్టియు, నీల-అలక-అలిభిః - నల్లని ముంగురులు అనే తుమ్మెదలచే, ఉపస్కృతమ్ - అలంకరించబడినట్టియు, ఉన్నసమ్ - ఎత్తైన ముక్కు గలిగినట్టియు, వల్గువాక్యమ్ - మధురమగు మాటలు గల, ముఖమ్ - ముఖమును, స్వానామ్ - నీ వారలకు, ప్రదర్శయ - చూపుము.

ఓ అభిమానవతీ! నీ పలువరుసలు, కనుబొమలు చాల అందముగా నున్నవి. నీ ముఖమునందు చిరునవ్వుతో కూడిన చూపులు అధికమగు అనురాగముచే మరియు సిగ్గుచే మెల్లమెల్లగా అంకురించుచున్నవి. తుమ్మెదలవంటి నల్లని ముంగురులు నీ ముఖమునకు అలంకారములైనవి. ఎత్తైన ముక్కు కలిగి, మధురమగు పలుకులను పలికే నీ ముఖమును నీవాడనగు నాకు చూపుము.

తస్మిన్దధే దమమహం తవ వీరపత్ని
యోఽన్యత్ర భూసురకులాత్కృతకిల్బిషస్తమ్ ।
పశ్యే న వీతభయమున్మదితం త్రిలోక్యా-
మన్యత్ర వై మురరిపోరితరత్ర దాసాత్ ॥ 24

వీరపత్ని - వీరుని భార్యవగు ఓ పురంజనీ!, యః - ఎవడైతే, తవ - నీకు, కృతకిల్బిషః - చేయబడిన అపరాధము గలవాడో, భూసురకులాత్ - బ్రాహ్మణవంశము కంటె, అన్యత్ర - భిన్నుడైన, తస్మిన్ - వానియందు, అహమ్ - నేను, దమమ్ - శిక్షను, దధే - వేసెదను, మురరిపోః - మురారి యొక్క, దాసాత్ - దాసునికంటె, ఇతరత్ర - భిన్నుడైనట్టియు, వీతభయమ్ - తొలగిన భయము కలిగినట్టియు, ఉన్మదితమ్ - గొప్ప ఆనందముతో నున్న, తమ్ - అట్టివానిని, త్రిలోక్యామ్ - ముల్లోకములయందు, అన్యత్ర - మరియొకచోట, న పశ్యే - కానరాకున్నాను, వై - నిశ్చయము.

వీరుడనైన నా భార్యవగు ఓ పురంజనీ! నీయెడల అపరాధమును చేసినవాడు బ్రాహ్మణుడు గానిచో, నేను వానికి శిక్షను వేసెదను. కాని, మురారి (మురుడనే రాక్షసుని సంహరించిన శ్రీహరి) భక్తుని మినహాయించినచో, నీయెడల అపరాధమును చేసి నిర్భయముగా ఆనందముగా ఉండగలిగే వ్యక్తి ముల్లోకములలో గాని, ముల్లోకములకు బయట గాని నాకు ఎవ్వరైననూ కానవచ్చుట లేదు. ఇది నిశ్చయము.

వక్త్రం న తే వితిలకం మలినం విహర్షం
సంరంభభీమమవిమృష్టమపేతరాగమ్ ।

పశ్యే స్తనావపి శుచోపహతౌ సుజాతౌ
బింబాధరం విగతకుంకుమపంకరాగమ్ ॥ 25

వితిలకమ్ - బొట్టు లేనట్టియు, మలినమ్ - మలినముగా నున్నట్టియు, విహర్షమ్ - హర్షము లేనట్టియు, సంరంభభీమమ్ - కోపముచే భయమును గొల్పునట్టియు, అవిమృష్టమ్ - ప్రకాశించనట్టియు, అపేతరాగమ్ - తొలగిన అనురాగము గల, తే - నీ, వక్త్రమ్ - ముఖమును, న పశ్యే - చూడలేదు, శుచా - దుఃఖముచే, ఉపహతౌ - సౌందర్యమును కోల్పోయిన, సుజాతౌ - సుందరమగు, స్తనౌ - స్తనములను, విగతకుంకుమపంకరాగమ్ - తొలగిన కుంకుమ ముద్దవంటి రంగు గల, బింబ-అధరం అపి - దొండపండువంటి క్రింది పెదవిని కూడ, న పశ్యే - చూడలేదు.

నీ ముఖము బొట్టు లేకుండా మలినముగానున్నది. నీ ముఖము హర్షముతో ప్రకాశించుటకు బదులుగా, కోపముతో భయమును గొల్పుచున్నది. నీ ముఖములో నాకు అనురాగము కానవచ్చుటలేదు. నీ సుందరమగు స్తనములు శోకాశ్రువులతో తడిసియున్నవి. కుంకుమ ముద్దవలె ఎర్రనైన దొండపండువంటి నీ క్రింది పెదవి రంగును కోల్పోయినది. ఈ స్థితిలో నిన్ను నేను ఇదివరలో ఏనాడైననూ చూడలేదు.

తన్మే ప్రసీద సుహృదః కృతకిల్బిషస్య
స్వైరం గతస్య మృగయాం వ్యసనాతురస్య ।
కా దేవరం వశగతం కుసుమాస్త్రవేగ-
విస్రస్తపౌంస్నముశతీ న భజేత కృత్యే ॥ 26

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే చతుర్థస్కంధే
పురంజనోపాఖ్యానే షడ్వింశోఽధ్యాయః ॥

తత్ - అందువలన, సుహృదః - ప్రేమ కలిగినట్టియు, కృతకిల్బిషస్య - చేయబడిన అపరాధము కలిగినట్టియు, స్వైరమ్ - స్వేచ్ఛగా, మృగయామ్ - వేటను గురించి, గతస్య - వెళ్ళినట్టియు, వ్యసన-ఆతురస్య - వేట అనే వ్యసనమునందు ఆసక్తి కలిగిన, మే - నాకు, ప్రసీద - ప్రసన్న

రాలవు కమ్ము, వశగతమ్ - వశమైనట్టియు, కుసుమ-అస్త్రవేగవిస్రస్తధైర్యమ్ - మన్మథుని బాణముల వేగముచే జారిపోయిన ధైర్యము గలిగిన, దేవరమ్ - భర్తను, ఉశతీ - కోరే, కా - ఎవతె, కృత్యే - యోగ్యమగు దేశమునందు (కాలమునందు), న భజేత - సేవించకుండును?

కావున, నీవు నా యెడల ప్రసన్నురాలవు కమ్ము. వేట అనే చెడు అలవాటు గల నేను నిన్ను విడిచి స్వేచ్ఛగా వేటకు వెళ్లి నీ యెడల అపరాధమును చేసితిని. కాని, ఇప్పుడు నేను మన్మథుని బాణముల వేగముచే జారిపోయిన ధైర్యము గలవాడనై నీకు వశుడనై యున్నాను. భర్తను ప్రేమించే ఏ యువతి యోగ్యమగు దేశకాలములలో అట్టి భర్తను సేవించకుండును?

శ్రీమద్భాగవత మహాపురాణమునందు నాల్గవ స్కంధములో
పురంజనోపాఖ్యానములో పురంజనుడు పురంజనిని
అనునయించుటను వర్ణించే ఇరువది ఆరవ
అధ్యాయము ముగిసినది (26).

*****

# అథ సప్తవింశోఽధ్యాయః

## పురంజనోపాఖ్యానము - కాలకన్యోపాఖ్యానము

నారద ఉవాచ ।
ఇత్థం పురంజనం సధ్య్రాగ్వశమానీయ విభ్రమైః ।
పురంజనీ మహారాజ రేమే రమయతీ పతిమ్ ॥ 1

నారదః - నారద మహర్షి, ఉవాచ - పలికెను, మహారాజ - ఓ మహారాజా!, పురంజనీ - పురంజని, ఇత్థమ్ - ఈ విధముగా, పతిమ్ - భర్తయగు, పురంజనమ్ - పురంజనుని, విభ్రమైః - విలాసలచే, సధ్య్రాక్ - చక్కగా, వశం ఆనీయ - వశము చేసుకొని, రమయతీ - రమింప జేయు చున్నదై, రేమే - రమించెను.

నారద మహర్షి ప్రాచీనబర్హిషునితో ఇట్లు పలికెను --- ఓ మహా రాజా! పురంజని ఈ విధముగా భర్తయగు పురంజనుని విలాసలతో పూర్తిగా తన వశము చేసుకొని, తాను రమిస్తూ ఆయనను రమింపజేసెను.

స రాజా మహిషీం రాజన్ సుస్నాతాం రుచిరాననామ్ ।
కృతస్వస్త్యయనాం తృప్తామభ్యనందదుపాగతామ్ ॥ 2

రాజన్ - ఓ రాజా!, సః - ఆ, రాజా - పురంజన మహారాజు, సుస్నాతామ్ - చక్కగా స్నానము చేసినట్టియు, రుచిర-ఆననామ్ - అంద మగు ముఖము కలిగినట్టియు, కృతస్వస్తి-అయనామ్ - చేయబడిన మంగ ళాలంకారములు కలిగినట్టియు, తృప్తామ్ - ఆనందించినట్టియు, ఉపాగ తామ్ - తన వద్దకు వచ్చిన, మహిషీమ్ - భార్యను, అభ్యనందత్ - అభి నందించెను.

ఓ రాజా! సుందరవదనయగు పురంజని చక్కగా స్నానమాడి కుంకుమ మొదలగు మంగళద్రవ్యములతో అలంకరించుకొని, ఆనందముతో భర్తయగు పురంజన మహారాజు వద్దకు రాగా, ఆయన ఆమెను అభినందించెను.

తయోపగూఢః పరిరబ్ధకంధరో
రహోఽనుమంత్రైరపకృష్టచేతనః ।
న కాలరంహో బుబుధే దురత్యయం
దివా నిశేతి ప్రమదాపరిగ్రహః ॥ 3

తయా - ఆమెచే, ఉపగూఢః - కౌగిలించుకొనబడినవాడు, పరిరబ్ధకంధరః - పట్టుకొనబడిన మెడ గలవాడు, రహః - ఏకాంతమునందు, అనుమంత్రైః - అనుకూలమగు గుసగుసలచే, అపకృష్టచేతనః - ఆకర్షించబడిన మనస్సు గలవాడు, ప్రమదాపరిగ్రహః - మత్తెక్కించే ఆమెయే జీవితధ్యేయముగా గల పురంజనుడు, దివా - పగలు, నిశా - రాత్రి, ఇతి - అనే, దురత్యయమ్ - దాట శక్యము కాని, కాలరంహః - కాలముయొక్క వేగమును, న బుబుధే - తెలియలేదు.

ఆమె ఆతనిని కౌగిలించగా, ఆతడు ఆమె మెడను కౌగిలించెను. ఆమె ఏకాంతములో ఆతనితో గుసగుసలాడుచుండగా, మనస్సు ఆమెచే ఆకర్షించబడి, పురంజనుడు మత్తెక్కించే ఆమెయే జీవితధ్యేయముగా గలవాడు ఆయెను. ఆతనికి రాత్రింబగళ్ల రూపములో పరుగు దీసే కాలముయొక్క వేగము తెలియలేదు. కాలమును దాటుట ఎవరికైననూ శక్యము కాదు గదా!

శయాన ఉన్నద్ధమదో మహామనా
మహార్హతల్పే మహిషీభుజోపధిః ।
తామేవ వీరో మనుతే పరం యతః
తమోఽభిభూతో న నిజం పరం చ యత్ ॥ 4

ఉన్నద్ధమదః - అధికముగా పెరిగిన గర్వము గలవాడు, మహా మనాః - పెద్ద అభిమానము గలవాడు, మహా-అర్హతల్పే - మిక్కిలి విలువైన శయ్యయందు, మహిషీభుజ-ఉపధిః - భార్యయొక్క భుజమే తలగడగా గలవాడై, శయానః - పరుండినవాడు, వీరః - వీరుడు అగు పురంజనుడు,, తాం ఏవ - ఆమెను మాత్రమే, పరమ్ - జీవితలక్ష్యముగా, మనుతే - తలపోయుచున్నాడు, యత్ - ఏ, నిజమ్ - తన స్వరూపమైన, పరం చ - పరమాత్మ గలదో దానిని, న - జీవితలక్ష్యముగా భావించలేదు, యతః - ఏలయనగా, తమః-అభిభూతః - అజ్ఞానముచే పరాభూతుడు.

అధికముగా గర్వము పెరిగి వీరుడగు పురంజనుడు పెద్ద అభిమానము గలవాడయ్యెను. మిక్కిలి విలువైన శయ్యపై భార్య భుజముపై తల పెట్టుకొని పరుండియున్న ఆ రాజునకు ఆమె మాత్రమే పరమపురుషార్థముగా గోచరించెను. అజ్ఞానముచే పరాభూతుడైయున్న ఆ రాజునకు తన స్వరూపమగు పరబ్రహ్మను తెలియుట పురుషార్థమగునని తోచనేలేదు.

తయైవం రమమాణస్య కామకశ్మలచేతసః ।
క్షణార్ధమివ రాజేంద్ర వ్యతిక్రాంతం నవం వయః ॥ 5

రాజేంద్ర - ఓ మహారాజా!, ఏవమ్ - ఈ విధముగా, తయా - ఆమెతో, రమమాణస్య - రమించుచున్నట్టియు, కామకశ్మలచేతసః - కామముచే మలినమైన మనస్సు గల పురంజనునకు, నవం వయః - యౌవనము, క్షణ-అర్ధం ఇవ - అర్ధక్షణము వలె, వ్యతిక్రాంతమ్ - గడచిపోయినది.

ఓ మహారాజా! ఈ విధముగా కామముచే మలినమైన మనస్సు గల పురంజనుడు ఆమెతో గూడి రమించుచుండగా, యౌవనము అర్ధక్షణము వలె కరిగిపోయెను.

తస్యామజనయత్పుత్రాన్ పురంజన్యాం పురంజనః ।
శతాన్యేకాదశ విరాడాయుషోఽర్ధమథాత్యగాత్ ॥ 6

దుహితౄర్దశోత్తరశతం పితృమాతృయశస్కరీః ।
శీలౌదార్యగుణోపేతాః పౌరంజన్యః ప్రజాపతే ॥ 7

ప్రజాపతే - ఓ ప్రజాపతీ!, విరాట్ - చక్రవర్తియగు, పురంజనః - పురంజనుడు, తస్యామ్ - ఆ, పురంజన్యామ్ - పురంజనియందు, శతం ఏకాదశ - నూట పదకొండుమంది, పుత్రాన్ - పుత్రులను, పితృమాతృయ శః-కరీః - తండ్రికి తల్లికి కీర్తిని తెచ్చిపెట్టునట్టియు, శీల-ఔదార్యగుణ-ఉపేతాః - సచ్ఛీలము పెద్ద మనస్సు అనే మంచి గుణములతో కూడినట్టియు, పౌరంజన్యః - పౌరంజనీలు అని పేరు పొందిన, దశ-ఉత్తరశతమ్ - నూటపదిమంది, దుహితౄః - కుమార్తెలను, అజనయత్ - కనెను, అథ - అప్పటికి, ఆయుషః - ఆయుర్దాయముయొక్క, అర్ధమ్ - సగము, అత్యగాత్ - గడచిపోయెను.

ఓ ప్రజాపతీ! పురంజన చక్రవర్తికి ఆ పురంజనియందు నూట పదకొండుమంది కొడుకులు, నూట పదిమంది కుమార్తెలు కలిగిరి. అప్పటికి ఆతని ఆయుష్షు సగము గడిచిపోయెను. పౌరంజనీలు అని పేరు పొందిన ఆ కుమార్తెలు సచ్ఛీలము, పెద్ద మనస్సు అనే మంచి గుణములు గలవారై తల్లిదండ్రులకు మంచి పేరును తెచ్చిపెట్టిరి.

స పంచాలపతిః పుత్రాన్ పితృవంశవివర్ధనాన్ ।
దారైస్సంయోజయామాస దుహితౄస్సదృశైర్వరైః ॥ 8

పంచాలపతిః - పంచాలదేశప్రభువగు, సః - ఆ పురంజనుడు, పితృవంశవివర్ధనాన్ - పితృవంశమును వర్ధిల్లజేసే, పుత్రాన్ - పుత్రులను, దారైః - భార్యలతో, దుహితౄః - కుమార్తెలను, సదృశైః - తగిన, వరైః - భర్తలతో, సంయోజయామాస - కలిపెను.

పంచాలదేశప్రభువగు ఆ పురంజనుడు పితృవంశమును వర్ధిల్లజేసే పుత్రులకు వివాహములను చేసెను. కుమార్తెలకు కూడ అనురూపులగు వరులతో వివాహములను చేసెను.

పుత్రాణాం చాభవన్ పుత్రా ఏకైకస్య శతం శతమ్ ।
యైర్వై పౌరంజనో వంశః పంచాలేషు సమేధితః ॥ 9

పుత్రాణాం చ - ఆ పుత్రులలో కూడ, ఏక-ఏకస్య - ఒక్కొక్కనికి, శతం శతమ్ - వంద వంద చొప్పున, పుత్రాః - పుత్రులు, అభవన్ - కలిగిరి. యైః వై - ఎవరిచేనైతే, పౌరంజనః - పురంజనునకు చెందిన, వంశః - వంశము, పంచాలేషు - పంచాల దేశమునందు, సమేధితః - బాగుగా వర్ధిల్ల జేయబడినదో.

పురంజనుని ఆ పుత్రులలో ఒక్కొక్కనికి వంద చొప్పున పుత్రులు కలిగిరి. వారు పంచాలదేశములో పురంజనుని వంశమును వర్ధిల్లజేసిరి.

తేషు తద్రిక్థహారేషు గృహకోశానుజీవిషు ।
నిరూఢేన మమత్వేన విషయేష్వన్వబధ్యత ॥ 10

తేషు - వారియందు, తత్-రిక్థహారేషు - వారి పుత్రులయందు, గృహకోశ-అ...జీవిషు - ఇల్లు ధనము పరిచారకులయందు, నిరూఢేన - మిక్కిలి దృఢమైన, మమత్వేన - మమకారముచే, విషయేషు - భోగ్యపదార్థములయందు, అన్వబధ్యత - మిక్కిలి బంధించబడెను.

ఆ పుత్రులు, వారి పుత్రులు, ఇల్లు, డబ్బు, పరిచారకులు అనువాటియందు పురంజనునకు మిక్కిలి దృఢమగు మమకారము ఏర్పడెను. దాని కారణముగా ఆతడు సంసారములోని శబ్దాదివిషయములయందు గట్టిగా తగుల్కొనెను.

ఈజే చ క్రతుభిర్ఘోరైర్దీక్షితః పశుమారకైః ।
దేవాన్ పితౄన్ భూతపతీన్నానాకామో యథా భవాన్ ॥ 11

నానాకామః - అనేకములగు కామనలు గల పురంజనుడు, దీక్షితః - దీక్షను తీసుకున్నవాడై, ఘోరైః - భయమును గొల్పునట్టియు, పశుమారకైః - పశువులను హింసించే, క్రతుభిః - క్రతువులచే, దేవాన్ - దేవతలను, పితౄన్ - పితృదేవతలను, భూతపతీన్ - భూతముల నాయకులను, భవాన్ యథా - నీవు వలె, ఈజే చ - ఆరాధించెను.

అనేకములగు కామనలు గల ఆ పురంజనుడు దీక్షను బూని, పశుహింసతో కూడియుండుటచే భయమును గొల్పే క్రతువులను చేసి, దేవ

తలు పితృదేవతలు భైరవుడు మొదలగు భూతనాయకులు అనువారిని, నీవు చేసినట్లే ఆరాధించెను.

యుక్తేష్వేవం ప్రమత్తస్య కుటుంబాసక్తచేతసః ।
ఆససాద స వై కాలో యోఽప్రియః ప్రియయోషితామ్ ॥ 12

ఏవమ్ - ఈ విధముగా, యుక్తేషు - యోగ్యమగు విషయముల యందు, ప్రమత్తస్య - అసావధానముగానున్నట్టియు, కుటుంబ-ఆసక్తచేతసః - కుటుంబమునందు తగుల్కొన్న మనస్సు గల పురంజనునకు, సః - ఆ, కాలః - కాలము, వై - నిశ్చయముగా, ఆససాద - సమీపించెను, యః - ఏ కాలము, ప్రియయోషితామ్ - ప్రియమగు భార్య గలవారికి (ప్రియులగు భార్యలకు), అప్రియః - ప్రియము కానిదో.

ఈ విధముగా కుటుంబమునందు తగుల్కొన్న మనస్సు గలవాడై, ఈశ్వరారాధనవంటి యోగ్యములగు ప్రవృత్తులయందు అసావధానముగానున్న పురంజనునకు ముసలిదనము వచ్చిపడెను. ప్రియమగు భార్యతో రమించ గోరువానికి, తాను ప్రేమించే భార్యకు కూడ ఆ కాలము అనుకూలము కాదు.

చండవేగ ఇతి ఖ్యాతో గంధర్వాధిపతిర్నృప ।
గంధర్వాస్తస్య బలినష్షష్ట్యుత్తరశతత్రయమ్ ॥ 13

నృప - ఓ మహారాజా!, చండవేగః - చండవేగుడు, ఇతి - అని, ఖ్యాతః - ఖ్యాతిని గాంచిన, గంధర్వ-అధిపతిః - గంధర్వనాయకుడు గలడు, తస్య - వానికి, బలినః - బలశాలురగు, గంధర్వాః - గంధర్వులు, షష్టి-ఉత్తరశతత్రయమ్ - మూడువందల అరవై మంది గలరు.

ఓ మహారాజా! చండవేగుడని ప్రసిద్ధిని గాంచిన గంధర్వనాయకుడు ఒకడు గలడు. ఆయన వద్ద బలశాలురగు గంధర్వులు మూడు వందల అరవై మంది గలరు.

గంధర్వ్యస్తాదృశీరస్య మైథున్యశ్చ సితాసితాః ।
పరివృత్త్యా విలుంపంతి సర్వకామవినిర్మితామ్ ॥ 14

అస్య - వీనికి, సిత-అసితాః - తెల్లని మరియు నల్లని, మైథున్యః - గంధర్వులతో కలిసి జంటలుగా ఉండే, తాదృశీః - అటువంటి, గంధర్వ్యః - గంధర్వయువతులు, సర్వకామవినిర్మితామ్ - అన్ని భోగవిషయములచే నిర్మించబడిన నగరమును, పరివృత్త్యా - ఒకరి తరువాత మరియొకరుగా, విలుంపంతి - దోపిడీ చేసెదరు.

ఆ గంధర్వునకు అంతే సంఖ్యలో బలవతులగు గంధర్వస్త్రీలు కూడ గలరు. నలుపు, తెలుపు రంగు గల వారు గంధర్వులతో జత గట్టియుండెదరు. సకలభోగ్యవిషయములతో నిర్మించబడిన నగరమును పరిభ్రమిస్తూ, వారు దానిని ఒకరి తరువాత మరియొకరు చొప్పున దోపిడీ జేసెదరు.

తే చండవేగానుచరాః పురంజనపురం యదా ।
హర్తుమారేభిరే తత్ర ప్రత్యషేధత్ప్రజాగరః ॥ 15

తే - ఆ, చండవేగ-అనుచరాః - చండవేగుని అనుచరులు, యదా - ఏ కాలమునందైతే, పురంజనపురమ్ - పురంజనుని నగరమును, హర్తుమ్ - దోచుటకు, ఆరేభిరే - ఆరంభించిరో, తత్ర - ఆ కాలమునందు, ప్రజాగరః - ప్రజాగరుడు, ప్రత్యషేధత్ - అడ్డుపడెను.

చండవేగుని అనుచరులు పురంజనుని నగరమును దోచుకొనుట కారంభించగా, ప్రజాగరుడనే అయిదు తలల పాము వారికి అడ్డు పడెను.

స సప్తభిశ్శతైరేకో వింశత్యా చ శతం సమాః ।
పురంజనపురాధ్యక్షో గంధర్వైర్యుయుధే బలీ ॥ 16

పురంజనపుర-అధ్యక్షః - పురంజనుని నగరమునకు అధ్యక్షుడు, బలీ - బలవంతుడు అగు, సః - ఆ ప్రజాగరుడు, ఏకః - ఒక్కడే, సప్తభిః శతైః వింశత్యా చ - ఏడు వందల ఇరవై మంది, గంధర్వైః - గంధర్వులతో, శతమ్ - వంద, సమాః - సంవత్సరములను, యుయుధే - యుద్ధము చేసెను.

పురంజనుని నగరమునకు అధ్యక్షుడు, బలశాలి అగు ఆ ప్రజాగరుడు ఒక్కడే ఏడు వందల ఇరవైమంది గంధర్వులతో వంద సంవత్సరములు నిరంతరముగా పోరాడెను.

క్షీయమాణే స్వసంబంధ ఏకస్మిన్ బహుభిర్యుధా ।
చింతాం పరాం జగామార్తస్స రాష్ట్రపురబాంధవః ।। 17

బహుభిః - అనేకమందితో, యుధా - యుద్ధముచే, స్వసంబంధే - తనకు చెందినవాడు, ఏకస్మిన్ - ఒంటరివాడు అగు ప్రజాగరుడు, క్షీయమాణే - క్షీణించిపోవుచుండగా, రాష్ట్రపురబాంధవః - దేశమునకు నగరమునకు ప్రభువగు, సః - ఆ పురంజనుడు, ఆర్తః - పీడను పొందినవాడై, పరామ్ - పెద్ద, చింతామ్ - చింతను, జగామ - పొందెను.

అనేకులగు గంధర్వులతో యుద్ధము జరుగుచుండగా, పురంజనుని రక్షకుడగు ప్రజాగరుడు ఒంటరిగా పోరాడుతూ క్రమముగా నీరసపడుచుండెను. దేశమునకు, నగరమునకు కూడ ప్రభువగు ఆ పురంజనుడు అప్పుడు చాల దుఃఖమును, చింతను పొందెను.

స ఏవ పుర్యాం మధుభుక్ పంచాలేషు స్వపార్షదైః ।
ఉపనీతం బలిం గృహ్ణన్ స్త్రీజితో నావిదద్భయమ్ ।। 18

స్త్రీజితః - భార్యచే జయించబడిన, సః ఏవ - ఆ పురంజనుడే, పంచాలేషు - పంచాల దేశమునందు, పుర్యామ్ - నగరమునందు, మధుభుక్ - మధువును భుజించువాడై, స్వపార్షదైః - తన అనుచరులచే, ఉపనీతమ్ - తీసుకురాబడిన, బలిమ్ - కప్పమును, గృహ్ణన్ - స్వీకరించుచున్నవాడై, భయమ్ - భయమును, న అవిదత్ - తెలియలేదు.

భార్యకు వశుడైయున్న ఆ పురంజనుడు పంచాలదేశములో ఆ నగరమునందు తన అనుచరులచే తీసుకురాబడిన కప్పమును గ్రహిస్తూ సుఖములననుభవిస్తూ ఉండెను. ఆతనికి మీద పడిన ఈ భయమును గురించి తెలియకుండెను.

కాలస్య దుహితా కాచిత్త్రిలోకీం వరమిచ్ఛతీ ।
పర్యటంతీ న బర్హిష్మన్ ప్రత్యనందత కశ్చన ॥ 19

బర్హిష్మన్ - ప్రాచీనబర్హిష మహారాజా!, కాలస్య - కాలుని, కాచిత్ - ఒకానొక, దుహితా - కుమార్తె, వరమ్ - వరుని, ఇచ్ఛతీ - కోరుచున్నదై, త్రిలోకీమ్ - ముల్లోకములను, పర్యటంతీ - సంచరించుచున్నది, కశ్చన - ఏ ఒక్కడైననూ, న ప్రత్యనందత - ఇష్టపడలేదు.

ఓ బర్హిషత్ మహారాజా! కాలునకు జర అనే ఒక కుమార్తె ఉండెను. ఆమె భర్తను గోరి ముల్లోకములను తిరిగెను. కాని, ఒక్కరికైననూ ఆమె నచ్చలేదు.

దౌర్భాగ్యేనాత్మనో లోకే విశ్రుతా దుర్భగేతి సా ।
యా తుష్టా రాజర్షయే తు వృతాऽదాత్పూరవే వరమ్ ॥ 20

ఆత్మనః - తన, దౌర్భాగ్యేన - దురదృష్టముచే, సా - ఆమె, లోకే - లోకమునందు, దుర్భగా - దుర్భగ, ఇతి - అని, విశ్రుతా - ఖ్యాతిని పొందినది, యా - ఏ దుర్భగ, రాజర్షయే - రాజర్షియగు, పూరవే తు - పూరుని కొరకైతే, వృతా - వరించబడినదై, తుష్టా - సంతసించినదై, వరమ్ - వరమును, అదాత్ - ఇచ్చెనో.

ఆమె చాల దురదృష్టవంతురాలగుటచే లోకములో దుర్భగ అని ప్రఖ్యాతిని గాంచినది. ఆమె రాజర్షియగు పూరువు తనను స్వీకరించినందులకు చాల సంతోషించి, ఆయనకు రాజ్యాధికారము అనే వరమునిచ్చినది.

కదాచిద్రటమానా సా బ్రహ్మలోకాన్మహీం గతమ్ ।
వవ్రే బృహద్వ్రతం మాం తు జానతీ కామమోహితా ॥ 21

రటమానా - తిరుగాడుచున్నట్టియు, కామమోహితా - కామముచే మోహమును చెందిన, సా - ఆమె, కదాచిత్ - ఒకనాడు, బ్రహ్మలోకాత్ - బ్రహ్మలోకమునుండి, మహీమ్ - భూలోకమును గురించి, గతమ్ - వెళ్లిన, మాం - నన్ను, బృహత్-వ్రతమ్ - గొప్ప వ్రతనిష్ఠ గలవానినిగా, జానతీ తు - తెలిసినదే అయిననూ, వవ్రే - వరించెను.

ఆమె కామముచే మోహమును పొంది తిరుగాడుచుండెను. నేను ఒకప్పుడు బ్రహ్మలోకమునుండి భూలోకమునకు వెళ్లితిని. నేను నైష్ఠిక బ్రహ్మచారినని తెలిసి కూడ ఆమె నన్ను అచట వరించెను.

మయి సంరభ్య విపులమదాచ్ఛాపం సుదుస్సహమ్ ।
స్థాతుమర్హసి నైకత్ర మద్యాచ్ఞావిముఖో మునే ॥ 22

మయి - నాయందు, సంరభ్య - కోపించి, విపులమ్ - పెద్ద, సుదుస్సహమ్ - మిక్కిలి సహించ శక్యము కాని, శాపమ్ - శాపమును, అదాత్ - ఇచ్చెను, మునే - ఓ మహర్షీ!, మత్-యాచ్ఞావిముఖః - నా కోరిక యందు విముఖుడవైన నీవు, ఏకత్ర - ఒకచోట, స్థాతుమ్ - ఉండుటకు, న అర్హసి - తగవు.

ఆమె నాయందు కోపించి నాకు మిక్కిలి సహించ శక్యము కాని పెద్ద శాపమునిచ్చినది. ఓ మునీ! నీవు నా కోరిక విషయములో విముఖుడవై ఉన్నావు గనుక, నీవు ఒకచోట స్థిరముగా నుండజాలవు అని ఆమె శపించినది.

తతో విహతసంకల్పా కన్యకా యవనేశ్వరమ్ ।
మయోపదిష్టమాసాద్య వవ్రే నామ్నా భయం పతిమ్ ॥ 23

తతః - తరువాత, విహతసంకల్పా - భగ్నమైన సంకల్పము గల, కన్యకా - ఆ కన్య, మయా - నాచే, ఉపదిష్టమ్ - సూచించబడిన, నామ్నా భయమ్ - భయుడను పేరు గల, యవన-ఈశ్వరమ్ - యవనప్రభుని, ఆసాద్య - సమీపించి, పతిమ్ - భర్తనుగా, వవ్రే - వరించెను.

ఈ విధముగా ఆ కన్యయొక్క సంకల్పము భగ్నమైన తరువాత, ఆమెకు భయుడనే పేరు గల యవనప్రభుని నేనే సూచించితిని. ఆమె నా సూచన ప్రకారముగా అతని వద్దకు వెళ్లి, అతనినే భర్తగా వరించెను.

ఋషభం యవనానాం త్వాం వృణే వీరేప్సితం పతిమ్ ।
సంకల్పస్త్వయి భూతానాం కృతః కిల న రిష్యతి ॥ 24

వీర - ఓ వీరుడా!, యవనానామ్ - యవనులలో, ఋషభమ్ - శ్రేష్ఠుడవగు, త్వామ్ - నిన్ను, ఈప్సితమ్ - మనసునకు నచ్చిన, పతిమ్ - భర్తనుగా, వృణే - వరించుచున్నాను, త్వయి - నీయందు, కృతః - చేయబడిన, భూతానామ్ - ప్రాణులయొక్క, సంకల్పః - సంకల్పము, న రిష్యతి కిల - నశించదు గదా!

ఓ వీరా! యవనులలో శ్రేష్ఠుడవగు నిన్ను నేను నా మనస్సునకు నచ్చిన భర్తగా వరించుచున్నాను. ప్రాణులు నీ యెడల చేసిన సంకల్పము విఫలము కాదు గదా!

ద్వావిమావనుశోచంతి బాలావసదవగ్రహౌ ।
యల్లోకశాస్త్రోపనతం న రాతి న తదిచ్ఛతి ।। 25

బాలౌ - మూర్ఖులు, అసత్-అవగ్రహౌ - మిథ్యాభూతమగు పట్టుదల గలవారు అగు, ఇమౌ - ఈ, ద్వౌ - ఇద్దరిని గురించి, అనుశోచంతి - శోకించుచున్నారు, యత్ - ఎవరనగా, లోకశాస్త్ర-ఉపనతమ్ - లోకవ్యవహారములో గాని శాస్త్రోపదేశముచే గాని సంప్రాప్తమైనదానిని, న రాతి - ఇచ్చుట లేదో, తత్ - దానిని, న ఇచ్ఛతి - ఇష్టపడుట లేదో.

లోకవ్యవహారములో గాని, శాస్త్రోపదేశముచే గాని దానము చేయవలసిన దానిని దానము చేయనివాడు, అదే రీతిలో సంప్రాప్తమైన దానిని స్వీకరించనివాడు అనే వీరిద్దరు మూర్ఖులు. వీరి పట్టుదల వ్యర్థమైనది. వీరు శోకింప దగినవారు.

అథో భజస్వ మాం భద్ర భజంతీం మే దయాం కురు ।
ఏతావాన్ పౌరుషో ధర్మో యదార్తాననుకంపతే ।। 26

భద్ర - మంగళకరమైన వాడా!, అథో - అందువలన, భజంతీమ్ - సేవించుచున్న, మామ్ - నన్ను, భజస్వ - స్వీకరించుము, మే - నా కొరకు, దయామ్ - దయను, కురు - చేయుము, పౌరుషః - పురుషులకు సంబంధించిన, ధర్మః - ధర్మము, ఏతావాన్ - ఇంత మాత్రమే, యత్ - ఏదనగా, ఆర్తాన్ - దీనులను, అనుకంపతే - దయను చూపుచున్నాడో.

ఓ మంగళకరమైన వాడా! కావున నిన్ను ప్రేమించుచున్న నన్ను స్వీకరించుము. నాపై దయను చూపుము. దీనుల యెడల దయను చూపుటయే పురుషులు చేయదగిన ధర్మము.

కాలకన్యోదితవచో నిశమ్య యవనేశ్వరః ।
చికీర్షుర్దేవగుహ్యం స సస్మితం తామభాషత ॥ 27

సః - ఆ, యవన-ఈశ్వరః - యవనప్రభుడు, కాలకన్యా-ఉదిత వచః - కాలుని కన్యయగు జరచే చెప్పబడిన మాటను, నిశమ్య - విని, దేవగుహ్యమ్ - దేవతల రహస్యకార్యమును, చికీర్షుః - చేయగోరువాడై, సస్మితమ్ - చిరునవ్వుతో కూడియున్నట్లుగా, తామ్ - ఆమెను ఉద్దేశించి, అభాషత - పలికెను.

కాలకన్యయగు జర చెప్పిన మాటలను విని, ఆ యవనప్రభుడు దేవతల రహస్యకార్యమునొకదానిని చేయగోరి, చిరునవ్వుతో ఆమెను ఉద్దేశించి ఇట్లు పలికెను.

మయా నిరూపితస్తుభ్యం పతిరాత్మసమాధినా ।
నాభినందతి లోకోఽయం త్వామభద్రామసంమతామ్ ॥ 28

ఆత్మసమాధినా - చిత్తముయొక్క ఏకాగ్రతచే, మయా - నాచే, తుభ్యమ్ - నీ కొరకు, పతిః - భర్త, నిరూపితః - కనుగొనబడినాడు, అయమ్ - ఈ, లోకః - లోకము, అభద్రామ్ - అమంగళకరురాలవు, అసంమతామ్ - సమ్మతము కానిదానవు అగు, త్వామ్ - నిన్ను, న అభినందతి - ఇష్టపడుట లేదు.

నేను ఏకాగ్రమగు చిత్తముతో ఆలోచించి, నీకు భర్తను కనుగొంటిని. నీవు అమంగళకరురాలవగుటచే లోకులకు నీవు నచ్చుబాటు అగుట లేదు. కావుననే, వారు నిన్ను స్వీకరించుట లేదు.

త్వమవ్యక్తగతిర్భుంక్ష్వ లోకం కర్మవినిర్మితమ్ ।
యా హి మే పృతనాయుక్తా ప్రజానాశం ప్రణేష్యసి ॥ 29

త్వమ్ - నీవు, అవ్యక్తగతిః - తెలియబడని రాక గలదానవై, కర్మ వినిర్మితమ్ - కర్మలచే నిర్మించబడిన, లోకమ్ - ప్రాణిని (ప్రాణి దేహమును), భుంక్ష్వ - అనుభవించుము, యా - ఏ నీవు, మే - నాయొక్క, పృతనాయుక్తా - సైన్యముతో కూడినదానవై, ప్రజానాశమ్ - ప్రాణుల నాశమును, ప్రణేష్యసి - చేయగలవో.

నీ రాక ఎవ్వరికైననూ తెలియదు. నీవు కర్మలచే నిర్మితమైన ఈ ప్రాణుల శరీరములను అనుభవించుము. నా సైన్యము నీకు తోడు కాగలదు. నీవు సకలప్రాణులను నశింప జేయగలవు.

ప్రజ్వారోఽయం మమ భ్రాతా త్వం చ మే భగినీ భవ ।
చరామ్యుభాభ్యాం లోకేఽస్మిన్నవ్యక్తో భీమసైనికః ॥ 30

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే చతుర్థస్కంధే పురంజనోపాఖ్యానే కాలకన్యోపాఖ్యానవర్ణనం నామ సప్తవింశోఽధ్యాయః ॥

అయమ్ - ఈ, ప్రజ్వారః - ప్రజ్వారుడు, మమ - నా, భ్రాతా - సోదరుడు, త్వం చ - నీవు కూడ, మే - నా, భగినీ - చెల్లెలివి, భవ - కమ్ము, ఉభాభ్యామ్ - మీ ఇద్దరితో, అస్మిన్ - ఈ, లోకే - లోకమునందు, భీమసైనికః - భయంకరులగు సైనికులు గల నేను, అవ్యక్తః - తెలియబడనివాడనై, చరామి - సంచరించెదను.

ఈ ప్రజ్వారుడు నాకు తమ్ముడు. నీవు కూడ నాకు చెల్లెలివి కమ్ము. మీ ఇద్దరు తోడు కాగా, భయంకరులగు సైనికులు గల నేను ఎవ్వరికైననూ తెలియకుండా ఈ లోకములో సంచరించెదను.

శ్రీమద్భాగవత మహాపురాణములోని నాల్గవ స్కంధమునందు
పురంజనోపాఖ్యానములో కాలకన్యోపాఖ్యానమును వర్ణించే
ఇరువది ఏడవ అధ్యాయము ముగిసినది (27).

*****

# అథ అష్టావింశోऽధ్యాయః

## పురంజనోపాఖ్యానము - అవిజ్ఞాత వైదర్భీ సంవాదము

నారద ఉవాచ ।
సైనికా భయనామ్నో యే బర్హిష్మన్ దిష్టకారిణః ।
ప్రజ్వారకాలకన్యాభ్యాం విచేరురవనీమిమామ్ ॥ 1

నారదః - నారద మహర్షి, ఉవాచ - పలికెను, బర్హిష్మన్ - ఓ బర్హిష్మత్ మహారాజా!, భయనామ్నః - భయుడని ప్రసిద్ధిని గాంచిన యవనరాజుయొక్క, దిష్టకారిణః - ఆజ్ఞను నిర్వర్తించే, సైనికాః - సైనికులు, ప్రజ్వారకాలకన్యాభ్యామ్ - ప్రజ్వారుడు కాలకన్యలతో గూడి, ఇమామ్ - ఈ, అవనీమ్ - భూమండలమును, విచేరుః - సంచరించిరి.

నారద మహర్షి ఇట్లు పలికెను --- ఓ బర్హిష్మత్ మహారాజా! భయుడని ప్రసిద్ధిని గాంచిన ఆ యవనప్రభుని సైనికులు ఆయన ఆదేశమును పాలించువారై, ప్రజ్వారునితో మరియు కాలకన్యతో గూడి, ఈ భూమండలమును సంచరించిరి.

త ఏకదా తు రభసా పురంజనపురీం నృప ।
రురుధుర్భౌమభోగాఢ్యాం జరత్పన్నగపాలితామ్ ॥ 2

నృప - ఓ మహారాజా!, తే - వారు, ఏకదా తు - ఒకనాడైతే, భౌమభోగ-ఆఢ్యామ్ - భూమండలమునందలి భోగములచే సంపన్నమై యున్నట్టియు, జరత్-పన్నగపాలితామ్ - ముసలి పాముచే రక్షించబడిన, పురంజనపురీమ్ - పురంజనుని నగరమును, రభసా - వేగముగా, రురుధుః - ముట్టడించిరి.

ఓ మహారాజా! ఒకనాడు వారు పురంజనుని నగరమును వేగముగా ముట్టడించిరి. భూమండలములోని భోగములతో సంపన్నమై యున్న ఆ పురమును ముసలి పాము సంరక్షించుచుండెను.

కాలకన్యాఽపి బుభుజే పురంజనపురం బలాత్ ।
యయాఽభిభూతః పురుషస్సద్యో నిస్సారతామియాత్ ।। 3

కాలకన్యా అపి - కాలకన్య కూడ, పురంజనపురమ్ - పురంజనుని పురమును, బలాత్ - బలాత్కారముగా, బుభుజే - భోగించెను, యయా - ఏ కాలకన్యచే, అభిభూతః - పరాజితుడైన, పురుషః - వ్యక్తి, సద్యః - వెంటనే, నిస్సారతామ్ - సత్తువ లేని స్థితిని, ఇయాత్ - పొందునో.

కాలకన్య కూడ పురంజనుని పురమును బలాత్కారముగా ఆక్రమించి భోగించెను. కాలకన్యచే ఆక్రమించబడిన వ్యక్తి వెంటనే సత్తువను పూర్తిగా కోల్పోవును.

తయోపభుజ్యమానాం వై యవనాస్సర్వతోదిశమ్ ।
ద్వార్భిః ప్రవిశ్య సుభృశం ప్రార్దయన్ సకలాం పురీమ్ ।। 4

తయా - ఆ కాలకన్యచే, ఉపభుజ్యమానామ్ - భోగించబడుచున్న, సకలామ్ - సకలమగు, పురీమ్ - నగరమును, యవనాః - యవనులు, సర్వతః-దిశమ్ - అన్ని దిక్కులనుండియు, ద్వార్భిః - ద్వారముల గుండా, ప్రవిశ్య - ప్రవేశించి, సుభృశమ్ - మిక్కిలి తీవ్రముగా, ప్రార్దయన్ - పీడను కలిగించిరి.

కాలకన్య ఆ నగరమును ఆక్రమించి భోగించుచుండగా, యవనులు అన్ని దిక్కులనుండియు ద్వారముల గుండా లోపల ప్రవేశించి, ఆ నగరమునంతనూ చాల తీవ్రమగు వినాశమునకు గురి చేసిరి.

తస్యాం ప్రపీడ్యమానాయామభిమానీ పురంజనః ।
అవాపోరువిధాంస్తాపాన్ కుటుంబీ మమతాకులః ।। 5

తస్యామ్ - ఆ పురము, ప్రపీడ్యమానాయామ్ - అధికముగా పీడింపబడుచుండగా, అభిమానీ - పురమునందు అభిమానము గలవాడు, కుటుంబీ - కుటుంబము గలవాడు, మమతా-ఆకులః - మమకారముచే ఆందోళనను చెందినవాడు అగు, పురంజనః - పురంజనుడు, ఉరువిధాన్ - పలువిధములగు, తాపాన్ - దుఃఖములను, అవాప - పొందెను.

కుటుంబమునకు యజమానియగు పురంజనునకు ఆ పురమునందు, దానికి చెందిన వ్యక్తులయందు ఇది నాది, నా వారు అనే అభిమానమెందు. ఆ కారణముగా, ఆ పురము తీవ్రముగా ముట్టడించబడినప్పుడు, ఆతడు చాల వ్యాకులతను చెందినవాడై పలువిధములగు దుఃఖములను పొందెను.

కన్యోపగూఢో నష్టశ్రీః కృపణో విషయాత్మకః ।
నష్టప్రజ్ఞో హృతైశ్వర్యో గంధర్వయవనైర్బలాత్ ॥ 6

కన్యా-ఉపగూఢః - కాలకన్యచే కౌగిలించుకొనబడినవాడు, నష్టశ్రీః - నశించిన శోభ గలవాడు, కృపణః - దీనుడు, విషయ-ఆత్మకః - ఇంద్రియభోగములయందు మనస్సు గలవాడు, నష్టప్రజ్ఞః - నశించిన వివేకజ్ఞానము గలవాడు, గంధర్వయవనైః - గంధర్వులచే మరియు యవనులచే, బలాత్ - బలాత్కారముగా, హృతశ్రీః - అపహరించబడిన సంపద గలవాడు.

కాలకన్య కౌగిలికి చిక్కిన పురంజనుని అందమంతయు నశించెను. దీనుడగు ఆతని మనస్సు ఇంకనూ విషయభోగములయందు లగ్నమైయుండెను. ఆతని వివేకము కూడ నశించెను. గంధర్వులు, యవనులు ఆతని సంపదను కొల్లగొట్టిరి.

విశీర్ణాం స్వపురీం వీక్ష్య ప్రతికూలాననాదృతాన్ ।
పుత్రాన్పౌత్రానుగామాత్యాఞ్జాయాం చ గతసౌహృదామ్॥7

ఆత్మానం కన్యయా గ్రస్తం పంచాలానరిదూషితాన్ ।
దురంతచింతామాపన్నో న లేభే తత్ప్రతిక్రియామ్॥ 8

విశీర్ణామ్ - శిథిలమైన, స్వపురీమ్ - తన నగరమును, ప్రతికూలాన్ - వ్యతిరేకులైనట్టియు, అనాదృతాన్ - ఆదరము లేని, పుత్రాన్ - పుత్రులను, పౌత్ర-అనుగ-అమాత్యాన్ - మనుమలను అనుచరులను మంత్రులను, చ - మరియు, గతసౌహృదామ్ - తొలగిన ప్రేమ గల, జాయామ్ - భార్యను, కన్యయా - కాలకన్యచే, గ్రస్తమ్ - మ్రింగివేయబడిన, ఆత్మానమ్ - తనను, అరిదూషితాన్ - శత్రువులచే పాడు చేయబడిన, పంచాలాన్ - పంచాల దేశమును, వీక్ష్య - చూచి, దురంతచింతామ్ - అంతము లేని దుఃఖమును, ఆపన్నః - పొందినవాడై, తత్-ప్రతిక్రియామ్ - వాటికి ప్రతిక్రియను, న లేభే - పొందలేదు.

పురంజనుని నగరము శిథిలమయ్యెను. ఆతని పుత్రులు, పౌత్రులు, అనుచరులు, మంత్రులు పురంజనుని యెడల ఆదరమును చూపుట మాని వ్యతిరేకులైరి. భార్యకు కూడ ఆయనపై ప్రేమ తొలగిపోయెను. పంచాలదేశము శత్రువులచే పాడు చేయబడెను. తాను కాలకన్యచే ఆక్రమించబడి యుండెను. ఈ స్థితిని కనుగొనిన పురంజనునకు అంతము లేని దుఃఖము కలిగెను. దీనినుండి బయట పడే ఉపాయమేమియు ఆయనకు తోచలేదు.

కామానభిలషన్ దీనో యాతయామాంశ్చ కన్యయా ।
విగతాత్మగతిస్నేహః పుత్రదారాంశ్చ లాలయన్ ॥ 9

కన్యయా - కాలకన్య కారణముగా, యాతయామాన్ - తొలగిపోయిన సారము గల, కామాన్ - భోగ్యవస్తువులను, అభిలషన్ - కోరుచున్నవాడు, విగత-ఆత్మగతిస్నేహః - తొలగిపోయిన తనయొక్క పుణ్యలోకగమనము మరియు బంధువుల ప్రేమ గలవాడు, చ - మరియు, పుత్రదారాన్ - పుత్రులను భార్యను, లాలయన్ - లాలించుచున్నవాడు.

కాలకన్య కారణముగా పురంజనునకు భోగ్యవస్తువులయందు సారము అనుభవమునకు వచ్చుట ఆగిపోయెను. అయిననూ, ఆతడు వాటినే కోరుచుండెను. ఆతడు పుణ్యమును చేయకపోవుటచే పుణ్యలోక

ప్రాప్తి లేదు. ఇహలోకములో పుత్రాదుల ప్రేమ కూడ ఆతనికి లభించుట లేదు. ఆతడు పుత్రులను భార్యను వారి ప్రేమ కొరకై బుజ్జగించుచుండెను.

గంధర్వయవనాక్రాంతాం కాలకన్యోపమర్దితామ్ ।
హాతుం ప్రచక్రమే రాజా తాం పురీమనికామతః ।। 10

గంధర్వయవన-ఆక్రాంతామ్ - గంధర్వులచే మరియు యవనులచే ఆక్రమించబడినట్టియు, కాలకన్యా-ఉపమర్దితామ్ - కాలకన్యచే భగ్నము చేయబడిన, తామ్ - ఆ, పురీమ్ - పురమును, రాజా - పురంజన మహారాజు, అనికామతః - ఇచ్ఛ లేకున్ననూ, హాతుమ్ - విడిచిపెట్టుటకు, ప్రచక్రమే - ఉపక్రమించెను.

పురంజనుని పురమును గంధర్వులు, యవనులు ఆక్రమించిరి. కాలకన్య ఆ పురమును భగ్నము చేసెను. కావుననే, ఆ రాజు ఇష్టము లేకున్ననూ, ఆ పురమును విడిచిపెట్టే ప్రయత్నమునారంభించెను.

భయనామ్నోऽగ్రజో భ్రాతా ప్రజ్వారః ప్రత్యుపస్థితః ।
దదాహ తాం పురీం కృత్స్నాం భ్రాతుః ప్రియచికీర్షయా ।।11

భయనామ్నః - భయుడని ప్రసిద్ధిని గాంచిన యవనప్రభువుయొక్క, అగ్రజః - ముందు పుట్టిన, భ్రాతా - సోదరుడగు, ప్రజ్వారః - ప్రజ్వారుడు, ప్రత్యుపస్థితః - తిరిగి పురమునకు వచ్చినపాడు, భ్రాతుః - సోదరునకు, ప్రియచికీర్షయా - ప్రియమును చేయవలెననే కోరికతో, కృత్స్నామ్ - సకలమగు, తామ్ - ఆ, పురీమ్ - పురమును, దదాహ - తగులబెట్టెను.

భయుడని ప్రసిద్ధిని గాంచిన యవనప్రభుని పెద్ద అన్నగారగు ప్రజ్వారుడు ఇంతలో ఆ నగరమునకు వచ్చెను. ఆతడు తన సోదరునకు ప్రియమును చేయగోరి ఆ పురమునకంతకూ నిప్పు పెట్టెను.

తస్యాం సందహ్యమానాయాం సపౌరస్సపరిచ్ఛదః ।
కౌటుంబికః కుటుంబిన్యా ఉపాతప్యత సాన్వయః ।। 12

తస్యామ్ - ఆ పురము, సందహ్యమానాయామ్ - గట్టిగా తగులబడుచుండగా, సపౌరః - పురజనులతో గూడినవాడు, సపరిచ్ఛదః - సేవకులతో కూడినవాడు, కౌటుంబికః - కుటుంబమునందు ప్రేమ గలవాడు, స-అన్వయః - పుత్రులు మొదలగువారితో కూడియున్నవాడు అగు పురంజనుడు, కుటుంబిన్యా - భార్యతో గూడి, ఉపాతప్యత - పెద్ద తాపమును పొందెను.

ఆ పురము తగులబడుచుండగా, కుటుంబమునందు ఆసక్తి గల పురంజనుడు పురజనులతో, సేవకులతో, పుత్రాదులతో గూడినవాడై భార్యతో బాటుగా చాల తాపముననుభవించెను.

యవనోపరుద్ధాయతనో గ్రస్తాయాం కాలకన్యయా ।
పుర్యాం ప్రజ్వారసంసృష్టః పురపాలోఽన్వతప్యత ।। 13

పుర్యామ్ - పురము, కాలకన్యయా - కాలకన్యచే, గ్రస్తాయామ్ - ఆక్రమించబడగా, యవన-ఉపరుద్ధ-ఆయతనః - యవనులచే ముట్టడించబడిన నివాసము గలవాడు, ప్రజ్వారసంసృష్టః - ప్రజ్వారునిచే పీడించబడినవాడు అగు, పురపాలః - పురమును రక్షించే నాగము, అను - ప్రతి క్షణము, అతప్యత - తాపమును పొందెను.

కాలకన్య పురమును ఆక్రమించెను. యవనులు పురపాలకుడగు నాగుని ఇంటిని ముట్టడించిరి. ప్రజ్వారుడు కూడ ఆ నాగుని పీడించెను. అపుడా నాగు నిరంతరమగు తాపముననుభవించెను.

న శేకే సోఽవితుం తత్ర పురుకృచ్ఛ్రోరువేపథుః ।
గంతుమైచ్ఛత్తతో వృక్షకోటరాదివ సానలాత్ ।। 14

తత్ర - అచట, పురుకృచ్ఛ్ర-ఉరువేపథుః - పెద్ద ఆపద కారణముగా అధికముగా వణుకుచున్న, సః - ఆ నాగము, అవితుమ్ - రక్షించుటకు, న శేకే - సమర్థము కాలేదు, స-అనలాత్ - నిప్పుతో కూడియున్న, వృక్షకోటరాత్ ఇవ - చెట్టు తొర్రనుండి వలె, తతః - ఆ పురమునుండి, గంతుమ్ - వెళ్లుటకు, ఐచ్ఛత్ - కోరెను.

పెద్ద ఆపద వచ్చి పడిన కారణముగా అధికముగా వణుకుచున్న పురపాలకుడగు నాగము ఆ పురమును రక్షించలేక పోయెను. కావుననే, నిప్పు గల చెట్టు తొర్రవంటి ఆ పురమునుండి నిష్క్రమించవలెనని ఆ నాగము తలపోసెను.

శిథిలావయవో యర్హి గంధర్వైర్హృతపౌరుషః ।
యవనైరరిభీ రాజన్నుపరుద్ధో రురోద హ ॥ 15

రాజన్ - ఓ మహారాజా!, శిథిల-అవయవః - శిథిలమైన అవయవములు గలవాడు, గంధర్వైః - గంధర్వులచే, హృతపౌరుషః - అపహరించబడిన పౌరుషము గలవాడు అగు నాగము, యర్హి - ఏ కాలమునందైతే, అరిభిః - శత్రువులగు, యవనైః - యవనులచే, ఉపరుద్ధః - అడ్డుకొనబడినవాడో ఆ కాలమునందు, రురోద హ - ఏడ్చెను.

ఓ మహారాజా! ఆ నాగముయొక్క అవయవములన్నియు శిథిలమయ్యెను. దాని పౌరుషమును గంధర్వులు అపహరించిరి. అది పారిపోవుటకు యత్నించగా, శత్రువులగు యవనులు దానిని అడ్డుకొనిరి. అప్పుడది ఏడ్చెను.

దుహితౄః పుత్రపౌత్రాంశ్చ జామిజామాతృపార్షదాన్ ।
స్వత్వావశిష్టం యత్కించిద్గృహకోశపరిచ్ఛదమ్ ॥ 16

అహం మమేతి స్వీకృత్య గృహేషు కుమతిర్గృహీ ।
దధ్యౌ ప్రమదయా దీనో విప్రయోగ ఉపస్థితే ॥ 17

ప్రమదయా - భార్యతో, విప్రయోగే - వియోగము, ఉపస్థితే - సంప్రాప్తము కాగా, కుమతిః - తప్పు ఆలోచన గలవాడు, గృహీ - గృహస్థుడు, దీనః - దీనుడు అగు పురంజనుడు, గృహేషు - ఇంటియందు, అహమ్ - నేను, మమ - నాది, ఇతి - అని, స్వీకృత్య - స్వీకరించి, దుహితౄః - కుమార్తెలను, పుత్రపౌత్రాన్ చ - పుత్రులను పౌత్రులను కూడ, జామిజామాతృపార్షదాన్ - కోడళ్లను అల్లుళ్లను సేవకులను, స్వత్వ -అవశిష్టమ్ - తనది అంటూ మిగిలియున్నది, గృహకోశపరిచ్ఛదమ్ -

ఇల్లు ఖజానా సామగ్రి, కించిత్ - కొంచెము, యత్ - ఏది గలదో దానిని, దధ్యౌ - ధ్యానించెను.

గృహస్థుడగు పురంజనుడు దేహమునందు నేను అనే బుద్ధి, దేహమునకు సంబంధించిన ఇంటియందు నాది అనే బుద్ధిని కలిగియుండెను. ఇట్టి తప్పు ధారణలు గల గృహస్థుడైన ఆ పురంజనుడు భార్యతోడి వియోగము సంప్రాప్తము కాగా, దీనుడయ్యెను. ఆతని వద్ద నాది అనదగ్గది ఇల్లు, ధనము, సామగ్రి కొద్దిగా మిగిలియుండెను. ఆతడు ఆ సమయములో ఆ మిగిలిన ఆస్తిని, కూతుళ్లను, కొడుకులను, మనుమలను, కోడళ్లను, అల్లుళ్లను, సేవకులను గురించి చింతిస్తూ గడిపెను.

లోకాంతరం గతవతి మయ్యనాథా కుటుంబినీ ।
వర్తిష్యతే కథం త్వేషా బాలకాననుశోచతీ ।। 18

మయి - నేను, లోక-అంతరమ్ - పరలోకమును గురించి, గతవతి - వెళ్లగా, అనాథా - భర్త లేనిది, కుటుంబినీ - కుటుంబము గలది అగు, ఏషా తు - ఈమెయైతే, బాలకాన్ - పిల్లలను, అనుశోచతీ - దుఃఖించుచున్నదై, కథమ్ - ఏ విధముగా, వర్తిష్యతే - నిర్వహించగల్గును?

నేను పరలోకమునకు వెళ్లిన తరువాత విగతభర్తృక, పెద్ద కుటుంబము గలది అగు ఈ నా భార్య పిల్లల గురించి దుఃఖిస్తూ రోజులను ఎట్లు గడుపగల్గునో?

న మయ్యనాశితే భుంక్తే నాస్నాతే స్నాతి మత్పరా ।
మయి రుష్టే సుసంత్రస్తా భర్త్సితే యతవాగ్భయాత్ ।। 19

మత్-పరా - నేనే పరాయణముగా గల నా భార్య, మయి - నేను, అనాశితే - తినకుంటే, న భుంక్తే - తినదు, అస్నాతే - స్నానము చేయకుంటే, న స్నాతి - స్నానము చేయదు, మయి - నేను, రుష్టే - కోపిస్తే, సుసంత్రస్తా - చాల భయపడునది, భర్త్సితే - బెదిరించబడగా, భయాత్ - భయము వలన, యతవాక్ - నియంత్రించబడిన వాక్కు గలది.

నా భార్య పతివ్రత. నేను భోజనము చేయకపోతే ఆమె కూడ భోజనము చేయదు. నేను స్నానము చేయకపోతే, ఆమె కూడ స్నానము చేయదు. నేను కోపిస్తే ఆమె చాల భయపడును. నేను బెదిరించినప్పుడు ఆమె భయముతో మౌనమును వహించెడిది.

ప్రబోధయతి మావిజ్ఞం వ్యుషితే శోకకర్శితా ।
వర్త్మైతద్గృహమేధీయం వీరసూరపి నేష్యతి ॥ 20

అవిజ్ఞమ్ - అవివేకినగు, మా - నన్ను, ప్రబోధయతి - మేల్కొలుపును, వీరసూః - వీరులగు పుత్రులను కన్న ఈమె, వ్యుషితే - నేను పొరుగూరు వెళ్లగా, శోకకర్శితా - శోకముతో కృశించునది, గృహమేధీయమ్ - గృహస్థాశ్రమమునకు సంబంధించిన, వర్త్మ - మార్గమును, అపి నేష్యతి - నడిపించునా?

నేను పొరపాటు చేయబోవునంతలో ఈమె నన్ను హెచ్చరించెడిది. ఈమె వీరులగు పుత్రులను కన్నది. కాని, నేను పొరుగూరు వెళ్లినచో, వియోగదుఃఖముతో కృశించిపోవును. అట్టి ఈమె నేను మరణించిన పిదప ఇంటి వ్యవహారములను నడుపునా?

కథం ను దారకా దీనా దారకీర్వాऽపరాయణాః ।
వర్తిష్యంతే మయి గతే భిన్ననావ ఇవోదధౌ ॥ 21

అపర-అయనాః - మరియొక దిక్కులేని, దీనాః - దీనులగు, దారకాః - పుత్రులు, దారకీః వా - పుత్రికలు గాని, మయి - నేను, గతే - మరణించగా, ఉదధౌ - సముద్రమునందు, భిన్ననావః ఇవ - పగిలిపోయిన నావ గలవారు వలె, కథం ను - ఏ విధముగా, వర్తిష్యంతే - జీవించెదరో?

ఈ నా పుత్రులకు, పుత్రికలకు నేను తప్ప మరియొక దిక్కు లేదు. నేను మరణించగా, దీనులైన వీరు సముద్రములో నావ భగ్నమైన యాత్రికులు వలె, జీవితమును ఎట్లు వెళ్లదీసెదరో?

ఏవం కృపణయా బుద్ధ్యా శోచంతమతదర్హణమ్ ।
గ్రహీతుం కృతధీరేనం భయనామాऽభ్యపద్యత ॥ 22

ఏవమ్ - ఈ విధముగా, కృపణయా - దీనమగు, బుద్ధ్యా - బుద్ధితో, శోచంతమ్ - దుఃఖించుచున్నట్టియు, అతత్-అర్హణమ్ - అట్టి శోకమునకు తగని, ఏనమ్ - ఈ పురంజనుని, గ్రహీతుమ్ - పట్టుకొనుటకు, కృతధీః - చేయబడిన సంకల్పము గల, భయనామా - భయుడు అని ప్రసిద్ధిని చెందిన యవనరాజు, అభ్యపద్యత - వచ్చి పడెను.

ఈ విధముగా పురంజనుడు దీనమగు బుద్ధితో శోకించుచుండెను. అది ఆయనకు కలుగవలసిన శోకము కాదు. ఇంతలో, ఆయనను పట్టుకొనుటకు భయుడు అని ప్రసిద్ధిని చెందిన యవనరాజు వచ్చి పడెను.

పశువద్యవనైరేష నీయమానస్స్వకం క్షయమ్ ।
అన్వద్రవన్నానుపథాశ్శోచంతో భృశమాతురాః ॥ 23

ఏషః - ఈ పురంజనుడు, పశువత్ - పశువు వలె, స్వకమ్ - తన, క్షయమ్ - వినాశ (స్థాన) మును గురించి, యవనైః - యవనులచే, నీయమానః - కొనిపోబడుచున్నవాడు, భృశమ్ - మిక్కిలి, ఆతురాః - కలత జెందిన, అనుపథాః - అనుచరులు, శోచంతః - దుఃఖించుచున్నవారై, అను-అద్రవన్ - వెంట వెళ్లిరి.

పురంజనుని యవనులు ఈ విధముగా పశువును వలె తన స్థానమును గురించి తీసుకొని పోవుచుండగా, మిక్కిలి కలత జెందిన ఆతని అనుయాయులు దుఃఖిస్తూ ఆయన వెంట నడచిరి.

పురీం విహాయోపగత ఉపరుద్ధో భుజంగమః ।
యదా తమేవాను పురీ విశీర్ణా ప్రకృతిం గతా ॥ 24

యదా - ఏ కాలమునందైతే, ఉపరుద్ధః - ముట్టడించబడిన, భుజంగమః - నాగుడు, పురీమ్ - నగరమును, విహాయ - విడిచిపెట్టి, ఉపగతః - వెడలినాడో, తం ఏవ అను - ఆతడు వెళ్లిన వెంటనే, పురీ - ఆ నగరము, విశీర్ణా - శిథిలమైనదై, ప్రకృతిమ్ - ప్రకృతిని, గతా - పొందినది.

శత్రువులచే ముట్టడించబడిన పురపాలకుడగు నాగుడు పురమును విడిచిపెట్టి వెళ్లిపోయెను. ఆ వెనువెంటనే ఆ నగరము శిథిలమై చుట్టూ ఉండే ప్రకృతిలో కలిసిపోయెను.

**వికృష్యమాణః ప్రసభం యవనేన బలీయసా ।**
**నావిందత్తమసాఽఽవిష్టస్సఖాయం సుహృదం పురః ॥ 25**

బలీయసా - బలవంతుడగు, యవనేన - యవనునిచే, ప్రసభమ్ - బలాత్కారముగా, వికృష్యమాణః - లాగివేయబడుచున్న పురంజనుడు, తమసా - అజ్ఞానముచే, ఆవిష్టః - కప్పివేయబడినవాడై, పురః - పూర్వము, సుహృదమ్ - హితమును చేసిన, సఖాయమ్ - మిత్రుని, న అవిందత్ - పొందలేదు.

బలవంతుడగు యవనుడు పురంజనుని బలాత్కారముగా లాగివేయుచుండెను. కాని, అజ్ఞానముచే కప్పివేయబడియున్న పురంజనుడు తనకు పూర్వములో హితమును చేసిన మిత్రుని (అవిజ్ఞాతుని) స్మరించలేక పోయెను.

**తం యజ్ఞపశవోఽనేన సంజ్ఞప్తా యేఽదయాలునా ।**
**కుఠారైశ్చిచ్ఛిదుః క్రుద్ధాస్స్మరంతోఽమీవమస్య తత్ ॥ 26**

అదయాలునా - క్రూరాత్ముడగు, అనేన - ఈ పురంజనునిచే, సంజ్ఞప్తాః - సంహరించబడిన, యజ్ఞపశవః - యజ్ఞపశువులు, అస్య - వీని యొక్క, తత్ - ఆ, అమీవమ్ - క్రూరత్వమును, స్మరంతః - గుర్తు చేసుకొనుచున్నవై, తమ్ - వానిని, కుఠారైః - గొడ్డళ్లతో, చిచ్ఛిదుః - ఛేదించినవి.

పురంజనుడు క్రూరాత్ముడై యజ్ఞములో పశువులను సంహరించియుండెను. ఆతని ఆ క్రూరత్వమును గుర్తు చేసుకొని, ఆ పశువులు వానిని గొడ్డళ్లతో నరికినవి.

**అనంతపారే తమసి మగ్నో నష్టస్మృతిస్సమాః ।**
**శాశ్వతీరనుభూయార్తిం ప్రమదాసంగదూషితః ॥ 27**

తామేవ మనసా గృహ్ణాన్ బభూవ ప్రమదోత్తమా ।
అనంతరం విదర్భస్య రాజసింహస్య వేశ్మని ॥ 28

అనంతపారే - అంతము లేని వ్యాప్తి గల, తమసి - అజ్ఞానమునందు, మగ్నః - మునిగియున్నవాడు, ప్రమదాసంగదూషితః - భార్యయందలి ఆసక్తిచే కలుషితమైన మనస్సు గలవాడు, నష్టస్మృతిః - నశించిన స్మృతి గలవాడు అగు పురంజనుడు, శాశ్వతీః - అనంతములగు, సమాః - సంవత్సరములను, ఆర్తిమ్ - దుఃఖమును, అనుభూయ - అనుభవించి, తాం ఏవ - ఆ భార్యను మాత్రమే, మనసా - మనస్సుచే, గృహ్ణాన్ - ధ్యానించుచున్నవాడై, అనంతరమ్ - తరువాత, రాజసింహస్య - రాజులలో శ్రేష్ఠుడగు, విదర్భస్య - విదర్భుని, వేశ్మని - గృహమునందు, ప్రమదా-ఉత్తమా - సుందరస్త్రీలలో ఉత్తమురాలై, బభూవ - జన్మించెను.

పురంజనుడు అంతము లేని వ్యాప్తిగల అజ్ఞానమునందు మునిగియున్నవాడగుటచే, భార్యయందలి ఆసక్తిచే వాని మనస్సు కలుషితమయ్యెను. ఆతనికి స్మృతి కూడ నశించెను. ఆతడు చిరకాలము నిరంతరమగు దుఃఖముననుభవించెను. ఆతడు మనస్సులో భార్యను మాత్రమే ధ్యానించుటచే, ఆ దుఃఖానుభవము పూర్తి అయిన పిదప, రాజులలో ఉత్తముడగు విదర్భదేశాధిపతికి కుమార్తెయై జన్మించెను. ఆమె అతిశయించిన సౌందర్యము గలది.

ఉపయేమే వీర్యపణాం వైదర్భీం మలయధ్వజః ।
యుధి నిర్జిత్య రాజన్యాన్ పాండ్యః పరపురంజయః ॥ 29

పరపురంజయః - శత్రువుల నగరములను జయించువాడు, పాండ్యః - పాండుదేశాధిపతి అగు, మలయధ్వజః - మలయధ్వజుడు, రాజన్యాన్ - రాజులను, యుధి - యుద్ధమునందు, నిర్జిత్య - జయించి, వీర్యపణామ్ - పరాక్రమమే శుల్కముగా గల, వైదర్భీమ్ - విదర్భరాజపుత్రిని, ఉపయేమే - వివాహమాడెను.

పాండుదేశాధిపతియగు మలయధ్వజుడు శత్రువుల నగరములను జయించిన దిట్ట. ఆతడు రాజులను యుద్ధములో జయించి, పరాక్రమమునే శుల్కముగా భావించే విదర్భరాజపుత్రికను వివాహమాడెను.

తస్యాం స జనయాంచక్ర ఆత్మజామసితేక్షణామ్ ।
యవీయసస్సప్త సుతాన్ సప్త ద్రవిడభూభృతః ॥ 30

సః - ఆతడు, తస్యామ్ - ఆమెయందు, అసిత-ఈక్షణామ్ - నల్లని కన్నులు గల, ఆత్మజామ్ - కుమార్తెను, యవీయసః - ఆమెకంటె కనిష్ఠులైనట్టియు, సప్త - ఏడ్గురు, ద్రవిడభూభృతః - ద్రవిడదేశపు రాజులైన, సప్త - ఏడ్గురు, సుతాన్ - కొడుకులను, జనయాంచక్రే - కనెను.

ఆతనికి ఆమెయందు నల్లని కన్నులు గల ఒక కుమార్తె, ఆ పిదప ఏడ్గురు కొడుకులు కలిగిరి. ఆ ఏడ్గురు ద్రవిడదేశమునందు రాజులైరి.

ఏకైకస్యాభవత్తేషాం రాజన్నర్బుదమర్బుదమ్ ।
భోక్ష్యతే యద్వంశధరైర్మహీ మన్వంతరం పరమ్ ॥ 31

రాజన్ - ఓ మహారాజా!, తేషామ్ - వారికి, ఏక-ఏకస్య - ఒక్కొక్కనికి, అర్బుదం అర్బుదమ్ - చాలమంది చొప్పున, అభవత్ - సంతానము కలిగెను, యత్-వంశధరైః - ఎవరి వంశమునందు జన్మించినవారిచే, మహీ - భూమి, మన్వంతరం పరమ్ - మన్వంతర కాలము దాటి కూడ, భోక్ష్యతే - అనుభవించబడ గలదో.

ఓ మహారాజా! వారికి ఒక్కొక్కనికి చాల సంతానము కలిగెను. వారి వంశమునందు జన్మించిన వారు మన్వంతరము పూర్తి అగునంతవరకు, ఆ తరువాత కూడ భూమిని పాలించగలరు.

అగస్త్యః ప్రాగ్దుహితరముపయేమే ధృతవ్రతామ్ ।
యస్యాం దృఢచ్యుతో జాత ఇధ్మవాహాత్మజో మునిః ॥ 32

అగస్త్యః - అగస్త్యుడు, దృఢవ్రతామ్ - దృఢమగు వ్రతనిష్ఠ గల, ప్రాక్ - మొట్టమొదటి, దుహితరమ్ - కుమార్తెను, ఉపయేమే - వివాహ

మాడెను, యస్యామ్ - ఎవతెయందు, ఇధ్మవాహ-ఆత్మజః - ఇధ్మవాహుడు పుత్రుడుగా గల, దృఢచ్యుతః - దృఢచ్యుతుడనే, మునిః - మహర్షి, జాతః - పుట్టెనో.

మలయధ్వజుని పెద్ద కుమార్తె దృఢమగు వ్రతనిష్ఠ గలది. ఆమెను అగస్త్యమహర్షి వివాహమాడెను. వారికి దృఢచ్యుత మహర్షి పుట్టెను. ఇధ్మవాహుడు దృఢచ్యుతుని పుత్రుడు.

విభజ్య తనయేభ్యః క్ష్మాం రాజర్షిర్మలయధ్వజః ।
ఆరిరాధయిషుః కృష్ణం స జగామ కులాచలమ్ ॥ 33

సః - ఆ, రాజర్షిః - రాజర్షియగు, మలయధ్వజః - మలయధ్వజుడు, తనయేభ్యః - పుత్రుల కొరకు, క్ష్మామ్ - భూమిని, విభజ్య - విభాగము చేసి, కృష్ణమ్ - శ్రీకృష్ణుని, ఆరిరాధయిషుః - ఆరాధించే కోరిక గలవాడై, కుల-అచలమ్ - కుల పర్వతమును గురించి, జగామ - వెళ్లెను.

ఆ రాజర్షియగు మలయధ్వజుడు రాజ్యమును కొడుకులకు పంచియిచ్చి, తాను శ్రీకృష్ణుని ఆరాధించే కోరికతో తమ వంశమునకు చెందిన మలయపర్వతమునకు వెళ్లెను.

హిత్వా గృహాన్ సుతాన్ భోగాన్ వైదర్భీ మదిరేక్షణా ।
అన్వధావత పాండ్యేశం జ్యోత్స్నేవ రజనీకరమ్ ॥ 34

మదిర-ఈక్షణా - మత్తెక్కించే కన్నులు గల, వైదర్భీ - విదర్భ రాజపుత్రి, గృహాన్ - ఇంటిని, సుతాన్ - పుత్రులను, భోగాన్ - భోగములను, హిత్వా - విడిచిపెట్టి, జ్యోత్స్నా - వెన్నెల, రజనీకరమ్ - రాత్రికి ప్రభువగు చంద్రుని వలె, పాండ్య-ఈశమ్ - పాండ్యదేశప్రభువగు మలయధ్వజుని, అను-అధావత - అనుసరించి వెళ్లెను.

విదర్భ రాజపుత్రి గొప్ప సుందరి, యువతియే అయిననూ, ఇంటిని పుత్రులను భోగములను విడిచిపెట్టి, వెన్నెల రాత్రికి ప్రభువగు చంద్రుని వెంట ఉండే విధముగా, పాండ్యమహారాజగు మలయధ్వజుని వెంట మలయపర్వతమునకు వెళ్లెను.

తత్ర చంద్రవశా నామ తామ్రపర్ణీ వటోదకా ।
తత్పుణ్యసలిలైర్నిత్యముభయత్రాత్మనో మృజన్ ।। 35

తత్ర - అచట, చంద్రవశా నామ - చంద్రవశ అని ప్రసిద్ధిని గాంచి నది, తామ్రపర్ణీ - తామ్రపర్ణి, వటోదకా - వటోదక, తత్-పుణ్యసలిలైః - వాటి పవిత్రములగు జలములచే, నిత్యమ్ - ప్రతిదినము, ఉభయత్ర - బయట లోపల, ఆత్మనః - తనకు, మృజన్ - క్షాళన చేసుకొనువాడు.

అచట చంద్రవశ, తామ్రపర్ణి, వటోదక అను మూడు నదులు గలవు. మలయధ్వజుడు వాటి పవిత్రములగు జలములలో ప్రతిదినము స్నానమును చేయుచూ, దేహముయొక్క మాలిన్యమును మాత్రమే గాక, మనో మాలిన్యమును కూడ పోగొట్టుకొనుచుండెను.

కందాఽష్టిభిర్మూలఫలైః పుష్పపర్ణైస్తృణోదకైః ।
వర్తమానశ్శనైర్గాత్రకర్శనం తప ఆస్థితః ।। 36

కంద-అష్టిభిః - దుంపలతో గింజలతో, మూలఫలైః - వ్రేళ్లతో పళ్ల తో, పుష్పపర్ణైః - పుష్పములతో ఆకులతో, తృణ-ఉదకైః - గడ్డితో నీటితో, వర్తమానః - దేహయాత్రను సాగించువాడై, శనైః - మెల్లగా, గాత్రకర్శనమ్ - శరీరమును కృశింపజేసే, తపః - తపస్సును, ఆస్థితః - అనుష్ఠించువాడు.

దుంపలు, గింజలు, వ్రేళ్లు, పళ్లు, పుష్పములు, ఆకులను భుజిస్తూ, ఒకప్పుడు నీటిని మాత్రమే త్రాగి శరీరమును నిలబెట్టుకుంటూ, ఆతడు క్రమముగా శరీరమును కృశింపజేసే తపస్సును అనుష్ఠించెను.

శీతోష్ణవాతవర్షాణి క్షుత్పిపాసే ప్రియాప్రియే ।
సుఖదుఃఖ ఇతి ద్వంద్వాన్యజయత్సమదర్శనః ।। 37

సమదర్శనః - సర్వమునందు పరబ్రహ్మను దర్శించే (సమమగు చిత్తము గల) ఆ మలయధ్వజుడు, శీత-ఉష్ణవాతవర్షాణి - చల్లదనము వేడిమి గాలి వర్షములు, క్షుత్-పిపాసే - ఆకలి దప్పికలు, ప్రియ-అప్రియే - ఇష్టానిష్టములు, సుఖదుఃఖే - సుఖదుఃఖములు, ఇతి - అనే, ద్వంద్వాని

- ద్వంద్వము (పరస్పరవిరుద్ధముల జంట) లను, అజయత్ - జయించె ను.

సర్వమునందు ఈశ్వరుని దర్శించే ఆ మలయధ్వజుడు, శీతోష్ణ ములు వాతవర్షములు ఆకలిదప్పికలు ఇష్టానిష్టములు సుఖదుఃఖములు అనే ద్వంద్వములను సమచిత్తముతో జయించెను.

తపసా విద్యయా పక్వకషాయో నియమైర్యమైః ।
యుయుజే బ్రహ్మణ్యాత్మానం విజితాక్షానిలాశయః ॥ 38

తపసా - తపస్సుచే, విద్యయా - ఉపాసనచే, నియమైః - నియ మములచే, యమైః - యమములచే, పక్వకషాయః - పరిపక్వమైన వాస నలు గలవాడు, విజిత-అక్ష-అనిల-ఆశయః - ప్రత్యాహారము ప్రాణాయా మము మనోనిగ్రహము గలవాడు అగు మలయధ్వజుడు, బ్రహ్మణి - పర బ్రహ్మయందు, ఆత్మానమ్ - మనస్సును, యుయుజే - ఐక్యము చేసెను.

మలయధ్వజుడు తపస్సును ఉపాసనను చేసి, యమములను (స త్యము, అహింస, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము), నియమ ములను (శౌచము, తపస్సు, సంతోషము, స్వాధ్యాయము, ఈశ్వరప్రణిధా నము) పాటిస్తూ, తద్ద్వారా వాసనలను నిర్మూలించి, ప్రాణాయామమును, ప్రత్యాహారము (ఇంద్రియనిగ్రహము) ను, ధారణను, ధ్యానమును చేసి, మనస్సును పరబ్రహ్మయందు విలీనము (సమాధి) చేసెను.

ఆస్తే స్థాణురివైకత్ర దివ్యం వర్షశతం స్థిరః ।
వాసుదేవే భగవతి నాన్యద్వేదోద్వహన్ రతిమ్ ॥ 39

ఏకత్ర - ఒకే చోట, దివ్యం వర్షశతమ్ - వంద దివ్యసంవత్సరము లను, స్థాణుః ఇవ - బండరాయి వలె, ఆస్తే - ఉండును, భగవతి వాసుదేవే - వాసుదేవ భగవానునియందు, రతిమ్ - ప్రీతిని, ఉద్వహన్ - చేయుచున్నవాడై, అన్యత్ - ఇతరమును, న వేద - తెలియకుండెను.

ఆతడు ఒకే స్థానమునందు వంద దివ్యసంవత్సరములు బండరా యివలె నుండి తపస్సును చేసెడివాడు. ఆతడు వాసుదేవ భగవానుని యందు ప్రీతిని చేయుచూ, ఇతరమును తెలియకుండెను.

స వ్యాపకతయాత్మానం వ్యతిరిక్తతయాత్మని ।
విద్వాన్ స్వప్న ఇవామర్శసాక్షిణం విరరామ హ ।। 40

సః - ఆతడు, ఆత్మని - దేహేంద్రియమనస్సంఘాతమునందు, ఆమర్శసాక్షిణమ్ - అంతఃకరణమునకు సాక్షియగు, ఆత్మానమ్ - ఆత్మను, స్వప్నే ఇవ - స్వప్నమునందు వలె, వ్యాపకతయా - సర్వమును వ్యాపించియున్నదానినిగా, వ్యతిరిక్తతయా - సంఘాతముకంటె విలక్షణమైనదానినిగా, విద్వాన్ - తెలుసుకున్నవాడై, విరరామ హ - సర్వమునుండి విరమించెను.

ఆత్మ దేహేంద్రియమనస్సంఘాతమునంతను వ్యాపించియున్ననూ, ఈ సంఘాతముకంటె విలక్షణముగనే యున్నది. స్వప్నములో వలె జ్ఞాత, జ్ఞేయము రెండు ఆత్మ చైతన్యమునందు మాత్రమే ప్రకాశించుచున్నవి. ఆత్మను ఆ విధముగా అంతఃకరణవృత్తులకు సాక్షిగా తెలుసుకొని, ఆతడు సకలవ్యవహారములనుండియు విరమించెను.

సాక్షాద్భగవతోక్తేన గురుణా హరిణా నృప ।
విశుద్ధజ్ఞానదీపేన స్ఫురతా విశ్వతోముఖమ్ ।। 41

పరే బ్రహ్మణి చాత్మానం పరం బ్రహ్మ తథాఽత్మని ।
వీక్షమాణో విహాయేక్షామస్మాదుపరరామ హ ।। 42

నృప - ఓ మహారాజా!, గురుణా - పరమగురువైన, భగవతా హరిణా - శ్రీహరి భగవానునిచే, సాక్షాత్ - సాక్షాత్తుగా, ఉక్తేన - చెప్పబడినట్టియు, విశ్వతః-ముఖమ్ - అన్ని విధములుగా, స్ఫురతా - ప్రకాశించుచున్న, విశుద్ధజ్ఞానదీపేన - విశుద్ధమగు జ్ఞానము అనే దీపముచే, పరే బ్రహ్మణి - పరబ్రహ్మయందు, ఆత్మానమ్ - ఆత్మను, తథా - అదే విధముగా, ఆత్మని - ఆత్మయందు, పరం బ్రహ్మ చ - పరబ్రహ్మను కూడ, వీక్ష

మాణః - దర్శించుచున్నవాడై, ఈక్షామ్ - మనస్సులోని ఆలోచనను, విహాయ - విడిచిపెట్టి, అస్మాత్ - ఈ జగత్తునుండి, ఉపరరామ - ఉపరమించెను.

ఓ మహారాజా! సాక్షాత్తు పరమగురువగు శ్రీహరి భగవానుడు ఆతని అంతఃకరణములో విశుద్ధమగు ఆత్మజ్ఞానము అనే దీపమును ప్రకాశింపజేసెను. ఆ జ్ఞానము ఆతని హృదయమునందు సర్వతోముఖముగా ప్రకాశించెను. దాని ప్రభావముచే ఆతడు పరబ్రహ్మ (దేశకాలవస్తుపరిచ్ఛేదములకు అధిష్ఠాత) యందు ఆత్మను, ఆత్మ (దేశకాలవస్తుపరిచ్ఛేదములకు ద్రష్ట) యందు పరబ్రహ్మను దర్శించెను. దానితో ఆతని మనోవృత్తులు కూడ విలీనమయ్యెను. ఆతడు దేహమును విడిచిపెట్టెను.

పతిం పరమధర్మజ్ఞం వైదర్భీ మలయధ్వజమ్ ।
ప్రేమ్ణా పర్యచరద్ధిత్వా భోగాన్ సా పతిదేవతా ॥ 43

పతిదేవతా - భర్తయే దైవముగా గల, సా - ఆ, వైదర్భీ - విదర్భ రాజకుమారి, భోగాన్ - భోగములను, హిత్వా - విడిచిపెట్టి, పతిమ్ - భర్తయైనట్టియు, పరమధర్మజ్ఞమ్ - సర్వోత్తమమగు ధర్మమును తెలుసుకున్న, మలయధ్వజమ్ - మలయధ్వజుని, ప్రేమ్ణా - ప్రేమతో, పరి-అచరత్ - సేవించెను.

విదర్భ రాజకుమారి పతియే దైవముగా గల సాధ్వి. ఆమె భోగములను విడనాడి, పరమధర్మాత్ముడైన తన భర్త మలయధ్వజుని ప్రేమతో సేవించెను.

చీరవాసా వ్రతక్షామా వేణీభూతశిరోరుహా ।
బభావుపపతిం శాంతా శిఖా శాంతమివానలమ్ ॥ 44

చీరవాసా - నారబట్టలను దాల్చినది, వ్రతక్షామా - నియమనిష్ఠలచే కృశించినది, వేణీభూతశిరోరుహా - జడలు గట్టిన జుట్టు గలది అగు వైదర్భి, ఉప పతిమ్ - భర్త సమీపమునందు, శాంతమ్ - చల్లారిన, అనలం

ఉప - అగ్నియందు, శాంతా - పొగ లేని, శిఖా ఇవ - జ్వాల వలె, బభౌ - ప్రకాశించెను.

వైదర్భి నారబట్టలను దాల్చి నియమనిష్ఠలను పాటించుటచే చిక్కి పోయెను. ఆమె జుట్టు జడలు కట్టెను. భర్త సమీపమునందు ఆమె చల్లారు చున్న అగ్నియందలి పొగ లేని జ్వాల వలె ప్రకాశించెను.

అజానతీ ప్రియతమం యదోపరతమంగనా ।
సుస్థిరాసనమాసాద్య యథాపూర్వముపాచరత్ ।। 45

యదా - ఏ కాలమునందైతే, అంగనా - ఆ వైదర్భి, సుస్థిర-ఆస నమ్ - మిక్కిలి స్థిరమగు ఆసనము గల, ప్రియతమమ్ - మిక్కిలి ప్రియు డగు భర్తను, ఉపరతమ్ - ప్రాణములను విడచినవానినిగా, అజానతీ - తెలి యకున్నదో అప్పుడు, యథాపూర్వమ్ - పూర్వమునందు వలెనే, ఆసాద్య - సమీపించి, ఉపాచరత్ - సేవించెను.

మలయధ్వజుడు మిక్కిలి స్థిరమగు ఆసనమునందుండియే మర ణించెను. ఆ కారణముచే తన ప్రియతముడగు భర్త మరణించినాడనే సంగతి ఆ వైదర్భికి తెలియలేదు. ఆమె పూర్వమునందు వలెనే ఆయన వద్దకు వెళ్లి సేవలను చేసెను.

యదా నోపాలభేతాంఘ్రావూష్మాణం పత్యురర్చతీ ।
ఆసీత్సంవిగ్నహృదయా యూథభ్రష్టా మృగీ యథా ।। 46

యదా - ఏ కాలమునందైతే, పత్యుః - భర్తయొక్క, అంఘ్రౌ - పాదమునందు, అర్చతీ - పూజించుచున్న వైదర్భి, ఊష్మాణమ్ - వేడిని, న ఉపాలభేత - కనుగొనలేదో అప్పుడు, యూథభ్రష్టా - గుంపునుండి విడి పోయిన, మృగీ యథా - లేడివలె, సంవిగ్నహృదయా - ఆందోళన చెందిన హృదయము గలది, ఆసీత్ - ఆయెను.

ఆమెకు భర్త పాదములను పూజించుచుండగా, వేడి తగలలేదు. అప్పుడామె, గుంపునుండి విడిపోయిన లేడి వలె, హృదయములో చాల ఆందోళనను చెందెను.

ఆత్మానం శోచతీ దీనమబంధుం విక్లబాశ్రుభిః ।
స్తనావాసిచ్య విపినే సుస్వరం ప్రరురోద సా ॥ 47

దీనమ్ - దీనురాలైనట్టియు, అబంధుమ్ - తోడు లేని, ఆత్మానమ్ - తనను గురించి, శోచతీ - దుఃఖించుచున్న, సా - ఆ వైదర్భి, విక్లబ-అశ్రుభిః - దుఃఖపు కన్నీళ్లతో, స్తనౌ - స్తనములను, ఆసిచ్య - అంతటా తడిపి, విపినే - అడవియందు, సుస్వరమ్ - మధురమగు స్వరము కలుగు నట్లుగా, ప్రరురోద - గట్టిగా రోదించెను.

తోడు ఎవ్వరైననూ లేని తన దైన్యమునకు ఆమె చాల వగచెను. దుఃఖము వలన ప్రవహించిన కన్నీటితో ఆమె స్తనములు అంతటా తడిసిపోయెను. ఆమె ఆ అడవిలో మధురమగు స్వరముతో గట్టిగా రోదించెను.

ఉత్తిష్ఠోత్తిష్ఠ రాజర్ష ఇమాముదధిమేఖలామ్ ।
దస్యుభ్యః క్షత్త్రబంధుభ్యో బిభ్యతీం పాతుమర్హసి ॥ 48

రాజర్షే - ఓ రాజర్షీ!, ఉత్-తిష్ఠ - లెమ్ము, ఉత్తిష్ఠ - లెమ్ము, ఉదధి మేఖలామ్ - సముద్రమే మొలనూలుగా కలిగినట్టియు, దస్యుభ్యః - దోపిడీగాండ్రనుండి, క్షత్త్రబంధుభ్యః - అయోగ్యులగు క్షత్త్రియులనుండి, బిభ్యతీమ్ - భయపడుచున్న, ఇమామ్ - ఈ భూదేవిని, పాతుమ్ - రక్షించుటకు, అర్హసి - తగుదువు.

ఓ రాజర్షీ! లెమ్ము, లెమ్ము. సముద్రమే మొలనూలుగా గల ఈ భూదేవికి దోపిడీగాండ్ర వలన, అయోగ్యులగు క్షత్త్రియుల వలన భయము పెచ్చు మీరినది. ఈ భూమిని నీవే రక్షించవలసి యున్నది.

ఏవం విలపతీ బాలా విపినేఽనుగతా పతిమ్ ।
పతితా పాదయోర్భర్తూ రుదంత్యశ్రూణ్యవర్తయత్ ॥ 49

పతిమ్ - భర్తను, విపినే - అడవియందు, అనుగతా - అనుసరించి వెళ్లిన, బాలా - ఆ సుందరి, ఏవమ్ - ఈ విధముగా, విలపతీ - దుఃఖించుచున్నదై, భర్తుః - భర్తయొక్క, పాదయోః - పాదములయందు, పతితా

- పడినదై, రుదంతీ - ఏడ్చుచున్నదై, అశ్రూణి - కన్నీళ్లను, అవర్తయత్ - విడిచిపెట్టెను.

భర్తతో బాటుగా అడవికి వెళ్లిన ఆ సుందరి ఈ విధముగా దుఃఖిస్తూ, భర్త పాదములపై పడి ఏడుస్తూ, కన్నీటిని ప్రవహింప జేసెను.

చితిం దారుమయీం చిత్వా తస్యాం పత్యుః కలేవరమ్ ।
ఆదీప్య చానుమరణే విలపంతీ మనో దధే ।। 50

దారుమయీమ్ - కట్టెలతో నిండిన, చితిమ్ - చితిని, చిత్వా - పేర్చి, తస్యామ్ - దానియందు, పత్యుః - భర్తయొక్క, కలేవరమ్ - శరీరమును, ఆదీప్య - మంటబెట్టి, విలపంతీ - ఏడ్చుచున్నదై, అనుమరణే - భర్తతో బాటుగా మరణించుటపై, మనః - మనస్సును, దధే - నిలిపెను.

ఆమె కట్టెలతో చితిని పేర్చి, భర్త దేహమును దానిపై తగులబెట్టెను. ఆమె అప్పుడు ఏడుస్తూ, తాను కూడ భర్తతో బాటుగా మరణించుటకు నిశ్చయించుకొనెను.

తత్ర పూర్వతరః కశ్చిత్సఖా బ్రాహ్మణ ఆత్మవాన్ ।
సాంత్వయన్ వల్గునా సామ్నా తామాహ రుదతీం ప్రభో ।।51

ప్రభో - ఓ మహారాజా!, తత్ర - ఆ సమయము (దేశము) నందు, కశ్చిత్ - ఒకానొక, పూర్వతరః - మిక్కిలి పూర్వమునందలి, సఖా - మిత్రుడగు, ఆత్మవాన్ - ఆత్మజ్ఞానియగు, బ్రాహ్మణః - బ్రాహ్మణుడు, రుదతీమ్ - ఏడ్చుచున్న, తామ్ - ఆమెను, వల్గునా - మనోహరమగు, సామ్నా - ప్రియమగు వాక్యముతో, సాంత్వయన్ - ఓదార్చుచున్నవాడై, ఆహ - పలికెను.

ఓ మహారాజా! ఆమెకు చాల పూర్వమునందలి మిత్రుడొకడు ఆ సమయములో అచటికి వచ్చెను. ఆయన ఆత్మజ్ఞానియగు బ్రాహ్మణుడు. ఆయన ఏడ్చుచున్న ఆమెను చూచి, మనోహరమగు ప్రియవాక్యములతో ఓదారుస్తూ, ఇట్లు పలికెను.

బ్రాహ్మణ ఉవాచ ।
కా త్వం కస్యాసి కో వాఽయం శయానో యస్య శోచసి ।
జానాసి కిం సఖాయం మాం యేనాగ్రే విచచర్థ హ ॥ 52

త్వమ్ - నీవు, కా - ఎవతెవు?, కస్య అసి - ఎవరి దానవు?, శయానః - పరుండియున్న, అయమ్ - ఈతడు, కః వా - ఎవడు?, యస్య - ఎవనిని గురించి, శోచసి - దుఃఖించుచున్నావో, సఖాయమ్ - మిత్రుడన గు, మామ్ - నన్ను, జానాసి కిమ్ - గుర్తు పట్టినావా?, యేన - ఏ నాతో, అగ్రే - పూర్వమునందు, విచచర్థ హ - కలిసి తిరిగితివో.

నీవెవరివి? ఎవరి దానవు? నీవీ వ్యక్తి కొరకు దుఃఖించుచున్నావు. పరుండియున్న ఈతడు ఎవడు? నేను పూర్వమునందు నీతో కలిసి తిరిగిన మిత్రుడను. నన్ను గుర్తు పట్టినావా?

అపి స్మరసి చాత్మానమవిజ్ఞాతసఖం సఖే ।
హిత్వా మాం పదమన్విచ్ఛన్ భౌమభోగరతో గతః ॥ 53

సఖే - ఓ మిత్రమా!, ఆత్మానమ్ - నిన్ను, అవిజ్ఞాతసఖమ్ - అవి జ్ఞాతుడనే మిత్రుడు గలవానినిగా, అపి స్మరసి - గుర్తుకు వచ్చినదా?, భౌమభోగరతః - భూలోకమునకు చెందిన భోగములయందు ప్రీతిగల నీవు, మామ్ - నన్ను, హిత్వా - విడిచిపెట్టి, పదమ్ - భోగస్థానమును, అన్విచ్ఛన్ - వెదుకుచున్నవాడవై, గతః - వెళ్లినవాడవు.

ఓ మిత్రమా! నీకు అవిజ్ఞాతుడనే మిత్రుడు ఉండెడివాడు. ఆ సంగతి గుర్తుకు వచ్చినదా? ఆ మిత్రుడను నేనే. నీవు భూలోకమునందలి భోగములయందు ప్రీతి గలవాడవై, నన్ను విడిచిపెట్టి ఆ భోగములు లభించే స్థానమును వెదుక్కుంటూ వెళ్లియుంటివి.

హంసావహం చ త్వం చార్య సఖాయౌ మానసాయనౌ ।
అభూతామంతరా వౌకస్సహస్రపరివత్సరాన్ ॥ 54

ఆర్య - ఓ శ్రేష్ఠపురుషుడా!, అహం చ - నేను, త్వం చ - నీవు, మానస-అయనౌ - మానస సరోవరము నివాసస్థానముగా గల, హంసౌ -

హంసలము, సహస్రపరివత్సరాన్ - వేయి సంవత్సరముల కాలమును, ఓకః అంతరా వా - నివాసస్థానము లేకుండగనే, అభూతామ్ - ఉంటిమి.

ఓ శ్రేష్ఠ పురుషుడా! మిత్రులమగు మనమిద్దరము మానససరోవరములో నివసించెడివారము. మనము వేయి సంవత్సరముల కాలములో ఏ నాడైననూ నివాసస్థానము లేకుండగనే గడిపితిమి.

స త్వం విహాయ మాం బంధో గతో గ్రామ్యమతిర్మహీమ్ ।
విచరన్ పదమద్రాక్షీః కయాచిన్నిర్మితం స్త్రియా ॥ 55

బంధో - ఓ బంధుడా!, గ్రామ్యమతిః - ఇంద్రియభోగముల యందు మనస్సు గల, సః - అట్టి, త్వమ్ - నీవు, మామ్ - నన్ను, విహాయ - విడిచిపెట్టి, గతః - వెళ్లినాడవు, మహీమ్ - భూమండలమును, విచరన్ - సంచరించుచున్నవాడవై, కయాచిత్ - ఒకానొక, స్త్రియా - యువతిచే, నిర్మితమ్ - నిర్మించబడిన, పదమ్ - నివాసస్థానమును, అద్రాక్షీః - చూచితివి.

ఓ బంధుడా! ఇంద్రియభోగములయందు ప్రీతి గల అట్టి నీవు నన్ను విడిచిపెట్టి వెళ్లితివి. నీవు భూమండలములో సంచరిస్తూ, ఒకానొక స్త్రీచే నిర్మించబడిన నివాసస్థానమును కనుగొంటివి.

పంచారామం నవద్వారమేకపాలం త్రికోష్ఠకమ్ ।
షట్కులం పంచవిపణం పంచప్రకృతి స్త్రీధవమ్ ॥ 56

పంచ-ఆరామమ్ - అయిదు ఉద్యానవనములు గలిగినట్టియు, నవద్వారమ్ - తొమ్మిది ద్వారములు కలిగినట్టియు, ఏకపాలమ్ - ఒక కాపలాదారు కలిగినట్టియు, త్రికోష్ఠకమ్ - మూడు ప్రాకారములు కలిగినట్టియు, షట్-కులమ్ - ఆర్గురు వ్యాపారస్థులు కలిగినట్టియు, పంచవిపణమ్ - అయిదు బజారులు కలిగినట్టియు, పంచప్రకృతి - అయిదు ద్రవ్యములతో నిర్మించబడిన, స్త్రీధవమ్ - స్త్రీ ప్రభ్వీగా గల (స్థానమును చూచితివి).

అయిదు ఉద్యానవనములు, తొమ్మిది ద్వారములు, మూడు ప్రాకారములు, అయిదు బజారులు గల ఆ నివాసస్థానమునందు ఒక కాప

లాదారు, ఆర్గురు వ్యాపారస్థులు ఉండెడివారు. అయిదు ద్రవ్యములతో నిర్మించబడిన ఆ స్థానమునకు ఒక యువతి ప్రభ్విగా ఉండెడిది.

పంచేంద్రియార్థా ఆరామా ద్వారః ప్రాణా నవ ప్రభో ।
తేజోఽబన్నాని కోష్ఠాని కులమింద్రియసంగ్రహః ॥ 57

ప్రభో - ఓ ప్రభూ!, పంచ - అయిదు, ఇంద్రియ-అర్థాః - ఇంద్రియగోచరములగు విషయములు, ఆరామాః - ఉద్యానములు, నవ - తొమ్మిది, ప్రాణాః - ఇంద్రియగోళకములు, ద్వారః - ద్వారములు, తేజః -అప్-అన్నాని - అగ్ని నీరు పృథివి అనునవి, కోష్ఠాని - ప్రాకారములు, ఇంద్రియసంగ్రహః - ఇంద్రియముల సమూహమే, కులమ్ - ఆర్గురు వ్యాపారస్థుల సమూహము.

ఓ పురనాయకా! దేహము అనే జీవుని నివాసస్థానమునకు శబ్ద రూపరసస్పర్శగంధములనే ఇంద్రియగోచరములగు అయిదు విషయములే ఉద్యానములుగా చిత్రించబడినవి. తొమ్మిది ఇంద్రియగోళకములే ద్వారములు. అగ్ని, నీరు, పృథివి అనునవి ప్రాకారములు. కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మము, మనస్సు అనే ఆరు ఇంద్రియములు వివిధవిషయములను సంగ్రహించే వ్యాపారస్థులుగా వర్ణించబడినారు.

విపణస్తు క్రియాశక్తిర్భూతప్రకృతిరవ్యయా ।
శక్త్యధీశః పుమాంస్త్వత్ర ప్రవిష్టో నావబుధ్యతే ॥ 58

క్రియాశక్తిః తు - క్రియలను చేసే శక్తిగల కర్మేంద్రియవర్గమే, విపణః - బజారు, భూతప్రకృతిః - పంచభూతములనే ఉపాదానము, అవ్యయా - ఖర్చు అయ్యేది కాదు, శక్తి-అధి-ఈశః - మాయాశక్తికి అధీశ్వరుడు, పుమాన్ తు - చేతనపురుషుడు అగు పరమాత్మయైతే, అత్ర - ఈ దేహమునందు, ప్రవిష్టః - ప్రవేశించినవాడై, న అవబుధ్యతే - తెలియకున్నాడు.

క్రియలను చేసే అయిదు కర్మేంద్రియములే బజారులు. ఈ పురమును కట్టుటకు పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము అనే పంచ

భూతములే ద్రవ్యములుగా వినియోగించబడినవి. ఈ ద్రవ్యములు ఖర్చు అయ్యేవి కావు. మాయాశక్తికి అధీశ్వరుడు, పూర్ణచైతన్యస్వరూపుడు అగు పరమాత్మ ఈ పురములో ప్రవేశించి తనను తాను మరచిపోయినాడు.

తస్మింస్త్వం రామయా స్పృష్టో రమమాణోఽశ్రుతస్మృతిః ।
తత్సంగాదీదృశీం ప్రాప్తో దశాం పాపీయసీం ప్రభో ॥ 59

ప్రభో - ఓ పురనాయకా!, తస్మిన్ - ఆ నగరమునందు, త్వమ్ - నీవు, రామయా - బుద్ధి అనే యువతిచే, స్పృష్టః - పరాజితుడవై, రమమాణః - రమించుచున్నవాడవై, అశ్రుతస్మృతిః - ఆత్మజ్ఞానమునందు (ఈశ్వరునియందు) గుర్తు లేనివాడవై, తత్-సంగాత్ - ఆ బుద్ధియొక్క సంగము వలన, ఈదృశీమ్ - ఇట్టి, పాపీయసీమ్ - దుఃఖముతో నిండియున్న, దశామ్ - అవస్థను, ప్రాప్తః - పొందినవాడవు.

ఓ పురనాయకా! ఆ పురములో నీవు బుద్ధి అనే యువతితో తాదాత్మ్యమును చెందితివి. నీవు ఆమె మోహములో పడి రమిస్తూ, ఈశ్వరుని (ఆత్మస్వరూపమును) విస్మరించితివి. ఆ బుద్ధితోడి తాదాత్మ్యము వలననే నీకు దుఃఖపూర్ణమగు ఇట్టి దుర్దశ సంప్రాప్తమైనది.

న త్వం విదర్భదుహితా నాయం వీరస్సుహృత్తవ ।
న పతిస్త్వం పురంజన్యా రుద్ధో నవముఖే యయా ॥ 60

త్వమ్ - నీవు, విదర్భదుహితా - విదర్భరాజపుత్రికవు, న - కావు, అయమ్ - ఈ, వీరః - వీరుడగు మలయధ్వజుడు, తవ - నీ, సుహృత్ - భర్త, న - కాదు, త్వమ్ - నీవు, పురంజన్యాః - పురంజనియొక్క, పతిః - భర్తవు, న - కావు, యయా - ఏ పురంజనిచే, నవముఖే - తొమ్మిది ద్వారములు గల పురమునందు, రుద్ధః - కట్టివేయబడితివో.

నీవు విదర్భరాజపుత్రికవు కావు. వీరుడగు ఈ మలయధ్వజుడు నీకు భర్త కాదు. పూర్వజన్మలో నిన్ను పురంజని తొమ్మిది ద్వారములు గల పురము (దేహము) లో బంధించినది. ఆ పురంజనికి నీవు భర్తవు కావు.

**మాయా హ్యేషా మయాసృష్టా యత్పుమాంసం స్త్రియం సతీమ్।**
**మన్యసే నోభయం యద్వై హంసౌ పశ్యావయోర్గతిమ్ ॥ 61**

ఏషా - ఈ, మాయా - మాయ, మయా - నాచే, హి - నిశ్చయముగా, సృష్టా - సృష్టించబడినది, యత్ - దేనివలన, పుమాంసమ్ - పురుషునిగను, సతీమ్ - పతివ్రతయగు, స్త్రియమ్ - స్త్రీనిగను, మన్యసే - తలంచుచున్నావో, ఉభయమ్ - ఆ రెండు, న - కావు, యత్ - ఏలయనగా, హంసౌ - హంసలము, వై - నిశ్చయము, ఆవయోః - మన యిద్దరి, గతిమ్ - స్వరూపమును, పశ్య - చూడుము.

ఈ మాయను నేనే సృష్టించితివి. దానివలననే, నీవు పూర్వజన్మలో పురంజనుడనే పురుషుడనని తలపోసితివి. ఈ జన్మలో సాధ్వియగు స్త్రీని అని తలపోయుచుంటివి. కాని, ఈ రెండు నీవు కాదు. మనమిద్దరము హంసలము. నీవు మన యిద్దరి స్వరూపమును తెలుసుకొనుము.

**అహం భవాన్న చాన్యస్త్వం త్వమేవాహం విచక్ష్వ భోః ।**
**న నౌ పశ్యంతి కవయశ్ఛిద్రం జాతు మనాగపి ॥ 62**

అహమ్ - నేను, భవాన్ - నీవే, త్వమ్ - నీవు, అన్యః - మరియొకడివి, న - కావు, భోః - ఓయీ!, త్వమ్ - నీవు, అహం ఏవ - నేనే, విచక్ష్వ - తెలియుము, కవయః - జ్ఞానులు, నౌ - మన యిద్దరిలో, ఛిద్రమ్ - తేడాను, మనాక్ అపి - లేశమైననూ, జాతు - ఏనాడైననూ, న పశ్యంతి - చూడరు.

ఓయీ! నేను నీవే. నీవు నాకంటె భిన్నముగా లేవు. నీవు నేనే. ఈ సత్యమును తెలుసుకొనుము. జ్ఞానుల దర్శనములో మన యిద్దరిలో తేడా లేశమైననూ ఏనాడైననూ లేదు.

**యథా పురుష ఆత్మానమేకమాదర్శచక్షుషోః ।**
**ద్విధాభూతమవేక్షేత తథైవాంతరమావయోః ॥ 63**

యథా - ఏ విధముగానైతే, పురుషః - పురుషుడు, ఏకమ్ - ఒక్కడే అయిన, ఆత్మానమ్ - తనను, ఆదర్శచక్షుషోః - అద్దము కన్నుల

యందు, ద్విధాభూతమ్ - రెండు అయినవానినిగా, అవేక్షేత - చూచునో, తథా ఏవ - ఆ విధముగనే, ఆవయోః - మన యిద్దరికి, అంతరమ్ - తేడా.

పురుషునకు తన రూపము అద్దములో ఒక రకముగాను, ఇతరవ్యక్తియొక్క కంటిలో మరియొకవిధముగను కనబడును. అదే విధముగా ఒకే పరబ్రహ్మ సమష్టి ఉపాధిలో ఈశ్వరునిగను, వ్యష్టి ఉపాధిలో జీవునిగను కనబడుచున్నది. ఈ విధముగా, మన యిద్దరికి వాస్తవములో లేని భేదము మాయచే కానవచ్చుచున్నది.

ఏవం స మానసో హంసో హంసేన ప్రతిబోధితః ।
స్వస్థస్తద్వ్యభిచారేణ నష్టామాప పునస్స్మృతిమ్ ॥ 64

సః - ఆ, మానసః - మానస సరోవరమునకు చెందిన, హంసః - హంస, హంసేన - హంసచే, ఏవమ్ - ఈ విధముగా, ప్రతిబోధితః - మేలుకొల్పబడినదై, స్వస్థః - తన స్వరూపమునందున్నదై, తత్-వ్యభిచారేణ - ఆ మిత్రునితోడి వియోగముచే, నష్టామ్ - తొలగిపోయిన, స్మృతిమ్ - స్మరణమును, పునః - మరల, ఆప - పొందెను.

ఈ విధముగా మానససరోవరనివాసియగు ఆ హంస (జీవుడు) ను మిత్రుడగు హంస (ఈశ్వరుడు) మేల్కొల్పగా, అది తన స్వరూపమును తెలుసుకొని ఆనందించెను. ఆ మిత్రుని వియోగము చేతనే దానికి స్వరూపజ్ఞానము మరుపునకు వచ్చెను. ఇపుడు అది మరల తన స్వరూపమును తెలుసుకొనగలిగెను.

బర్హిష్మన్నేతదధ్యాత్మం పారోక్ష్యేణ ప్రదర్శితమ్ ।
యత్పరోక్షప్రియో దేవో భగవాన్ విశ్వభావనః ॥ 65

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే చతుర్థస్కంధే పురంజనోపాఖ్యానే అవిజ్ఞాత వైదర్భి సంవాదో నామ అష్టావింశోఽధ్యాయః ॥

బర్హిష్మన్ - ఓ ప్రాచీనబర్హిష మహారాజా!, ఏతత్ - ఈ, అధ్యాత్మమ్ - ఆత్మతత్త్వము, పారోక్ష్యేణ - దాచి పెట్టిన విధముగా, ప్రదర్శితమ్ - ప్రదర్శించబడినది, యత్ - ఏలయనగా, విశ్వభావనః - జగత్పాల

కుడగు, భగవాన్ - శ్రీహరి భగవానుడు, పరోక్షప్రియః - దాచిపెట్టి చెప్పుటయందు ప్రీతి గలవాడు.

ఓ ప్రాచీనబర్హిష మహారాజా! ఈ ఆత్మతత్త్వమును నేను కథారూపముగా దాచిపెట్టి చెప్పితిని. ఏలయనగా, జగత్పాలకుడగు శ్రీహరి భగవానునకు ఇట్టి పరోక్షకథమునందు ప్రీతి మెండు.

శ్రీమద్భాగవత మహాపురాణములోని నాల్గవ స్కంధమునందు
పురంజనోపాఖ్యానములో అవిజ్ఞాత వైదర్భీ సంవాదమనే
ఇరువది ఎనిమిదవ అధ్యాయము ముగిసినది (**28**).

*****

# అథ ఏకోనత్రింశోऽధ్యాయః

## పురంజనోపాఖ్యానము - ప్రాచీనబర్హిష నారద సంవాదము

ప్రాచీనబర్హిరువాచ ।
భగవంస్తే వచోऽస్మాభిర్న సమ్యగవగమ్యతే ।
కవయస్తద్విజానంతి న వయం కర్మమోహితాః ।। 1

భగవన్ - ఓ పూజ్యా!, తే - నీ, వచః - వచనము, అస్మాభిః - మాచే, సమ్యక్ - బాగుగా, న అవగమ్యతే - తెలియబడుట లేదు, తత్ - దానిని, కవయః - జ్ఞానులు, విజానంతి - తెలియుచున్నారు, కర్మమోహితాః - కర్మలచే మోహమును పొందియున్న, వయమ్ - మేము, న - కాదు.

ప్రాచీనబర్హిష మహారాజు ఇట్లు పలికెను --- ఓ పూజ్యా! నీ వచనము నాకు బాగుగా తెలియలేదు. నీవు చెప్పుదానిని జ్ఞానులు తెలియగలరు. కర్మల మోహములో పడియున్న నావంటి వారలకు నీ వచనములు తెలియ రావు.

నారద ఉవాచ ।
పురుషం పురంజనం విద్యాద్యద్వ్యనక్త్యాత్మనః పురమ్ ।
ఏకద్విత్రిచతుష్పాదం బహుపాదమపాదకమ్ ।। 2

పురంజనమ్ - పురంజనుని, పురుషమ్ - జీవునిగా, విద్యాత్ - తెలియవలెను, యత్ - ఏలయనగా, ఆత్మనః - తనకు, ఏకద్విత్రిచతుష్పాదమ్ - ఒకటి రెండు మూడు లేక నాలుగు పాదములు గల, బహుపాదమ్

- అనేకపాదములు గల, అపాదకమ్ - పాదములు లేని, పురమ్ - దేహ మును, వ్యనక్తి - ప్రకటించుకొనుచున్నాడు.

పురంజనుడే జీవుడు. ఈ జీవుడు తన కొరకై ప్రారబ్ధకర్మానుసార ముగా ఒక దేహము అనే పురమును తయారు చేసుకొనును. ఆ దేహము నకు ఒకటి, రెండు, మూడు, నాలుగు లేక అనేకములగు పాదములు ఉండ వచ్చును. లేదా, పాదములు అసలే లేకపోవచ్చును.

యోఽవిజ్ఞాతాహ్వతస్తస్య పురుషస్య సఖేశ్వరః ।
యన్న విజ్ఞాయతే పుంభిర్నామభిర్వా క్రియాగుణైః ॥ 3

అవిజ్ఞాత-ఆహ్వతః - అవిజ్ఞాతుడు అని పిలువబడినవాడు, యః - ఎవడు గలడో ఆతడు, తస్య - ఆ, పురుషస్య - జీవుని, సఖా - మిత్రుడ గు, ఈశ్వరః - ఈశ్వరుడు, యత్ - ఏలయనగా, పుంభిః - మానవులచే, నామభిః - పేర్లచే గాని, క్రియాగుణైః వా - చేష్టలచే గాని గుణములచే గాని, న విజ్ఞాయతే - తెలియబడుట లేదు.

ఆ జీవునకు ఈశ్వరుడే మిత్రుడు. జీవులు ఆ మిత్రుని పేర్లను గాని, చేష్టలను గాని, గుణములను గాని తెలియలేకున్నారు. కావుననే, ఆ మిత్రునకు అవిజ్ఞాతుడు అని పేరు వచ్చినది.

యదా జిఘృక్షుః పురుషః కార్త్స్న్యేన ప్రకృతేర్గుణాన్ ।
నవద్వారం ద్విహస్తాంఘ్రిం తత్రామనుత సాధ్వితి ॥ 4

యదా - ఏ కాలమునందైతే, పురుషః - జీవుడు, ప్రకృతేః - ప్రకృ తియొక్క, గుణాన్ - గుణములను, కార్త్స్న్యేన - పూర్తిగా, జిఘృక్షుః - స్వీకరించ గోరువాడో అప్పుడు, తత్ర - వాటిలో, నవద్వారమ్ - తొమ్మిది ద్వారములు కలిగినట్టియు, ద్విహస్త-అంఘ్రిమ్ - రెండు చేతులు కాళ్లు కలిగిన దేహమును, సాధు - మంచిది, ఇతి - అని, అమనుత - తలచెను.

జీవుడు ప్రకృతియొక్క సత్త్వరజస్తమోగుణకార్యములగు సుఖదుః ఖమోహములను పూర్తిగా అనుభవించగోరెను. అప్పుడు ఆతడు పైన

చెప్పిన దేహములలో రెండు కాళ్లు, రెండు చేతులు, తొమ్మిది ద్వారములు గల మనుష్యదేహమును, ఇది బాగున్నది యని తలచెను.

బుద్ధిం తు ప్రమదాం విద్యాన్మమాహమితి యత్కృతమ్ ।
యామధిష్ఠాయ దేహేఽస్మిన్ పుమాన్ భుంక్తేఽక్షభిర్గుణాన్ ॥5

ప్రమదాం తు - సుందరియగు పురంజనినైతే, బుద్ధిమ్ - బుద్ధినిగా, విద్యాత్ - తెలియవలెను, మమ - నాది, అహమ్ - నేను, ఇతి - అనేది, యత్-కృతమ్ - ఏ బుద్ధిచే చేయబడినదో, పుమాన్ - జీవుడు, యామ్ - ఏ బుద్ధిని, అధిష్ఠాయ - అధిష్ఠానముగా చేసుకొని, అస్మిన్ - ఈ, దేహే - దేహమునందు, అక్షభిః - ఇంద్రియములతో, గుణాన్ - గుణకార్యములను (భోగములను), భుంక్తే - భోగించుచున్నాడో.

సుందరయువతియగు పురంజని బుద్ధి అని తెలియవలెను. జీవుడు ఆ బుద్ధి వలననే నేను, నాది అనే అభిమానమును కలిగియున్నాడు. ఆ బుద్ధితోడి తాదాత్మ్యము వలననే జీవుడు ఈ దేహములో ఇంద్రియముల ద్వారా సత్త్వరజస్తమోగుణముల కార్యములగు సుఖదుఃఖమోహములను (భోగములను) అనుభవించుచున్నాడు.

సఖాయ ఇంద్రియగణా జ్ఞానం కర్మ చ యత్కృతమ్ ।
సఖ్యస్తద్వృత్తయః ప్రాణః పంచవృత్తిర్యథోరగః ॥ 6

ఇంద్రియగణాః - ఇంద్రియముల సమూహములు, సఖాయః - మిత్రులు, జ్ఞానమ్ - జ్ఞానము, కర్మ చ - కర్మ కూడ, యత్-కృతమ్ - ఏ ఇంద్రియములచే చేయబడునో, తత్-వృత్తయః - ఆ ఇంద్రియముల వ్యాపారములు, సఖ్యః - సఖురాండ్రు, పంచవృత్తిః - అయిదు విధముల వ్యాపారములు గల, ప్రాణః - ప్రాణశక్తి, ఉరగః యథా - అయిదు పడగల పాము వంటిది.

అయిదు కర్మేంద్రియములు, అయిదు జ్ఞానేంద్రియములు వెరసి పది పురంజనుని మిత్రులు. వాటి ద్వారానే జీవుడు క్రమముగ్గా కర్మలను చేయుచూ, జ్ఞానమునార్జించుచున్నాడు. ఆ ఇంద్రియముల వ్యాపారము

లగు శబ్దాదులు పురంజని చెలికత్తెలు. ప్రాణశక్తి దేహములో ప్రాణ-అపాన-వ్యాన-ఉదాన-సమానములనే అయిదు వ్యాపారములను చేయుచున్నది. కావుననే, అది అయిదు పడగల పాముతో పోల్చబడినది. పురపాలకుడగు సర్పము అదియే.

బృహద్బలం మనో విద్యాదుభయేంద్రియనాయకమ్ ।
పంచాలాః పంచ విషయా యన్మధ్యే నవఖం పురమ్ ।। 7

ఉభయ-ఇంద్రియనాయకమ్ - రెండు విధముల ఇంద్రియములకు నియామకమగు, మనః - మనస్సును, బృహత్-బలమ్ - గొప్ప బలము గల భటునిగా, విద్యాత్ - తెలియవలెను, పంచ - అయిదు, విషయాః - విషయములే, పంచాలాః - పంచాల దేశము, యత్-మధ్యే - వేటి మధ్యయందు, నవఖమ్ - తొమ్మిది రంధ్రముల, పురమ్ - పురము గలదో.

జ్ఞానేంద్రియములను, కర్మేంద్రియములను కూడ ఆయా వ్యాపారములలో నడిపించే మనస్సు గొప్ప బలము గల భటుడు. శబ్దరూపరసస్పర్శగంధములనే అయిదు విషయములు కలిసి పంచాలదేశము. ఆ ఇంద్రియముల మధ్యలోని తొమ్మిది రంధ్రముల పురము శరీరమే.

అక్షిణీ నాసికే కర్ణౌ ముఖం శిశ్నగుదావితి ।
ద్వే ద్వే ద్వారౌ బహిర్యాతి యస్తదింద్రియసంయుతః ।। 8

అక్షిణీ - రెండు కన్నులు, నాసికే - రెండు ముక్కు పుటములు, కర్ణౌ - రెండు చెవులు, ద్వే ద్వే - రెండేసి రెండేసి, ద్వారౌ - ద్వారములు, ముఖమ్ - నోరు, శిశ్నగుదౌ - జనన విసర్జనేంద్రియములు, ఇతి - అనేవి, తత్-ఇంద్రియసంయుతః - ఆయా ఇంద్రియములతో గూడిన, యః - ఏ జీవుడు, బహిః - బయటకు, యాతి - వెళ్లుచున్నాడో.

ఒకే చోట రెండేసి ద్వారములు గలవని చెప్పబడినది. అవి రెండు కన్నులు, రెండు ముక్కు పుటములు, రెండు చెవులు. నోరు, జననవిసర్జ

వేంద్రియములతో కలిసి వెరసి తొమ్మిది ద్వారములు. జీవుడు ఆయా ఇంద్రియముల ద్వారా జగత్తులోని విషయములలోనికి వెళ్లుచుండును.

అక్షిణీ నాసికే ఆస్యమితి పంచ పురః కృతాః ।
దక్షిణా దక్షిణః కర్ణ ఉత్తరా చోత్తరస్స్మృతః ॥ 9

అక్షిణీ - రెండు కన్నులు, నాసికే - రెండు ముక్కు పుటములు, ఆస్యమ్ - నోరు, ఇతి - అనే, పంచ - అయిదు ద్వారములు, పురః - తూర్పునందు, కృతాః - నిర్మించబడినవి, దక్షిణః - కుడి, కర్ణః - చెవి, దక్షిణా - దక్షిణదిక్కునందలి ద్వారము, ఉత్తరః - ఎడమ, కర్ణః చ - చెవి కూడ, ఉత్తరా - ఉత్తరద్వారము, స్మృతః - చెప్పబడినది.

రెండు కన్నులు, రెండు ముక్కు పుటములు, నోరు అనునవి తూర్పుదిక్కునందలి అయిదు ద్వారములు. కుడి చెవి దక్షిణదిక్కునందలి ద్వారము. ఎడమ చెవి ఉత్తరదిక్కునందలి ద్వారము.

పశ్చిమే ఇత్యధో ద్వారౌ గుదం శిశ్నమిహోచ్యతే ।
ఖద్యోతావిర్ముఖీ చాత్ర నేత్రే ఏకత్ర నిర్మితే ।
రూపం విభ్రాజితం తాభ్యాం విచష్టే చక్షుషేశ్వరః ॥ 10

ఇహ - ఈ దేహములో, అధః - క్రింద, గుదమ్ - విసర్జనేంద్రియము, శిశ్నమ్ - జననేంద్రియము, పశ్చిమే - పడమర దిక్కునందలి, ద్వారౌ - రెండు ద్వారములు అని, ఉచ్యతే - చెప్పబడుచున్నది, అత్ర - ఈ పురమునందు, ఏకత్ర - ఒక్కచోట, నిర్మితే - నిర్మించబడిన, ఖద్యోత-ఆవిర్ముఖీ - ఖద్యోతము ఆవిర్ముఖము అనే ద్వారములు, నేత్రే - రెండు కన్నులు, రూపమ్ - రూపమే, విభ్రాజితమ్ - విభ్రాజిత దేశము, ఈశ్వరః - ఈ దేహమునకు ప్రభువగు జీవుడు, తాభ్యామ్ - వాటిగుండా, చక్షుషా - చక్షురింద్రియముతో, విచష్టే - చూచుచున్నాడు.

ఈ దేహములో క్రిందనుండే జననవిసర్జనేంద్రియములే పడమర దిక్కునందలి రెండు ద్వారములు. ఈ పురములో ఒకే చోట ఖద్యోతము (సూర్యుడు, లేక మిణుగురు పురుగు), ఆవిర్ముఖము (ప్రకాశించే ముఖ

ము) అనే రెండు ద్వారములు నిర్మించబడినవని చెప్పబడినది. అవియే రెండు కన్నులు. రూపమే విభ్రాజిత (బాగుగా ప్రకాశింపజేయబడిన) దేశము. ఈ పురమునకు ప్రభువగు జీవుడు నేత్రేంద్రియము (ద్యుమంతుడు అనే మిత్రుడు, ప్రకాశము గలవాడు) తో ఆ ద్వారముల గుండా రూపమును దర్శించుచున్నాడు.

నలినీ నాలినీ నాసే గంధస్సౌరభ ఉచ్యతే ।
ఘ్రాణోఽవధూతో ముఖ్యాఽఽస్యం విపణో వాగ్రసవిద్రసః ॥11

నలినీ - నలిని, నాలినీ - నాలిని అనే ద్వారములు, నాసే - ముక్కు పుటములు, గంధః - గంధము, సౌరభః - సౌరభదేశమని, ఉచ్యతే - చెప్పబడుచున్నది, ఘ్రాణః - ఘ్రాణేంద్రియము, అవధూతః - అవధూతుడు, ముఖ్యా - ముఖ్యద్వారము, ఆస్యమ్ - నోరు, విపణః - విపణుడు, వాక్ - వాగింద్రియము, రసవిత్ - రసజ్ఞుడు, రసః - రసనేంద్రియము.

నలిని నాలిని (తామర తీగలు) అనే రెండు ద్వారములు ముక్కు పుటములు. గంధము సౌరభదేశము (పరిమళము). ఘ్రాణేంద్రియము అవధూతుడనే (గాలి వీచుట) మిత్రుడు. ముఖ్యమనే ద్వారము నోరు. వాగింద్రియమే విపణుడనే (లోకవ్యవహారము, స్తుతి) మిత్రుడు. రసనేంద్రియము రసజ్ఞుడనే (రుచిని తెలియుట) మిత్రుడు.

ఆపణో వ్యవహారోఽత్ర చిత్రమంధో బహూదనమ్ ।
పితృహూర్దక్షిణః కర్ణ ఉత్తరో దేవహూస్స్మృతః ॥ 12

అత్ర - ఈ పరోక్షకథనమునందు (ఈ వాగింద్రియమునందు), వ్యవహారః - వ్యాపారము, ఆపణః - ఆపణుడు, చిత్రమ్ - రకరకముల, అంధః - అన్నము, బహూదనమ్ - బహూదనదేశము, దక్షిణః - ఎడమ, కర్ణః - చెవి, పితృహూః - పితృహు అనే ద్వారము, ఉత్తరః - కుడి చెవి, దేవహూః - దేవహు అనే ద్వారమని, స్మృతః - చెప్పబడినది.

ఈ పరోక్షకథనములో వాగింద్రియముయొక్క వ్యాపారమగు సంభాషణమే ఆపణుడనే మిత్రుడు. రకరకముల ఆహారమే బహూదన దేశ

ము. ఎడమ చెవి పితృహు అనే ద్వారము కాగా, కుడి చెవి దేవహూ అనే ద్వారము.

ప్రవృత్తం చ నివృత్తం చ శాస్త్రం పంచాలసంజ్ఞితమ్ ।
పితృయానం దేవయానం శ్రోత్రాచ్ఛ్రుతధరాద్వ్రజేత్ ।।13

ప్రవృత్తం - కర్మకాండ రూపమగు, శాస్త్రమ్ - వేదము, నివృత్తం చ - జ్ఞానకాండరూపమగు వేదము కూడ, పంచాలసంజ్ఞితమ్ - దక్షిణపంచాలము ఉత్తరపంచాలము అనే పేరుతో చెప్పబడినది, శ్రుతధరాత్ - శ్రుతధరుడనే, శ్రోత్రాత్ - చెవి వలన, పితృయానమ్ - పితృయానమార్గమును, దేవయానమ్ - దేవయానమార్గమును, వ్రజేత్ - వెళ్లును.

మానవుడు కర్మకాండరూపమగు వేదమును విని, కర్మలననుష్ఠించి, మరణించిన పిదప పితృయానమార్గములో వెళ్లును. ఈ కర్మకాండయే దక్షిణపంచాలమనబడినది. జ్ఞానకాండరూపమగు వేదమును విని ఉపాసనలను చేయు సాధకుడు దేవయానమార్గమును పొందును. ఈ కాండకు ఉత్తరపంచాలమని పేరు పెట్టబడినది. వినుటకు సహకరించే చెవియే శ్రుతధరుడు అనే మిత్రుడు.

ఆసురీ మేఢ్రమర్వాగ్ద్వార్వ్యవాయో గ్రామిణాం రతిః ।
ఉపస్థో దుర్మదః ప్రోక్తో నిరృతిర్గుద ఉచ్యతే ।। 14

ఆసురీ - ఆసురి అనే, ద్వాః - ద్వారము, అర్వాక్ - క్రిందనుండే, మేఢ్రమ్ - జననేంద్రియము, గ్రామిణామ్ - విషయలాలసులకు, రతిః - ప్రీతిస్థానమగు గ్రామకదేశము, వ్యవాయః - యువతీసంగము, ఉపస్థః - జననేంద్రియము, దుర్మదః - దుర్మదుడని, ప్రోక్తః - చెప్పబడినది, నిరృతిః - నిరృతి, గుదః - విసర్జనేంద్రియమని, ఉచ్యతే - చెప్పబడుచున్నది.

క్రిందనుండే జననావయవము ఆసురి (భోగ లంపటత్వము) అనే ద్వారము. యువతీసంగమే విషయలాలసులకు ప్రియమగు గ్రామకదేశము. జననేంద్రియమే దుర్మదుడనే మిత్రుడు. నిరృతి అనే ద్వారము విసర్జనావయవమునకు ప్రతీక.

**వైశసం నరకం పాయుర్లుబ్ధకోఽంధౌ తు మే శృణు ।**
**హస్తపాదౌ పుమాంస్తాభ్యాం యుక్తో యాతి కరోతి చ ॥ 15**

వైశసమ్ - వైశసదేశము, నరకమ్ - నరకమే, పాయుః - విసర్జనేంద్రియము, లుబ్ధకః - లుబ్ధకుడు, మే - నా వచనము వలన, అంధౌ తు - ఇద్దరు అంధులను గురించి, శృణు - వినుము, హస్తపాదౌ - చేతులు కాళ్లు, పుమాన్ - మానవుడు, తాభ్యామ్ - వాటితో, యుక్తః - కూడినవాడై, కరోతి - చేయుచున్నాడు, యాతి చ - వెళ్లుచున్నాడు.

వైశస (యాతనలు) దేశమే నరకము. విసర్జనేంద్రియమే లుబ్ధకుడనే మిత్రుడు. ఇద్దరు అంధుల (క్రియయే గాని, జ్ఞానము లేకుండుట) రహస్యమును చెప్పెదను. వినుము. వారు చేతులు, కాళ్లే. మానవుడు చేతులతో పనులను చేయును; కాళ్లతో నడచును.

**అంతఃపురం చ హృదయం విషూచిర్మన ఉచ్యతే ।**
**తత్ర మోహం ప్రసాదం వా హర్షం ప్రాప్నోతి తద్గుణైః ॥ 16**

అంతఃపురమ్ - అంతఃపురము, హృదయమ్ - హృదయము, మనః - మనస్సు, విషూచిః - విషూచీనుడని, ఉచ్యతే - చెప్పబడుచున్నది, తత్ర - దానియందు, తత్-గుణైః - దాని గుణములచే, మోహమ్ - మోహమును గాని, ప్రసాదమ్ - ప్రసన్నతను గాని, హర్షం వా - హర్షమును గాని, ప్రాప్నోతి - పొందుచున్నాడు.

అంతఃపురము హృదయమునకు ప్రతీక. దానిలోని విషూచీనుడనే ప్రధాన సేవకుడు మనస్సే. జీవుడు మనస్సులోని సత్త్వగుణమును బట్టి ప్రసన్నతను, రజోగుణమును బట్టి హర్షమును, తమోగుణమును బట్టి వ్యామోహమును పొందుచుండును.

**యథా యథా విక్రియతే గుణాక్తో వికరోతి చ ।**
**తథా తథోపద్రష్టాత్మా తద్వృత్తీరనుకార్యతే ॥ 17**

యథా యథా - ఏయే విధముగా, విక్రియతే - వికారములను పొందింపబడుచుండునో, చ - మరియు, వికరోతి - ఇంద్రియములకు వికా

రములను కలిగించునో, ఉపద్రష్టా - సాక్షియగు, ఆత్మా - ఆత్మ, గుణ-అక్తః - గుణములచే లేపమును పొందినదై, తథా తథా - ఆయా విధముగా, తత్ -వృత్తీః - దాని వృత్తులను, అనుకార్యతే - అనుకరింప జేయబడుచున్నది.

బుద్ధి స్వప్నములో వికారములను పొందుచుండును. జాగ్రత్తులో ఇంద్రియములయందు వికారములను కలిగించుచుండును. బుద్ధియొక్క సత్త్వరజస్తమోగుణములు వివేకము లేకుండుటచే ఆత్మయందు ఆరోపించబడి, ఆత్మ వాటిచే లేపమును పొందినట్లు అగును. ఆ కారణముచే ఆత్మ కేవలసాక్షియే అయి ఉన్ననూ, బుద్ధి ఏయే వికారములను పొందునో, ఆత్మయే ఆయా వికారములను పొందుచున్నట్లు భాసించును.

దేహో రథస్త్వింద్రియాశ్వస్సంవత్సరరయో గతిః ।
ద్వికర్మచక్రస్త్రిగుణధ్వజః పంచాసుబంధురః ॥ 18

దేహః - దేహమే, ఇంద్రియ-అశ్వః - ఇంద్రియములే గుఱ్ఱములుగా గలిగినది, ద్వికర్మచక్రః - రెండు రకముల కర్మలే చక్రములుగా గలది, త్రిగుణధ్వజః - మూడు గుణములే జెండా కర్రలుగా గలది, పంచ-అసుబంధురః - అయిదు ప్రాణవృత్తులే కమ్మీలుగా కలిగిన, రథః - రథము, సంవత్సరరయః - సంవత్సరకాలముయొక్క వేగమే, గతిః - గమనము.

దేహమే రథము. అయిదు ఇంద్రియములే (కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మము) దాని గుఱ్ఱములు. పుణ్యపాపములనిచ్చే ధర్మ-అధర్మములే దాని చక్రములు. సత్త్వరజస్తమోగుణములే దాని జెండా కర్రలు. ప్రాణ-అపాన-వ్యాన-ఉదాన-సమానములనే ప్రాణవృత్తులే దాని కమ్మీలు. సంవత్సరము కొలబద్దగా గల కాలప్రవాహమే దాని గమనము.

మనోరశ్మిర్బుద్ధిసూతో హృన్నీడో ద్వంద్వకూబరః ।
పంచేంద్రియార్థప్రక్షేపస్సప్తధాతువరూథకః ॥ 19

మనః-రశ్మిః - మనస్సే కళ్లెముగా గలది, బుద్ధిసూతః - బుద్ధియే సారథిగా గలది, హృత్-నీడః - హృదయమే రథికుడు కూర్చుండే స్థానముగా గలది, ద్వంద్వకూబరః - సుఖదుఃఖములు మొదలగు ద్వంద్వ

ములే కూబరము (కాడిని గట్టే మ్రాను) లుగా గలది, పంచ-ఇంద్రియ-అర్థ ప్రక్షేపః - అయిదు ఇంద్రియముల విషయములే అరలు (ఆయుధములు) గా గలది, సప్తధాతువరూథకః - ఏడు ధాతువులే కవచములుగా కలిగినది.

ఆ దేహమనే రథమునకు మనస్సే కళ్లెము. బుద్ధియే సారథి. హృదయమే రథికుడు (జీవుడు) కూర్చుండే స్థానము. సుఖదుఃఖములు మొదలగు ద్వంద్వములే (పరస్పరవిరుద్ధములగు స్థితులు) కూబరము (కాడిని గట్టే మ్రాను) ల జంట. శబ్దరూపరసస్పర్శగంధములే దానిలోని అరలు (ఆయుధములు). చర్మము, మూలుగు, మాంసము, వీర్యము, క్రొవ్వు, రక్తము, ఎముకలు అనే ఏడు ధాతువులే (మౌలిక ద్రవ్యములు) దానిని రక్షించే ఆవరణములు.

ఆకూతిర్విక్రమో బాహ్యో మృగతృష్ణాం ప్రధావతి ।
ఏకాదశేంద్రియచమూః పంచసూనావినోదకృత్ ॥ 20

ఆకూతిః - అయిదు కర్మేంద్రియములే, బాహ్యః - బయటనుండే, విక్రమః - నడక, ఏకాదశ-ఇంద్రియచమూః - పదకొండు ఇంద్రియములే సైన్యముగా గల జీవుడు, పంచసూనావినోదకృత్ - అయిదు ఇంద్రియములతో హింసతో కూడిన వినోదమును చేయువాడై, మృగతృష్ణామ్ - ఎండమావిని, ధావతి - పరుగెత్తుచున్నాడు.

దేహములోని అయిదు కర్మేంద్రియములే దేహము అనే రథము యొక్క అయిదు రకముల, బయటకు కానవచ్చే నడక. అయిదు కర్మేంద్రియములు, అయిదు జ్ఞానేంద్రియములు, మనస్సు వెరసి ఈ పదకొండు ఆ రథములో పయనించే జీవుని సైన్యము. జీవుడు అయిదు జ్ఞానేంద్రియములతో అయిదు విషయములను అధర్మముగా సంపాదించి వినోదించుటయే హింసతో కూడిన వేట. (సూనములనగా పొయ్యి, సన్నెకల్లు, చీపురు, రోలు, నీటి పాత్ర అనే అయిదు ఇంటి సామానులు. వీటిని వాడుటలో ప్రాణి హింసకు అవకాశము గలదు). ఇట్టి జీవుడు ఇంద్రియభోగములనే ఎండమావి వెంట పరుగులెత్తుచున్నాడు. ఈ పరుగే వేటగా వర్ణించబడినది.

సంవత్సరశ్చండవేగః కాలో యేనోపలక్షితః ।
తస్యాహానీహ గంధర్వా గంధర్వ్యో రాత్రయస్స్మృతాః ।
హరంత్యాయుః పరిక్రాంత్యా షష్ట్యుత్తరశతత్రయమ్ ॥ 21

సంవత్సరః - సంవత్సరము. చండవేగః - చండవేగుడు (ప్రచండ మగు వేగము గలది). యేన - దేనిచే, కాలః - కాలము, ఉపలక్షితః - కొలువబడుచున్నదో, తస్య - దానియొక్క, అహాని - పగళ్లు, ఇహ - ఈ పరోక్షకథనమునందు, గంధర్వాః - గంధర్వులనియు, రాత్రయః - రాత్రులు, గంధర్వ్యః - గంధర్వస్త్రీలనియు, స్మృతాః - చెప్పబడినారు, షష్టి-ఉత్తరశతత్రయమ్ - మూడువందల అరవై సార్లు, పరిక్రాంత్యా - పరిభ్రమించుట ద్వారా, ఆయుః - ఆయుర్దాయమును, హరంతి - హరించుచున్నారు.

కాలము ప్రచండమగు వేగము గలది. దానికి కొలమానమగు సంవత్సరమే చండవేగుడనే గంధర్వరాజు. దానిలోని మూడు వందల అరవై పగళ్లు గంధర్వులుగను, అన్నియే రాత్రులు గంధర్వస్త్రీలుగను రూపకము చేయబడినది. ఈ రాత్రింబగళ్లు ఒకదానివెంట మరియొకటి తిరుగుతూ, జీవుని ఆయుర్దాయమును హరించి వేయుచుండును.

కాలకన్యా జరా సాక్షాల్లోకస్తాం నాభినందతి ।
స్వసారం జగృహే మృత్యుః క్షయాయ యవనేశ్వరః ॥ 22

కాలకన్యా - కాలకన్య, సాక్షాత్ - సాక్షాత్తుగా, జరా - ముసలిదనము, లోకః - మానవుడు, తామ్ - దానిని, న అభినందతి - ఇష్టపడడు, మృత్యుః - మరణమే, యవన-ఈశ్వరః - యవనప్రభుడు, క్షయాయ - నాశము కొరకు, స్వసారమ్ - చెల్లెలిగా, జగృహే - స్వీకరించెను.

కాలకన్యయే సాక్షాత్తుగా ముసలిదనము. లోకులు ముసలిదనమును ఇష్టపడరు. మరణమే యవనప్రభుడు. అతడు ప్రాణుల నాశము కొరకై ఈ కాలకన్యను తన చెల్లెలిగా స్వీకరించెను.

ఆధయో వ్యాధయస్తస్య సైనికా యవనాశ్చరాః ।
భూతోపసర్గాశురయః ప్రజ్వారో ద్వివిధజ్వరః ॥ 23

ఆధయః - మనోవ్యాధులు, వ్యాధయః - శరీరవ్యాధులు, తస్య - ఆ యవనప్రభునియొక్క, చరాః - పాదచారులగు, సైనికాః - సైనికులు, భూత-ఉపసర్గ-ఆశురయః - ప్రాణుల వినాశమునందు శీఘ్రమగు వేగము గల, ప్రజ్వారః - ప్రజ్వారుడు, ద్వివిధజ్వరః - అనేకవిధముల జ్వరమే.

మనోవ్యాధులు, శరీరవ్యాధులు ఆ యవనప్రభుని పాదచారులగు సైనికులు. ప్రాణుల వినాశమును తొందరగా తెచ్చి పెట్టే పలు రకముల జ్వరములే ప్రజ్వారుడు (చండవేగుని తమ్ముడు).

ఏవం బహువిధైర్దుఃఖైర్దైవభూతాత్మసంభవైః ।
క్లిశ్యమానశ్శతం వర్షం దేహే దేహీ తమోవృతః ॥ 24

ఏవమ్ - ఈ విధముగా, దైవభూత-ఆత్మసంభవైః - దైవము వలన పంచభూతముల వలన మరియు శరీరము వలన కలిగే, బహువిధైః - పలు రకముల, దుఃఖైః - దుఃఖములచే, క్లిశ్యమానః - పీడింపబడుచున్న, దేహీ - జీవుడు, శతం వర్షమ్ - వంద యేళ్లు, దేహే - దేహమునందు, తమః-వృతః - అజ్ఞానముచే కప్పబడినవాడు.

ఈ విధముగా అజ్ఞానముచే కప్పబడిన వివేకము గల జీవుడు దేహమునందు ఆత్మభావము గలవాడై, వందయేళ్లు ఆధ్యాత్మిక-ఆధిభౌతిక-ఆధిదైవికదుఃఖముల ననుభవించుచుండును.

ప్రాణేంద్రియమనోధర్మానాత్మన్యధ్యస్య నిర్గుణః ।
శేతే కామలవాన్ ధ్యాయన్మమాహమితి కర్మకృత్ ॥ 25

నిర్గుణః - గుణములు లేనివాడు, ప్రాణ-ఇంద్రియమనః-ధర్మాన్ - ప్రాణము ఇంద్రియములు మనస్సుల ధర్మములను, ఆత్మని - తనయందు, అధ్యస్య - ఆరోపించుకొని, కామలవాన్ - అల్పములగు కోరికలను, ధ్యాయన్ - చింతించుచున్నవాడై, మమ - నాది, అహమ్ - నేను, ఇతి -

అని, కర్మకృత్ - కర్మలను చేయుచున్నవాడై, శేతే - దేహమునందు ఉండును.

జీవుని యథార్థస్వరూపము నిర్గుణమగు ఆత్మ. కాని, ప్రాణము, ఇంద్రియములు, మనస్సుల ధర్మములను ఆత్మయందు ఆరోపించుటచే జీవుడు నిర్మాణమైనాడు. ఈ జీవుడు దేహమునందు అహంకారము, దేహమునకు సంబంధించినవాటియందు మమకారము గలవాడై, తనను కర్తగా భ్రమించి, అల్పములగు కోరికలను ధ్యానిస్తూ, వాటి కొరకై కర్మలను చేస్తూ, దేహమే తాననే అజ్ఞానములో జీవించుచుండును.

యదాత్మానమవిజ్ఞాయ భగవంతం పరం గురుమ్ ।
పురుషస్తు విషజ్జేత గుణేషు ప్రకృతేస్స్వదృక్ ॥ 26

పురుషః - వ్యక్తి, స్వదృక్ తు - స్వయంప్రకాశస్వరూపుడే అయినా, యదా - ఏ కాలమునందైతే, ఆత్మానమ్ - తనను, పరం గురుమ్ - గురువులకు గురువగు, భగవంతమ్ - భగవంతునిగా, అవిజ్ఞాయ - తెలియకనుండునో ఆ కాలమునందు, ప్రకృతేః - మాయాశక్తియొక్క, గుణేషు - గుణములయందు, విషజ్జేత - విశేషమగు ఆసక్తిని కలిగియుండును.

వ్యక్తి స్వతహాగా స్వయంప్రకాశస్వరూపుడు. గురువులకు గురువగు భగవంతునకు, వ్యక్తియొక్క అంతరతమస్వరూపము (ఆత్మ) నకు భేదము లేదు. కాని, ఈ సత్యమునెరుంగని వ్యక్తి మాయాశక్తియొక్క సత్త్వరజస్తమోగుణములనుండి పుట్టిన విషయభోగములయందు అధికమగు ఆసక్తిని కలిగియుండును.

గుణాభిమానీ స తదా కర్మాణి కురుతేఽవశః ।
శుక్లం కృష్ణం లోహితం వా యథాకర్మాభిజాయతే ॥ 27

గుణ-అభిమానీ - గుణములయందు అభిమానము గల, సః - ఆ జీవుడు, తదా - అప్పుడు, అవశః - అస్వతంత్రుడై, శుక్లమ్ - సాత్త్వికము గాని, లోహితమ్ - రాజసము గాని, కృష్ణం వా - తామసము గాని అగు,

కర్మాణి - కర్మలను, కురుతే - చేయును, యథాకర్మ- కర్మను బట్టి, అభి జాయతే - జన్మించును.

సత్త్వరజస్తమోగుణముల కార్యములగు దేహేంద్రియాదుల యందు నేను, నాది అనే అభిమానము గల జీవుడు తన స్వాతంత్ర్య మును కోల్పోయి వాటికి లోబడి కర్మలనాచరించును. ఆ కర్మలు సాత్త్వి కము గాని, రాజసము గాని, తామసము గాని కావచ్చును. కర్మల ఫలము ననుసరించి వానికి మరల జన్మ వచ్చును.

శుక్లాత్ప్రకాశభూయిష్ఠాన్ లోకానాప్నోతి కర్హిచిత్ ।
దుఃఖోదర్కాన్ క్రియాయాసాంస్తమఃశోకోత్కటాన్ క్వచిత్ ॥ 28

శుక్లాత్ - సాత్త్విక కర్మ వలన, ప్రకాశభూయిష్ఠాన్ - ప్రకాశము అధికముగానుండే, లోకాన్ - లోకములను, కర్హిచిత్ - ఒకానొక కాలమునం దు, దుఃఖ-ఉదర్కాన్ - దుఃఖమే ఉత్తరఫలముగా గల, క్రియా-ఆయాసాన్ - కర్మలచే క్లేశము గల లోకములను, క్వచిత్ - ఒక కాలమునందు, తమః-శోక-ఉత్కటాన్ - అజ్ఞానము శోకము అధికముగానుండే లోకములను, ఆప్నోతి - పొందును.

జీవుడు ఒకప్పుడు సాత్త్వికకర్మల వలన ప్రకాశము అధికముగా నుండే దేవాది లోకములను, మరియొకప్పుడు రాజస కర్మల వలన దుఃఖ బహుళములైన కర్మల ఆయాసము అధికముగా నుండే మనుష్యాది లోక ము (జన్మ) లను, ఇంకో సందర్భములో తామసకర్మలచే అజ్ఞానము దుఃఖము నిండియుండే పశుపక్ష్యాది జన్మలను పొందును.

క్వచిత్పుమాన్ క్వచిచ్చ స్త్రీ క్వచిన్నోభయమంధధీః ।
దేవో మనుష్యస్తిర్యగ్వా యథాకర్మగుణం భవః ॥ 29

అంధధీః - అజ్ఞానముతో నిండిన బుద్ధి గల జీవుడు, యథాకర్మగు ణమ్ - కర్మలను గుణములను బట్టి, క్వచిత్ - ఒకప్పుడు, పుమాన్ - పురు షుడుగను, క్వచిత్ చ - మరియొకప్పుడు, స్త్రీ - స్త్రీగను, క్వచిత్ - ఒక

ప్పుడు, న-ఉభయమ్ - నపుంసకుడుగను, దేవః - దేవతగను, మనుష్యః - మానవుడుగను, తిర్యక్ వా - పశువుగా గాని, భవః - జన్మ.

అజ్ఞానముతో నిండియున్న ఈ జీవుడు తాను అయా గుణముల ప్రభావముచే చేసిన ఆయా కర్మలను అనుసరించి, దేవయోనిలో గాని, మనుష్యయోనిలో గాని, పశుపక్ష్యాదియోనిలో గాని, పురుషుడుగా గాని, స్త్రీగా గాని, నపుంసకుడుగా గాని జన్మించును.

క్షుత్పరీతో యథా దీనస్సారమేయో గృహం గృహమ్ ।
చరన్ విందతి యద్దిష్టం దండమోదనమేవ వా ॥ 30

తథా కామాశయో జీవ ఉచ్చావచపథా భ్రమన్ ।
ఉపర్యధో వా మధ్యే వా యాతి దిష్టం ప్రియాప్రియమ్ ॥31

క్షుత్-పరీతః - ఆకలిచే వ్యాపించబడినది, దీనః - దీనము అగు, సారమేయః - కుక్క, యథా - ఏ విధముగానైతే, గృహం గృహమ్ - ఇంటింటిని, చరన్ - తిరుగుచున్నదై, దండమ్ - బడితెను గాని, ఓదనం ఏవ వా - అన్నమునే గాని, యత్ - ఏది, దిష్టమ్ - దైవముచే నిర్ణయించబడినదో దానిని, విందతి - పొందుచున్నదో, తథా - అదే విధముగా, కామ-ఆశయః - కోరికలతో నిండిన మనస్సు గల, జీవః - జీవుడు, ఉచ్చావచ పథా - ఉత్తమము మరియు అధమము అగు మార్గముచే, భ్రమన్ - తిరుగుచున్నవాడై, ఉపరి - పైన గాని, అధః వా - క్రింద గాని, మధ్యే వా - మధ్యయందు గాని, దిష్టమ్ - దైవముచే నిర్ణయించబడిన, ప్రియ-అప్రియమ్ - సుఖదుఃఖములను, యాతి - పొందుచున్నాడు.

ఆకలితో పరితపించే దీనమగు కుక్క ఇంటింటికీ తిరుగుచుండును. దైవానుగ్రహమునసరించి దానికి ఒకప్పుడు బడితె పూజ జరుగును. మరియొకప్పుడు అన్నము లభించును. అదే విధముగా, కోరికలతో నిండిన మనస్సు గల జీవుడు ఉత్తమ (స్వర్గాది లోకములకు వెళ్లే) మార్గములో గాని, అధమ (నరక) మార్గములో గాని పరిభ్రమించుచుండును. వానికి స్వర్గములో గాని, మనుష్యలోకములో గాని, నరకములో గాని దైవముచే నిర్ణయించబడిన సుఖము గాని, దుఃఖము గాని లభించుచుండును.

దుఃఖేష్వేకతరేణాపి దైవభూతాత్మహేతుషు ।
జీవస్య న వ్యవచ్ఛేదస్స్యాచ్చేత్తత్తత్ప్రతిక్రియా ॥ 32

దైవభూత-ఆత్మహేతుషు - దైవము పంచభూతములు మరియు దేహము కారణములుగా గల, దుఃఖేషు - దుఃఖములయందు, ఏకతరేణ అపి - ఒక్కదానిచేనైననూ, జీవస్య - జీవునకు, వ్యవచ్ఛేదః - పూర్తి విడుదల, న - లేదు, తత్-తత్-ప్రతిక్రియా - ఆయా దుఃఖములకు నివారణోపాయము, స్యాత్ చేత్ - ఉన్ననూ.

జీవునకు ఆధిదైవిక-ఆధిభౌతిక-ఆధ్యాత్మికములగు దుఃఖములలో ఒక్కదానినుండియైననూ పూర్తి విముక్తి లేదు. ఆయా దుఃఖములకు నివారణోపాయములున్ననూ, అవి తాత్కాలికములు మరియు అసమగ్రములు మాత్రమే.

యథా హి పురుషో భారం శిరసా గురుముద్వహన్ ।
తం స్కంధేన స ఆధత్తే తథా సర్వాః ప్రతిక్రియాః ॥ 33

పురుషః - వ్యక్తి, శిరసా - శిరస్సుతో, గురుమ్ - పెద్ద, భారమ్ - బరువును, ఉద్వహన్ - పైకెత్తి మోయుచున్నవాడు, సః - ఆతడు, యథా - ఏ విధముగానైతే, తమ్ - ఆ బరువును, స్కంధేన - భుజముతో, ఆధత్తే - మోయునో, సర్వాః - అన్ని, ప్రతిక్రియాః - నివారణోపాయములు, తథా - అట్టివి.

తలపై పెద్ద బరువును మోయుచున్న వ్యక్తి ఆ బరువును భుజముల మీదికి మార్చుకొనును. బరువును మోయుట తప్పదు. దుఃఖమునకు నివారణోపాయములు అట్టివి మాత్రమే.

నైకాంతతః ప్రతీకారః కర్మణాం కర్మ కేవలమ్ ।
ద్వయం హ్యావిద్యోపసృతం స్వప్నే స్వప్న ఇవానఘ ॥ 34

అనఘ - పాపమునెరుంగని ఓ మహారాజా!, కర్మణామ్ - కర్మలకు, కర్మ కేవలమ్ - కర్మ మాత్రమే, ఏకాంతతః - పూర్తిగా, ప్రతీకారః - నివారణోపాయము, న - కాదు, హి - ఏలయనగా, స్వప్నే - స్వప్నము

సందలి, స్వప్నః ఇవ - కల వలె, ద్వయమ్ - రెండు, అవిద్యా-ఉపసృతమ్ - అజ్ఞానముచే వ్యాపించబడియున్నది.

పాపమునెరుంగని ఓ మహారాజా! ఒక కర్మయొక్క ఫలమును మరియొక కర్మ పూర్తిగా తప్పించలేదు. ఏలయనగా, స్వప్నమునందలి స్వప్నము వలె, రెండు కర్మలయందు (కర్మ మరియు కర్మఫలభోగము అనే రెండింటియందు), నేను కర్తను మరియు భోక్తను అనే అజ్ఞానము వ్యాపించియే యున్నది.

అర్థే హ్యావిద్యమానేఽపి సంసృతిర్న నివర్తతే ।
మనసా లింగరూపేణ స్వప్నే విచరతో యథా ॥ 35

లింగరూపేణ - ఉపాధియై యున్న, మనసా - మనస్సుతో, స్వప్నే - స్వప్నమునందు, విచరతః యథా - సంచరించుచున్నవానికి వలె, అర్థే - పదార్థము, అవిద్యమానే అపి - లేకున్ననూ, సంసృతిః - సంసారము, న నివర్తతే - తొలగిపోవుట లేదు.

వ్యక్తి స్వప్నములో మానసిక వాసనయే ఉపాధిగా గలవాడై సంచరిస్తూ, స్వప్నము వాస్తవము కాకున్ననూ, స్వప్నదుఃఖముననుభవించును. అదే విధముగా, జగత్తులో దుఃఖమును కలిగించే పదార్థము మిథ్యయే అయిననూ, దానివలన కలిగే సంసారదుఃఖము తప్పుట లేదు.

అథాత్మనోఽర్థభూతస్య యతోఽనర్థపరంపరా ।
సంసృతిస్తద్వ్యవచ్ఛేదో భక్త్యా పరమయా గురౌ ॥ 36

అథ - అందువలన, అర్థభూతస్య - యథార్థతత్త్వమగు, ఆత్మనః - ఆత్మకు, యతః - ఏ అజ్ఞానము వలన, అనర్థపరంపరా - దుఃఖముల వరుసయగు, సంసృతిః - సంసారమో, గురౌ - జగన్నాథుడగు శ్రీహరి యందలి, పరమయా - సర్వోత్తమమగు, భక్త్యా - భక్తిచే, తత్-వ్యవచ్ఛేదః - దాని నివారణము.

ఆత్మ ఒక్కటియే సత్యము. జగత్తు అంతా మిథ్య. అయిననూ, ఆత్మస్వరూపుడగు జీవునకు అజ్ఞానముచే దుఃఖముల వరుస అయిన

సంసారము కలుగుచున్నది. కావున, శ్రీహరియందు చేయబడే సర్వోత్తమ మగు నిష్కామభక్తి మాత్రమే అజ్ఞానమును పోగొట్టి, సంసారమును నివ ర్తింప జేయగలదు.

వాసుదేవే భగవతి భక్తియోగస్సమాహితః ।
సధ్రీచీనేన వైరాగ్యం జ్ఞానం చ జనయిష్యతి ॥ 37

వాసుదేవే భగవతి - వాసుదేవ భగవానునియందు, సధ్రీచీనేన - యోగ్యమగు పద్ధతిగా, సమాహితః - ఏకాగ్రచిత్తముతో చేయబడిన, భక్తియోగః - భక్తియోగము, వైరాగ్యమ్ - వైరాగ్యమును, జ్ఞానం చ - జ్ఞాన మును కూడ, జనయిష్యతి - కలిగించగలదు.

వాసుదేవ భగవానునియందు సరియగు పద్ధతిలో ఏకాగ్రమగు చిత్తముతో చేయబడిన భక్తియోగము (భక్తి అనే సాధనాభ్యాసము) జ్ఞానవై రాగ్యములను ఉదయింప జేయును.

సోఽచిరాదేవ రాజర్షే స్యాదచ్యుతకథాశ్రయః ।
శృణ్వతశ్శ్రద్దధానస్య నిత్యదా స్యాదధీయతః ॥ 38

రాజర్షే - ఓ రాజర్షీ!, నిత్యదా - అన్ని కాలములలో, శ్రద్దధానస్య - శ్రద్ధను కలిగియున్నట్టియు, శృణ్వతః - శ్రవణము చేయుచున్నట్టియు, అధీయతః - అధ్యయనము చేయుచున్న వానికి, అచ్యుతకథా-ఆశ్రయః - అచ్యుతుని గాథలే ఆలంబనముగా గల, సః - ఆ భక్తియోగము, అచిరాత్ ఏవ - తొందరగానే, స్యాత్ - కలుగును.

ఓ రాజర్షీ! నిత్యము శ్రద్ధతో అచ్యుతుని గాథలను వింటూ, మోక్ష శాస్త్రమును అధ్యయనము చేయుచున్న సాధకునకు తొందరలోనే ఆ భక్తి యోగము సిద్ధించును. భక్తియోగమునకు ఆలంబనము అచ్యుతుని గాథలే.

యత్ర భాగవతా రాజన్ సాధవో విశదాశయాః ।
భగవద్గుణానుకథనశ్రవణవ్యగ్రచేతసః ॥ 39

తస్మిన్మహన్ముఖరితా మధుభిచ్చరిత్ర-
పీయూషశేషసరితః పరితస్స్రవంతి ।
తా యే పిబంత్యవితృషో నృప గాఢకర్ణైః
తాన్న స్పృశంత్యశనతృడ్భయశోకమోహాః ॥ 40

రాజన్ - ఓ రాజా!, యత్ర - ఎక్కడనైతే, సాధవః - పరోపకారపరాయణులు, విశద-ఆశయాః - స్వచ్ఛమగు హృదయము గలవారు, భగవత్-గుణ-అనుకథనశ్రవణవ్యగ్రచేతసః - భగవంతుని గుణముల కీర్తనమును వినుటయందు తొందరపడే మనస్సులు గలవారు అగు, భాగవతాః - భగవద్భక్తులు ఉండెదరో, తస్మిన్ - ఆ స్థానమునందు, మహత్-ముఖరితాః - మహాత్ములచే కీర్తించబడిన, మధుభిత్-చరిత్రపీయూషశేషసరితః - మధువైరియగు శ్రీహరియొక్క చరితము అనే అమృతము మాత్రమే మిగిలియుండే నదులు, పరితః - అన్ని వైపులా, స్రవంతి - ప్రవహించుచుండును, నృప - ఓ రాజా!, యే - ఎవరైతే, తాః - ఆ నదులను, అవితృషః - తృప్తి లేనివారై, గాఢకర్ణైః - నిమగ్నమైయున్న చెవులతో, పిబంతి - పానము చేయుదురో, తాన్ - వారిని, అశనతృట్-భయశోకమోహాః - ఆకలి దప్పిక భయము దుఃఖము మరియు వ్యామోహములు, న స్పృశంతి - స్పృశించవు.

ఓ రాజా! పరోపకారపారీణులు, స్వచ్ఛమగు అంతఃకరణము గలవారు అగు భగవద్భక్తులు భగవానుని గుణముల కీర్తనను వినుటకు తొందరపడే మనస్సును కలిగియుందురు. వారు ఎక్కడ ఉండెదరో అక్కడ, మహాత్ములచే కీర్తించబడే మధువైరియగు శ్రీహరియొక్క చరితము అనే శుద్ధమగు అమృతము వరదలై అంతటా పారుచుండును. ఓ మహారాజా! ఆ అమృతమును ఎవరైతే కథాశ్రవణమునందు నిమగ్నమైయున్న చెవులతో తృప్తి లేకుండగా పానము చేసెదరో, వారికి ఆకలి దప్పికలు, భయము, దుఃఖము మరియు వ్యామోహము అనునవి దరి జేరవు.

ఏతైరుపద్రుతో నిత్యం జీవలోకస్స్వభావజైః ।
న కరోతి హరేర్నూనం కథామృతనిధౌ రతిమ్ ॥ 41

స్వభావజైః - స్వభావము (అజ్ఞానము) నుండి పుట్టే, ఏతైః - వీటిచే, నిత్యమ్ - నిత్యము, ఉపద్రుతః - పీడించబడే, జీవలోకః - జీవసమూహము, హరేః - శ్రీహరియొక్క, కథా-అమృతనిధౌ - గాథలు అనే అమృతభాండమునందు, రతిమ్ - ప్రేమను, న కరోతి - చేయుట లేదు, నూనమ్ - నిశ్చయము.

జీవులకు ఈ భయము, శోకము, మోహము అనునవి అజ్ఞానము వలన కలుగుచున్నవి. వీటిచే నిత్యము పీడించబడే జీవులు శ్రీహరి గాథలు అనే అమృతస్రోతస్సునందు ప్రీతిని చేయలేకున్నారు. ఇది నిశ్చయము.

ప్రజాపతిపతిస్సాక్షాద్భగవాన్ గిరిశో మనుః ।
దక్షాదయః ప్రజాధ్యక్షా నైష్ఠికాస్సనకాదయః ॥ 42

మరీచిరత్ర్యంగిరసౌ పులస్త్యః పులహః క్రతుః ।
భృగుర్వశిష్ఠ ఇత్యేతే మదంతా బ్రహ్మవాదినః ॥ 43

అద్యాపి వాచస్పతయస్తపోవిద్యాసమాధిభిః ।
పశ్యంతోఽపి న పశ్యంతి పశ్యంతం పరమేశ్వరమ్ ॥ 44

ప్రజాపతిపతిః - ప్రజాపతులకు ప్రభువగు బ్రహ్మగారు, సాక్షాత్ - సాక్షాత్తుగా, భగవాన్ గిరిశః - కైలాసాధిపతియగు శివభగవానుడు, మనుః - మనువు, దక్ష-ఆదయః - దక్షుడు మొదలగు, ప్రజా-అధ్యక్షాః - ప్రజాపతులు, సనక-ఆదయః - సనకుడు మొదలగు, నైష్ఠికాః - నైష్ఠిక బ్రహ్మచారులు, మరీచిః - మరీచి, అత్రి-అంగిరసౌ - అత్రి అంగిరసుడు, పులస్త్యః - పులస్త్యుడు, పులహః - పులహుడు, క్రతుః - క్రతువు, భృగుః - భృగు మహర్షి, వశిష్ఠః - వశిష్ఠ మహర్షి, ఇతి - ఈ విధమైన, ఏతే - ఈ, మత్-అంతాః - నావరకు గల, వాచస్పతయః - వాఙ్మయమునకు అధిపతులైన, బ్రహ్మవాదినః - వేదవేత్తలు, తపః-విద్యాసమాధిభిః - తపస్సు ఉపాసన సమాధి అనువాటిచే, పశ్యంతః అపి - దర్శనము కొరకు యత్నించుచున్నవారే అయినమా, అద్య అపి - ఈ నాటికి కూడ, పశ్యంతమ్ - దృక్స్వరూపుడగు, పరమేశ్వరమ్ - పరమేశ్వరుని, న పశ్యంతి - కనజాలకున్నారు.

ప్రజాపతులకు ప్రభువగు బ్రహ్మగారు, సాక్షాత్తు కైలాసాధిపతి యగు శివభగవానుడు, స్వాయంభువ మనువు, దక్షుడు మొదలగు ప్రజాపతులు, సనకుడు మొదలగు నైష్ఠిక బ్రహ్మచారులు, మరీచి, అత్రి, అంగిరసుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, భృగువు, వసిష్ఠుడు మరియు నేను మాత్రమే గాక, వాఙ్మయమునంతను ఒడిసిపట్టిన బ్రహ్మవేత్తలెందరో ఆ పరమేశ్వరుని దర్శించుట కొరకై తపస్సును, ఉపాసనను, సమాధిని అనుష్ఠించుచున్నారు. కాని, సర్వసాక్షియగు ఆ పరమేశ్వరుని దర్శనము వారికి అగుట లేదు.

శబ్దబ్రహ్మణి దుష్పారే చరంత ఉరువిస్తరే ।
మంత్రలింగైర్వ్యవచ్ఛిన్నం భజంతో న విదుః పరమ్ ॥ 45

దుష్పారే - తరించ శక్యము కానట్టియు, ఉరువిస్తరే - పెద్ద విస్తారము గల, శబ్దబ్రహ్మణి - శబ్దరూపములోనున్న బ్రహ్మ (వేదము) యందు, చరంతః - అధ్యయనము చేయుచున్నవారు, మంత్రలింగైః - మంత్రముల లోని రూపములచే, వ్యవచ్ఛిన్నమ్ - సీమితమైయున్న, పరమ్ - పరబ్రహ్మను, భజంతః - సేవించుచున్నవారై, న విదుః - తెలియకున్నారు.

వేదము చాల పెద్దది. దానిని అధిగమించుట సంభవము కాదు. అట్టి పరబ్రహ్మరూపమేయగు వేదమును అధ్యయనము చేసిన వేదవేత్తలు మంత్రములలో బోధించబడిన ఈశ్వరుని ఇంద్రాదిపరిచ్ఛిన్నరూపములను యజ్ఞముల ద్వారా సేవించుచున్నారు. కాని, వారు కూడ ఆ పరమేశ్వరుని తత్త్వమును తెలియకున్నారు.

యదా యమనుగృహ్ణాతి భగవానాత్మభావితః ।
స జహాతి మతిం లోకే వేదే చ పరినిష్ఠితామ్ ॥ 46

ఆత్మభావితః - హృదయమునందు ఆరాధించబడిన, భగవాన్ - శ్రీహరి భగవానుడు, యదా - ఏ కాలమునందైతే, యమ్ - ఎవనిని, అనుగృహ్ణాతి - అనుగ్రహించునో, సః - అతడు, లోకే - లోకమునందు, వేదే చ - వేదమునందు కూడ, పరినిష్ఠితామ్ - దృఢముగా ఆసక్తమైయున్న, మతిమ్ - బుద్ధిని, జహాతి - విడిచిపెట్టుచున్నాడు.

హృదయములో ఎవడైతే శ్రీహరి భగవానుని ఆరాధించునో, వానికి ఆ శ్రీహరియొక్క అనుగ్రహము కలుగును. ఆ అనుగ్రహముచే వాని మనస్సులో లోకవ్యవహారములపై మరియు వైదికములగు కామ్యకర్మలపై ఉన్న దృఢమగు ఆసక్తి దూరమగును.

తస్మాత్కర్మసు బర్హిష్మన్నజ్ఞానాదర్థకాశిషు ।
మార్థదృష్టిం కృథాః శ్రోత్రస్పర్శిష్వస్పృష్టవస్తుషు ॥ 47

బర్హిష్మన్ - ఓ ప్రాచీనబర్హిష మహారాజా!, **తస్మాత్** - కావున, అజ్ఞానాత్ - అజ్ఞానము వలన, అర్థకాశిషు - పురుషార్థముగా కానవచ్చునట్టియు, శ్రోత్రస్పర్శిషు - చెవులకు ఇంపుగా వినవచ్చునట్టియు, అస్పృష్టవస్తుషు - స్పృశించబడని పరమాత్మతత్త్వము గల, కర్మసు - కర్మలయందు, అర్థదృష్టిమ్ - పురుషార్థభావనను, మా కృథాః - చేయకుము.

ఓ ప్రాచీనబర్హిష మహారాజా! మానవునకు అజ్ఞానముచే కామ్యకర్మలయందు, ఇవియే పురుషార్థము అనే భ్రమ కలుగును. ఈ కర్మల వలన లభించే ఫలములను బోధించే వాక్యములు వినుటకు ఇంపుగా నున్ననూ, ఇవి పరమాత్మతత్త్వముయొక్క జాడనైననూ అరయజాలవు. కావున, కామ్యకర్మలే పురుషార్థము అనే భావనను కలిగి యుండకుము.

స్వం లోకం న విదుస్తే వై యత్ర దేవో జనార్దనః ।
ఆహుర్ధూమ్రధియో వేదం సకర్మకమతద్విదః ॥ 48

తే - వారు, వై - నిశ్చయముగా, స్వమ్ - ఆత్మరూపమగు, లోకమ్ - లోకమును, న విదుః - తెలియకున్నారు, యత్ర - ఎచ్చోటనైతే, దేవః - స్వయంప్రకాశస్వరూపుడగు, జనార్దనః - జనార్దనుడు గలడో, ధూమ్రధియః - కలుషితమైన బుద్ధిగలవారు, అతత్-విదః - వేదతాత్పర్యమునెరుంగని వారు, వేదమ్ - వేదమును, సకర్మకమ్ - కర్మబోధకమునుగా, ఆహుః - చెప్పుచున్నారు.

కామనలచే కలుషితమైన బుద్ధి గలవారై వేదతాత్పర్యమునెరుంగని అజ్ఞానులు వేదముల తాత్పర్యము కర్మలేనని చెప్పెదరు. అట్టివార

లకు స్వయంప్రకాశస్వరూపుడగు జనార్దనుడే తమ ఆత్మరూపముగాను న్నాడనియు, అట్టి ఆత్మయే శాశ్వతమగు ఆనందలోకమనియు తెలియదు.

**ఆస్తీర్య దర్భైః ప్రాగగ్రైః కార్త్స్న్యేన క్షితిమండలమ్ ।**
**స్తబ్ధో బృహద్వధాన్మానీ కర్మ నావైషి యత్పరమ్ ।**
**తత్కర్మ హరితోషం యత్సా విద్యా తన్మతిర్యయా ॥ 49**

క్షితిమండలమ్ - భూమండలమును, కార్త్స్న్యేన - పూర్తిగా, ప్రాక్-అగ్రైః - తూర్పువైపు కొనలు గల, దర్భైః - దర్భలతో, ఆస్తీర్య - పరిచి, స్తబ్ధః - వినయము లేనివాడవై, బృహత్-వధాత్ - అనేకములగు పశువుల సంహారము వలన, మానీ - అభిమానము గలవాడవై, యత్ - ఏ, పరమ్ - సర్వోత్తమమగు, కర్మ - కర్మ గలదో దానిని, న అవైషి - తెలియకున్నావు, యత్ - ఏది, హరితోషమ్ - శ్రీహరికి ప్రీతికారకమో, తత్ - అదియే, కర్మ - కర్మ, యయా - దేనిచే, తత్-మతిః - ఆ శ్రీహరియందు మనస్సు లగ్నమగునో, సా - అదియే, విద్యా - విద్య.

నీవు భూమండలమునంతను తూర్పువైపు కొనలు గల దర్భలను పరిచి, అనేకములగు పశువులను సంహరించి, నేను గొప్ప గొప్ప యజ్ఞములను చేసితిననే అభిమానముతో గర్వించి యున్నావు. సర్వోత్తమమగు కర్మ ఏదియో నీకు తెలియదు. శ్రీహరికి ప్రీతిని కలిగించునదియే కర్మ. శ్రీహరియందు మనస్సు నిలుచునట్లు చేయునదియే విద్య.

**హరిర్దేహభృతామాత్మా స్వయం ప్రకృతిరీశ్వరః ।**
**తత్పాదమూలం శరణం యతః క్షేమో నృణామిహ ॥ 50**

హరిః - శ్రీహరి, దేహభృతామ్ - ప్రాణులకు, ఆత్మా - ఆత్మ, స్వయమ్ - స్వయముగా, ప్రకృతిః - జగత్కారణము, ఈశ్వరః - జగన్నియంత, తత్-పాదమూలమ్ - ఆయన పాదముల మూలము, శరణమ్ - ఆశ్రయము (రక్షకము), యతః - దేని వలన (యందు), నృణామ్ - మానవులకు, ఇహ - ఇక్కడ, క్షేమః - కల్యాణమో.

జగన్నియంతయగు శ్రీహరియే ప్రాణుల ఆత్మ. ఆయనయే సర్వ జగత్కారణము. ఆయన పాదమూలమే ప్రాణులకు ఆశ్రయము, రక్షకము. ఆ ఆశ్రయమును స్వీకరించు మానవులకు ఈ జన్మలోనే ఇక్కడనే కల్యాణము (జీవన్ముక్తి) కలుగును.

స వై ప్రియతమశ్చాత్మా యతో న భయమణ్వపి ।
ఇతి వేద స వై విద్వాన్ యో విద్వాన్ స గురుర్హరిః ॥ 51

సః - ఆ శ్రీహరియే, వై - నిశ్చయముగా, ప్రియతమః - అత్యంత ప్రియమగు, ఆత్మా - ఆత్మ, యతః - ఎవని వలన, భయమ్ - భయము, అణు అపి - లేశమైననూ, న - లేదో, ఇతి - ఈ విధముగా, యః - ఎవడైతే, వేద - తెలియునో, సః వై - వాడే, విద్వాన్ - జ్ఞాని, సః - అట్టి, విద్వాన్ - జ్ఞాని, గురుః - గురువు, హరిః - శ్రీహరి.

సర్వప్రాణులకు అత్యంతప్రియమైనది ఆత్మ. అట్టి ఆత్మ ఆ శ్రీహరియే. కావున, శ్రీహరి వలన లేశమైననూ భయము లేదు. శ్రీహరియే ఆత్మ అనే ఈ సత్యమును తెలుసుకున్నవాడే జ్ఞాని. జ్ఞాని, శ్రీహరి ఒక్కటియే. అట్టి జ్ఞానియే యథార్థమగు గురువు.

నారద ఉవాచ ।
ప్రశ్న ఏవం హి సంఛిన్నో భవతః పురుషర్షభ ।
అత్ర మే వదతో గుహ్యం నిశామయ సునిశ్చితమ్ ॥ 52

పురుష-ఋషభ - ఓ పురుషశ్రేష్ఠా!, భవతః - నీ, ప్రశ్నః - ప్రశ్న, ఏవమ్ - ఈ విధముగా, సంఛిన్నః - తొలగించబడినది, అత్ర - ఈ సందర్భములో, మే - నేను, సునిశ్చితమ్ - ఖచ్చితముగా నిర్ణయించబడిన, గుహ్యమ్ - రహస్యమును, వదతః - చెప్పగా, నిశామయ - వినుము.

నారద మహర్షి ఇట్లు పలికెను --- ఓ పురుషశ్రేష్ఠా! ఇంతవరకు నేను చెప్పిన దానితో నీ ప్రశ్నకు సమాధానము లభించినది. ఈ సందర్భములో నేను నీకు శాస్త్రజ్ఞులచే ఖచ్చితముగా నిర్ణయించబడిన రహస్యమునొకదానిని చెప్పెదను. వినుము.

క్షుద్రంచరం సుమనసాం శరణే మిథిత్వా
రక్తం షడంఘ్రిగణసామసు లుబ్ధకర్ణమ్ ।
అగ్రే వృకానసుతృపోఽవిగణయ్య యాంతం
పృష్ఠే మృగం మృగయ లుబ్ధకబాణభిన్నమ్ ॥ 53

క్షుద్రంచరమ్ - చిన్న గడ్డి పరకలను తినుచున్నట్టియు, సుమనసామ్ - పుష్పముల, శరణే - వాటికయందు, మిథిత్వా - రహస్యముగా ఆడులేడితో కలుసుకొని, రక్తమ్ - ఆసక్తిని కలిగియున్నట్టియు, షడంఘ్రిగణసామసు - తుమ్మెదల గుంపుల గానములయందు, లుబ్ధకర్ణమ్ - లాలస గల చెవులు కలిగినట్టియు, అగ్రే - ఎదుట, అసుతృపః - ఇతరప్రాణులను చంపి పొట్ట పోసుకొనే, వృకాన్ - తోడేళ్లను, అవిగణయ్య - పరిగణించకుండగా, యాంతమ్ - వెళ్లుచున్నట్టియు, పృష్ఠే - వెనుక, లుబ్ధకబాణభిన్నమ్ - కిరాతుని బాణముచే చీల్చివేయబడిన, మృగమ్ - లేడిని, మృగయ - వెదుకుము.

ఒక మగలేడి చిన్న చిన్న గడ్డి పరకలను గతుకుతూ పుష్పవాటిక వద్దకు వచ్చి అచట ఆడు లేడితో కలిసి విహరించుచుండెను. దానికి తుమ్మెదల గుంపుల గానముపై ప్రీతి మెండు. ఇతరప్రాణులను సంహరించి పొట్ట పోసుకునే తోడేళ్లు యెదుటనే ఉన్ననూ, అది గమనించలేదు. ఇంతలో కిరాతుడు వెనుకనుండి వచ్చి దానిని బాణముతో నేల గూల్చెను. మానవజీవితము ఇట్టిదియే సుమా! గమనించుము.

సుమనస్సధర్మణాం స్త్రీణాం శరణ ఆశ్రమే పుష్పమధుగంధవత్ క్షుద్రతమం కామ్యకర్మవిపాకజం కామసుఖలవం జైహ్వ్యోపస్థ్యాది విచిన్వంతం మిథునీభూయ తదభినివేశిత మనసం షడంఘ్రిగణసామగీతవదతిమనోహరవనితాదిజనాలాపేష్వతితరామతిప్రలోభితకర్ణమగ్రే వృకయూథవదాత్మన ఆయుర్హరతోఽహోరాత్రాదీన్ కాలలవవిశేషానవిగణయ్య గృహేషు విహరంతం పృష్ఠత ఏవ పరోక్షమనుప్రవృత్తో

**లుబ్ధకః కృతాంతోఽంతశ్శరేణ యమిహ పరావిధ్యతి తమిమ**
**మాత్మానమహో రాజన్ భిన్నహృదయం ద్రష్టుమర్హసి॥ 54**

రాజన్ - ఓ రాజా!, సుమనః-సధర్మణామ్ - పువ్వులతో సమాన మగు లక్షణములు గల, స్త్రీణామ్ - యువతులకు, శరణే - ఆశ్రయమగు, ఆశ్రమే - ఇంటియందు, పుష్పమధుగంధవత్ - పువ్వుల తేనెల పరిమళము వలె, క్షుద్రతమమ్ - మిక్కిలి అల్పమైనట్టియు, కామ్యకర్మవిపాకజమ్ - కామ్యకర్మల పరిపక్వత వలన పుట్టినట్టియు, జైహ్వ-ఔపస్థ్య-ఆది - జిహ్వ జననేంద్రియము మొదలగువాటిచే పొందబడే, కామసుఖలవమ్ - కామనల పరిపూర్తిచే లభించే సుఖముయొక్క లేశమును, విచిన్వంతమ్ - వెదుకుచున్నట్టియు, మిథునీభూయ - యువతులతో జత గట్టి, తత్-అభినివేశితమనసమ్ - వారియందు గట్టిగా తగుల్కొన్న మనస్సు కలిగినట్టియు, షడంఘ్రిగణసామగీతవత్-అతిమనోహరవనితా-ఆదిజన-ఆలాపేషు - తుమ్మెదల గుంపుల మధురధ్వనుల వలె మిక్కిలి మనోహరములైన భార్యాపుత్రాదుల కబుర్లయందు, అతితరాం అతిప్రలోభితకర్ణమ్ - అతిశయించిన లాలస గల చెవులు కలిగినట్టియు, అగ్రే - ఎదుట, వృకయూథవత్ - తోడేళ్ల గుంపు వలె, ఆత్మనః - తన, ఆయుః - ఆయుర్దాయమును, హరతః - హరించివేయుచున్న, అహః-రాత్ర-ఆదీన్ - పగలు రాత్రి మొదలగు, కాలలవవిశేషాన్ - విశిష్టములగు చిన్న చిన్న కాలఖండములను, అవిగణయ్య - లెక్కించకుండగా, గృహేషు - ఇంటియందు, విహరంతమ్ - రమించుచున్న, యమ్ - ఎవనిని, పృష్ఠతః ఏవ - వెనుకనే, పరోక్షమ్ - కనబడకుండా, అనుప్రవృత్తః - అనుసరించి వచ్చుచున్న, లుబ్ధకః - కిరాతుడగు, కృతాంతః - యముడు, అంతః - హృదయమునందు, శరేణ - బాణముతో, పరావిధ్యతి - దూరమునుండియే కొట్టుచున్నాడో, తమ్ - అట్టి, ఇమమ్ - ఈ, ఆత్మానమ్ - నిన్ను, ఇహ - ఈ కథలో, భిన్నహృదయమ్ - పగులగొట్టబడిన హృదయము గలవానినిగా, ద్రష్టుమ్ - చూచుటకు, అర్హసి - తగుచున్నావు, ఇతి - అని, అహో - అయ్యో!

ఓ మహారాజా! యువతులే పైన చెప్పిన కథలోని పుష్పములు. పుష్పములకు, యువతులకు సమానలక్షణములు గలవు. యువతులకు

ఆశ్రయమగు గృహమే పుష్పవాటిక. వ్యక్తి లేడితో పోల్చబడినాడు. అతడు తాను చేసుకున్న కామ్యకర్మలు పరిపక్వమైనప్పుడు నాలుక, జననేంద్రియము మొదలగు ఇంద్రియముల ద్వారా ఏవో కొద్దిపాటి ఇంద్రియసుఖములననుభవించును. ఈ అల్పములగు సుఖములు పువ్వులలోని తేనె యొక్క పరిమళముతో పోల్చబడినవి. వ్యక్తి జీవితములో ఇట్టి సుఖముల వెంట పడుచునే యుండును. వీటి కొరకై ఒక యువతితో జతగట్టి ఆమె యందు దృఢమగు ఆసక్తిని పెంచుకొనును. భార్యాపుత్రాదులు అతిమనోహరముగా చెప్పే కబుర్లు తుమ్మెదల గుంపుల మధురధ్వనుల వంటివి. ఆ కబుర్లు చెవులకు చాల ఇంపుగా నుండుటచే, ఆతడు వాటియందు అతిశయించిన లాలసతను కలిగియుండును. రాత్రింబగళ్లు మొదలగు కాలఖండములే ఆతని ముందుండే తోడేళ్ల గుంపు. అవి ఆతని ఆయుర్దాయమును నిరంతరముగా హరించివేయుచున్నవి. కాని, ఆతడా సంగతిని గుర్తించకుండా గృహములోని భోగములయందు లగ్నమై యున్నాడు. వెనుక కనబడకుండా వచ్చే కిరాతుడే యముడు. ఆ యముడు దూరమునుండియే ఆతనిని హృదయములో కొట్టి గాయపరచును. అనగా, ఆతడు భగ్నాశుడై హృదయవేదనను అనుభవించును. అయ్యో! ఈ కథలో రూపక రీతిలో మృగముగా చెప్పబడిన వ్యక్తివి నీవేనని తెలియుము.

స త్వం విచక్ష్య మృగచేష్టితమాత్మనోఽంతః
చిత్తం నియచ్ఛ హృది కర్ణధునీం చ చిత్తే ।
జహ్యంగనాశ్రమమసత్తమయూథగాథం
ప్రీణీహి హంసశరణం విరమ క్రమేణ ॥ 55

సః - అట్టి, త్వమ్ - నీవు, మృగచేష్టితమ్ - ఆ లేడివంటి చేష్టలు గలవానినిగా, విచక్ష్య - చూచి, ఆత్మనః - నీ, హృది - బుద్ధియందు, అంతః - లోపల, చిత్తమ్ - మనస్సును, కర్ణధునీం చ - చెవియొక్క నది వంటి బాహ్యవృత్తిప్రవాహమును, చిత్తే - మనస్సునందు, నియచ్ఛ - నియంత్రించుము, అసత్-తమయూథగాథమ్ - మిథ్యావిషయములలో గట్టిగా తగుల్కొన్నవారి గుంపుల కబుర్లు గల, అంగనా-ఆశ్రమమ్ - గృహస్థాశ్రమమును, జహి - విడిచిపెట్టుము, హంసశరణమ్ - జ్ఞానులకు ఆశ్ర

యమగు శ్రీహరిని, ప్రీణీహి - ప్రసన్నునిగా చేసుకొనుము, క్రమేణ - క్రమముగా, విరమ - నివృత్తుడవు కమ్ము.

ఈ కథలో చెప్పిన లేడికి నీకు ప్రవృత్తిలో తేడా లేదు అని గమనించుము. బాహ్యశబ్దములయందు నిరంతరముగా పయనించే నీ చెవులను మనస్సులో ప్రత్యాహారము చేసి, మనస్సును బుద్ధియందు విలీనము చేయుము. మిథ్యాభోగములయందు గట్టిగా తగుల్కొన్న జనులు గుంపులుగా చేరి భోగములకు సంబంధించిన కబుర్లను చెప్పుకొనుచుందురు. ఇది గృహస్థాశ్రమలక్షణమై యున్నది. దీనిని విడిచిపెట్టుము. క్రమముగా నివృత్తిమార్గమును చేపట్టుము. జ్ఞానులు శరణు జొచ్చే శ్రీహరిని ప్రసన్నునిగా చేసుకొనుము.

ప్రాచీనబర్హిరువాచ ।
శ్రుతమన్వీక్షితం బ్రహ్మన్ భగవాన్ యదభాషత ।
నైతజ్జానంత్యుపాధ్యాయాః కిం న బ్రూయుర్విదుర్యది ॥56

బ్రహ్మన్ - ఓ పూజ్యా!, శ్రుతమ్ - వినబడినది, అను-ఈక్షితమ్ - విచారించబడినది, యత్ - దేనిని, భగవాన్ - పూజ్యుడవగు నీవు, అభాషత - చెప్పినావో, ఉపాధ్యాయాః - కర్మలను బోధించిన ఆచార్యులు, ఏతత్ - దీనిని, న జానంతి - తెలియకున్నారు, యది విదుః - తెలుసుకున్నచో, కిం న బ్రూయుః - ఏల చెప్పకుందురు?

ప్రాచీనబర్హిష మహారాజు ఇట్లు పలికెను --- ఓ మహాత్మా! పూజ్యుడవగు నీవు బోధించిన ఆత్మతత్త్వమును నేను విని, దానిని గురించి ఆలోచించితిని. కర్మలను బోధించే ఆచార్యులు ఈ ఆత్మతత్త్వమును బోధించరు. ఏలయన, వారికి ఇది తెలియదు. తెలిసియున్నచో, వారు ఏల బోధించకుందురు?

సంశయోఽత్ర తు మే విప్ర సంఛిన్నస్తత్కృతో మహాన్ ।
ఋషయోఽపి హి ముహ్యంతి యత్ర నేంద్రియవృత్తయః ॥ 57

విప్ర - ఓ మహాత్మా!, అత్ర - ఈ ఆత్మతత్త్వమునందు, మే - నాకు, తత్-కృతః - ఆ ఉపాధ్యాయులచే కలిగించబడిన, మహాన్ - పెద్ద, సంశయః - సందేహము, సంఛిన్నః - చక్కగా తొలగించబడినది, హి - ఏలయనగా, ఋషయః అపి - మహర్షులు కూడ, ముహ్యంతి - మోహ మును చెందుచున్నారు, యత్ర - దేనియందైతే, ఇంద్రియవృత్తయః - ఇంద్రియవ్యాపారములు, న - ప్రవర్తిల్లవో.

ఓ మహాత్మా! మా ఉపాధ్యాయులు చెప్పిన దానిని బట్టి నాకు ఈ ఆత్మతత్త్వము విషయములో పెద్ద సందేహము ఉండెడిది. దానిని మీరు పూర్తిగా తొలగించినారు. ఈ ఆత్మతత్త్వము విషయములో మహర్షులు కూడ భ్రాంతిపడెదరు. ఏలయన, ఇది ఇంద్రియములకు గోచరము కాదు.

కర్మాణ్యారభతే యేన పుమానిహ విహాయ తమ్ ।
అముత్రాన్యేన దేహేన జుష్టాని స యదశ్నుతే ।। 58

ఇతి వేదవిదాం వాదశ్శ్రూయతే తత్ర తత్ర హ ।
కర్మ యత్క్రియతే ప్రోక్తం పరోక్షం న ప్రకాశతే ।। 59

పుమాన్ - వ్యక్తి, ఇహ - ఈ లోకమునందు, యేన - ఏ దేహము చే, కర్మాణి - కర్మలను, ఆరభతే - ఆరంభించునో, తమ్ - దానిని, విహాయ - విడిచిపెట్టి, సః - ఆ వ్యక్తి, అముత్ర - పరలోకమునందు, అన్యేన - మరియొక, దేహేన - దేహముతో, జుష్టాని - కర్మఫలములను, అశ్నుతే - అనుభవించుచున్నాడని, యత్ - ఏది గలదో, ఇతి - ఈ విధ ముగా, వేదవిదామ్ - వేదవేత్తల, వాదః - కథనము, తత్ర తత్ర హ - అక్క డక్కడ, శ్రూయతే - వినవచ్చుచున్నది, యత్ - ఏ, ప్రోక్తమ్ - వేదవిహిత మైన, కర్మ - కర్మ, క్రియతే - చేయబడుచున్నదో అది, పరోక్షమ్ - కంటికి కానరానిదై, న ప్రకాశతే - ప్రకాశించుట లేదు.

వ్యక్తి ఇహలోకములో ఏ దేహముతో కర్మలను చేయునో, ఆ దేహ మును ఇక్కడనే విడిచిపెట్టి పరలోకమునకు వెళ్లును. అచట ఆతడు మరి యొక దేహముతో ఆ కర్మల ఫలముననుభవించునని వేదవేత్తలు చెప్పు మాటలు అక్కడక్కడ వినవచ్చుచున్నవి. ఇది యెట్లు పొసగును? మనము

వేదవిహితమైన కర్మను చేసిన వెంటనే అది అదృశ్యమగుచున్నది. అది పరలోకములో ఫలరూపముగా ప్రకాశించుట యెట్లు?

నారద ఉవాచ ।
యేనైవారభతే కర్మ తేనైవాముత్ర తత్పుమాన్ ।
భుంక్తే హ్యవ్యవధానేన లింగేన మనసా స్వయమ్ ॥ 60

పుమాన్ - వ్యక్తి, యేన - ఏ, లింగేన - సూక్ష్మశరీరమగు, మనసా - మనస్సుచే, కర్మ - కర్మను, ఆరభతే - ఆరంభించుచున్నాడో, అముత్ర - పరలోకమునందు, స్వయమ్ - తానే, అవ్యవధానేన - విచ్ఛేదము లేని, తేన ఏవ - ఆ సూక్ష్మశరీరముతోనే, తత్ - దానిని, భుంక్తే హి - అనుభవించును.

నారద మహర్షి ఇట్లు పలికెను --- వ్యక్తి ఇహలోకములో కర్తృత్వ భోక్తృత్వవిశిష్టమగు మనస్సుతో సంకల్పించి కర్మలను చేయును. అదే వ్యక్తి స్వయముగా పరలోకములో అదే సూక్ష్మశరీరముతో ఆ కర్మల ఫలమును భోగించును. సూక్ష్మశరీరము ఇహపరలోకములయందు విచ్ఛేదము కాదు.

శయానమిమముత్సృజ్య శ్వసంతం పురుషో యథా ।
కర్మాత్మన్యాహితం భుంక్తే తాదృశేనేతరేణ వా ॥ 61

శయానమ్ - పరుండియున్నట్టియు, శ్వసంతమ్ - గాలిని పీల్చుచున్న, ఇమమ్ - ఈ దేహమును, ఉత్సృజ్య - విడిచిపెట్టి, పురుషః - వ్యక్తి, యథా - ఏ విధముగానైతే, తాదృశేన - అట్టి దేహముతో గాని, ఇతరేణ వా - మరియొక దేహముతో గాని, ఆత్మని - మనస్సునందు, ఆహితమ్ - నిహితమైయున్న, కర్మ - కర్మఫలమును, భుంక్తే - భోగించుచున్నాడో.

వ్యక్తి నిద్రించినప్పుడు ప్రాణము గల ఈ దేహము ఇక్కడనే యుండగా, అతడు స్వప్నములో వాసనచే నిర్మితమైన అటువంటి దేహముతో గాని, లేక మరియొక దేహముతో గాని తన మనస్సులో నిహితమై

యున్న కర్మవాసనలకనురూపముగా సుఖదుఃఖములననుభవించును. అదే విధముగా జీవుడు పరలోకములో మరియొక దేహముతో సూక్ష్మశరీరము నందు నిహితమైయున్న కర్మఫలములను భోగించును.

మమైతే మనసా యద్యదసావహమితి బ్రువన్ ।
గృహ్ణీయాత్తత్పుమాన్ రాద్ధం కర్మ యేన పునర్భవః ॥ 62

ఏతే - వీరు, మమ - నా వారు, అహమ్ - నేను, అసౌ - ఇట్టివాడను, ఇతి - అని, బ్రువన్ - పలుకుచున్నవాడై, మనసా - మనస్సుతో, యత్ యత్ - ఏయే దేహమును, పుమాన్ - వ్యక్తి, గృహ్ణీయాత్ - స్వీకరించునో, తత్ - ఆ దేహము వలన, కర్మ - కర్మ, రాద్ధమ్ - సంపాదించబడినది, యేన - దేనిచే, పునః - మరల, భవః - జన్మ.

మానవుడు ఒక దేహమును తానని మనస్సులో భావించి, ఆ దేహముతో సంబంధము గల ఇతరులను తనవారినిగా స్వీకరించి, ఆ దేహముతో కర్మలను చేయును. ఆ కర్మల వలన ఆతడు మరల జన్మించును.

యథానుమీయతే చిత్తముభయైరింద్రియేహితైః ।
ఏవం ప్రాగ్దేహజం కర్మ లక్ష్యతే చిత్తవృత్తిభిః ॥ 63

ఉభయైః - రెండు విధముల, ఇంద్రియ-ఈహితైః - ఇంద్రియవ్యాపారములచే, యథా - ఏ విధముగానైతే, చిత్తమ్ - మనస్సు, అనుమీయతే - ఊహించబడుచున్నదో, ఏవమ్ - ఇదే విధముగా, ప్రాక్-దేహజమ్ - దేహము పుట్టుటకు ముందు ఉన్న, కర్మ - కర్మ, చిత్తవృత్తిభిః - మనోవృత్తులచే, లక్ష్యతే - ఊహించబడుచున్నది.

కర్మేంద్రియములు మరియు జ్ఞానేంద్రియముల వ్యాపారములను బట్టి మనస్సు అనేది ఒకటి వాటిని ప్రేరేపిస్తూ ఉన్నదని మనము నిర్ధారించవచ్చును. అదే విధముగా, వ్యక్తియొక్క మనస్సులో ఉదయించే పలువిధముల ఆలోచనలను బట్టి, ఈ దేహము పుట్టుటకు ముందు వీనియందు సూక్ష్మముగా కర్మవాసనలు ఉన్నవి అని మనము నిర్ధారించెదము.

నానుభూతం క్వ చానేన దేహేనాదృష్టమశ్రుతమ్ ।
కదాచిదుపలభ్యేత యద్రూపం యాదృగాత్మని ॥ 64

అనేన - ఈ, దేహేన - దేహముతో, క్వ చ - ఎక్కడనైననూ (ఏ కాలమునందైననూ), న అనుభూతమ్ - అనుభవించబడనిది, అదృష్టమ్ - చూడబడనిది, అశ్రుతమ్ - వినబడనిది అగు, యత్-రూపమ్ - ఏ రూపము గలదియో, యాదృక్ - ఎట్టిదియో అది, కదాచిత్ - ఒకప్పుడు, ఆత్మని - మనస్సునందు, ఉపలభ్యేత - అనుభవమునకు రావచ్చును.

ఒకానొక విశిష్టమగు రూపము, విశిష్టలక్షణములు గల అనుభవము వ్యక్తికి ఈ దేహముతో కలిగియుండక పోవచ్చును. దానిని ఆతడు ఇదివరలో ఎక్కడనైననూ ఏ కాలమునందైననూ చూచి గాని, విని గాని యుండక పోవచ్చును. అయిననూ, అట్టిది ఒకప్పుడు మనస్సులో స్వప్నాదులయందు స్ఫురించవచ్చును.

తేనాస్య తాదృశం రాజన్ లింగినో దేహసంభవమ్ ।
శ్రద్ధత్స్వాననుభూతోఽర్థో న మనః స్ప్రష్టుమర్హతి ॥ 65

రాజన్ - ఓ మహారాజా!, తేన - దానిచే, లింగినః - లింగదేహముతో కూడియున్న, అస్య - ఈ వ్యక్తికి, దేహసంభవమ్ - పూర్వదేహము వలన కలిగిన, తాదృశమ్ - అట్టి అనుభవమును, శ్రద్ధత్స్వ - స్వీకరించి తెలుసుకొనుము, అననుభూతః - అనుభవమునకు రాని, అర్థః - విషయము, మనః - మనస్సును, స్ప్రష్టుమ్ - స్పృశించుటకు, న అర్హతి - అర్హము కాదు.

ఓ మహారాజా! ఈ దేహముతో అనుభవమునకు రాని విషయము మనస్సులో స్ఫురించినది. కావున, ఈ వ్యక్తికి పూర్వదేహము ఉండెడిదనియు, ఆ దేహముతో నుండగా సూక్ష్మశరీరమునందు ఆ విషయము అనుభవమునకు వచ్చినదనియు నీవు ఆలోచించి స్వీకరించవలెను. ఏలయనగా, ఇదివరలో అనుభవమునకు రాని విషయము మనస్సులో చూచాయగానైననూ స్ఫురణకు వచ్చుట సంభవము కాదు.

మన ఏవ మనుష్యస్య పూర్వరూపాణి శంసతి ।
భవిష్యతశ్చ భద్రం తే తథైవ న భవిష్యతః ॥ 66

మనుష్యస్య - మానవునకు, మనః ఏవ - మనస్సే, పూర్వరూపాణి - ఇదివరలో అనుభవమునకు వచ్చిన విషయములను, భవిష్యతః చ - భవిష్యత్తులో అనుభవమునకు రాబోయే విషయములను కూడ, తథా ఏవ - అదే విధముగా, న భవిష్యతః - పునర్జన్మ లేకపోవుటయొక్క స్థితిని, శంసతి - సూచించును, తే - నీ కొరకు, భద్రమ్ - మంగళమగు గాక!

మానవునకు తన మనస్సే వివిధవాసనలను బట్టి పూర్వజన్మలో ఇట్టి అనుభవములు ఉండియుండునని సూచించును. అదే విధముగా, శాంతి భయము మొదలగు అవస్థలను బట్టి భవిష్యత్తులో కలుగబోయే శుభాశుభములను కూడ మనస్సు సూచించును. ఇంతే గాక, అతి స్వచ్ఛమగు మనస్సుగల వ్యక్తికి మరల జన్మ లేదనే సంగతిని వాని మనస్సు సూచించును. ఓ రాజా! నీకు మంగళమగు గాక!

అదృష్టమశ్రుతం చాత్ర క్వచిన్మనసి దృశ్యతే ।
యథా తథాऽనుమంతవ్యం దేశకాలక్రియాశ్రయమ్ ॥ 67

అదృష్టమ్ - కనబడనిది, అశ్రుతం చ - వినబడనిది కూడ, క్వచిత్ - ఒకప్పుడు, మనసి - మనస్సునందు, అత్ర - ఈ జన్మయందు, యథా - ఏ విధముగా, దృశ్యతే - అనుభవమునకు వచ్చునో, తథా - అదే విధముగా, దేశకాలక్రియా-ఆశ్రయమ్ - దేశము కాలము కర్మలు ఆశ్రయముగా గలది, అనుమంతవ్యమ్ - ఊహించబడవలసినది.

ఈ జన్మలో గాని, పూర్వజన్మలలో గాని సుతరాము చూచుటకు గాని, వినుటకు గాని సంభవము కాని సంగతి (పర్వతముపై సముద్రము) ఒకప్పుడు మనస్సులో స్ఫురించవచ్చును. ఇట్లు స్ఫురించుటకు కారణము ఆయా దేశకాలక్రియల అయోగ్యమగు సమ్మేళనమేనని ఊహించవలెను.

సర్వే క్రమానురోధేన మనసీంద్రియగోచరాః ।
ఆయాంతి వర్గశో యాంతి సర్వే సమనసో జనాః ॥ 68

ఇంద్రియగోచరాః - ఇంద్రియములచే తెలియబడే విషయములు, సర్వే - అన్ని, క్రమ-అనురోధేన - క్రమానుసారముగా, మనసి - మనస్సునందు, వర్గశః - గుంపులుగా, ఆయాంతి - వచ్చుచుండును, యాంతి - పోవుచుండును, సర్వే - అందరు, జనాః - జనులు, సమనసః - మనస్సుగలవారే.

ఇంద్రియగోచరములగు విషయములు మాత్రమే పుణ్యాపాపముల క్రమముననుసరించి వ్యక్తియొక్క మనస్సులో గుంపులు గుంపులుగా అనుభవమునకు వచ్చి, తొలగి పోవుచుండును. ప్రతి వ్యక్తి వాసనామయమగు లింగశరీరము కలవాడే.

సత్త్వైకనిష్ఠే మనసి భగవత్పార్శ్వవర్తిని ।
తమశ్చంద్రమసీవేదముపరజ్యావభాసతే ॥ 69

సత్త్వ-ఏకనిష్ఠే - సత్త్వగుణమునందు మాత్రమే ఏకాంతమగు నిష్ఠ కలిగినట్టియు, భగవత్-పార్శ్వవర్తిని - భగవంతుని చేరియుండే, మనసి - మనస్సునందు, ఇదమ్ - ఈ జగత్తు, చంద్రమసి - చంద్రుని యందు, ఉపరజ్య - కప్పివేసి, తమః ఇవ - రాహువు వలె, ఉపరజ్య - సంయోగమును పొంది, అవభాసతే - కానవచ్చుచున్నది.

మనస్సు స్వతహాగా సత్త్వగుణప్రధానమైనది. పైగా, అది ఆత్మరూపుడగు భగవానునకు అత్యంతసన్నిహితముగా నున్నది. అయిననూ, ఇట్టి మనస్సునందు, ప్రకాశస్వరూపుడగు చంద్రునియందు రాహువు (ఛాయాగ్రహము) చే కల్పించబడిన గ్రహణము వలె, మిథ్యాభూతమగు జగత్తుతోడి సంయోగము భాసించుచున్నది. లేదా, సాధకుడు సత్త్వగుణప్రధానమగు మనస్సును కలిగియుండి నిరంతరముగా భగవంతుని ధ్యానించుచున్నచో, వాని మనస్సులో ఈ జగత్తు, చంద్రునియందు గ్రహణము వలె, వాస్తవముగా లేకున్ననూ కేవలప్రతీతిమాత్రముగా నుండును.

నాహం మమేతి భావోఽయం పురుషే వ్యవధీయతే ।
యావద్బుద్ధిమనోఽక్షార్థగుణవ్యూహో హ్యనాదిమాన్ ॥ 70

అనాదిమాన్ - ఆది లేని, బుద్ధిమనః-అక్ష-అర్థగుణవ్యూహః - బుద్ధి మనస్సు ఇంద్రియములు విషయములు అనే గుణకార్యముల సమూహము, యావత్ - ఎంతవరకో అంతవరకు, పురుషే - వ్యక్తియందు, అహమ్ - నేను, మమ - నాది, ఇతి - అనే, అయమ్ - ఈ, భావః - అభిమానము, న వ్యవధీయతే - తొలగిపోదు.

బుద్ధి, మనస్సు, ఇంద్రియములు, విషయములు అనే సమూహము (లింగదేహము) సత్త్వరజస్తమోగుణములచే రచించబడి అనాదినుండియు ప్రవర్తిల్లుచున్నది. ఇది ఉన్నంత వరకు వ్యక్తికి, నేను నాది అనే అభిమానము దూరము కాదు.

సుప్తిమూర్ఛోపతాపేషు ప్రాణాయనవిఘాతతః ।
నేహతేఽహమితి జ్ఞానం మృత్యుప్రజ్వారయోరపి ॥ 71

సుప్తిమూర్ఛా-ఉపతాపేషు - నిద్ర మూర్ఛ మరియు తీవ్రశోకములయందు, మృత్యుప్రజ్వారయోః అపి - మరణము మరియు పెద్ద జ్వరమునందు కూడ, ప్రాణ-ఆయనవిఘాతతః - ప్రాణశక్తియే ఆశ్రయముగా గల ఇంద్రియముల వ్యాకులత వలన, అహమ్ - నేను, ఇతి - అనే, జ్ఞానమ్ - స్ఫురణ, న ఈహతే - ప్రవర్తిల్లుట లేదు.

నిద్ర, మూర్ఛ, తీవ్రమగు శోకము, మరణసమయము, పెద్ద జ్వరావేశము అనే ఈ స్థితులలో వ్యక్తికి దేహాభిమానము ఉండదు. దీనికి కారణము అజ్ఞానము లేకపోవుట కాదు. ఈ సందర్భములలో ప్రాణశక్తియే ఆశ్రయముగా గల ఇంద్రియములు వ్యాకులములై యుండుటచే దేహాభిమానము లుప్తమగును.

గర్భే బాల్యేఽప్యపౌష్కల్యాదేకాదశవిధం తదా ।
లింగం న దృశ్యతే యూనః కుహ్వాం చంద్రమసో యథా॥72

గర్భే - గర్భమునందు, బాల్యే అపి - బాల్యమునందు కూడ, యూనః - యువకునియొక్క, ఏకాదశవిధమ్ - పదకొండు విధముల, లింగమ్ - లింగ శరీరము, అపౌష్కల్యాత్ - పూర్తి వికాసము లేనందువల

న, కుహ్వామ్ - అమావాస్యయందు, చంద్రమసః - చంద్రుని, లింగం యథా - రూపము వలె, న దృశ్యతే - ప్రకటమగుట లేదు.

అమావాస్యనాడు చంద్రుడు ఉన్నా ప్రకటముగా కానవచ్చుట లేదు. అదే విధముగా, వ్యక్తి తల్లి గర్భములో నున్నప్పుడు, బాల్యావస్థ యందు కూడ, నేను అనే దేహాభిమానము ప్రకటమగుట లేదు. కాని, యౌవనములో దేహాభిమానము పూర్తిగా ప్రకటమగుచున్నది. దీనికి కారణము అజ్ఞానము లేకపోవుట కాదు. అయిదు కర్మేంద్రియములు, అయిదు జ్ఞానేంద్రియములు, అంతఃకరణము అనే పదకొండు ఇంద్రియముల సముదాయరూపమగు లింగశరీరము ఆ కాలములో ఇంకనూ పూర్తిగా వికసించకపోవుటచేతనే దేహాభిమానము ప్రకటమగుట లేదు.

అర్థే హ్యవిద్యమానేఽపి సంసృతిర్న నివర్తతే ।
ధ్యాయతో విషయానస్య స్వప్నేఽనర్థాగమో యథా ।। 73

విషయాన్ - ఇంద్రియభోగములను గురించి, ధ్యాయతః - చింతిల్లుచున్న, అస్య - వీనికి, అర్థే - విషయము, అవిద్యమానే అపి - లేకున్ననూ, స్వప్నే - స్వప్నమునందలి, అనర్థ-ఆగమః యథా - ఆపద రాక వలె, సంసృతిః - సంసారము, న నివర్తతే - తొలగి పోవుట లేదు.

వ్యక్తికి కలలో ఆపద వచ్చినట్లు కానబడును. అది వాస్తవము కాదు. కాని, దాని వలన దుఃఖము తప్పుట లేదు. అదే విధముగా, అజ్ఞాని భోగాసక్తుడై యుండును. ఈ భోగములు మిథ్యయే గాని, వాస్తవములు కావు. అయిననూ, వాటిని గురించి చింతిల్లుచుండుట వలన సంసారదుఃఖము తప్పుట లేదు.

ఏవం పంచవిధం లింగం త్రివృత్ షోడశవిస్తృతమ్ ।
ఏష చేతనయా యుక్తో జీవ ఇత్యభిధీయతే ।। 74

ఏవమ్ - ఈ విధముగా, పంచవిధమ్ - అయిదు రకములైనట్టియు, త్రివృత్ - మూడు పేటలు కలిగినట్టియు, షోడశవిస్తృతమ్ - పదునారు వికారములుగా విస్తరించియున్న, లింగమ్ - సూక్ష్మశరీరమే, చేత

నయా - చైతన్యముతో, యుక్తః - కూడినదై, ఏషః - ఈ, జీవః - జీవుడు, ఇతి - అని, అభిధీయతే - వ్యవహరించ బడుచున్నది.

ఈ తీరున అయిదు సూక్ష్మభూతములతో నిర్మితమైన సూక్ష్మశరీరము సత్త్వరజస్తమోగుణముల కార్యములగు సుఖదుఃఖమోహములకు ఆశ్రయమగుచున్నది. అదియే అయిదు జ్ఞానేంద్రియములు, అయిదు కర్మేంద్రియములు, అయిదు సూక్ష్మభూతములు, అంతఃకరణము వెరసి పదునారు కళలుగా విస్తరించియున్నది. ఈ లింగశరీరమే ఆత్మచైతన్యముతో కూడి జీవుడు అని వ్యవహరించ బడుచున్నది.

అనేన పురుషో దేహానుపాదత్తే విముంచతి ।
హర్షం శోకం భయం దుఃఖం సుఖం చానేన విందతి ॥ 75

పురుషః - వ్యక్తి, అనేన - ఈ లింగశరీరముతో, దేహాన్ - స్థూలదేహములను, ఉపాదత్తే - స్వీకరించుచున్నాడు, విముంచతి - విడిచిపెట్టు చున్నాడు, చ - మరియు, అనేన - దీనితో, హర్షమ్ - హర్షమును, శోకమ్ - శోకమును, భయమ్ - భయమును, దుఃఖమ్ - దుఃఖమును, సుఖమ్ - సుఖమును, విందతి - పొందుచున్నాడు.

వ్యక్తి ఈ లింగశరీరముతో స్థూలదేహములను స్వీకరించి, విడిచి పెట్టుచుండును. వ్యక్తి దీని ద్వారానే హర్ష (రాబోయే మంచిని గురించి ఉల్లాసము)-శోక (గతమును గురించిన దుఃఖము)-భయ-సుఖ-దుఃఖముల ననుభవించుచుండును.

యథా తృణజలూకేయం నాపయాత్యపయాతి చ ।
న త్యజేన్మ్రియమాణోఽపి ప్రాగ్దేహాభిమతిం జనః ॥ 76

యావదన్యం న విందేత వ్యవధానేన కర్మణామ్ ।
మన ఏవ మనుష్యేంద్ర భూతానాం భవభావనమ్ ॥ 77

యథా - ఏ విధముగానైతే, ఇయమ్ - ఈ, తృణజలూకా - గడ్డిమీద పాకే జలగవంటి పురుగు, న అపయాతి - గడ్డి పరకనుండి తొలగి పోదో, అపయాతి చ - మరియొక గడ్డపోచమీదికి తొలగిపోవునో అదే విధ

ముగా, జనః - జీవుడు, మ్రియమాణః అపి - మరణించబోవుచున్ననూ, ప్రాక్-దేహ-అభిమతిమ్ - పూర్వదేహమునందలి అభిమానమును, న త్యజేత్ - విడిచిపెట్టడు, యావత్ - ఎంతవరకైతే, కర్మణామ్ - కర్మలయొక్క, వ్యవధానేన - విచ్ఛేదముచే, అన్యమ్ - మరియొక దేహమును, న విందేత - పొందడో, మనుష్య-ఇంద్ర - ఓ నరపతీ!, భూతానామ్ - ప్రాణులకు, మనః ఏవ - మనస్సు మాత్రమే, భవభావనః - సంసారహేతువు.

ఓ నరపతీ! గడ్డి మీద పాకే జలగవంటి పురుగు ముందు పోచను పట్టుకొని, ఆపైన వెనుక పోచను విడిచిపెట్టును. అదే విధముగా, ఏ కర్మలు ప్రస్తుత దేహమునారంభించినవో, అవి పూర్తిగా భోగముచే విచ్ఛేదమై, నూతనమగు ప్రారబ్ధకర్మలచే ఈయబడే దేహమును పొందేటంతవరకు, జీవుడు మరణోన్ముఖుడై యున్ననూ, ప్రస్తుతదేహమునందలి అభిమానమును విడిచిపెట్టడు. ఈ విధముగా, ప్రాణులకు మనస్సే సంసారమునకు హేతువు అగుచున్నది.

యదాఽక్షైశ్చరితాన్ ధ్యాయన్ కర్మాణ్యాచినుతేఽసకృత్ ।
సతి కర్మణ్యవిద్యాయాం బంధః కర్మణ్యనాత్మనః ।। 78

యదా - ఏ కాలమునందైతే, అవిద్యాయామ్ - అజ్ఞానమునందు, అనాత్మనః - ఆత్మస్థితి లేనివానికి, కర్మణి - కర్మ, సతి - ఉండగా, అక్షైః - ఇంద్రియములచే, చరితాన్ - భోగించబడిన విషయములను, ధ్యాయన్ - ధ్యానించుచున్నవాడై, కర్మాణి - కర్మలను, ఆచినుతే - చేయుచున్నాడో ఆ కాలమునందు, కర్మణి - కర్మ ఉండగా, అసకృత్ - పలుమార్లు, బంధః - బంధము.

అజ్ఞానియగు వ్యక్తి తన స్వరూపమగు పూర్ణ-ఆత్మయందు నిష్ఠను కలిగియుండజాలడు. అట్టివాడు తనయందు కర్తృత్వమునారోపించుకొని కర్మలను చేయుచుండును. ఆ కర్మల ఫలమును భోగరూపముగా అనుభవించి, మరల వాటిని గురించియే చింతిల్లుచుండును. ఆ విధముగా ఆతడు మరల కర్మలను చేయుచుండును. ఈ విధముగా ఈ కర్మపరంపర

కొనసాగుచుండగా, ఆతడు పలుమార్లు పుట్టి మరణిస్తూ సంసారములో బందీయై యుండును.

అతస్తదపవాదార్థం భజ సర్వాత్మనా హరిమ్
పశ్యంస్తదాత్మకం విశ్వం స్థిత్యుత్పత్త్యప్యయా యతః ॥ 79

అతః - కావున, తత్-అపవాద-అర్థమ్ - ఆ అజ్ఞానముయొక్క నివారణ కొరకై, విశ్వమ్ - జగత్తును, తత్-ఆత్మకమ్ - ఆ శ్రీహరియొక్క రూపముగనే, పశ్యన్ - చూచుచున్నవాడవై, హరిమ్ - శ్రీహరిని, సర్వ-ఆత్మనా - అన్ని విధములుగా (సర్వము శ్రీహరియే అను విధముగా), భజ - సేవించుము, స్థితి-ఉత్పత్తి-అప్యయాః - స్థితి సృష్టి మరియు ప్రళయములు, యతః - ఎవనినుండియో.

ఈ జగత్తు శ్రీహరినుండి పుట్టి శ్రీహరియందే ఉనికి గలదై శ్రీహరియందే విలీనమగును. కావున, ఇది శ్రీహరికంటె భిన్నముగా లేదు. కావున, నీవు ఈ విధముగా జగత్తును సర్వము శ్రీహరియే అని దర్శిస్తూ, అన్ని విధములుగా శ్రీహరిని సేవించి, అజ్ఞానమును పోగొట్టుకొనుము.

మైత్రేయ ఉవాచ ।
భాగవతముఖ్యో భగవాన్నారదో హంసయోర్గతిమ్ ।
ప్రదర్శ్య హ్యాముమామంత్ర్య సిద్ధలోకం తతోఽగమత్ ॥80

భాగవతముఖ్యః - భగవద్భక్తులలో ప్రముఖుడు, భగవాన్ - పూజ్యుడు అగు, నారదః - నారదుడు, హంసయోః - జీవేశ్వరుల, గతిమ్ - తత్త్వమును, ప్రదర్శ్య - నిరూపించి, అముమ్ - ఈ బర్హిష్మత్ మహారాజును, ఆమంత్ర్య - సెలవు తీసుకొని, తతః - తరువాత, సిద్ధలోకమ్ - సిద్ధులుండే లోకమును గురించి, అగమత్ - వెళ్లెను.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- పూజ్యుడగు నారదుడు భగవద్భక్తులలో అగ్రేసరుడు. ఆయన ఈ విధముగా ప్రాచీనబర్హిష మహారాజునకు జీవేశ్వరుల తత్త్వమును బోధించి, తరువాత సిద్ధలోకమునకు వెళ్లెను.

ప్రాచీనబర్హీ రాజర్షిః ప్రజాసర్గాభిరక్షణే ।
ఆదిశ్య పుత్రానగమత్తపసే కపిలాశ్రమమ్ ।। 81

రాజర్షిః - రాజర్షియగు, ప్రాచీనబర్హిః - ప్రాచీనబర్హిషుడు, ప్రజాసర్గ -అభిరక్షణే - వంశమును నిలబెట్టుట మరియు ప్రజలను పాలించుటయందు, పుత్రాన్ - కొడుకులను, ఆదిశ్య - ఆదేశించి, తపసే - తపస్సు కొరకు, కపిల-ఆశ్రమమ్ - కపిల భగవానుని ఆశ్రమమును గురించి, అగమత్ - వెళ్లెను.

రాజర్షియగు ప్రాచీనబర్హిషుడు తన కొడుకులకు వంశమును నిలబెట్టుడనియు, ప్రజలను పాలించుడనియు ఆదేశించి, తపస్సు కొరకై కపిల భగవానుని ఆశ్రమమునకు వెళ్లెను.

తత్రైకాగ్రమనా వీరో గోవిందచరణాంబుజమ్ ।
విముక్తసంగోఽనుభజన్ భక్త్యా తత్సామ్యతామగాత్ ।। 82

వీరః - వీరుడు, విముక్తసంగః - విడిచిపెట్టబడిన సంసారాసక్తి గలవాడు అగు ప్రాచీనబర్హిషుడు, తత్ర - అచట, ఏకాగ్రమనాః - ఏకాగ్రమగు మనస్సు గలవాడై, గోవిందచరణ-అంబుజమ్ - గోవిందుని పాదపద్మమును, భక్త్యా - భక్తితో, అను - ప్రతిక్షణము, భజన్ - సేవించుచున్నవాడై, తత్-సామ్యతామ్ - ఆయనతోడి ఐక్యమును, అగాత్ - పొందెను.

వీరుడగు ప్రాచీనబర్హిషుడు సంసారాసక్తిని విడిచిపెట్టి ఆ కపిలాశ్రమములో ఏకాగ్రమగు చిత్తముతో గోవిందుని పాదపద్మములను భక్తిపూర్వకముగా అనుక్షణము సేవించి, ఆయనలో ఐక్యమయ్యెను.

ఏతదధ్యాత్మపారోక్ష్యం గీతం దేవర్షిణాఽనఘ ।
యశ్శ్రావయేద్యశ్శృణుయాత్స లింగేన విముచ్యతే ।। 83

అనఘ - ఓ పుణ్యాత్మా!, దేవ-ఋషిణా - దేవర్షియగు నారదునిచే, గీతమ్ - కీర్తించబడిన, ఏతత్ - ఈ, అధ్యాత్మపారోక్ష్యమ్ - ఆత్మతత్త్వముయొక్క పరోక్షమగు కథనమును, యః - ఎవడైతే, శ్రావయేత్ - వినిపిం

చునో, యః - ఎవడైతే, శృణుయాత్ - వినునో, సః - ఆతడు, లింగేన - లింగశరీరముచే, విముచ్యతే - విడిచిపెట్టబడును.

ఓ పుణ్యాత్మా! దేవర్షియగు నారదుడు కీర్తించిన ఈ ఆత్మతత్త్వ ముయొక్క పరోక్షకథనమును ఎవడైతే వినునో, లేక వినిపించునో, ఆతడు లింగశరీరవిముక్తిని (మోక్షమును) పొందును.

ఏతన్ముకుందయశసా భువనం పునానం
దేవర్షివర్యముఖనిస్సృతమాత్మశౌచమ్ ।
యః కీర్త్యమానమధిగచ్ఛతి పారమేష్ఠ్యం
నాస్మిన్ భవే భ్రమతి ముక్తసమస్తబంధః ।। 84

ముకుందయశసా - మోక్షమునిచ్చే శ్రీహరియొక్క కీర్తిచే, భువనమ్ - జగత్తును, పునానమ్ - పావనము చేయునట్టియు, దేవర్షివర్యముఖనిస్సృతమ్ - దేవర్షులలో శ్రేష్ఠుడగు నారదుని ముఖమునుండి వెలువడినట్టియు, ఆత్మశౌచమ్ - అంతఃకరణశుద్ధిని కలిగించునట్టియు, పారమేష్ఠ్యమ్ - పరమాత్మను పొందించే, ఏతత్ - ఈ గాథను, కీర్త్యమానమ్ - కీర్తింపబడుచున్నదానిని, యః - ఎవడైతే, అధిగచ్ఛతి - చక్కగా తెలుసుకొనునో ఆతడు, ముక్తసమస్తబంధః - విడిచిపెట్టబడిన అన్ని బంధములు గలవాడై, అస్మిన్ - ఈ, భవే - సంసారమునందు, న భ్రమతి - పరిభ్రమించడు.

దేవర్షులలో శ్రేష్ఠుడగు నారదుని ముఖమునుండి వెలువడిన ఈ గాథ మోక్షప్రదాతయగు శ్రీహరియొక్క కీర్తిచే లోకమును పావనము చేయుచున్నది. ఇది సాధకునకు అంతఃకరణశుద్ధి ద్వారా మోక్షపదమునొసంగును. దీనిని మహాత్ములు కీర్తించుచుండగా తెలుసుకున్న సాధకుడు సకలబంధములనుండి విముక్తిని పొందును. వానికి తిరిగి ఈ సంసారములో పరిభ్రమణము ఉండదు.

అధ్యాత్మపారోక్ష్యమిదం మయాఽధిగతమద్భుతమ్ ।
ఏవం స్త్రియాఽఽశ్రమః పుంసశ్ఛిన్నోఽముత్ర చ సంశయః ।।85

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే చతుర్థస్కంధే
పురంజనోపాఖ్యానే ప్రాచీనబర్హిషనారదసంవాదో
నామ ఏకోనత్రింశో ఽధ్యాయః ॥

అద్భుతమ్ - ఆశ్చర్యకరమగు, ఇదమ్ - ఈ, అధ్యాత్మపారోక్ష్యమ్ - ఆత్మతత్త్వముయొక్క పరోక్షకథనము, మయా - నాచే, అధిగతమ్ - పొందబడినది, ఏవమ్ - ఈ విధముగా, స్త్రియా - బుద్ధితో కూడియున్న, పుంసః - వ్యక్తికి, ఆశ్రమః - దేహాభిమానము, చ - మరియు, అముత్ర - పరలోకమునందు, సంశయః - సంశయము, ఛిన్నః - ఛేదించబడినది.

ఆత్మతత్త్వముయొక్క ఈ పరోక్షకథనము ఆశ్చర్యకరమైనది. దీనిని నేను పొంది నీకు చెప్పితిని. దీని వలన సాధకునకు బుద్ధితోడి తాదాత్మ్యము వలన కలిగే దేహాభిమానము నష్టమై జీవన్ముక్తి కలుగును. మరియు పరలోకము విషయములో ఉండే సందేహములు తొలగిపోవును.

శ్రీమద్భాగవత మహాపురాణములో నాల్గవ స్కంధమునందలి
పురంజనోపాఖ్యానములో ప్రాచీనబర్హిషునకు నారదుని ఉపదేశమును
వర్ణించే ఇరువది తొమ్మిదవ అధ్యాయము ముగిసినది (29).

*****

## అథ త్రింశోఽధ్యాయః

## ప్రచేతసులు శ్రీహరిని దర్శించి స్తుతించుట

విదుర ఉవాచ ।
యే త్వయాఽభిహితా బ్రహ్మన్ సుతాః ప్రాచీనబర్హిషః ।
తే రుద్రగీతేన హరిం సిద్ధిమాపుః ప్రతోష్య కామ్ ॥ 1

బ్రహ్మన్ - ఓ మహర్షీ!, యే- ఏ, ప్రాచీనబర్హిషః - ప్రాచీనబర్హిషుని, సుతాః - పుత్రులు, త్వయా - నీచే, అభిహితాః - ఉపదేశించబడిరో, తే - వారు, రుద్రగీతేన - రుద్రగీతముచే, హరిమ్ - శ్రీహరిని, ప్రతోష్య - ప్రసన్నునిగా చేసుకొని, కామ్ - ఎట్టి, సిద్ధిమ్ - సిద్ధిని, ఆపుః - పొందిరి?

విదురుడిట్లు పలికెను --- ఓ మహర్షీ! ప్రాచీనబర్హిషుని పుత్రులు నీ సలహా ప్రకారముగా రుద్రుని ఉపదేశమును అనుష్ఠించి, శ్రీహరిని ప్రసన్నునిగా చేసుకొని సిద్ధిని బడసినారు గదా! ఆ సిద్ధి యెట్టిది?

కిం బార్హస్పత్యేహ పరత్ర వాఽథ
కైవల్యనాథప్రియపార్శ్వవర్తినః ।
ఆసాద్య దేవం గిరిశం యదృచ్ఛయా
ప్రాపుః పరం నూనమథ ప్రచేతసః ॥ 2

బార్హస్పత్య - బృహస్పతి శిష్యుడవగు ఓ మైత్రేయా!, ప్రచేతసః - ప్రచేతసులు, యదృచ్ఛయా - అనుకోకుండా, గిరిశమ్ - కైలాసపతియగు, దేవమ్ - శివదేవుని, ఆసాద్య - కలుసుకొని, కైవల్యనాథప్రియపార్శ్వవర్తినః - మోక్షమునిచ్చే ప్రభువగు శ్రీహరికి ప్రియుడైన శివుని ప్రక్కనే ఉన్నవారు, అథ - అందువలన, నూనమ్ - నిశ్చయముగా, పరమ్ - సర్వో

త్కృష్టమగు పురుషార్థము (మోక్షము) ను, ప్రాపుః - పొందిరి, ఇహ - ఈ లోకమునందు, అథవా - లేక, పరత్ర - పరలోకమునందు, కిమ్ - దేనిని (పొందిరి?)

బృహస్పతి శిష్యుడవగు ఓ మైత్రేయా! ప్రచేతసులు అనుకోకుండా (ఈశ్వరేచ్ఛచే) కైలాసాధిపతియగు శివదేవుని దర్శనమును పొందిరి. మోక్షమునిచ్చే ప్రభుడగు శ్రీహరికి శివుడు ప్రియుడు. అట్టి శివుని అనుగ్రహముచే వారు తప్పక పరమపురుషార్థమగు మోక్షమును నిశ్చయముగా పొందియే యుందురు. కాని, దానికి ముందు ఇహపరలోకములలో వారికి లభించిన సిద్ధి యెట్టిది?

మైత్రేయ ఉవాచ ।
ప్రచేతసోఽంతరుదధౌ పితురాదేశకారిణః ।
జపయజ్ఞేన తపసా పురంజనమతోషయన్ ॥ 3

పితుః - తండ్రియొక్క, ఆదేశకారిణః - ఆదేశమును పాలించే, ప్రచేతసః - ప్రచేతసులు, ఉదధౌ - సముద్రమునందు, అంతః - లోపల, జపయజ్ఞేన - జపయజ్ఞరూపమగు, తపసా - తపస్సుచే, పురంజనమ్ - సకలజగత్సృష్టికర్తయగు శ్రీహరిని, అతోషయన్ - ప్రీతునిగా చేసుకొనిరి.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- తండ్రి ఆదేశమును పాలించే ప్రచేతసులు సముద్రము లోపల జపయజ్ఞరూపమగు తపస్సును చేసి, సృష్టికి మూలపురుషుడగు శ్రీహరిని ప్రసన్నునిగా చేసుకొనిరి.

దశవర్షసహస్రాంతే పురుషస్తు సనాతనః ।
తేషామావిరభూత్కృచ్ఛ్రం శాంతేన శమయన్ రుచా ॥ 4

దశవర్షసహస్ర-అంతే - పదివేల సంవత్సరములు పూర్తి అయిన తరువాత, సనాతనః - కాలాతీతుడు, పురుషః - పూర్ణుడు అగు శ్రీహరి, రుచా - కాంతితో, కృచ్ఛ్రమ్ - క్లేశమును, శమయన్ - తొలగించుచు[illegible] వాడై, శాంతేన - సత్త్వప్రధానమగు రూపముతో, తేషామ్ - వారికి, ఆ[illegible]ర భూత్ - సాక్షాత్కరించెను.

వారు పదివేల సంవత్సరములు తపస్సును చేసిన పిదప శ్రీహరి వారికి శాంతమగు రూపముతో సాక్షాత్కరించెను. కాలమునకు అతీతుడు, పూర్ణుడు అగు ఆయనయొక్క కాంతి వారి తపఃక్లేశమును చల్లార్చెను.

సుపర్ణస్కంధమారూఢో మేరుశృంగమివాంబుదః ।
పీతవాసా మణిగ్రీవః కుర్వన్ వితిమిరా దిశః ॥ 5

అంబుదః - మేఘము, మేరుశృంగం ఇవ - మేరుపర్వతశిఖరమును వలె, సుపర్ణస్కంధమ్ - గరుత్మంతుని భుజమును, ఆరూఢః - అధిష్ఠించినవాడు, పీతవాసాః - పచ్చని వస్త్రము గలవాడు, మణిగ్రీవః - కౌస్తుభము మెడయందు గలవాడు, దిశః - దిక్కులను, వితిమిరాః - తొలగిన చీకట్లు కలవిగా, కుర్వన్ - చేయుచున్నవాడు.

పచ్చని వస్త్రమును దాల్చి గరుత్మంతుని స్కంధములపై అధిష్ఠించిన శ్రీహరి మేరుపర్వత శిఖరముపైనుండే మేఘమువలె నున్నాడు. మెడలో కౌస్తుభమాణిక్యమును దాల్చిన ఆయన తన కాంతిచే దిక్కులలోని చీకట్లను పారద్రోలుచుండెను.

కాశిష్ణునా కనకవర్ణవిభూషణేన
భ్రాజత్కపోలవదనో విలసత్కిరీటః ।
అష్టాయుధైరనుచరైర్మునిభిస్సురేంద్రైః
ఆసేవితో గరుడకిన్నరగీతకీర్తిః ॥ 6

కాశిష్ణునా - ప్రకాశించుచున్న, కనకవర్ణవిభూషణేన - బంగరు రంగురంగుల ఆభరణముచే, భ్రాజత్-కపోలవదనః - విరాజిల్లే చెక్కిళ్లు గల ముఖము గలవాడు, విలసత్-కిరీటః - ప్రకాశించే కిరీటము గలవాడు, అష్ట-ఆయుధైః - ఎనిమిది ఆయుధములచే, అనుచరైః - అనుచరులచే, మునిభిః - మహర్షులచే, సుర-ఇంద్రైః - లోకపాలకులచే, ఆసేవితః - అంతటా సేవించబడుచున్నవాడు, గరుడకిన్నరగీతకీర్తిః - గరుడుడనే కిన్నరునిచే గానము చేయబడిన కీర్తి గలవాడు.

రంగురంగుల మణులు పొదిగిన బంగరు ఆభరణముచే ఆయన చెక్కిళ్లు మరియు ముఖము ప్రకాశించుచుండెను. ఆయన తలపై కిరీటము, చేతులయందు ఎనిమిది ఆయుధములు విరాజిల్లుచుండెను. ఆయన చుట్టూ అనుచరులు, మహర్షులు మరియు లోకపాలకులు సేవించుచుండిరి. గరుడుడే కిన్నరుడై ఆయన కీర్తిని గానము చేయుచుండెను.

పీనాయతాష్టభుజమండలమధ్యలక్ష్మ్యా
స్పర్ధచ్ఛ్రియా పరివృతో వనమాలయాద్యః ।
బర్హిష్మతః పురుష ఆహ సుతాన్ ప్రపన్నాన్
పర్జన్యనాదరుతయా సఘృణావలోకః ॥ 7

పీన-ఆయత-అష్టభుజమండలమధ్యలక్ష్మ్యా - బలిసిన పొడవైన ఎనిమిది భుజముల సమూహమునకు మధ్యలోనున్న లక్ష్మీదేవితో, స్పర్ధత్-శ్రియా - పోటీపడుచున్న శోభ గల, వనమాలయా - వనమాలతో, పరివృతః - చుట్టువారబడియున్నవాడు, ఆద్యః - సర్వజగత్కారణుడు, పురుషః - పూర్ణుడు అగు శ్రీహరి, సఘృణా-అవలోకః - దయతో గూడిన చూపు గలవాడై, ప్రపన్నాన్ - శరణు పొందిన, బర్హిష్మతః సుతాన్ - బర్హిష్మంతుని పుత్రులగు ప్రచేతసులను ఉద్దేశించి, పర్జన్యనాదరుతయా - మేఘగర్జనవంటి ధ్వనితో, ఆహ - పలికెను.

శ్రీహరియొక్క ఎనిమిది బలిసిన పొడవాటి భుజముల మధ్యలో లక్ష్మీదేవి, వనమాల కాంతిలో ఒకదానితోనొకటి పోటీ పడుచుండెను. సర్వజగత్కారణుడు, పూర్ణుడు అగు శ్రీహరి తనను శరణు జొచ్చిన బర్హిష్మంతుని పుత్రులగు ప్రచేతసులను కృపాదృష్టితో చూచి, మేఘగర్జనవంటి వాక్కుతో వారితోనిట్లనెను.

శ్రీభగవానువాచ ।
వరం వృణీధ్వం భద్రం వో యూయం మే నృపనందనాః ।
సౌహార్దేనాఽపృథగ్ధర్మాస్తుష్టోఽహం సౌహృదేన వః ॥

నృపనందనాః - రాజకుమారులారా!, సౌహార్దేన - ప్రేమచే, అపృథక్-ధర్మాః - భిన్నము కాని ధర్మము గల, యూయమ్ - మీరు, మే - నానుండి, వరమ్ - వరమును, వృణీధ్వమ్ - కోరుకొనుడు, వః - మీ కొరకు, భద్రమ్ - మంగళమగు గాక!, వః - మీయొక్క, సౌహృదేన - స్నేహభావముచే, అహమ్ - నేను, తుష్టః - సంతసించినవాడను.

శ్రీభగవానుడిట్లు పలికెను --- ఓ రాజకుమారులారా! మీరు అన్యోన్యము ప్రేమ గలవారై అందరు కలిసి ఒకే ధర్మమును పాటించుచున్నారు. మీ ఈ పరస్పరస్నేహభావముచే నేను సంతసించితిని. మీరు నానుండి వరమును కోరుకొనుడు. మీకు మంగళమగు గాక!

యోఽనుస్మరతి సంధ్యాయాం యుష్మాననుదినం నరః ।
తస్య భ్రాతృష్వాత్మసామ్యం తథా భూతేషు సౌహృదమ్ ॥9

యః - ఏ, నరః - మానవుడు, సంధ్యాయామ్ - సంధ్యాకాలమునందు, అనుదినమ్ - ప్రతిదినము, యుష్మాన్ - మిమ్ములను, అనుస్మరతి - స్మరించుచున్నాడో, తస్య - వానికి, భ్రాతృషు - సోదరులయందు, ఆత్మసామ్యమ్ - తనతోడి సమత్వము, తథా - మరియు, భూతేషు - ప్రాణులయందు, సౌహృదమ్ - ప్రేమ.

ఏ మానవుడైతే ప్రతిదినము సంధ్యాకాలమునందు మిమ్ములను స్మరించునో, వానికి తన సోదరులయందు ఆత్మసమమగు ప్రీతి కలుగును. మరియు, వానికి సకలప్రాణులయందు ప్రేమ ఉదయించును.

యే తు మాం రుద్రగీతేన సాయం ప్రాతస్సమాహితాః ।
స్తువంత్యహం కామవరాన్ దాస్యే ప్రజ్ఞాం చ శోభనామ్ ॥10

యే తు - ఎవరైతే, సాయమ్ - సాయంకాలము, ప్రాతః - ఉదయము, సమాహితాః - ఏకాగ్రమగు చిత్తము గలవారై, రుద్రగీతేన - రుద్రగీతముతో, మామ్ - నన్ను, స్తువంతి - స్తుతించుచున్నారో వారికి, అహమ్ - నేను, కామవరాన్ - కోరిన వరములను, చ - మరియు, శోభనామ్ - శోభిల్లే, ప్రజ్ఞామ్ - బుద్ధిశక్తిని, దాస్యే - ఈయగలను.

ఎవరైతే ఉదయము సాయంకాలము నన్ను ఏకాగ్రచిత్తులై రుద్రగీతముతో స్తుతించెదరో, వారికి నేను కోరిన వరములను మాత్రమే గాక చక్కటి బుద్ధిశక్తిని కూడ అనుగ్రహించెదను.

యద్యూయం పితురాదేశమగ్రహీష్ట ముదాన్వితాః ।
అథో వ ఉశతీ కీర్తిర్లోకాననుభవిష్యతి ॥ 11

యత్ - ఎందువలనైతే, యూయమ్ - మీరు, ముదా - ఆనందముతో, అన్వితాః - కూడుకున్నవారై, పితుః - తండ్రియొక్క, ఆదేశమ్ - ఆదేశమును, అగ్రహీష్ట - స్వీకరించిరో, అథో - అందువలన, వః - మీకు, ఉశతీ - మంచి, కీర్తిః - కీర్తి, లోకాన్ అను - లోకములననుసరించి, భవిష్యతి - కలుగగలదు.

మీరు తండ్రియొక్క ఆదేశమును ఆనందముగా స్వీకరించిరి. కావున, మీయొక్క గొప్ప కీర్తి లోకములలో వ్యాపించగలదు.

భవితా విశ్రుతః పుత్రోఽనవమో బ్రహ్మణో గుణైః ।
య ఏతామాత్మవీర్యేణ త్రిలోకీం పూరయిష్యతి ॥ 12

విశ్రుతః - ప్రఖ్యాతిని చెందువాడు, గుణైః - గుణములచే, బ్రహ్మణః - బ్రహ్మగారికి, అనవమః - తక్కువ కానివాడు అగు, పుత్రః - పుత్రుడు, భవితా - కలుగగలడు, యః - ఎవడైతే, ఆత్మవీర్యేణ - తన సంతానముచే, ఏతామ్ - ఈ, త్రిలోకీమ్ - ముల్లోకములను, పూరయిష్యతి - నింపగలడో.

మీకు ఒక పుత్రుడు కలుగును. ఆతడు గుణములలో బ్రహ్మకు తక్కువ కాబోడు. గొప్ప ప్రఖ్యాతిని బడసే ఆతడు తన సంతానముతో ఈ ముల్లోకములను నింపును.

కండోః ప్రమ్లోచయా లబ్ధా కన్యా కమలలోచనా ।
తాం చాపవిద్ధాం జగృహుర్భూరుహా నృపనందనాః ॥ 13

నృపనందనాః - రాజకుమారులారా!, ప్రమ్లోచయా - ప్రమ్లోచచే, కండోః - కండుమహర్షినుండి, కమలలోచనా - కలువకన్నుల, కన్యా - కన్య, లబ్ధా - పొందబడినది, అపవిద్ధామ్ - పారవేయబడిన, తామ్ - ఆ కన్యను, భూరుహాః - చెట్లు, జగృహుః - స్వీకరించినవి.

ఓ రాజకుమారులారా! ప్రమ్లోచ అనే అప్సరసకు కండు మహర్షి వలన కలువ కన్నుల చిన్నది జన్మించెను. కాని ఆమె ఆ పిల్లను అడవిలో విడిచిపెట్టగా, చెట్లు ఆ శిశువును స్వీకరించినవి.

క్షుత్క్షామాయా ముఖే రాజా సోమః పీయూషవర్షిణీమ్ ।
దేశినీం రోదమానాయా నిదధే స దయాన్వితః ॥ 14

క్షుత్-క్షామాయాః - ఆకలిచే చిక్కియున్నట్టియు, రోదమానాయాః - ఏడ్చుచున్న ఆ పిల్లయొక్క, ముఖే - నోటియందు, రాజా - ఓషధులకు ప్రభువగు, సోమః - చంద్రుడు, దయా-అన్వితః - దయతో గూడినవాడై, పీయూషవర్షిణీమ్ - అమృతమును స్రవించే, దేశినీమ్ - చూపుడు వ్రేలును, నిదధే - ఉంచెను.

ఆ శిశువు ఆకలితో బాధపడి ఏడ్చుచుండెను. అపుడు ఓషధులకు ప్రభువగు చంద్రుడు దయ గలవాడై అమృతమును స్రవించే తన చూపుడు వ్రేలును ఆ శిశువు నోటిలోనుంచెను.

ప్రజావిసర్గ ఆదిష్టాః పిత్రా మామనువర్తతా ।
తత్ర కన్యాం వరారోహాం తాముద్వహత మా చిరమ్ ॥ 15

మామ్ - నన్ను, అనువర్తతా - అనుసరించే, పిత్రా - తండ్రిచే, ప్రజావిసర్గే - సంతానమును కనుటయందు, ఆదిష్టాః - ఆదేశించబడిన మీరు, తత్ర - ఆ సందర్భములో, వరారోహామ్ - సుందరియగు, తామ్ - ఆ, కన్యామ్ - కన్యను, ఉద్వహత - వివాహమాడుడు, మా చిరమ్ - ఆలస్యమును చేయకుడు.

మీ తండ్రియగు ప్రాచీనబర్హిషుడు నా ఆజ్ఞను పాలించే భక్తుడు. సంతానమును కనుడని మిమ్ములను ఆయన ఆదేశించినాడు. కావున, మీరు సుందరియగు ఆ కన్యను వివాహమాడుడు. విలంబము చేయకుడు.

**అపృథగ్ధర్మశీలానాం సర్వేషాం వస్సుమధ్యమా ।**
**అపృథగ్ధర్మశీలేయం భూయాత్పత్న్యర్పితాశయా ।। 16**

అపృథక్-ధర్మశీలానామ్ - వేర్వేరు కాని ధర్మము మరియు స్వభావము గల, వః - మీకు, సర్వేషామ్ - అందరికి, సుమధ్యమా - చక్కని నడుము గలది, అపృథక్-ధర్మశీలా - వేరు కాని ధర్మము మరియు స్వభావము గలది అగు, ఇయమ్ - ఈమె, అర్పిత-ఆశయా - అర్పించబడిన హృదయము గల, పత్నీ - భార్య, భూయాత్ - అగుగాక!

మీరు అందరు కలిసి ఒకే ధర్మమును పాటిస్తూ ఒకే స్వభావమును కలిగియున్నారు. మీతో సమానమగు ధర్మము మరియు శీలము గల ఈ సుందరి కూడ మీకే తన హృదయమునర్పించగలదు. ఆమె మీకు భార్య యగుగాక!

**దివ్యవర్షసహస్రాణాం సహస్రమహతౌజసః ।**
**భౌమాన్ భోక్ష్యథ భోగాన్ వై దివ్యాంశ్చానుగ్రహాన్మమ ।।17**

దివ్యవర్షసహస్రాణాం సహస్రమ్ - పది లక్షల దేవసంవత్సరముల కాలము, అహత-ఓజసః - నశించని బలము గలవారై, మమ - నా, అనుగ్రహాత్ - అనుగ్రహము వలన, భౌమాన్ - భూలోకమునందలి, దివ్యాన్ - దేవలోకమునందలి, భోగాన్ చ - భోగములను కూడ, భోక్ష్యథ - అనుభవించుడు.

మీరు నా అనుగ్రహము వలన పది లక్షల దేవసంవత్సరముల కాలము తగ్గని బలము గలవారై, భూలోకమునందలి భోగములను మాత్రమే గాక దేవభోగములను కూడ అనుభవించుడు.

**అథ మయ్యనపాయిన్యా భక్త్యా పక్వగుణాశయాః ।**
**ఉపయాస్యథ మద్ధామ నిర్విద్య నిరయాదతః ।। 18**

అథ - తరువాత, మయి - నాయందు, అనపాయిన్యా - నిరంతరముగా కొనసాగే, భక్త్యా - భక్తిచే, పక్వగుణ-ఆశయాః - దహించబడిన కోరికలు మొదలగు మాలిన్యము గల (పరిపక్వమైన త్రిగుణాత్మకమగు) హృదయము గలవారై, అతః - ఈ, నిరయాత్ - నరకమునుండి, నిర్విద్య - వైరాగ్యమును పొంది, మత్-ధామ - నా స్వరూపమును, ఉపయాస్యథ - చేరుకొనగలరు.

మీరు నాయందు నిరంతరమగు భక్తిని చేసెదరు. దాని ప్రభావముచే త్రిగుణాత్మకమగు మీ అంతఃకరణము పరిపక్వమై దానిలోని కామనలు మొదలగు మాలిన్యములు నశించును. అపుడు మీకు నరకతుల్యమగు ఈ భోగములయందు వైరాగ్యము కలుగును. అప్పుడు మీరు నా స్వరూపమునందు ఐక్యము కాగలరు.

గృహేష్వావిశతాం చాపి పుంసాం కుశలకర్మణామ్ ।
మద్వార్తాయాతయామానాం న బంధాయ గృహా మతాః ॥19

కుశలకర్మణామ్ - ధర్మాధర్మవివేకపూర్వకమగు కర్మలు కలిగినట్టియు, మత్-వార్తాయాతయామానామ్ - నా గాథలతో గడిచిపోయే జాములు గల, పుంసామ్ - వ్యక్తులకు, గృహేషు - ఇంటియందు, ఆవిశతాం చ అపి - ప్రవేశించినవారికి కూడ, గృహాః - ఇల్లు, బంధాయ - బంధము కొరకు అని, న మతాః - చెప్పబడలేదు.

మానవుడు ధర్మాధర్మవివేకపూర్వకముగా కర్మలను చేస్తూ, భగవచ్చింతనలో కాలమును గడుపవలెను. అట్లు చేయువారలకు గృహస్థాశ్రమమైననూ బంధహేతువు కాబోదు.

నవ్యవద్ధృదయే యజ్జ్ఞో బ్రహ్మైతద్బ్రహ్మవాదిభిః ।
న ముహ్యంతి న శోచంతి న హృష్యంతి యతో గతాః ॥ 20

యత్ - దేనివలన, జ్ఞః - జ్ఞప్తిస్వరూపుడనగు నేను, హృత్ - హృదయమును, నవ్యవత్ - నూతనము వలె, అయే - పొందెదనో, బ్రహ్మవాదిభిః - బ్రహ్మవేత్తలచే, ఏతత్ - ఇది, బ్రహ్మ - బ్రహ్మ, యతః - దేని

యందు, గతాః - నిష్ఠను పొందినవారు, న ముహ్యంతి - మోహమును పొందరో, న శోచంతి - శోకమును పొందరో, న హృష్యంతి - హర్షమును పొందరో.

నిరంతరమగు భగవచ్చింతన వలన జ్ఞప్తిస్వరూపుడనగు నేను సాధకుని హృదయములో నిత్యనూతనముగా ప్రకాశించెదను. దీనినే బ్రహ్మవేత్తలు బ్రహ్మయని నిర్దేశించుచున్నారు. ఇట్టి భగవచ్చింతనము వలన సాధకుడు వ్యామోహమును గాని, శోకమును గాని, హర్షోద్రేకమును గాని పొందడు.

మైత్రేయ ఉవాచ ।
ఏవం బ్రువాణం పురుషార్థభాజనం
జనార్దనం ప్రాంజలయః ప్రచేతసః ।
తద్దర్శనధ్వస్తతమోరజోమలా
గిరాఽగృణన్ గద్గదయా సుహృత్తమమ్ ॥ 21

ఏవమ్ - ఈ విధముగా, బ్రువాణమ్ - పలుకుచున్నట్టియు, పురుష-అర్థభాజనమ్ - పురుషార్థములను పొందించునట్టియు, సుహృత్తమమ్ - పరమహితమును చేయునట్టియు, జనార్దనమ్ - దుష్టజనశిక్షకుడగు శ్రీహరిని, ప్రాంజలయః - చేతులను జోడించినవారు, తత్-దర్శనధ్వస్తతమః-రజః-మలాః - ఆ శ్రీహరియొక్క దర్శనముచే నశింపజేయబడిన తమోగుణము రజోగుణము అనే మాలిన్యములు గలవారు అగు, ప్రచేతసః - ప్రచేతసులు, గద్గదయా - బొంగురు వోయిన, గిరా - వాక్కుతో, అగృణన్ - స్తుతించిరి.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- దుష్టజనశిక్షకుడు, పరమహితకారి అగు శ్రీహరి భక్తులకు పురుషార్థములననుగ్రహించును. ఆయన ఈ విధముగా పలుకగా, ప్రచేతసులు చేతులను జోడించి బొంగురు వోయిన కంఠముతో వారాయనను ఇట్లు స్తుతించిరి. ఆయన దర్శనముచే వారి హృదయములలోని రజస్తమోగుణముల మాలిన్యము నశించియుండెను.

ప్రచేతస ఊచుః ।
నమో నమః క్లేశవినాశనాయ నిరూపితోదారగుణాహ్వయాయ ।
మనోవచోవేగపురోజవాయ సర్వాక్షమార్గైరగతాధ్వనే నమః ।। 22

ప్రచేతసః - ప్రచేతసులు, ఊచుః - పలికిరి, క్లేశవినాశనాయ - కష్టములను బాపునట్టియు, నిరూపిత-ఉదారగుణ-ఆహ్వయాయ - శాస్త్రోక్తములైన గొప్ప గుణములే పేర్లుగా గలిగినట్టియు (గుణములు, నామములు కలిగినట్టియు), మనః-వచః-వేగపురః-జవాయ - మనస్సుయొక్క వాక్కులయొక్క వేగముకంటె ముందుండే వేగము కలిగినట్టియు, సర్వ-అక్షమార్గైః - అన్ని ఇంద్రియమార్గములచే, అగత-అధ్వనే - పొందబడని మార్గము గలవాడు అగు శ్రీహరి కొరకు, నమః నమః నమః - అనేక నమస్కారములు.

ప్రచేతసులు ఇట్లు పలికిరి --- భక్తుల కష్టములను బాపే శ్రీహరికి ఏ గుణములను శాస్త్రములు నిరూపించుచున్నవో, అవియే ఆయన నామములగుచున్నవి (ఆయన గుణములు, నామములు శాస్త్రముచే నిరూపించబడుచున్నవి). ఆయన స్వరూపము మిక్కిలి వేగము గల మనస్సునకు గాని, వాక్కునకు గాని అందదు. ఆయన స్వరూపము ఇంద్రియముల వ్యాపారములకు అందదు. ఆయనకు అనేక నమస్కారములు.

శుద్ధాయ శాంతాయ నమస్స్వనిష్ఠయా
మనస్యపార్థం విలసద్ద్వయాయ ।
నమో జగత్స్థానలయోదయేషు
గృహీతమాయాగుణవిగ్రహాయ ।। 23

స్వనిష్ఠయా - ఆత్మనిష్ఠచే, శుద్ధాయ - శుద్ధుడైనట్టియు, శాంతాయ - శాంతుడైనట్టియు, మనసి - మనస్సునందు, అప-అర్థమ్ - అయథార్థముగా, విలసత్-ద్వయాయ - స్ఫురించే ద్వైతము గలిగినట్టియు, జగత్-స్థానలయ-ఉదయేషు - జగత్తుయొక్క స్థితి ప్రళయము సృష్టులయందు, గృహీతమాయాగుణవిగ్రహాయ - స్వీకరించబడిన మాయాగుణముల ఉపాధి గల శ్రీహరి కొరకు, నమః - నమస్కారము.

శ్రీహరియే మాయాశక్తియొక్క సత్త్వరజస్తమోగుణములను ఉపాధిగా స్వీకరించి, జగత్తునకు స్థితిని ప్రళయమును మరియు సృష్టిని చేయును. అయిననూ, ఆయన స్వస్వరూపనిష్ఠుడగుటచే ఆయనయందు కర్తృత్వాదికము గాని, గుణముల సంక్షోభము గాని లేవు. వాస్తవముగా లేకున్ననూ మనస్సునందు స్ఫురించే ఈ నానాత్వరూపమగు జగత్తునకు అధిష్ఠానము శ్రీహరియే. అట్టి శ్రీహరికి నమస్కారము.

నమో విశుద్ధసత్త్వాయ హరయే హరిమేధసే ।
వాసుదేవాయ కృష్ణాయ ప్రభవే సర్వసాత్వతామ్ ॥ 24

విశుద్ధసత్త్వాయ - శుద్ధసత్త్వప్రధానుడైనట్టియు, హరిమేధసే - సంసారమును పోగొట్టే జ్ఞానము కలిగినట్టియు, వాసుదేవాయ - వసుదేవపుత్రుడగు (సకలజగన్నివాసుడు మరియు స్వయంప్రకాశస్వరూపుడు), కృష్ణాయ - శ్రీకృష్ణుడైనట్టియు (ఆనందరూపుడై ఆకర్షించువాడు), సర్వసాత్వతామ్ - అందరు సాత్వతవంశీయులకు (సత్త్వగుణప్రధానులగు భక్తులకు), ప్రభవే - ప్రభుడగు, హరయే - శ్రీహరి కొరకు, నమః - నమస్కారము.

శ్రీహరి శుద్ధసత్త్వప్రధానమగు మూర్తి. ఆయనను తెలుసుకున్నవానికి సంసారము తొలగిపోవును. ఆయనయే వసుదేవపుత్రుడగు శ్రీకృష్ణుడై అవతరించి సాత్వతవంశీయులకు ప్రభుడైనాడు. సకలజగత్తులు చైతన్యస్వరూపుడగు ఆయనయందే భాసించుచున్నవి. ఆనందరూపుడగు ఆ శ్రీహరియే సత్త్వగుణప్రధానులగు భక్తులకు ప్రభుడు. ఆయనకు నమస్కారము.

నమః కమలనాభాయ నమః కమలమాలినే ।
నమః కమలపాదాయ నమస్తే కమలేక్షణ ॥ 25

కమల-ఈక్షణ - కలువ కన్నులవాడా!, కమలనాభాయ - కమలము నాభియందు గలిగినట్టియు, కమలమాలినే - కమలముల మాల కలిగినట్టియు, కమలపాదాయ - కమలములవంటి పాదములు కల, తే - నీ కొరకు, నమః నమః నమః నమః - అనేక నమస్కారములు.

ఓ కలువ కన్నుల శ్రీహరీ! బ్రహ్మాండము కమలముల మాలను ధరించే నీ నాభియందలి కమలమైనది. కమలములవంటి పాదములు గల నీకు అనేక నమస్కారములు.

నమః కమలకింజల్కపిశంగామలవాససే ।
సర్వభూతనివాసాయ నమోఽయుంక్ష్మహి సాక్షిణే ॥ 26

కమలకింజల్కపిశంగ-అమలవాససే - కమలముల పుప్పొడివలె పచ్చని స్వచ్ఛమగు వస్త్రములు కలిగినట్టియు, సర్వభూతనివాసాయ - సకలప్రాణులలో నివసించునట్టియు, సాక్షిణే - సాక్షియగు శ్రీహరి కొరకు, నమః - నమస్కారమును, అయుంక్ష్మహి - చేయుచున్నాము.

కమలముల పుప్పొడివలె పచ్చనైన స్వచ్ఛమగు వస్త్రములను ధరించియున్న శ్రీహరి కొరకు పలుమార్లు నమస్కరించుచున్నాము. ఆయన సకలప్రాణులలో సాక్షిచైతన్యరూపముగా నివసించి యున్నాడు.

రూపం భగవతా త్వేతదశేషక్లేశసంక్షయమ్ ।
ఆవిష్కృతం నః క్లిష్టానాం కిమన్యదనుకంపితమ్ ॥ 27

అశేషక్లేశసంక్షయమ్ - సకలకష్టములను బాపే, ఏతత్ - ఈ, రూపం తు - రూపమైతే, భగవతా - భగవానునిచే, క్లిష్టానామ్ - క్లేశములతో నిండియున్న, నః - మాకు, ఆవిష్కృతమ్ - ఆవిష్కరించబడినది, అనుకంపితమ్ - అనుగ్రహము, అన్యత్ - మరియొకటి, కిమ్ - ఏమి గలదు?

కష్టములనన్నింటినీ బాపే ఈ రూపము అవిద్యాది క్లేశములతో నిండియున్న మాకు శ్రీహరి భగవానునిచే ఆవిష్కరించబడినది. ఇంతకంటె గొప్ప అనుగ్రహము ఏమి గలదు?

ఏతావత్త్వం హి ప్రభుభిర్భావ్యం దీనేషు వత్సలైః ।
యదనుస్మర్యతే కాలే స్వబుద్ధ్యాఽభద్రరంధన ॥ 28

అభద్రరంధన - అమంగళములను నాశము చేయువాడా!, దీనేషు - దీనులయందు, వత్సలైః - ప్రేమ గల, ప్రభుభిః - ప్రభువులచే, ఏతావత్త్వమ్ - ఇంత మాత్రము, భావ్యమ్ - చేయదగినది, యత్ - ఏదనగా, కాలే - కాలమునందు, స్వబుద్ధ్యా - తమ బుద్ధిచే, అనుస్మర్యతే - స్మరించబడుచున్నదో.

అమంగళములను నాశనము చేయువాడా! దీనవత్సలురగు ప్రభువులు ఆయా కాలములయందు సేవకులను తమ బుద్ధియందు స్మరించవలెను. అంతమాత్రముచే సేవకులు కృతార్థులగుదురు.

యేనోపశాంతిర్భూతానాం క్షుల్లకానామపీహతామ్ ।
అంతర్హితోఽంతర్హృదయే కస్మాన్నో వేద నాశిషః ॥ 29

యేన - దేనిచే, భూతానామ్ - ప్రాణులకు, ఉపశాంతిః - కష్టముల నివారణ కలుగునో, క్షుల్లకానామ్ - అల్పములగు ప్రాణుల, హృదయే - హృదయమునందు, అంతః - లోపల, అంతర్హితః - దాగియున్న శ్రీహరి, ఈహతామ్ - కోరికలను కోరే, నః - మా, ఆశిషః - ఆకాంక్షలను, కస్మాత్ - ఎందువలన, న వేద - తెలియకుండును?

శ్రీహరిచే స్మరించబడువారల కష్టములు నివారణ అగును. ఆయన అత్యల్పములగు ప్రాణుల హృదయముల లోపల కూడ అంతర్యామియై ఉన్నాడు. అట్టి శ్రీహరికి కోరికలతో నిండిన మా హృదయముల లోని ఆకాంక్షలు ఏల తెలియకుండును?

అసావేవ వరోఽస్మాకమీప్సితో జగతః పతే ।
ప్రసన్నో భగవాన్ యేషామపవర్గగురుర్గతిః ॥ 30

జగతః పతే - ఓ జగన్నాథా!, అస్మాకమ్ - మాకు, ఈప్సితమ్ - కోరబడే, వరః - వరము, అసౌ ఏవ - ఇదియే, యేషామ్ - ఏ మాకు, అపవర్గగురుః - మోక్షమునకు గురువు, గతిః - శరణము అగు, భగవాన్ - గవానుడవగు నీవు, ప్రసన్నః - ప్రసన్నుడవో.

ఓ జగన్నాథా! మోక్షప్రదాతవు, మోక్షమార్గమును చూపువాడవు అగు నిన్ను మేము శరణు పొందినాము. మాయందు భగవానుడవగు నీవు ప్రసన్నుడవైనావు. మేము కోరే వరము ఇదియే.

వరం వృణీమహేఽథాపి నాథ త్వత్పరతః పరాత్ ।
న హ్యంతస్త్వద్విభూతీనాం సోఽనంత ఇతి గీయసే ।। 31

నాథ - ఓ ప్రభూ!, అథ అపి - అయినప్పటికీ, పరతః - ప్రకృతికంటె, పరాత్ - అతీతుడవగు, త్వత్ - నీనుండి, వరమ్ - వరమును, వృణీమహే - కోరుచున్నాము, త్వత్-విభూతీనామ్ - నీ మహిమలకు, అంతః - అంతము, న హి - లేదు గదా!, సః - అట్టి నీవు, అనంతః ఇతి - అనంతుడవని, గీయసే - కీర్తించబడుచున్నావు.

ఓ ప్రభూ! అయినప్పటికీ, ప్రకృతికి అతీతుడవగు నీనుండి మేము వరమును కోరుచున్నాము. నీ మహిమలకు అంతము లేదు గనుకనే, నిన్ను అనంతుడని కీర్తించుచున్నారు.

పారిజాతేఽంజసా లబ్ధే సారంగోఽన్యం న సేవతే ।
త్వదంఘ్రిమూలమాసాద్య సాక్షాత్కిం కిం వృణీమహి ।।32

అంజసా - తేలికగా, పారిజాతే - కల్పవృక్షము, లబ్ధే - పొందబడగా, సారంగః - తుమ్మెద, అన్యమ్ - ఇతరమును, న సేవతే - సేవించదు, సాక్షాత్ - సాక్షాత్తుగా, త్వత్-అంఘ్రిమూలమ్ - నీ పాదమూలమును, ఆసాద్య - పొంది, కిం కిమ్ - దేనిని దేనిని, వృణీమహి - కోరెదము?

తేలికగా కల్పవృక్షము లభించినప్పుడు తుమ్మెద మరియొక చెట్టును సేవించదు. మాకు సాక్షాత్తుగా నీ పాదమూలము లభించినది. మేము ఇతరములను వేటిని కోరవలయును?

యావత్తే మాయయా స్పృష్టా భ్రమామ ఇహ కర్మభిః ।
తావద్భవత్ప్రసంగానాం సంగస్స్యాన్నో భవే భవే ।। 33

యావత్ - ఎంతవరకు, తే - నీ, మాయయా - మాయచే, స్పృష్టాః - వ్యాపించబడినవారమై, ఇహ - ఈ సంసారమునందు, కర్మభిః - కర్మలచే, భ్రమామః - పరిభ్రమించెదమో, తావత్ - అంతవరకు, భవే భవే - జన్మజన్మలయందు, భవత్-ప్రసంగానామ్ - నీయందు గొప్ప భక్తి గలవారల, సంగః - సంగము, నః - మాకు, స్యాత్ - కలుగు గాక!

నీ మాయచే కప్పివేయబడిన మేము కర్మఫలములననుభవిస్తూ ఈ సంసారములో పరిభ్రమిస్తూ ఉన్నంతవరకు, మాకు జన్మజన్మలయందు నీ గొప్ప భక్తుల సంగము కలుగు గాక!

తులయామ లవేనాపి న స్వర్గం నాపునర్భవమ్ ।
భగవత్సంగిసంగస్య మర్త్యానాం కిముతాశిషః ।। 34

భగవత్-సంగిసంగస్య - భగవంతునియందు ప్రేమ గలవారల సంగముయొక్క, లవేన అపి - లేశముతోనైననూ, స్వర్గమ్ - స్వర్గమును, న తులయామ - సమానముగా లెక్కించలేము, అపునర్భవమ్ - మరల పుట్టుక లేని మోక్షమును, న - లెక్కించలేము, మర్త్యానామ్ - మానవుల, ఆశిషః - సంపదలను గురించి, కిం ఉత - చెప్పునదేమున్నది?

భగవంతునియందు ప్రేమ గల భక్తులతోడి సంగముయొక్క లేశముతోనైననూ స్వర్గము గాని, మోక్షము గాని తులదూగవు. ఇక మానవుల భోగభాగ్యములు తులదూగవని వేరుగా చెప్పవలయునా?

యత్రేడ్యంతే కథా మృష్టాస్తృష్ణాయాః ప్రశమో యతః ।
నిర్వైరం యత్ర భూతేషు నోద్వేగో యత్ర కశ్చన ।। 35

యత్ర - ఏ సత్సంగమునందు, మృష్టాః - శుద్ధములగు, కథాః - గాథలు, ఈడ్యంతే - కీర్తించబడునో, యతః - దేనివలన, తృష్ణాయాః - తృష్ణయొక్క, ప్రశమః - పూర్తిగా చల్లారుటయో, యత్ర - దేనియందు, భూతేషు - ప్రాణులయందు, నిర్వైరమ్ - వైరము ఉండదో, యత్ర - దేని యందు, ఉద్వేగః - భయము, కశ్చన - ఏదైననూ, న - లేదో.

సత్సంగములో శుద్ధములగు భగవద్గాథలు గానము చేయబడును. దానిలో పాల్గొన్నవారికి సంసారాసక్తి బాగుగా పలచబడును. అచట ప్రాణుల మధ్యనుండే వైరము తొలగిపోవును. సత్సంగము వలన మనస్సులోని భయాందోళనలు పూర్తిగా దూరమగును.

యత్ర నారాయణస్సాక్షాద్భగవాన్న్యాసినాం గతిః ।
సంస్తూయతే సత్కథాసు ముక్తసంగైః పునః పునః ॥ 36

యత్ర - ఏ సత్సంగమునందు, సత్-కథాసు - భగవద్గాథలయందు, ముక్తసంగైః - విడిచిపెట్టబడిన సంసారాసక్తి గలవారిచే, న్యాసినామ్ - సర్వసంగపరిత్యాగులకు, గతిః - శరణమగు, భగవాన్ నారాయణః - నారాయణ భగవానుడు, సాక్షాత్ - సాక్షాత్తుగా, పునః పునః - మరల మరల, సంస్తూయతే - చక్కగా స్తుతించబడునో.

సత్సంగములో సంసారాసక్తిని విడిచిపెట్టిన మహాత్ములు భగవద్గాథలను కీర్తించెదరు. ఆ గాథలలో సాక్షాత్తు నారాయణ భగవానుడు చక్కగా పదే పదే స్తుతించబడును. సర్వసంగపరిత్యాగులకు గతి ఆయనయే.

తేషాం విచరతాం పద్భ్యాం తీర్థానాం పావనేచ్ఛయా ।
భీతస్య కిం న రోచేత తావకానాం సమాగమః ॥ 37

తీర్థానామ్ - తీర్థములకు, పావన-ఇచ్ఛయా - పవిత్రము చేయాలనే కాంక్షతో, పద్భ్యామ్ - కాళ్లతో, విచరతామ్ - సంచరించే, తేషామ్ - ఆ, తావకానామ్ - నీ భక్తుల, సమాగమః - సమాగమము, భీతస్య - భయపడినవానికి, కిమ్ - ఏల, న రోచేత - రుచించదు?

నీ భక్తులు తీర్థములను పవిత్రము చేసే ఆకాంక్షతో కాలి నడకన సంచరించెదరు. సంసారము వలన భయపడియున్నవానికి వారితోడి సమాగమము ఏల రుచించదు?

వయం తు సాక్షాద్భగవన్ భవస్య
ప్రియస్య సఖ్యుః క్షణసంగమేన ।

సుదుశ్చికిత్స్యస్య భవస్య మృత్యోః
భిషక్తమం త్వాఽద్య గతిం గతాస్స్మః ॥ 38

భగవన్ - ఓ భగవానుడా!, వయం తు - మేమైతే, సాక్షాత్ - సాక్షాత్తుగా, ప్రియస్య సఖ్యుః - ప్రియసఖుడగు, భవస్య - శివునియొక్క, క్షణసంగమేన - క్షణకాలము సమాగమముచే, సుదుశ్చికిత్స్యస్య - చికిత్స చేయుట మిక్కిలి శక్యము కాని, భవస్య - పుట్టుకకు, మృత్యోః - మరణమునకు, భిషక్తమమ్ - గొప్ప వైద్యుడవగు, త్వా - నిన్ను, అద్య - ఈనాడు, గతిమ్ - శరణమును, గతాః స్మః - పొందినాము.

ఓ భగవానుడా! నీకు ప్రియసఖుడగు శివునితో సాక్షాత్తుగా మాకు క్షణకాలము సమాగమము కలిగినది. జననమరణములనే రోగమునకు చికిత్స చాల కష్టము. కాని, శివసమాగమముయొక్క ప్రభావముచే మేము సంసారరోగమునకు సర్వోత్తమవైద్యుడవగు నిన్ను శరణు పొందగల్గినాము.

యన్నస్స్వధీతం గురవః ప్రసాదితా
విప్రాశ్చ వృద్ధాశ్చ సదానువృత్త్యా ।
ఆర్యా నతాస్సుహృదో భ్రాతరశ్చ
సర్వాణి భూతాన్యనసూయయైవ ॥ 39

యన్నస్సుతప్తం తప ఏతదీశ
నిరంధసాం కాలమదభ్రమప్సు ।
సర్వం తదేతత్పురుషస్య భూమ్నో
వృణీమహే తే పరితోషణాయ ॥ 40

ఈశ - ఓ ఈశ్వరా!, నః - మాయొక్క, యత్ - ఏ, సు-అధీతమ్ - చక్కని అధ్యయనము గలదో, గురవః - గురువులు, విప్రాః - వేదవేత్తలు, చ - మరియు, వృద్ధాః - పెద్దలు, సదా - అన్నివేళలా, అనువృత్త్యా - అనుసరణముచే, ప్రసాదితాః - ప్రసన్నులుగా చేయబడినారో, ఆర్యాః - గొప్పవారు, సుహృదః - మిత్రులు, భ్రాతరః - సోదరులు, సర్వాణి - అన్ని, భూతాని - ప్రాణులు, అనసూయయా ఏవ - దోషారోపణ చేయకుం

దగనే, నతాః - నమస్కరించ బడినారో, నిరంధసామ్ - నిరాహారులమగు, నః - మాయొక్క, ఏతత్ - ఈ, అప్సు - నీళ్లయందు, అదభ్రమ్ - చాల, కాలమ్ - కాలము, సుతప్తమ్ - బాగుగా అనుష్ఠించబడిన, **తపః** - తపస్సు ఏది గలదో, **తత్** - ఆ, **ఏతత్** - ఈ, సర్వమ్ - సర్వమును, పురుషస్య - సర్వాంతర్యామివైయైనట్టియు, భూమ్నః - పరబ్రహ్మస్వరూపుడవగు, **తే** - నీయొక్క, పరితోషణాయ - ప్రసన్నత కొరకు, వృణీమహే - కోరెదము.

ఓ ఈశ్వరా! మేము చక్కగా వేదమును అధ్యయనము చేసితిమి. గురువులను, వేదవేత్తలను మరియు పెద్దలను అన్ని కాలములలో అనుసరించి ప్రసన్నులను చేసుకొంటిమి. గొప్పవారు, మిత్రులు, సోదరులకు మాత్రమే గాక సకలప్రాణులకు మేము దోషారోపణను చేయకుండగా నమస్కరించితిమి. మేమీ విధముగా నీటిలో నిలబడి నిరాహారులమై చాలకాలము చక్కని తపస్సును చేసితిమి. ఈ సర్వము వలన సర్వాంతర్యామివి, పరబ్రహ్మస్వరూపుడవు అగు నీవు ప్రసన్నుడవగుదువు గాక! మా కోరిక ఇదియే.

మనుస్స్వయంభూర్భగవాన్ భవశ్చ
యేఽన్యే తపోజ్ఞానవిశుద్ధసత్త్వాః ।
అదృష్టపారా అపి యన్మహిమ్నః
స్తువంత్యథో త్వాత్మసమం గృణీమః ।। 41

మనుః - మనువు, స్వయంభూః - స్వయంభువుడగు బ్రహ్మగారు, భగవాన్ భవః చ - శివ భగవానుడు కూడ, తపః-జ్ఞానవిశుద్ధసత్త్వాః - తపస్సు మరియు ఉపాసనలచే పరిశుద్ధమైన అంతఃకరణము గల, అన్యే - ఇతరులు, యే - ఎవరు గలరో వారు, యత్-మహిమ్నః - ఏ నీ మహిమ యొక్క, అదృష్టపారాః అపి - కనబడని అంతము గలవారే అయినప్పటికీ, ఆత్మసమం తు - తమ శక్తికి తగ్గట్లుగా మాత్రమే, స్తువంతి - స్తుతించుచున్నారు, అథో - అందువలన, గృణీమః - స్తుతించుచున్నాము.

స్వాయంభువ మనువు, స్వయంభువుడగు బ్రహ్మగారు, శివ భగవానుడు మాత్రమే గాక, తపస్సు మరియు ఉపాసనలచే పవిత్రమైన అంతః

కరణము గల ఇతరులు నీ మహిమయొక్క అంతమును చూచినవారు కాకున్ననూ, తమ తమ శక్తికి తగ్గట్లుగా మాత్రమే నిన్ను స్తుతించుచున్నారు. కావుననే, మేము కూడ నిన్ను స్తుతించుచున్నాము.

నమస్సమాయ శుద్ధాయ పురుషాయ పరాయ చ ।
వాసుదేవాయ సత్త్వాయ తుభ్యం భగవతే నమః ॥ 42

సమాయ - సముడవైనట్టియు, శుద్ధాయ - శుద్ధుడవైనట్టియు, పురుషాయ - సర్వాంతర్యామివైనట్టియు, పరాయ - సర్వాతీతుడవైనట్టియు, వాసుదేవాయ - వాసుదేవుడవైనట్టియు, సత్త్వాయ - సత్త్వమూర్తివగు, భగవతే - భగవానుడవగు, తుభ్యమ్ - నీ కొరకు, నమః - నమస్కారము.

నీవు సర్వప్రాణులలో ఆత్మచైతన్యరూపముగా సమానముగానున్నావు. నీయందు కర్తృత్వభోక్తృత్వాది దోషములు లేవు. సర్వజగన్నివాసుడవగు నీవు స్వయంప్రకాశస్వరూపుడవు. నీవు ప్రకృతికి అతీతుడవు. సత్త్వమూర్తివగు నీయందు ఈశ్వరభావము, వీర్యము, యశస్సు, శ్రీ, జ్ఞానము మరియు వైరాగ్యము అనే ఆరు గుణములు పూర్ణముగా నున్నవి. నీకు నమస్కారము.

మైత్రేయ ఉవాచ ।
ఇతి ప్రచేతోభిరభిష్టుతో హరిః
ప్రీతస్తథేత్యాహ శరణ్యవత్సలః ।
అనిచ్ఛతాం యానమతృప్తచక్షుషాం
యయౌ స్వధామానపవర్గవీర్యః ॥ 43

శరణ్యవత్సలః - శరణు పొందినవారియందు ప్రేమ గలవాడు, అనపవర్గవీర్యః - మొక్కవోని శక్తి గలవాడు అగు, హరిః - శ్రీహరి, ఇతి - ఈ విధముగా, ప్రచేతోభిః - ప్రచేతసులచే, అభిష్టుతః - చక్కగా స్తుతించబడినవాడై, ప్రీతః - సంతసించినవాడై, తథా - అటులనే యగుగాక!, ఇతి - అని, ఆహ - పలికెను, అతృప్తచక్షుషామ్ - తృప్తిని చెందని కన్నులు గల

ప్రచేతసులు, యానమ్ - వెళ్లుటను, అనిచ్ఛతామ్ - ఇష్టపడనివారై యుండగా, స్వధామ - తన ధామమును గురించి, యయౌ - వెళ్లెను.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- అమోఘమగు శక్తి గల శ్రీహరికి శరణాగతులయందు వాత్సల్యము మెండు. ప్రచేతసులు ఈ విధముగా స్తుతించగా, ఆయన సరేయని వారి కోరికను అనుమోదించెను. ఆయన దర్శనముచే వారి కన్నులకు ఇంకనూ తృప్తి కలుగనే లేదు. కావుననే, ఆయన నిర్గమనమును వారు ఇష్టపడలేదు. అయిననూ, ఆయన తన ధామమునకు వెళ్లెను.

అథ నిర్యాయ సలిలాత్ప్రచేతస ఉదన్వతః ।
వీక్ష్యాకుప్యన్ద్రుమైశ్ఛన్నాం గాం గాం రోద్ధుమివోచ్ఛ్రితైః ।।44

అథ - తరువాత, ప్రచేతసః - ప్రచేతసులు, ఉదన్వతః - సముద్రముయొక్క, సలిలాత్ - నీటినుండి, నిర్యాయ - బయటకు వచ్చి, గామ్ - స్వర్గమును, రోద్ధుం ఇవ - అడ్డుకొనుటకా యన్నట్లు, ఉచ్ఛ్రితైః - ఎత్తుగా పెరిగిన, ద్రుమైః - చెట్లతో, ఛన్నామ్ - ఆవరించబడియున్న, గామ్ - భూమిని, వీక్ష్య - చూచి, అకుప్యన్ - కోపించిరి.

తరువాత ప్రచేతసులు సముద్రజలములనుండి పైకి వచ్చి చూడగా భూమి అంతయు చెట్లతో ఆవరించబడి యుండెను. ఆ చెట్లు స్వర్గమును అడ్డుకొనుటకా యన్నట్లు ఎత్తుగా పెరిగినవి. వాటిని చూచి వారు కోపించిరి.

తతోఽగ్నిమారుతౌ రాజన్నముంచన్ముఖతో రుషా ।
మహీం నిర్వీరుధం కర్తుం సంవర్తక ఇవాత్యయే ।। 45

రాజన్ - ఓ రాజా!, తతః - తరువాత, అత్యయే - ప్రళయమునందు, సంవర్తకః - సంహారకర్తయగు రుద్రుడు వలె, రుషా - కోపముతో, మహీమ్ - భూమిని, నిర్వీరుధమ్ - చెట్లు లేనిదానినిగా, కర్తుమ్ - చేయుటకు, ముఖతః - నోటినుండి, అగ్నిమారుతౌ - మంటలను గాలిని, అముంచన్ - విడిచిపెట్టిరి.

ఓ రాజా! తరువాత వారు, ప్రళయకాలరుద్రుని వలె కోపించి, భూమిపై చెట్లు లేకుండా చేయుటకై నోటినుండి మంటలను గాలిని విడిచి పెట్టిరి.

భస్మసాత్క్రియమాణాంస్తాన్ ద్రుమాన్ వీక్ష్య పితామహః ।
ఆగతశ్శమయామాస పుత్రాన్ బర్హిష్మతో నయైః ॥ 46

భస్మసాత్ - బూడిదగా, క్రియమాణాన్ - చేయబడుచున్న, తాన్ - ఆ, ద్రుమాన్ - చెట్లను, వీక్ష్య - చూచి, పితామహః - బ్రహ్మ, ఆగతః - వచ్చినవాడై, బర్హిష్మతః - ప్రాచీనబర్హిషుని, పుత్రాన్ - పుత్రులను, నయైః - మంచి మాటలతో, శమయామాస - కోపము చల్లారునట్లు చేసెను.

చెట్లు కాలి బూడిద అగుచుండగా చూచిన బ్రహ్మగారు అచటకు వచ్చి, ప్రాచీనబర్హిషుని పుత్రులగు ఆ ప్రచేతసులకు మంచి మాటలను చెప్పి, వారి కోపమును తగ్గించెను.

తత్రావశిష్టా యే వృక్షా భీతా దుహితరం తదా ।
ఉజ్జహ్రుస్తే ప్రచేతోభ్య ఉపదిష్టాస్స్వయంభువా ॥ 47

తత్ర - అచట, యే - ఏ, వృక్షాః - చెట్లు, అవశిష్టాః - మిగిలినవో, తే - అవి, తదా - అప్పుడు, భీతాః - భయపడినవై, స్వయంభువా - స్వయంభువుడగు బ్రహ్మగారిచే, ఉపదిష్టాః - ఉపదేశించబడినవై, ప్రచేతోభ్యః - ప్రచేతసుల కొరకు, దుహితరమ్ - తమ కుమార్తెను, ఉజ్జహ్రుః - సమర్పించినవి.

కాలిపోగా మిగిలియున్న చెట్లు భయపడినవి. స్వయంభువుడగు బ్రహ్మగారి ఉపదేశానుసారముగా అవి అప్పుడు తమ కుమార్తెను ప్రచేతసులకు సమర్పించినవి.

తే చ బ్రహ్మణ ఆదేశాన్మారిషాముపయేమిరే ।
యస్యాం మహదవజ్ఞానాదజన్యజనయోనిజః ॥ 48

తే చ - ఆ ప్రచేతసులు కూడ, బ్రహ్మణః - బ్రహ్మగారి, ఆదేశాత్ - ఆదేశము వలన, మారిషామ్ - మారిష అనే ఆ కన్యను, ఉపయేమిరే - వివాహమాడిరి, యస్యామ్ - ఎవతెయందు, అజనయోనిజః - నారాయణుడే కారణముగా గల బ్రహ్మగారి పుత్రుడగు దక్షుడు, మహత్-అవజ్ఞానాత్ - పెద్దలను నిందించుట వలన, అజని - జన్మించెనో.

ఆ ప్రచేతసులు కూడ బ్రహ్మగారి ఆదేశము వలన మారిష అనే ఆ కన్యను వివాహమాడిరి. పూర్వము నారాయణునినుండి ఉద్భవించిన బ్రహ్మగారికి పుత్రుడైన దక్షుడు మహాదేవుని నిందించుటచే, గర్భవాసదుఃఖమునననుభవించుటకై మరల ఆమెయందు జన్మించెను.

చాక్షుషే త్వంతరే ప్రాప్తే ప్రాక్సర్గే కాలవిద్రుతే ।
యస్ససర్జ ప్రజా ఇష్టాస్స దక్షో దైవచోదితః ॥ 49

చాక్షుషే అంతరే తు - చాక్షుష మన్వంతరమైతే, ప్రాప్తే - రాగా, ప్రాక్-సర్గే - పూర్వమునందలి సృష్టి, కాలవిద్రుతే - కాలముచే నష్టము కాగా, యః - ఏ, దక్షః - దక్షుడు, దైవచోదితః - దైవముచే ప్రేరేపించబడిన వాడై, ఇష్టాః - తనకు నచ్చిన, ప్రజాః - సంతానమును, ససర్జ - కనెనో, సః - ఆ దక్షుడే.

చాక్షుష మన్వంతరము వచ్చు కాలమునకు అంతకు ముందటి సృష్టి కాలప్రభావముచే నశించెను. అప్పుడు దైవముచే ప్రేరితుడైన దక్షుడు తనకు అభీష్టమగు సంతానమును కనెను. ఆ దక్షుడు ఇప్పుడు మారిషయందు జన్మించెను.

యో జాయమానస్సర్వేషాం తేజస్తేజస్వినాం రుచా ।
స్వయోపాదత్త దాక్ష్యాచ్చ కర్మణాం దక్షమబ్రువన్ ॥ 50

యః - ఏ దక్షుడు, జాయమానః - పుట్టుచున్నవాడై, స్వయా - తనదైన, రుచా - కాంతితో, సర్వేషామ్ - అందరు, తేజస్వినామ్ - తేజశ్శాలుగ, తేజః - తేజస్సును, ఉపాదత్త - తిరస్కరించెనో, కర్మణామ్ -

కర్మలయొక్క, దాక్ష్యాత్ చ - చాతుర్యము వలన, దక్షమ్ - దక్షునిగా, అబ్రువన్ - పలికిరి.

ఆ దక్షుడు పుట్టుచుండగనే తన తేజస్సుచే తేజశ్శాలురందరి తేజస్సును తిరస్కరించెను. కర్మలయందు చాతుర్యము గలవాడగుటచే ఆతనిని దక్షుడని వ్యవహరించిరి.

తం ప్రజాసర్గరక్షాయామనాదిరభిషిచ్య చ ।
యుయోజ యుయుజేఽన్యాంశ్చ స వై సర్వప్రజాపతీన్ ।।51

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే చతుర్థస్కంధే ప్రచేతోభ్యః
శ్రీహరిదర్శనం నామ త్రింశోఽధ్యాయః ।।

అనాదిః - స్వయంభువుడగు బ్రహ్మగారు, తమ్ - వానిని, అభిషిచ్య - అభిషేకించి, ప్రజాసర్గరక్షాయామ్ - ప్రజాసృష్టియొక్క రక్షణయందు, యుయోజ - నియోగించెను, సః వై - ఆ దక్షుడే, సర్వప్రజాపతీన్ - అందరు ప్రజాపతులను, యుయుజే - నియోగించెను.

స్వయంభువుడగు బ్రహ్మగారు ఆ దక్షుని అభిషేకించి ప్రజాసృష్టిని రక్షించుమని నియోగించెను. ప్రజాపతులకు నాయకుడగు ఆ దక్షుడే ఇతరప్రజాపతులను కూడ నియోగించెను.

శ్రీమద్భాగవతమునందలి నాల్గవ స్కంధములో ప్రచేతసులకు
శ్రీహరి దర్శనమిచ్చుటను, ఆయనను వారు స్తుతించుటను
వర్ణించే ముప్పదియవ అధ్యాయము ముగిసినది (30).

*****

# అథ ఏకత్రింశోऽధ్యాయః

## నారద ప్రచేతస సంవాదము

మైత్రేయ ఉవాచ ।
తత ఉత్పన్నవిజ్ఞానా ఆశ్వధోక్షజభాషితమ్ ।
స్మరంత ఆత్మజే భార్యాం విసృజ్య ప్రావ్రజన్ గృహాత్ ।। 1

తతః - తరువాత, ఉత్పన్నవిజ్ఞానాః - కలిగిన వివేకజ్ఞానము గల ప్రచేతసులు, అధోక్షజభాషితమ్ - శ్రీహరియొక్క వచనమును, స్మరంతః - స్మరించుచున్నవారై, ఆత్మజే - కుమారునియందు, భార్యామ్ - భార్యను, విసృజ్య - విడిచిపెట్టి, ఆశు - వెంటనే, గృహాత్ - ఇంటినుండి, ప్రావ్రజన్ - సన్న్యసించిరి.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- శ్రీహరి నిర్దేశించిన కాలము పూర్తి అయిన తరువాత ఆ ప్రచేతసులు శ్రీహరియొక్క వచనమును స్మరించి, కొడుకునకు భార్యను అప్పజెప్పి, ఇంటిని విడిచి సన్న్యసించిరి.

దీక్షితా బ్రహ్మసత్రేణ సర్వభూతాత్మమేధసా ।
ప్రతీచ్యాం దిశి వేలాయాం సిద్ధోऽభూద్యత్ర జాజలిః ।। 2

ప్రతీచ్యాం దిశి - పడమర దిక్కునందు, వేలాయామ్ - సముద్రతీరమునందు, సర్వభూత-ఆత్మమేధసా - సర్వప్రాణులయందలి ఆత్మ తానే అనే జ్ఞానము గల, బ్రహ్మసత్రేణ - బ్రహ్మవిచారముచే, దీక్షితాః - చేయబడిన సంకల్పము గలవారు, యత్ర - ఎక్కడనైతే, జాజలిః - జాజలి, సిద్ధః - ముక్తుడు, అభూత్ - ఆయెనో.

వారు పడమరదిక్కునందలి సముద్రతీరమునకు వెళ్లి, బ్రహ్మవిచారమునకు సంకల్పమును చేసిరి. ఆ విచారమునందు సర్వప్రాణులయందు తానే ఆత్మరూపముగా నున్నాననే సత్యము గుర్తించబడును. అది జాజలి మహర్షి ముక్తిని పొందిన స్థానము.

తాన్నిర్జితప్రాణమనోవచోదృశో
జితాసనాన్ శాంతసమానవిగ్రహాన్ ।
పరేఽమలే బ్రహ్మణి యోజితాత్మనః
సురాసురేడ్యో దదృశే స్మ నారదః ॥ 3

నిర్జితప్రాణమనః-వచః-దృశః - జయించబడిన ప్రాణము మనస్సు వాక్కు చూపులు గలిగినట్టియు, జిత-ఆసనాన్ - జయించబడిన ఆసనము కలిగినట్టియు, శాంతసమానవిగ్రహాన్ - శాంతము సమానము అగు రూపము గలిగినట్టియు, అమలే - శుద్ధమగు, పరే బ్రహ్మణి - పరబ్రహ్మయందు, యోజిత-ఆత్మనః - నిలుపబడిన బుద్ధిగల, తాన్ - వారిని, సుర-అసుర-ఈడ్యః - దేవతలచే రాక్షసులచే కొనియాడబడే, నారదః - నారద మహర్షి, దదృశే స్మ - చూచెను.

ఆ ప్రచేతసులు సర్వక్రియలనుండి విరమించుకొని, మౌనమును పాటిస్తూ, కళ్లను మూసుకొని, నిటారుగా కూర్చున్నవారై, ఆసనమును జయించి, ప్రాణాయామమును చేసి, మనోనిగ్రహమును సంపాదించిరి. వారు శుద్ధమగు పరబ్రహ్మయందు మనస్సును నిలిపియుంచిరి. వారిని నారదమహర్షి చూచెను. ఆయనను దేవతలు మాత్రమే గాక, రాక్షసులు కూడ కొనియాడుచుందురు.

తమాగతం త ఉత్థాయ ప్రణిపత్యాభినంద్య చ ।
పూజయిత్వా యథాదేశం సుఖాసీనమథాస్తువన్ ॥ 4

తే - వారు, ఆగతమ్ - వచ్చిన, తమ్ - ఆ నారద మహర్షిని, ఉత్థాయ - లేచి, ప్రణిపత్య - నమస్కరించి, అభినంద్య చ - అభినందించి, పూజయిత్వా - పూజించి, యథాదేశమ్ - యోగ్యమగు స్థానమునందు,

సుఖ-ఆసీనమ్ - సుఖముగా కూర్చున్న ఆయనను, అథ - అప్పుడు, అస్తువన్ - స్తుతించిరి.

నారదుడు రాగానే వారు లేచి నిలబడి నమస్కరించి ఆయన రాకను ప్రశంసించిరి. ఆయనకు యోగ్యమగు ఆసనమునిచ్చి పూజించిరి. ఆయన సుఖముగా కూర్చుండియుండగా, వారిట్లు స్తుతించిరి.

ప్రచేతస ఊచుః ।
స్వాగతం తే సురర్షేఽద్య దిష్ట్యా నో దర్శనం గతః ।
తవ చంక్రమణం బ్రహ్మన్నభయాయ యథా రవేః ॥ 5

సుర-ఋషే - ఓ దేవర్షీ!, తే - నీకు, స్వాగతమ్ - స్వాగతము, దిష్ట్యా - దైవానుగ్రహముచే, నః - మా, దర్శనమ్ - చూపును, గతః - పొందితివి, బ్రహ్మన్ - ఓ మహాత్మా!, తవ - నీ, చంక్రమణమ్ - సంచారము, రవేః యథా - సూర్యుని సంచారము వలె, అభయాయ - అభయము కొరకు.

ప్రచేతసులు ఇట్లు పలికిరి --- ఓ దేవర్షీ! నీకు స్వాగతము. దైవానుగ్రహముచే నీవు మాకు కనబడితివి. సూర్యుని సంచారముచే లోకములకు వెలుగు కలిగి భయము పోవును. అదే విధముగా నీ సంచారముచే లోకులకు జ్ఞానోదయమై సంసారభయము తొలగును.

యదాదిష్టం భగవతా శివేనాధోక్షజేన చ ।
తద్గృహేషు ప్రసక్తానాం ప్రాయశః క్షపితం ప్రభో ॥ 6

ప్రభో - ఓ ప్రభూ!, భగవతా శివేన - శివ భగవానునిచే, అధోక్షజేన చ - శ్రీహరిచే కూడ, యత్ - ఏది, ఆదిష్టమ్ - ఉపదేశించబడినదో, తత్ - అది, గృహేషు - ఇంటియందు, ప్రసక్తానామ్ - గట్టి ఆసక్తి గల మాకు, ప్రాయశః - చాల మటుకు, క్షపితమ్ - మరువబడినది.

ఓ ప్రభూ! శివ భగవానుడు మరియు శ్రీహరి కూడ ఆత్మతత్త్వమును ఉపదేశించినారు. కాని, మేము చాల కాలము గృహవిషయములలో గట్టి ఆసక్తిని కలిగియుండుటచే, ఆ ఉపదేశమును చాలవరకు మరచితిమి.

తన్నః ప్రద్యోతయాధ్యాత్మజ్ఞానం తత్త్వార్థదర్శనమ్ ।
యేనాంజసా తరిష్యామో దుస్తరం భవసాగరమ్ ॥ 7

**తత్** - అందువలన, నః - మాకు, తత్త్వ-అర్థదర్శనమ్ - యథార్థమగు వస్తువును చూపించే, అధ్యాత్మజ్ఞానమ్ - ఆత్మవిషయకమగు జ్ఞానమును, ప్రద్యోతయ - ప్రకాశింప జేయుము, యేన - దేనిచే, దుస్తరమ్ - తరించ శక్యము కాని, భవసాగరమ్ - సంసార సముద్రమును, అంజసా - తేలికగా, తరిష్యామః - తరించగలమో.

కావున, నీవు మాకు యథార్థమగు అద్వయవస్తువుయొక్క సాక్షాత్కారమును కలిగించే ఆత్మజ్ఞానమును ప్రకాశింప జేయుము. దాని వలన మేము తరించ శక్యము కాని సంసారసముద్రమును తేలికగా తరించెదము.

మైత్రేయ ఉవాచ ।
ఇతి ప్రచేతసాం పృష్టో భగవాన్నారదో మునిః ।
భగవత్యుత్తమశ్లోక ఆవిష్టాత్మాఽబ్రవీన్నృపాన్ ॥ 8

ఇతి - ఈ విధముగా, ప్రచేతసామ్ - ప్రచేతసులచే, పృష్టః - ప్రశ్నించబడిన, భగవాన్ - పూజ్యుడగు, నారదః మునిః - నారద మహర్షి, ఉత్తమశ్లోకే - ఉత్తమమగు కీర్తి గల, భగవతి - శ్రీహరి భగవానునియందు, ఆవిష్ట-ఆత్మా - సంలగ్నమైన మనస్సు గలవాడై, నృపాన్ - ఆ రాజులనుద్దేశించి, అబ్రవీత్ - పలికెను.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- ఈ విధముగా మహారాజులగు ప్రచేతసులు ప్రశ్నించగా, పూజ్యుడగు నారద మహర్షియొక్క మనస్సు ఉత్తమమగు కీర్తి గల శ్రీహరియందు సంలగ్నమయ్యెను. ఆయన వారితో నిట్లనెను.

**నారద ఉవాచ ।**
**తజ్జన్మ తాని కర్మాణి తదాయుస్తన్మనో వచః ।**
**నృణాం యేనేహ విశ్వాత్మా సేవ్యతే హరిరీశ్వరః ॥ 9**

నృణామ్ - మానవులకు, తత్ - అదియే, జన్మ - పుట్టుక, తాని - అవియే, కర్మాణి - కర్మలు, తత్ - అదియే, ఆయుః - ఆయుర్దాయము, తత్ - అదియే, మనః - మనస్సు, వచః - వాక్కు, యేన - దేనిచే, ఇహ - ఈ లోకములో, విశ్వ-ఆత్మా - జగత్తునకు ఆత్మ (జగద్రూపములో నున్న వాడు), ఈశ్వరః - జగన్నాథుడు అగు, హరిః - శ్రీహరి. సేవ్యతే - సేవించబడునో.

నారదుడిట్లు పలికెను --- జగద్రూపములో ప్రకటమైన శ్రీహరియే ఈ జగత్తునకు ఆత్మ. మానవులకు జగన్నాథుడగు శ్రీహరి సేవలో వినియోగించిన జన్మయే జన్మ; శ్రీహరిని సేవించుటకు చేసే కర్మలే కర్మలు; శ్రీహరి సేవలో వినియుక్తమైన ఆయుర్దాయమే ఆయుర్దాయము; శ్రీహరిని స్మరించే మనస్సే మనస్సు; శ్రీహరిని కీర్తించే వాక్కే వాక్కు.

కిం జన్మభిస్త్రిభిర్వేహ శౌక్లసావిత్రయాజ్ఞికైః ।
కర్మభిర్వా త్రయీప్రోక్తైః పుంసోఽపి విబుధాయుషా ।। 10

శ్రుతేన తపసా వా కిం వచోభిశ్చిత్తవృత్తిభిః ।
బుద్ధ్యా వా కిం నిపుణయా బలేనేంద్రియరాధసా ।। 11

కిం వా యోగేన సాంఖ్యేన న్యాసస్వాధ్యాయయోరపి ।
కిం వా శ్రేయోభిరన్యైశ్చ న యత్రాత్మప్రదో హరిః ।। 12

ఇహ - ఈ లోకములో, పుంసః - మానవునకు, శౌక్లసావిత్రయాజ్ఞికైః - మంచి వంశములో పుట్టుట ఉపనయనము మరియు యజ్ఞమును చేయుట అనే, త్రిభిః - మూడు, జన్మభిః వా - జన్మలతో గాని, త్రయీప్రోక్తైః - వేదములచే విధించబడిన, కర్మభిః వా - కర్మలతో గాని, విబుధ-ఆయుషా అపి - దేవతలకు వంటి ఆయుర్దాయముతోనైననూ, కిమ్ - ఏమి ప్రయోజనము?, శ్రుతేన - శ్రవణముచే గాని, తపసా వా - తపస్సుచే గాని, కిమ్ - ఏమి ప్రయోజనము?, వచోభిః - వాక్కులతో గాని, చిత్తవృత్తిభిః - మనస్సులోని ఆలోచనలతో గాని, నిపుణయా - నిపుణమగు, బుద్ధ్యా వా - బుద్ధితో గాని, కిమ్ - ఏమి ప్రయోజనము?, బలేన - బలముతో గాని, ఇంద్రియరాధసా - ఇంద్రియపాటవముతో గాని, యోగేన వా

**- యోగముతో** గాని, **కిమ్ -** ఏమి ప్రయోజనము?, **సాంఖ్యేన - ఆత్మానా త్మవివేకమాత్రముచే** గాని, **న్యాసస్వాధ్యాయయోః అపి -** సన్న్యాస వేదా ధ్యయనములకైననూ, **అన్యైః -** ఇతరములగు, **శ్రేయోభిః చ -** శ్రేయస్సా ధనములచేనైననూ, **కిం వా -** ఏమి ప్రయోజనము?, **యత్ర -** వేటియం దు, **ఆత్మప్రదః -** తనను తాను ఇచ్చివేసే (ఆత్మజ్ఞానమునిచ్చే), **హరిః -** శ్రీహరి, **న -** లేదో.

శ్రీహరి భక్తులకు తనను తాను సమర్పించుకొనును. భక్తులకు ఆత్మజ్ఞానమునను గ్రహించేది శ్రీహరియే. అట్టి శ్రీహరితోడి సంబంధము లేనిచో, మంచి వంశములో పుట్టుట, ఉపనయనము అనే రెండవ జన్మ, యజ్ఞము అనే మూడవ జన్మ, వేదవిహితములైన కర్మలు, దేవతలకు వంటి ఆయుర్దాయము, శాస్త్ర శ్రవణము, తపస్సు, గొప్ప వాక్కులు, మనస్సు లోని గొప్ప ఆలోచనలు, నిపుణమగు బుద్ధి, శరీరబలము, ఇంద్రియ పాట వము, యోగాభ్యాసము, కేవలమగు ఆత్మానాత్మవివేకము, సన్న్యాసము, వేదాధ్యయనము, ఇతరములగు శ్రేయస్సాధనములు మొదలగువాటితో మానవునకు ప్రయోజనమేమున్నది?

శ్రేయసామపి సర్వేషామాత్మా హ్యవధిరర్థతః ।
సర్వేషామపి భూతానాం హరిరాత్మాఽఽత్మదః ప్రియః ॥ 13

సర్వేషామ్ - అన్ని, శ్రేయసాం అపి - శ్రేయస్సాధనములకు కూడ, అర్థతః - వాస్తవముగా, ఆత్మా - ఆత్మ, అవధిః - అవధి, సర్వేషామ్ - అన్ని, భూతానాం అపి - ప్రాణులకు కూడ, హరిః - శ్రీహరి, ప్రియః ప్రియమగు, ఆత్మా - ఆత్మ, ఆత్మదః - ఆత్మజ్ఞానమునిచ్చువాడు.

వాస్తవములో శ్రేయస్సాధనములన్నింటికి ఆత్మయే అవధి (అన గా, ఆత్మజ్ఞానమునకు దారి తీసే సాధనములు మాత్రమే శ్రేయస్కరము లు). ఆత్మజ్ఞానమునిచ్చే శ్రీహరియే సకలప్రాణులకు ప్రియమగు ఆత్మ.

**యథా తరోర్మూలనిషేచనేన**
**తృప్యంతి తత్స్కంధభుజోపశాఖాః ।**

ప్రాణోపహారాచ్చ యథేంద్రియాణాం
తథైవ సర్వార్హణమచ్యుతేజ్యా ॥ 14

**యథా** - ఏ విధముగానైతే, **తరోః** - చెట్టుయొక్క, **మూలనిషేచనేన** - మూలమును తడుపుట వలన, **తత్-స్కంధభుజ-ఉపశాఖాః** - దాని మ్రాను పెద్ద చిన్న కొమ్మలు, **తృప్యంతి** - రసమును పొందునో, **యథా** - ఏ విధముగానైతే, **ప్రాణ-ఉపహారాత్** - ప్రాణమునకు భోజనము వలన, **ఇంద్రియాణామ్** - ఇంద్రియములకో, **తథా ఏవ** - అదే విధముగా, **అచ్యుత-ఇజ్యా** - అచ్యుతుని పూజ, **సర్వ-అర్హణమ్** - సర్వమునకు పూజ.

చెట్టు మొదట్లో నీరు పోసినచో, మ్రాను పెద్ద చిన్న కొమ్మలు సర్వమునకు రసము అందును. ప్రాణశక్తికి ఆహారమును సమర్పించినచో, ఇంద్రియములన్నింటికీ శక్తి లభించును. అదే విధముగా, శ్రీహరిని అర్చించినచో, సకలజగత్తును అర్చించినట్లే యగును.

యథైవ సూర్యాత్ప్రభవంతి వారః
పునశ్చ తస్మిన్ ప్రవిశంతి కాలే ।
భూతాని భూమౌ స్థిరజంగమాని
తథా హరావేవ గుణప్రవాహః ॥ 15

యథా ఏవ - ఏ విధముగానైతే, సూర్యాత్ - సూర్యునినుండి, వారః - నీళ్లు, ప్రభవంతి - పుట్టుచున్నవో, పునః చ - మరల, కాలే - కాలమునందు, తస్మిన్ - ఆ సూర్యునియందు, ప్రవిశంతి - ప్రవేశించుచున్నవో, స్థిరజంగమాని - కదిలే మరియు కదలని, భూతాని - ప్రాణులు, భూమౌ - భూమియందు (కలియుచున్నవో), తథా - అదే విధముగా, గుణప్రవాహః - త్రిగుణముల ప్రవాహరూపమగు బ్రహ్మాండము, హరౌ ఏవ - శ్రీహరియందు మాత్రమే.

సూర్యుని వలన అంతరిక్షమునుండి వర్షములు పడును. ఆ వర్షజలమంతయు మరల వేసవి కాలములో అంతరిక్షములోనికి గ్రహించబడును. కదిలే మరియు కదలని ప్రాణుల దేహములన్నియు భూమినుండియే పుట్టి, మరల భూమిలోనే విలీనమగును. అదే విధముగా, సత్త్వరజస్తమోగు

ణాత్మకమగు ప్రకృతియొక్క ప్రవాహరూపమగు ఈ బ్రహ్మాండము శ్రీహరి నుండియే పుట్టి, శ్రీహరిలోననే విలీనమగును.

ఏతత్పదం తజ్జగదాత్మనః పరం
సకృద్విభాతం సవితుర్యథా ప్రభా ।
యథాఽసవో జాగ్రతి సుప్తశక్తయో
ద్రవ్యక్రియాఽజ్ఞానభిదాభ్రమాత్యయః ॥ 16

సవితుః - సూర్యునియొక్క, ప్రభా యథా - కాంతి వలె, యథా - ఏ విధముగానైతే, జాగ్రతి - జాగ్రదవస్థయందలి, అసవః - ఇంద్రియములు, సుప్తశక్తయః - విలీనమైన వ్యాపారములు గలవియో అదే విధముగా, ఏతత్ - ఈ జగత్తు, జగత్-ఆత్మనః - జగత్తునకు ఆత్మయగు శ్రీహరియొక్క, తత్ - ఆ, పరమ్ - సర్వాతిశాయియగు, సకృత్-విభాతమ్ - ఒక్కసారి (నిరంతరముగా) ప్రకాశించే, పదమ్ - స్వరూపమే, ద్రవ్యక్రియా -అజ్ఞానభిదాభ్రమ-అత్యయః - పంచభూతములు ఇంద్రియములు మరియు అహంకారరూపమగు అజ్ఞానముల వలన కలిగే భేదభ్రాంతిని తొలగించునది.

జగత్తుయొక్క వాస్తవికతత్త్వము శ్రీహరియే. శాస్త్రప్రసిద్ధమైన శ్రీహరియొక్క స్వరూపము ప్రకృతికి అతీతమైనది మరియు స్వయంప్రకాశము. పాంచభౌతికదేహము ప్రకృతికంటె భిన్నముగా నున్నదనియు, ఇంద్రియశక్తులు ప్రకృతిశక్తికంటె వేరుగానున్నవనియు, తాను పరమాత్మకంటె భిన్నముగా నున్నాననియు మానవులు భ్రమించుచుందురు. ఆ స్వరూపమును ఆత్మరూపముగా తెలుసుకొనుట వలన ఇట్టి భేదభ్రాంతి దూరమగును. సూర్యునినుండి వెలువడే కాంతులు సూర్యునికంటె భిన్నముగా లేవు. జాగ్రదవస్థలో ప్రకటమయ్యే ఇంద్రియశక్తులు నిద్రావస్థలో ఏ ఆత్మయందు విలీనమగుచున్నవో, దానికంటె అవి జాగ్రదవస్థలోనైననూ భిన్నముగా ఉన్నట్లు కనప్పట్టుటయే గాని, భిన్నముగా లేవు. అదే విధముగా శ్రీహరి నుండి వెలువడిన ఈ జగత్తు శ్రీహరికంటె భిన్నముగా లేదు.

యథా నభస్యభ్రతమఃప్రకాశా
భవంతి భూపా న భవంత్యనుక్రమాత్ ।
ఏవం పరే బ్రహ్మణి శక్తయస్త్వమూ
రజస్తమస్సత్త్వమితి ప్రవాహః ॥ 17

భూపాః - ఓ రాజులారా!, యథా - ఏ విధముగానైతే, నభసి - ఆకాశమునందు, అభ్రతమఃప్రకాశాః - మేఘములు చీకటి వెలుగులు, భవంతి - కలుగుచున్నవో, అనుక్రమాత్ - కాలక్రమముననుసరించి, న భవంతి - లేకుండునో, ఏవమ్ - ఇదే విధముగా, అమూః - ఈ, రజః - రజోగుణము, తమః - తమస్సు, సత్త్వమ్ - సత్త్వము అనే, శక్తయః - శక్తులు, ఇతి - ఈ విధముగా, ప్రవాహః - ప్రకృతి ప్రవాహము.

ఓ ప్రచేతసులారా! ఆకాశములో మేఘములు, చీకటి వెలుగులు ఆయా కాలములలో కనబడి మరల అదృశ్యమగుచుండును. అదే విధముగా, శ్రీహరియందు సత్త్వరజస్తమోగుణములరూపములో మాయాశక్తి సృష్టికాలములో ప్రకటమై ప్రళయకాలములో విలీనమగును. ఈ శక్తుల వలననే జగత్తు అనే ప్రవాహము సాగిపోవుచున్నది.

తేనైకమాత్మానమశేషదేహినాం
కాలం ప్రధానం పురుషం పరేశమ్ ।
స్వతేజసా ధ్వస్తగుణప్రవాహ -
మాత్మైకభావేన భజధ్వమద్ధా ॥ 18

తేన - ఆ కారణముచే, అశేషదేహినామ్ - సకలప్రాణులకు, ఆత్మానమ్ - ఆత్మయైనట్టియు, కాలమ్ - కాలస్వరూపుడైనట్టియు, ప్రధానమ్ - జగదుపాదానమైనట్టియు, పురుషమ్ - పూర్ణుడైనట్టియు, పర-ఈశమ్ - ప్రకృతికంటె అతీతుడైనట్టియు, స్వతేజసా - తన చైతన్యశక్తిచే, ధ్వస్తగుణప్రవాహమ్ - నశింపజేయబడిన గుణముల ప్రవాహము గల శ్రీహరిని, అద్ధా - సాక్షాత్తుగా, ఆత్మా-ఏకభావేన - ఆత్మతో ఒక్కటి అనే విధముగా, భజధ్వమ్ - సేవించుడు.

శ్రీహరియే సకలప్రాణులకు ఆత్మ. కాలరూపుడగు ఆయనయే ఈ జగత్తునకు ఉపాదానమగుచున్నాడు. ప్రకృతికి అతీతుడు మరియు పూర్ణుడు అగు శ్రీహరి చిద్ఘనుడు గనుక, ఈ త్రిగుణముల ప్రవాహరూపమగు జగత్తుయొక్క గుణదోషములు ఆయనకు సంక్రమించవు. అట్టి శ్రీహరిని సాక్షాత్తు ఆత్మకంటె అభిన్నము అనే విధముగా సేవించుడు.

దయయా సర్వభూతేషు సంతుష్ట్యా యేన కేన వా ।
సర్వేంద్రియోపశాంత్యా చ తుష్యత్యాశు జనార్దనః ॥ 19

సర్వభూతేషు - సకలప్రాణులయందు, దయయా - దయచే, యేన కేన వా - ఏదో ఒకదానితో, సంతుష్ట్యా - సంతోషించుటచే, చ - మరియు, సర్వ-ఇంద్రియ-ఉపశాంత్యా - అన్ని ఇంద్రియముల వ్యాపారములను కట్టిపెట్టుటచే, జన-అర్దనః - దుష్టజనులను పీడించే శ్రీహరి, ఆశు - శీఘ్రముగా, తుష్యతి - సంతోషించును.

సకలప్రాణులయందు దయ, లభించినదానితో తృప్తి పడుట, ఇంద్రియములనన్నింటినీ భోగ్యవిషయములనుండి వెనుకకు మళ్లించి శాంతముగా నుండుట అనువాటిచే దుష్టజనశిక్షకుడగు శ్రీహరి తొందరగా ప్రసన్నుడగును.

అపహతసకలైషణామలాత్మ-
న్యవిరతమేధితభావనోపహూతః ।
నిజజనవశగత్వమాత్మనోఽయన్
న సరతి ఛిద్రవదక్షరస్సతాం హి ॥ 20

అక్షరః - అక్షరపరబ్రహ్మయగు శ్రీహరి, సతామ్ - సత్పురుషుల యొక్క, అపహతసకల-ఏషణామల-ఆత్మని - తొలగించబడిన అన్ని కామనలు గలదగుటచే స్వచ్ఛమైన హృదయమునందు, అవిరతమ్ - నిరంతరముగా, ఏధితభావనా-ఉపహూతః - వర్ధిల్లజేయబడిన భక్తిచే ఆహ్వానించబడిన (స్థిరము చేయబడిన) వాడై, ఆత్మనః - తన, నిజజనవశగత్వమ్ - తనవారైన భక్తులకు వశమై యుండుటను, అయన్ - తెలుసుకొనుచున్నవాడై, ఛిద్రవత్ - హృదయాకాశము వలె, నహి సరతి - తొలగిపోడు గదా!

కామనలన్నియు తొలగుటచే సత్పురుషుల హృదయములు స్వచ్ఛముగా నుండును. వారు అట్టి తమ హృదయములో నిరంతరమగు భక్తిచే శ్రీహరిని ప్రతిష్ఠించెదరు. అక్షరపరబ్రహ్మయగు శ్రీహరి భక్తులకు వశుడై యుండుట అనే నిష్ఠ గలవాడై, వారి హృదయములనుండి హృద యాకాశము వలెనే తొలగిపోడు సుమా!

న భజతి కుమనీషిణాం స ఇజ్యాం
హరిరధనాత్మధనప్రియో రసజ్ఞః ।
శ్రుతధనకులకర్మణాం మదైర్యే
విదధతి పాపమకించనేషు సత్సు ॥ 21

అధన-ఆత్మధనప్రియః - ధనము లేనివారైననూ ఆత్మజ్ఞానమే ధనముగా గలవారు ప్రియులైనట్టియు, రసజ్ఞః - భక్తిరసమును తెలిసిన వాడు అగు, సః - ఆ, హరిః - శ్రీహరి, కుమనీషిణామ్ - కుత్సితబుద్ధి గల వారల, ఇజ్యామ్ - పూజను, న భజతి - స్వీకరించడు, యే - ఎవరైతే, శ్రుతధనకులకర్మణామ్ - చదువు డబ్బు కులము కర్మానుష్ఠానములయొ క్క, మదైః - గర్వములచే, అకించనేషు - ఏమీ లేని, సత్సు - సత్పురుషు లయెడల, పాపమ్ - పాపమును, విదధతి - చేయుదురో.

కుత్సితబుద్ధి గల జనులు తాము పెద్ద చదువులను చదివినామని యో, డబ్బు గలవారమనియో, గొప్ప కులమునకు చెందినవారమనియో, పెద్ద పెద్ద పూజలను చేసినవారమనియో గర్వించి, ఇవి ఏమీ లేని సత్పు రుషుల యెడల పాపమునాచరించెదరు. అట్టివారి పూజను శ్రీహరి స్వీక రించడు. ధనమేమీ లేకున్ననూ ఆత్మజ్ఞానమే ధనముగా గల మహాత్ముల హృదయములలోని భక్తిరసము ఆయనకు విదితమే.

శ్రియమనుచరతీం తదర్థినశ్చ
ద్విపదపతీన్ విబుధాంశ్చ యత్స్వపూర్ణః ।
న భజతి నిజభృత్యవర్గతంత్రః
కథమముముద్విసృజేత్పుమాన్ కృతజ్ఞః ॥ 22

అనుచరతీమ్ - నిరంతరముగా సేవ చేయుచున్న, శ్రియమ్ - లక్ష్మీదేవిని, తత్-అర్థినః - ఆ లక్ష్మిని కోరే, ద్విపదపతీన్ - నరపతులను, విబుధాన్ చ - దేవతలను కూడ, న భజతి - స్వీకరించదు, యత్ - ఏల యనగా, స్వపూర్ణః - తన స్వరూపమునందు పూర్ణుడైన శ్రీహరి, నిజభృత్యవర్గతంత్రః - తన భక్తజనులకు వశుడై యుండువాడు, కృతజ్ఞః - కృతజ్ఞుడగు, పుమాన్ - పురుషుడు, అముమ్ - ఈ శ్రీహరిని, కథమ్ - ఏ విధముగా, ఉత్ - కొంచెమైననూ, విసృజేత్ - విడిచిపెట్టును?

స్వస్వరూపమునందు పూర్ణుడగు శ్రీహరి తన భక్తులకు వశుడై యుండును. కావుననే, ఆయన తనను నిరంతరముగా సేవించే లక్ష్మీదేవిని, సంపదల వెంటబడే రాజులను, దేవతలను కూడ సరకు చేయడు. చేసిన ఉపకారమును గుర్తులోనుంచుకొనే సత్పురుషుడు ఎవ్వాడు అట్టి శ్రీహరిని కొద్దిసేపైననూ విడిచిపెట్టును?

మైత్రేయ ఉవాచ ।
ఇతి ప్రచేతసో రాజన్నన్యాశ్చ భగవత్కథాః ।
శ్రావయిత్వా బ్రహ్మలోకం యయౌ స్వాయంభువో మునిః ॥ 23

రాజన్ - ఓ విదురా!, ప్రచేతసః - ప్రచేతసులను, ఇతి - ఇట్టివి, చ - మరియు, అన్యాః - ఇతరములగు, భగవత్-కథాః - భగవానుని గాథలను, శ్రావయిత్వా - వినిపించి, స్వాయంభువః - స్వయంభువుడగు బ్రహ్మగారి పుత్రుడగు, మునిః - నారద మహర్షి, బ్రహ్మలోకమ్ - బ్రహ్మలోకమును గురించి, యయౌ - వెళ్లెను.

మైత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- భక్తితో ప్రకాశించే ఓ విదురా! స్వయంభువుడగు బ్రహ్మగారి పుత్రుడైన నారద మహర్షి ఈ విధముగా అనేకములగు భగవద్గాథలను ప్రచేతసులకు చెప్పి, బ్రహ్మలోకమునకు వెళ్లెను.

**తేఽపి తన్ముఖనిర్యాతం యశో లోకమలాపహమ్ ।**
**హరేర్నిశమ్య తత్పాదం ధ్యాయంతస్తద్గతిం యయుః ॥ 24**

తే అపి - ఆ ప్రచేతసులు కూడ, తత్-ముఖనిర్యాతమ్ - ఆ నారదుని ముఖమునుండి వెలువడినట్టియు, లోకమల-అపహామ్ - జనుల మాలిన్యములను పోగొట్టే, హరేః - శ్రీహరియొక్క, యశః - కీర్తిని, నిశమ్య - విని, తత్-పాదమ్ - ఆ శ్రీహరి పాదమును, ధ్యాయంతః - ధ్యానించుచున్నవారై, తత్-గతిమ్- ఆ శ్రీహరితోడి ఐక్యమును, యయుః - పొందిరి.

శ్రీహరియొక్క కీర్తిని విన్నవారి మాలిన్యములు దూరమగును. ఆ ప్రచేతసులు కూడ అట్టి శ్రీహరి కీర్తిని నారదుని ముఖమునుండి వినిరి. వారు ఆయన పాదములను ధ్యానిస్తూ, ఆయన ధామమును పొందిరి.

ఏతత్తేఽభిహితం క్షత్తర్యన్మాం త్వం పరిపృష్టవాన్ ।
ప్రచేతసాం నారదస్య సంవాదం హరికీర్తనమ్ ॥ 25

క్షత్తః - ఓ విదురా!, ప్రచేతసామ్ - ప్రచేతసులకు, నారదస్య - నారదునకు, హరికీర్తనమ్ - శ్రీహరియొక్క కీర్తనము గల, యత్ - ఏ, సంవాదమ్ - సంవాదమును, త్వమ్ - నీవు, మామ్ - నన్ను, పరిపృష్టవాన్ - ప్రశ్నించితివో, ఏతత్ - అట్టి ఈ సంవాదము, తే - నీ కొరకు, అభిహితమ్ - చెప్పబడినది.

ఓ విదురా! ప్రచేతసులకు నారదునకు శ్రీహరిని కీర్తించే సంవాదము జరిగినది. దానిని చెప్పుమని నీవు నన్ను ప్రశ్నించితివి. దానిని ఈ విధముగా నేను నీకు చెప్పితిని.

శ్రీశుక ఉవాచ ।
య ఏష ఉత్తానపదో మానవస్యానువర్ణితః ।
వంశః ప్రియవ్రతస్యాపి నిబోధ నృపసత్తమ ॥ 26

నృపసత్తమ - ఓ మహారాజా!, మానవస్య - మనుపుత్రుడగు, ఉత్తానపదః - ఉత్తానపాదునియొక్క, యః - ఏ, ఏషః - ఈ, వంశః - వంశము గలదో అది, అనువర్ణితః - వర్ణించబడినది, ప్రియవ్రతస్య అపి - ప్రియవ్రతునికి కూడ, నిబోధ - తెలుసుకొనుము.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఓ పరీక్షిన్మహారాజా! స్వాయంభువమనువుయొక్క పుత్రుడగు ఉత్తానపాదుని వంశమును నీకింతవరకు వర్ణించితిని. ప్రియవ్రతుని వంశమును గురించి కూడ తెలుసుకొనుము.

యో నారదాదాత్మవిద్యామధిగమ్య పునర్మహీమ్ ।
భుక్త్వా విభజ్య పుత్రేభ్య ఐశ్వరం సమగాత్పదమ్ ॥ 27

యః - ఏ ప్రియవ్రతుడు, నారదాత్ - నారదునినుండి, ఆత్మవిద్యామ్ - ఆత్మజ్ఞానమును, అధిగమ్య - పొంది, పునః - మరల, మహీమ్ - భూమిని, భుక్త్వా - భోగించి, పుత్రేభ్యః - పుత్రుల కొరకు, విభజ్య - పంచియిచ్చి, ఐశ్వరమ్ - ఈశ్వరునకు చెందిన, పదమ్ - ధామమును, సమగాత్ - పొందెనో.

ప్రియవ్రతుడు నారదునినుండి ఆత్మజ్ఞానమును పొందెను. ఆయన రాజ్యమును భోగించి, తరువాత దానిని పుత్రులకు పంచి యిచ్చి, ఈశ్వరునిలో ఐక్యమయ్యెను.

ఇమాం తు కౌషారవిణోపవర్ణితాం
క్షత్తా నిశమ్యాజితవాదసత్కథామ్ ।
ప్రవృద్ధభావోఽశ్రుకలాకులో మునేః
దధార మూర్ధ్నా చరణం హృదా హరేః ॥ 28

కౌషారవిణా - మైత్రేయ మహర్షిచే, ఉపవర్ణితామ్ - వర్ణించబడిన, ఇమామ్ - ఈ, అజితవాదసత్-కథామ్ - పరాజయమునెరుంగని శ్రీహరియొక్క వర్ణనము గల సత్కథను, నిశమ్య - విని, ప్రవృద్ధభావః - బాగా వర్ధిల్లిన భక్తి గలవాడు, అశ్రుకలా-ఆకులః - కన్నీటి ధారచే వ్యాకులమైనవాడు అగు, క్షత్తా తు - విదురుడైతే, మూర్ధ్నా - శిరస్సుచే, మునేః - మైత్రేయ మహర్షియొక్క, హృదా - హృదయముచే, హరేః - శ్రీహరియొక్క, చరణమ్ - పాదమును, దధార - ధరించెను.

మైత్రేయ మహర్షి ఈ విధముగా పరాజయమునెరుంగని శ్రీహరియొక్క సత్కథను వర్ణించి చెప్పెను. దానిని విన్న విదురునకు భక్తి బాగా

వర్థిల్లుటచే కన్నీరు స్రవించి ఆయన వ్యాకులుడయ్యెను. అపుడాయన ఆ మహర్షి పాదములకు శిరస్సుతో ప్రణమిల్లి, శ్రీహరి పాదములను హృదయములో ధ్యానించెను.

విదుర ఉవాచ ।
సోఽయమద్య మహాయోగిన్ భవతా కరుణాత్మనా ।
దర్శితస్తమసః పారో యత్రాకించనగో హరిః ।। 29

మహాయోగిన్ - ఓ యోగిపుంగవా!, కరుణ-ఆత్మనా - దయాహృదయుడవగు, భవతా - నీచే, అద్య - ఈనాడు, సః - అట్టి, అయమ్ - ఈ, తమసః - అజ్ఞానముయొక్క, పారః - ఆవలి తీరము, దర్శితః - చూపబడినది, యత్ర - ఎక్కడనైతే, అకించనగః - ఏమీ లేనివారిచే పొందబడే (ఏమీ లేనివారికి శరణు అగు), హరిః - శ్రీహరి గలడో.

విదురుడిట్లు పలికెను --- ఓ యోగిపుంగవా! దయాహృదయుడవగు నీవీనాడు అజ్ఞానసముద్రముయొక్క ఆవలి తీరము (జ్ఞానము) ను చూపించితివి. ఆ జ్ఞానమును పొందినవారికి ఏమీ లేకున్ననూ, శ్రీహరి ఆశ్రయము లభించును.

శ్రీశుక ఉవాచ ।
ఇత్యానమ్య తమామంత్ర్య విదురో గజసాహ్వయమ్ ।
స్వానాం దిదృక్షుః ప్రయయౌ జ్ఞాతీనాం నిర్వృతాశయః ।।30

స్వానామ్ - తన వారలగు, జ్ఞాతీనామ్ - బంధువులను, దిదృక్షుః - చూడగోరువాడు, నిర్వృత-ఆశయః - శాంతమైన మనస్సు గలవాడు అగు, విదురః - విదురుడు, తమ్ - ఆ మైత్రేయుని, ఇతి - ఈ విధముగా, ఆనమ్య - నమస్కరించి, ఆమంత్ర్య - సెలవు తీసుకొని, గజసాహ్వయమ్ - హస్తినాపురమును గురించి, ప్రయయౌ - వెళ్లెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- శాంతచిత్తుడగు విదురుడు ఈ విధముగా మైత్రేయునకు నమస్కరించి, ఆయనవద్ద సెలవు తీసుకొని, తన బంధువులను చూచే కోరికతో హస్తినాపురమునకు వెళ్లెను.

**ఏతద్యశ్శృణుయాద్రాజన్ రాజ్ఞాం హర్యర్పితాత్మనామ్ ।**
**ఆయుర్ధనం యశస్స్వస్తి గతిమైశ్వర్యమాప్నుయాత్ ॥ 31**

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే చతుర్థస్కంధే నారద
ప్రచేతస సంవాదో నామ ఏకత్రింశోఽధ్యాయః ॥

రాజన్ - ఓ రాజా!, యః - ఎవడైతే, హరి-అర్పిత-ఆత్మనామ్ - శ్రీహరియందు అర్పించబడిన హృదయము గల, రాజ్ఞామ్ - మహారాజుల, ఏతత్ - ఈ గాథను, శృణుయాత్ - వినునో ఆతడు, ఆయుః - ఆయుర్దాయమును, ధనమ్ - ధనమును, యశః - కీర్తిని, స్వస్తి - కల్యాణమును, ఐశ్వర్యమ్ - ఈశ్వరునకు సంబంధించిన, గతిమ్ - గతిని, ఆప్నుయాత్ - పొందును.

ఓ పరీక్షిన్మహారాజా! శ్రీహరియందు అర్పించబడిన హృదయము గల ఈ మహారాజుల గాథలను విన్నవారికి ఆయుర్దాయము, ధనము, కీర్తి, కల్యాణములు, ఈశ్వరునితోడి ఐక్యము లభించును.

శ్రీమద్భాగవత మహాపురాణములోని నాల్గవ స్కంధమునందు
నారద ప్రచేతస సంవాదమును వర్ణించే ముప్పది
ఒకటవ అధ్యాయము ముగిసినది (31).

నాల్గవ స్కంధము సమాప్తము.

హరిః ఓమ్, తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు.

*****